


# వేదతత్త్వ ప్రకాశము

## ఋగ్వేదాది భాష్యభూమిక



మహర్షి స్వామి దయానంద సరస్వతీ విరచితము

అనుకర్త : పండిత గోపదేవ్

అంబా రామార్య సత్యార్థ ప్రకాశ ట్రస్టు (రి), సికింద్రాబాద్.

ఓ3మ్

# వేదతత్త్వ ప్రకాశము

శ్రీ మహర్షి స్వామి దయానందసరస్వతీ కృతమగు

## ఋగ్వేదాది భాష్యభూమిక

(తెలుగు అనువాద సహితము)

అనువాద కర్త :

దార్శనిక్, "కళాప్రపూర్ణ", దర్శన తత్త్వవేత్త, వేదవేదాంగ పారంగత్

**పండిత గోపదేవ్**

ప్రచురణము :

**అంబా రామార్య సత్యార్థ ప్రకాశ ట్రస్టు (R), సికింద్రాబాద్.**

**అంబా దర్శన గ్రంథమాల,**

**ఆర్యసమాజము - కూచిపూడి వారి సౌజన్యముతో**

పంచమ ముద్రణము : 500 ప్రతులు
దయానందాబ్దము : 193
శకాబ్దము : 1939
సం॥ : దుర్ముఖినామ సం॥ శ్రావణం 2017
విక్రమాబ్దము : 2074
సృష్టి సంవత్సరము : 196, 08, 53, 116





మూల్యము : ₹ **150/-** (పోస్టేజీ అదనం)

**పోస్టు ద్వారా ప్రతులకు :**
ఆర్యసమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా).
గుంటూరు జిల్లా. ఫోన్ : 08644-252789. (ఆం.ప్ర.)
ఫోన్ : 93466 41063

**ప్రతులకు :**
అంబా రామార్య సత్యార్థ ప్రకాశ ట్రస్టు, # 5, మాశెట్టి బిల్డింగ్,
3-3-736 to 740, కంచరిబజార్, సికింద్రాబాద్-3. (తెలంగాణ)
ఫోన్ : 040-66320200.

ఆర్యసమాజము, సీతాఫలమండి, సికింద్రాబాద్ - 61. (తెలంగాణ)
ఫోన్ : 040-27071816

ఆర్యసమాజము, గాంధీచౌక్ దగ్గర, తెనాలి,
గుంటూరు జిల్లా. (ఆం.ప్ర.)

ఆర్యసమాజము, పిచ్చుకలకుంట, అరండల్‌పేట్,
గుంటూరు. (ఆం.ప్ర.)

Designed & Printed at
**PRINTSHOP**
Sec'bad. Ph : 6632 0300

ఓ౩మ్

# ప్రకాశకీయము

ఈ ఋగ్వేదాది భాష్యభూమికలో వేదములో ఏ విషయములు కలవో వాటి నన్నింటిని విడువకుండా సంక్షిప్తంగా, న్యాయంగా చూపిరి. దీనిని చదివినందువలన పాఠకులకు వేదములు చదువాలనే అసక్తి కలుగును. ఈ గ్రంథము లేకున్నచో వేదాలంటే ఏమిటి ? వాటిలో ఏముంది? అవి ప్రజలకు ఏ విధంగా ఉపయోగపడతాయి ? అను విషయములు ప్రజలకు తెలువదనిన అతిశయోక్తి కాదేమో ! ఈ గ్రంథమునందు వేదోత్పత్తి, వేదనిత్యత్వము, వేదసంజ్ఞ, బ్రహ్మవిద్య, వేదోక్త ధర్మములు, సృష్టివిద్య, పృథివ్యాది లోకభ్రమణము, ఆకర్షణానుకర్షణము, ప్రకాశ్య ప్రకాశకము, గణిత విద్య, ఈశ్వర స్తుతి ప్రార్థనోపాసనము, ముక్తి, నౌకావిమానవిద్యలు, నక్షత్రవిద్య, వైద్యశాస్త్రము, పునర్జన్మ, వివాహనియోగములు, రాజప్రజాధర్మములు, వర్ణాశ్రమధర్మములు, పంచమహా యజ్ఞములు, ప్రామాణ్యా ప్రామాణ్య గ్రంథములు, అధికారానధికారములు, పఠన పాఠనములు, శంకాసమాధానములు, ప్రతిజ్ఞ, ప్రశ్నోత్తరములు, నిరుక్తములోవైదికశబ్దములు, స్వరవ్యవస్థ, వైదిక లౌకిక శబ్ద సామాన్య విశేషనియయములు, వ్యాకరణము, అలంకారములు, మున్నగు విషయములు గలవు. ఈవిషయముల నన్నింటిని నామూలాగ్రముగా పఠించిన పఠితలకు నెంత జ్ఞానముకలుగునో యనూహ్యము. దీని ద్వారా ప్రతి విషయమునకు సంబంధించిన మూలతత్త్వములను గ్రహించినచో నే విషయమును గూర్చియు సందేహముండదు.

తేది. 14-9-2006

ప్రకాశకులు

# ద్రవ్యదాత పరిచయము

శ్రీ మానుకొండ రాధాకృష్ణమూర్తి B.Sc., B.E (Mechanical) గారు 1967 సం॥ నాటి పట్టభద్రులు, వీరు మినిస్ట్రీ ఆఫ్ డిఫెన్స్, గవర్నమెంట్ ఆఫ్ ఇండియా సంబంధిత ఆఫీసులో, సీనియర్ సైంటిఫిక్ ఆఫీసరుగా విధులు నిర్వహించి, 2004 సం॥లొ, తమ 60 సం॥ల వయస్సు తరువాత ఉద్యోగ విరమణ చేశారు.

శ్రీ రాధాకృష్ణమూర్తి గారి జన్మస్థలము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో గుంటూరు జిల్లా అంతర్గత తెనాలి పట్టణము. వీరి తల్లిదండ్రు లిరువురు కూడ మంచి శ్రమశీలం గలిగిన సంస్కారవంతులు. దైవభక్తి మెండుగా గలిగి, దానధర్మములతో కూడిన ధార్మిక జీవితాలను గడిపి, సుసంతానముతో ధన్యజీవులయినారు. వారికి మొత్తముగా 11 మంది సంతానము. వరుసగా కలిగిన అయిదుగురు ఆడపిల్లల సంతానములో ఇరువురు బాల్యములోనే కాలం చేసిన తరువాత శ్రీ రాధాకృష్ణమూర్తి గారు, 1943 జూన్ మాసములో జన్మించిరి. వీరి తరువాత ముగ్గురు మగపిల్లలు గలిగిరి. అందులో నొకరు బాల్యములోనే కాలం చేసిన అనంతరం, ఒక ఆడపిల్ల, ఇద్దరు మొగ పిల్లలు గిలిగిరి. ఆ తరువాత వీరి తండ్రిగారు తమ 57 సం॥ వయస్సులో 1962లో అకాల మృత్యువాత బడిరి. అప్పుడు కుటుంబ బాధ్యతలు, వీరి తల్లిగారు వీరరాఘవమ్మగారిపై బడినవి. అప్పటి నుండి 19 సం॥ వయస్సు గలమూర్తిగారు కుటుంబ బాధ్యతలను నిర్వహించటములో తల్లిగారికి, ఎంతగానో తోడ్పడినారు. వీరి తండ్రిగారు మెకానికల్ ఇంజనీరింగ్ వర్క్సు చేశారు. తండ్రిగారి చివరి కోరిక మేరకు వీరి తల్లిగారు ఎంతో కష్టపడి శ్రీరాధాకృష్ణమూర్తిగారిని మెకానికల్ ఇంజనీరుగా చదివించినారు వీరు ఉద్యోగము చేసుకుంటూ, నిస్వార్థముగా ముందుగా వీరి తోడబుట్టినవారికి తగిన చదువులు, ఉద్యోగములు మరియు వివాహాది సంస్కారములను నెరవేర్చుటయందు, తల్లిగారికి సహకరించిరి. తల్లిగారు తమ 68 సం॥ల వయస్సులో 1985 సం॥లో స్వర్గస్థులయినారు. అనంతరము వీరి 52 సం॥ల వయస్సులో శ్రమించి మిగిలిన తన చెల్లిలి వివాహము కూడ. 1994 సం॥లొ పూర్తిచేసారు. తన తండ్రిగారి చివరిరోజు కోర్కె, "అందరూ బాగుండాలి" అనే పితృవాక్యపరిపాలనకు, వీలయినంతవరకు న్యాయము చేశారు. మూర్తిగారు మాత్రము ఎప్పటికి నైష్ఠిక బ్రహ్మచారులుగానే మిగిలిపోయారు.

వీరు ఈ మధ్యన 2015 సం॥లో తెనాలి ఆర్యసమాజ భవన పునరద్ధురణకు ఇతోధికంగా, ఆర్థిక సహాయము చేసి సమాజమునకు తోడ్పడినారు. తెనాలి ఆర్యసమాజ సభలలో, వారి కార్యక్రమములలో విరివిగా పాల్గొంటూ వారిని బాగా ప్రోత్సహిస్తున్నారు.

వీరు 2015లో జరిగిన గోదావరినది పుష్కరాల సమయము నందు, మరియు 2016 లో జరిగిన, కృష్ణానది పుష్కరాల సందర్భముగా మొత్తంగా సుమారు 27వేల మందికిపైగా భక్తులకు, వారి తల్లిదండ్రుల పేరు మీదగా "అన్నప్రసాద" వితరణ కావించిరి.

నియమబద్ధంగా జీవితమును సాగించుచున్న మూర్తిగారికి ఆధ్యాత్మిక భావములు కూడ ఎక్కువ. వీరికి తన 25 సం॥ల వయస్సులోనే 1968 సం॥లో, తెనాలి పట్టణములో శ్రీ నాగం రామారావు (వామదేవ్) గారి ద్వారా విద్వత్ శిరోమణి, షడ్దర్శనాచార్యులు, కళాప్రపూర్ణ బిరుదాంకితులు, నైష్ఠిక బ్రహ్మచారులు అయిన

శ్రీ పండిత గోపదేవ్ శాస్త్రి గారితో పరిచయమేర్పడినది. మూర్తిగారి జీవితము మలుపు తిరిగింది. వారి ద్వారా ఆర్యసమాజ భావాలను వేద సిద్ధాంతములను బాగుగా అవగాహన చేసుకున్నారు. తరువాత కూడ శతాధిక ఆయుష్కులు శ్రీ పండిత గోపదేవ్ శాస్త్రిగారు పరమపదించే వరకు అనగా 1996 సం॥వరకు వారిని కలుసుకుంటూ, వారితో చక్కని అనుబంధమును కలిగి ఉన్నారు.

ప్రస్తుతము వీరు హైదరాబాదులో నివసిస్తూ, ఎవరైనా మిత్రులు వీరిని కలవాటికి వచ్చినపుడు వారితో ఆధ్యాత్మిక, ఆధిభౌతిక శాస్త్ర విషయములను, సైంటిఫిక్‌గా విశ్లేషించి, తర్కబద్ధంగా వివరించి వారికి కలిగే సందేహములను, ఓర్పుగా, నేర్పుతో నివృత్తి చేసి వారికి మంచి జ్ఞానమును కలిగించే ప్రయత్నము చేయుచున్నారు. వీరితో మాట్లాడినవారు ఒకరకంగా వీరిని బహుముఖ ప్రజ్ఞాశాలిగా గుర్తించ గలుగుతారు. ప్రసన్నులవుతారు.

శ్రీ రాధాకృష్ణమూర్తి గారు, తమ తల్లిదండ్రుల పేరున "మానుకొండ వీరరాఘవమ్మ మరియు క్రిష్ణయ్య గార్ల మెమోరియల్ ఛారిటబుల్ ట్రస్టును 2006 సం॥లో స్థాపించిరి. అప్పటినుండి వ్యవస్థాపక అధ్యక్షుడుగా ఆ ట్రస్టు ద్వారా అనేకమందికి రకరకములుగా ఆర్థిక సహాయములు చేయుచున్నారు. అనగా వైదిక ధర్మప్రచారమునకు పాటుబడు వారి ఈతిబాధల నివృత్తికి ప్రధానముగాను, తరువాత వైదిక గురుకులములకు, విద్యార్థులకు, రోగులకు మొదలువారికి ఉచితముగాపుస్తకములు, ఫీజులు, మందులు, కళ్ళ ఆపరేషన్‌లు, అలాగే వృద్ధులకు నెలవారి ఫించను రూపముగా ఆర్థిక సహాయములు మరియు ఉచితమని తోచినప్పుడు వేరే వేరే రకములుగాను దయాభావంతో, ఉదారంగాను సహాయములు చేస్తూ ఇప్పటికి చేస్తున్నారు.

ప్రస్తుతము మా ట్రస్టు ఉపాధ్యక్షులైన శ్రీ కావూరి శత్రుంజయుగారు "ఋగ్వేదాది భాష్య భూమిక" అను ఈ గ్రంథ పునర్ముద్రణకు ఆర్థికంగా సహాయపడవలసిందిగా కోరిన వెంటనే స్పందించి మాకు రూ. 51,000/- విరాళంగా ఇచ్చి తద్వారా వారికి గురుదేవులు శ్రీ పండిత గోపదేవ్ శాస్త్రి గారి పట్ల ఉన్న అంకితభావాన్ని చాటుకొన్నారు.

ప్రస్తుతము వీరు 74 సం॥ల వయస్సులో కూడ ఉత్సాహంగా, ఆరోగ్యముగానే ఉన్నారు. వీరు శతవర్షములు పైబడి, ఆరోగ్యముగా జీవిస్తూ ఆర్యసమాజానికి, మానవ సమాజానికి తోడ్పడుతూ, వైదిక సంస్కృతిని ఉద్ధరించే ప్రయత్నములోనే ఉండాలని, తమవంతు సహాయ, సహకారములను సాగించుతూనే ఉండాలని కోరుకుంటున్నాను. అందుకు సర్వేశ్వరుడు శ్రీ మానుకొండ రాధాకృష్ణమూర్తి గారికి తగిన శక్తిసామర్థ్యములను ప్రసాదించాలని హృదయపూర్వకముగా కోరుకుంటున్నాను.

ఇట్లు
మాశెట్టి శ్రీనివాస్ ఆర్య
కార్యదర్శి
అంబారామార్య సత్యార్థ ప్రకాశ ట్రస్టు

# పరిచయము

భగవంతుడు సర్వజ్ఞుడు; సర్వశక్తి సంపన్నుడు; సర్వవ్యాపకుడు; సత్యస్వరూపుడు. పరమాత్మ యెట్లు సర్వజ్ఞుడో - అట్లే, ఆ పరమాత్మ నుండి ఆవిష్కృతమైన వేద విజ్ఞానమును సర్వజ్ఞము; నిత్యసత్యము. అది అపౌరుషేయము. సర్వలోకములకును సమాదరణీయము. భరతఖండమున వెలసిన మహర్షులు తమ తపశ్శక్తివలన, అట్టి వేదసమామ్నాయమును అక్షర రూపముగా నాకర్షించి, ఋగ్యజుస్సామాథర్వణములుగా విలసిల్లిన ఆ చతుర్వేదములను 'శ్రుతులు' అని వ్యవహరించిరి. శ్రవణగోచరములైన ఆవేదములవలన సచ్చిదానంద స్వరూపానుభవమును పొంది, ధన్యత గాంచిరి. మంత్రద్రష్టలైన ఆ మహర్షులు- ఆ వేదసుధారసమును వాగ్రూపమున భద్రపఱచి, శిష్యపరంపరాగత మొనర్చి సనాతన ధర్మసంపదను సంవర్ధించి, సంతుష్టి నందిరి. అదియునుగాక ఆశ్రుతులలోని విజ్ఞానమును స్మృతులలో పురాణేతిహాసాదులలో ప్రసరింపజేసి, సర్వప్రజానీకమునకును ఆ విజ్ఞానము నందించిరి. కాని, శ్రుతి స్మృతులకు వైరుధ్య మేర్పడినపుడు శ్రుతియే పరమ ప్రమాణము; స్వతః ప్రమాణము. అట్టితరి స్మృతి నిరాకరణీయము.

సనాతన ధర్మప్రతిపాదకమైన వేదవాఙ్మయమునకు భిన్నదృక్పథములతో వ్యాఖ్యానము లనేకములు కాలక్రమమున వెలువడసాగెను. తత్ఫలితముగ వేదముల నిజస్వరూపము మఱుగునబడుట తటస్థించెను. తత్కారణమున వివిధ వ్యాఖ్యలను సమన్వయించి, వేదముల నిజస్వరూపమును లోకమునకు దర్శింపజేయుట చాల యావశ్యకమయ్యెను. ఈ యావశ్యకమును గుర్తించిన శ్రీ దయానంద సరస్వతి 19-వ శతాబ్దమున, శ్రీ విరజానందశిష్యరత్నమై, వేదముల నధ్యయన మొనరించి, వానిలోగల గాఢగూఢములైన యంశములను బాగుగా నవగత మొనరించుకొని, ఆ యా రహస్యములను సమరసముగ వ్యాఖ్యారూపమున లోకమున ప్రకటింపనెంచెను. అపౌరుషేయములైన వేదములకు భాష్యములు వ్రాయ సాహసించిన శ్రీ దయానంద సరస్వతి సామాన్యుడుకాడు; సర్వసమర్థుడు. విజ్ఞానవేత్తగా - విశాలహృదయుడుగా - యోగనిష్ఠాగరిష్ఠుడుగా - ఆజన్మ బ్రహ్మచర్య వ్రతపాలకుడుగా - త్యాగమూర్తిగా ప్రఖ్యాతి నార్జించిన మహనీయుడు. ఒకవంక స్వార్జితమైన విజ్ఞాన సంపదను, మఱియొకవంక యాస్కుని నిరుక్తమును దివ్యచక్షువులుగా ధరించి, తన నిశిత పరిశీలనా పరిశోధనముల సత్ప్రయత్నముతో వేదముల నిజస్వరూపమును సుస్పష్టముగ జూపెట్టెను. మంత్రములు, సంహితలు మాత్రమే వేదములు అని సప్రమాణముగా నిరూపించెను. అనంతరము చతుర్వేదములకును భాష్యముల వ్రాయ సంకల్పించి, ప్రారంభమున వానికి 'భూమిక' నొకదానిని రూపొందించెను. అటుపిమ్మట, యజుర్వేదమునకు సమగ్రముగ భాష్యమును వ్రాసి, దశమండల విలసితమైన ఋగ్వేదమునందలి యేడు మండలములకు మాత్రము భాష్యమును రచించి, అకస్మాత్తుగ పరమపదించెను. ఇది మన దురదృష్టము.

ఆర్యసమాజ స్థాపకుడైన శ్రీ దయానందుని తత్త్వ మహత్త్వమంతటను పరివ్యాప్తమయ్యెను. ఆయన యశశ్చంద్రికలు దశదిశల వ్యాపించెను. ఆ మహర్షిచే రచింపబడిన 'సత్యార్థప్రకాశిక' ఆర్యమతమునకు ప్రమాణగ్రంథముగ పరిగణింపబడెను. ఇట్టి ఆర్యసమాజ గ్రంథముల నాంధ్రలోకమున కందించుట కెందఱో ప్రయత్నముగావించిరి. ఇట్టివారిలో శ్రీ గోపదేవశాస్త్రిగారు అగ్రగణ్యులు. శ్రీ గోపదేవశాస్త్రిగారు బహుభాషావేత్తలు. పండిత ప్రకాండులు. దయానంద హృదయమును బాగుగా దర్శించిన ప్రాజ్ఞులు. షడ్దర్శనములను ఆంధ్రవాణిలో రాణింపజేసిన ప్రతిభావంతులు. నైష్ఠిక బ్రహ్మచర్యము నవలంబించి, అచంచలమైన దీక్షతో వైదిక ధర్మవ్యాప్తికై నిరంతరము పరిశ్రమించుచున్న పరమయోగులు. ఇట్టి విశిష్ట గుణగణ సముపేతులైన శ్రీ గోపదేవశాస్త్రిగారు - శ్రీ దయానంద సరస్వతిచే, సంస్కృత భాషలో రచింపబడిన ఈ ఋగ్వేదాది భాష్యభూమికను మృదుమధురమైన శైలిలో హృదయంగమముగా నాంధ్రీకరించుట - ఆంధ్రుల యదృష్ట విశేషము. ఈ యుద్గ్రంథమును అత్యంత శ్రద్ధాసక్తులతో - సర్వాంగ సుందరముగా తొలిముద్రణముగా ప్రకాశింప జేసిన తిరుమల తిరుపతి దేవస్థానములవారు - మిక్కిలి ప్రశంసా పాత్రులు. తిరుమల తిరుపతి దేవస్థానముల వారిట్టి యుత్తమ గ్రంథములను విశేషముగ భారతీయ భాషలలో వెలువరించుచు, వైదికమత విస్తృతికి దోహద మొసంగుదురు గావుత !!!

శ్రీ దయానంద దివ్యసందేశములను శ్రీ గోపదేవశాస్త్రిగారు ఆంధ్రులకు సమగ్రముగా నందించుటకు సదవకాశమును భగవానుడు ప్రసాదించుగావుత !!

'ఆర్షవిద్యాలంకార' శ్రీ కల్లూరి చంద్రమౌళి

1-3-1967, గుంటూరు - 2

ఓమ్

# అనువాదకుని వాక్యములు

శ్రీ మద్దయానంద మహర్షి క్రీస్తుశకము పంధొమ్మిదవ శతాబ్దమున (1824-1883) భారతదేశమునం దవతరించిన యుగ ప్రవర్తకులలో శ్రేష్ఠతముడు. ఇతడు వేదమతవాది. తనకు సమకాలికుడైన జర్మన్ తత్త్వవేత్త కారల్ మార్క్సు వలె నితడు కేవలం జడతత్త్వ (ప్రకృతి) వాది కాడు. తనకు కొన్ని శతాబ్దములకు పూర్వుడైన భారతీయ తత్త్వవేత్త శ్రీ శంకరస్వాములవలె కేవల చేతన (బ్రహ్మ) తత్త్వవాదియును గాడు. వేదములందు నిత్యసత్యములుగా సిద్ధాంతము చేయబడిన 'జీవేశ్వర ప్రకృతులు' అను మూడు తత్త్వముం నిత డంగీకరించియున్నాడు.

శ్రీ దయానంద మహర్షి-గుజరాత్ (సౌరాష్ట్ర) ప్రాంతమున సామవేదీయ-ఔదీచ్య బ్రాహ్మణవంశమునకు సంబంధించిన యొక సంపన్న గృహమున జన్మించి, అఖండ బ్రహ్మచర్యమును యావజ్జీవము పరిపాలించిన మహనీయుడు. ఆదిత్య బ్రహ్మచారి. యోగనిష్ఠా గరిష్ఠుడు. సమాహిత చిత్తుడై సత్యము నన్వేషించినవాడు. భారతభాగ్యవిధాత. విశ్వమానవాభ్యుదయాకాంక్షి. వేదమతోద్ధారకుడు. లోకకల్యాణ కరములైన వైదిక సిద్ధాంతములు సార్వజనీనములు, సార్వభౌమికములు, నిత్యసత్యములు నని ప్రపంచ విజ్ఞులకు ప్రబోధించిన ప్రజ్ఞాశాలి. వేదమత ప్రచార ప్రబోధముల మూలమున ప్రపంచ మానవాళికి పరమ శ్రేయస్సును జేకూర్ప కంకణబద్ధుడై యందులకు ప్రాణములను ధారవోసిన ధర్మవీరధురీణుడు. ప్రాచీన మహర్షుల దృష్టికోణముతో వేదసిద్ధాంతముల నవగతముచేసికొని, వానిని పండితలోకమున కందజేయ నుద్దేశించి వేదములకు భాష్యము వ్రాసిన మహామేధావి.

వేదములకు భాష్యము వ్రాయబూనిన మహర్షి ముందుగా 'ఋగ్వేదాది భాష్యభూమిక' అను నామములో నీ గ్రంథము రచించియున్నాడు. ఇయ్యది సంస్కృతముతోబాటు ఆర్యభాష (హిందీ) కూడ చేర్చి పండిత పామరులకు దెలియునట్లు మహర్షిచే రచియింపబడినది. ఆర్య (హిందీ) భాషలో సత్యార్థ ప్రకాశము, సంస్కారవిధి మున్నగు గ్రంథములు మహర్షి రచనలు పెక్కు కలవు. కాని, వేదవిషయ విజ్ఞానము నెఱుగుటకు ఈ 'ఋగ్వేదాది భాష్యభూమిక' మిక్కిలిగా దోడ్పడగలదు.

వేదములు భారతదేశమున చరిత్రకందని కాలమునుండియు ప్రచారములో నుండెను. పూర్వకాలమున భారతీయులు వేదపఠనమొనర్చి, యందలి సిద్ధాంతములను సత్యములుగా గ్రహించి, వాని కనుగుణముగా తమ జీవిత విధానములను దీర్చిదిద్దుకొని సర్వసుఖసంపదలతో జీవించి యుండుట పాఠకులకు దెలియని విషయముకాదు. కాని, కాలచక్రము భ్రమించిన కొలది భారతీయులు వేదమార్గము వదలి యన్యమార్గముల నవలంబించి, స్వరాజ్య స్వారాజ్యములను గోల్పోయి దుఃఖముల పాలగుటయు చదువరులెఱుగని వార్తకాదు. వేదాధ్యయనము భారతమున సన్నగిల్లెను. వేదమునందలి సత్యములు పండితులకు కూడ నందకపోవుటచే నాధునికులు వేదములనే విస్మరించిరి. మధ్యకాలికులైన మహీధర ఉవ్వటాదులు వ్రాసిన వేదభాష్యములను జదివి పాశ్చాత్యవిద్వాంసులు పెక్కురు వేదములలో మానవులు నేర్చుకొనదగిన విషయములు లేవనుటయే కాక అవి యజ్ఞాల గీతములుగా నెంచినవారు కలరు.

శ్రీ శంకర రామానుజాద్యాచార్యులు వేదములు కేవలము కర్మకాండమునకు సంబంధించినవిగా నెంచి ఉపనిషత్తుల నాధారముగా తీసికొని తమ తమ సంప్రదాయములను నెలకొల్పి యున్నారు.

ఇట్టి స్థితిలో పందొమ్మిదవ శతాబ్దమున మహర్షిదయానందస్వామి వేదములకు భాష్యము వ్రాయబూని యీ భూమికా గ్రంథమును రచియించి వేదములందు ప్రతిపాదిత సత్యములను లోకమునకు వెల్లడించిరి. ప్రాచ్య పాశ్చాత్య దేశీయ విద్వాంసులకు వేదగత సత్యములను దెలుపుట కీ గ్రంథమెంతగనో తోడ్పడును. వేదసిద్ధాంతములను విశ్వమున వ్యాపింపజేయు నుద్దేశముతో దయానంద మహర్షి క్రీ.శ. 1875 వ నీదేశమునందు "ఆర్యసమాజ" మనునొక సంఘమును గూడ స్థాపించియున్నారు. అది దేశ విదేశములలో వేదసిద్ధాంతములను ప్రచారమొనర్చుచున్నది. అదియే దానికి ముఖ్యోద్దేశము.

బ్రహ్మాది జైమిని పర్యంతముగల మహర్షుల దృష్టి కోణముతో వేదవిషయముల నెఱుగుట కీ భాష్యభూమిక తెలుగుపాఠకులకు మిక్కిలి యుపయోగించునని యెంచి నేని గ్రంథము ననువదించితిని. అనువాదము పూర్తిచేసిన తదుపరి రెండు సంవత్సరముల కాలము నాదగ్గఱ పాండులిపి (వ్రాతప్రతి) యట్లే పడియుండెను. ముద్రణకు తగిన సాధన సామగ్రి లభింపదయ్యెను.

ఆర్షవిద్యాలంకారులు శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు ఆంధ్రలోకమునకు సుపరిచితులు. మాకు ఆప్తులు. వారు శ్రీ తిరుమల దేవస్థానపు కమిటీకి అధ్యక్షులుగా నున్న సమయమున నాచే ననువదింప బడిన యీ గ్రంథరాజము జూచుట సంభవించెను. ఈ గ్రంథప్రథమ సంస్కరణము శ్రీ వేంకటేశ్వరస్వామివారికి కానుకగా నిమ్మనియడిగి తీసికొని తామీ గ్రంథమును శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానపు ముద్రణాలయమున ప్రథమమున ముద్రింప సకల సదుపాయముల జేసిరి. వారికి ఆర్ష విజ్ఞానమునందుగల యనురాగమే వారి యీ ప్రయత్నమునకు ముఖ్యకారణము. వారికి సదా నేను కృతజ్ఞుడను.

సామాన్యముగా గ్రంథమున ముందు మొదటి మాటలలో రచయితలు-పుస్తకాంతర్గత విషయములు పాఠకులకు సంక్షేపముగా దెలియునట్లు వ్రాయుచుందురు. కాని నేను నా యీ ప్రథమవాక్యము లందట్టి పనికి బూనుకొననైతి. కారణమేమన పలువురు పాఠకులు పుస్తకమున నున్న మొదటి మాటలు చదివి పుస్తకమంతయు చదివినట్లెంచుచుందురు. ఆ భూమికాపండితులు పుస్తకము సంపూర్ణముగా జదువరు. కావున నట్టి యవకాశము నేనిందు కల్పింపనైతి. మఱియును ఈ గ్రంథము స్వయముగా భూమికయే. వేదప్రతిపాద్య విషయములను సంక్షేపముగా దెలుపుటకే మహర్షి దీనిని వ్రాసి ఋగ్వేదాది భాష్యభూమిక యని పేరిడియున్నారు. కాబట్టి భూమికకు భూమికయేమి వ్రాయగలను? తెలుగు పాఠకులు గ్రంథమునంతయు నామూలాగ్రము చదివి యందలి వైశిష్ట్యమును గ్రహింప ప్రార్థించెద.

క్రీ.శ. 1967 లో ప్రథమ ముద్రణము చేయబడిన యీ గ్రంథము కొలది కాలమునకే ఖర్చు ఆయిపోయినను పునర్ ముద్రణము కాకుండుటకు కారణము ధనాభావమే. తెలుగు భాషలో ఈశ్వరీయ జ్ఞానబోధకమగు నిట్టి గ్రంథము మఱి యొకటి లేదనిన నతిశయోక్తి కాదు.

దయానంద మహర్షి చెప్పుచుండగా విని వ్రాసిన పండితులు, పౌరాణికులు, వారప్పటికి భారతదేశమున ప్రచలితమైయున్న నానావిధ సంప్రదాయాత్మకమగు హిందూమతమునకు సంబంధించిన వేదవిరుద్ధ సిద్ధాంతముల ననుసరించువారు కావున ఆర్యభాష (హిందీ) లో వ్రాయునపుడు కొన్ని ప్రమాదములు వాటిల్లినవి. అవి బుద్ధిపూర్వకములో అబుద్ధిపూర్వకములో నేడు నిర్ణయించుట కష్టతరము. అందువలన మహర్షి రచిత గ్రంథములలో నట నట సంస్కృత - ఆర్య భాషలలో భేదములు పొడగట్టుచున్నవి. అట్టిచోట్ల అనువాదములో చదువరులకు భ్రమకలుగకుండునట్లు నా నేర్చినట్లు వివరములు, సవరణలు, కోష్ఠముల (బ్రాకెట్ల) లో వ్రాసియున్నాను. పాఠకులు గ్రహింతురు గాక !

బుధజన విధేయుడు
గోపదేవ్

# విషయ విభాగము

ఓమ్

# అథ ఋగ్వేదాది భాష్య భూమికా

"ఓమ్ సహ నావవతు సహ నౌ భునక్తు
సహ వీర్యం కరవావహై, తేజస్వి నా
వధీతమస్తు, మా విద్విషావహై"
ఓమ్ శాంతిః శాంతిః శాంతిః
తైత్తిరీయ ఆరణ్యకే, నవమ ప్రపాఠకే ప్రథమానువాకే.

తెలుగు । (సహనావవతు) ఓ సర్వశక్తిమంతుడవగు ఈశ్వర! నీ కృపవలనను, రక్షణ వలనను, సహాయము వలనను మేము పరస్పరము ఒకరినొకరము రక్షించుకొందుముగాక! (సహ నౌ భునక్తు) మే మెల్లరము నీ యనుగ్రహమువలన పరమప్రీతితో కలిసి, అన్నింటికంటె నుత్తమమగు నైశ్వర్యమును - చక్రవర్తి రాజ్యాది సామగ్రితో నానందమును - ఎల్లపుడు ననుభవింతుము గాక! (సహ వీర్యం కరవావహై) ఓ కృపానిధీ! నీ సహాయమువలన మేమెల్లరము పరస్పరము కలిసి యొకరు ఇంకొకరి సామర్థ్యమును పురుషార్థము ద్వారా ఎల్లపుడు పెంపొందించుకొందుము గాక! (తేజస్వి నౌ అధీతమస్తు)ఓ ప్రకాశమయ! సర్వవిద్యల నొసంగు పరమేశ్వర! నీ సామర్థ్యము వలననే మేము చదివినదియు, మాచే చదివింపబడినదియు సమస్త ప్రపంచమునందును ప్రకాశించు గాక! మా సమస్త విద్యయు సదా వృద్ధినొందునుగాక! (మా విద్విషావహై) ఓ ప్రీత్యుత్పాదక! మేము పరస్పరము ద్వేషింపక, యెల్లరము నొకరి కొకరము మిత్రులమై వర్తించునట్లు నీవు దయజూడుము. '(ఓం శాంతిః, శాంతిః, శాంతిః) ఓ భగవంతుడ! నీ కృప వలన మా తాపత్రయము.' (౧ ఆధ్యాత్మికము - జ్వరము మున్నగు రోగములవలన శరీరమునందు గలుగు తాపము. ౨. ఆధిభౌతికము - ఇతర ప్రాణులవలనగలుగు తాపము. 3. ఆధిదైవికము - మనస్సు యొక్కయు, ఇంద్రియముల యొక్కయు వికారమువలనను, అశుద్ధివలనను, చాంచల్యము వలనను గలుగు తాపము.) శాంతించుగాక! ఈ మువ్విధములయిన దుఃఖములను శాంతిపజేయుము - నివారింపుము. అందువలన సుఖపూర్వకముగ వేద భాష్యమును యథావిధిగ రచియించి మానవుల కెల్లరకు నుపకారము చేయుదుము. మేము కోరునదిదియే. మాకెల్లపుడు సహాయ మొసర్చుము.

సంస్కృతం । "బ్రహ్మానంత మనాది విశ్వకృదజం సత్యం వరం శాశ్వతం
విద్యా యస్య సనాతనీ నిగమభృద్ వైధర్మ్య విధ్వంసినీ,
వేదాఖ్యా విమలా హితా హి జగతే నృభ్యః సుభాగ్య ప్రదా
తన్నత్వా నిగమార్థ భాష్యమతినా భాష్యం తు తన్తన్యతే"

తె॥ బ్రహ్మస్వరూపుడై, అనంతము మున్నగు విశేషణములతో నెవడు యుక్తుడో, యెవని వేదవిద్య సనాతనమో యట్టి పరమేశ్వరునకు నత్యంత ప్రేమభక్తితో నమస్కరించి యీ వేదభాష్యము నారంభించుచున్నాను..

స॥ "కాలరామాఙ్క చంద్రేఽబ్దే భాద్రమాసే సితేదలే
ప్రతిపద్యాదిత్య వారే భాష్యారంభః కృతో మయా" (౨)

తె॥ విక్రమసంవత్ ౧౯౩౩ భాద్రపద శుద్ధ పాడ్యమి ఆదివారమున నే నీ వేద భాష్యమునారంభించితిని.

సం॥ "దయాయా ఆనందో విలసతి పరః స్వాత్మవిదితః,
సరస్వత్య స్యాగ్రే నివసతి హితా హీశశరణా
ఇయం ఖ్యాతిర్యస్య ప్రతతసుగుణా వేదమననా-
స్త్యనే నేదం భాష్యం రచితమితి బోద్ధవ్య మనఘాః." (౩)

తె॥ దయానంద సరస్వతి యను నామముగల వ్యక్తి యీ వేద భాష్యమును రచియించినాడని సజ్జనుల కెల్లరకు విదితమగుగాక!

సం॥ "మనుష్యేభ్యో హితాయైవ సత్యార్థం సత్యమానతః,
ఈశ్వరానుగ్రహేణేదం వేదభాష్యం విధీయతే." (౪)

తె॥ ఈశ్వరుని కృపాసహాయమువలన సర్వమానవుల హితము కొఱకే వేదభాష్య మొనర్చుచున్నాడ.

సం॥ "సంస్కృత ప్రాకృతాభ్యాం యద్భాషాభ్యా మన్వితం శుభమ్
మంత్రార్థ వర్ణనం చాత్ర క్రియతే కామధుఙ్మయా." (౫)

తె॥ సంస్కృతము, ప్రాకృతము (హిందీ) అను రెండు భాషలలో నీ వేదభాష్యము రచియింపబడుచున్నది. వేద మంత్రార్థము కూడ.

సం॥ "ఆర్యాణాం మున్యృషీణాం యా వ్యాఖ్యారీతిః సనాతనీ /
తాం సమాశ్రిత్య మంత్రార్థా విధాస్యంతే తు నాన్యథా." (౬)

తె॥ ఈ వేదభాష్యమునం దప్రమాణముగ నాకింతయు వ్రాయబడదు. బ్రహ్మ మొదలు వ్యాసమహర్షి వఱకు గల ఋషులయు, మునులయు రీతి ననుసరించియే యీ వేదభాష్యము రచియింపబడును.

సం॥ "యేనాధునికభాష్యైర్యే టీకాభిర్ వేదదూషకాః
దోషాః సర్వే వినశ్యేయు రన్యథార్థవివర్ణనాః." (౭)

తె॥ ఇంతకు పూర్వము వ్రాయబడిన వేదభాష్యముల వలనను, టీకల వలనను వేదములపై నే మిథ్యాదోషారోపణములు భ్రమచే చేయబడినవో, అవి యన్నియు నీ వేదభాష్యమూలమున నివృత్తములగును.

సం॥ "సత్యార్థశ్చ ప్రకాశ్యేత వేదానాం యః సనాతనః
ఈశ్వరస్య సహాయేన ప్రయత్నోఽ యం సుసిద్ధ్యతామ్." (౮)

తె॥ మఱియు నీ భాష్యమువలన వేదముల సత్యార్థము ప్రపంచమున ప్రసిద్ధమగుగాక! వేదముల సనాతనార్థము నెల్లరు నున్నదున్నట్లెఱుగుటకు నేనీయత్న మొనర్చుచున్నాను. కావున పరమేశ్వరుని సహాయమున నీ కార్యము బాగుగ సిద్ధించునుగాక! సర్వశక్తిమంతుడగు పరమేశ్వరుని నే బ్రార్థించున దిదియే.

సం॥ "విశ్వాని దేవ సవితర్ దురితాని పరాసువ
యద్ భద్రం తన్న ఆసువ." ౧ యజుర్వేదే, అధ్యాయే ౩౦, మంత్రః ౩.

హే సచ్చిదానందానన్త స్వరూప! హే పరమ కారుణిక! హే అనన్తవిద్య! హే విద్యా విజ్ఞాన ప్రద! (దేవ) హే సూర్యాది సర్వజగద్విద్యా ప్రకాశక! హే సర్వానంద ప్రద! (సవితః) హే సకల

జగదుత్పాదక! (నః) అస్మాకం, (విశ్వాని) సర్వాణి (దురితాని) దుఃఖాని, సర్వాన్ దుష్టగుణాంశ్చ (పరాసువ) దూరే గమయ, (యద్ భద్రం) యత్ కల్యాణం, సర్వదుఃఖరహితం, సత్య విద్యాప్రాప్త్యాఽభ్యుదయ నిఃశ్రేయస సుఖకరం భద్రమస్తి, (తన్నః) అస్మభ్యం, (ఆసువ) సమన్తాదుత్పాదయ, కృపయా ప్రాపయ, అస్మిన్ వేదభాష్య కరణానుష్ఠానే యే దుష్టా విఘ్నాః తాన్ ప్రాప్తేః పూర్వమేవ పరాసువ-దూరంగమయ. యచ్చ శరీరబుద్ధి సహాయ కౌశల సత్యవిద్యా ప్రకాశాది భద్రమస్తి, తత్ స్వకృపాకటాక్షేణ హే పరబ్రహ్మన్! నోఽస్మభ్యం ప్రాపయ. భవత్ కృపా కటాక్ష సుసహాయప్రాప్త్యా సత్యవిద్యోజ్జ్వలం ప్రత్యక్షాది ప్రమాణ సిద్ధం భవద్రచితానాం వేదానాం యథార్థం భాష్యం వయం విదధీమహి. తదిదం సర్వమనుష్యోపకారాయ భవత్ కృపయా భవేత్. అస్మిన్ వేదభాష్యే సర్వేషాం మనుష్యాణాం పరమ శ్రద్ధయాఽఽ త్యన్తా ప్రీతిర్యథాస్యాత్, తథైవ భవతా కార్యమిత్యోమ్.

తె॥ ఓ సత్యస్వరూప ! ఓ విజ్ఞానమయ! ఓ సదానందస్వరూప! ఓ అనంత సామర్థ్య యుక్త! ఓ పరమకృపాలు ! ఓ అనంతవిద్యామయ! ఓ విద్యావిజ్ఞానప్రద! (దేవ) ఓ పరమేశ్వర ! నీవు సూర్యాది సర్వజగత్తును, విద్యను ప్రకాశింపజేయువాడవు. సర్వానంద ప్రదుడవు. (సవితః!) ఓ సర్వజగదుత్పాదక! సర్వశక్తిమంతుడ! నీవు సకల జగత్తు నుత్పన్నము చేయువాడవు. (నః) మా, (విశ్వాని) సమస్త, (దురితాని) దుఃఖములను, దుష్టగుణములను, (పరాసువ) దూరమొనర్పుము - మా నుండి వానిని, వానినుండి మమ్ములను దూరముగ నుంచుము. (యత్ భద్రం) ఏది సర్వదుఃఖరహితమగు శుభమో, యేది సర్వసుఖయుక్తమో దానిని మా కెల్లపుడు ప్రాపింపజేయుము (సుఖము ద్వివిధము. ఒకటి: సత్యవిద్యాప్రాప్తి వలన గలుగు నభ్యుదయము - చక్రవర్తి రాజ్యము, ఇష్టమిత్రులు, ధనము, పుత్రులు, స్త్రీ శరీరాదులవలన ప్రాప్తించు సత్యంతోత్తమ సుఖము. రెండు : నిశ్శ్రేయస సుఖము - మోక్షము. ఈ ద్వివిధ సుఖమే భద్రమనబడును) (తత్ నః ఆసువ) ఉపర్యుక్త భద్రనామక సుఖమును నీవు మాకన్నివిధముల కలిగింపుము. నీ కృపాసహాయమున విఘ్నములన్నియు మానుండి దూరమగుగాక! ఈ వేద భాష్యరచనానుష్ఠానము సుఖముగ పూర్ణమగుగాక! ఈ యనుష్ఠానమున మా శరీరమునం దారోగ్యము, బుద్ధి, చతురత వర్ధిల్లునుగాక! సజ్జనుల సహాయము, సత్యవిద్యా ప్రకాశము పెంపొందునుగాక! ఈ భద్ర స్వరూప సుఖమును నీవు నీ సామర్థ్యము వలన మా కొసంగుము. నీ కృపాబలముతో నీచే రచియింపబడిన సత్యవిద్యాయుక్త వేదములకు సత్యార్థయుక్త భాష్యమును సుఖముగ రచియింతుము. కావున నీ వేద భాష్యము నీ కృపవలన సంపూర్ణమయి, సర్వమానవుల కనిశ ముపకార మొనర్చుగాక! అంతర్యామివగు నీ ప్రేరణ వలన మనుజులకెల్లరకు నీ వేదభాష్యమునందు శ్రద్ధాసమన్వితమగు నుత్సాహముదయించుగాక! అందువలన వేద భాష్యమునొనర్చు మా ప్రయత్నము యథావిధిగ సిద్ధించునుగాక! ఇట్లే నీవు మాపైనను, సమస్త జగత్తుమీదను కృపాదృష్టి నుంచుము. అందువలన నీ గొప్ప సత్యకార్యమును మేము సులభముగ జేయగలము.

# అథేశ్వర ప్రార్థనా విషయః

సం॥ "యో భూతం చ భవ్యం చ సర్వం యశ్చాధితిష్ఠతి
స్వర్యస్య చ కేవలం తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః" (౧)
అథర్వ వేద సంహితాయాం, కాండే ౧౦ ప్రపాఠకే (౨౩)
అనువాకే ౪ సూక్తే ౮. మంత్ర : ౧.

(యో భూతం చ) యో భూత భవిష్యద్వర్తమానాన్ కాలాన్ (సర్వం యశ్చ అధితిష్ఠతి) సర్వం జగచ్చాధితిష్ఠతి, సర్వాధి ష్ఠాతాసన్ కాలా దూర్ధ్వం విరాజమానో స్తి (స్వఃయస్యచ కేవలం) యస్య చ కేవలం నిర్వికారం స్వః సుఖ స్వరూపమస్తి, యస్మిన్ దుఃఖం లేశ మాత్రమపి నాస్తి, యద్ ఆనంద ఘనం బ్రహ్మాస్తి (తస్మై...నమః) తస్మై జ్యేష్ఠాయ సర్వోత్కృష్టాయ బ్రహ్మణే మహతేఽత్యంతం నమోఽస్తు. (౧.)

తె॥ (యో భూతం) ఏ పరమేశ్వరుడు భూత భవిష్యద్వర్తమాన కాలముల నతిక్రమించి విరాజిల్లుచున్నాడో, ఆ మూడు కాలములందును జరుగు వ్యవహారముల నన్నింటిని సరిగా నెఱుగునో, (సర్వం యశ్చ అధితిష్ఠతి) ఎవడు సమస్త జగత్తును తన విజ్ఞానముచే నెఱుంగునో, పుట్టించి, పోషించి, లయమొనర్చునో, మఱియు విశ్వమునందలి పదార్థముల కధిష్ఠాత స్వామియో (స్వః యస్య చ కేవలమ్) కేవల సుఖమే యెవనికి స్వరూపమో, ఎవడు మోక్షమును, వ్యావహారిక సుఖమును నిచ్చువాడో, యెవనికి లేశమాత్రమైనను దుఃఖము కలుగదో, ఎవడానందఘనుడో (తస్మై...నమః) అందఱికంటె పెద్దయు సర్వసామర్థ్య యుక్తుడు నగు నా పరమాత్మ కత్యంత ప్రేమతో నమస్కారము. (భూతము-గత కాలము, భవిష్యత్తు-రానున్న కాలము, వర్తమానము- జరుగుచున్న కాలము. మంత్రమునందలి యనేక చకారములు వర్తమానకాల సూచకములు.)

సం॥ "యస్యభూమిః ప్రమాఽన్తరిక్షముతో దరమ్
దివం యశ్చక్రే మూర్ధా నం, తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః "౨
అథ ౧ ౦. కాం౨ ౩. ప్ర. ౪ అ. ౭ సూ. ౩౨ మ.

(యస్యభూమిః ప్రమా) యస్య భూమిః ప్రమా యథార్థజ్ఞాన సాధనం పాదావివాస్తి, (అంతరిక్ష...) అంతరిక్షం యస్యోదరతుల్య మస్తి. యశ్చ సర్వస్మాదూర్ధ్వం సూర్య రశ్మి ప్రకాశమయ మాకాశం దివం మూర్ధానం శిరోవ చ్చక్రే కృతవా నస్తి, తస్మై...

తె॥ (యస్య భూమిః ప్రమా.) ఏ పరమేశ్వరుని యునికిని, జ్ఞానమును దెలుపుటకు భూమ్యాది పదార్థములు యథార్థ జ్ఞాన సాధనములో, ఎవడు సృష్టిలో భూమిని పాదస్థానమున నుండునదిగ రచించెనో, (అంతరిక్ష ముత ఉదరమ్) భూమికి సూర్యాది గోళములకు మధ్య నుండు నాకాశము నెవడు ఉదరస్థానమున నిర్మించెనో, (దివం యశ్చక్రే మూర్ధానం) ఎవడు ప్రకాశమాన పదార్థములను సృష్టిలో నన్నింటికి పైన మస్తకస్థానమున నుంచెనో - ఎవడు భూమి మొదలు సూర్యాది లోకముల వఱకు గల సమస్త జగత్తును నిర్మించి దాని యందు వ్యాపకుడై, జగత్తు యొక్క సర్వావయవములందు పూర్ణుడై యన్నిటిని ధరించుచున్నాడో - (తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః) యా పరబ్రహ్మకు నమస్కారము.

సం॥ "యస్య సూర్యశ్చక్షు శ్చంద్రమాశ్చ పునర్ణవః
అగ్నిం యశ్చక్ర ఆస్యం తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః." ౩

అథ. కాం. ౧౦ ప్ర౨౩, అను ౪ సూ ౭ మం. ౩౩.

(యస్య సూ) యస్య సూర్యః చంద్రమాశ్చ పునః పునః సర్గాదౌ నవీనే చక్షుషీ ఇవ భవతః, యో అగ్ని మాస్యం ముఖవచ్చక్రే కృతవానస్తి, తస్మై...

తె॥ (యస్య సూర్యః చక్షుః, చంద్రమాః చ.) ఎవనికి సూర్య చంద్రులు నేత్ర స్థానములై యున్నవో, ఎవడు ప్రతి కల్పాదియందును సూర్యచంద్రాది పదార్థములను మాటి మాటికి క్రొత్తవిగ రచియించునో, (యః అగ్నిం ఆస్యం చక్రే) ఎవడు ముఖ స్థానముగా నగ్నిని రచియించెనో, (తస్మై....నమః) ఆ పరబ్రహ్మకే నా నమోవాకములు.

సం॥ "యస్య వాతః ప్రాణాపానౌ చక్షురంగిరసోఽభవన్
దిశో యశ్చక్రే ప్రజ్ఞానీ స్తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః." (౪)

అథర్వ కాండ ౧౦. ప్ర౨౩, అను. ౪ సూ. ౭ మం. ౩ ౪

(యస్య వాతః....) వాతః సమష్టిర్ వాయుర్ యస్య ప్రాణాపానా వివాస్తి,(అంగిరసః...) అంగిరా అంగారా అంకనా అంచనా ఇతి నిరుక్తే ౩–౧౭. ప్రకాశకాః కిరణాః చక్షుషీ ఇవ భవతః యో దిశః ప్రజ్ఞానీః ప్రజ్ఞాపినీర్ వ్యవహార సాధికాః చక్రే, తస్మై హ్యనంత విద్యాయ బ్రహ్మణే మహతే సతతం నమోఽస్తు.

తె॥ (యస్య వాతః ప్రాణాపానౌ) ఎవడు బ్రహ్మాండగత వాయువును ప్రాణాపానములనలె నొనర్చెనో, (చక్షుః అంగిరసః అభవన్) ప్రకాశము నిచ్చు కిరణముల నెవడు నేత్రముల జేసెనో – కిరణ ప్రకాశము వలననే రూపము (రంగు) గ్రహింపబడును. (నిరుక్తమున 'అంగిరస్' శబ్దమునకు 'అంగారా' శబ్దముతో పైన జూపిన యర్థము వ్రాయబడినది.) (యః దిశః ప్రజ్ఞానీః చక్రే) ఎవడు దశ దిశలను సర్వ వ్యవహారము సిద్ధము సేయు వానిగ జేసెనో, అనంత విద్యా యుక్తుడును, సర్వమానవులకు నిష్ట దేవుడును నగు నా పరబ్రహ్మకు మా నమస్కారములు.

సం॥ "య ఆత్మదా బలదా యస్య విశ్వ ఉపాసతే ప్రశిషంయస్య దేవాః,
యస్య చ్ఛాయామృతం యస్య మృత్యుః కస్మై దేవాయ హవిషా విధేమ." యజు. ౩ ౫.

(య ఆత్మదాః....) య ఆత్మదా విద్యా విజ్ఞాన ప్రదః, (బలదాః) యః శరీరేంద్రియ ప్రాణాత్మ మనసాం పుష్ట్యుత్సాహ పరాక్రమ దృఢత్వ ప్రదః, (యస్య...) యం విశ్వేదేవాః సర్వే విద్వాంస ఉపాసతే యస్యానుశాసనం చ మన్యంతే, (యస్యచ్ఛాయా....) యస్యాశ్రయ ఏవ మోక్షోఽస్తి, యస్య అచ్ఛాయా అకృపా ఽనాశ్రయో మృత్యుః జన్మ మరణ కారకోఽస్తి. (కస్మై.) (తస్మై కస్మై ప్రజాపతయే ప్రజాపతిర్ వై కః తస్మై హవిషా విధే మేతి. శతపథ బ్రాహ్మణే, కాండే ౭ అ. ౩) సుఖ స్వరూపాయ బ్రహ్మణే దేవాయ ప్రేమ భక్తి రూపేణ హవిషా వయం విధేమ, సతతం తస్యై వోపాసనం కుర్వీమహి.

తె॥ (య ఆత్మదా....) ఏ జగదీశ్వరుడు దయతో తన యాత్మ విజ్ఞానమును గలిగించునో, ఎవడు సర్వ విద్యలయు, సత్య సుఖములయు ప్రాప్తిని గలిగించునో, (బలదాః) ఎవడు శరీరమునకు, ఇంద్రియములకు, మనః ప్రాణాదులకును పుష్టి, ఉత్సాహము, పరాక్రమము, దృఢత్వము నిచ్చునో, (యస్య విశ్వే ఉపాసతే) విద్వాంసులెల్లరు నెవని నుపాసించుచు వచ్చిరో, (యస్య ప్రశిషం దేవాః) యెవని యను శాసనము–వేదోక్తి

శిక్షణమును శిష్టులెల్లరు నతి గౌరవముతో స్వీకరింతురో, (యస్యచ్ఛాయా అమృతం) ఎవని నాశ్రయించుట మోక్షసుఖమునకు కారణమో (యస్య మృత్యుః) ఎవని యకృపయే జన్మ మరణ రూప దుఃఖముల నొసంగునో - ఈశ్వరుని, అతని యుపదేశములగు సత్య విద్యలను, సత్య ధర్మములను, సత్యమోక్షమును నంగీకరింపక, వేదమునకు విరోధులై తన యిచ్ఛ వచ్చినట్లు దుష్టములగు కోరికలతో దుష్కర్మలందు వర్తించు వారిపై నీశ్వరునకు కృప గలుగదు. అదియే యకృప. అది దుఃఖములకు కారణమగును. అతని యాజ్ఞాపాలనమే సర్వసుఖములకు మూలమగును. (కస్మై దేవాయ హవిషా విధేమ.) సుఖ స్వరూపుడును, సర్వ ప్రజాపతియునగు నా పరమేశ్వరుని ప్రాప్తి కొఱకు సత్య ప్రేమ-భక్తి-రూప సామగ్రితో మనము నిత్యము భజింతుముగాక! అందువలన మన కెట్టి దుఃఖము నెన్నడు గలుగకుండుగాక! (శత పథ బ్రాహ్మణమున 'కః' శబ్దమునకు 'ప్రజాపతి యని యర్థము వ్రాయబడినది.)

సం॥ "ద్యౌః శాంతి రంతరిక్షగ్ం శాంతిః పృథివీ శాంతి
రాపః శాంతి రోషధయః శాంతిర్, వనస్పతయః
శాంతిర్ విశ్వేదేవాః శాంతిర్ బ్రహ్మ శాంతిః
సర్వగ్ం శాంతిః శాంతి రేవ శాంతిః సా మా శాంతి రేధి."(౬) యజు. అ. ౩౬ మం. ౧౭

(ద్యౌఃశాంతి....) హే సర్వ శక్తిమన్ పరమేశ్వర! త్వద్ భక్త్యా త్వత్ కృపయా చ ద్యౌః, అంతరిక్షం, పృథివీ, జలమ్, ఓషధయః వనస్పతయః, విశ్వేదేవాః సర్వే విద్వాంసో, బ్రహ్మ వేదః, సర్వం జగచ్చాస్మదర్థం శాంతం నిరుపద్రవం సుఖ కారకం సర్వదాఽస్తు. అనుకూలం భవతు నః. యేన వయం వేద భాష్యం సుఖేన విదధీమహి. హే భగవన్ ! ఏతయా సర్వ శాన్త్యా విద్యా బుద్ధి విజ్ఞానారోగ్య సర్వోత్తమ సహాయైర్ భవాన్ మా వర్ధయతు తథా సర్వం జగచ్చ.

తె॥ (ద్యౌః శాంతిః....) ఓ సర్వ శక్తి మంతుడవగు భగవంతుడ! నీ యందు మాకుగల భక్తి చేతను, నీ కృప చేతను (ద్యౌః) సూర్యాదిలోకముల ప్రకాశము, విజ్ఞానము నెల్లప్పుడు, మాకు సుఖదాయకములగు గాక! అట్లే పృథివి, ఆకాశము, జలము, ఓషధులు, వనస్పతులు- వటవృక్షాదులు, ప్రపంచమునగల విద్వాంసులెల్లరు బ్రహ్మము-వేదము అను నీ పదార్థములు, మఱియు వీని కంటె నితరమగు జగత్తు అన్నియు మాకు సర్వ కాలములందును సుఖము నొడగూర్చుగాక! సర్వ పదార్థములు సర్వ దినములందును మా కనుకూలములగుగాక! అందువలన మేమీవేద భాష్య రూప కార్యమును సుఖముగ నెఱవేర్పగలుగుదుము గాక! ఓ భగవంతుడ! ఇట్టి సర్వ శాంతి వలన మాకు కృపతో విద్య, బుద్ధి, విజ్ఞానము, సర్వోత్తమ సహాయము నొసంగుము, ఉత్తమ గుణములను, సుఖమునునొసంగి మమ్ములను, సర్వ జగత్తును వృద్ధినొందింపుము.

సం॥ "యతో యతః సమీహసే తతో నో అభయం కురు
శన్నః కురు ప్రజాభ్యోఽభయం నః పశుభ్యః (౭) యజు, అ. ౩౬, మం. ౨౨

(యతో యతః) హే పరమేశ్వర ! యతో యతో దేశాత్ త్వం సమీహసే, జగద్రచన పాలనార్థం చేష్టాం కరోషి, తతస్తతో దేశాన్నో ఽ స్మా నభయం కురు; యతః సర్వథా సర్వేభ్యో దేశేభ్యో భయ రహితా భవత్ కృపయా వయం భవేమ. (శన్నః కురు....) తథా తత్రస్థాభ్యః ప్రజాభ్యః పశుభ్యశ్చ నో ఽ స్మానభయం కురు. ఏవం సర్వేభ్యో దేశేభ్యస్తత్ర స్థాభ్యః ప్రజాభ్యః పశుభ్యశ్చ నోఽస్మాన్ శం కురు. ధర్మార్థ కామ మోక్షాది సుఖ యుక్తాన్ స్వానుగ్రహేణ సద్యః సంపాదయ.

తె॥ (యతో యతః) ఓ పరమేశ్వర! నీ వేయే దేశమున జగత్తును రచియించుచున్నావో, పాలించుచున్నావో, యాయా దేశము నుండి మమ్ములను భయరహితుల నొనర్పుము- ఏ దేశమునుండియు

మా కించుకంతయు భయ మొదవకుండుగాక! (శం నః కురు....) అట్లే యన్ని దేశములందుగల నీ ప్రజలనుండియు, పశువుల నుండియు మమ్ము భయరహితులను జేయుము. మా వలన వానికిని సుఖము కలుగుగాక! భయము కలుగ రాదు; నీ ప్రజలలోని మనుజుల వలనను, పశువుల వలనను మాకు శుభము కలుగునట్లు చేయుము. ధర్మార్థ కామమోక్షరూప పురుషార్థములు నీ యనుగ్రహమున మాకు శీఘ్రముగ ప్రాప్తించుగాక! అందువలన మానవ జన్మమునకు ఫలములగు ధర్మాదులు సుఖముగ సిద్ధించునుగాక!

*సం॥ "యస్మిన్ ఋచః సామ యజూగ్ంషి, యస్మిన్*
*ప్రతిష్ఠితా రథనాభావివారాః యస్మింశ్చిత్తగ్ం*
*సర్వమోతం ప్రజానాం తన్మే మనః శివ సంకల్పమస్తు." (ఉ )యజు. అ.౩౪.మం.౫.*

*(యస్మిన్ ఋచః...) హే భగవన్! కృపానిధే! యస్మిన్ మనసి ఋచః సామాని యజూంషి చ ప్రతిష్ఠితాని భవన్తి, యస్మిన్ యథార్థ మోక్ష విద్యా చ ప్రతిష్ఠితా భవతి, (యస్మిన్ చిత్తం....) యస్మింశ్చ ప్రజానాం చిత్తం స్మరణాత్మకం సర్వమోత మస్తి. సూత్రే మణిగణవత్ ప్రోతమస్తి. కస్యాం కఇవ? రథనాభౌ అరా ఇవ; తన్మే మమ మనో భవత్ కృపయా శివ సంకల్పం కల్యాణ ప్రియం సత్యార్థ ప్రకాశం చాస్తు; యేన వేదానాం సత్యార్థః ప్రకాశ్యేత. హే సర్వవిద్యామయ! సర్వార్థ విత్! మదుపరి కృపాం విధేహి; యథా నిర్విఘ్నేన వేదార భాష్యం సత్యార్థం పూర్ణం వయం కుర్వీమహి. భవద్యశో వేదానాం సత్యార్థం విస్తారయేమహిః యం దృష్ట్వా వయం సర్వే సర్వోత్కృష్ట గుణా భవేమ. ఈ దృశీం కరుణా మస్మాక ముపరి కరోతు భవాన్, ఏతదర్థం ప్రార్థ్యతే. అనయా ప్రార్థనయాఽస్మాన్ శీఘ్రమేవానుగృహ్ణాతు యత ఇదం సర్వోపకారకం కృత్యం సిద్ధం భవేత్."*

తె॥ (యస్మిన్నృచః) ఓ భగవంతుడ! కృపానిధీ! (ఋచః) ఋగ్వేదము, (సామ) సామవేదము, (యజూంషి) యజుర్వేదము, ఈ మూడింటికి నంతర్భూతమగుటచే నథర్వవేదము – అను నీ వేదములన్నియు దేనియందు స్థిరములగునో, మఱియు దేనియందు మోక్షవిద్య – బ్రహ్మవిద్య సత్యాసత్య ప్రకాశము నేర్పడునో, (యస్మిన్ చిత్తం...) దేనియందు సర్వప్రజల చిత్తము స్మరించువృత్తితో నుండునో, ఇవి యన్నియు మాలయందలి మణులు సూత్రమున గ్రుచ్చబడినట్లు, రథ చక్రపుటడ్డలో నాకులిమిడి యున్నట్లు ఇమిడియుండునో, అట్టి నా మనస్సు నీ కృపవలన శుద్ధమగుగాక! అట్లే కల్యాణము మోక్షమును, సత్యధర్మమును ననుష్ఠించుటకును, అసత్యమును పరిత్యజించుటకును ననువగు సంకల్పముతో గూడినదగుగాక! ఆ మనస్సు వలన మాకు నీచే నిర్మితములైన వేదముల సత్యార్థము సరిగా ప్రకాశించుగాక! మేము విఘ్నములనుండి యెల్లప్పుడు వేఱుగనుండునట్లు నీవు మాపై కృప నుంచుము. సత్యార్థ సహితముగ నీవేద భాష్యమును సంపూర్ణమొనర్చి, భవన్నిర్మితములైన వేదముల సత్యార్థమును విస్తరింపజేయుటయనెడి కీర్తిని జగమున నెల్లప్పటికి వృద్ధి నొనరింతుముగాక! ఈ భాష్యమును జూచి, వేదానుసారముగ సత్యానుష్ఠాన మొనర్చి మేమెల్లరము నెల్లప్పుడు శ్రేష్ఠగుణయుక్తుల మగుదుముగాక! ఇందులకే మా ప్రార్థనయు. మేము నిన్నెల్లపుడు ప్రేమతో ప్రార్థించుచున్నాము. నీవు శీఘ్రముగ కృపతో నాలకింపుము. అందువలన నెల్లరకు నుపకారమొనర్చు నీ వేద భాష్యానుష్ఠానము బాగుగ సిద్ధించును గాక!

ఇతీశ్వర ప్రార్థనా విషయః = ఇట్లు ఈశ్వర ప్రార్థనా విషయము

సమాప్తము

# అథ వేదోత్పత్తి విషయః

స॥ "తస్మాద్ యజ్ఞాత్ సర్వహుత ఋచః సామాని జజ్ఞిరే

ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాద్ యజుస్తస్మాదజాయత." ౧ యజు – అ. ౩౧. మం. ౭.

(తస్మాద్) తస్మాద్యజ్ఞాత్ సచ్చిదానందాది లక్షణాత్ పూర్ణాత్ పురుషాత్ సర్వహుతాత్ సర్వపూజ్యాత్ సర్వోపాస్యాత్ సర్వశక్తిమతః పరబ్రహ్మణః (ఋచః) ఋగ్వేదః, (యజుః) యజుర్వేదః. (సామాని) సామవేదః, (ఛందాంసి) అథర్వవేదశ్చ, (జజ్ఞిరే) చత్వారో వేదాస్తేనైవ ప్రకాశితా ఇతి వేద్యమ్. సర్వహుత ఇతి వేదానామపి విశేషణం భవితు మర్హతి; వేదాః సర్వహుతః. యతః సర్వమనుష్యైర్ హోతు మాదాతుం గ్రహీతుం యోగ్యాః సన్త్యతః. 'జజ్ఞిరే. అజాయత' ఇతి క్రియాద్వయం వేదానా మనేక విద్యావత్త్వద్యోతనార్థమ్. తథా, 'తస్మా'దితి పదద్వయం ఈశ్వరాదేవ వేదా జాతా ఇత్యవధారణార్థమ్, వేదానాం గాయత్ర్యాది ఛందోఽన్వితత్వాత్, పున శ్ఛందాంసీతి పదం చతుర్థస్యా థర్వవేదస్య ఉత్పత్తిం జ్ఞాపయతీత్యవధేయమ్.

'యజ్ఞో వై విష్ణుః' శత.కాం.౧.అ ౧ బ్రా.౨, కం.౧౩.

"ఇదం విష్ణుర్ విచక్రమే త్రేధా నిదధే పదమ్" యజుః అ. ౫ మం. ౧౫

ఇతి సర్వజగత్ కర్తృత్వం విష్ణౌ పరమేశ్వర ఏవ ఘటతే నాన్యత్ర, వేవేష్టి వ్యాప్నోతి చరాచరం జగత్ స విష్ణుః పరమేశ్వరః

తె॥ పరమేశ్వరునకు నమస్కరించి, యతనిని ప్రార్థించి, తదుపరి వేదోత్పత్తి విషయము – వేదము నెవరుత్పన్న మొనర్చిరి? వ్రాయబడుచున్నది.

(తస్మాత్ యజ్ఞాత్ సర్వహుతః) సత్ – ఎవనికెన్నడు నాశనము లేదో, చిత్ –ఎవడు సదా జ్ఞానస్వరూపుడో, అజ్ఞాన మావంతయు నెవని కెన్నడు గలుగదో, ఆనంద–ఎవడు సదా సుఖస్వరూపుడో, ఎవనికి దుఃఖలేశమెన్నడును గలుగదో – అట్టి సచ్చిదానందరూపలక్షణములతో గూడి, సర్వత్ర పరిపూర్ణుడై యుండుటచే పురుషుడును, సర్వమానవులచే నుపాసింపబడ యోగ్యుడగు నిష్టదేవుడగుటచే సర్వహుతుడును, సర్వ సామర్థ్యయుక్తుడును నగు నా పరబ్రహ్మము నుండి, (ఋచః) ఋగ్వేదము, (సామాని) సామవేదము, (జజ్ఞిరే) పుట్టెను. (తస్మాత్) ఆపరమేశ్వరునుండి (ఛందాంసి) అథర్వవేదము (జజ్ఞిరే) పుట్టెను. (తస్మాత్) ఆతని నుండి, (యజుః) యజుర్వేదము. (అజాయత) జన్మించెను.

మంత్రమునందు పఠింపబడిన 'సర్వహుతః' పదము వేదములకును విశేషణము కాగలదు. 'హు' ధాతువు–క్రియ, ఆదానము = గ్రహించుటయను నర్థమునందును ప్రయుక్తమగును. అందువలన వేదములు సర్వహుతములు– సర్వమానవులచే గ్రహింపబడ యోగ్యములగుచున్నవి. కావున మానవులెల్లరు వేదములను గ్రహింపవలయుననియు వేదోక్త రీతిని నడువవలయుననియు బోధపడుచున్నది.

'జజ్ఞిరే, అజాయత' అను నేకార్థక క్రియలను రెండింటిని ప్రయోగించుటవలన వేదము లనేకవిద్యాయుక్తములని యెఱుగవలయును. అట్లే 'తస్మాత్' అను పదమును రెండు మాఱులు ప్రయోగించుటవలన 'వేదము లీశ్వరునుండియే యుత్పన్నములైనవి కాని, మనుష్యుల వలన గాదు' అని నిశ్చయముగా నెఱుగవలయును. వేదమంత్రములు అన్నియు గాయత్రి మున్నగు ఛందస్సులతో గూడియే యున్నవి. అయినను 'ఛందాంసి' అను పదము ప్రత్యేకముగ మంత్రమున ప్రయోగింపబడినందున

నది నాలుగవదియైన అథర్వవేదోత్పత్తిని దెలుపును.

యజ్ఞ శబ్దమున కర్థము విష్ణువు అనియు, సర్వ వ్యాపకుడగు పరమేశ్వరుడే విష్ణు శబ్ద వాచ్యుడనియు శత పథాది బ్రాహ్మణము వలనను, వేద మంత్రముల వలనను దెలియుచున్నది. ఇందులకు కారణము - సర్వ జగత్తు నుత్పన్నము సేయు సామర్థ్యము పరమేశ్వరునందే యున్నది. ఇతరులలో లేదు.

సం॥ "యస్మాదృచో అపాతక్షన్ యజు ర్యస్మాదపాకషన్
సామాని యస్య లోమా న్యథర్వాంగిరసో ముఖమ్
స్కంభం తం బ్రూహి కతమః స్విదేవ సః

అథ. కాం.౧౦ ప్రపా. ౨౩ అను ౪, సూ. ౭ మం. ౨౦.

(యస్మాదృచో) యస్మాత్ సర్వశక్తిమతః ఋచః ఋగ్వేదః (అపాతక్షన్) అపాతక్షత్ ఉత్పన్నోఽస్తి యస్మాత్ పరబ్రహ్మణః (యజుః) యజుర్వేదః అపాకషన్ ప్రాదుర్భూతోఽస్తి. తథైవ యస్మాత్ (సామాని) సామవేదః (అంగిరసః) అథర్వవేదశ్చోత్పన్నౌ స్తః. ఏవమేవ యస్యేశ్వరస్య అంగిరసః- అథర్వవేదో ముఖం ముఖవత్ ముఖ్యోఽస్తి. సామాని లోమానీవ సంతి, యజుర్ యస్య హృదయం, ఋచః ప్రాణ శ్చేతి రూపకాలంకారః యస్మాత్ చత్వారో వేదా ఉత్పన్నాః స కతమః స్విద్దేవోఽస్తి తం త్వం బ్రూహీతి ప్రశ్నః? అస్యోత్తరమ్ (స్కంభం తం) తం స్కంభం సర్వజగద్ధారకం పరమేశ్వరం త్వం జానీహీతి. తస్మాత్ స్కంభాత్ సర్వాధారాత్ పరమేశ్వరాత్ పృథక్ కశ్చిదవ్యన్యో దేవో వేదకర్తా నైవాస్తీతి మంతవ్యమ్.

"ఏవం వా అరేఽస్య మహతో భూతస్య నిఃశ్వసిత
మేత దృగ్వేదో యజుర్వేదః సామవేదో ఽ థర్వాంగిరసః

శత. కాం౧౪ అ. ౫ . బ్రా. ౪ క, ౧౦

అస్యాయమభిప్రాయః. యాజ్ఞవల్క్యోఽభివదతి - హే మైత్రేయి ! మహత ఆకాశాదపి బృహతః పరమేశ్వర స్యైవ సకాశాద్ ఋగ్వేదాది వేద చతుష్టయం (నిఃశ్వసితం) నిఃశ్వాసవత్ సహజతయా నిఃసృతమస్తీతి వేద్యమ్. యథా శరీరా చ్ఛ్వాసో నిఃసృత్య పునస్త దేవ ప్రవిశతి, తథై వేశ్వరాద్ వేదానాం ప్రాదుర్భావ తిరోభావౌ భవత ఇతి నిశ్చయః."

తె॥(యస్మాదృచో అపాతక్షన్) సర్వశక్తిమంతు డగు పరమేశ్వరునినుండి ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము (అంగిరసః) అథర్వవేదము అను నాలుగు వేదములు జనించినవి. 'అథర్వ వేదము ఈశ్వరుని ముఖతుల్యము; సామవేదము లోమ సమానము; యజుర్వేదము హృదయము వంటిది; ఋగ్వేదము ప్రాణము' అని పరమేశ్వరుడీ మంత్రమున వేదముల యుత్పత్తిని రూపకాలంకారముతో దెలిపి యున్నాడు. (బ్రూహి కతమః స్విదేవ సః) నాలుగు వేదములు నే దేవుని నుండి యుత్పన్నములైనవో యతనిని దెలుపుము. (స్కంభంతం) పరమేశ్వరుడు సర్వజగద్ధారకుడు. అతని నామము స్కంభుడు. అతడే వేద కర్తయని యెఱుగుము. మానవుల కుపాసింపదగిన యిష్ట దేవుడతడు తప్ప మఱియొకడు లేడనియు నెఱుగుము. వేదకర్తయు, సర్వ శక్తి మంతుడునగు పరమేశ్వరుని విడిచి అన్యునుపాసించు నభాగ్యుడెవడుండును!

(ఏవం వా అరేఽస్య) మహా విద్వాంసుడైన యాజ్ఞ వల్క్య మహర్షి తనకు పత్నియు, విదుషియునగు మైత్రేయి కిట్లుపదేశించు చున్నాడు- "ఓ మైత్రేయీ! సర్వ వ్యాపకుడగు పరమేశ్వరుడు ఆకాశాదులకంటె

గొప్పవాడు. అతని నుండియే ఋగ్యజుః సామాథర్వములను నాలుగు వేదములు నుత్పన్నములైనవి. మనుష్య శరీరమునుండి శ్వాస బయటికి వచ్చి మరల శరీరమున బ్రవేశించునట్లు, సర్గారంభమున నీశ్వరుడు వేదముల నుత్పన్న మొనర్చి ప్రపంచమున బ్రకటించును. ప్రళయ కాలమున బ్రపంచమున వేదములుండవు. కాని, పరమేశ్వరుని జ్ఞానమునందు బీజమున నంకురముండునటుల వేదము లెల్లపుడు నుండును. ప్రథమమున బీజమునందంకురముండును. ఆ యంకురమే తదుపరి వృక్ష రూపమై మరల బీజమున నంకుర రూపమున నుండును. అట్లే వేదములు నీశ్వరుని జ్ఞానమున నెల్లపుడు నుండును. అవి నశింపవు. అవి యీశ్వరుని విద్య కావున నవి నిత్యములు.

సం॥ పూర్వ పక్షః- అత్ర కేచి దాహుః నిరవయవాత్ పరమేశ్వరా చ్ఛబ్ద
మయో వేదః కథ ముత్పద్యేతేతి?

ఉత్తరపక్షః- అత్ర బ్రూమః న సర్వ శక్తి మతీశ్వరే శంకేయ ముపపద్యతే. కుతః? ముఖ ప్రాణాది సాధన మంత రాపి తస్య కార్యం కర్తుం సామర్థ్యస్య సదైవ విద్య మానత్వాత్. అన్యచ్చ. యథా మనసి విచారణా వసరే ప్రశ్నోత్తరాది శబ్దోచ్చారణం భవతి. తథేశ్వరే ఽ పి మన్యతామ్. యోఽస్తి ఖలు సర్వశక్తిమాన్, న నైవ కస్యాపి సహాయం కార్యం కర్తుం గృహ్ణాతి. యథాఽస్మదాదీనాం. సహాయేన వినా కార్యం కర్తుం సామర్థ్యం నాస్తి. నచైవ మీశ్వరే. యదా నిరవయవే నేశ్వరేణ సకలం జగద్రచితం, తదా వేదరచనే కా శంకా అస్తి? కుతః? వేదస్య సూక్ష్మ రచనవజ్జగత్యపి మహదాశ్చర్య భూతం రచన మీశ్వరేణ కృత మస్త్యతః.

తె॥ పూ.పః ఈ విషయమున ననేకు లిట్లు ప్రశ్నింతురు- 'ఈశ్వరుడు నిరాకారుడు. అతని నుండి శబ్ద రూపమగు వేదము లెట్లుత్పన్నములు కాగలవు?

ఉ.పః పరమేశ్వరుడు సర్వ శక్తి మంతుడు. అతని విషయమున నిట్లు శంకించుట బొత్తిగా పనికి రాదు. ముఖ ప్రాణాది సాధనములు లేకయే పరమేశ్వరునిలో ముఖ ప్రాణాది సాధనముల మూలమున నగు కార్యము లొనర్చుటకు ననంత సామర్థ్యము కలదు. ఈశ్వరుడు తన సామర్థ్యముతోనే ముఖ ప్రాణాద్యవయవములు లేకయే ముఖ ప్రాణాది కార్యముల బాగుగ నిర్వర్తింప గలడని భావము. ఈ దోషము జీవులలో గలుగ గలదు. జీవులు ముఖాదులు లేకున్న ముఖాది కార్యములను జేయజాలరు. వారల్ప సామర్థ్యము కలవారు. ఇందులకొక దృష్టాంతమును గలదు. మనస్సునందు ముఖాద్యవయవములు లేవు. అయినను దానియందు. ప్రశ్నోత్తరాది శబ్దోచ్చారణ రూపమగు మానసవ్యాపారము జరుగును. అట్లే పరమేశ్వరుని యందును జరుగునని తెలియనగును. సంపూర్ణ సామర్థ్యము కలవా డేకార్యము నొనర్చుటకును నెవని సహాయము నపేక్షింపడు. తన సామర్థ్యము చేతనే సర్వ కార్యములను నిర్వర్తింపగలడు. మన మితరుల సహాయము లేక కార్యముల నొనర్ప జాలము. ఈశ్వరుడట్టివాడు కాడు. ప్రళయమున జగత్తు లేకుండెను. సృష్టి సమయమున నిరాకారుడగు నీశ్వరుడు సాకార సంపూర్ణ జగత్తును నిర్మింపగలిగినపుడు వేదములను రచించుటలో నాటంక మేమి? జగమున నేత్రాది పదార్థముల నత్యంత విస్మయ జనకముగ నీశ్వరుడు నిర్మించి యున్నాడు. అట్లే వేదము నందును నత్యంత సూక్ష్మ విద్యలను రచించి యున్నాడు. నిరాకారేశ్వరుడు వేదముల గూడ నిట్లు రచియింప జాలడా?

సం॥ పూ.ప నను! జగద్రచనే తు ఖల్వీశ్వర మంతరేణ న కస్యాఽపి
సామర్థ్యమస్తి, వేదరచనే త్వన్యస్యాన్య గ్రంథరచనవత్ స్యాదితి.

ఉ, మః అత్రోచ్యతే, ఈశ్వరేణ రచితస్య వేద స్యాధ్యయనానంతర మేవ గ్రంథరచనే కస్యాఽపి సామర్థ్యం స్యాన్న చాన్యథా. నైవ కశ్చిదపి పఠన శ్రవణమంతరా విద్వాన్ భవతి, యథేదానీం కించిదపి శాస్త్రం పఠిత్వోపదేశం శ్రుత్వా వ్యవహారం చ దృష్ట్వైవ మనుష్యాణామ్ జ్ఞానం భవతి, తద్యథా – కస్యచి త్పంతాన మేకాంతే రక్షయిత్వా అన్న పానాదికం యుక్త్యా దద్యాత్. తేన సహ భాషణాది వ్యవహారం లేశ మ్మాత్రమపి న కుర్యా ద్యావత్తస్య మరణం న స్యాత్. యథా తస్య కించిదపి యథార్థం జ్ఞానం న భవతి, యథా చ మహారణ్య స్థానాం మనుష్యాణా ముపదేశమంతరా పశువత్ ప్రవృత్తిర్ భవతి; తథైవాది సృష్టి ప్రవృత్తిర్ భవేత్. పునర్ గ్రంథరచనస్య తు కా కథా?

తె॥ పూ.ప; ఈశ్వరునకు దక్క యే జీవునకును జగత్తును రచించు శక్తి లేదు. కాని మనుష్యులకు వ్యాకారణాది శాస్త్రములను రచించు సామర్థ్యమున్నది, కావున వేద రచన నొనర్చు సామర్థ్యము జీవుల కుండ వచ్చును గదా?

ఉ.ప॥ లేదు. ప్రథమమున నీశ్వరుడు వేదములను రచియించెను. వానిని జదివిన తరువాతనే గ్రంథమును రచించు సామర్థ్యము మనుజాలకు గలుగును. లేకున్న గలుగ జాలదు. వేదములను జదువక, వినక యే మనుజాడును విద్వాంసుడు కాజాలడు. ఇప్పుడును కొండొక శాస్త్ర మును జదివి, వేఱొకని యుపదేశమును విని, మానవుల పరస్పర వ్యవహారమును జూచినపుడే మానవులకు జ్ఞానము కలుగుచున్నది. లేకున్న కలుగదు. కొండొక బాలుని జన్మించినప్పటి నుండియు నే కాంతమున నుంచి, అతని కన్న జలములను యుక్తితో నొసంగుము. అతనితో భాషణాది వ్యవహారములను లేశ మాత్రమైనను జేయకుము. మరణ పర్యంతమట్లే యతనిని బెంచిన నతని కొకింతయు యథార్థజ్ఞానము కలుగదు. అట్లే ఘోరారణ్యములలో నుండు మానవుల ప్రవృత్తియు వన్యపశువులంబోలి యుండుట జూడనగును. సర్గారంభమున నీశ్వరుడు వేదము నుపదేశింపకున్న నేటి వఱకును మానవుల ప్రవృత్తి యట్లే యుండెడిది. ఇక గ్రంథ రచనా సామర్థ్యమును గూర్చి యేమన గలము? కావున వేదము లీశ్వరరచితములని యంగీకరించుటయ మేలు లేకున్న లేదు.

సం॥ పూ.వ. మైవం వాచ్యమ్. ఈశ్వరేణ మనుష్యేభ్యః స్వాభావికం జ్ఞానం దత్తం; తచ్చ సర్వగ్రంథేభ్య ఉత్కృష్టమస్తి, నైవ తేన వినా వేదానాం శబ్దార్థ సంబంధానామపి జ్ఞానం భవితు మర్హతి. తదున్నత్యా గ్రంథరచన మపి కరిష్యంత్యేవ. పునః కిమర్థం మన్యతే వేదోత్పాదన మీశ్వరేణ కృతమితి?

ఉ. మః నైవం ప్రాప్తే వదామహే. నైవ పూర్వోక్తాయాశ్శిక్షితాయైకాంతే రక్షితాయ బాలకాయ, మహారణ్యస్థేభ్యో మనుష్యేభ్య శ్చేశ్వ రేణ స్వాభావికం జ్ఞానం దత్తం కిమ్? కథం నాస్మదాదయోఽన్యేభ్యః శిక్షాగ్రహణ మంతరేణ, వేదాధ్యయ నేన చ వినా పండితా భవన్తి? తస్మాత్ కిమాగతమ్? న శిక్షయా పఠనాఽ ధ్యయ నేన చ స్వాభావిక జ్ఞాన మాత్రేణ కస్యాపి నిర్వాహో భవితు మర్హతి. యథాఽస్మదాదిభి రప్యన్యేషాం విదుషాం, విద్వత్ కృతానాం గ్రంథానాం చ సకాశా దనేక విధం జ్ఞానం గృహీత్వైవ గ్రంథాంతరం రచ్యతే. తథేశ్వర జ్ఞానస్య సర్వే షాం మనుష్యాణా మపేక్షాఽ వశ్యం భవతి, కించ, సృష్టే రారంభ సమయేన పఠనపాఠనక్రమో గ్రంథశ్చ కశ్చిదప్యాసీత్, తదాసీ మీశ్వరో పదేశ మంతరా నచ కస్యాపి విద్యా సంభవో బభూవ, పునః కథం కశ్చిజ్జనో గ్రంథం రచయేత్? మనుష్యాణాం నైమిత్తికజ్ఞానే స్వాతం త్ర్యాభావాత్. స్వాభావిక జ్ఞానమాత్రేణైవ విద్యా ప్రాప్త్యనుపపత్తేశ్చ.

యచ్చోక్తం స్వకీయం జ్ఞాన ముత్ కృష్ట మిత్యాది, తదప్యసమంజసమ్. తస్య సాధనకోటౌ ప్రవిష్టత్వాత్. చక్షుర్వత్, యథా చక్షుర్ మనః సాహిత్యేన వినా హ్యకించిత్కరమస్తి, తథాఽన్యేషాం

విదుషా మీశ్వరజ్ఞానస్య చ సాహిత్యేన వినా స్వాభావిక జ్ఞాన మప్యకించిత్కరమేవ భవతీతి.

తె॥ పూ.ప. ఈశ్వరుడు మానవులకు స్వాభావిక జ్ఞానమొసంగియున్నాడు. అజ్ఞానము గ్రంథముల కన్నింటికంటె నుత్తమము. అది లేకున్న వేదములలోని శబ్దార్థములు, వాని సంబంధములకు సంబంధించిన జ్ఞాన మెన్నడును గలుగ జాలదు. ఆ జ్ఞానము క్రమముగా వృద్ధి నొందినపుడు మానవులు గ్రంథము రచియింతురు. అట్టియెడ వేద ములు భగవంతుని నుండి యుత్పన్నములైన వని యంగీకరింపనేల?

ఉ.ప. ఇంతకు పూర్వము, ఏకాంతమున బెంచిన బాలకుని వన వాసులను దృష్టాంతముగ నిచ్చి యుంటిమి. వారికి భగవంతుడు స్వాభావిక జ్ఞానము నీయలేదా? వారు తమ స్వాభావిక జ్ఞానముతో విద్వాంసు లేల కారు? దీనిం బట్టి, ఈశ్వరోపదేశమైన వేదము లేకున్న నే మనుజానకును యథార్థజ్ఞానము కలుగజాలదని నిశ్చితమగు చున్నది. ప్రస్తుత కాలమున మనము కూడ వేదములను జదువకున్నను, విద్వాంసుల నుండి శిక్షణను బొందకున్నను, విద్వ ద్రచితములయిన గ్రంథములను పఠింపకున్నను పండితులము కాజాలము. అట్లే సృష్ట్యాదియందు పరమాత్ముడు వేదముల నుపదేశింపకున్న పక్షమున నేటి వఱకును మానవునకు ధర్మాది విషయముల యథార్థజ్ఞానము కలిగియుండదు. దీనిం బట్టి తెలిసిన దేమి? విద్వాంసుల శిక్షణకాని, వేదముల పఠనము కాని లేక, కేవల స్వాభావిక జ్ఞానముతో మానవ వ్యవహారము నిర్వహింపబడదు. అన్య విద్వాంసుల నుండి మనము వెదాది శాస్త్రముల మూలమున నానావిధ విజ్ఞానములను గ్రహించి, అనంతరమున గ్రంథములను రచియింతుము. అట్లే యీ శ్వర జ్ఞానా పేక్షయు నెల్ల మానవుల కావశ్యక మగుచున్నది. సృష్టి కారంభకాలమున పఠన పాఠన వ్యవస్థ యేమియు లేకుండెను. విద్యకు సంబంధించిన గ్రంథ మేదియు లేదు. కావుననపుడు పరమేశ్వరుడు వేదముల నుపదేశింపకున్న లోకమున విద్యయే యుండదు. అట్టియెడ మానవుడు గ్రంథము నెట్లు రచియింపగలడు? మానవజ్ఞానము నైమిత్తికము. కావున నందు మానవులకు స్వాతంత్ర్యముండ నేరదు. స్వాభావిక జ్ఞానముతోనే యేరికిని విద్యా ప్రాప్తి కలుగదు. కావుననే యీశ్వరుడు సర్వమానవుల హితార్థము వేదముల నుత్పన్నము చేసి యున్నాడు. మఱియు స్వాభావిక జ్ఞానము వేదాది సర్వజ్ఞానములకంటె నుత్తమ మనుటయు సరికాదు. అది యింకను సాధ్యమే. అది యన్నింటి కంటె నుత్తమమని సాధింప వలసి యున్నదని భావము: మనస్సంయోగములేక నేత్రమేమియు జూడ నేరదు. ఆత్మ సంయోగము లేని మనస్సు కూడ నేమియు జేయజాలదు. అట్లే స్వాభావిక జ్ఞానము కూడ, వేదము, విద్వాంసుల శిక్షణ గ్రహింప సాధనము మాత్రమగును. అయ్యది పశువులకు వలె వ్యవహారమునకు సాధనమగును. కాని, ఆ స్వాభావిక జ్ఞానము స్వయముగ ధర్మార్థ కామమోక్ష విద్యకు సాధన మెన్నడును గాజాలదు. (మనస్సంయోగములేని చక్షువు రూపమును గ్రహించు ననుట యెట్లు అసాధ్య విషయమో, అట్లే స్వాభావిక జ్ఞానము వేదోప దేశము లేక గ్రంథ రచనము చేయగలదనుటయు అసాధ్య విషయము.)

సం॥ పూ. వ, వేదోత్పాదన ఈశ్వరస్య కిం ప్రయోజనమస్తీత్యత్ర వక్తవ్యమ్

ఉ.వ. ఉచ్యతే. వేదానా మనుత్పాదనే ఖలు తస్య కిం ప్రయోజన మస్తీతి?

పూ. వ. అస్యోత్తరం వయం న జానీమః.

ఉ.వః సత్యమేవైతత్. తావ ద్వేదోత్పాదనే యదస్తి ప్రయోజనం తచ్ఛ్రుణుత. ఈశ్వరేఽనంతా విద్యా అస్తి వా నవా?

పూ. వ. అస్తి.

ఉ. వ. సా కిమర్థాఽస్తి?

పూ. ప. స్వార్థా.

ఉ. ప. ఈశ్వరః పరోపకారం న కరోతి కిమ్?

పూ. ప. కరోతి. తేన కిమ్?

ఉ. ప. తేనేద మస్తి. విద్యా స్వార్థా పరార్థా చ భవతి. తస్యా స్తద్విషయత్వాత్. యద్యస్మదర్థ మీశ్వరో విద్యోపదేశం న కుర్యాత్. తదాఽన్యతరపక్షే సా విఫలా స్యాత్. తస్మాద్ ఈశ్వరేణ స్వవిద్యా భూత వేద స్యోపదేశేన సప్రయోజనతా సంపాదితా. పరమ కారుణికో హి పరమేశ్వరోఽస్తి పితృవత్. యథా పితా స్వసంతతిం ప్రతి సదైవ కరుణాం దధాతి. తథేశ్వరోఽపి పరమకృపయా సర్వమనుష్యార్థం వేదోపదేశ ముపచక్రే, అన్యథా అంధ పరంపరయా మనుష్యాణాం ధర్మార్థకామమోక్షసిద్ధ్యా వినా పరమానంద ఏవ న స్యాత్. యథా కృపాయమాణే నేశ్వరేణ ప్రజా సుఖార్థం కందమూల ఫలతృణాదికం రచితం, స కథం న సర్వ సుఖ ప్రకాశికాం సర్వ విద్యామయీం వేద విద్యాముపదిశేత్? కించ, బ్రహ్మాండ స్థోత్కృష్ట సర్వ పదార్థ ప్రాప్త్యా యావత్ సుఖం భవతి, న తావద్విద్యాప్రాప్తి సుఖస్య సహస్రతమేనాంశేనాపి తుల్యం భవతి; అతో వేదోపదేశ ఈశ్వరేణ కృత ఏవాస్తీతి నిశ్చయః

తె। వేదముల నుత్పన్న మొనర్చుటలో నీశ్వరునకుగల ప్రయోజనమేమి?

ఉ.ప. వేదముల నుత్పన్నము సేయకుండుటలో ప్రయోజన మేమి? యని ప్రశ్నించిన, దానికి సమాధానము చెప్ప జాల నందువేని యది నిజమే. వేదమీశ్వరుని నిత్య విద్య. దాని కుత్పత్త్యనుత్పత్తులు లేవు. కాని, జీవులమగు మన కొఱకు నీశ్వరుడు వేదములను బ్రకటించి యున్నాడు. అది మనపై నతనికిగల పరమ కృప. ఇక వేదోత్పత్తి ప్రయోజనము వినుడు. ఈశ్వరుని యందనంత విద్య యున్నదా? లేదా? ఉన్నదందు రేని, యతని విద్యకు బ్రయోజనమేమి?

పూ. ప. ఈశ్వరుని విద్య యతనికి పదార్థముల నెఱుంగుటకు, వానిని రచించుటకు నుపయోగించును. అదియే దాని ప్రయోజనము.

ఉ. ప. అటులయిన నీశ్వరుడు పరోపకార మొనర్చునా? లేదా?

పూ.ప. ఈశ్వరుడు పరోపకారియే. దాని వలన నీ కేమి సిద్ధించును?

ఉ.ప. విద్య స్వార్థము కొఱకును పరార్థము కొఱకును నుపయోగించును. అయ్యదియే దాని గుణము. దాని వలన స్వార్థ పరార్థములు రెండును సిద్ధించును. కావున పరమేశ్వరుడు తన వేద విద్యను జీవులమగు మన కుపదేశింపని పక్షమున విద్యవలన పరోపకారము జేయవలయు ననెడి ప్రయోజనము సిద్ధింపదు – చరితార్థము కాదు. అందువలననే పరమేశ్వరుడు తన వేద విద్యను మనకుపదేశించి, దానిని సఫలము చేసి యున్నాడు. పరమేశ్వరుడు మనకు తల్లిదండ్రుల వంటి వాడు. మన మందఱము నతని ప్రజ–సంతానము. అతడు తన ప్రజపై నిత్యము కృపా దృష్టి నుంచును. తల్లిదండ్రులు తమ సంతానముపై నెల్లప్పుడు కరుణ గలిగి యుందురు. సంతానము సుఖపడు నట్లెల్ల విధముల యత్నింతురు. అట్లే యీశ్వరుడును మనుష్యాది సర్వ ప్రాణుల మీదను కృపా దృష్టి నెల్లపుడు గలిగియుండును. కావుననే మానవులమగు మనకు వేదముల నుపదేశించి యున్నాడు. అట్లు చేయకున్న నెవరికిని ధర్మార్థ కామమోక్షములు సరిగ సిద్ధించెడివి కావు; పరమానందము కూడ నెవనికిని లభించి యుండెడిది కాదు. పరమకృపాలువగు పరమేశ్వరుడు జీవులను సుఖింపజేయుటకు, కందమూల ఫలాదులను, ఇతర సూక్ష్మ స్థూల పదార్థములను జగమున రచించినట్లు సమస్త సత్య విద్యలతో గూడిన వేదోపదేశమును మాత్రము

జీవుల సుఖార్థ మేల చేయడు? బ్రహ్మాండమునగల యుత్తమ పదార్థ ప్రాప్తి వలన గలుగు సుఖము ఉత్తమ విద్యా ప్రాప్తి చే గలుగు సుఖములో సహస్రాంశముతో నైనను బోలదు. అట్టి సర్వోత్తమ విద్యాబోధక వేదమును పరమేశ్వరుడేల యుపదేశింపడు? కావున వేదము లీశ్వర నిర్మితములే యని నిశ్చిత సిద్ధాంతము.

సం॥ పూ. వః ఈశ్వరేణ లేఖనీ మసీపాత్రాదిసాధనాని వేద పుస్తక లేఖనాయ కుతో లబ్ధాని ?

ఉ.వః అత్రోచ్యతే. అహ హహ! మహతీయం శంకా భవతా కృతా. వినా హస్త పాదాద్యవయవైః కాష్ఠలోష్టాది సామగ్రీసాధనైశ్చ యథేశ్వరేణ జగద్రచితం, తథా వేదా అపి రచితాః. సర్వశక్తిమతీశ్వరే వేద వచనం ప్రత్యేవం మా శంకి. కింతు పుస్తకస్థా వేదా తేనాదౌ నోత్పాదితాః

పూ. వ. కింతర్హి ?

ఉ. వ. జ్ఞానమధ్యే ప్రేరితాః

పూ. వ. కేషామ్ ?

ఉ. వ. అగ్నివాయ్వాదిత్యాంగిరసామ్.

పూ. వ. తే తు జ్ఞాన రహితా జడాః సన్తి.

ఉ.వ. నైవం వాచ్యం; సృష్ట్యాదౌ మనుష్య దేహధారిణ స్తే హ్యాసన్ కుతః (ఇతి చేత్?) జడే జ్ఞానకార్యాసంభవాత్. యత్రార్థా సంభవో ఽ స్తి తత్ర లక్షణా భవతి. తద్యథా – కశ్చిదాప్తః కంచిత్ ప్రతి వదతి 'మంచాః క్రోశంతి' ఇతి, అత్ర మంచస్థా మనుష్యాః క్రోశన్తీతి విజ్ఞాయతే, తథై వాత్రాపి విజ్ఞాయతామ్. విద్యా ప్రకాశ సంభవో మనుష్యే ష్వేవ భవితు మర్హతీతి. అత్ర ప్రమాణమ్.

"తేభ్య స్తప్తేభ్య స్త్రయో వేదా అజాయన్త,
అగ్నేర్ ఋగ్వేదో, వాయోర్ యజుర్వేదః సూర్యాత్ సామ వేదః"

శత, కాం.౧౧. అం. ౫. బ్రా. ౨ కం. ౩

ఏషాం జ్ఞానమధ్యే ప్రేరయిత్వా తద్ ద్వారా వేదాః ప్రకాశితాః

పూ.వ. సత్య మేవమేతత్. పరమేశ్వరేణ తేభ్యో జ్ఞానం దత్తం, జ్ఞానేన తైర్ వేదానాం రచనం కృతమితి విజ్ఞాయతే.

ఉ.వ. మైవం విజ్ఞాయి. జ్ఞానం కిం ప్రకారకం దత్తమ్?

పూ. వ. వేద ప్రకారకమ్.

ఉ. వ. తదీశ్వరస్య వా తేషామ్ ?

పూ. వ. ఈశ్వరస్యైవ.

ఉ. వ. పున స్తేనైవ ప్రణీతా వేదా ఆహోస్విత్తైశ్చ ?

పూ. వ. యస్య జ్ఞానం తేనైవ ప్రణీతాః.

ఉ. వ. పునః కిమర్థా శంకా కృతా? తైరేవ రచితేతి?

పూ. వ. నిశ్చయ కరణార్థా.

31 పూ. ప. వేదమును వ్రాయుటకు నీశ్వరుడు కలము, సిరా బుడ్డి మున్నగు సాధనము లెటనుండి తీసికొనెను? సర్గారంభమున కాగితములు మున్నగు పదార్థములు లేవుకదా?

ఉ.ప. సహో! నీకు గొప్ప శంకయే కలిగినది. నీ బుద్ధినేమని కొనియాడుదును? హస్తపాదాద్యవయవములు లేక, కాష్ఠలోష్ఠాది సాధన సామగ్రియు లేక యీశ్వరు డీజగము నెట్లు రచియించెనో చెప్పుము? అట్లే సాధనములు లేకయే వేదములను రచియించినాడు. అతడు సర్వ శక్తిమంతుడు. కావున నిట్లు శంకించుట నీకు తగదు. కాని; వాస్తవమున సృష్ట్యాది యందీశ్వరుడు పుస్తకములుగ వ్రాసి వేదములను ప్రకటింపలేదు. మఱి యెట్లు చేసె నందు వేని అగ్ని, వాయువు, ఆదిత్యుడు, అంగిరసుడు సనువారి జ్ఞానమున. అగ్ని వాయ్వాదులు జడములందువేని, యట్లుకాదు. వారు సృష్టి కారంభమున మానవ దేహధారులై యుండిరి. అది యెట్లన జడములలో జ్ఞాన కార్యమసంభవము.

పదములకు శక్యార్థము సంభవము కాని యెడల లక్షణార్థము గ్రహింపబడును. అప్పుడైన విద్వాంసుడు 'మంచెలు కేకలు పెట్టుచున్నవి.' అనిన మంచెలు కేకలు వేయుట సంభవము కాదు. కావున 'మంచెలపై నున్న మనుష్యులు కేకలు వేయు చున్నారు.' అని యీ వాక్యమునకు లక్షణార్థము చెప్పబడును. అట్లే అగ్ని మొదలగు జడ పదార్థములందు జ్ఞాన ప్రకాశ మసంభవము. కావున లక్షణావృత్తితో అగ్నివాయ్వాది పదములు పురుష బోధకములని యెఱుంగవలయును. ఈ విషయమున శత పథ బ్రాహ్మణ ప్రమాణమును జూడుడు. ("తేభ్య స్తప్తేభ్య...) తపస్వులయిన జ్ఞానులందు వేదములు ప్రకాశితము లయ్యెను. అగ్నియందు ఋగ్వేదము; వాయువునందు యజుర్వేదము; సూర్యునియందు సామ వేదము. (అంగిరసునందు అథర్వవేదము.) వీరి నలుగురి జ్ఞానమున ముందు వేదములను ప్రకటించి వారి నుండి బ్రహ్మాదులకు (మహర్షులకు) అందజేసెను.

పూ. పః సత్యమే. ఈశ్వరుడు వారికి జ్ఞానము గలిగించియుండును. ఆ జ్ఞానముతో వారు వేదములను రచించియుందురు.

ఉ. ప. ఇట్లనుట నీకు తగదు. ఈశ్వరుడు వారికి జ్ఞానము నెట్లొసంగెనో నీ వెఱుగుదువు గదా!

పూ. ప. వారికి వేద రూప జ్ఞానము నొసంగెను.

ఉ. ప. ఆజ్ఞానము ఈశ్వరునిదా? లేక వారిదా?

పూ.ప. ఆ జ్ఞాన మీశ్వరునిదే.

ఉ. ప. అయిన వేద మీశ్వర నిర్మితమా? లేక అగ్న్యాది ప్రణీతమా?

పూ.ప. జ్ఞానమెవనిదో యతడే వేదములను రచించెను.

ఉ. ప. మఱి అగ్న్యాదులు వేదరచయితలని యేల శంకించితివి?

పూ. ప. నిశ్చయార్థము.

సం॥ పూ. ఈశ్వరో న్యాయకర్తాస్తి పక్షపాతీ?

ఉ. ప. న్యాయకారి

పూ. ప. తర్హి చతుర్ణామేవ హృదయేషు వేదాః ప్రకాశితాః కుతో న సర్వేషా మితి?

ఉ. పః అత్రాహ. అత ఈశ్వరే పక్షపాతస్య లేశో ఽపి నైవాగచ్ఛతి, కిం త్వనేన తస్య

న్యాయకారిణః పరమాత్మనః సమ్యక్ న్యాయః ప్రకాశితో భవతి.

పూ.ప: కుతః?

ఉ.ప: న్యాయేత్యస్యైవ నామాస్తి యో యాదృశం కర్మ కుర్యాత్తస్మై తాదృశ మేవ ఫలం దద్యాత్. అత్రైవం వేదితవ్యమ్. తేషా మేవ పూర్వ పుణ్య మాసీత్ యతః ఖల్వేతేషాం హృదయే వేదానాం ప్రకాశ కర్తుం యోగ్యోఽస్తి.

పూ.ప: కించ తే తు సృష్టేః ప్రాగుత్పన్నా స్తేషాం పూర్వపుణ్యం కుత ఆగతమ్?

ఉ.ప: అత్ర బ్రూమః. సర్వే జీవాః స్వరూపతోఽనాదయః, తేషాం కర్మాణి, సర్వం కార్యం జగచ్చ ప్రవాహేణైవానాదీని సంతీతి. ఏతేషా మనాదిత్వస్య ప్రమాణపూర్వకం ప్రతిపాదన మగ్రే కరిష్యతే.

తె॥ పూ.ప: ఈశ్వరుడు న్యాయకారియా? లేక పక్షపాతియా?

ఉ.ప: న్యాయకారి.

పూ.ప: ఈశ్వరుడు న్యాయకారియగు నెడల నెల్లరి హృదయములందును వేదముల నెందుకు ప్రకటింపడయ్యె? నలువురి హృదయములందే ప్రకాశింప జేసినందున పక్షపాతియగును.

ఉ.ప: ఇందువలన నీశ్వరునందు పక్షపాతము కొంచెమైన నున్నదనుట సరికాదు. పైపెచ్చు యతనియందు గల న్యాయమే వెల్లడి యగుచున్నది. అది యెట్లందురేని, న్యాయమన నేమి? ఎవరెట్టి కర్మచేసిన వారికట్టి ఫలము నిచ్చుటయేకదా! దీనింబట్టి, యే నలువురి హృదయమున వేదములు ప్రకాశింపజేయబడినవో వారందులకు తగిన పుణ్యము పూర్వమొనరించిన వారని తెలియనగును.

పూ.ప. ఆ నలువురును సృష్టి కారంభమున నుత్పన్నులై యున్నారు కదా? వారికి పూర్వపుణ్య మెటనుండి వచ్చినది?

ఉ.ప.: జీవులు, (కారణ జగత్తు), స్వరూపముతో ననాదులు ఆదిలేనివి. కర్మములు, సర్వకార్యజగత్తు ఈ రెండును ప్రవాహముతో ననాదులు. ఈ విషయము ప్రమాణ పూర్వకముగ ముందు వ్రాయుదుము.

సం॥ పూ.ప: కిం గాయత్ర్యాదిచ్ఛందో రచనమపీశ్వరేణైవ కృతమ్?

ఉ.ప.: ఇయం కుతః శంకాఽభూత్? కిమీశ్వరస్య గాయత్ర్యాది చ్ఛందోరచన జ్ఞానం నాస్తి?

పూ.ప: అస్త్యేవ; తస్య సర్వవిద్యావత్త్వాత్.

ఉ.ప: అతో నిర్మూలా సా శంకాస్తి.

పూ.ప: చతుర్ముఖేన బ్రహ్మణా వేదా నిరమాయిషతేత్యైతిహ్యమ్.

ఉ.ప: మైవం వాచ్యమ్. ఐతిహ్యస్య శబ్ద ప్రమాణాంతర్భావాత్.

"ఆప్తోపదేశః శబ్దః." న్యా. శా. అ. ౧, ఆ, ౧, సూ. ౭,

"శబ్ద ఐతిహ్యమిత్యాది చ." న్యా.శా.అ.౨,ఆ,౨, సూ,౨.

"అస్త్యైవోపరి." న్యా.శా.అ.౧.ఆ.౨,సూ.౭.

ఇతి గోతమాచార్యేణోక్తత్వాత్.

"ఆప్తః ఖలు సాక్షాత్ కృతధర్మా; యథా దృష్టస్యార్థస్య చిఖ్యాపయిషయా ప్రయుక్త ఉపదేష్టా; సాక్షాత్కరణమర్థస్యాప్తిస్తయా ప్రవర్తత ఇత్యాప్తః. ఇతి న్యాయభాష్యే వాత్స్యాయనోక్తేః."

అతః సత్యస్యైవైతిహ్యత్వేన గ్రహణం నానృతస్య. యత్ సత్యప్రమాణ మాప్తోపదిష్టమైతిహ్యం తద్ గ్రాహ్యం నాతో విపరీతమితి; అనృతస్య ప్రమత్తగీతత్వాత్, ఏవమేవ వ్యాసే నర్షిభిశ్చ వేదా రచితా ఇత్యాద్యపి మిథ్యైవాస్తీతి మన్యతామ్. నవీనపురాణ గ్రంథానాం తంత్ర గ్రంథానాం చ వైయర్థ్యాపత్తేశ్చేతి.

తె॥ ప్రశ్నము; గాయత్రి మున్నగు ఛందస్సులనుగూడ నీశ్వరుడే రచియించెనా?

ఉత్తరము : నీకీశంక యేల కలిగినది? ఛందోరచనజ్ఞాన మీశ్వరునకు లేదా?

ప్ర: ఈశ్వరుడు సమస్త విద్యాయుక్తుడగుటవలన నతని కన్నియు దెలియును.

ఉ: బాగు. కావున నీశంక నిరర్థకమే కదా!

ప్ర: చతుర్ముఖ బ్రహ్మ వేదములను రచించినాడని యితిహాసమున జదువుచున్నామే?

ఉ: అట్లనకు. ఇతిహాసము శబ్దప్రమాణమునందే లెక్కింపబడినది.

(ఆప్తోపదేశః శబ్దః..) 'సత్యవాదులగు విద్వాంసులు చేసిన యుపదేశ రూపశబ్దములే శబ్దప్రమాణము.' అని న్యాయదర్శనమున గోతమాచార్యుడు వ్రాసియున్నాడు.

(శబ్ద ఐతిహ్యమ్) అను నీసూత్రమున గోతముడు ఇతిహాసమును శబ్దప్రమాణమున లెక్కించియున్నాడు.

(ఆప్తోపదేశః శబ్దః) అను సూత్రమునకు భాష్యము వ్రాయుచు వాత్స్యాయన ముని ఆప్తలక్షణము నిట్లు వర్ణించియున్నాడు:- 'సర్వ పదార్థవిద్యలను సాక్షాత్తుగ నెఱిగినవాడును, కపటాది దోషరహితుడును, ధర్మాత్ముడును, ఎల్లప్పుడు సత్యము జెప్పుచు, సత్యము నంగీకరించుచు, సత్యము నాచరించువాడును, పూర్ణవిద్యవలన దా నెఱిగిన విషయమును మానవులకు సుఖము గలుగు నిమిత్తము కృపాదృష్టితో నుపదేశించువాడును నగు మానవుడు ఆప్తుడనబడును.' అని పృథివి మొదలు పరమేశ్వర పర్యంతము గల పదార్థముల నున్నవి యున్నట్లు స్వయముగ ప్రత్యక్ష మొనర్చుకొని, తదనుసారము వర్తించుటకు 'ఆప్తి' యని పేరు. 'ఆప్తి'తో కూడినవాడు ఆప్తుడు.

అట్టి యాప్తుని యుపదేశమే ప్రమాణమగును. ఇతరుల వాక్యములు ప్రమాణములు కావు. సత్యప్రమాణముతో గూడిన యితిహాసమే సత్యవృత్తాంతమే యితిహాసమగును; కాని, అనృతవృత్తము కాదు. సత్యప్రమాణముతో గూడిన యితిహాసమే సర్వమానవులకు గ్రహణయోగ్యము. అందుకు విపరీతేతిహాసమును గ్రహించుట యెవరికిని దగదు. ప్రమాదయుక్త పురుషుని మిథ్యాకథనము ఇతిహాసముగ గ్రహింపబడదు, ఇట్లే వ్యాసమహర్షి నాలుగు వేదసంహితలను రచించినాడనియు, లేక వానిని సంగ్రహము చేసినాడనియు జెప్పు ఇతిహాసములన్నియు నసత్యములని యెఱుగవలయును. ఇటీవల రచియింపబడిన బ్రహ్మవైవర్తాది పురాణములు, బ్రహ్మయామలాది తంత్రగ్రంథములు, వానియందు వ్రాయబడిన యితిహాసములు ప్రమాణములుగ గ్రహింపరాదు. వానియందు అసంభవములు, అప్రమాణములు నగు కపోలకల్పితములయిన మిథ్యేతిహాసము లెన్నో వ్రాసియున్నారు. సత్యగ్రంథములైన శతపథబ్రాహ్మణము మున్నగు గ్రంథములలోని యితిహాసముల నెన్నడును విడువరాదు.

సం॥ప్ర: యో మంత్రసూక్తానామృషిర్లిఖిత స్తేనైవ తద్రచితమితి కుతో న స్యాత్?
ఉ: మైవం వాదీః. బ్రహ్మాదిభిరపి వేదానామధ్యయన శ్రవణయోః కృతత్వాత్.
"యో వై బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై?
శ్వే.ఉప.అ.౬, శ్లో. ౧౮.

ఇతి శ్వేతాశ్వతరోపనిషదాది వచనస్య విద్యమానత్వాత్; ఏవంయదర్షీణా ముత్పత్తిరపి నాసీత్తదా బ్రహ్మదీనాం సమీపే వేదానాం వర్తమానత్వాత్. తద్యథా-

"అగ్ని వాయు రవిభ్యస్తు త్రయం బ్రహ్మ సనాతనమ్
దుదోహ యజ్ఞసిద్ధ్యర్థం ఋగ్యజుఃసామలక్షణమ్." మను. అ, ౧-౨౩.

"అధ్యాపయామాస పితౄన్ శిశురంగిరసః కవిః." మను. అ. ౨.శ్లో, ౧౫౧,

ఇతి మనుసాక్ష్యత్వాత్. అగ్న్యాదీనాం సకాశాద్ బ్రహ్మాపి వేదానా మధ్యయనం చక్రే. అన్యేషాం వ్యాసాదీనాం తు కా కథా?

తె॥ప్రః సూక్తములు, మంత్రములు, నే ఋషులపేర లిఖింపబడుచున్నవో వారే వేదములను రచించినారని యేల యంగీకరింపరాదు?

ఉః అట్లనరాదు. కారణమేమన ః బ్రహ్మాది మహర్షులుకూడ వేదములను జదివినారు. శ్వేతాశ్వతరాది-ఉపనిషత్తులలో నిట్లున్నది.

(యోవై బ్రహ్మాణం...) బ్రహ్మను సృష్టించినవాడు బ్రహ్మాదుల సృష్టికి ముందే అగ్ని మున్నగువారికి వేదముల నుపదేశించి వారి మూలమున బ్రహ్మాదులకును నుపదేశించెను. ఆ పరమేశ్వరుని శరణుబొందుదుము.' దీనింబట్టి బ్రహ్మాది మహర్షులు కూడ వేదములను జదివిరని తెలియుచున్నది. మరీచ్యాది ఋషులు, వ్యాసాది మునులు జన్మింపకముందే బ్రహ్మాదులకు వేదములు తెలియును. ఇందులకు మనువు శ్లోకములే ప్రమాణములు.

(అగ్నివాయు...) 'పూర్వము చెప్పబడిన అగ్ని, వాయువు, సూర్యుడు, అంగిరసుడు ననువారినుండి బ్రహ్మాదులు వేదములను పఠించిరి.' మ.అ.౧-౨౩

(అధ్యాపయామాస..) 'అంగిరసముని పుత్రుడు విద్వాంసుడై, తన పినతండ్రి మున్నగు పెద్దవారికిగూడ వేదములను జెప్పెను.'

బ్రహ్మయే వేదములను ఇతరులనుండి చదివియున్నా డనిన నిక వ్యాసాది మహర్షులయు, మన విషయమున నేమనవలయును?

*సం॥ప్రః కథం వేదః శ్రుతిశ్చేతి ద్వేనామ్నీ ఋక్సంహితాదీనాం జాతే?*

***ఉః*** *అర్థవశాత్. (విద) జ్ఞానే. (విద) సత్తాయాం, (విద్ఌ) లాభే, (విద) విచారణే, ఏతేభ్యో 'హల' శ్చేతి సూత్రేణ 'కరణాధికరణ కారకయోః 'ఘఞ్' ప్రత్యయే కృతే వేదశబ్దః సాధ్యతే. తథా (శ్రు) శ్రవణే, ఇత్యస్మాద్ధాతోః కరణ కారకే 'క్తిన్' ప్రత్యయే కృతే శ్రుతిశబ్దో వ్యుత్పాద్యతే, విదంతి జానన్తి, విద్యన్తే భవన్తి విందంతి, విందంతే లభంతే, విందతే విచారయన్తి సర్వే మనుష్యాః సర్వాః సత్యవిద్యాః, యైర్ యేషు వా, తథా విద్వాంసశ్చ భవన్తి, తే వేదాః. తథా ఆదిసృష్టి మారభ్యాద్యపర్యంతం బ్రహ్మాదిభిః సర్వాః సత్యవిద్యాః శ్రూయన్తేఽ నయా సా శ్రుతిః. న కస్యచిద్దేహధారిణః సకాశాత్ కదాచిత్ కోఽపి వేదానాం రచనం దృష్టవాన్.*

*ప్రః కుతః ?*

ఉ : నిరవయవేశ్వరాత్తేషాం ప్రాదుర్భావాత్, అగ్నివాయ్వాదిత్యాంగిరసస్తు నిమిత్తభూతా వేద ప్రకాశార్థమీశ్వరేణ కృతా ఇతి విజ్ఞేయమ్, తేషాం జ్ఞానేన వేదానామనుత్పత్తేః. వేదేషు శబ్దార్థ సంబంధాః పరమేశ్వరా దేవ ప్రాదుర్భూతాః. తస్యపూర్ణవిద్యావత్వాత్.

ప్రః అతః కిం సిద్ధమ్?

ఉః అగ్ని వాయురవ్యఙ్గిరో మనుష్యదేహధారిజీవద్వారేణ పరమేశ్వరేణ శ్రుతి, ర్వేదః ప్రకాశీకృత ఇతి బోధ్యమ్.

తె॥ ప్రః ఋగ్వేదాది సంహితలకు వేదము, శ్రుతి యని రెండు పేరులేల కలిగినవి?

ఉః అర్థభేదము వలన నీ రెండు నామము లేర్పడినవి. సంస్కృతమున నొక 'విద' ధాతువునకు జ్ఞానమర్థము. రెండవ 'విద' ధాతువునకు 'సత్తా' ఉనికి యర్థము. మూడవ 'విద్ల' కు లాభము, నాలుగవ 'విద'కు విచారణ – ఆలోచన, అని యర్థము. ఈ నాలుగు ధాతువుల (క్రియల) కుతరువాత 'హలశ్చ' అను పాణినీయ సూత్రమునను సరించి కరణము, అధికరణము (తృతీయాసప్తమీ) అను కారకములందు 'ఘఞ్' అను ప్రత్యయము చేర్చినందున వేదశబ్దము సిద్ధించును. అట్లే 'శ్రుధాతువు శ్రవణార్థకము. దానికి కరణార్థమున 'క్తిన్' ప్రత్యయము చేర్చిన శ్రుతిశబ్దము సిద్ధించును. వేనిలో, వేనిని జదువుటవలన యథార్థవిద్యల విజ్ఞానము కలుగునో యవి వేదములనబడును. వేనిని వేనియందు జదువుటవలన విద్వాంసులగుదురోయవి వేదములు. వేని ద్వారమున, వేనియందు సర్వసుఖములు లభించునో యవి వేదములు. వేనియందు, వేని ద్వారమున మానవులు సత్యాసత్యముల సరిగా విచారింప గలుగుదురో యవి వేదములు. ఈ యర్థములందు సంహితలకు వేదనామము కలిగినదనిభావము. అట్లే సృష్ట్యారంభమునుండి నేటి వఱకు, బ్రహ్మమొదలు మనవఱకు నెల్లరు సంహితల ద్వారమున సత్యవిద్యలను వినుచు వచ్చినందున వేదములకు సంహితలకు-శ్రుతి యని నామ మేర్పడినది. ఎవడును నేదేహధారి నుండియు వేదము లుత్పన్నములగుచుండగ – రచియింపబడుచుండగ జూడలేదు.

ప్రః ఎందువలన

ఉ : నిరవయవేశ్వరుని వలన వేదములు ప్రాదుర్భవించినవి. వాని నెల్లరు నేటి వఱకు వినుచు, వినిపించుచునే వచ్చిరి. కొండొకడు వాద్యములను వాయించి శబ్దము నావిర్భవింపజేయునట్లు, కొయ్యబొమ్మలలో క్రియను గలిగించునట్లు వేదముల నావిర్భవింపజేయుట కీశ్వరుడు-అగ్ని, వాయువు, ఆదిత్యుడు, అంగిరసుడు ననువారిని – మానవులను – నిమిత్తమాత్రులను జేసియున్నాడు. అగ్ని మున్నగువారి జ్ఞానముతో వేదము లుద్భవింపలేదు. వేదములందలి శబ్దములు, అర్థములు, వానికిగల సంబంధములు అన్నియు పూర్ణ విద్వాంసుడగుటచే నీశ్వరునినుండియే ప్రకటితములైనవి.

ప్ర : ఇందువలన నేమి సిద్ధించినది?

ఉ : పరమేశ్వరుడు మానవ దేహధారులయిన అగ్ని, వాయువు, ఆదిత్యుడు, అంగిరసుడు నను జీవుల ద్వారమున వేదములను బ్రకాశింపజేసెనని సిద్ధమైనది.

సం॥ ప్రః వేదానాముత్పత్తౌ కియన్తి వర్షాణి వ్యతీతాని?

ఉః అత్రోచ్యతే – ఏకో వృందః, షణ్ణవతిః కోటయః అష్టౌలక్షాణి, ద్విపంచాశత్ సహస్రాణి, నవశతాని, షట్ సప్తతి శ్చైతావంతి (౧౯౬౦౮౫౨౯౭౬) వర్షాణి వ్యతీతాని, సప్తసప్తతితమోఽయం సంవత్సరో వర్తతి ఇతి వేదితవ్యమ్ ఏతావత్యేవ వర్షాణి వర్తమానకల్ప సృష్టేశ్చేతి.

ప్ర : కథం విజ్ఞాయతే హ్యేతావత్యేవ వర్షాణి వ్యతీతానీతి?

ఉ : అత్రాహ; అస్యాం వర్తమానాయాం సృష్టౌ, వైవస్వతస్య సప్త మస్యాస్య మన్వంతర స్యేదానీం వర్తమానత్వాత్, అస్మాత్ పూర్వం షణ్ణాం మన్వంతరాణాం వ్యతీతత్వాచ్చేతి. తద్యథా స్వాయంభవః స్వారోచిషః ఔత్తమిః, తామసో, రైవతః చాక్షుషో, వైవస్వతశ్చేతి, సప్తైతే మనవః. తథా సావర్ణ్యాదయ ఆగామినః సప్తచైతే మిళిత్వా (౧౪) చతుర్దశైవ భవన్తి, తత్రైకసప్తతి శ్చాతుర్యుగాని హ్యేకైకస్య మనోః పరిమాణం భవతి. తే చైకస్మిన్ బ్రాహ్మదినే (౧౪) చతుర్దశ భుక్త భోగా భవంతి. ఏకసహస్రం (౧౦౦౦) చాతుర్యుగాని బ్రాహ్మదినస్య పరిమాణం భవతి. బ్రాహ్మరాత్ర్యా అపి తావదేవ పరిమాణం విజ్ఞేయమ్, సృష్టేర్ వర్తమానస్య దిన సంజ్ఞాఽస్తి, ప్రలయస్య చ రాత్రి సంజ్ఞేతి. అస్మిన్ బ్రహ్మదినే షట్ మనవస్తు వ్యతీతాః, సప్తమస్య వైవస్వ తస్య వర్తమానస్య మనోరష్టావింశతి తమో ఽయం కలిర్ వర్తతే. తత్రాస్య వర్తమానస్య కలియుగ స్యైతావంతి (౪౯౭౬) చత్వారి సహస్రాణి నవశతాని షట్ సప్తతిశ్చ వర్షాణి తు గతాని; సప్త సప్తతితమోఽయం సంవత్సరో వర్తతే. యమార్యా విక్రమస్యైకోనవింశతిశతం త్రయస్త్రింశత్తమోత్తరం (౧౯౩౩) సంవత్సరం వదన్తి. అత్ర విషయే ప్రమాణాని:

"బ్రాహ్మస్య తు క్షపాహస్య యత్ ప్రమాణం సమాసతః
ఏకైకశో యుగానాం తు, క్రమశస్తన్నిబోధత." ౧, మ ౧-౬౮
"చత్వార్యాహుః సహస్రాణి, వర్షాణాం తు కృతం యుగం
తస్య తావచ్ఛతీ సంధ్యా సంధ్యాంశశ్చ తథా విధః. "౨ .మ.౧- ౬౯.
"ఇతరేషు ససంధ్యేషు ససంధ్యాంశేషు చ త్రిషు
ఏకాపాయేన వర్తంతే సహస్రాణి శతాని చ." ౩. మ. ౧.౭౦
"యదేతత్ పరిసంఖ్యాతమాదావేవ చతుర్యుగమ్
ఏతద్ ద్వాదశసాహస్రం దేవానాం యుగ ముచ్యతే." ౪.మ.౧-౭౧
"దైవికానాం యుగానాం తు సహస్రం పరిసంఖ్యయా
బ్రాహ్మమేక మహర్ జ్ఞేయం తావతీ రాత్రి రేవ చ." ౫ మ. ౧-౭౨
"తద్వై యుగ సహస్రాంతం. బ్రాహ్మం పుణ్య మహర్విదుః
రాత్రిం చ తావతీ మేవ, తేఽహోరాత్ర విదో జనాః." ౬మ.౧.౭౩
"యత్ ప్రాగ్ ద్వాదశ సాహస్ర ముదితం దైవికం యుగమ్
తదేక సప్తతి గుణం మన్వంతర మిహోచ్యతే." ౭. మ.౧-౭౯
"మన్వంతరాణ్యసంఖ్యాని సృష్టిః సంహార ఏవచ
క్రీడన్నివైతత్ కురుతే పరమేష్ఠీ పునః పునః." ౮ మ. ౧-౮౦

కాలస్య పరిమాణార్థం బ్రాహ్మోహోరాత్రాదయ : సుగమ బోధార్థాః సంజ్ఞాః క్రియన్తే. యతః సహజతయా, జగదుత్పత్తిప్రలయయోర్ వర్షాణాం వేదోత్పత్తేశ్చ పరిగణనం భవేత్. మన్వంతర పర్యావృత్తౌ సృష్టేర్ నైమిత్తిక గుణానామపి పర్యావర్తనం కించిత్ కించిత్ భవత్యతో మన్వంతర సంజ్ఞా క్రియతే.

అత్రైవం సంఖ్యాతవ్యమ్ :–

"ఏకం దశ శతం చైవ సహస్ర మయుతం తథా
లక్షం చ నియుతం చైవ కోటి రర్బుద మేవ చ.
"వృందః ఖర్వో నిఖర్వశ్చ శంఖః పద్మం చ సాగర :
అంత్యం మధ్యం పరార్ద్ధ్యం చ దశవృద్ధ్యా యథాక్రమమ్.౨
ఇతి సూర్య సిద్ధాంతాదిషు సంఖ్యాయతే. అనయా రీత్యా వర్షాది గణనా కార్యేతి.
"సహస్రస్య ప్రమాసి సహస్రస్య ప్రతిమాసి." యజు. అ. ౧౫–౬౫
"సర్వం వై సహస్రం సర్వస్య దాతాసి."

శతపథ ; కాం. ౭. అ. ౫. బ్రా. ౨, కం. ౧౩

సర్వస్య (సహస్రస్య) జగతః సర్వమ్ (సహస్రమ్) ఇతి నామాస్తి, కాలస్య చానేన సహస్రసమహాయుగ సంఖ్యయా పరిమితస్య దినస్య నక్తస్య చ బ్రహ్మాండస్య ప్రమాపరిమాణస్య కర్తా పరమేశ్వరోఽస్తి. మంత్రస్యాస్య సామాన్యార్థే వర్తమానత్వాత్ సర్వ మభివదతీతి. ఏవమే వాగ్రేఽపి యోజనీయమ్.

జ్యోతిశ్శాస్త్రే ప్రతిదిన చర్యాఽభిహితార్త్యేః క్షణ మారభ్య కల్ప కల్పాంతస్య గణిత విద్యయా స్పష్టం పరిగణనం కృతమ్. అద్య పర్యంత మపి క్రియతే, ప్రతి దిన ముచ్చార్యతే. జ్ఞాయతే చాతః కారణా దియం వ్యవస్థైవ సర్వైర్ మనుష్యైః స్వీకర్తుం యోగ్యాఽస్తి నాన్యేతి నిశ్చయః. కుతో హి, ఆర్యైర్నిత్యం ఓం తత్సత్ శ్రీ బ్రహ్మణో ద్వితీయ ప్రహరార్ధే వైవస్వతే మన్వన్తరేఽష్టావింశతితమే కలియుగే కలి ప్రథమ చరణేఽ ముక సంవత్సరాయనర్తు మాస పక్ష దిన నక్షత్ర లగ్న ముహూర్తే అత్రేదం కృతం క్రియతే చ" ఇత్యాబాలవృద్ధైః ప్రత్యహం విదితత్వాత్, ఇతి హాసస్యాస్య సర్వత్రార్యావర్తదేశే వర్తమానత్వాత్ సర్వత్రైకరసత్వాత్ అశక్యేయం వ్యవస్థా కేనాపి విచాలయితు మితి విజ్ఞాయతామ్, అన్య ద్యుగ వ్యాఖ్యాన మగ్రే కరిష్యతే. తత్ర ద్రష్టవ్యమ్.

తె॥ ప్ర : వేదము లుత్పన్నములై యెన్ని వత్సరములు గతించినవి?

ఉ: ఒక వృందము, తొంబదియాఱుకోట్లు, యెనిమిది లక్షలు, యేబది రెండు వేల, తొమ్మిది వందల, డెబ్బది యాఱు (౧౯౬౦౮౫౨౯౭౬) సంవత్సరము లయినవి. వేదములు, జగత్తును ఉత్పన్నములై ఇప్పుడు డెబ్బది యేడవ సంవత్సరము గడచుచున్నది.

ప్ర : ఇన్నియేండ్లే జగదుత్పత్తికిని, వేదోత్పత్తికిని తదుపరి గడచినవని యెట్లు నిశ్చయము చేయనగును?

ఉ: ఇప్పటి సృష్టిలో నేడవ (౭) వైవస్వత మన్వంతరము నడుచుచున్నది. ఇంతకు పూర్వ మాఱు (౬) మన్వంతరములు గడచినవి. ఆయార్వురు మనువుల పేర్లివి- ౧. స్వాయంభువుడు, ౨ స్వారోచిషుడు ౩. ఔత్తమి, ౪. తామసుడు, ౫. రైవతుడు, ౬ చాక్షుషుడు. ఇప్పుడేడవ వైవస్వత మన్వంతరము నడచుచున్నది. దీనికి తరువాత సావర్ణి మున్నగు నామములు గల యేడు మన్వంతరములు రానున్నవి. ఇట్లు(౧౪) మన్వంతరములు ౭౧ చతుర్యుగములొక మన్వంతరమగును. ఇట్టి ౧౪ మన్వంతరములు (సృష్టిలో) ఒక బ్రహ్మదినమున భోగింపబడును. ఇంతే సమయము బ్రహ్మరాత్రి (ప్రలయము)కి నగును. ఆ గణన ప్రకార మీ దిగువ జూడుడు.

సత్య (కృత) యుగము ౧౭౨౮౦౦౦ సంవత్సరములు.

త్రేతాయుగము ౧౨౯౬౦౦౦ "

ద్వాపరయుగము ౮౬౪౦౦౦ "

కలియుగము ౪౩౨౦౦౦ "

క్షణము, నిమేషము మొదలు- సంవత్సర పర్యంతము గల సమయమున కంతటికి నార్యులు నామముల నేర్పఱచియున్నారు. ఉపర్యుక్తచతుర్యుగముల సమయము కలిసి (౪౩౨౦౦౦౦) నలుబదిమూడు లక్షల యిరువది వేల వత్సరము లగుచున్నది. ఈ కాలము చతుర్యుగ మనబడును. ఇట్టి డెబ్బది యొక్క (౭౧) చతుర్యుగములు (౩౦,౬౭, ౨౦౦౦౦ సం.) ఒక మన్వంతర మగును. ఇట్టి మన్వంతరము లాఱు (౬) (౧,౮౪,౦౩,౨౦,౦౦౦ సం.) ప్రస్తుత బ్రహ్మ దినమున - సృష్టి యందు - గడచిపోయినవి. ఏడవ మన్వంతర కాలము గడచుచున్నది. ఇందులో నిది ఇరువది యెనిమిదవ (౨౮) చతుర్యుగము. ఈ చతుర్యుగమునను కృతయుగము (౧౭౨౮౦౦౦ సం.) త్రేతాయుగము (౧౨,౯౬౦౦౦ సం.) ద్వాపరయుగము (౮౬,౪౦౦౦సం) గడచి పోయినవి. ఇక, ప్రస్తుత కలియుగమున ౪౯౭౬ వత్సరములు గతించినవి; ౪, ౨౭,౦౨౪ సంవత్సరములు అనుభవింపవలసి యున్నది. ఇట్లు నేటివఱకు నీ వైవస్వత మన్వంతరమున (౧౨౦౫౩౨౯౭౬సం.) పం(డ్రెండుకోట్ల యైదు లక్షల ముప్పది రెండు వేల తొమ్మిది వందల డెబ్బదియాఱు వర్షములు భుక్తము లయినవి. ఇంకను (౧౮౬౧౮౭౦౨౪ సం.) పదునెనిమిది కోట్ల, అఱువది యొక్క లక్షల, యెనుబది యేడు వేల, యిరువది నాలుగు వర్షములు భోగింపవలసియున్నది. వీనిలో నిప్పుడు డెబ్బదియేడవ (౭౭) సంవత్సరము జరుగుచున్నది. దీనిని ఆర్యులు విక్రమ (సంవత్) శకము ౧౯౩౩ అని లెక్కించుచున్నారు. పైన వర్ణించిన చతుర్యుగము లొక్కవేయి కలిసి యొక బ్రహ్మదిన మగును. అదియే సృష్టి కాలము. కావున సంపూర్ణ సృష్టిసమయము (౪౩౨౦౦౦౦×౧౦౦౦= ౪,౩౨,౦౦౦౦౦౦౦.) నాలుగు అర్బుదముల, ముప్పది రెండు కోట్ల సంవత్సరము లగుచున్నది. ఇట్లే వేయి చతుర్యుగములు కాలము బ్రహ్మ రాత్రి - ప్రళయ కాలమగును. ఈశ్వరుడు సృష్టిని రచియించి వేయి చతుర్యుగముల కాలము గడచువఱకు నీ సృష్టిని రక్షించుచుండును. ఈ కాలమునకే బ్రహ్మదినమని పేరు. తదుపరి వేయి వర్షముల సమయ మీ ప్రపంచమును లయము చేసి-నశింపజేసి-కారణ రూపమున నుంచును:ఆ కాలమునకు బ్రహ్మరాత్రి యని పేరు. సృష్టి కాలము - దినము, ప్రళయ కాలము - రాత్రి యని భావము. కావున వర్తమాన సృష్టిలో (బ్రహ్మ దినము) వేదములు, జగత్తు నేర్పడి యిప్పటికి (౧౯౬౦౮౫౨౯౭౬ సం.) ఒక్క వృందము, తొంబదియాఱు కోట్ల, యెనిమిది లక్షల యేబది రెండు వేల, తొమ్మిది వందల డెబ్బది యాఱు వత్సరములు గతించినవి. ఇక (౨౩౩౩౨౨౭౦౨౪ సం.) రెండు వృందముల, ముప్పది మూడు కోట్ల, ముప్పది రెండు లక్షల, యిరువది యేడు వేల, యిరువది నాలుగు వర్షములు గడవవలసియున్నవి.

(ఇంత వఱకు సృష్టిలో గతించిన సంవత్సరముల (౧౯౬౦౮౫౨౯౭౬) సంఖ్యలో నాలు మన్వంతరముల యేడు సంధికాలములకు సంబంధించిన (౧౨౯౬౦౦౦) సంవత్సరములు కలుపుకొని లెక్కించు కొనవలయును. ఇట్లే గడవవలసియున్న కాలము (౨౩౩౩౨౨౭౦౨౪) సంవత్సరములలో గూడ నేడు మన్వంతరములలోని యెనిమిది సంధికాలములకు సంబంధించిన (౧౩౮౨౪౦౦౦) సంవత్సరములు కలిపి లెక్కింప వలయును. మూల గ్రంథమున నీ సంవత్సరములు కలిపినట్లు కనిపింపదు. అట్లు కలుపకున్న సంపూర్ణ సృష్టి సమయమున కగు (౪౩౨౦౦౦౦౦౦౦) సంవత్సరములు పూర్తికానేరవు.) వీనిలో నిపు డంతిమమగు నిరువది నాల్గవ సంవత్సరము భోగింపబడుచున్నది. ముందురానున్న

భోగ్య వర్షములలో నొక్కొక్క సంవత్సరము తగ్గించుచుగతించిన వత్సరములలో నొక్కొక్క యేడు పెంచుచు లెక్కించుకొనవలయును. పరమేశ్వరుడు సృష్టి కాలమునకు బ్రహ్మదినమనియు, ప్రళయ కాలమునకు బ్రహ్మ రాత్రి యనియు నామములనేర్పఱచెను. ఇందులకు మనువు శ్లోకములు సాక్ష్యములు. వానియర్థము లీ క్రింద జూడుడు.

మనుస్మృతి శ్లోకార్థములు : –

"బ్రహ్మదినము, బ్రహ్మరాత్రి, ప్రతి యుగము యొక్కయు పరిమాణమును క్రమముగ వినుము.".

"(ఈ శ్లోకములందు దేవ వత్సరములు లెక్కింపబడినవి. ౩౬౦ మానవ వత్సరములు ఒక దేవ వర్షము. )ఇట్టి నాలుగు వేల దేవ వర్షములు ఒక్క సత్యయుగ మగును. ఆ యుగ సంధ్య (యుగ పూర్వ కాలము) నాలుగు వందల వర్షములు. సంధ్యాంశము (యుగపరకాలము) నాలుగు వందల యేండ్లు. ఇట్లు మొత్తము ( ౪౦౦ + ౪౦౦౦ + ౪౦౦=౪౮౦౦) సంధ్య, సంధ్యాంశములతో కలిసి సత్యయుగము నాలుగువేల యెనిమిది వందల దేవ వర్షముల పరిమాణము గలదగు చున్నది. మానవ సంవత్సరములు ౪౮౦౦× ౩౬౦ = ౧౭౨౮౦౦౦." ఇది కృతయుగపరిమాణము.

"ఇతర (త్రేతా, ద్వాపర, కలి) యుగముల వర్ష సంఖ్యలు, సత్యయుగము యొక్కయు, సంధ్య యొక్కయు, సంధ్యాంశము యొక్కయు వర్ష సంఖ్య నుండి యొక్క టొక్కటిగా తగ్గించి నిర్ణయింపనగును.

త్రేతాయుగము ( ౩౦౦+౩౦౦౦+౩౦౦) × ౩౬౦=౧౨,౯౬,౦౦౦

ద్వాపరయుగము ( ౨౦౦+౨౦౦౦+౨౦౦) × ౩౬౦=౮,౬౪,౦౦౦

కలియుగము ( ౧౦౦ + ౧౦౦౦ + ౧౦౦) ×౩౬౦=౪,౩౨,౦౦౦

ఇట్లే నాలుగు యుగముల కాల పరిమాణము దేవమానమున ౧౨౦౦౦ సంవత్సరములగును. మానుష వర్షములు ౧౨౦౦౦ × ౩౬౦=౪౩,౨౦,౦౦౦ నలువది మూడు లక్షల యిరువది వేలగును."

"ఈ ౧౨౦౦౦ దేవ వర్షములు పరిమాణముగల చతుర్యుగముల సమయమే యొక దేవయుగ మనబడును."

"ఇట్టి వేయి (౧౦౦౦) దేవయుగము లొక బ్రహ్మదినము (సృష్టి), అంతటి పరిమాణముగల సమయమే బ్రహ్మరాత్రియు (ప్రళయము) నగును.

౧౨౦౦౦ × ౧౦౦౦ = ౧,౨౦,౦౦,౦౦౦ దేవ వర్షములు

౧౨౦౦౦౦౦౦× ౩౬౦=౪౩౨౦౦౦౦౦౦౦ మానవ వర్షములు

సృష్టిసమయ మెంతో ప్రళసమయము కూడ నంతయే."

"అట్టి దేవయుగము లొక వేయి గడచిన నది పుణ్యమైన బ్రహ్మదిన మనియు, అంతే సమయము బ్రహ్మరాత్రి యనియు సహోరాత్ర విదులు చెప్పుదురు."

"పూర్వము చెప్పబడిన చతుర్యుగములు (౧౨౦౦౦ దేవ వర్షములు) ఒక దేవయుగ మగును.అట్టి దేవయుగములు (౭౧) డెబ్బది యొక్కటి కలిసి యొక మన్వంతరకాల మనబడును."

"మన్వంతరము లసంఖ్యేయములు. సృష్టి ప్రళయములు నసంఖ్యేయములే. ప్రజాపతి, సృష్టి ప్రళయముల క్రీడవలె (అనాయాసముగ) నొనర్చును."

సృష్ట్యుత్పత్తి స్థితి లయములు, వేదోత్పత్తి సమయమున మానవులు లెక్కించుటకు వీలుగ బ్రహ్మదినము, బ్రహ్మరాత్రి మున్నగునామములు నిశ్చయింపబడినవి. మన్వంతరము మారినప్పుడు సృష్టి నైమిత్తిక గుణములలోను కొంత మార్పు వచ్చును. అందువలననే మన్వంతర మను పేరు పెట్టబడినది. వర్తమాన సృష్టికి కల్పమనియు, ప్రళయమునకు వికల్పమనియు పేరులు. ఈ వర్షముల సంఖ్య నీ క్రింద జూపిన విధమున లెక్కింపవలయును.

| | |
|---|---|
| "ఏకము | ౧ |
| దశకము | ౧౦ |
| శతము | ౧౦౦ |
| సహస్రము | ౧౦౦౦ |
| దశసహస్రము | ౧౦౦౦౦ |
| లక్ష | ౧౦౦౦౦౦ |
| నియుతము | ౧౦౦౦౦౦౦ |
| కోటి | ౧౦౦౦౦౦౦౦ |
| అర్బుదము | ౧౦౦౦౦౦౦౦౦ |
| వృందము | ౧౦౦౦౦౦౦౦౦౦ |
| ఖర్వము | ౧౦౦౦౦౦౦౦౦౦౦ |
| నిఖర్వము | ౧౦౦౦౦౦౦౦౦౦౦౦ |
| శంఖము | ౧౦౦౦౦౦౦౦౦౦౦౦౦ |
| పద్మము | ౧౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦ |
| సాగరము | ౧౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦ |
| అంత్యము | ౧౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦ |
| మధ్యము | ౧౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦ |
| పరార్ధ్యము | ౧౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦౦ |

పదిరెట్లు పెంచుచు నీ గణితముతోనే సూర్యసిద్ధాంతాది జ్యోతిష్యగ్రంథములలో లెక్కలు వేయబడినవి."

("సహస్రస్య...") అను నీ యజుర్వేదవాక్యమును బట్టి ప్రపంచమునకు సహస్రమని నామము. పూర్వము వర్ణించిన బ్రహ్మదినమునకు, రాత్రికిని సహస్రమనియే పేరు. ఈ మంత్రమున కర్థము సామాన్యము :- "ఓ పరమేశ్వర! యీ సహస్ర చతుర్యుగదినరాత్రుల (ప్రమాణము)ను నిర్మించువాడవు నీవే"!

శతపథ బ్రాహ్మణమునందును నీ సంపూర్ణ జగత్తునకు 'సహస్ర'మని నామము గలదు. సంపూర్ణ జగత్తునకు దాతవు నీవే.

జ్యోత్యషశాస్త్రమున సంవత్సరముల సంఖ్యను సరిగా నార్యులు లెక్కించినారు. సృష్ట్యుత్పత్తి జరిగినప్పటి నుండి నేటి వఱకు దినములను లెక్కించుచు, క్షణము మొదలు కల్పాంతము వఱకు గణితవిద్యను ప్రసిద్ధ మొనర్చుచు వచ్చిరి - పరంపరగా వినుచు వినిపించుచు, వ్రాయుచు, వ్రాయించుచు, చదువుచు చదివించుచు వచ్చితిమని భావము. సృష్టియొక్కయు, వేదములయొక్కయు నుత్పత్తి కాల వత్సరముల సంఖ్యావ్యవస్థ పైన జూపినదే సరియని యెల్లరు నంగీకరించుట యుక్తము.

ఆర్యులు నిత్యము 'ఓమ్, తత్, సత్' అను పరమేశ్వరుని నామములను ముందుగా నుచ్చరించి కార్యముల నాచరించుచు, పరమేశ్వరునకు నెల్లపుడు ధన్యవాదముల నొనర్చుచు వచ్చుచున్నారు. నేటి వఱకును మనము, పరమేశ్వరుని సృష్టియు నానందముతో నున్నాము. పూర్వము నిరూపించిన బ్రహ్మదినమున రెండవ జామున మధ్యాహ్న సమీపమున జేరుకొనుచున్నట్లు 'బహీ ఖాతా' (లెక్కల చిట్టా)లో వలె నిత్యము వ్రాయుచు, వ్రాయించుచు, చదువుచు, చదివించుచు వచ్చుచున్నాము. దానింబట్టి వైవస్వత మన్వంతరమున నెన్ని వర్షములు భోగింపవలసియున్నదియు తెలియనగును. (బ్రహ్మణో ద్వితీయ..") ఇప్పుడు వైవస్వత మన్వంతరము నడచుచున్నది. అందులో నీ కలియుగము (౨౮) ఇరువది యెనిమిదవది. ఈ యుగమునను ప్రథమచరణమే గడచుచున్నది. అట్లే వర్షము, అయనము, ఋతువు, మాసము పక్షము, దినము, నక్షత్రము, లగ్నము, నిమేషము మొదలగువానితో గూడిన యీ సమయమునందు మేమీ పనులు చేసితిమి; ఇది చేయనున్నాము అని కార్యారంభమున సంకల్పించుచున్నాము. ఉదాహరణమునకు:- మేమీ వేదభాష్యభూమికలో విక్రమశకము ౧౯౩౩ సంవత్సరమున ఫాల్గుణమాస, శుక్లపక్ష షష్ఠీ శనివారము దినమున చతుర్థ ప్రహరము (నాల్గవ జాము)న నీ విషయమును వ్రాసితిమి. ఇట్లే యన్ని కార్యములు నార్యులు బాలకులు మొదలు వృద్ధుల వఱకు నెల్లరు చేయుచు, నెఱుగుచు వచ్చిరి. బహీఖాతాలో ప్రతి దినము తిథులు వ్రాసినట్లు సంకల్పమున మాసములు, సంవత్సరములు పెంచుచు, తగ్గించుచు వచ్చుచున్నారు. ఆర్యావర్తమున నేటి వఱకు ని యితిహాసమొకే విధముగ వర్తించుచున్నది. సర్వగ్రంథములందును నీ విషయ మొకే విధముగా వ్రాయబడియుండుట జూడనగును. విరోధ మొక్కయెడను గనిపింపదు. కావున దీనిని కాదన నెవరికిని సామర్థ్యము లేదు.

సృష్టి యుత్పన్నమైన నాటినుండి సరిగా తిథి వారములు వ్రాయు చుండని పక్షమున ఆర్యులకును సరిగా నీ లెక్క తెలుగుట కఠినమయ్యేడిది. ఇక నితరుల సంగతి నేమనగలము! దీనింబట్టే సృష్టి ప్రారంభము నుండి నేటి వఱకు ఆర్యులలోనే గొప్ప గొప్ప విద్వాంసులు, సభ్యులు ప్రసిద్ధులై యున్నారనియు సిద్ధమగుచున్నది. జైనులు, మహమ్మదీయులు మున్నగువారీ దేశపు టితిహాసము (చరిత్ర)ను, విద్యాపుస్తకములను నశింపజేయ మొదలిడినపుడు ఆర్యులు సృష్టియొక్క గణితమునకు సంబంధించిన యితిహాసమును కంఠస్థము చేసికొనిరి. జ్యోతిష శాస్త్రమును మిగిలియున్న పుస్తకముల మూలమున వార్షిక పంచాంగములను నిర్మించుచున్నారు. వానిలోను క్రమముగా తిథులు వ్రాయుచు వచ్చుచున్నారు. దీని నెవరును కాదనజాలరు. పూర్వాపరకాలముల ప్రమాణమెల్లరకు దెలియుటకును, సృష్టియొక్కయుత్పత్తి ప్రళయములు, వేదోత్పత్తి మున్నగు విషయముల కాలపరిమితి దెలియుటకును నీ యైతిహాసిక దృష్టాంత మిట వ్రాయబడినది. దీని వలన వేదోత్పత్తి కాలమును గుర్తించుటలో భ్రమ కలుగదు. ఇది మిక్కిలి యుత్తమ కార్యము. దీని నెల్లరును బాగుగ నెఱుగవలయును. ఈ గణిత శాస్త్రమను నుత్తమ వ్యవహారమును లోకులు ధన సంపాదన కొఱకు జెడగొట్టి యున్నారు. ఇయ్యది దుఃఖకరము. కాని, ధన లోభముతో నైనను (నీ గణిత సంబంధమైన) పుస్తక వ్యవహారమును రక్షించుచు నష్టము కాకుండునట్లు చేయుట హర్షింపదగిన విషయమే. నాలుగు యుగములలో గల భేదము, వాని వర్ష సంఖ్యలో గల హెచ్చు తగ్గులు వాని వివరణము ముందు వ్రాయుదుము - అక్కడ చదువుదురు గాక! ఇట వానికి ప్రసక్తి లేనందున వ్రాయమైతిమి.

ఈ ప్రకరణమునందే పూర్వ ముల్లేఖించిన మనుస్మృతిశ్లోకముల మూలమున దేవ వర్షములను లెక్కించి క్రమముగ నాలుగు వృందముల ముప్పది రెండు కోట్ల (౪౩౨౦౦౦౦౦౦౦) మానవవర్షములు సంపూర్ణ సృష్టి కాలమని స్పష్ట పఱపబడినది.

వైదిక సిద్ధాంతానుసారము సృష్టికి గల యాయు వింతయే. శ్రీ దయానంద స్వామి వారును నీ సిద్ధాంతమునే యీ ప్రకరణమున నీ క్రింది వచనములతో పోషించియున్నారు. "ఏకసహస్రం (౧౦౦౦) చతుర్యుగాని బ్రహ్మదినస్య పరిమాణం భవతి." 'సృష్టికి ఆయువు ఒక్క వేయి చతుర్యుగములు' (౪౩౨౦౦౦౦×౧౦౦౦=౪౩౨౦౦౦౦౦౦౦). కాని, పై పంక్తులలో జూపినట్లు ఈ సృష్టిలో గతించిన వర్షములు గడవ నున్న వర్షములు కలిపి చూచిన (గత వ. ౧౯౬౦౮౫౨౯౭౬+౨౩౩౩౨౨౭౦౨౪, రానున్న వ. ౪౨౯౪౦౮౦౦౦౦) మాత్రమే యగు చున్నవి. (౨౫౯౨౦౦౦౦) రెండుకోట్ల , యేబదితొమ్మిది లక్షల, యిరువదివేల వత్సరముల కాలము సృష్టిసమయమునకు తగ్గుచున్నది. కావున విక్రమ సంవత్ ౧౯౩౩ వఱకు నిర్దేశించిన గత కాలపు వత్సరముల సంఖ్యయు, రానున్న కాలపు వర్షముల సంఖ్యయు సరికాదని తెలియుచున్నది. ఈ విషయమును ఇంతకు పూర్వమే సూచించి యున్నాము. ఈ ప్రకరణమున సృష్టియుత్పన్నమై వి.శ. ౧౯౩౩ వఱకు (౧౯౬౦౮౫౨౯౭౬) ఒక్క వృందము, తొంబదియాఱుకోట్ల, యెనిమిది లక్షల, యేబది రెండు వేల, తొమ్మిది వందల డెబ్బది యాఱు సంవత్సరము లయినట్లు నిర్దేశింప బడినది. కాని, దయానంద మహర్షిచే వ్రాయబడిన యితర గ్రంథముల మొదటి పేజీల మీదనే, ఒక వృందము తొంబది యేడు కోట్ల, యిరువది తొమ్మిది లక్షల నలుపది యెనిమిది వేల తొమ్మిది వందల డెబ్బది యాఱు (౧౯౭౨౯౪౮౯౭౬) వర్షములు సృష్టి కాలమని లిఖింపబడియుండుట జూచు చున్నాము. దీనింబట్టియు నీ పుస్తకమున జూపిన సంఖ్య సరికాదని తెలియుచున్నది. జ్యోతిషశాస్త్రపు సూర్య సిద్ధాంత నామక గ్రంథాధారమున నీ గణితము చేయబడినది. ఆ గ్రంథమును బాగుగ జూచినపుడు పైన జూపిన అంకెలలో భేదము గలుగుటకు కారణము బోధపడును.

సం॥ "యుగానాం సప్తతిః సైకా మన్వంతర మిహోచ్యతే

కృతాబ్ద సంఖ్యయాఽస్యాంతే సంధిః ప్రోక్తో జలప్లవః" సూ.సి.అ.౧.శ్లో. ౧౮,

తె॥ డెబ్బది యొక్క చతుర్యుగము లొక మన్వంతరము. మన్వంతరమున కంతమున సత్యయుగ సంఖ్యకు సమాన సంఖ్య (౧౭౨౮౦౦౦) గల వర్షముల కాలము ఒక సంధికాలముండును, ఆ సంధిలో జల ప్లవము (వరద ) కలుగును."

సం॥ "ససంధయ స్తే మనవః కల్పే జ్ఞేయా శ్చతుర్దశ

కృత ప్రమాణః కల్పాదౌ సంధిః పంచదశ స్మృతః" సూ.సి. అ. ౧శ్లో. ౧౯

తె॥ 'ఇట్టి ౧౫ సంధులతో కూడిన ౧౪ మన్వంతరము లొక కల్పము (సృష్టి)లో నగును.

పైన జూపిన సృష్టి సంవత్సరములలో ౧౪ మన్వంతరముల కాలము లెక్కింపబడినది కాని, యే ...ణమునను యీ మన్వంతరముల మధ్యలో నేర్పడు ౧౫ సంధికాలముల సంవత్సరములు లెక్కించి ...ట్లు కనిపింపదు. ప్రస్తుత కల్పము (సృష్టి)లో ఆఱు మన్వంతరములు గడచిపోయినవి. ఏడవ మన్వంతరమున ...పది యేడు చతుర్యుగములు గడచినవి. ఇప్పుడు ఇరువది యెనిమిదవ చతుర్యుగము గడచుచున్నది. ...మునను కృత, త్రేత, ద్వాపర యుగములు గతించినవి. కలియుగమున ప్రథమ పాదములో (౪౯౭౬) ...లుగు వేల తొమ్మిది వందల డెబ్బది యాఱు సంవత్సరములు సమాప్తమైనవి. కావున.

| | | |
|---|---|---|
| ౬ | మన్వంతరములు | ౧౮౪౦౩౨౦౦౦౦ |
| ౭ | సంధికాలములు | ౧౨౦౯౬౦౦౦ |
| ౭ | వ. వై.మ. ౨౭ చ.యు. | ౧౧౬౬౪౦౦౦౦ |
| ౨౮ | చ.యుగములలో గత సం. | ౩౮౯౨౯౭౬ |
| | సృష్టికాలము నేటి వఱకు | ౧౯౭౨౯౪౯౭౬ |

విక్రమ సంవత్ ౧౯౩౩ నాటికి వేదముల యుత్పత్తి జరిగి ఒక బృందము తొంబది యేడు కోట్ల, యిరువది తొమ్మిది లక్షల, నలుబది యెనిమిది వేల తొమ్మిది వందల డెబ్బదియాఱు వర్షములు గతించినవి. ఇదియే సృష్టి యేర్పడిన కాలము కూడ. ఇందు ప్రమాణము :-

సం॥ "కల్పాదస్మాచ్చ మనవః షడ్ వ్యతీతాః ససంధయః

వైవస్వతస్య చ మనోః యుగానాం త్రిఘనోఽగతః" సూ.సి.అ.౧.శ్లో.౨౨

"ఏతావతా కథనేనైవ, అధ్యాపకెర్ విలసన – మోక్షమూలరా ద్యభిధైర్ యూరోపాఖ్యఖండస్థై మనుష్యరచితో వేదో ఽస్తి శ్రుతిర్ నాస్తీ' తి యదుక్తం, యచ్చోక్తం చతుర్వింశతి. రేకోన త్రింశత్, త్రింశ, దేకత్రింశచ్చ శతాని వర్షాణి వేదోత్పత్తౌ వ్యతీతానీతి తత్సర్వం భ్రమ మూల మస్తీతి వేద్యమ్. తథైవ ప్రాకృత భాషయా వ్యాఖ్యాన కారిభి రప్యేవ ముక్తం తదపి భ్రాంతమేవాస్తీతి చ."

ఇతి వేదోత్పత్తి విచారః

తె॥ ప్రొఫెసర్ విల్సన్, ప్రొఫెసర్ మాక్స్‌ముల్లర్ మున్నగు ఐరోపా ఖండపు మహాశయులు 'వేదములు మనుష్య రచితములనియు, అవి శ్రుతులు కావనియు' చెప్పినది సరికాదు. ఇంకను వారిలో కొందఱు వేదముల కాలము ౨౪౦౦ సం. లో ౨౯౦౦ సం.లో, ౩౦౦౦ సం.లో, ౩౧౦౦ సం.లోయై యుండునని చెప్పియున్నారు. అదియును. భ్రమ మూలకము-అసత్యమని యెఱుగవలయును. వారికి ఆర్యులమగు మన దినచర్య కాని, మనము నిత్యము సృష్టికి నారంభము నుండియు చెప్పుకొనుచు వచ్చు సంకల్పమును గూర్చి కాని యేమియు దెలియదు. దానిని గూర్చి వారెన్నడు నాలోచించియు నుండరు. అందువలననే వారి కీ విషయమున నిట్టి భ్రమలు కలిగి యుండును. కాబట్టి వేదములు పరమేశ్వరుని వలన నుత్పన్నము లైనవనియు, యవి యుత్పన్నములై పైన నిరూపించినట్లు ౧౯౭౨౯౪౯౭౬ సంవత్సరములు ( వి.శ. ౧౯౩౩ నాటికి) గతించినవనియు, అంతేకాలము సృష్టి యుత్పత్తికి తదుపరి గతించినదనియు నెఱుగవలయును. ఇంతే కాక దేశ భాషలలో వేద విషయమున జేసిన విరుద్ధ వ్యాఖ్యానములన్నియు మిథ్యాభాషిత (అబద్ధ)ము లనియు గుర్తింపవలయును. మఱియు నింతకు పూర్వము వర్ణించినట్లు వేయి చతుర్యుగములు గతింపనంత వఱకు ఈశ్వర ప్రదత్తములైన వేదములు, ఈజగత్తు, ప్రాణిజగత్తు పరమేశ్వరుని దయవలన నెల్లపుడు నుండుననియు తెలిసికొనవలయును.

వేదోత్పత్తి విషయము సమాప్తము

# అథ వేదానాం నిత్యత్వ విచారః

సం॥ ఈశ్వరస్య సకాశా ద్వేదానా ముత్పత్తౌ సత్యాం స్వతో నిత్యత్వ మేవ
భవతి; తస్య సర్వసామర్థ్యస్య నిత్యత్వాత్

తె॥ వేదము లీశ్వరీయములు - ఈశ్వరోత్పన్నములు. ఈశ్వరుని సర్వసామర్థ్యములు - శక్తులు నిత్యము లగుటంబట్టి వేదములు కూడ స్వతః నిత్యములే యగును.

సం॥ పూ . అత్ర కేచిదాహుః. న వేదానాం శబ్దమయత్వా న్నిత్యత్వం సంభవతి. శబ్దోఽనిత్యః కార్యత్వాత్. ఘటవత్, యథా ఘటః కృతోఽస్తి, తథా శబ్దోఽపి; తస్మాచ్ఛబ్దానిత్యత్వే వేదానా మప్యనిత్యత్వం స్వీకార్యమ్.

ఉః మైవం మన్యతామ్. శబ్దో ద్వివిధః నిత్య కార్యభేదాత్, యే పరమాత్మ జ్ఞానస్థాః శబ్దార్థ సంబంధాః సన్తి, తే నిత్యా భవితు మర్హంతి; యే ఽ స్మదాదనాం వర్తన్తే, తే తు కార్యాశ్చ.. కుతః? యస్య జ్ఞాన క్రియే నిత్యే స్వభావసిద్ధే అనాది స్తః తస్య సర్వం సామర్థ్యమపి నిత్యమేవ భవితు మర్హతి. తద్విద్యామయత్వాద్ వేదానా మనిత్యత్వం నైవ ఘటతే.

తె॥ పూ । ఈ విషయమున కొందఱిట్లు శంకింతురు. వేదములందు ఛందస్సు, పదములు, వాక్యములు, వాని కలయికలు నున్నందున వేదములు శబ్దమయములు. కావున నవి నిత్యములు కానేరవు. ఘటము (కుండ) చేయుటవలన నేర్పడుచున్నది. అట్లే వేదములను గూడ శబ్దములతో నెవరో రచియించియున్నారు. అవి రచియించుటకు పూర్వ ముండియుండవు. ప్రళయమున నవి నశియించును. ఇట్లు ఉత్పత్తి వినాశములు గలవి కార్యములనబడును. శబ్దము లుత్పత్తి వినాశములు గలవి యగుటచే కార్యములు. అందువలన నవి యనిత్యములు. కావున శబ్దమయములగు వేదములును ననిత్యములే యగును. (ఇందులకు ఘటాదులు ఉదాహరణము.)

ఉ. ప। అట్లు శకింపజనదు. కారణమేమన ।

నిత్యములు, కార్యములు నని, శబ్దములు ద్వివిధములు. పరమేశ్వరుని జ్ఞానమునందలి శబ్దములు, అర్థములు, సంబంధములు నిత్యములే. మన (మానవ) కల్పన వలన నుత్పన్నములగునవి కార్యము- అనిత్యములగును. ఎవని జ్ఞానము -క్రియ, నిత్యములో - స్వభావ సిద్ధములో - అనాదులో, అతని సమస్త సామర్థ్యములు నిత్యములే యగును. వేదములు పరమేశ్వరుని విద్యారూప సామర్థ్యములే యగుటవలన నిత్యములే యగును. ఈశ్వరుని విద్య అనిత్య మెన్నడును కానేరదు.

సం॥ పూ ః కించ భోః! సర్వస్యాస్య జగతో విభాగం ప్రాప్తస్య కారణ రూపస్థితౌ సర్వస్థూల కార్యాభావే పఠన పాఠన పుస్తకానా మభావాత్ కథం వేదానాం నిత్యత్వం స్వీక్రియతే?

ఉ; అత్రోచ్యతే, ఇదం తు పుస్తకపత్రమసీవదార్థాదిషు ఘటతే, తథాఽస్మత్ క్రియాపక్షే చ, నేతరస్మిన్, అతః కారణాత్, ఈశ్వర విద్యా మయత్వేన వేదానాం నిత్యత్వం వయం మన్యామహే. కించ న పఠన పాఠన పుస్తకానిత్యత్వే వేదానా మనిత్యత్వం జాయతే, తేషా మీశ్వర జ్ఞానేన సహ సదైవ విద్యమానత్వాత్, యథా అస్మిన్ కల్పే వేదేషు శబ్దాక్షరార్థ సంబంధా ః సంతి, తథైవ పూర్వ మాసన్,

అగ్రే భవిష్యంతి చ.

పూ. కుతః?

ఉ : ఈశ్వర విద్యాయానిత్యత్వా దవ్యభిచారిత్వాచ్చ, అత ఏవేద ముక్తమ్ ఋగ్వేదే.
"సూర్యాచంద్రమసౌ ధాతా యథా పూర్వ మకల్పయత్" ఇతి. (ఋ.౧౦–౧౯౦–౩)

అస్యాయమర్థః – సూర్య చంద్రగ్రహణముపలక్షణార్థం, యథా పూర్వ కల్పే సూర్యచంద్రాదిరచనం తస్య జ్ఞానమధ్యే హ్యాసీత్, తథైవ తేనాస్మిన్ కల్పేపి రచనం కృత మస్తీతి విజ్ఞాయతే.

పూ: కుత :?

ఉ : ఈశ్వర జ్ఞానస్య వృద్ధిక్షయ విపర్యయాభావాత్. ఏవం వేదేష్వపి స్వీకార్యమ్; వేదానాం తేనైవ స్వవిద్యాతః సృష్టత్వాత్.

తె॥ పూ : ఈ జగత్తంతయు విభక్తమై కారణరూపమున( ప్రళయమున) నున్నపుడు కార్య రూపమున స్థూలముగ నున్న పదార్థము లన్నియు నశించును. అప్పుడు వేద పుస్తకములు నశించును. కావున, వేదములు నిత్యము లెట్లగును?

ఉ : ఈస్థితి పుస్తకములకు, సిరాకు, కాగితములకు, అక్షరముల నిర్మాణమునకు గలుగును; అట్లే మనము చేయు క్రియకును వర్తించును. వేదముల కీ స్థితి కలుగదు. వేదము పరమేశ్వరుని జ్ఞానమునందుండు శబ్దార్థ సంబంధరూపము గదా! వేదము పుస్తకము కాదు. కాగితములు, సిరాబుడ్డి అంతకంటెను కాదు. కాగితముల మీద సిరాతో వ్రాయుట యనునది మానవ క్రియ. అందువలన నాక్రియ యనిత్యము. వేద మీశ్వరుని జ్ఞానమున నెల్లపుడు నుండును – కావున నది నిత్యమేయగును. అందువలన పఠన పాఠనములు, పుస్తకములు ననిత్యము లయినంత మాత్రమున వేదములనిత్యములు కావు; అవి పరమేశ్వరుని జ్ఞానమున బీజమున నంకుర ముండునట్లెల్లపుడు నుండును. సృష్టికి నారంభమున వేదము లీశ్వరునివలన ప్రసిద్ధములగును. ప్రళయమున జగత్తుండదు కావున నవి యప్రసిద్ధములగును. కావున వేదములు స్వరూపతః నిత్యములే యగును. ఈ కల్పమున (సృష్టియందు) శబ్దములు, అక్షరములు, అర్థములు, సంబంధములు వేదమున నుండునట్లే పూర్వ కల్పమునందును నుండెను. రానున్న కల్పమునందును నుండును.

కారణ మేమందురేని, ఈశ్వరుని విద్యాదులు నిత్యములు, ఏకరసములై యుండును. వాని యొక్క యక్షరములకు కూడ విపరీత భావము కలుగదు. అందువలననే ఋగ్వేదమున నిట్లు వర్ణింపబడినది. "సూర్యాచంద్రమసౌ...." సూర్య చంద్రగ్రహణ మిట ఉపలక్షణము మాత్రమే. పూర్వ కల్పమున నీశ్వరుని జ్ఞానమునందు సూర్య చంద్రుల నిర్మాణ మెట్లుండెనో, యీ కల్పము నందును నట్లే యున్నది. పూర్వ కల్పమున సూర్య చంద్రులను రచించినట్లు ఈ కల్పమునను పరమేశ్వరుడు రచించినాడని భావము."

ఋగ్వేదాది నాలుగు వేద సంహితలందు నిప్పుడెట్టి శబ్దార్థ సంబంధములు, అక్షరములు నే క్రమమున నున్నవో, అట్లే యెల్లకల్పములందు నుండును. కారణమేమన ఈశ్వరుని జ్ఞానము నిత్యము. దానికి వృద్ధి క్షయము లుండవు. వైపరీత్యము గలుగదు. కావున వేదముల స్వరూపము నిత్యమనియే యంగీకరింపవలయును.

సం॥ ఉ : అత్ర వేదానాం నిత్యత్వే వ్యాకరణ శాస్త్రాదీనాం సాక్ష్యర్థం ప్రమాణాని లిఖ్యంతే. తత్రాహ మహా భాష్య కారః పతంజలిమునిః–

"నిత్యాః శబ్దా నిత్యేషు శబ్దేషు కూటస్థై రవిచాలిభిర్ వర్ణైర్ భవితవ్య మనపాయోపజనవికారిభిః" ఇతి. ఇదం వచనం ప్రథమాహ్నిక మారభ్య బహుషు స్థలేషు వ్యాకరణ మహాభాష్యే ఽస్తి.

తథా – "శ్రోత్రోపలబ్ధిర్ బుద్ధినిర్ గ్రాహ్యః ప్రయోగేణాభిజ్వలిత ఆకాశ దేశః శబ్దః" ఇదమ్ "అ ఇ ఉ ణ్ సూత్రభాష్యే ప్రోక్తమితి." అస్యాయమర్థః – వైదికా లౌకికాశ్చ సర్వే శబ్దా నిత్యా సంతి.

పూ ః కుతః?

ఉ ః శబ్దానాం మధ్యే కూటస్థా వినాశరహితా అచలా అనపాయా అనుపజనా అవికారిణో వర్ణాః। సన్త్యతః అపాయో—లోపః, నివృత్తిః— అగ్రహణమ్, ఉపజనః—ఆగమః, వికారః ఆదేశః. ఏతే న విద్యంతే యేషు శబ్దేషు; తస్మా న్నిత్యాః శబ్దాః.

తె॥ వేదములు నిత్యములను విషయమున సాక్ష్యము కొఱకు వ్యాకరణ శాస్త్ర ప్రమాణముల నిచ్చుచున్నాము. వ్యాకరణశాస్త్రము సంస్కృతమునకు నితర భాషలకును చెందిన శబ్ద విద్యకు మూల (ముఖ్య) ప్రమాణము. భగవత్పాణిని, పతంజలి మును లా శాస్త్రమును రచించిరి. వారి మతమున - శబ్దములన్నియు నిత్యములు. ఈ శబ్దములలోని అక్షరాద్యవయవము లన్నియును కూటస్థములు - వినాశరహితములు. అవి పూర్వాపరములలో చలింపవు. వాని కభావము కాని, వినాశము కాని కలుగదు. కావున వైదిక శబ్దములు, వేదములనుండి లోక వ్యవహారమునందు వాడబడు లౌకికశబ్దములు సన్నియును నిత్యములే. కారణమేమన;

ఆ శబ్దములలోని వర్ణములు - అక్షరములన్నియు నాశములేనివి, [illegible]ములు. వానిలో వికారముకాని, లోపముకాని, ఆగమము కాని యేదియును గలుగదు. అందువలన శబ్దములు నిత్యములే.

సం॥ పూః నను గణపాఠాష్టాధ్యాయీ మహాభాష్యే ష్వపాయాదయో విధీయంతే. పునరేతత్ కథం సంగచ్ఛతే?

ఉః ఇత్యేవం ప్రాప్తే బ్రూతే మహాభాష్యకారః

సర్వే సర్వపదాదేశా దాక్షీపుత్రస్య పాణినేః

ఏకదేశవికారే హినిత్యత్వం నోపపద్యతే." ౧

'దాధాఘ్వదాప్' ఇత్యస్య సూత్రస్యోపరి మహాభాష్య వచనమ్ . అస్యాయమర్థః సర్వేసంఘాతాః సర్వేషాం పదానాం స్థాన ఆదేశా భవంతి. అర్థా చ్ఛబ్దసంఘాతాంతరాణాం స్థానేష్వన్యే శబ్దసంఘాతాః ప్రయుజ్యంతే. తద్యథా – "వేదపార + గమ్+డ+ను+భూ+శప్+తిప్, ఇత్యేతస్య వాక్యసముదాయస్య స్థానే. "వేదపారగోఽభవత్" ఇతీదం సముదాయాంతరం ప్రయుజ్యతే. అస్మిన్ ప్రయుక్తసముదాయే "గమ్–డ–ను–శప్–తిప్" ఇత్యేతేషాం "అమ్, డ్+ఉ,శ్,ప్,ఇ,ప్" ఇత్యేతే అపయంతీతి కేషాంచిద్ బుద్ధిర్ భవతి, సా భ్రమమూలైవాస్తి.

పూ ః కుతః?

ఉః శబ్దానా మేకదేశవికారే చేత్యుపలక్షణాత్. నైవ శబ్దస్యైకదేశాపాయే ఏకదేశోపజనే ఏకదేశ వికారిణే సతి, దాక్షీపుత్రస్య పాణినే రాచార్యస్య మతే శబ్దానాం నిత్యత్వ ముపపన్నం భవత్యతః. తథైవ అడాగమో, 'భూ' ఇత్యస్యస్థానే భో ఇతి వికారే చైవం సంగతి కార్యేతి.

(శ్రోత్రోపలబ్ధిరితి.) శ్రోత్రేంద్రియేణ జ్ఞానం యస్య, బుద్ధ్యా నితరాం గ్రహీతుం యోగ్య ఉచ్చారణేనాభిప్రకాశితో యో, యస్యాకాశో దేశోఽధికరణం వర్తతే – స శబ్దో భవతీతి బోధ్యమ్. అనేన శబ్దలక్షణే నాపి శబ్దో నిత్య ఏవాస్తీ త్యవగమ్యతే.

పూ : కథమ్?

ఉ: ఉచ్చారణ శ్రవణాది ప్రయత్న క్రియాయాః క్షణ ప్రధ్వంసిత్వాత్. 'ఏకైక వర్ణవర్తినీ వాక్' ఇతి మహాభాష్య ప్రామాణ్యాత్. ప్రతి వర్ణం వాక్ క్రియా పరిణమతే, అతస్తస్యా ఏ వానిత్యత్వం గమ్యతే, న చ శబ్దస్యేతి.

తె॥ పూ : గణపాఠము, అష్టాధ్యాయి, మహాభాష్యము నను గ్రంథములలో అక్షరములలోపము, ఆగమము, వికారము మున్నగునవి కలుగునట్లు వర్ణింపబడియున్నది. కావున శబ్దములు నిత్యము లెట్లగును?

ఉ: ఈ ప్రశ్నకు సమాధానము మహాభాష్యకర్త పతంజలిముని యిట్లు నుడివియున్నాడు 'శబ్దసముదాయస్థానమున మఱియొక శబ్ద సముదాయము ప్రయోగింపబడును. ఉదా: 'వేదపార+గమ్+డ+సు+భూ+శప్+తిప్' అనునీ పదసముదాయ (వాక్య) స్థానమున, 'వేదపారగోఽభవత్' అను నీ శబ్దసముదాయాంతరము ప్రయోగింపబడును. ఈ విషయమున కొందఱు 'అమ్,డ్ +ఉ,శ్ +ప్, ఇ ప్,' అను నక్షరములు నివృత్తములగును – లోపించును అందురు. అది భ్రమ మాత్రమే కాని, సరికాదు. కారణమేమన

శబ్ద సముదాయస్థానమున మఱియొక శబ్దసముదాయమే ప్రయోగింపబడును. అట్లుకాక శబ్దావయవములైన యక్షరములలో వికారము నంగీకరించిన పక్షమున 'శబ్దములు నిత్యములు' అను దాక్షీపుత్రుడైన పాణినిముని సిద్ధాంతము స్థిరము కానేరదు. ఇట్లే 'అట్' ఆగమము, 'భూ' స్థానమున 'భో' ప్రయోగస్థలములందును సంగతి నెంచవలయును. శబ్దముల యేక దేశము (అవయవము) వికృతము కాదనియు, ఒక శబ్దస్థానమున మఱియొక శబ్దము ప్రయోగింపబడుననియు నెంచవలయునని భావము. (శ్రోత్రో పలబ్ధిరితి...) శ్రోత్రేంద్రియము (చెవి) చే గ్రహింపబడునవియు, బుద్ధిచే తెలియబడునవియు, వాగింద్రియముచే నుచ్చరింపబడి ప్రకాశింపజేయబడునవియు, ఆకాశమున నుండునవియు – శబ్దము లనబడును. ఈ లక్షణములను బట్టియు శబ్దము నిత్యమనియే తెలియుచున్నది.

పూ: అదియెట్లు?

ఉ: ఉచ్చారణ శ్రవణాదులు మన మొనర్చు క్రియలు. ఆ క్రియలు క్షణికములు- అవి నశించును. కావున నవి యనిత్యములే. కాని, శబ్దము మాత్ర మనిత్యముకాదు. మన మొనర్చు వాగింద్రియ క్రియాశబ్దము నందలి ప్రతివర్ణమును వేఱగును; కాని, శబ్దము మాత్ర మేకరసమై యఖండముగానే యుండును.

సం॥పూ: నను చ భోః! శబ్దోఽవ్యవరతాగతో భవతి? ఉచ్చారిత ఉపాగచ్ఛతి, అనుచ్చారితోఽనాగతో భవతి, వాక్క్రియావత్. పునస్తస్య నిత్యత్వం కథం భవేత్?

ఉ: అత్రోచ్యతే. నాకాశవత్ పూర్వస్థితస్య శబ్దస్య సాధనాభావాదభివ్యక్తిర్ భవతి. కింతు, తస్య ప్రాణ వాక్ క్రియాఽభివ్యక్తిశ్చ, తద్యథా, 'గౌ'రిత్యత్ర యావద్ వాగ్గకారేఽస్తి. న తావదౌకారే, యావదౌకారే. న తావద్ విసర్జనీయే. ఏవం వాక్క్రియోచ్చారణ స్యాపాయోపజనౌ భవతః, న చ శబ్దస్యాఖండైకరసస్య; తస్య సర్వత్రోపలబ్ధ త్వాత్, యత్ర ఖలు వాయు వాక్క్రియే న భవతః, తత్రోచ్చారణ శ్రవణేఽపి న భవతః. అతః శబ్దస్త్వాకాశవదేవ సదా నిత్యోఽస్తీత్యాదివ్యాకరణమతేన సర్వేషాం శబ్దానాం నిత్యత్వ మస్తి, కిముత వైదికానా మితి.

తెప్పూ॥ శబ్దము కూడ నుచ్చారణమునకు తరుపరి నశించును- పూర్వము వినబడదు. కావున ఉచ్చారణ క్రియవలె శబ్దము కూడ ననిత్యము కావచ్చును. శబ్దము నిత్యమని యెట్లంగీకరింపనగును?

ఉ॥ శబ్దము లాకాశమువలె నంతట నేకరసములై నిండియుండును. ఉచ్చారణక్రియ జరుగునంతవఱకు శబ్దములు ప్రసిద్ధములు కాక వినబడవు. ప్రాణము, వాక్కు నను వానిక్రియలచే నుచ్చారణ చేయబడినపుడే శబ్దములు ప్రసిద్ధము లగును- వినబడును॥ "గ" అను శబ్దము నుచ్చరించినపుడు ఉచ్చారణక్రియ 'గకారము'న నున్నంతవఱకు 'ఔకారమున' నుండదు. 'ఔ'కారమున నున్నపుడు గ కారవిసర్జనీయములలో నుండదు. అట్లే వాక్క్రియకును ఉత్పత్తి వినాశము లుండును; కాని, అఖండైకరసములగు శబ్దములకు మాత్రము వినాశోత్పత్తులుండవు. ఆకాశమున శబ్దప్రాప్తి యగుచున్నందున శబ్దము లాకాశమున నొకే విధమున నఖండముగ నంతట నిండియుండును. ప్రాణ, వాక్ -ఇంద్రియక్రియలు జరుగునంతవఱకు వాని యుచ్చారణ శ్రవణములు కలుగవు. కావున శబ్దము లాకాశమువలె నిత్యములే యని సిద్ధమగుచున్నది. వ్యాకరణశాస్త్ర సిద్ధాంతము ననుసరించి శబ్దములన్నియు నిత్యములైనపుడు, వేద శబ్దములను గూర్చి యిక చెప్పవలసిన దేముండును? వైదిక శబ్దములు సర్వవిధముల నిత్యములే యని భావము.

*సం॥ ఏవం జైమినిమునినాఽపి శబ్దస్య నిత్యత్వం ప్రతిపాదితమ్ "నిత్యస్తు స్యాద్దర్శనస్య పరార్థత్వాత్"*
పూ. మీమాంసా ౧-౧-౧

*అస్యాయ మర్థః– 'తు' శబ్దే నానిత్యశంకా నివార్యతే. వినాశ రహితత్వాచ్ఛబ్దో నిత్యోఽస్తి, కస్మాత్? దర్శనస్య పరార్థత్వాత్. దర్శనస్య ఉచ్చారణస్య పరస్యార్థస్య జ్ఞాపనార్థత్వాత్, శబ్దస్యానిత్యత్వం నైవ భవతి. అన్యథా అయం గోశబ్దార్థోఽస్తీత్యభిజ్ఞా, అనిత్యేన శబ్దేన భవితు మయోగ్యాఽస్తి, నిత్యత్వే సతి జ్ఞాప్యజ్ఞాపకయోర్విద్యమానత్వాత్ సర్వమేతత్సంగతం స్యాత్, అతశ్చైకమేవ గోశబ్దం యుగపదనేకేషు స్థలే ష్వనేక ఉచ్చారకా ఉపలభంతే. పునః పునస్తమేవ చేతి. ఏవం జైమినినా శబ్దనిత్యత్వే అనేకే హేతవః ప్రదర్శితాః.*

**తె॥** ఇట్లే జైమిని మునికూడ శబ్దనిత్యత్వము నంగీకరించియున్నారు-

(నిత్యస్తు...) సూత్రమునందలి 'తు' శబ్దము శబ్దమునగల యనిత్యత్వ శంకను నిరాకరించుచున్నది. శబ్దములు నిత్యములే. వానికి నాశములేదు. అర్థజ్ఞానముకొఱకే శబ్దముచ్చరింపబడుచున్నది. కావున శబ్దమనిత్యము కానేరదు. ఏశబ్దము నుచ్చరింతుమో దాని ప్రత్యభిజ్ఞయే కలుగును. శ్రవణేంద్రియము (చెవి) ద్వారా ఆ శబ్దమే జ్ఞానమున స్థిరమగును. మరల నాశబ్దమువలననే యర్థప్రతీతి కలుగును. శబ్దమనిత్యమగునెడల నర్థజ్ఞానము (నెవరు కలిగింతురు) నేది కలిగించును? ఆ శబ్దమే లేదుకదా? అర్థజ్ఞానమును గలిగించున దేది? అనేక ప్రదేశములలో నొకే క్షణమున ననేక పురుషులు గో శబ్దము నుచ్చరింతురు. అట్లే యా శబ్దమే మాటిమాటికి నుచ్చరింపబడును. ఈ కారణము వలనను శబ్దము నిత్యమే యగును. శబ్ద మనిత్యమగునెడల నీ వ్యవస్థ యెన్నడును సిద్ధింపనేరదు. జైమినిముని యిట్లనేక హేతువులతో పూర్వమీమాంసాశాస్త్రమున శబ్దము నిత్యమని నిరూపించియున్నారు.

*సం॥ అన్యచ్చ వైశేషిక సూత్రకారః కణాదముని రప్యత్రాహ*
*"తద్వచనా దామ్నాయస్య ప్రామాణ్యమ్."* వై.ద.౧-౧-౩.

*అస్యాయ మర్థః– తద్వచనా త్తయోర్ ధర్మేశ్వరయోర్ వచనాత్, ధర్మస్యైవ కర్తవ్యతయా ప్రతిపాదనా దీశ్వరేణైవోక్తత్వాచ్చ ఆమ్నాయస్య – వేదచతుష్టయస్య ప్రామాణ్యం సర్వైర్ నిత్యత్వేన స్వీకార్యమ్.*

తె॥ ఇట్లే వైశేషిక దర్శనకర్త కణాదమునియు చెప్పియున్నాడు. (తద్వచనాత్...) వేదము లీశ్వరోక్తములు - వీనియందు సత్యవిద్య, పక్షపాత రహితధర్మము ప్రతిపాదింపబడియున్నవి. అందువలన నాలుగు వేదములు నిత్యములే. ఇట్లే యెల్లరు నంగీకరించుట యుక్తము. ఈశ్వరుడు నిత్యుడు - కావున నతని విద్యయు నిత్యమే.

సం॥ తథా స్వకీయన్యాయశాస్త్రే గోతమమునిరప్యత్రాహ

"మంత్రాయుర్వేద ప్రామాణ్యవచ్చ తత్ప్రామాణ్య మాప్త ప్రామాణ్యాత్"

న్యా. ౨-౧-౬౭.

అస్యాయ మర్థః : తేషాం వేదానాం నిత్యానాం ఈశ్వరోక్తానాం ప్రామాణ్యం సర్వైః స్వీకార్యమ్.

పూ : కుతః ?

ఉః ఆప్త ప్రామాణ్యాత్ – ధర్మాత్మభిః కపటఛలాదిదోషరహితైర్ దయాలుభిః సత్యోపదేష్టృభిర్ విద్యాపారగైర్ మహాయోగిభిః సర్వైర్ బ్రహ్మాదిభిరాప్తైర్ వేదానాం ప్రామాణ్యం స్వీకృత మతః.

పూః కింవత్?

ఉః మంత్రాయుర్వేద ప్రామాణ్యవత్ – యథా సత్యపదార్థ విద్యా ప్రకాశకానాం మంత్రానాం విచారాణాం సత్యత్వేన ప్రామాణ్యం భవతి, యథా చాయుర్వేదోక్తస్యైకదేశోక్తౌషధసేవనేన రోగనివృత్త్యా తద్భిన్న స్యాపి భాగస్య తాదృశస్య ప్రామాణ్యం భవతి, తథా వేదోక్తార్థ స్యైక దేశప్రత్యక్షేణేతరస్య అదృష్టార్థ విషయస్య వేదభాగస్యాఽపి ప్రామాణ్య మంగీకార్యమ్.

ఏతత్ సూత్రస్యోపరి భాష్యకారేణ వాత్స్యాయనమునినాఽప్యేవం ప్రతిపాదితమ్–

"ద్రష్టృ ప్రవక్తృసామాన్యా చ్చానుమానమ్. య ఏవాప్తా వేదార్థానాం ద్రష్టారః ప్రవక్తారశ్చ త ఏవాయుర్వేద ప్రభృతీనా మిత్యాయుర్వేద ప్రామాణ్యవద్ వేదప్రామాణ్య మనుమాతవ్య మితి నిత్యత్వాద్ వేదవాక్యానాం ప్రమాణత్వే తత్ ప్రామాణ్య మాప్తప్రామాణ్యా దిత్యుక్తమ్".౧)

అస్యాయ మభిప్రాయః– యథా ఆప్తోపదేశస్య శబ్దస్య ప్రామాణ్యం భవతి తథా సర్వథా ఆప్తేనేశ్వరేణోక్తం వేదానాం సర్వై రాప్తైః ప్రామాణ్యే నాంగీకృతత్వాద్ వేదాః ప్రమాణ మితి బోధ్యమ్. అత ఈశ్వరవిద్యామయత్వాద్ వేదానాం నిత్యత్వ మేవోపపన్నం భవతీతి దిక్.

తె॥ న్యాయశాస్త్రమున గోతమమునిగూడ శబ్దము నిత్యమని చెప్పియున్నాడు.

(మంత్రాయుర్...) ఈశ్వరోక్తములయిన నిత్యవేదముల ప్రామాణ్యము నెల్లరు నంగీకరింపదగినది.

పూ॰ ఎందువలన?

ఉ॰ సృష్టికి నారంభమునుండి నేటివఱకును ఆప్తులైన బ్రహ్మాది మహర్షులెల్లరు వేదములను నిత్యములనియు ప్రామాణికములనియు నంగీకరించుచువచ్చిరి. ధర్మాత్ములు, కపటఛలాదిదోషరహితులు, సర్వ విద్యాయుక్తులు, మహాయోగులు, సర్వమానవుల సుఖము నపేక్షించి సత్యము నుపదేశించువారు, లేశమాత్రమైనను పక్షపాతముకాని,

---

౧) ఉపలభ్యమానేషు వాత్స్యాయన భాష్యేషు "ఇత్యుక్తమ్" స్థానే "ఇత్యయుక్తమ్" ఇతి పాఠో వర్తతే

మిథ్యాచారముకాని లేని వారును ఆప్తులనబడుదురు. వారు ప్రామాణికులు. అట్టివారే వేదములను నిత్యగుణ యుక్తములుగా ప్రమాణీకరించియున్నారు.

పూ॥ వేనివలె వేదములు ప్రమాణములు? ఇందులకు దృష్టాంతమేమి?

ఉ॥ సత్యార్థమును, సత్యవిద్యను ప్రకట మొనర్చు మంత్రములు, వైద్యశాస్త్రము నిందులకు దృష్టాంతములు. సత్యపదార్థములను దెలుపు మంత్రము (ఆలోచన)లవలె, ఆయుర్వేదమున నొక భాగమగు నౌషధములవలె వేదములు ప్రమాణములు. ఔషధము పథ్యపూర్వకముగ సేవించినందున రోగనివృత్తి కలుగును, సుఖము లభించును. ఆయుర్వేదమున నొక భాగమగు నౌషధ విషయము సత్యమైనందున మిగిలిన భాగములు కూడ సత్యములైన ప్రమాణములుగ నంగీకరింతుము.అట్లే వేదప్రామాణ్యమును నెల్లరు స్వీకరింపవలయును. వేదములలో నొక భాగమునందు చెప్పబడిన విషయము సత్యమని తెలిసినపుడు మిగిలిన వేదభాగములు - అర్థములు ప్రత్యక్షములు కానివి కూడ ప్రమాణములనియే యంగీకరింపదగును. ఆప్తపురుషుల యుపదేశము మిథ్య యెన్నడును కాదు.

(మంత్రాయుర్...) ఈ సూత్రమునకు వ్రాసిన వ్యాఖ్యానము నందు భాష్యకారుడు వాత్స్యాయనుడు, వేదములు ప్రామాణికములనియు, నిత్యము లనియు స్పష్టముగ నిట్లు ప్రతిపాదించి యున్నాడు॥- ఆప్తులు వేదార్థములను స్వయముగ జూచి యితరులకు జూపువారును- తెలుపువారు నై యున్నారు. మంత్రార్థద్రష్టలు, వక్తలునైన వారే ఆయుర్వేదాది శాస్త్రకర్తలునై యున్నారు. ఆయుర్వేదమున వారు చెప్పినదెట్లు సత్యమో, అట్లే వేదములు ప్రామాణికములు, నిత్యములనను వారి వ్యవహారము కూడ సత్యమనియే యంగీకరింపనగును. ఆప్తోపదేశములు ప్రమాణములైనట్లు, ఆప్తులకాప్తుడు, నెల్లరకు పరమ గురువునగు పరమేశ్వరునిచే నుపదిష్టములయిన వేదములు నిత్యము లనుటయు ప్రమాణముగ నంగీకరింపవలయును.

సం॥ అత్ర విషయే యోగశాస్త్రే పతంజలిముని రప్యాహ –

"స ఏష పూర్వేషా మపి గురుః కాలేనానవచ్ఛేదాత్." పా, యోగ. ౧-౧-౨౬

యః పూర్వేషాం సృష్ట్యాదా వుత్పన్నానా మగ్నివాయ్వాదిత్యాంగిరా బ్రహ్మాదీనాం ప్రాచీనానాం అస్మదాదీనా మిదానీంతనానాం అగ్రే భవిష్యతాం స సర్వేషా మేవ ఈశ్వర ఏవ గురు రస్తి 'గృణాతి–వేద ద్వారోపదిశతి సత్యానర్థాన్ స గురుః. స చ సర్వదా నిత్యోఽస్తి. తత్రకాలగతే రప్రచారత్వాత్. న స ఈశ్వరో హ్యవిద్యాదిక్లేశైః పాపకర్మభి స్తద్వాసనయా చ కదాచి ద్యుక్తో భవతి. యస్మిన్ నిరతిశయం నిత్యం స్వాభావికం జ్ఞాన మస్తి, తదుక్తత్వాద్ వేదానా మపి సత్యార్థవత్వనిత్యత్వే వేద్యే ఇతి.

తె॥ యోగ దర్శన కర్త పతంజలిమునియు వేదములు నిత్యము లనియే యంగీకరించియున్నాడు.

(స ఏష...) ప్రాచీనులయిన అగ్ని, వాయువు, ఆదిత్యుడు, అంగిరసుడు మఱియు బ్రహ్మాది మహర్షులు సృష్టి-ప్రారంభమున జన్మించిన వారు. వారి తరువాత మనవఱకుగల విద్వాంసులకు, ముందు రానున్న వారికి నెల్లరకును పరమేశ్వరుడు గురువు. వేదము మూలమున సత్యార్థముల నుపదేశించుటవలన పరమేశ్వరునకు 'గురు'వనునామము కలిగినది. అతడు నిత్యుడు. అతనియందు క్షణాదికాలగతి వ్యవహార ముండదు. అవిద్యాదిక్లేశములకు, పాపకర్మలకు, వాని వలన గలుగు వాసనాజనిత భోగములకును నతడు దూరముగ నుండును-అవి యతని నంటవు. ఆ ప్రభువునందు అనంత విజ్ఞాన మేకరసమై యెల్లప్పుడు నుండును. అట్టి పరమేశ్వరునిచే రచియింపబడిన వేదములందు సత్యార్థ బోధకత, నిత్యత్వమ్ము నిశ్చితముగ నుండునని యెల్లరు నెఱుగ వలయును.

సం॥ ఏవమేవ స్వకీయసాంఖ్యశాస్త్రే ప్రథమాధ్యాయే కపిలాచార్యోఽ వ్యత్రాహ–

"నిజశక్త్యభివ్యక్తేః స్వతః ప్రామాణ్యమ్." సూ.౫-౫౧

అస్యాయమర్థః – వేదానాం నిజశక్త్యభివ్యక్తేః పురుష సహచారి ప్రధాన సామర్థ్యాల్, ప్రకటత్వాల్ స్వతః ప్రామాణ్యనిత్యత్వే స్వీకార్యే ఇతి.

తె॥ ఇట్లే సాంఖ్య శాస్త్రమున కపిలాచార్యుడు కూడ చెప్పుచున్నాడు.

(నిజ...) పురుషునితో – పరమేశ్వరునితో నుండునట్టి ముఖ్య సామర్థ్యము వలననే వేదములు ప్రకటములైనవని. ఆ సామర్థ్యమునకు జ్ఞానశక్తియని కాని, విద్యాశక్తియని కాని నామ మంకితము చేయవచ్చును. కావున వేదముల నిత్యత్వము, స్వతః ప్రామాణ్యము రెండును నెల్లరిచే నంగీకరింపబడవలసినవే.

సం॥ అస్మిన్ విషయే స్వకీయ వేదాంతశాస్త్రే కృష్ణద్వైపాయనో వ్యాస ముని రప్యాహ.

"శాస్త్ర యోనిత్వాత్" వే. సూ.౧.౧.౩

అస్యాయమర్థః – ఋగ్వేదాదేః శాస్త్రస్య – అనేక విద్యాస్థానోపబృంహితస్య, ప్రదీపవత్ సర్వార్థావద్యోతినః, సర్వజ్ఞకల్పస్య –యోనిః కారణం బ్రహ్మ. న హీదృశస్య శాస్త్రస్య ఋగ్వేదాది లక్షణస్య సర్వజ్ఞ గుణాన్వితస్య సర్వజ్ఞా దన్యతః సంభవోఽస్తి. యద్య ద్విస్తరార్థం శాస్త్రం యస్మాత్ పురుషవిశేషాత్ సంభవతి; యథా వ్యాకరణాది పాణిన్యాదేర్ జ్ఞేయైకదేశార్థమపి స తతో వ్యధికతర విజ్ఞాన ఇతి సిద్ధం లోకే కిము వక్తవ్య మితి.

ఇదం వచనం శంకరాచార్యేణాస్య సూత్రస్యోపరి స్వకీయ వ్యాఖ్యానే గదితమ్.

పూ : అతః కిమాగతమ్ ?

ఉ : సర్వజ్ఞస్యేశ్వరస్య శాస్త్రమపి నిత్యం సర్వార్థ జ్ఞానయుక్తం చ భవితు మర్హతి. అన్యచ్చ తస్మిన్నేవాధ్యాయే–

"అత ఏవ చ నిత్యత్వమ్" వే. సూ.౧.౩.౨౯

అస్యాయ మర్థః– అత ఈశ్వరోక్తత్వాన్నిత్య ధర్మకత్వాద్ వేదానాం స్వతః ప్రామాణ్యం, సర్వ విద్యావత్త్వం, సర్వేషు కాలేష్వ వ్యభిచారిత్వాన్నిత్యత్వం చ సర్వైర్ మనుష్యైర్ మంతవ్య మితి సిద్ధమ్.

న వేదస్య ప్రామాణ్య సిద్ధ్యర్థ మన్యత్ ప్రమాణం స్వీక్రియతే, కిం త్వేతత్ సాక్షివద్ విజ్ఞేయమ్, వేదానాం స్వతః ప్రమాణత్వాత్ సూర్యవత్, యథా సూర్యః స్వప్రకాశకస్సన్ సంసారస్థాన్ మహతోఽల్పాంశ్చ పర్వతాదీన్ త్రసరేణ్వంతాన్ పదార్థాన్ ప్రకాశయతి, తథా వేదోఽపి స్వయం స్వప్రకాశః సన్ సర్వా విద్యాః ప్రకాశయతీ త్యవధేయమ్.

తె॥ ఇట్లే వేదాంత శాస్త్రమున వేదములు నిత్యములను విషయమున వ్యాసులిట్లు నిరూపించిరి– "శాస్త్రయోనిత్వాత్" అని.

(శాస్త్రయోనిత్వాత్) అను సూత్రమును వివరించుచు శంకరాచార్యులు కూడ వేదములు నిత్యములని యంగీకరించి యిట్లు వ్యాఖ్యానము వ్రాసిరి.

'ఋగ్వేదాది నాలుగు వేదములు ననేక విద్యాయుక్తములు. ప్రదీపమువలె సత్యములగు నర్థముల

నన్నింటిని ప్రకాశింప జేయును. ఆ వేదములకు కర్త-సర్వజ్ఞత్వాదిగుణములతో కూడిన పరబ్రహ్మము. సర్వజ్ఞమగు బ్రహ్మకంటె నితరుడగు జీవుడెవడును సర్వజ్ఞగుణయుక్తములగు నీ వేదములను రచించినాడనుట సంభవము కాదు. పాణిని ప్రభృతిమునులు వ్యాకరణాది శాస్త్రములను రచియించిరి. వాని యందు విద్యైక దేశము-విద్యలో నొక్కొక్క యంశము మాత్రము ప్రకటము చేసి యున్నారు. వారా శాస్త్రములను గూడ వేదముల నాశ్రయించియే వ్రాయగలిగిరి. సర్వ విద్యాయుక్తములగు వేదములను పరమేశ్వరుడు దక్క యితరుడెవ్వడును రచియింపజాలడు. పరమేశ్వరునికంటె భిన్నుడింకొకడు సర్వ విద్యాపూర్ణుడు లేడు. మఱియు పరమేశ్వరరచితములైన వేదములను జదువుట వలనను, విచారణ చేయుట వలనను పరమేశ్వరుని యనుగ్రహము వలనను మానవులకు యథాయోగ్యముగ విద్యలు తెలియును. మఱియొక తీరున తెలియవు.

పూ । దీని యభిప్రాయ మేమి? దీని వలన సిద్ధించిన దేమి?

ఉ। వేదములు నిత్యములని ఆర్యులెల్లరును సాక్ష్యమిచ్చిరి. ఈశ్వరుడు నిత్యుడు; సర్వజ్ఞుడు. అతనిచే నిర్మితములయిన వేదములును నిత్యములు; సర్వార్థములను దెలుపయోగ్యములు. అవి యితర నిర్మితము లెన్నడు కాజాలవని (పై లేఖవలన) సిద్ధమయినది.

(అత ఏవ చ నిత్యత్వమ్) ఈ సూత్రమునందును వేదములు నిత్యములనియు, స్వతః ప్రమాణములనియు, సర్వసత్యవిద్యాయుక్తములనియు వర్ణింపబడినది. సజ్జను లెల్లరు నిది యంగీకరించుట యుక్తము. వేదములు ఈశ్వరోక్తములు, నిత్య ధర్మయుక్తము లగుట వలన స్వతఃప్రమాణములు. అవి యెల్లపుడు నీశ్వరుని జ్ఞానమునందుండును కావున నిత్యములు. వేదముల ప్రామాణ్యమును నిరూపించుట కన్యప్రమాణమవశ్యము కాదు. వేదముల ప్రామాణికతను, నిత్యత్వమును నిరూపించుటలో నితర శాస్త్రములు సాక్ష్యమును మాత్ర మియ్యగలవు. వేదములు నిత్యము లనుటలో స్వయముగ వేదములే ప్రమాణములు సూర్యుడు ప్రకాశించు చున్నాడనుటకు సూర్యుడే ప్రమాణము ఇతరము కాదు. సూర్యుడు ప్రకాశ స్వరూపుడై పర్వతము మొదలు త్రసరేణు పర్యంతములగు పదార్థముల నన్నింటిని ప్రకాశింపజేయును. అట్లే వేదములు స్వయంప్రకాశములై సర్వసత్యవిద్యలను ప్రకాశింపజేయును.

సం॥ అత ఏవ స్వాయ మీశ్వరః స్వప్రకాశితస్య వేదస్య స్వస్యచ సిద్ధికరం ప్రమాణ మాహః-

"స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నా విరగ్ం శుద్ధ మపాప విద్ధమ్, కవిర్ మనీషీ పరిభూః స్వయం భూర్ యాథాతథ్యతోఽర్థాన్ వ్యదధా చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః" య, అ, ४०. మ.౮.

అస్యాయ మభిప్రాయః- యః పూర్వోక్తః సర్వవ్యాపకత్వాది విశేషణయుక్త ఈశ్వరోఽస్తి, (స పర్యగాత్) పరితః సర్వతోఽగాత్ గతవాన్ ప్రాప్తవా నస్తి, నైవైకః పరమాణురపి తద్వ్యాప్త్యా వినాఽస్తి, (శుక్రం) తద్ బ్రహ్మ సర్వజగత్ కర్తృ వీర్యవ దనంతబలవ దస్తి; (అకాయం)తత్ స్థూల సూక్ష్మ కారణ శరీరత్రయ సంబంధరహితమ్ (అవ్రణం) నైవైతస్మిం ఛ్ఛిద్రం కర్తుం పరమాణు రపి శక్నోతి, అత ఏవ ఛేద రహితత్వాదక్షతం. (అస్నావిరం) తన్నాడీ సంబంధ రహితత్వాద్ బంధనావరణ విముక్తం( శుద్ధం) తద విద్యాదిదోషేభ్యః సర్వదా పృథగ్ వర్తమానం, (అపాపవిద్ధం) నైవ తత్ పాపయుక్తం పాపకారి చ కదా చిద్ భవతి. (కవిః) సర్వజ్ఞః (మనీషీ) యః సర్వేషాం మనసా మీషీ సాక్షిజ్ఞాతాఽస్తి (పరిభూః) సర్వేషా ముపరి విరాజమానః (స్వయం భూః) యో నిమిత్తోపాదాన సాధారణ కారణత్రయ రహితః; స ఏవ సర్వేషాం పితా; న హ్యస్య కశ్చిత్ జనకః; స్వసామర్థ్యేన సహైవ సదా వర్తమానోఽస్తి. (శాశ్వతీభ్యః) య ఏవం భూతః సచ్చిదానంద స్వరూపః పరమాత్మా, సః సర్గాదౌ స్వకీయాభ్యః శాశ్వతీభ్యో నిరంతరాభ్యః

(సమాభ్యః) ప్రజాభ్యః (యాథాతథ్యతో) యథార్థ స్వరూపేణ వేదోపదేశేన (అర్థాన్ వ్యదధాత్) విహితవాన్; అర్థాత్, యదా యదా సృష్టిం కరోతి, తదా తదా ప్రజాభ్యో హితా యాదిసృష్టౌ సర్వ విద్యాసమన్వితం వేద శాస్త్రం స ఏవ భగవానుపదిశతి, అత ఏవ నైవవేదానా మనిత్యత్వం కేనాపి మంతవ్యమ్; తస్య విద్యాయాః సర్వదైకరస వర్తమానత్వాత్.

తె॥ ఇట్లే పరమేశ్వరుడు, తన్నుగూర్చియు, తనచే ప్రకాశింపజేయబడిన వేదముల నిత్యత్వమును గూర్చియు, వాని స్వతః ప్రామాణ్యమును గూర్చియు నుపదేశించెను. ఆ విధము నీ క్రింద వ్రాయు చున్నాము:-

(స పర్యగాత్) ఈ మంత్రము పరమేశ్వరుని గూర్చియు నతనిచే నిర్మితములయిన వేదములను గూర్చియు జ్ఞానము కలిగించును.

మంత్రార్థము : (స పర్యగాత్) ఈశ్వరుడు సర్వ వ్యాపకుడు మున్నగు విశేషణములతో కూడినవాడు. అతడు సమస్త జగత్తునందు వ్యాపించి పరిపూర్ణుడై యున్నాడు. ఒక్క పరమాణువుగూడ పరమేశ్వరుని నుండి వేఱుగా నుండదు. ఆ బ్రహ్మము (శుక్రం) సర్వజగత్తును రచించునదై యున్నది. అనంత విద్యాబలయుక్తమునై యున్నది. (అకాయం) అది స్థూల సూక్ష్మ కారణ శరీర రహితము. శరీర సంయోగము పరమేశ్వరున కెన్నడు నుండదు. అతడెన్నడు జన్మింపడు, (అవ్రణం) అతడు భేద రహితుడగుటచే నక్షతుడు. పరమాణువు కూడ నతనిలో ఛిద్రము కలిగింపజాలదు. (అస్నావిరం) అతడు నాడులచే బంధింపబడడు. శరీరమునందు వాయువు, రక్తము నాడులచే బంధింప బడునట్లు పరమేశ్వరుడు నాడులచే బంధింపబడడు. (శుద్ధం) అవిద్య అజ్ఞానము మున్నగు క్లేశరూప సర్వదోషములకు నతడు దూరుడు. (అపాపవిద్ధం) ఈశ్వరుడు పాపయుక్తుడు కాడు. పాపముల నెన్నడుజేయడు. అతడు స్వభావతః ధర్మాత్ముడు, ధర్మస్వరూపుడు. (కవిః) అతడు సర్వము నెఱుగును. (మనీషీ) అతడు సర్వాంతర్యామి. భూత భవిష్యద్ వర్తమాన కాలిక వ్యవహారముల నన్నింటిని సరిగా దెలిసి కొనును. (పరిభూః) అతడన్నింటికి పైన విరాజిల్లు చున్నాడు. (స్వయంభూః) అతడెన్నడు పుట్టడు. అతనికి కారణము లేదు. అతడే యన్నింటికి కారణము, అనాది; అనంతుడు కావున నతడే యందఱికి తల్లి; తండ్రియును తన సత్యసామర్థ్యములతోడనే యెల్లపుడు వర్తిల్లును. ఇట్టి లక్షణములతో గూడి యా పరమేశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడై యున్నాడు. (శాశ్వతీభ్యః) అతడు సృష్ట్యారంభమున స్వసామర్థ్యమున నెల్లపుడునుండు తన ప్రజలకు మోక్ష ప్రాప్తి కొఱకు (అర్థాన్ వ్యదధాత్) సత్యములగు నర్థములను నుపదేశించెను. ఇట్లే పరమేశ్వరుడు ప్రతి సృష్టి యందును నారంభమున ప్రజలహితము నుద్దేశించి సర్వ విద్యా యుక్తములగు వేదముల నుపదేశించును. ప్రతి ప్రళయమునందును వేదములు పరమేశ్వరుని జ్ఞానమున నిలిచి యుండును. అందువలన నవి నిత్యములనియే యంగీకరింపవలయును. పరమేశ్వరుని విద్య యెల్లపుడు నేకరసమై యుండును.

సం॥ యథా శాస్త్రప్రమాణేన వేదా నిత్యాః సన్తీతి నిశ్చయోఽస్తి, తథా యుక్త్యాఽపి. తద్యథా:- "నాసత ఆత్మ లాభో, న సత ఆత్మ హానమ్. యోఽస్తి స భవిష్యతి" ఇతి న్యాయేన వేదానాం నిత్యత్వం స్వీకార్యమ్

ప్ర : కుతః ?

ఉ : యస్య మూలం నాస్తి ; నైవ తస్య శాఖాదయః సంభవితు మర్హంతి; వంధ్యాపుత్ర వివాహ దర్శనవత్. పుత్రో భవేచ్చేత్తదా వంధ్యాత్వం న సిద్ధ్యేత్; న చాస్తి చేత్ పునస్తస్య వివాహ దర్శనే కథం భవతః? ఏవమే వాత్రాపి విచారణీయమ్. యదీశ్వరే విద్యాఽనంతా న భవేత్సకథ ముపదిశేత్? న చోపదిశేచ్చే న్నైవ కస్యాపి మనుష్యస్య విద్యా సంబంధో దర్శనం చ స్యాతామ్? నిర్మూలస్య

ప్రరోహాభావాత్. నహ్యస్మిన్ జగతి నిర్మూల ముత్పన్నం కించిద్ దృశ్యతే.

యస్య సర్వేషాం మనుష్యాణాం సాక్షా దనుభవోఽస్తి, సోఽత్ర ప్రకాశ్యతే – యస్య ప్రత్యక్షోఽనుభవ స్తస్యైవ సంస్కారః, యస్య సంస్కార–స్తస్యైవ స్మరణం జ్ఞానం; తేనైవ ప్రవృత్తి నివృత్తీ భవతో నాన్యథేతి. తద్యథా–యేన సంస్కృత భాషా పఠ్యతే. తస్య తస్యా ఏవ సంస్కారో భవతి; నాన్యస్యాః యేన దేశ భాషాఽధీయతే. తస్య తస్యా ఏవ సంస్కారో భవతి, నాతోఽన్యథా. ఏవం సృష్ట్యాదా వీశ్వరోపదేశ–అధ్యాపనా భ్యాం వినా నైవ కస్యాఽపి విద్యాయా అనుభవః స్యాత్, పునః కథం సంస్కారః? తేన వినా కుతః స్మరణమ్; న చ స్మరణేన వినా విద్యాయా లేశోఽపి కస్యచిద్ భవితు మర్హతి.

తె|| శాస్త్ర ప్రమాణముల వలన వేదముల నిత్యత్వము నిరూపింపబడినట్లే, యుక్తులతోను వేద నిత్యత్వము సిద్ధమగును. అది యెట్లనః–

అసత్తు నుండి సత్తేర్పడుట–అభావమునుండి భావము కలుగుట – యెన్నడును జరుగదు. అట్లే, సత్తు – అసత్తు, భావము – అభావమ్మును కాదు. సత్యమువలననే ముందు ప్రవృత్తి కలుగును. వస్తువు కాని దాని నుండి మఱియొక వస్తు వే విధముగను కలుగజాలదు. ఈ న్యాయము ననుసరించియు వేదములు నిత్యము లనియే యంగీకరింపవలయును.

పూ : ఎందువలన?

ఉ : మూలము – మొదలు లేని దానికి కొమ్మలు, ఆకులు, పూవులు, ఫలములు, మున్నగునవి యెట నుండి కలుగును? కలుగ నేరవు. ఎవడేని తాను వంధ్యాపుత్రుని వివాహము జూచి నాడనన యతని మాట యసంభవమగును. పుత్రుడుగల స్త్రీ వంధ్య యెట్లగును? పుత్రుడే లేనపుడతనికి వివాహ మెట్లగును? ఆ వివాహము నింకొక డెట్లు చూచును? కావున నీశ్వరునియం దనంతవిద్య యుండబట్టియే, మానవుల కత డా విద్య నుపదేశించి యున్నాడు. లేకున్న నతడెట్లుపదేశించును? జగము నెట్లు రచియింపగలడు? ఈశ్వరుడు తన విద్యను మానవుల కుపదేశింపకున్న, ఏ మానవునకును విద్య – యథార్థజ్ఞానము ఎన్నడును కలిగెడిది కాదు. మూలము లేని వస్తు వేర్పడుట కాని, వృద్ధి నొందుట కాని జగమున నసంభవము. కావున పరమేశ్వరుని మూలరూప వేద విద్య – మానవులలో వృక్ష రూపమున వృద్ధినొందినట్లు గుర్తింపవలయును.

మఱియు నింకొక యుక్తియు నిందు గలదు. సర్వమానవులకు నే పదార్థానుభవము – సాక్షాత్ ప్రత్యక్ష జ్ఞానము కలుగునో, అద్దానినే వారు ప్రకటింతురు. చూడుడు. ఏ వస్తు జ్ఞానము సాక్షాత్తుగ గలుగునో యా వస్తు విషయక సంస్కారము (మనస్సున) నేర్పడును. సంస్కారము వలన స్మరణ మేర్పడును. జ్ఞానము వలనను, స్మరణము వలనను ఇష్టమగు వస్తు సంపాదనకు ప్రవృత్తియు, అనిష్ట వస్తువు నుండి నివృత్తియు గలుగును లేకున్న గలుగదు. సంస్కృత భాష జదువు వాని మనస్సున నా భాషకు సంబంధించిన సంస్కారము గలుగును. ఇతర భాషకు చెందిన సంస్కార మేర్పడదు. ఇట్లే యీశ్వరుడు వేదోపదేశము జేయకున్న మనుజుని మనస్సునందు విద్యానుభవము కలుగదు. అనుభవము కలుగకున్న సంస్కారము గలుగదు. విద్యా సంస్కారములు లేనపుడు దాని స్మరణమును గలుగదు. స్మరణ లేకుండ మనుష్యునిలో విద్యా లేశము కూడ కలుగదు.

ఈయుక్తి వలన, ఈశ్వరుని యుపదేశము వలన వేదములను విని వానిం జదివి, విచారించుటవలననే మానవులకు విద్యాసంబంధమగు ననుభవము, తజ్జన్య సంస్కారము గలుగుచు వచ్చుచున్నవని తెలియుచున్నది.

సం॥ పూ. ప. కించ భోః! మనుష్యాణాం స్వాభావికీ యా ప్రవృత్తిర్ భవతి, తత్ర సుఖ దుఃఖానుభవశ్చ, తయా ఉత్తరోత్తరకాలే క్రమాను క్రమాద్ విద్యావృద్ధిర్ భవిష్యత్యేవ. పునః కిమర్థ మీశ్వరాద్వేదోత్పత్తేః స్వీకార ఇతి?

ఉ : ఏవం ప్రాప్తే బ్రూమః :- ఏతద్ వేదోత్పత్తి ప్రకరణే పరిహృతమ్, తత్రైవనిర్ణయః-యథా నేదానీ మన్యేభ్యః పఠనేన వినాకశ్చిదపి విద్వాన్ భవతి, తస్య జ్ఞానోన్నతిశ్చ; తథాదౌ ఈశ్వరోపదేశాగమనేన వినా కస్యాపి విద్యా జ్ఞానోన్నతిర్ భవేత్, అశిక్షిత బాలకవనస్థ వత్. యథోపదేశ మంతరా న బాలకానాం వనస్థానాం చ విద్యా మనుష్య భాషా విజ్ఞానే అపి భవతః; పున ర్విద్యోత్పత్తేస్తు కా కథా? తస్మాదీశ్వరా దేవ యా వేద విద్యాఽఽగతా. సా నిత్యైవాఽస్తి. తస్య సత్య గుణవత్వాత్.

యన్నిత్యం వస్తు వర్తతే, తస్య నామగుణకర్మాణ్యపి నిత్యాని భవన్తి; తదాధారస్య నిత్యత్వాత్. నై వాధిష్ఠానమంతరా నామగుణ కర్మాదయో గుణాః స్థితిం లభన్తే, తేషాం పరాశ్రితత్వాత్. యన్నిత్యం నాస్తి, న తస్యైతాన్యపి నిత్యాని భవంతి. నిత్యంచ. ఉత్పత్తి వినాశాభ్యా మితరద్ భవితు మర్హతి. ఉత్పత్తిర్ హి పృథగ్ భూతానాం ద్రవ్యాణాం యా సంయోగ విశేషాద్ భవతి; తేషా ముత్పన్నానాం కార్యద్రవ్యాణాం సతి వియోగే వినాశశ్చ సంఘాతాభావాత్. అదర్శనం చ వినాశః. ఈశ్వరస్య ఏకరసత్వాన్నైవ తస్య సంయోగ వియోగాభ్యాం సంస్పర్శోఽపి భవతి. అత్ర కణాదమునికృతం సూత్రం ప్రమాణమస్తి-

"స దకారణవ న్నిత్యమ్" వై.ద.౪,౪.౧.

అస్యాయ మర్థః ;- యత్ కార్యం కారణాదుత్పద్య విద్యమానం భవతి, తదనిత్య ముచ్యతే; తస్య ప్రాగుత్పత్తే రభావాత్, యత్తు కస్యాపి కార్యం నైవ భవతి, కింతు సదైవ కారణ రూపమేవ తిష్ఠతి, తన్నిత్యం కథ్యతే.

యద్ యత్ సంయోగజన్యం, తత్తత్ కర్త్రపేక్షం భవతి; కర్తాఽపి సంయోగజన్యశ్చేత్తర్హి తస్యాప్యన్యోఽన్యః కర్తాఽస్తి త్యాగచ్ఛేత్. ఏవం పునః పునః ప్రసంగా దనవస్థాపత్తిః యచ్చ సంయోగేన ప్రాదుర్భూతం; నైవ తస్య ప్రకృతి పరమాణ్వాదీనాం సంయోగకరణే సామర్థ్యం భవితు మర్హతి, తస్మా త్తేషాం సూక్ష్మత్వాత్. యద్ యస్మాత్ సూక్ష్మం, తత్ తస్యాత్మా భవతి, స్థూలే సూక్ష్మస్య ప్రవేశార్హత్వాత్; అయోఽగ్నివత్. యథా సూక్ష్మత్వాదగ్నిః, కఠినం స్థూల మయః ప్రవిశ్య తస్యావయవానాం పృథగ్ భావం కరోతి; తథా జలమపి పృథివ్యాః సూక్ష్మత్వాత్ తత్కణాన్ ప్రవిశ్య సంయుక్త మేకం పిండం కరోతి, ఛినత్తి చ. తథా పరమేశ్వరః సంయోగ వియోగాభ్యాం పృథగ్ భూతో విభు రస్తి, అతో నియమేన రచనం వినాశం చ కర్తు మర్హతి, న చాన్యథా. యథా సంయోగ వియోగాంతర్గతత్వాన్నాస్మ దాదీనాం ప్రకృతి పరమాణ్వాదీనాం సంయోగ వియోగకరణే సామర్థ్య మస్తి, తథేశ్వరేఽపి భవేత్.

అన్యచ్చ : యతః సంయోగ వియోగారంభో భవతి. స తస్మాత్ పృథగ్ భూతోఽస్తి తస్య సంయోగ వియోగారబ్ధ *స్యాదికారణత్వాత్. ఆదికారణ స్యాభావా త్సంయోగ వియోగారంభ స్యానుత్పత్తేశ్చ.

ఏవం భూతస్య సదా నిర్వికార స్వరూప స్యాజస్యానాదేర్ నిత్యస్య సత్య సామర్థ్య స్యేశ్వరస్య సకాశాద్ వేదానాం ప్రాదుర్భావాత్. తస్య జ్ఞానే సదైవ వర్తమానత్వాత్ సత్యార్థవత్వం నిత్యత్వం చైతేషా మస్తీతి సిద్ధమ్-

ఇతి వేదానాం నిత్యత్వ విచారః

*"ఆరబ్ధస్య" "స్థానే" "ఆరంభస్య" ఇతి పాఠః అధికోపయుక్తః

తెలుపు : మనుష్యులలో స్వాభావికముగు ప్రవృత్తి యున్నది. దానితో చేష్టాదులు గలుగును. అందువలన సుఖ దుఃఖానుభవము కలుగును. దాని వలన క్రమముగ వారిలో విద్యావృద్ధి తప్పక యేర్పడును. అపిమీదు మానవులు వేదములను రచియింతురు. కావున వేదముల నీశ్వరుడు రచించిన ట్లేల యంగీకరింపవలయును?

ఉః దీనికి సమాధానము వేదోత్పత్తి ప్రకరణమున నింతకుముందే చెప్పబడినది. "ప్రస్తుత కాలమున నితర విద్వాంసులనుండి విద్య నేర్చుకొనక యెవరును విద్వాంసులగుట లేదు. జ్ఞానము వృద్ధి నొందదు. ఇయ్యది చూచుచున్నాము. ఇట్లే సృష్టి కారంభమున నీశ్వరుడు వేదముల నుపదేశింపకున్న పక్షమున నెవరును విద్యావంతులు కాక యుండెడివారు. ఎవరికిని జ్ఞానము కూడ వృద్ధి నొందెడిది కాదు" అని యట చెప్పబడినది. ఇందులకు నశిక్షిత బాలకులను, వనముననుండెడి వ్యక్తులను దృష్టాంతముగ నుల్లేఖించి యున్నాము. దీని వలన పరమేశ్వరుని యుపదేశము వలన వేద విద్య మానవులలో వ్యాపించి, వారిలో విద్యాజ్ఞానములు వృద్ధినొందుట సులభమైనదని తెలియవలయును. పరమేశ్వరుని గుణములన్నియు సత్యములే. కావున నతని విద్యయగు వేదము కూడ సత్యము-నిత్యమే-యగును. నిత్యపదార్థము యొక్క గుణ కర్మములు, నామధేయమును నిత్యములే యగును. ఆధారము నిత్యముగుటయే యిందులకు కారణము. ఆధారము లేక గుణ కర్మములు, నామము స్థిరములు కావు. అవి యెల్లపుడును ద్రవ్యము నాశ్రయించి యుండునవి. అనిత్య వస్తువుల నామ గుణ కర్మము లనిత్యములే యగును.

ఉత్పత్తి వినాశములు లేనిది నిత్యమగును. వేఱు వేఱుగనుండు ననేక ద్రవ్యముల సంయోగ విశేషమున నేర్పడుట యుత్పత్తి యనబడును. సంయుక్త ద్రవ్యముల వియోగము- కారణ రూపమున పరమ సూక్ష్మములై పరమాణు రూపావస్థ - వినాశ మనబడును. సంయోగముచే నేర్పడి స్థూలములైన ద్రవ్యములు చక్షురాదీంద్రియములచే దెలియబడును. ఆ స్థూల ద్రవ్యములలోని సంయోగము నశించి పరమాణువులు వేఱు వేఱుగ నైనపుడు సూక్ష్మము లగుటవలన నా ద్రవ్యము లింద్రియగోచరములు కావు. ఈ స్థితియే నాశమనబడును. అదర్శమే- ఇంద్రియములచే దెలియబడకుండుటయే నాశము. సంయోగముచే నేర్పడి, వియోగముచే నశించునదియే కార్యము - అనిత్యము అనబడును. సంయోగ వియోగములకు వేఱుగ నుండుదాని కుత్పత్తి వినాశము లెన్నడు నుండవు. ఈశ్వరునియందు సంయోగ వియోగము లుండవు. అతడెల్లపుడు నఖండుడు, నేకరసుడై యుండును. కావున నతడు నిత్యుడు. ఇందులకు కణాదసూత్రము ప్రమాణము.

(స దకారణవ న్నిత్యమ్) కారణములవలన నుత్పన్నమైయుండు కార్యము అనిత్యము. అది యుత్పత్తికి పూర్వ మారూపమున నుండదు. మట్టితో ఘట మేర్పడి, నాశము నొందును - కారణమగు మట్టి రూపమును బొందును. ఇట్లే పరమేశ్వరుని సామర్థ్యము మూలమున తన కారణమైన ప్రకృతినుండి జగత్తేర్పడి-ఉత్పన్నమై - స్థూల రూపమును బొంది కొంత కాల ముండును. మరల ప్రళయమున తన స్థూల రూపమును విడిచి సూక్ష్మ కారణ రూపమున (నెల్లపుడు) నుండును. ఎల్లపమిడు నుండునదియు, కారణ రహితమును, సదా కారణ రూపమున నుండు నదియు నగు వస్తువు నిత్యమనబడును. (ఈశ్వరుడట్టివాడే).

సంయోగముచే నేర్పడు వస్తువు కర్త నవశ్య మపేక్షించును. కర్మకర్త నపేక్షించును. అట్లే నియమము నియంతను. కార్యము కారణమును నెల్లపమిడపేక్షించును. ఎవడేని కర్తను గూడ మఱి యొకడు చేసి యుండ వచ్చుననిన నతని నిట్లు ప్రశ్నింపవలయును.'ఆకర్త నెవడు చేసెను?' అతని నింకొకడు చేసెనని చెప్పిన 'మరల నా కర్తను చేసినవాడెవడు?' అని ప్రశ్నింప నగును. అందువలన నీ ప్రశ్నలు మర్యాద-హద్దు- వ్యవస్థ లేనివై యనవస్థాదోషయుక్తము లగును. (కావున మూల కారణమగు కర్తకు కర్త యుండడు.) సంయోగముచే

నేర్పడు వస్తువు ప్రకృతి, లేక, పరమాణువులు మున్నగు సూక్ష్మవస్తువులను సంయుక్తము చేయుటకు సమర్థము కాదు. సంయోగ జన్య వస్తువుకంటె పరమాణ్వాదులు సూక్ష్మములు. స్థూల వస్తువు సూక్ష్మవస్తువులను సంయుక్తము చేయజాలదని భావము. సూక్ష్మ వస్తువు స్థూల వస్తువునకు ఆత్మ యగును. సూక్ష్మము స్థూలమున వ్యాప్తమై యుండును. లోహపిండము (ఇనుపగుండు) న నగ్ని ప్రవేశించి దాని సర్వావయవము లందును వ్యాప్తమగును. జలము పృథివియందు జేరి దాని కణములను సంయుక్త మొనర్చి దానిని ముద్దగా జేయును. అట్లే సూక్ష్మ వస్తువు స్థూల వస్తువున జేరి దానిని ఛేదింపనుగలదు. అట్లే పరమేశ్వరుడు సర్వసంయోగములకు, వియోగములకు వేత్తై యన్నిటి యందు వ్యాపకుడై యున్నాడు. అతడు ప్రకృతికంటె-పరమాణువుల కంటె నత్యంత సూక్ష్ముడై యున్నాడు. అతడొకచేతన పదార్థము. అందువలన నతడు పరమాణువులను సంయుక్తము చేసి జగత్తుగ నిర్మించుచున్నాడు. ఈశ్వరుడు పరమాణ్వాది పదార్థములకంటె స్థూలుడగు నెడల వానిని గ్రహించుటకును, కార్యరూపమున రచించుటకును నశక్తుడయ్యెడివాడు. స్థూల పదార్థములు సూక్ష్మ పదార్థములను నియమింప సమర్థములు కావు. దేని వలన సంయోగ వియోగము లారంభించునో యది వాని కంటె వేఱుగ నుండును. అది సంయోగ వియోగ ముల కాది కారణము. అట్లే యాది కారణము లేక, సంయోగ వియోగములు కూడ నసంభవములగును. కావున, సదా నిర్వికార స్వరూపుడు, అజుడు, అనాది, నిత్యుడు, సత్య సామర్థ్య యుక్తుడు, అనంత విద్యా వంతుడునగు నీశ్వరునుండి వేదములు ప్రకటమగుటవలనను, అతని జ్ఞానమున వేదము లెల్లపుడు నుండుట వలనను నవి సత్యార్థయుక్తము లనియు, నిత్యములనియు నెల్లరు నంగీకరింపవలయును. ఇట్లు వేదములు నిత్యములని సంక్షేపముగ నిట నాలోచింపబడినది.

వేద నిత్యత్వ విచారణ సమాప్తము.

# అథ వేద విషయ విచార ః

సం॥ అత్ర చత్వారో వేద విషయాః సన్తి, విజ్ఞానకర్మోపాసనాజ్ఞానకాండ భేదాత్.

(౧) తత్రాదిమో విజ్ఞాన విషయో హి సర్వేభ్యో ముఖ్యోఽస్తి, తస్య పరమేశ్వరా దారభ్య తృణ పర్యంత పదార్థేషు సాక్షాద్ బోధాన్వయత్వాత్. తత్రాపి ఈశ్వరానుభవో ముఖ్యోఽస్తి.

పూ ః కుతః !

ఉ ః అత్రైవ సర్వేషాం వేదానాం తాత్పర్య మస్తి. ఈశ్వరస్యాఖిలః సర్వేభ్యః పదార్థేభ్యః ప్రధానత్వాత్. అత్ర ప్రమాణాని—

"సర్వే వేదా యత్పద మామనన్తి, తపాంసి సర్వాణి చ యద్ వదంతి, యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ బ్రవీమ్యోమి త్యేతత్." కఠ. వ ౨ మం. ౧ ౫.

"తస్య వాచకః ప్రణవః" యోగ. సూ.అ.౧ పా. ౧. సూ. ౨౭

"ఓ ౩ మ్ ఖం బ్రహ్మ" యజు. అ. ౪౦. మం॰ ౧౭.

"ఓమితి బ్రహ్మ" తైత్తిరియారణ్యకే ప్ర. ౭ అను. ౮.

"తత్రాపరా ఋగ్వేదో యజుర్వేద ః సామవేదోఽథర్వవేదః, శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిష మితి. అథ పరా యయా తదక్షర మధిగమ్యతే." ముం. ౧ ఖం. ౧. మం ౫.

ఏషా మర్థః ః— (సర్వే వేదాః) యత్ పరమం పదం మోక్షాఖ్యం పరబ్రహ్మ ప్రాప్తి లక్షణం సర్వానందమయం సర్వదుఃఖేతర దస్తి, తదేవోంకారవాచ్య మస్తి. (తస్య) తస్యేశ్వరస్య ప్రణవ ఓంకారో వాచకోఽస్తి. వాచ్యశ్చేశ్వరః. (ఓమ్) ఓమితి పరమేశ్వరస్య నామాఽస్తి.

తదేవ పరం బ్రహ్మ సర్వే వేదా ఆమనంతి, ఆ సమంతాదభ్యస్యంతి, ముఖ్యతయా ప్రతిపాదయంతి, (తపాంసి) సత్య ధర్మానుష్ఠానాని తపాం స్యపి తదభ్యానపరాణ్యేవ సంతి. (యదిచ్ఛంతో) బ్రహ్మచర్య గ్రహణ ముపలక్షణార్థం, బ్రహ్మచర్య గార్హస్థ్య వాన ప్రస్థ సంన్యాసాశ్ర మాచరణాని సర్వాణి తదేవామనన్తి, బ్రహ్మ ప్రాప్త్యభ్యాస పరాణి సన్తి. యద్ బ్రహ్మేచ్ఛంతో విద్వాంస స్తస్మిన్నధ్యానమానా పదం త్యుపదిశంతి చ. హే. నచికేతః! అహం యమో, యదీదృశం పద మస్తి, తదేతత్తే తుభ్యం, సంగ్రహేణ — సంక్షేపేణ బ్రవీమి.

(తత్రాపరా....) వేదేషు ద్వే విద్యే వర్తేతే అపరా పరాచేతి. తత్ర యయా పృథివీ మారభ్య ప్రకృతి పర్యంతానాం పదార్థానాం జ్ఞానేన యథావ దుపకార గ్రహణం క్రియతే, సా—అపరేత్యుచ్యతే. యయా చాదృశ్యాది విశేషణ యుక్తం సర్వశక్తిమద్ బ్రహ్మ విజ్ఞాయతే, సా పరా. అర్థా దపరాయాః సకాశాత్ అత్యుత్కృష్టేతి వేద్యమ్.

తె॥ వేదముల నిత్యత్వమును గూర్చి వివరించిన తదుపరి, వేదములందు చెప్పబడిన విషయములను, వాని భేదములను గూర్చి యీ ప్రకరణమున విచారింపబడును. వేదములం దనేక విషయములున్నవి. కాని ముఖ్యముగా వానిని నాల్గు విధములుగ విభజింపవచ్చును. ౧. విజ్ఞానము (సర్వ పదార్థ యథార్థజ్ఞానము)

౨. కర్మము ౩. ఉపాసన ౪. జ్ఞానము. ఈ విభాగములను కాండలనియు వ్యవహరింతురు.

౧ విజ్ఞానకాండః- కర్మోపాసనా జ్ఞానములను మూడింటిని సరిగా నుపయోగించుకొనుటయు, పరమేశ్వరుడు మొదలు తృణపర్యంతముగల పదార్థములను బాగుగ దెలిసికొని, వాని వలన తగిన లాభమును బొందుటయు విజ్ఞాన మనబడును.

(౧) పరమేశ్వరుని సరిగా నెఱిగి యతని యాజ్ఞలను చక్కగా పాలించుచుండవలయును. (౨) ఈశ్వరునిచే రచియింపబడిన పదార్థములను, వాని గుణ స్వభావములను బాగుగ విచారించి, వానిచే నగు కార్యములను సిద్ధము చేసికొనవలయును. ఈశ్వరు డే పదార్థములనే ప్రయోజన సిద్ధికై నిర్మించెనో, వాని నందుల కుపయోగించుకొన వలయునని భావము. పై రెండు విషయములందును ఈశ్వర ప్రతిపాదనము ముఖ్యము.

పూ : కారణమేమి?

ఉః వేదముల ముఖ్య తాత్పర్యము ఈశ్వర ప్రతిపాదనమే యై యున్నది. ఈ విషయమున నీ క్రింది ప్రమాణములను జూడుడు. (సర్వే వేదాః) ఏది పరమ పదమో, దేనిని మోక్షమందురో, దేని యందు పరబ్రహ్మను బొంది యెల్లపుడు సుఖమున నుందురో, సర్వానందయుక్తుడు, సర్వదుఃఖరహితుడునగు నే పరమేశ్వరుని నామము 'ఓమ్'అనబడునో, అతనిని బోధించుటయే వేదములకు ముఖ్య తాత్పర్యము. ఇందులకే యోగ సూత్రము ప్రమాణము (తస్య) పరమేశ్వరుని నామము 'ఓమ్'ప్రణవము (ఓమ్) పరమేశ్వరుని వాచకము. అతడు. వాచ్యుడు. (ఓ౩మ్ ఖం) ఆకాశమువలె వ్యాపకుడగుటవలన 'ఓ౩మ్', 'ఖమ్' అనునవి పరమేశ్వర నామములని యజుర్వేదము. ఇట్లే తైత్తిరీయారణ్యకమునందును 'ఓమ్' పరమేశ్వరుని నామమని చెప్పబడినది. కఠోపనిషత్తు ననుసరించి చూచినను. వేదములన్నియు నా బ్రహ్మ ప్రాప్తి నొనరించుటకే ప్రవృత్తములైనవని తెలియుచున్నది. జగద్వర్ణనాదు లన్నియు నాపరమేశ్వరుని ప్రాప్తికే యగును. బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వాన ప్రస్థము, సంన్యాసము నను నాలుగాశ్రమములలో నొనరించు సత్యాచరణరూపకర్మములు కూడ నీశ్వరుని ప్రాప్తి కొఱకే చేయబడును. విద్వాంసు లెల్లరు బ్రహ్మ ప్రాప్తికై యత్నింతురు. బ్రహ్మమును గూర్చియితరులకు నుపదేశింతురు. ఓ నచికేత! తప్పక పొందదగు బ్రహ్మమును గూర్చియే నీకు నేను సంక్షేపముగ జెపెమెదును' అని యముడు నచికేతునితో ననెను.

(తత్రాపరా....) వేదములందు పరా, అపరా యని పేర్లుగల రెండు విద్యలున్నవి. తృణము మొదలు ప్రకృతి పర్యంతము గల పదార్థముల గుణదోషముల నెఱిగి, వానితో సిద్ధమగు కార్యములను నిర్వహించుటను నేర్పునది-అపర విద్య యనబడును, సర్వ శక్తిమంతుడగు పరమేశ్వరుని యథార్థజ్ఞానము గలిగించునది పరవిద్యయనబడును. ఇయ్యది యపరవిద్యకంటె మిక్కిలి యుత్తమము. అపర విద్యవలన నేర్పడు నుత్తమ ఫలమే పరావిద్య యగును.

*సం॥ "యత్త దదృశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షుః శ్రోత్రం, తదపాణి పాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం యద్ భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః.*

ముం ౧. ఖం., ౧. మం.౬

తె॥ముండకోపనిషత్తునందు నిట్లున్నది.

'జ్ఞానేంద్రియముల కా బ్రహ్మమందదు. ఎవరికి నది చిక్కవడదు. దానికి గోత్రము లేదు;

బ్రాహ్మణత్వాది వర్ణము లేదు; చక్షుః శ్రోత్రాది ఇంద్రియములు దానికి లేవు; దానికి హస్తపాదములు లేవు; అది నిత్యము, వ్యాపకము; అది సర్వాంతర్యామి; సూక్ష్మము; నాశము లేనిది;దోషము లేనిది. సంపూర్ణ జగత్తునకు కారణమగు నా బ్రహ్మమును ధ్యానము ద్వారా సాక్షాత్కారము చేసికొనువారు దృఢవ్రతులగుదురు.

సం॥ అన్యచ్చ :– "తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః దివీవ చక్షు రాతతమ్."

ఋగ్. ౧,౨.౨౫.

అస్యాయ మర్థః– తత్ (విష్ణోః) వ్యాపకస్య పరమేశ్వరస్య (పరమం) ప్రకృష్టానంద స్వరూపం (పదం) పదనీయం– సర్వోత్త మోపాయైర్ మనుష్యైః ప్రాపణీయం మోక్షాఖ్య మస్తి. తత్ (సూరయః) విద్వాంసః సదా సర్వేషు కాలేషు పశ్యంతి. కీదృశం తద్ (ఆతతమ్) ఆ సమంతాత్ తతమ్ – విస్తృతమ్ యద్దేశకాలవస్తుపరిచ్ఛేదరహిత మస్తి. అతః సర్వైః సర్వత్ర తదుపలభ్యతే. తస్య బ్రహ్మస్వరూపస్య విభుత్వాత్. కస్మాం కిమివ? (దివీవ చక్షు రాతతమ్) దివి మార్తండ ప్రకాశే నేత్రదృష్టేర్ వ్యాప్తిర్ యథా భవతి, తథైవ తత్పదం బ్రహ్మాపి వర్తతే. మోక్షస్య చ సర్వస్మా దధికోత్కృష్టత్వాత్ తదేవ ద్రష్టుం ప్రాప్తు మిచ్ఛంతి. అతో వేదా విశేషేణ తస్యైవ ప్రతిపాదనం కుర్వతి.

ఏత ద్విషయకం వేదాంత సూత్రం వ్యాసో ప్యాహ :–

"తత్తు సమన్వయాత్." వేదాం. ౧–౧–౪

అస్యాయ మర్థః– తదేవ బ్రహ్మ సర్వత్ర వేదవాక్యేషు సమన్వితం ప్రతిపాదిత మస్తి :క్వచిత్ సాక్షాత్, క్వచిత్ పరంపరయా చ, అతః పరమోఽర్థో వేదానాం బ్రహ్మైవాస్తి.

తథా యజుర్వేదే ప్రమాణమ్–

"యస్మాన్న జాతః పరో అన్యో అస్తి. య ఆవివేశ భువనాని విశ్వా. ప్రజాపతిః ప్రజయా సంరరాణ స్త్రీణి జ్యోతీంషి సచతే స షోడశీ." అ.౮–౩౬.

ఏతస్యార్థః– (యస్మాత్) నైవ పరబ్రహ్మణః సకాశాత్,(పరః) ఉత్తమః పదార్థః (జాతః) ప్రాదుర్ భూతః– ప్రకటః (అన్యః) భిన్నః కశ్చిద స్యస్తి. (ప్రజాపతిః) ప్రజాపతి రితి బ్రహ్మణో నామాస్తి. ప్రజాపాలకత్వాత్. (య ఆవివేశ భువనాని) యః పరమేశ్వరః (విశ్వా) విశ్వాని సర్వాణి. (భువనాని) సర్వలోకాన్, వ్యాప్తవా నస్తి. (సంరరాణః) సర్వ ప్రాణిభ్యోఽత్యంతం సుఖం దత్తవాన్ సన్. (త్రీణి జ్యోతీంషి) త్రీణి అగ్ని సూర్య విద్యుదాఖ్యాని సర్వజగత్ ప్రకాశకాని. (ప్రజయా) జ్యోతిషోఽన్యయా సృష్ట్యా సహ తాని;(సచతే) సమవేతాని కరోతి, కృతవా నస్తి. (సః) అతః స పరమేశ్వరః (షోడశ) యేన షోడశ కలా జగతి రచితా స్స విద్యంతే యస్మిన్ యస్య వా తస్మాత్ స షోడశీ త్యుచ్యతే, అతోఽయ మేవ పరమోఽర్థో వేదితవ్యః.

"ఓమిత్యేత దక్షర మిదం సర్వం తస్యోపవ్యాఖ్యానమ్" మాండూ. ౧

ఇదం మాండూక్యోపనిష ద్వచన మస్తి. అస్యాయ మర్థ :– ఓమిత్యేతద్ యస్య నామాస్తి, తదక్షరమ్. యన్నక్షీయతే. కదాచిద్ యచ్చరాచరం జగ దస్తితే వ్యాప్నోతి, తద్ బ్రహ్మైవాస్తీతి విజ్ఞేయమ్. అస్యైవ సర్వైర్ వేదాదిభిః శాస్త్రైః సకలేన జగతా వోపగతం వ్యాఖ్యానం ముఖ్యతయా క్రియతే, అతోఽయం ప్రధాన విషయోఽస్తీ త్యవధార్యమ్.

కించ ప్రధానస్యాగ్రేఽప్రధానస్య గ్రహణం భవితు మర్హతి. 'ప్రధానాప్రధానయోః ప్రధానే కార్యసంప్రత్యయః' ఇతి వ్యాకరణ మహాభాష్య వచన ప్రామాణ్యాత్. ఏవమేవ సర్వేషాం వేదానాం ఈశ్వరే ముఖ్యేఽర్థే ముఖ్య తాత్పర్య మస్తి. తత్ ప్రాప్తి ప్రయోజనా ఏవ సర్వ ఉపదేశాః సంతి. అతస్తదుపదేశపురఃసరేణైవ త్రయాణాం కర్మోపాసనా జ్ఞాన కాండానాం పారమార్థిక వ్యావహారిక ఫల సిద్ధయే యథాయోగ్యోపకారాయ చానుష్ఠానం సర్వైర్ మనుష్యైర్ యథావత్ కర్తవ్య మితి.

తె॥ మఱియు నీ విషయమున ఋగ్వేద ప్రమాణము - (విష్ణుః...) వ్యాపకుడైన పరమేశ్వరుని, (పరమం) అత్యంతోత్తమము, నానంద స్వరూపమును, (పదం) పొందదగినదియునగు మోక్షమును, (సూరయః) విద్వాంసులు, (సదా పశ్యంతి) సర్వ కాలములందును చూతురు. ఈశ్వరు డన్నింటను వ్యాపించి యున్నాడు. అతనిలో దేశ కాలవస్తు భేదము, ('ఒకచో నున్నాడు - ఇంకొకయెడ లేడు, ఒక కాలమున నున్నాడు- ఇంకొక కాలమున లేడు, ఒక వస్తువునందున్నాడు, మఱియొక వస్తువు నందు లేడు' అను భేదము) లేదు. కావున నతడెల్ల స్థలముల నెల్లరికి ప్రాప్తుడై ( పదవాచ్యుడై ) యున్నాడు. అందులకు దృష్టాంతము (దివీవ చక్షురాతతమ్) సూర్యకాంతి యావరణములేని యాకాశమునందు వ్యాప్తమై యుండును. ఆ కాంతియందు నేత్ర దృష్టి వ్యాప్త మగును. అట్లే బ్రహ్మపదము కూడ స్వయం ప్రకాశమై సర్వత్ర వ్యాప్తమై యున్నది. దానికి మించిన యుత్తమ పద ప్రాప్తి యింకొకటి లేదు. కావుననే నాలుగు వేదములు నా పదమును ప్రాప్తింపజేయుటకే విశేషముగ ప్రతిపాదించుచున్నవి.

ఈ విషయమున వ్యాసరచిత వేదాంత శాస్త్ర ప్రమాణము (తత్తు సమన్వయాత్) వేద వాక్యములం దన్నింటియందును విశేషించి బ్రహ్మ ప్రతిపాదనమే యున్నది. కొన్ని యెడల సాక్షాత్తుగను (Direct), మఱికొన్ని తావులలో పరంపరగాను, బ్రహ్మమే వర్ణింపబడినది. కావున పరబ్రహ్మ పరమేశ్వరుడే వేదములకు ముఖ్యవిషయము.

ఇందులకు (యస్మాన్న జాతః....) అను యజుర్వేదమంత్రము కూడ ప్రమాణ మగుచున్నది.

(యస్మాన్న జాతః) ఆ పరబ్రహ్మము కంటె, (అన్యః) ఇంకొకడు. (పరః) ఉత్తముడు (జాతఃనాస్తి) ప్రకటమైనవాడు లేడు, (యః ఆవి వేశ భువనాని విశ్వా) అతడు సర్వలోకములందును వ్యాప్తుడై ప్రవిష్టుడై యున్నాడు, (ప్రజాపతిః) అతడే జగత్పాలకుడు, అధ్యక్షుడును, (సంరరాణః) సర్వ ప్రాణులకును సుఖము నిచ్చువాడు అతడు (త్రీణిజ్యోతీంషి) అగ్ని, సూర్యుడు, విద్యుత్తనుమూడు జ్యోతిస్సులు, (ప్రజయా) మిగిలిన జగద్వస్తువులతోపాటు, (సచతే) సృష్టించి జగత్తున చేర్చి యున్నాడు. (సః షోడశీ) కావున నతనికి షోడశి యని పేరు.

౧. ఈక్షణము=యథార్థవిచారణ.
౨. ప్రాణము=విశ్వమును ధరించు నది
౩ శ్రద్ధా=సత్యమున విశ్వాసము.
౪. ఆకాశము.
౫. వాయువు
౬. అగ్ని
౭. జలము
౮. పృథివి
౯. ఇంద్రియములు
౧౦. మనస్సు - జ్ఞానము
౧౧. అన్నము
౧౨. వీర్యము-బలము-పరాక్రమము
౧౩. తపస్సు-ధర్మానుష్ఠానము సత్యాచరణము
౧౪. మంత్రము-వేద విద్య.
౧౫. కర్మములు-సర్వచేష్టలు.
౧౬. నామములు-దృశ్యాదృశ్య వస్తువుల సంజ్ఞలు.

పదునాఱు (షోడశ) కళ లివియే. ఇవి యన్నియు నీశ్వరునందే యుండును. అందువలన నీతడు 'షోడశి' అనబడును. ప్రశ్నోపనిషత్తునందు నాఱవ ప్రశ్నలో నీ పదునాఱు కళలు ప్రతిపాదింపబడియున్నవి.

అందువలన వేదములకు ముఖ్యవిషయము పరమేశ్వరుడే.అతడు కాక మిగిలిన జగత్తంతయు వేదములకు గౌణవిషయము- అప్రధాన విషయము. మాండూక్యోపనిషత్తునందును('ఓమిత్యేదక్షర....)' 'ఓమ్' పద వాచ్యుడు అక్షరుడు - నాశము లేనివాడు. అతడు చరాచర జగత్తునందంతట వ్యాపించి యున్నాడు. అతడే 'బ్రహ్మ' అని వర్ణింపబడినది.

వేదాది సత్యశాస్త్రముల కిదియే ముఖ్య విషయము. 'ప్రధానాప్రధానములలో ప్రధానమునే గ్రహింపవలయును' అని వ్యాకరణమహాభాష్య సిద్ధాంతము. కావున వేదముల ముఖ్య తాత్పర్యము - పరమేశ్వరుని ప్రతిపాదించి, యతని ప్రాప్తి గలిగించుటయే అని నిశ్చితము. ఆ పరమేశ్వరుని యుపదేశ రూపములగు వేదములందు బోధింపబడిన, జ్ఞాన కర్మోపాసనలను మూడు కాండల యనుష్ఠానమువలన నిహపరలోక వ్యవహారఫలసిద్ధి కలుగుననియు, పరుల కుపకారమొనర్చుటకు పురుషార్థమొనర్పవలయుననియు, మనుష్య దేహధారణ జేసినందుల కిదియే ఫలమనియు నెఱుగనగును.

సం॥ ౨. తత్ర ద్వితీయో విషయః కర్మకాండాఖ్యః, స సర్వః క్రియా మయోఽస్తి. నైతేన వినా విద్యాభ్యాసజ్ఞానే అపి పూర్ణే భవతః.

పూ; కుతః?

ఉః బాహ్య మానస వ్యవహారయోర్ బాహ్యాభ్యంతరే యుక్తత్వాత్. స చానేకవిధోఽస్తి.

(౧) ఏకః పరమ పురుషార్థ సిద్ధ్యర్థోఽర్థాద్ య ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసనాఽఽజ్ఞాపాలన ధర్మానుష్ఠానజ్ఞానేన మోక్షమేవ సాధయితుం ప్రవర్తతే.

(౨) అపరో లోకవ్యవహారసిద్ధయే యో ధర్మేణార్థకామౌ నిర్వర్తయితుం సంయోజ్యతే.

(౧) స యదా పరమేశ్వరస్య ప్రాప్తి మేవ ఫలముద్దిశ్య క్రియతే. తదాఽయం శ్రేష్ఠఫలాపన్నో నిష్కామసంజ్ఞాం లభతే; అస్య ఖల్వనంత సుఖేన యోగాత్.

(౨) యదా చార్థకామఫలసిద్ధ్యవసానో లౌకిక సుఖాయ యోజ్యతే. తదా సోఽవరః – సకామ ఏవ భవతి. అస్య జన్మమరణఫలభోగేన యుక్తత్వాత్. న చాగ్నిహోత్ర మారభ్యాశ్వమేధపర్యంతేషు యజ్ఞేషు

"స ప్రాణ మసృజత్ ప్రాణా చ్ఛ్రద్ధాం ఖం వాయుర్
జ్యోతి రాపః పృథివీంద్రియం మనః
అన్న మన్నాత్ వీర్యం తపో మంత్రాః కర్మలోకా
లోకేషు చ నామ చ" ప్ర, ఉ. ౬-౪.
(పదునాఱు కళలను దెలుపు నీ మంత్రములు ప్రశ్నోపనిషత్తునుండియుల్లేఖింపబడినవి

• "స ఈక్షాం చక్రే కస్మిన్నహ ముత్క్రాంత ఉత్క్రాంతో భవిష్యామి, కస్మిన్ వా ప్రతిష్ఠితే ప్రతిష్ఠాస్యామితి." ప్ర. ఉ. ౬-3

సుగంధి మిష్టపుష్టరోగనాశకగుణైర్ యుక్తస్య సమ్యక్ సంస్కారేణ శోధితస్య ద్రవ్యస్య వాయు వృష్టి జలశుద్ధి కరణార్థ మగ్నౌ హోమః క్రియతే, స తద్ద్వారా సర్వజగత్ సుఖకార్యేవ భవతి. యం చ భోజనాచ్ఛాదన యాన కలాకౌశల యంత్రసామాజిక నియమ ప్రయోజన సిద్ధ్యర్థం విధత్తే, సోఽ ధికతయా స్వసుఖాయైవ భవతి.

## ౨. కర్మకాండ

తె॥ వేదప్రతిపాద్య విషయములలో రెండవది కర్మకాండ. ఇందు క్రియలు ప్రధానముగ నుండును. క్రియ నొనరింపక జ్ఞానము, విద్యాభ్యాసము రెండును సిద్ధింపవు.

పూ॥ కారణమేమి?

ఉ॥ బాహ్యవ్యవహారములకు, మానసవ్యవహారములకు బాహ్యాభ్యంతరములతో సంబంధముండును. అది యనేక విధములైనను ముఖ్యముగ రెండు విధములు.

(౧) ఒకటి పరమార్థమార్గము. దీనివలన పరమార్థము సంపాదింపనగును. ఇందు పరమేశ్వరుని (స్తుతి)- అతని సర్వశక్తిమత్త్వాది గుణములను గీర్తించుట, ఉపదేశించుట, శ్రవణము చేయుట, (ప్రార్థన)- ఈశ్వరుని సహాయము నర్థించుట, (ఉపాసన) - ఈశ్వరుని స్వరూపము నెఱింగి యందు మగ్నమగుట, (ఉపాసన వేదములందు, పాతంజల యోగశాస్త్రమునందు చెప్పిన రీతిని జేయవలయును.) (ఆజ్ఞాపాలన) సత్య భాషణాదులైన యీశ్వరోపదిష్టములగు నాజ్ఞలను పాలించుట, (ధర్మానుష్ఠాన - జ్ఞాన) ధర్మస్వరూపము నెఱింగి, న్యాయాచరణ మొనర్చుట మున్నగునవి యున్నవి. పక్షపాతమును విడిచి యన్ని విధముల సత్యమును గ్రహించి, యసత్యమును త్యజించుటయే న్యాయాచరణ మనబడును. పైన వర్ణింపబడిన విషయములన్నియు పరమార్థ మార్గమునకు చెంధియున్నవి. కర్మకాండలో నిదియే ప్రధాన భాగము. మనుజుడు దీనిమూలమున మోక్షప్రాప్తికి ప్రవృత్తుడగును.

(౨) రెండవమార్గము లోకవ్యవహారసిద్ధి కుపయోగించును. దానివలన ధర్మయుక్తములగ నర్థకామములను సాధించుట కనువగు సాధనములు లభించును. (౧) మోక్షము - పరమేశ్వరప్రాప్తి కొఱకు ధర్మయుక్తములగు సర్వకార్యములను బాగుగ నిర్వర్తించునెడల నది నిష్కామమార్గ మనబడును. ఇందు సాంసారిక భోగముల ననుభవింప వలయుననెడి కోరికలుండవు. దీని ఫలము శ్రేష్ఠమనబడును. అది యక్షయ సుఖరూపఫలము. (౨) సాంసారిక సుఖముల ననుభవింపవలయునను కోరికతో ధర్మయుక్తకర్మము లాచరించుమార్గము - సకామమార్గమనబడును. ఇందువలన గలుగు ఫలము నశ్వరమగును. కర్మముల నాచరించి, వానివలన గలుగు ఫలములను నింద్రియముల మూలమున ననుభవించుచు మనుష్యుడు జన్మమరణములనుండి విడివడ జాలడు. అగ్నిహోత్రము మొదలు - అశ్వమేధమువఱకు గల కర్మములలో నాలుగు విధములయిన ద్రవ్యములతో హోమమొనర్పవలయును.

(౧) సుగంధయుక్తములయిన వస్తువులు - కస్తూరి, కుంకుమపువ్వు మొదలగునవి.

(౨) తియ్యని వస్తువులు - బెల్లము, తేనె మున్నగునవి.

(౩) పుష్టిని గలిగించు వస్తువులు - నేయి, పాలు, అన్నము మున్నగునవి.

(౪) రోగ నాశకములు-సోమలతాది ఓషధులు.

ఈనలు విధములయిన వస్తువులను సంపాదించి, వానిలో దోషములు లేకుండజూచి, వానిని తగిన పరిమాణములలో కలిపి యగ్నిలోయుక్తి పూర్వకముగ హోమ మొనర్పవలయును. అందువలన

వాయువు, వర్షజలము శుద్ధము లగును. కాగా ఎల్లరికి సుఖము కలుగును. భోజనాచ్ఛాదనములు, విమానాది వాహనములు, కలాకుశలత, యంత్రములు, వీని ప్రాప్తి కొఱకు, సామాజిక నియమ పాలన కొఱకు జేయు కర్మముల వలన కర్తకే యధికాంశమున సుఖము కలుగును.

సం॥ అత్ర పూర్వమీమాంసాయాః ప్రమాణమ్

"ద్రవ్య సంస్కారకర్మసు పరార్థత్వా త్ఫలశ్రుతి రర్థవాదః స్యాత్" అ, ४పా.౩.సూ.౧

"ద్రవ్యాణాం తు క్రియార్థానాం సంస్కారః క్రతు ధర్మఃస్యాత్" అ. ४.పా.౩.సూ.౮.

అనయో రర్థః– ద్రవ్యం, సంస్కారః, కర్మచైతత్త్రియం యజ్ఞ కర్త్రా కర్తవ్యమ్. ద్రవ్యాణి పూర్వోక్తాని చతుః సంఖ్యాకాని సుగంధాది గుణయుక్తా న్యేవ గృహీత్వా తేషాం పరస్పర ముత్త మోత్తమగుణ సంపాదనార్థం సంస్కారః కర్తవ్యః. యథా సూపాదీనాం సంస్కారార్థం సుగంధయుక్తం ఘృతం చమసే సంస్థాప్య అగ్నౌ ప్రతప్య సధూమే జాతే సతి తం సూపపాత్రే ప్రవేశ్య తన్ముఖం బద్ధ్వా ప్రచాలయేచ్ఛ, తదా యః పూర్వం ధూమవద్ బాష్ప ఉత్థితః స సర్వః సుగంధో హి జలం భూత్వా ప్రవిష్టః సన్ సర్వం సూపం సుగంధ మేవ కరోతి; తేన పుష్టిరుచికరశ్చ భవతి. తథైవ యజ్ఞాద్ యో బాష్పో జాయతే, స వాయుం వృష్టిజలం చ నిర్దోషం కృత్వా సర్వజగతే సుఖాయైవ భవతి. అత్రోక్తం–

"యజ్ఞోఽపి తస్యై జనతాయై కల్పతే, యత్రైవం విద్వాన్ హోతా భవతి.

ఐ.బ్రా.మం,.౧.అ.౨

జనానాం సమూహో జనతా, తత్సుఖాయైవ యజ్ఞో భవతి. యస్మిన్ యజ్ఞేఽమునా ప్రకారేణ విద్వాన్ సంస్కృత ద్రవ్యాణా మగ్నౌ హోమం కరోతి.

పూః కుతః?

ఉ ః తస్య పరార్థత్వాత్. యజ్ఞః పరోపకారాయైవ భవతి, అత ఏవ ఫలస్యశ్రుతిః శ్రవణ మర్థవాదోఽనర్థవారణాయ భవతి. తథైవ హోమ క్రియార్థానాం ద్రవ్యాణాం పురుషాణాం చ యః సంస్కారో భవతి, స ఏవ క్రతుధర్మో బోధ్యః. ఏవం క్రతునా యజ్ఞేన ధర్మో జాయతే, నాన్యథేతి.

తె॥ ఈ విషయమున పూర్వమీమాంస–ధర్మ శాస్త్ర మిట్లు చెప్పుచున్నది.

(ద్రవ్య) ద్రవ్యము, సంస్కారము, ఉపయోగము నను నీ మూడును యజ్ఞకర్త కవశ్యకరణీయములు. పూర్వము చెప్పబడిన సుగంధాది యుక్తములగు చతుర్విధ ద్రవ్యముల బాగుగ సంస్కరించి, అగ్నిలో హోమము చేయుటవలన జగత్తున కత్యంత ముపకారము జరుగును. గరిటెలో నేయి వేసి, యందు సుగంధ ద్రవ్యము – జీలకఱ్ఱ, మెంతులు మున్నగునవి వేసి, వానిని బాగుగ నగ్నిపై తప్తమొనర్చి, పప్పులోను, కూరలలోను తిరుగబోత పెట్టినపుడు, పప్పు, కూరలు సుగంధితములగును. నేతి యణువులు, సుగంధ పదార్థములలోని యంశము లాపప్పు మున్నగు పదార్థములలో గలిసి, వానిని రుచికరములుగను, పుష్టికారకములుగను, సుగంధయుక్తములుగను జేయును. అట్లే యజ్ఞము వలన గూడ హోమము చేయబడు ద్రవ్యములు వాయువునందు జేరి వాయువును, వర్షపు జలమును నిర్దోషములుగ జేయును. సుగంధితములుగ నొనర్చును. జగత్తున కంతటికిని సుఖము నొడగూర్చును.

ఇందులకై తరేయ బ్రాహ్మణము ప్రమాణము.

(యజ్ఞోపి....) జనత - మానవ సముదాయమునకు సుఖము కలిగించు నిమిత్తము యజ్ఞము జరుగును. సంస్కరింపబడిన ద్రవ్యములను నగ్నియందు హోమ మొనర్చు విద్వాంసుడైన మానవుడు స్వయముగ నానందించును.

పూ : ఎందువలన?

ఉ : యజ్ఞము పరోపకారము కొఱకే చేయబడును. మానవుడు జగత్తున కెంతగా నుపకారము చేయునో, వాని కంతగా నీశ్వరుని వ్యవస్థవలన సుఖము ప్రాప్తించును. కావున యజ్ఞమునందలి ఫలశ్రవణ మర్థవాదమగును. ఇట్లు యజ్ఞమును స్తుతించుటవలన మనుష్యుడు దానిని జేయబూనుకొనును. యజ్ఞ మనర్థ దోషములను వారించి, జగదానందమును వృద్ధినొందించును.

(ద్రవ్యాణాం తు....) హోమ ద్రవ్యములను బాగుగ సంస్కరింపవలయును-శుద్ధిచేయవలయును. హోమము చేయదలచు వ్యక్తి హోమ విద్యను బాగుగ నేర్వ వలయును. ఇట్టి యజ్ఞములను చేయుట వలన నెల్లరకు నుత్తమఫలము లభించును. యజ్ఞకర్తకు మిక్కలిగ లాభము చేకూరును.

సం॥ అత్ర ప్రమాణమ్:- "అగ్నేర్ వై ధూమో జాయతే, ధూమా దభ్రమ్, అభ్రాత్ వృష్టిః, అగ్నేర్ వా ఏతా జాయంతే, తస్మా దాహ తపోజా ఇతి." శ.కాం.౫.అ.౩.

అస్యాభిప్రాయః- అగ్నేః సకాశాద్ ధూమబాష్పౌ జాయేతే; యదా ఽయమగ్నిర్ వృక్షౌషధి వనస్పతి జలాది పదార్థాన్ ప్రవిశ్య తాన్ సంహతాన్ విభిద్య, తేభ్యో రసం చ పృథక్ కరోతి; పునస్తే లఘుత్వ మాపన్నా వాయ్వాధారేణోపర్యాకాశం గచ్ఛంతి, తత్ర యావాన్ జలరసాంశః తావతో బాష్పసంజ్ఞాఽస్తి.యశ్చ నిఃస్నేహో భాగః, స పృథివ్యంశోఽస్తి. అత ఏవోభయ భాగయుక్తో ధూమ ఇత్యుచ్యతే. పునర్ ధూమ గమనానంతర మాకాశే జలసంచయోభవతి. తస్మా దభ్రం-ఘనా జాయంతే, తేభ్యో వాయుదలేభ్యో వృష్టిర్ జాయతే. అతోఽగ్నే రేవైతా యవాదయ ఓషధయో జాయంతే. తాభ్యోఽన్నమ్, అన్నాద్ వీర్యం, వీర్యా చ్ఛరీరాణి భవన్తీతి.

తె॥ ఈ విషయమున శతపథ బ్రాహ్మణ ప్రమాణము-

(అగ్నే....) అగ్నియందు వ్రేల్చబడు హోమ ద్రవ్యములనుండి ధూమము, బాష్పము నుత్పన్నము లగును. అగ్ని-వృక్షములు, ఓషధులు, వనస్పతులు, జలము మున్నగు పదార్థములందు ప్రవేశించి, వానిని వేఱు జేసి, వానియందలి రసమును వాని నుండి వేఱు చేయును. అదియే దాని స్వభావము. ఆ రసము తేలికయై వాయువు ద్వారమున నాకాశమున జేరును. అందలి జలాంశము 'బాష్ప' మనబడును. శుష్కాంశముపార్థివము. ఈ రెండింటి మేళనమే ధూమము. ఈ పరమాణువు వాయ్వాధారమున ఆకాశమునందొండొంటితో గలిసి మేఘము లగును. వాని వలన వృష్టి యేర్పడును. కావున నగ్నివలన యవాద్యోషధులు, వాని వలన నన్నము, దాని వలన వీర్యము-ధాతువు, అద్దాని నుండి శరీరము, తన్మూలమున కర్మములు నేర్పడుచున్నవి.

సం॥ అత్ర విషయే తైత్తిరీయోపనిషద్య్వుక్తమ్-

'తస్మాద్ వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః ఆకాశాద్ వాయుః వాయోరగ్నిః అగ్నే రాపః

---

౧ ఈ అర్థవాదశబ్దార్థము వేదసంజ్ఞాప్రకరణమున వివరింపబడును

అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధిభ్యోఽన్నమ్, అన్నాద్ రేతః రేతసః పురుషః, స వా ఏష పురుషోఽ న్నరసమయః ఆ.వ.ప్ర.అ.

స తపోఽతప్యత్, తప స్తప్త్వా అన్నం బ్రహ్మేతి వ్యజానాత్. అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే, అన్నేన జాతాని జీవంతి, అన్నం ప్రయన్త్యభిసంవిశంతి. (ఇతి భృగువల్ల్యాం ద్వితీయేఽనువాకే.)

అన్నం బ్రహ్మేత్యుచ్యతే జీవనస్య బృహద్ధేతుత్వాత్. శుద్ధాన్న జల వాయ్వాదిద్వారైవ ప్రాణినాం సుఖం భవతి. నాతోఽన్యథేతి.

తె॥ తైత్తిరీయోపనిషత్ ప్రమాణము:-

(తస్మాద్ వా.....) పరమాత్మని యనంతసామర్థ్యమువలన నాకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి - మున్నగు తత్త్వము లేర్పడినవి. ఆ భూమియం దోషధులు, పైరులు, వాని నుండి అన్నము- ధాన్యాదులు- వాని వలన వీర్యము - ధాతువు - దాని నుండి శరీరమును గలిగినది. కావున నీ పురుషుడన్నరసమయు డనిపించుకొనుచున్నాడు. పూర్వోక్తక్రమము ననుసరించి శరీరాదుల యుత్పత్తి, స్థితి లయములు వాని యందే జరుగుచుండును.

ఈ యుపనిషత్తులోనే ముందింకను నిట్లు చెప్పబడినది. ( స తపోఽతప్యత్....) భృగువు బ్రహ్మ నెఱుగుటకు తపస్సు జేసెను. చేసి, అన్నమే బ్రహ్మమని యెంచెను. అన్నమువలననే సర్వ ప్రాణుల శరీరము లేర్పడు చున్నవి. అన్నములోనే యవి జీవించుచున్నవి. అట్లే మృత్యుసమయమున ప్రాణుల శరీరములు పృథివ్యాదులందు లీనమగును.

కావున నెల్ల జీవుల జీవనమునకు ముఖ్య సాధనమగుట వలన అన్నమే బ్రహ్మమందురు. హోమము వలన వాయువు, జలము, ఓషధులు శుద్ధములగును. అందువలన సర్వ జగత్తునకు సుఖ మొదవును. వాయ్వాదుల యశుద్ధివలన దుఃఖము కలుగును. కావున వాయ్వాదుల శుద్ధి యవశ్యము సేయవలయును.

సం॥ తత్ర ద్వివిధః ప్రయత్నోఽస్తి, ఈశ్వరకృతో, జీవకృతశ్చ. ఈశ్వరేణ ఖలు అగ్నిమయః సూర్యో నిర్మితః, సుగంధ పుష్పాదిశ్చ. స నిరంతరం సర్వస్మాజ్జగతో రసా నాకర్షతి. తస్య, సుగంధ దుర్గంధాణు సంయోగిత్వేన తజ్జల వాయూ అపి ఇష్టానిష్టగుణ యోగా న్మధ్యమగుణౌ భవతః, తయోః సుగంధ దుర్గంధ మిశ్రి తత్వాత్. తజ్జల వృష్టా వోష ధ్యన్న రేతః శరీరాణ్యపి మధ్యమాన్యేవ భవంతి. తన్మధ్యమత్వాద్ బల బుద్ధి వీర్య పరాక్రమ ధైర్య శౌర్యాదయోఽపి గుణా మధ్యమా ఏవ జాయంతే.

పూ : కుతః ?

ఉ : యస్య యాదృశం కారణ మస్తి తస్య తాదృశమేవ కార్యం భవతీతి దర్శనాత్. అయం ఖల్వీశ్వరసృష్టేర్ దోషో నాస్తి.

పూ : కుతః ?

ఉ : దుర్గంధాది వికారస్య మనుష్య సృష్ట్యంత ర్భావాత్. యతో దుర్గంధాదివికారస్యోత్పత్తిర్ మనుష్యాదిభ్య ఏవ భవతి. తస్మాదస్య నివారణ మపి మనుష్యై రేవ కరణీయ మితి.

తె॥ రెండు విధములగు ప్రయత్నములవలన నవి సిద్ధించుచున్నవి. ఒక ప్రయత్న మీశ్వరకృతము. రెండవది జీవకృతము. ఈశ్వరకృతప్రయత్నమువలన అగ్ని రూప సూర్యుడు, సుగంధయుక్త పుష్పాదులు

జనించినవి. సూర్యుడు - నిరంతరము జగమునందలి సర్వరసములను పూర్వము చెప్పినట్లు పైకి నాకర్షించును. పుష్పాదులందలి సుగంధము కూడ దుర్గంధమునునివారించుచుండును. కాని, లోకమున పరమాణువులు సుగంధ దుర్గంధ యుక్తములగుటవలన జలవాయువులు మధ్యమ (సుగంధ దుర్గంధ మిశ్రిత) గుణములు గలవి యగును. అట్టి వర్షపు జలమువలన నేర్పడు నోషధులు, అన్నము, వీర్యము, శరీరాదులు మధ్యమగుణములు గలవియే యగును. వాని సంబంధము వలన బుద్ధి, బలము, పరాక్రమము, ధైర్య శౌర్యాది గుణములు నన్నియు మధ్యమములే యగును. కారణ మేమనః- కారణమునుబట్టియే కార్యమేర్పడును. దుర్గంధమువలన వాయువు, వాననీరు దోషయుక్తము లగుట నెల్లయెడల గననగును. ఈ దోషము ఈశ్వర సృష్టిది కాదు. కారణమేమి? యందు రేని, మనుష్యులవలననే దుర్గంధాది వికారము లేర్పడును. అందువలన నీ దోషమును మనుష్యులే నివారించుకొనవలసి యున్నది.

సం॥ యథేశ్వరేణాజ్ఞాదత్తా "సత్యభాషణ మేవ కర్తవ్యం, నానృత "మితి; యస్తా ముల్లంఘ్య ప్రవర్తతే, స పాపీయాన్ భూత్వా, క్లేశం చేశ్వరవ్యవస్థయా ప్రాప్నోతి. తథా "యజ్ఞః కర్తవ్య" ఇతీయమప్యాజ్ఞా తేనైవ దత్తాస్తి; తామపి య ఉల్లంఘయతి, సోఽపి పాపీయాన్ సన్ క్లేశవాంశ్చ భవతి.

పూ : కుతః ?

ఉః సర్వోపకారాకరణాత్. యత్ర ఖలు యావాన్ మనుష్యాది ప్రాణి సముదాయో భవతి, తత్ర తావానేవ దుర్గంధసముదాయోజాయతే. న చైవాయ మీశ్వరసృష్టినిమిత్తో భవితు మర్హతి.

పూ : కుతః ?

ఉ : తస్య మనుష్యాది ప్రాణి సముదాయ నిమిత్తోత్పన్నత్వాత్. యత్తు ఖలు మనుష్యాః స్వసుఖార్థం హస్త్యాది ప్రాణినా మేకత్ర బాహుల్యం కుర్వన్తి, అతస్తజ్జన్యోఽప్యధికో దుర్గంధో మనుష్యసుఖేచ్ఛానిమిత్త ఏవ జాయతే. ఏవం వాయువృష్టి జలదూషకః సర్వో దుర్గంధో మనుష్య నిమిత్తాదేవోత్పద్యతే; అతస్తస్య నివారణ మపి మనుష్యా ఏవ కర్తు మర్హంతి. తేషాం మధ్యాన్మనుష్యా ఏవోపకారానుపకారౌ వేదితు మర్హాః సంతి. మననం విచారః, తద్యోగాదేవ మనుష్యత్వం జాయతే. పరమేశ్వరేణ హి సర్వదేహధారి ప్రాణినాం మధ్యే, మనస్వినో విజ్ఞానం కర్తుం యోగ్యా మనుష్యా ఏవ సృష్టాః. తద్దేహేషు పరమాణు సంయోగ విశేషేణ విజ్ఞానభవనానుకులానా మవయవానా ముత్పాదితత్వాత్. అతస్త ఏవ ధర్మాధర్మయోర్ జ్ఞాన మనుష్ఠానాననుష్ఠానే చ కర్తు మర్హంతి న చాన్యే. అస్మాత్ కారణాత్ సర్వోపకారాయ సర్వైర్ మనుష్యై ర్యజ్ఞః కర్తవ్య ఏవ.

తె॥ ఈశ్వరుడు (వేదము మూలమున) సత్యభాషణాది ధర్మముల నాచరించుటకును, మిథ్యాభాషణాద్యధర్మ వ్యవహారములను జేయకుండుటకును నాదేశించి యున్నాడు. అందులకు విపరీతముగ నడచువాడు మిక్కిలి పాపియగును. ఈశ్వరుని న్యాయ వ్యవస్థ వలన నతనికి క్లేశము గలుగును. మఱియు నీశ్వరుడు యజ్ఞము చేయుటకును మానవుల నాజ్ఞాపించి యున్నాడు. అది చేయనివాడును పాపియై దుఃఖముల ననుభవించును.కారణ మేమనః- ఎల్లరకు నుపకారముజేయు యజ్ఞ కర్మము నొనర్పనందున మానవులు దోషు లగుదురు. మనుష్యాది ప్రాణి సముదాయ మెక్కడ నెంత యెక్కువ యగునో, అక్కడ నంతగా దుర్గంధము కూడ నెక్కుడగును. ఇయ్యది యీశ్వర సృష్టివలన గలిగిన దోషము కాదు. ఇందులకు హేతు వేమన :

దుర్గంధాదిదోషములు మనుష్యాది ప్రాణుల నిమిత్తముననే కలుగును. మానవులు తమ సుఖమును గోరి హస్తి, అశ్వము మున్నగు ప్రాణి వర్గము నొకచో జేర్తురు. కావున నా పశువుల వలన నధికముగ నేర్పడు దుర్గంధము మానవులు తమ సుఖము కోరి తెచ్చుకొనినదే. ఇట్లు వాయువును, వృష్టి జలమును దూషితము

చేయు దుర్గంధము మానవ నిమిత్తముగ నేర్పడినది; కావున దానిని వారించుటకు తగిన యత్నమును వారే చేయవలసి యుందురు. జగమున నున్న దేహధారిప్రాణులలో మనుష్యుడుత్తముడు; అతడే యుపకారానుపకారముల నెఱుగ గలడు. 'మనన' మన నాలోచనము. మననము చేయగలవాడు కావుననే, 'మనుష్యు'డని పిలువబడుచున్నాడు. ఈశ్వరుడు పరమాణ్వాదుల సంయోగ విశేషములతో విజ్ఞానోత్పత్తి కనుకూలముగ మానవ దేహము నిర్మించియున్నాడు. అందువలననే మానవుడు తన జ్ఞానమును పెంచుకొనగల్గుచున్నాడు. కావుననే యతడు ధర్మము ననుష్ఠించుటకును, అధర్మమును చేయకుండుటకును యోగ్యుడగుచున్నాడు. ఇతర ప్రాణులట్లు కాదు. కావున నితర ప్రాణుల కుపకారము చేయుటకు యజ్ఞము చేయవలసినవాడు మానవుడే.

సం॥ పూ॥ కించ భోః! కస్తూర్యాదీనాం సురభియుక్తానాం ద్రవ్యాణా మగ్నౌ ప్రక్షేపణేన వినాశాత్ కథ ముపకారాయ యజ్ఞో భవితు మర్హతీతి. కిం త్వేద్భిశైరుత్తమైః పదార్థైర్ మనుష్యాదిభ్యో భోజ నాది దానేనోపకారే కృతే, హోమా దప్యుత్తమం ఫలం జాయతే పునః కిమర్థం యజ్ఞకరణ మితి ?

ఉ॥ అత్రోచ్యతే, నాత్యంతో వినాశః కస్యాపి సంభవతి. వినాశో హి యద్ దృశ్యం భూత్వా పునర్ న దృశ్యేతేతి విజ్ఞాయతే. వదంతు దర్శనం త్వయా కతివిధం స్వీక్రియతే ?

పూ : అష్ట విధం చేతి.

ఉ : కించ తత్ ?

పూ : అత్రాహుర్ గోతమాచార్యా న్యాయశాస్త్రే–

"ఇంద్రియార్థ సన్నికర్షోత్పన్నం జ్ఞాన మవ్యపదేశ్య మవ్యభిచారి వ్యవసాయాత్మకం ప్రత్యక్షమ్."

౧. న్యాయ. అ. ౧, ఆ. ౧. సూ. ౪

"అథ తత్ పూర్వకం త్రివిధ మనుమానం పూర్వవ చ్ఛేషవత్ సామాన్యతోదృష్టం చ."

౨. ౨. న్యా. ౧–౧–౫.

"ప్రసిద్ధ సాధర్మ్యాత్ సాధ్యసాధన ముపమానమ్. "౩.న్యా.౧–౧–౬

"ఆప్తోపదేశః శబ్దః." ౪. న్యా, ౧–౧–౭,

ప్రత్యక్షానుమానోపమాన శబ్దైతి హ్యర్థాపత్తి సంభవాభావ సాధన భేదాత్ అష్టధా ప్రమాణం మయా మన్యతే ఇతి.

(౧) తత్ర, యదింద్రియార్థ సంబంధాత్ సత్య మవ్యభిచారి జ్ఞాన ముత్పద్యతే, తత్ ప్రత్యక్షమ్ ; సన్నికటే దర్శనాత్ 'మనుష్యోఽయం నాన్యః ఇత్యుదాహరణమ్.

(౨) యత్ర లింగజ్ఞానేన లింగినో జ్ఞానం జాయతే, తదనుమానమ్. పుత్రం దృష్ట్వా 'ఆసీ దస్య పితే' త్యాద్యుదాహరణమ్.

(౩) ఉపమానం సాదృశ్యజ్ఞానమ్. 'యథా దేవదత్తోఽస్తి. తథైవ యజ్ఞదత్తోఽప్యస్తీతి సాధర్మ్యా దుపదిశతీత్యా ద్యుదాహరణమ్.

(౪) శబ్ద్యతే – ప్రత్యాయ్యతే దృష్టోఽదృష్ట శ్చార్థో యేన స శబ్దః : జ్ఞానేన మోక్షో భవ' తీత్యా ద్యుదాహరణమ్.

తె॥ పూ : సుగంధయుక్తములై, అతి మూల్యములై యుండు కస్తూరి మున్నగు వస్తువు లితర వస్తువులలో గలిపి వాని నగ్నియందు హోమము చేసిన నవి నశించును. కావున యజ్ఞమువలన నెట్టి యుపకారమును గలుగదు. అంతకంటె నా కస్తూరి ఘృతము మొదలగు మేలైన వస్తువులను మనుష్యుల భోజనమున కుపయోగించిన మిక్కిలి యుపకారము జరుగును. కావున యజ్ఞమేల చేయవలయును?

ఉ : పదార్థ మేదియు బొత్తిగా నశింపదు. కేవలము వియోగము కలుగును. స్థూలములై యింద్రియములచే తెలియబడి మరల నవి యింద్రియములకు తెలియనంతగా సూక్ష్మములగుటయే వినాశ మన బడును. బాగు; అది యటుంచి యొక సంగతి చెప్పుము. నీవు దర్శనము (జ్ఞానము) నెన్నివిధములుగ నంగీకరించుచున్నావు?

పూ : ఎనిమిది విధములుగ.

ఉ : ఆ విధము లెయ్యవి ?

పూ : ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, ఐతిహ్యము, అర్థాపత్తి, సంభవము, అభావము, ఇట్లెనిమిది విధములైన దర్శనము-జ్ఞానము-నంగీకరింతుము.

గోతమాచార్యులు తన న్యాయశాస్త్రమున నిట్లు వివరించియున్నారు.

(౧)(ఇంద్రియార్థ...) చక్షురాదీంద్రియములకు రూపాది విషయములతో సంబంధము గల్గుటవలన నేర్పడు సత్యజ్ఞానము ప్రత్యక్షము.

ఉదా : కొండొక వస్తువును దూరమునుండి చూచినపుడు 'అది మనుష్యుడా? లేక మఱి యేమైన నగునా' అని సందేహము కలుగును; కాని, సమీపమునుండి చూచినపుడా సంశయము పోయి 'ఇతడు మనుష్యుడే' అని నిశ్చిత సత్యజ్ఞానము కలుగును.

(౨) (అథ తత్పూ....) కొండొక వస్తువునకు చెందిన లక్షణ మును చూచినపుడు యథార్థముగ నా వస్తువే తెలియబడినచో నది యనుమాన మందురు. ఇయ్యది ముప్విధముల నుండును. పూర్వవత్తు, శేషవత్తు, సామాన్యతో దృష్టము అని.

ఉదా : కొండొకని పుత్రుని జూచినపు'డతనికి తల్లిదండ్రులున్నారు' అని జ్ఞానము కలుగును. ఇట్లే మిగిలినవి యూహింపనగును.

(౩) (ప్రసిద్ధ...) ఒక వస్తువునందలి సామాన్య -తుల్య-ధర్మమును జూచి తన్మూలమున నట్టి ధర్మముగల మఱియొక వస్తువును దెలిసికొనుట యుపమానమనబడును. ఉదా : 'దేవదుత్తడున్నట్లే యజ్ఞదత్తుడుండును' అని యొకడు మఱియొకనికి చెప్పెనని యెంచుడు : అది విని వ్యక్తి దేవత్తునిలో గల గుణము వంటి గుణము యజ్ఞదత్తునిలో జూచి, అతడే యజ్ఞదత్తు డని గుర్తించును-ఇది యుపమానము.

(౪) (ఆప్తోప....) ప్రత్యక్షా ప్రత్యక్ష వస్తువుల నిశ్చయజ్ఞానము గలిగించునది శబ్ద ప్రమాణము.

ఉదా : 'జ్ఞానమువలన మోక్షము కలుగు'ను అను నిట్టి యాప్తోపదేశములు శబ్ద ప్రమాణమునకు ఉదాహరణములు.

*సం॥ "న చతుష్ట్వ మైతిహ్యార్థాపత్తి సంభవాభావ ప్రామాణ్యాత్."న్యాయ. అ. ౨.ఆ.౨, సూ. ౧*
*"శబ్ద ఐతిహ్యనర్థాంతరభావాత్ అనుమానేఽర్థాపత్తి సంభవాభావా నర్థాంతరభావా చ్చాప్రతిషేధః"ఽ*
*న్యా. ౨-౨-౨*

న చతుష్ట్య మితి సూత్రద్వయస్య సంక్షిప్తోఽర్థః క్రియతే –

(౫) (ఐతిహ్యం) శబ్దోపగత మాప్తోపదిష్టం గ్రాహ్యమ్. 'దేవాసురాః సంయత్తా ఆస' న్నిత్యాది.

(౬) (అర్థాపత్తిః) అర్థా దాపద్యతే సాఽర్థాపత్తిః కేనచి దుక్తం, సత్సు ఘనేషు వృష్టిర్ భవతీతి. కిమత్ర ప్రసజ్యతే? అసత్సు ఘనేషు న భవతి. ఇత్యా ద్యుదాహరణమ్.

(౭) (సంభవః) సంభవతి యేన యస్మిన్వా స సంభవః, ఉదాః– కేనచి దుక్తం మాతాపితృభ్యాం సంతానం జాయతే; సంభవో ఽస్తీతి వాచ్యమ్. పరంతు కశ్చిద్ బ్రూయాత్ – కుంభకర్ణస్య క్రోశ చతుష్టయ పర్యంతం శ్మశ్రుణః కేశా ఊర్ధ్వం స్థితా ఆసన్. షోడశక్రోశ మూర్ధ్వం నాసికా చ; అసంభవత్వా న్మిథ్యైవాస్తీతి విజ్ఞాయతే ఇత్యాది.

(౮) (అభావః) కోఽపి బ్రూయాద్ ఘట మానయేతి. స తత్ర ఘటమపశ్యన్ 'అత్ర ఘటో నాస్తి' ఇత్యభావలక్షణేన యత్ర ఘటో వర్తమానస్తస్మా దానీయతే.

ఇతి ప్రత్యక్షాదీనాం సంక్షేపతోఽర్థః. ఏవ మష్ట విధం దర్శన మర్థాత్ జ్ఞానమయా మన్యతే.

తె॥ ప్రత్యక్షాదులయిన యెనిమిది విధములైన ప్రమాణములను సూచించు పై రెండు సూత్రముల యర్థము కూడ నిట సంక్షేపముగ వ్రాయుచున్నాము.

(౫) (ఐతిహ్యమ్) సత్యవాదులగు విద్వాంసులు వ్రాసినట్టియు, చెప్పినట్టియు ఉపదేశములు ఇతిహాస మనబడును. ఇది యైదవ ప్రమాణము.

ఉదా : 'దేవాసురులు యుద్ధము జేయ తత్పరులైరి. 'వృత్తములు దెలుపు నిట్టి వాక్యములు, ఐతరేయము, శతపథ బ్రాహ్మణము మున్నగు సత్యగ్రంథములలోని యితి హాసమే గ్రాహ్యము. ఇతరమును గ్రహింపరాదు.

(౬) (అర్థాపత్తి :) ఒక డొకమాట చెప్పినప్పుడు ఆ మాట వలన మఱియొక విషయ మనాయాసముగ దెలియబడిన నది యర్థాపత్తి యనబడును.

ఉదా : 'మేఘములున్న వాన వచ్చును' అని యెవడేని పలికిన, మేఘములు లేక వాన యెన్నడు రాదు' అని తెలియును. ఇట్టి ప్రమాణమువలన గలుగు జ్ఞానము అర్థాపత్తి యనబడును.

(౭) (సంభవ:) 'మాతాపితల వలన సంతానము కలుగును' అని యొకడనిన, మఱియొక డదివిని 'నీవు చెప్పినది సంభవమే – కావచ్చును' అని యంగీకరించును. కాని యెవడేని, 'రావణుని తమ్ముడైన కుంభకర్ణుని మీసములు ఆకాశమున నాలుగు క్రోసుల పర్యంతము నిక్కబొడుచుకొని యుండుననియు, అతని ముక్కు పదునాఱు క్రోసుల పొడవు గలదనియు జెప్పిన నతని మాట యసత్యమని యెంచబడును. అతని మాట సంభవ మెన్నడును కాదు.

(౮) (అభావ:) ఒకడు మఱియొకనితో 'ఘటమును దెమ్ము' అనిన, అతడక్కడ ఘటము లేకుండుటం జూచి యది యున్న స్థలము నుండి తెచ్చును.

ఈ యెనిమిది విధములగు ప్రమాణములను నే నంగీకరింతును.

సం॥ ఉ : సత్యమేవ మేతత్. నైవ మంగీకారేణ వినా సమగ్రో వ్యవహార పరమార్థౌ కస్యాపి సిద్ధ్యేతామ్. యథా కశ్చిదేకం మృత్పిండం విశేషత శ్చూర్ణీకృత్య వేగయుక్తే వాయౌ బాహువేగే నాకాశం

ప్రతి క్షిపేత్. తస్య నాశో భవతీ త్యుపచర్యతే చక్షుషా దర్శనాభావాత్. (ణశ్) అదర్శనే అస్మాద్ ఘఞ్ ప్రత్యయే కృతే 'నాశ' ఇతి శబ్దః సిద్ధ్యతి. అతో నాశో బాహ్యేంద్రి యాదర్శన మేవ భవితు మర్హతి. కించ యదా పరమాణవః పృథక్ పృథక్ భవంతి తదా తే చక్షుషా నైవ దృశ్యంతే! తేషా మతీంద్రియత్వాత్. యదా చైతే మిలిత్వా స్థూలభావ మాపద్యంతే, తదైవ తద్ద్రవ్యం దృష్టిపథ మాగచ్ఛతి; స్థూలస్యైంద్రియకత్వాత్ యద్ ద్రవ్యం విభక్తం విభక్త మంతే విభాగానర్హం భవతి, తస్య పరమాణుసంజ్ఞా చేతి వ్యవహారః; తే హి విభక్తా అతీంద్రియాః సంత ఆకాశే వర్తంత ఏవ.

తె॥ అవును ఇది సత్యమే. ప్రమాణముల నంగీకరింపనిచో సంపూర్ణ లోక వ్యవహారము, పరమార్థము రెండును సిద్ధింపవు. అదర్శనము నాశ మనబడును. ఒక మట్టిగడ్డను పిండియగునట్లు మర్దించి యా మట్టియొక్క కణములను వేగముగ వీచు వాయువునందు వెదజల్లిన నవి కనబడకుండపోవును. మట్టిగడ్డ యప్పు డదర్శన మగును. అప్పుడు గడ్డ నశించినది యని చెప్పుదుము. 'ణశ్ అదర్శనే' అను ధాతువునకు ఘఞ్ ప్రత్యయము జేర్చిన నాశ శబ్దమేర్పడును. కావున 'నాశ' శబ్దము బాహ్యేంద్రియములకు గనబడకుండుట యను నర్థమున వాడుదుము. వస్తువునందుకలిసియున్న పరమాణువులు దేనికది వేఱైనపుడవి కనబడవు; ఇంద్రియగోచరములు - ఇంద్రియములకు విషయములు; ఇంద్రియములచే గ్రహింపదగినవి కావు. అతీంద్రియము లనియు వానిని జెప్పుదురు. ఆ పరమాణువు లొండొంటితో కలిసి స్థూల భావమును బొందినపుడవి ద్రవ్యములుగ కనిపించును. స్థూల పదార్థములే యింద్రియములకు విషయము లగును. ఒక వస్తువును ముక్కలు ముక్కలుగ జేయుచు బోయిన చివరకు ముక్కలు చేయలేని స్థితి కా వస్తువు వచ్చును. చివరకు మిగులు నాభాగమే 'పరమాణువు' అనబడును. ఈ పరమాణువులు వేఱువేఱుగ నున్నంతవఱకు నింద్రియములచే గ్రహింపబడవు. కాని, అవి యాకాశమున నుండును.

*సం॥ తథై వాగ్నౌ యద్ద్రవ్యం ప్రక్షిప్యతే తద్విభాగం ప్రాప్య దేశాంతరే వర్తత ఏవ. న హి తస్యాభావః కదాచిత్ భవతి. ఏవం యద్ దుర్గంధాదిదోష నివారకం సుగంధాది ద్రవ్య మస్తి. తదగ్నౌహుతం సద్ వాయోర్ వృష్టి జలస్య చ శుద్ధికరం భవతి. తస్మిన్ నిర్దోషే సతి సృష్టయే మహాన్ హ్యుపకారో భవతి. సుఖం చ; అతః కారణాద్ యజ్ఞః కర్తవ్య ఏవేతి.*

*పూః కించ భోః! వాయు వృష్టిజల శుద్ధికరణ మేవ యజ్ఞస్య ప్రయోజనమస్తి చేత్, తర్హి గృహాణాం మధ్యే సుగంధ ద్రవ్యరక్షణే నైతత్ సేత్స్యతి. పునః కిమర్థ మేతావా నాడంబరః?*

*ఉః నైవం శక్యమ్, నైవ తేనాశుద్ధో వాయుః సూక్ష్మో భూత్వా ఆకాశం గచ్ఛతి. తస్య పృథక్త్వ- లఘుత్వాభావాత్. తత్ర తస్య స్థితౌ సత్యాం నైవ బాహ్యో వాయు రాగంతుం శక్నో త్యవకాశాభావాత్. తత్ర పునః సుగంధ దుర్గంధ యుక్తస్య వాయోర్ వర్తమానత్వా దారోగ్యాదికం ఫల మపి భవితు మశక్యమే వాస్తి.*

తె॥ అట్లే సుగంధాదులతో గూడిన వస్తువు లగ్నిలో వేయబడును. అంతట నావస్తువునందలి యణువులన్నియు వేఱై యాకాశమున నుండును. ఏ వస్తువు కూడ దాని యస్తిత్వమును బోగొట్టుకొనదు. అందువలన నాకాశమున వ్యాపించిన వస్తువు దుర్గంధాదిదోషముల నవశ్యము నివారించును. ఇట్లు వాయువు, వృష్టిజలము శుద్ధమగుట వలన జగత్తున కెంతో యుపకారము గలుగును. సుఖము లభించును. ఈ కారణమున యజ్ఞము చేయవలసినదే యగుచున్నది.

పూః యజ్ఞమువలన వాయువు, వృష్టిజలము శుద్ధమగుటయే ప్రయోజనమగునెడల, దీనికింత యాడంబరమేల? గృహములలో నత్తరు, పుష్పములు మొదలగు సుగంధ ద్రవ్యముంచిన చాలునుగదా?

ఉ॥ యజ్ఞమువలన లభించుఫలము అన్యప్రకారములచే లభింపదు. అత్తరు, పుష్పము మున్నగు పదార్థములనుండి వెలువడు సుగంధాదులు దుర్గంధమిళిత వాయువున జేరి యట్లే యుండును; కాని, వాయువునుండి దుర్గంధమును వేఱుచేసి, దానిని బయటికి పంపజాలవు. ఇంటియందలి వాయువును పైకి బోవునట్లు చేసి వెలుపలి వాయువును శుద్ధమైన దాని నింటిలోనికి వచ్చునట్లు చేయజాలవు. అగ్నిహోత్రము వలన నింటియందలి వాయువు వేడికి తేలికయై బయటికిపోవును. వాయుకణములను విచ్ఛిన్న మొనర్చి యందలి దోషములను వేఱు చేయగల శక్తి హోమమునందు గలదు. కాని యత్తరులో నట్టి గుణము లేదు. కావున నింటిలో నారోగ్యము కలుగజాలదు.

సం॥ యదా తు ఖలు తస్మిన్ గృహేఽగ్నిమధ్యే సుగంధ్యాది ద్రవ్యస్య హోమః క్రియతే, తదాఽగ్నినా పూర్వోవాయుర్ భేదం ప్రాప్య లఘుత్వ మాపన్న ఉపర్యాకాశం గచ్ఛతి. తస్మిన్ గతే సతి తత్రావకాశత్వా చ్చతుర్భ్యో దిగ్భ్యః శుద్ధో వాయు రాద్రవతి. తేన గృహాకాశస్య పూర్ణత్వాత్ ఆరోగ్యాదికం ఫలమపి జాయతే.

తె॥ ఇంటిలో నగ్నియందు సుగంధితవస్తువులను హోమ మొనర్చినపుడింటియందలి వాయువును తేలిక యగునట్లు చేసి యా యగ్ని బయటకి పంపును. అందువలన నింటియం దావాయుస్థానము కాళీ యగును. దానిని పూరించుటకు వెలుపలి శుద్ధ వాయు వట జేరును. ఈ ఫల మగ్నిహోత్రాది యజ్ఞము వలననే కలుగునుకాని, అన్యవిధముల కలుగదు. హోమద్రవ్యపు కణములతో గూడిన వాయువు దుర్గంధయుక్తవాయువును బయటికి వెడలనంపుటయేకాక, యట చేరిన వాయువును శుద్ధము చేయును; రోగనాశకమై ప్రాణులకు సుఖము నిచ్చునది యగును.

సం॥ యో హోమేన సుగంధయుక్త ద్రవ్యపరమాణు యుక్త ఉపరి గతో వాయుర్ భవతి, స వృష్టిజలం శుద్ధం కృత్వా వృష్ట్యాధిక్య మపి కరోతి. తద్ద్వారా ఓషధ్యాదీనాం శుద్ధే రుత్తరోత్తరం జగతి మహత్సుఖం వర్ధత ఇతి నిశ్చీయతే. ఏతత్ ఖల్వగ్నిసంయోగ రహితసుగంధేన వాయునా భవితు మశక్య మస్తి. తస్మాద్ హోమకరణ ముత్తమ మేవ భవతీతి నిశ్చేతవ్యమ్.

తె॥సుగంధ్యాది ద్రవ్యపరమాణువులతో గూడిన హోమకరణమున వాయువాకాశమున బైకిజేరి వృష్టిజలమును శుద్ధము చేయును. దాని వలన నెక్కుడుగ వర్షించుటయు సంభవించును. శుద్ధజలవాయువుల మూలమున అన్నాద్యోషధులు శుద్ధము లగును. ప్రతిదినమొనర్చు యజ్ఞాదులవలన వాయువునందు సుగంధాదిగుణము లధికమై జగమున సుఖవృద్ధి కలుగును. ఇట్టిఫల మితర విధముల గలుగదు.

సం॥ అన్యచ్చ దూరస్థలే కేనచిత్ పురుషేణాగ్నౌ సుగంధ ద్రవ్యస్య హోమః క్రియతే; తద్యుక్తో వాయుర్ దూరస్థస్య మనుష్యస్య ఘ్రాణేంద్రియేణ సంయుక్తో భవతి. సోఽత్ర సుగంధ వాయు రస్తీతి జానాత్యేవ. అనేన విజ్ఞాయతే వాయునా సహ సుగంధం దుర్గంధం చ ద్రవ్యం గచ్ఛతీతి. తద్యథా న దూరం గచ్ఛతి, తదా తస్య ఘ్రాణేంద్రియసంయోగో న భవతి, పునర్ బాల బుద్ధీనాం భ్రమో భవతి– న సుగంధో నాస్తీతి. పరంతు తస్య హుతస్య పృథగ్ భూతస్య వాయుస్థస్య సుగంధయుక్తస్య ద్రవ్యస్య దేశాంతరే వర్తమానత్వాత్ తైర్ న విజ్ఞాయతే. అన్య దపి ఖలు హోమకరణస్య బహువిధ ముత్తమం ఫల మస్తి; తద్ విచారేణ బుధైర్ విజ్ఞేయ మితి.

తె॥ స్థలాంతరమున నొకడు సుగంధిత వస్తువులను నగ్నిలో హోమము చేసినపుడు, హోమస్థలమునకు దూరమున నున్న పురుషుడా సుగంధయుక్త వాయువు నాఘ్రాణించును. దీనిని బట్టి హోమద్రవ్యమగ్నిలోబడి తన యస్తిత్వమును గోలుపోలేదని తెలియుచున్నది. ఒకప్పుడధికదూరముననున్న వ్యక్తి, యా సుగంధమును

గ్రహింపజాలక పోవచ్చును. అందువలన నతనికి భ్రమ కలుగును. అతడు ద్రవ్యము నశించిన దనవచ్చును. వాస్తవమున నా సుగంధ వస్తువు ఆకాశమున వాయువులో చేరియున్నదనియే బుద్ధిమంతులు గ్రహింపవలసియుందురు. ఇట్లే హోమము వలన గలుగు ప్రయోజనము లింకను నెన్నియో యున్నవి. అవి యాలోచించి తెలిసికొనుట బుద్ధిమంతులపని.

**సం॥ పూః యది హోమకరణ స్యైతత్ ఫల మస్తి తద్ధోమకరణ మాత్రే ణైవ సిద్ధ్యతి; పునస్తత్ర వేదమంత్రాణాం పాఠః కిమర్థః క్రియతే?**

**ఉః అత్ర బ్రూమః – నీతస్యాన్య దేవ ఫల మస్తి.**

**పూః కిమ్?**

**ఉః యథా హస్తేన హోమః, నేత్రేణ దర్శనం, త్వచాస్పర్శనం చ క్రియతే; తథా వేదమంత్రా అపి వాచా పఠ్యంతే. తత్ పాఠే నేశ్వర స్తుతి ప్రార్థనోపాసనాః క్రియంతే. హోమేన కిం ఫలం భవతీ త్యస్యజ్ఞానం, తత్పాఠానువృత్యా వేదమంత్రాణాం రక్షణమ్, ఈశ్వరస్యాస్తిత్వ సిద్ధిశ్చ. అన్యచ్చ సర్వకర్మాదా వీశ్వరస్య ప్రార్థనా కార్యేత్యుపదేశః యజ్ఞే తు వేద మంత్రోచ్చారణాత్ సర్వత్రైవ తత్ ప్రార్థనా భవతీతి వేదితవ్యమ్.**

తె॥ పూః హోమము చేయుటవలననే ఫలము గలుగుగాక! హోమము చేయునపుడు మంత్రములు చదువుటేల?

ఉః మంత్రపఠనమునకు బ్రయోజనము వేఱుగానే కలదు.

పూః అది యేమి?

ఉః హోమ మొనర్చువేళ కంటితో జూతురు, త్వక్కుతో స్పృశింతురు, చేతులతో చేయుదురు. అట్లే వాక్కుతో మంత్రములను జదువుదురు. అందువలన నీశ్వరస్తుతి ప్రార్థనోపాసనలు జరుగును. హోమమువలన గలుగు ఫలము కూడ స్మరింపబడును. అనేక పర్యాయములు పఠించుటవలన మంత్రములు కంఠస్థము లగును. తన్మూలమున వేదములు రక్షింపబడును. ఇంతేకాక యీశ్వరుడు గలడని తెలియును. కావున జనులు నాస్తికులు కారు. మఱియు, కార్యము లన్నియు నీశ్వరుని ప్రార్థనతోనే ప్రారంభింపబడవలయును. వేదమంత్రముల నుచ్చరించుటచే యజ్ఞమునం దీశ్వరునిప్రార్థనమంతటజరుగును. కావున యజ్ఞాద్యుత్తమ కర్మములన్నియు వేద మంత్రముల పూర్వకముగ చేయవలయును – అని యుపదేశము సిద్ధించును. ప్రారంభింప వలసిన ప్రయోజనము గూడ సిద్ధించును.

**సం॥ పూః కశ్చిదత్రాహ –వేదమంత్రోచ్చారణం విహాయాన్యస్య కస్య చిత్ పాఠస్తత్ర క్రియేత, తదా కిం దూషణ మస్తీతి.**

**ఉః అత్రోచ్యతే. నాన్యస్య పాఠే కృతే నత్యేత త్ప్రయోజనం సిద్ధ్యతి.**

**పూః కుతః?**

**ఉః ఈశ్వరోక్తాభావా న్నిరతిశయ సత్యవిరహాచ్చ . యద్యద్ధి తత్ర క్వచిత్ సత్యం ప్రసిద్ధ మస్తి, తత్తత్ సర్వం వేదాదేవ ప్రసృత మితి విజ్ఞేయమ్. యద్యత్ ఖల్వనృతం తత్త దనీశ్వరోక్తం, వేదాద్ బహిరితి చ. అత్రార్థే మను రాహ–**

"త్వమేకో హ్యస్య సర్వస్య విధానస్య స్వయంభువః
అచింత్యస్యాప్రమేయస్య కార్యతత్త్వార్థ విత్ ప్రభో" ౧. మ..౧౩.
"చాతుర్వర్ణ్యం త్రయో లోకాః చత్వార శ్చాశ్రమాః పృథక్
భూతం భవ్యం భవిష్యచ్చ సర్వం వేదాత్ ప్రసిద్ధ్యతి" ౨ మ. ౧౨-౯౭
" బిభర్తి సర్వభూతాని వేదశాస్త్రం సనాతనమ్
తస్మా దేతత్పరం మన్యే యజ్జంతో రస్య సాధనమ్. ౩ మ. ౧౨, ౯౯

తె॥ పూ॥ యజ్ఞమున వేదమంత్రములకు బదు లింకేమైన పఠించిన గలుగు దోషమేమి?

ఉ॥ ఇతరములను జదివిన పై ప్రయోజనము సిద్దింపదు.

పూ॥ ఎందువలన?

ఉ॥ ఈశ్వరవాణిచే సిద్ధించు సత్యప్రయోజన మన్యవచనము వలన నెన్నడు సిద్దింపదు. ఈశ్వరవచనము సర్వవిధముల భ్రాంతిలేక సత్యమైనట్లు ఇతరులవచన మెన్నడును గాదు. వేదోపదిష్టమార్గమున తన్ను దా పవిత్ర మొనర్చుకొని, ఆప్తపురుషుల గ్రంథముల బోధనల వలనను, శిక్షణ వలనను వేదములను సరిగా దెలిసికొని చెప్పు పురుషుని వాక్యములు కూడ సత్యము లగును. కేవలము తన బుద్ధికి తోచినది చెప్పువాని వచనములు సరికావు. దీనింబట్టి, యెందెందు సత్యము చూడనగునో, విననగునో, అది వేదముల వలననే ప్రచురితమైనట్లు తెలియనగుచున్నది. మిథ్యాప్రచారము వేదమువలన కాక, జీవుల మూలమున జరిగినదనియు సిద్ధమగుచున్నది. ఈశ్వరీయ గ్రంథమువలన సిద్ధించు సత్యప్రయోజన మన్యమువలన కాజాలదు. ఇందులకు మను ప్రమాణము-

(౧) (త్వమేకో...) 'వేదములు స్వయంభువులు-సనాతనములు, వానిలో నసత్య ము లేదు. సమస్త సత్యవిద్యలు నందు విధింపబడియున్నవి. వానియర్థములను కేవలము నీ వెఱుగుదువు' అని ఋషులు మనువుతో ననిరి.

(౨) (చాతుర్వర్ణ్యం...) నాలుగు వర్ణములు, నాలు గాశ్రమములు, భూతము, భవిష్యత్తు, వర్తమానము మున్నగువానికి చెందిన విద్యలన్నియు వేదముల వలననే ప్రసిద్ధము లయినవి.

(౩) (బిభర్తి...) సనాతన వేదశాస్త్రములు సర్వవిద్యలను నొసంగి ప్రాణుల నన్నింటిని ధరించుచున్నవి. సుఖముల నన్నింటిని చేకూర్చును. కావుననే మనము వాని నుత్తమములని యెంచుచున్నాము. సర్వజీవుల సకల సుఖములకు సాధనములగుటచే నట్లు వాని నంగీకరించుటయు మనకు తగియే యున్నది.

సం॥ పూ. కిం యజ్ఞానుష్ఠానార్థం భూమిం ఖనిత్వా, వేదిః, ప్రణీతాదీని పాత్రాణి, కుశతృణం, యజ్ఞశాలా, ఋత్విజ శ్చైత త్సర్వం కరణీయ మస్తి?

ఉ; అత్ర బ్రూమః. యద్య దావశ్యకం యుక్తిసిద్ధం, తత్తత్కర్తవ్యం, నేతరత్. తద్యథా – భూమిం ఖనిత్వా, వేదీ రచనీయా; తస్యాం హోమే కృతే, అగ్నే స్తీవ్రత్వాద్ధుతం ద్రవ్యం సద్యో విభేదం ప్రాప్యాకాశం గచ్ఛతి. తథా వేదిదృష్టాంతేన త్రికోణ చతుష్కోణ గోల శ్యేనాద్యాకారవత్ కరణాద్ రేఖాగణిత మపి సాధ్యతే. తత్ర చ ఇష్టకానాం పరిగణితత్వా దనయా గణితవిద్యాఽపి గృహ్యతే. ఏవ మేవోత్తరేఽపి పదార్థాః సప్రయోజనాః సంత్యేవ. పరం త్వేవం ప్రణీతాయాం రక్షితాయాం పుణ్యం స్యాత్,

ఏవం పాపమితి యదుచ్యతే, తత్ర పాపనిమిత్తా భావాత్ సా కల్పనా మిథ్యైవాఽస్తి, కిం తు ఖలు యజ్ఞసిద్ధ్యర్థం యద్య దావశ్యకం యుక్తిసిద్ధ మస్తి, తత్తదేవ గ్రాహ్యమ్.

పూః కుతః?

ఉః తై ర్వినా తదసిద్ధేః.

తె॥ పూ॥ యజ్ఞ మొనర్చుటకు భూమిని త్రవ్వి వేది రచింప వలయునా? ఇట్లే ప్రణీత, ప్రోక్షణి, చమసము (గరిటె) మున్నగు పాత్రస్థాపన మావశ్యకమా? దర్భలు సంపాదింపవలసినదేనా? యజ్ఞశాల నిర్మింపక తప్పదా? ఋత్విజుల వరణ మావశ్యకమా?

ఉః ఇందు యుక్తి సిద్ధములన్నియు జేయవలసినవే. ఇతరములు చేయకున్నను దోషము లేదు. యజ్ఞవేదిక సిద్ధము చేయవలసినదే. అందు హోమము చేయుటవలన, అగ్ని వెంటనే తీవ్రతను వహించి దానిలో వ్రేల్చబడిన హోమద్రవ్యములు శీఘ్రముగ విభక్తములై పరమాణువుల రూపమున వాయువుతోను, అగ్నితోను నాకాశమున వ్యాపించును. హోమద్రవ్య మగ్నిలో వేయునపు డటునిటు వ్యర్థముగ పోకుండుటకు కూడ వేదిక యుపయోగించును. వేదిక త్రికోణములు గలదిగను, చతుష్కోణములు గలదిగను, గుండ్రముగను, డేగయొక్క ఆకారముతోడను నిర్మించుటంబట్టి రేఖాగణితము కూడ తెలియనగును. త్రిభుజాది రేఖల బోధయు గలుగును. వేదిక పరిమాణము - లోతు, పొడవు, వెడల్పులు మున్నగు వానిని బట్టియే పరిమాణము - కొలతలుగల యిటుకలు ఎన్ని కావలసియుండునో తెలిసికొనవలసి యుండును. అందువలన గణితవిద్యయు దెలియనగును. వెండి, బంగారము, తామ్రము మున్నగు ధాతువులతో పాత్రలు రచించుటకు కారణము వానిలో నుంచిన ఘృతాదిపదార్థములు చెడక స్థిరముగ నుండును. దర్భలు- యజ్ఞశాలను మార్జన చేయుటకును, చీమలు మున్నగు క్రిములు అగ్నికుండమున జేరి మరణింపకుండునట్లు చేయుటకును వేదికకు నలువైపుల నుంచబడును. యజ్ఞశాల నిర్మించుటవలన నెక్కుడు గాలి తగల కుండును. పశువులు, పక్షులు యజ్ఞకుండమును చెడగొట్ట కుండుటయు జరుగును. ఋత్విజులు లేక యజ్ఞ మెట్లు జరుగును? అందువలన నీ యజ్ఞ విధానము లన్నియు జరుగవలసినవే. ఇంతేకాక హోమద్రవ్యములను చక్కగా సంస్కరించి-శుద్ధము చేసి యుంచుకొనవలయును. ఇక 'పాత్రల నిట్లుంచిన పుణ్యము, అట్లుంచిన పాపము కలుగును' అని చెప్పుటలో సత్యము లేదు. ఎట్లుంచిన కార్యము సులభమగునో యట్లుంచు కొనవచ్చును.

పూ॥ కారణమేమి?

ఉః ఆవశ్యకములగు వస్తువులు లేకున్న యజ్ఞము జరుగజాలదు. కావున యుక్తి సిద్ధములన్నియు నుండవలసినదే.

సం॥ పూ. యజ్ఞే దేవతాశబ్దేన కిం గృహ్యతే?

ఉ. యాశ్చ వేదోక్తాః, అత్ర ప్రమాణానిః-

"అగ్ని ర్దేవతా, వాతో దేవతా, సూర్యో దేవతా, చంద్రమా దేవతా, వసవో దేవతా, రుద్రా దేవతా, ఆదిత్యా దేవతా, మరుతో దేవతా, విశ్వే దేవా దేవతా, బృహస్పతిర్ దేవతా, ఇంద్రో దేవతా, వరుణో దేవతా"

యజు. అ. ౧౪. మం. ౨౦

అత్ర కర్మకాండే దేవతాశబ్దేన వేద మంత్రాణాం గ్రహణమ్. గాయత్ర్యాదీని ఛందాంసి హ్యగ్న్యాది దేవతాఖ్యాన్యేవ గృహ్యన్తే, తేషాం కర్మకాండాది విధేర్ ద్యోతకత్వాత్. యస్మిన్ మంత్రే చాగ్ని శబ్దార్థ ప్రతిపాదనం వర్తతే. స ఏవ మంత్రో ఽగ్ని దేవతో గృహ్యతే. ఏవ మేవ వాతః, సూర్యః, చంద్రమా వసవో, రుద్రా, ఆదిత్యా, మరుతో, విశ్వేదేవా, బృహస్పతిః ఇంద్రో, వరుణ శ్చేత్యేత చ్ఛబ్దయుక్తా మంత్రా దేవతా శబ్దేన గృహ్యంతే, తేషా మపి తత్తదర్థస్య ద్యోతకత్వాత్ పరమాప్తేశ్వరేణ కృత సంకేతత్వాచ్చ.

తె॥ పూ . యజ్ఞమున దేవతాశబ్దముల కర్థమేమి?

ఉ . వేదమున జెప్పబడినవియే దేవతాపదమున కర్థములు, యజుర్వేదమంత్ర మిందులకు ప్రమాణము

(అగ్నిర్ దేవతా....) అగ్ని, వాయువు, సూర్యుడు, చంద్రుడు, వసువులు - ప్రసిద్ధములగు నెనిమిది వసువులు లేక యుత్తమ విద్వాంసులు, రుద్రులు - ప్రాణాదులయిన ఏకాదశరుద్రులు - లేక మధ్యమ శ్రేణికి చెందిన విద్వాంసులు, ఆదిత్యులు - ద్వాదశమాసములు లేక యుత్తమ విద్వాంసులు, - మరుత్తు - మననము నొనర్చు విద్వాంసుడగు ఋత్విక్కు, విశ్వేదేవులు - సద్గుణములు గల సర్వమానవులు, దివ్య పదార్థములు, బృహస్పతి - పెద్ద వచనమునకుగాని, బ్రహ్మాండమునకుగాని రక్షకుడు - పరమేశ్వరుడు, ఇంద్రుడు - విద్యుత్తు, లేక ఉత్తమ ధనము, వరుణుడు - జలము, లేక, శ్రేష్ఠ గుణయుక్త పదార్థము. ఇవియన్నియు, ఇంకను దివ్యగుణములుగల సకల పదార్థములు దేవత లనబడును.

కర్మకాండ - యజ్ఞ విషయమున - ముఖ్యముగా దేవతా శబ్దముచే వేద మంత్ర ము గ్రహింపబడును. గాయత్రి మున్నగు ఛందస్సులు అగ్ని ప్రభృతి దేవతానామములచే గ్రహింపబడును. ఈ వేదమంత్రముల వలననే కర్మకాండకు చెందిన విధులన్నియు తెలియనగును. అగ్ని శబ్దార్థ మే మంత్రమున ప్రతిపాదింపబడునో - తెలుపబడునో ఆ మంత్ర మగ్ని దేవతగలదిగ చెప్పబడును. వేదమంత్రములు అగ్నివాయ్వాది శబ్దార్థములను ప్రకటించును. 'మంత్రముల వలన నీ యర్థమే ప్రకాశము కావలయును' అను నీశ్వరసంకేతమును గలదు. తత్ఫలముగ నేయే మంత్రములలో నగ్న్యాది శబ్దములున్నవో, ఆ మంత్రములు, ఆయా శబ్దముల యర్థములు, అగ్ని మున్నగు దేవతానామముచే గ్రహింప బడును.

సం। అత్రాహ యాస్కాచార్యో నిరుక్తే :-

"కర్మ సంపత్తిర్ మంత్రో వేదే." ని. అ.౧-౨.

"అథాతో దైవతమ్. తద్ యాని నామాని ప్రాధాన్య స్తుతీనాం దేవతానాం తద్దైవత మిత్యాచక్షతే. సైషా దేవతోప పరీక్షా - యత్ కామ ఋషిర్ యస్యాం దేవతాయా మార్థపత్య మిచ్ఛన్ స్తుతిం ప్రయుంక్తే. తద్ దైవతః స మంత్రో భవతి. తా స్త్రివిధా ఋచః-పరోక్షకృతాః, ప్రత్యక్షకృతాః, ఆధ్యాత్మికశ్చ."

అస్యార్థః- (కర్మసం...) కర్మణా మగ్నిహోత్రాద్యశ్వమేధాంతానాం శిల్ప సాధనానాం చ సంపత్తిః- సంపన్నతా సంయోగో భవతి, యేన స మంత్రో వేదే దేవతాశబ్దేన గృహ్యతేః తథా చ కర్మణాం సంపత్తిర్ మోక్షో భవతి. యేన పరమేశ్వర ప్రాప్తిశ్చ. సోపి మంత్రో మంత్రార్థ శ్చాంగీకార్య :.

పూ . అథే త్యనంతరం దైవతం కిమ్?

ఉ . ఉచ్యతే - యత్ ప్రాధాన్యేన స్తుతిర్ యాసాం దేవతానాం క్రియతే, తద్ దైవత మితి విజ్ఞాయతే, యాని నామాని మంత్రోక్తాని, యేషా మర్థానాం మంత్రేషు విద్యన్తే, తాని సర్వాణి దేవతాలింగాని భవంతి.

తద్ యథా :–

"అగ్నిం దూతం పురోదధే హవ్యవాహ ముపబ్రువే, దేవాఀ. ఆసాదయా దిహ."

౧.య.౨౨—౧౭.

అత్రాగ్ని శబ్దో లింగ మస్తి.

పూ . అతః కిం విజ్ఞేయమ్ ?

ఉ . యత్ర యత్ర దేవతోచ్యతే, తత్ర తత్ర తల్లింగో మంత్రో గ్రాహ్య ఇతి. యస్య ద్రవ్యస్య నామ్నాన్వితం యచ్ఛందోఽస్తి, తదేవ దైవత మితి బోధ్యమ్, సా ఏషా దేవతోపపరీక్షా అతీతా, ఆగామినీ చాస్తి.

అత్రోచ్యతే :– ఋషి రీశ్వరః సర్వదృక్, యత్ కామో యం కామయమానః ఇమ మర్థ ముపది శేయ మితి, స యత్ కామః యస్యాం దేవతాయా మార్థపత్యమ్–అర్థస్య స్వామిత్వ ముపదేష్టు మిచ్ఛన్ సన్ స్తుతిం ప్రయుంక్తే. తదర్థగుణకీర్తనం ప్రయుక్తవానస్తి, స ఏవ మంత్రస్తద్దైవతో భవతి. కించ యదేవ అర్థ ప్రతీతికరణం దైవతం ప్రకాశ్యం యేన భవతి, స మంత్రో దేవతాశబ్ద వాచ్యోఽస్తీతి విజ్ఞాయతే. దేవతాభిధా ఋచః. యాభిర్ విద్వాంసః సర్వాః సత్యవిద్యాః స్తువంతి, ప్రకాశయంతి; ఋచస్తుతా వితి ధాత్వర్థయోగాత్.

తాః శ్రుతయః త్రివిధా స్త్రిప్రకారకాః సంతి–౧. పరోక్షకృతాః, ౨ ప్రత్యక్షకృతాః, ౩. ఆధ్యాత్మిక్య శ్చేతి. యాసాం దేవతానా మృచాం పరోక్షకృతోఽర్థోఽస్తి. తాః పరోక్షకృతాః; యాసాం ప్రత్యక్షమర్థో దృశ్యతే, తాః ప్రత్యక్షకృతా ఋచో దేవతాః; ఆధ్యాత్మిక్యశ్చ–అధ్యాత్మం జీవాత్మానం, తదంతర్యామిణం పరమేశ్వరం చ ప్రతిపాదితు మర్హా యా ఋచో మంత్రాః తా ఆధ్యాత్మిక్య శ్చేతి. ఏతా ఏవ కర్మకాండే దేవతా శబ్దార్థాః సంతీతి విజ్ఞేయమ్.

తె॥ దేవతాశబ్దముచే వేదమంత్రములు గ్రహింపబడు ననుటకు యాస్కముని ప్రమాణము:–

(కర్మసం...) వేదమంత్రములవలన నగ్నిహోత్రము మొదలు అశ్వమేధ పర్యంతము గల యజ్ఞములు, శిల్పవిద్య, వాని సాధనములు ప్రాప్తించును. కావున వేదమంత్రములు దేవతానామము గల వగుచున్నవి. లేక, ఏ వేదమంత్రములవలన కర్మసంపత్తి–మోక్షలాభము, పరమేశ్వరప్రాప్తియు గలుగునో, ఆ వేదమంత్రములకు, మంత్రార్థములకు దేవత యని నామము.

పూ. దైవతమని దేనినందురు?

ఉ. (అథాతో...) వేనిగుణములు వర్ణింపబడునో వానిని దైవతమందురు. మంత్రములలో నేయే యర్థముల కేయే సంజ్ఞలు మంత్రోక్తము లున్నవో , అవి యన్నియు దేవతాలింగము లగును. ఉదా:– "అగ్నిం దూతం–" 'ఓ మానవులార! ఎవడు (ఇహ) ఈ ప్రపంచమున, (దేవాన్) దివ్యభోగములను, (ఆసాదయాత్) ప్రాప్తింపజేయునట్టియు, (హవ్యవాహం) భోజనముచేయ నర్హమగు పదార్థములను ప్రాప్తింప జేయునట్టియు, (దూతమ్) దూతవలె కార్యము సిద్ధింపజేయునట్టియు, (అగ్నిమ్) అగ్నిని, (పురః) ముందు, (దధే) ఉంచునో, అతడు మిమ్ముల నుద్దేశించి, (ఉపబ్రువే) ఉపదేశించును. 'మీరును ఇట్లే చేయుడు' అని.

ఈ యజుర్వేదమంత్రమున 'అగ్ని' శబ్దము దేవతకు చిహ్నము.

పూ. ప: దీనింబట్టి తెలిసిన దేమి?

ఉ. ప: దీనింబట్టి యీ మంత్రమే యగ్నిదేవత యని తెలియబడినది. ఇట్లే యేయే మంత్రములలో ద్రవ్యనామ మంకితమై యుండునో, ఆ మంత్రములే దేవతలని యెంచవలయును. ఇట్లే యంతట నెఱుగవలయును. దేవతాశబ్దముచేత నే యే గుణముతో నే యే యర్థము గ్రహింపబడునో యవి యన్నియు నిరుక్తము, బ్రాహ్మణాది గ్రంథములలో బాగుగా వ్రాయబడియున్నవి. కారణ మేమన; ఈశ్వరు డే యే పదార్థముల నేయే నామములతో వేదములం దుపదేశించి యున్నాడో, ఆయా పదార్థములు, వానిని ప్రకటించు మంత్రములు, రెండును దేవతా శబ్దముచే జెప్పబడును. మఱియు నాయా నామములు గల మంత్రములవలననే యా యర్థములను దెలిసికొనవలయును. ఆ మంత్రములు ఋక్కులు దేవత లనబడును. వాని మూలముననే విద్వాంసులు సర్వ విద్యలను స్తుతియింతురు, ప్రకటింతురు. స్తుత్యర్థముగల'ఋచ్' ధాతువుతో ఋక్కుశబ్ద మేర్పడును.

ఆ మంత్రములు ముప్విధములు - ౧. పరోక్షములు, ౨ ప్రత్యక్షములు-ప్రసిద్ధార్థకములు, ౩. ఆధ్యాత్మికములు- జీవుడు, పరమేశ్వరుడు, అర్థముల కార్యకారణ భావములు నను విషయములను ప్రతిపాదించునవి. దీనింబట్టి భూత భవిష్యద్వర్తమాన కాలములందు నుండు పదార్థములను గూర్చియు, విద్యలను గూర్చియు తెలుపునవి మంత్రములే యని బోధపడుచున్నది. కావుననే మంత్రములకు దేవత యని నామము. కర్మకాండమున దేవతా శబ్దమునకు గల యర్థము లివియే యనియెఱుంగవలయును.

*సం॥ తద్యే అనాదిష్ట దేవతామంత్రా స్తేషు దేవతోపపరీక్షా – యద్దేవతః స యజ్ఞో వా యజ్ఞాంగం వా తద్దేవతా భవంతి, అథాన్యత్ర యజ్ఞాత్ ప్రాజాపత్యా ఇతి యాజ్ఞికా నారాశంసా ఇతి నైరుక్తాః. అపి వా సా కామదేవతా స్యాత్, ప్రాయో దేవతా వాఽస్తి హ్యాచారో బహులం లోకే – దేవదేవత్య మతిథిదేవత్యం పితృదేవత్యం, యాజ్ఞదైవతో మంత్ర ఇతి. ని.అ.౭.ఖం;౪.*

*(తద్యేఽనాది..)తత్–తస్మాద్, యే ఖల్వనాదిష్టదేవతా మంత్రాః అర్థాన్నవిశేషతో దేవతాదర్శనం నామార్థో వా యేషు దృశ్యతే, తేషు దేవతోపపరీక్షా కాఽస్తి త్యత్రోచ్యతే–*

*"యత్ర విశేషో న దృశ్యతే తత్రైవం యజ్ఞో దేవతా, యజ్ఞాంగం వే త్యేతద్దేవతాఖ్య మితి విజ్ఞాయతే. యే ఖలు యజ్ఞా దన్యత్ర ప్రయుజ్యంతే, తే వై ప్రాజాపత్యాః పరమేశ్వరదేవతాకా మంత్రా భవంతి" ఇత్యేవం యాజ్ఞికా మన్యంతే. అత్రైవం వికల్పోఽస్తి, నారాశంసా మనుష్యవిషయా ఇతి నైరుక్తా బ్రువంతి. తథా యా కామనా సా కామదేవతా భవతీతి సకామా లౌకికా జనా జానంతి. ఏవం దేవతా వికల్పస్య ప్రాయేణ లోకే బహుల మాచారోఽస్తి. క్వచిద్ దేవత్యం కర్మ, మాతృదేవత్యం, విద్వద్దేవత్యం, అతిథి దేవత్యం, పితృదేవత్యం చైతేపి పూజ్యాః–సత్కర్తవ్యాః సంతి. అత స్తేషా ముపకారకర్తృత్వ మాత్రమేవ దేవతాత్వ మస్తీతి విజ్ఞాయతే. మంత్రాస్తు ఖలు యజ్ఞసిద్ధయే ముఖ్యహేతుత్వా ద్యజ్ఞదైవతా ఏవ సంతీతి నిశ్చీయతే.*

తె॥ (తద్యే....) యాస్కముని యిట్లనుచున్నాడు. ఏ మంత్రములలో దేవతారూపమున కొండొక విశేషార్థముయొక్కనామము ప్రసిద్ధముగా కనిపింపదో, అట యజ్ఞాదులనే దేవతగానెంచవలయును. 'అగ్ని మీడే' అను మంత్రభాష్యమునందు ముప్విధములైన యజ్ఞములు వ్రాయబడినవి. ౧. అగ్నిహోత్రము మొదలు అశ్వమేధపర్యంతము గల యజ్ఞములు. ౨. ప్రకృతి మొదలు స్థూలపృథివి వఱకు గల జగద్రచనా రూపము, శిల్పవిద్యయును, ౩. సత్సంగాదులవలన కలుగు విజ్ఞానము, యోగమును. ఇవియే యా

మంత్రముల దేవతలు నని యెఱుంగనగును. లేక, 'వేనివలన నీ యజ్ఞము సిద్ధించునో యట్టి యజ్ఞాంగములు కూడ నా మంత్రములకు దేవతలగును. వానికంటె భిన్నములైన మంత్రములకు ప్రజాపతి - పరమేశ్వరుడు దేవత యగును' అని యాజ్ఞికులందురు. నిరుక్తి కారుల మతమున మనుష్యార్థ ప్రతిపాదకములగు మంత్రములకు దేవత మనుష్యులే యగుదురు. ఆమంత్రములలో మానవేచ్ఛ, కామన ప్రార్థన కనిపించుచున్నది కావున, వానికి కామనయే దేవతయని సకాములైన లౌకికజను లనుచున్నారు. ఇందు మత భేదము మిక్కిలిగా నున్నది. ఒకయెడ పూర్వోక్తదేవతలు చెప్పబడుదురు. ఇంకొకయెడ యజ్ఞాది కర్మలు, మఱి యొకచో మాత, వేఱొకచోట పిత, యిట్లే విద్వాంసుడు, అతిథి, ఆచార్యుడు దేవతలుగా చెప్పబడుచున్నారు. వీరెల్లరు పూజ్యులు. ఉపకారముచేయుదురు కావున దేవతలనబడుదురు. కాని, యజ్ఞమున మంత్రములు, పరమేశ్వరుడే దేవతలని ముఖ్యముగ నెంచబడుదురు. యజ్ఞము సిద్ధించుటకు మంత్రములు, పరమేశ్వరుడు ముఖ్యము.

సం॥ అత్ర పరిగణనమ్ః – గాయత్ర్యాదిచ్ఛన్దోఽన్వితామంత్రాః. ఈశ్వరాజ్ఞా, యజ్ఞః, యజ్ఞాంగం, ప్రజాపతిః, పరమేశ్వరః నరాః, కామః, విద్వాన్, అతిథిః, మాతా, పితా, ఆచార్యశ్చేతి కర్మకాండాదీన్ ప్రత్యేతా దేవతాః సంతి పరంతు మంత్రేశ్వరా వేవ యాజ్ఞదైవతే భవత ఇతి నిశ్చయః.

తె॥ దేవతల పరిగణనముః- గాయత్రి మున్నగు ఛందస్సులతో గూడిన మంత్రములు, వానియందు గల యీశ్వరాజ్ఞ, యజ్ఞములు, వాని యంగనులు-సాధనములు, ప్రజాపతియైన పరమేశ్వరుడు, మనుష్యులు, కామము, విద్వాంసుడు, అతిథి, తల్లి, తండ్రి-మాతాపితలు, ఆచార్యుడు వీరుదివ్యగుణములు గలిగియుండుటచే దేవత లనబడుదురు. కాని యజ్ఞమునందు ముఖ్యముగ వేద మంత్రములు, ఈశ్వరుడే దేవతలుగా గ్రహింపబడుదురు.

సం॥ అన్యచ్చ– "దేవో దానాద్ వా, దీపనాద్వా, ద్యోతనాద్వా, ద్యుస్థానో భవతీతి వా."

ని.౭–౧౫

"మంత్రా మననాత్, ఛందాంసి ఛాదనాత్." ని, ౭–౧౨.

అస్యార్థః – (దేవో దానాత్) యత్ స్వస్వత్వ నివృత్తి పూర్వకం పరస్వత్వోత్పాదనం తద్దానం భవతి. (దీపనాత్) దీపనం ప్రకాశనమ్. (ద్యోతనాత్) ద్యోతన ముపదేశాదికం చ. అత్ర దానశబ్దేన ఈశ్వరో, విద్వాంసో, మనుష్యాశ్చ దేవసంజ్ఞాః సంతి. దీపనాత్ సూర్యాదయో, ద్యోతనాత్ మాతృపిత్రాచార్యాతిథయశ్చ, (ద్యుస్థానో) తథా ద్యౌః, కిరణా ఆదిత్య రశ్మయః, ప్రాణ సూర్యాదయో వా స్థానం స్థిత్యర్థం యస్య స ద్యుస్థానః. ప్రకాశకానా మపి ప్రకాశకత్వాత్ పరమేశ్వర ఏవాత్ర దేవోఽస్తీతి విజ్ఞేయమ్. అత్ర ప్రమాణమ్ః–

"న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాంతి కుతోఽయ మగ్నిః, తమేవ భాంతమనుభాతి సర్వం తస్య భాసా సర్వ మిదం విభాతి" ఇతి కఠవల్లీ. ౫.మం.౧౫

తత్ర నైవ పరమేశ్వరే సూర్యాదయో భాంతి, ప్రకాశం కుర్వంతి. కింతు, తమేవ భాంతం ప్రకాశయంత మను–పశ్చాత్ తే హి ప్రకాశ యంతి. నైవ ఖల్వేతేషు కశ్చిత్ స్వాతంత్ర్యేణ ప్రకాశోఽస్తీతి. అతో ముఖ్యో దేవ ఏకః పరమేశ్వర ఏవోపాస్యోఽస్తీతి మన్తవ్యమ్.

తె॥ (దేవో దానాత్) కొండొక పదార్థము నిమ్నలిఖితార్థములలో 'దేవుడు - దేవత' అనబడునని యాస్కముని నిరుక్తమున వ్రాయుచున్నాడు.

౧ దానము :- తన వస్తువు నితరుల ప్రయోజనమునకిచ్చుట ( వస్తువుపై తన స్వామిత్వము వదలుకొని యితరులకు దానిపై స్వామిత్వము గలిగించుట.) ప్రాణులకు జగత్తులోని పదార్థములన్నియు నిచ్చినవాడు కావున పరమేశ్వరుడు ముఖ్యదాత - అతడే దేవుడు. విద్వాంసులు కూడ విద్యాదుల నితరులకు నిత్తురు. కావున, వారుకూడ దేవపదవాచ్యులే-దేవులే. ౨. దీపనము:- ప్రకాశింపజేయుట, మూర్తిమంతములగు పదార్థములను ప్రకాశింపజేయుటవలన సూర్యాదిలోకములు కూడ దేవులనబడును. ౩. ద్యోతనము:- సత్యము నుపదేశించుట. మాతాపితలు, ఆచార్యుడు అతిథి అనువీరు పాలించుట వలనను, విద్యల నొసంగుటచేతను, సత్యము నుపదేశించుటచేతను దేవులనబడుదురు. ౪. ద్యుస్థానము : కిరణములు, ప్రాణములు. సూర్యాదులు స్థానముగాగల ప్రకాశక పదార్థములు దేవులనబడును. ఇక్కడ కూడ వాస్తవమున సూర్యాదిలోకములకు గూడ ప్రకాశము నొసంగు పరమేశ్వరుడే సర్వమానవులకు నుపాసింపదగిన దేవుడు - ఇష్టదేవుడు. అన్యు డెవడు లేడు. ఇందులకు కఠోపనిషత్తు ప్రమాణము.

(న తత్ర...) సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు విద్యుత్తు అగ్ని, యివి యన్నియు పరమేశ్వరునకు కాంతి నొసంగజాలవు. వీనికి పరమేశ్వరునివలననే ప్రకాశము లభించును. పరమేశ్వరుని ప్రకాశమువలననే సూర్యాది లోకములు ప్రకాశించుచున్నవి. కావున నీశ్వరుడు తక్క యితర పదార్థ మేదియు స్వయం ప్రకాశము కలది కాదని తెలిసి కొనవలయును. పరమేశ్వరుడే ముఖ్యదేవుడు. అతనినే యుపాసింప వలయును.

(మంత్రా..) నిరుక్తమున మంత్రశబ్దనిర్వచనము - వేనిమూలమున నెల్ల సత్యవిద్యలు మననము-విచారణ-చేయబడునో యవి మంత్రములు. మంత్రములవలన విద్యలు తెలియబడునని భావము. ఛాదనము, పాపము, దుఃఖము మున్నగు వానినుండి రక్షంపబడుటకు ఆత్మకు మంత్రము లాచ్ఛాదనము లగును. కావున చంధస్సు లనబడును. 'ఛద్' ధాతువునకు 'అసున్' ప్రత్యయము చేర్చుటచే 'ఛందస్' శబ్దము సిద్ధించును. మంత్ర ప్రసంగమువలన గాయత్రి మున్నగు రచనలు కూడ ఛందస్సులనబడును.

*సం॥ "నైన ద్దేవా ఆప్నువన్ పూర్వ మర్షత్."* యజు. ౪౦-౪,

*అత్ర దేవ శబ్దేన మనః షష్ఠాని శ్రోత్రాదీ నీంద్రియాణి గృహ్యంతే, తేషాం శబ్ద స్పర్శ రూప రస గంధానాం సత్యాసత్యయో శ్చార్థానాం ద్యోతకత్వాత్ తాన్యపి దేవాః. యో దేవః సా దేవతా 'దేవాత్త లిత్యనేన సూత్రేణ స్వార్థే తల్ విధానాత్. స్తుతిర్ హి గుణ దోష కీర్తనం భవతి. యస్య పదార్థస్య మధ్యే యాదృశా గుణా వా దోషాః సంతి. తాదృశానా మేవోపదేశః స్తుతిర్ విజ్ఞాయతే. తద్యథా –అయ మసిః ప్రహృతః సన్నతీవ ఛేదనం కరోతి, తీక్ష్ణధారః స్వచ్ఛో ధనుర్వ న్నామ్యమానోఽపి న త్రుట్యతీత్యాది గుణ కథనమ్, అతో విపరీతోఽసిర్నైవతత్ కర్తుం సమర్థో భవతీ త్యసేః స్తుతిర్ విజ్ఞేయా.*

తె॥ (నైనద్దేవా....) ' ఆ సర్వ వ్యాపకుడగు పరమేశ్వరుని దేవతలు-ఇంద్రియములు పొందజాలవు' అని యజుర్వేదము.

ఇట దేవపద మింద్రియ వాచకము, శ్రోత్రము (చెవి), త్వక్కు, నేత్రములు, జిహ్వ, నాసిక, మనస్సునను నీ యాఱింద్రియములు దేవత లనబడినవి. శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము, సత్యా సత్య పదార్థములు నివి యన్నియు వీనిచే ప్రకాశితములగును- తెలుపబడును. దేవుడే దేవత. దేవ శబ్దమునకు స్వార్థమున 'తల్' ప్రత్యయము చేర్చిన దేవత యగును. పరమేశ్వరుని మూలమున నే గుణము లే పదార్థమున నుంచబడినవో, వాని నట్లే వర్ణించుట, వ్రాయుట, వినిపించుట, తెలియజేయుటయు స్తుతి యనబడును. అట్లే మానవ సృష్టి యందలి గుణ దోషముల నున్న వాని నున్నట్లు చెప్పుటయు,

వ్రాయుటయు స్తుతియే. ఇట్టి స్తుతి యొనర్చుట చేతనే యవి ఇంద్రియములు-దేవత లనబడినవి. గుణములు దేవత్వమునకు హేతువు; దోషములు కావు. ఇంద్రియము లెవరికి నిష్ట దేవుడు కాజాలవు. స్తుతికి ఉదాహరణము : 'ఈ ఖడ్గము ఖండించుటలో చాల మంచిది, నిర్మలమైనది, దీని ధార-వాయి-మిక్కిలి పదునైనది, ఎంతగా వంచినను ధనుస్సు వలె విఱుగదు.' ఇది ఖడ్గస్తుతి.

సం॥ తద్వ దన్యత్రాపి విజ్ఞేయమ్. పరం త్వయం నియమః కర్మకాండం ప్రత్యస్తి, ఉపాసనాజ్ఞాన కాండయోః కర్మ కాండస్య నిష్కామభాగేఽపి పరమేశ్వర ఏవేష్టదేవోఽస్తి.

పూ : కస్మాత్ ?

ఉ : తత్ర తస్యైవ ప్రాప్తిః ప్రార్థ్యతే. యశ్చ తస్య సకామో భాగోఽస్తి. తత్రేష్ట విషయ భోగ ప్రాప్తయే పరమేశ్వరః ప్రార్థ్యతే. అతః కారణాద్ భేదో భవతి. పరంతు నైవేశ్వరార్థ త్యాగః క్వాపి భవతీతి వేదాభి ప్రాయోఽస్తి.

తె॥ ఇట్లే యన్య స్థలములందును దేవ శబ్ద వ్యవహారము నెఱుగ వలయును. కాని, పరమేశ్వరు డేయే నామములతో నేయే పదార్థముల గుణములను మంత్రములలో కీర్తించియున్నాడో, ఆ వస్తువులే దేవతలనబడును. ఆ మంత్రములు కూడ నా దేవతల పేరుతోనే వ్యవహరింపబడును. ఈ యర్థములలో దేవతా శబ్దము వ్యవహరింపవలయునను నియమము కర్మకాండముననే యున్నది. అందఱకు నంతట యిష్ట దేవుడు పరమేశ్వరుడే. ఉపాసనాజ్ఞానకాండలు, కర్మకాండలో నిష్కామ భాగము, వీనియందు పరమేశ్వరుడే యిష్ట దేవుడు. అతని ప్రాప్తి కొఱకే స్తుతి ప్రార్థనోపాసనాదులు చేయుట యుక్తము.

పూ : ఎందువలన?

ఉ : ఆ తావులందు పరమేశ్వరుని ప్రార్థనయే చేయబడును. భేదము మాత్ర మింతయే. కర్మకాండలో నిష్కామభాగమున తిన్నగా పరమాత్మ ప్రాప్తికే ప్రార్థన జరుగును; సకామభాగమున మాత్రము అభీష్ట విషయ భోగము లభింపవలయునను పరమాత్ముని ప్రార్థింతురు. అట్లు పరమేశ్వరు డన్ని యెడల గ్రహింపబడును. అతనిని త్యజించుతావులేదు. వేదముల యభిప్రాయ మిదియే. అతడే యెల్లరకు నుపాస్య దేవుడు.

సం॥ అత్ర ప్రమాణమ్:- "మహా భాగ్యా ద్దేవతాయా ఏక ఆత్మా బహుధా స్తూయతే. ఏకస్యాత్మనోఽన్యే దేవాః ప్రత్యంగాని భవంతి, కర్మ జన్మాన, ఆత్మ జన్మాన, ఆత్మై వైషాం రథో భవ త్యాత్మాఽశ్వా[1], ఆత్మా యుధ మాత్మేషవ ఆత్మా సర్వం దేవస్య దేవస్య. ని, అ. ౭-౪.

(మహా భాగ్యా.....) సర్వాసాం వ్యవహారోపయోగిదేవతానాం మధ్య ఆత్మన ఏవ ముఖ్యం దేవతాత్వ మస్తి.

పూ: కుతః?

ఉ : ఆత్మనో మహాభాగ్యా దర్హాత్ సర్వ శక్తి మత్వాది విశేషగుణ వత్వాత్. న తస్యాగ్రేఽన్యస్య కస్యాపి దేవతాత్వం గణ్యం భవితు మర్హతి.

పూ : కుతః?

ఉ : సర్వేషు వేదేష్వేక స్యాద్వితీయ స్యాసహాయస్య సర్వత్ర వ్యాప్త స్యాత్మన ఏవ బహుధా బహుప్రకారై రుపాసనా విహితాఽస్తి. అస్మా దన్యే యే దేవా ఉక్తా, వక్ష్యంతే చ తే సర్వ ఏకస్యాత్మనః పరమేశ్వరస్య ప్రత్యంగాన్యేవ భవంతి - 'అంగ మంగం ప్రత్యంచతీతి' నిరుక్త్యా తస్యైవ సామర్థ్య

---

1. అశ్వ ఇతి నిరుక్తే పాఠః

స్త్యైకైకస్మిన్ దేశే ప్రకాశితాః సంతి. తే చ ( కర్మజ) యతః కర్మణా జాయంతే తస్మాత్ కర్మజన్మానో, యత ఆత్మన ఈశ్వరస్య సామర్థ్యా జ్జాతా స్తస్మా దాత్మజన్మాన శ్చ సంతి. అథైతే షాం దేవానా మాత్మా పరమేశ్వర ఏవ రథో రమణాధికరణమ్. స ఏవాశ్వో గమన హేతుః. స ఆయుధం విజయావహ మిషవోబాణా దుఃఖనాశకాః స ఏవాస్తి, తథా చాత్మైవ దేవస్య సర్వస్వ మస్తి. అర్థాత్ సర్వేషాం దేవానాం స ఏవోత్పాదకో ధాతాఽధిష్ఠాతా మంగలకారీ వర్తతే. నాతః పరం కించి దుత్తమంవిద్యత ఇతి బోధ్యమ్.

తె॥ ఇందు నిరుక్త ప్రమాణము :- (మహా భాగ్యాద్....) పరమేశ్వరుని నొక్కనినే యుపాసింప వలయును. వ్యవహారములందుపయోగపడు దేవతల నుపాసింపరాదు.

పూ : ఎందువలన?

ఉ : కారణమేమన : సర్వశక్తి మత్త్వాదిగుణము లా ప్రభువునందే కలవు. ఇతర దేవతలం దాగుణములు లేవు. కావున, వానినుపాసింపరాదు.

పూ : ఎందువలన?

ఉ : సర్వ వేదములందును, నద్వితీయుడు – పరసహాయ మొకింతయు నంగీకరింపనివాడు – సర్వ వ్యాపకుడునగు నా పరమేశ్వరుని యుపాసనయే యనేక విధముల వర్ణింపబడినది. ఇతర దేవత లన్నియు నా పరమేశ్వరునికే ప్రత్యంగములు. పరమేశ్వరుని సామర్థ్యాంశములచే ప్రకాశితములగునవి. వానికి స్వయం ప్రకాశము లేదు. పరమేశ్వరుని ప్రకాశము వలననే వానికి ప్రకాశము లభించును. ఈ యితర దేవత లన్నియు కొండొక ప్రయోజన సిద్ధి కొఱకు నిర్మింపబడినవి. వ్యర్థములు కావు. వీని వలన నేదో యొక కార్యము నిర్వహింప నగును. కావుననే యివి కర్మ జన్ములనబడినవి. ఈశ్వర సామర్థ్యము వలన జనించుటచే నవి 'ఆత్మ జన్ము'లగును. పరమేశ్వరుడు వీనికి రథము–రమింప, విహరింపవీలగు స్థానము. వీనికి 'అశ్వము' గమనమునకు హేతువు పరమేశ్వరుడే. ఈ దేవతలకు 'ఆయుధము' విజయము చేకూర్చువాడును పరమేశ్వరుడే. 'ఇషవః' దుఃఖమును నశింపజేయు బాణములును పరమేశ్వరుడే. అట్లే పరమేశ్వరుడే సర్వ దేవతలకు సర్వస్వము నై యున్నాడు. – అతడే దేవతల నుత్పన్నము చేసి, ధరించి, రక్షించుచున్నాడు. అతడే మంగళ కారియు. అతని కంటె నుత్కృష్ట పదార్థము – గొప్ప వస్తువు – ఇంకొకటి లేదు.

సం॥ అత్రాన్యదపి ప్రమాణమ్

౧. "యే త్రింశతి త్రయ స్పరో దేవాసో బర్హి రాసదన్. విద న్నహ ద్వితాసనన్."

ఋ. ౬, ౨-౮౩.౧

౨. " త్రయస్త్రింగ్ం శతా స్తువత భూతా న్యశామ్యన్.
ప్రజాపతిః పరమే ష్ఠ్యధిపతి రాసీత్.' య ౧౪-౩౧

౩. "యస్య త్రయస్త్రింశద్ దేవా నిధిం రక్షంతి సర్వదా. నిధిం తమద్య కో వేద యం దేవా అభిరక్షథ"
అథర్వకాం. ౧౦, ప్రపా.౨౩, ౪-౨౩.

౪. "యస్య త్రయస్త్రింశ ద్దేవా అంగే గాత్రా విభేజిరే. తాన్ వై త్రయస్త్రింశ ద్దేవా నేకే బ్రహ్మవిదో విదుః."
అథర్వ. కాం. ౧౦-౨౩, ౪-౨౭.

"స హోవాచ మహిమాన ఏవైషా మేతే త్రయస్త్రిగ్ంశత్త్వేవ దేవా ఇతి. కతమే తే త్రయస్త్రిగ్ంశ దితి; అష్టౌ వసవః, ఏకాదశ రుద్రాః, ద్వాదశాదిత్యా స్త ఏకత్రింశ దింద్రశ్చైవ ప్రజాపతిశ్చ త్రయస్త్రిగ్ంశా"వితి.
శత.౧౪—౬—౯—౩

"కతమే వసవ ఇతి? అగ్నిశ్చ పృథివీచ వాయుశ్చాంతరిక్షంచాదిత్యశ్చ ద్యౌశ్చ. చంద్రమాశ్చ, నక్షత్రాణి చైతే వసవః. ఏతేషు హీదగ్ం సర్వం వసుహిత మేతే హీదగ్ం సర్వం వాసయంతే తద్య దిదగ్ం వాసయంతే తస్మాద్ వసవ ఇతి"
శత, ౧౪—౬, ౯—౪

"కతమే రుద్రా ఇతి? దశేమే పురుషే ప్రాణా, ఆత్మైకాదశ స్తే యదాస్మాన్ మర్త్యాచ్ఛరీరా దుత్ క్రామం త్యథ రోదయంతి తద్యద్ రోదయంతి తస్మాద్ రుద్రా ఇతి." శత. ౧౪—౬, ౯—౫

"కతమ ఆదిత్యా ఇతి? ద్వాదశ మాసాః సంవత్సరస్యైత ఆదిత్యాః. ఏతే హీదగ్ం సర్వ మాదదానా యంతి; తద్య దిదగ్ం సర్వ మాదదానా యంతి తస్మా దాదిత్యా ఇతి." శత. ౧౪—౬, ౯—౬

"కతమ ఇంద్రః? కతమః ప్రజాపతిః? స్తనయిత్ను రేవేంద్రో, యజ్ఞః ప్రజాపతి రితి. కతమః స్తనయిత్ను రితి? అశని రితి, కతమో యజ్ఞ ఇతి? పశవ ఇతి." శత. ౧౪—౬, ౯—౭

"కతమే తే త్రయో దేవా ఇతి? ఇమ ఏవ త్రయో లోకాః, ఏషుహీమే సర్వే దేవా ఇతి. కతమౌ ద్వౌ దేవా వితి? అన్నం చైవ ప్రాణశ్చేతి. కతమోఽధ్యర్ధ ఇతి? యోఽయం పవత ఇతి"
శత. ౧౪—౬, ౯—౮

"తదాహుః. యదయ మేక ఏవ పవతేఽథ కథ మధ్యర్ధ ఇతి? యదస్మిన్నిదగ్ం సర్వ మధ్యార్ధ్నోత్తే నాధ్యర్ధ ఇతి. కతమ ఏకో దేవ ఇతి? స బ్రహ్మ త్యది త్యాచక్షతే."
శత. ౧౪, ౬, ౯—౯

అథైషా మర్థః— వేదమంత్రాణా మేవార్థో బ్రాహ్మణ గ్రంథేషు ప్రకాశిత ఇతి ద్రష్టవ్యమ్.

శాకల్యం ప్రతి యాజ్ఞవల్క్యోక్తిః— త్రయస్త్రింశదేవ దేవాఃసంతి. అష్టౌ వసవః, ఏకాదశ రుద్రాః. ద్వాదశాదిత్యాః, ఇంద్రః. ప్రజాపతి శ్చేత.

తత్ర (వసవః) అగ్నిః, పృథివీ, వాయుః, అంతరిక్షమ్, ఆదిత్యః. ద్యౌః, చంద్రమాః, నక్షత్రాణి చ, ఏతేషా మష్టానాం వసుసంజ్ఞాకృతాఽస్తి. ఆదిత్యః సూర్యలోక స్తస్య ప్రకాశోఽస్తి. ద్యౌః సూర్యసన్నిధౌ, పృథివ్యాదిషు వా. అగ్నిలోకోఽస్త్యగ్ని రేవ.

పూః కుత ఏతే వసవ ఇతి?

ఉః యద్యస్మా దేతే ష్వష్టస్వే వేదం సర్వం సంపూర్ణం వసు వస్తుజాతం హితం ధృత మస్తి. కించ సర్వేషాం వాసాధికరణా నీమ ఏవ లోకాః సంతి. హి యత శ్చేదం వాసయంతే సర్వస్యాస్య జగతో వాసహేతవ స్తస్మాత్ కారణా దగ్న్యాదయో వసుసంజ్ఞకాః సంతీతి, బోద్ధవ్యమ్.

(ఏకాదశ రుద్రాః) యే పురుషేఽస్మిన్ దేహే ప్రాణః, అపానః, వ్యానః, సమానః, ఉదానః, నాగః, కూర్మః, కృకలః, దేవదత్తః, ధనంజయశ్చ – ఇమే దశప్రాణాః. ఏకాదశ ఆత్మా, సర్వే మిలిత్వైకాదశ రుద్రా భవంతి.

పూః కుత ఏతే రుద్రాః?

ఉః ఇత్యత్రాహ – యదా యస్మిన్ కాలేఽస్మాన్ మరణధర్మకా చ్ఛరీరాత్ ఉత్క్రామంతో నిః సరంతః సంతోఽథే త్యనంతరం మృతక సంబంధినో జనాం స్తే రోదయంతి, యతో జనా రుదంతి, తస్మాత్ కారణా దేతే రుద్రాః సంతీతి విజ్ఞేయమ్.

(ద్వాదశాదిత్యాః) చైత్రాద్యాః ఫాల్గునాంతా ద్వాదశ మాసా ఆదిత్యా విజ్ఞేయాః.

పూః కుతః?

ఉః హి యత ఏతే సర్వంజగ దాదదానా అర్థా దాసమంతాద్ గృహ్ణంతః ప్రతిక్షణ ముత్పన్నస్య వస్తున ఆయుషః ప్రలయం నికట మానయంతో యంతి గచ్ఛంతి చక్రవద్ భ్రమణే నోత్తరోత్తరం జాతస్య వస్తునోఽవయవ శిథిలతాం పరిణామేన ప్రాపయంతి. తస్మాత్ కారణా న్మాసానా మాదిత్య సంజ్ఞా కృతాఽస్తి.

ఇంద్రః పరమైశ్వర్య యోగాత్ స్తనయిత్ను రశనిర్ విద్యుదితి, ప్రజాపతిర్ యజ్ఞః పశవ ఇతి, ప్రజాయాః పాలన హేతుత్వాత్ పశూనాం యజ్ఞస్య చ ప్రజాపతి రితి గౌణికీ సంజ్ఞా కృతాఽస్తి.

ఏతే సర్వే మిలిత్వా త్రయస్త్రింశ ద్దేవా భవంతి. 'దేవో దానా' దిత్యాది నిరుక్త్యా హ్యేతేషు వ్యావహారిక మేవ దేవత్వం యోజనీయమ్. త్రయోలోకా స్త్రయో దేవాః.

పూః కే తే.

ఉః ఇత్య త్రాహ నిరుక్త కారః – 'ధామాని త్రయాణి భవంతి, స్థానాని, నామాని, జన్మా నీతి.'

ని, ౯–౨

"త్రయో లోకా ఏత ఏవ–వా గేవాయం లోకో మనోఽంతరిక్ష లోకః, ప్రాణోఽసౌ లోకః."

శత. ౧౪–౪, ౩–౧౧

ఏతేపి త్రయో దేవా జ్ఞాతవ్యాః. ద్వౌ దేవా వన్నం ప్రాణ శ్చేతి. అధ్యర్ధో బ్రహ్మాండస్థః సూత్రాత్మాఖ్యః సర్వజగతో వృద్ధికరత్వాద్ వాయుర్ దేవః.

పూః కి మేతే సర్వ ఏవోపాస్యాః సంతి?

ఉః ఇత్య త్రాహ, నైవ; కింతు (స బ్రహ్మ) యత్ సర్వజగత్ కర్తృ సర్వశక్తిమత్ సర్వ స్యేష్టం సర్వోపాస్యం సర్వాధారం సర్వవ్యాపకం సర్వకారణమనాది సచ్చిదానంద స్వరూప మజం, న్యాయకా రిత్యాది విశేషణ యుక్తం బ్రహ్మాస్తి, స ఏవైకో దేవ శ్చతుస్త్రింశో వేదోక్త సిద్ధాంత ప్రకాశితః పరమేశ్వరో దేవః సర్వమనుష్యై రుపాస్యోఽస్తీతి మన్యధ్వమ్. యే వేదోక్త మార్గపరాయణా ఆర్యాః తే సర్వదైత స్యైవో పాసనం చక్రుః, కుర్వంతి, కరిష్యంతి చ. అస్మాద్ భిన్నస్యేష్టకరణే నోపాసనేన చానార్యత్వ మేవ మనుష్యేషు సిధ్యతీతి నిశ్చయః. అత్ర ప్రమాణమ్– "ఆత్మేత్యేవోపాసీత" శత. ౧౪–౪, ౨–౧౯

"స యోఽన్య మాత్మనః ప్రియం బ్రువాణం బ్రూయాత్ ప్రియగ్ం రోత్స్యతీ తీశ్వరో హ తథైవ స్యాదాత్మాన మేవ ప్రియ ముపాసీత, స య ఆత్మాన మేవ ప్రియ ముపాస్తే, న హాస్య ప్రియం ప్రమాయుక్తం భవతి"

శ. ౧౪–౪, ౨–౧౮.

"యోఽన్యాం దేవతా ముపాస్తే, న స వేద, యథా పశురేవగ్ం స దేవానామ్"

శత, ౧౪-౪, ౨-౨౨.

అనే నార్యేతిహాసేన విజ్ఞాయతే-న పరమేశ్వరం విహా యాన్య స్యోపాసకా ఆర్యా హ్యాసన్నితి.

తె॥ దేవతావిషయకములగు సన్య ప్రమాణములు:

ఋగ్వేదమున (యే త్రింశత్...) ముప్పదిమూడు దేవతలు నా యంతఃకరణమున నుండి పరమాత్మ నెఱుగుగాక! కర్మదేవతలు, జ్ఞానదేవతలు నను రెండు విధములగు దేవతలును దుర్వ్యసనములను తమ చెంతకు రానీయకుండు గాక!

యజుర్వేదమునను (త్రయ స్త్రింశత్) నా ముప్పది మూడు దేవతల వర్ణన గలదు. కాని యుపాస్యదేవుడు మాత్రము ప్రజాపతి - పరమేశ్వరుడొక్కడే. అతని నుపాసించుటవలననే భౌతికములగు నుపద్రవము లన్నియు శాంతించును.

ఏ పరమేశ్వరుని కోశమును ప్రాపంచికములయిన ముప్పది మూడు దేవతలు- దివ్యపదార్థములు- రక్షించుచున్నవో, ఆ కోశమును నేడెఱుగు వారెవరు?' అని యథర్వ వేదమున గలదు. మఱియు నందే, 'ఆ పరమేశ్వరునందుండు నే ముప్పది మూడు దేవతలు తమ్మునదాము వేఱు వేఱుగ విభక్తములుగ జేసికొనినవో, ఆ దివ్య పదార్థములను (దేవతలను) బ్రహ్మజ్ఞానులలో కొందఱే యెఱుగుదురు' అనియు నున్నది.

బ్రాహ్మణ గ్రంథములు వేదమంత్రముల వ్యాఖ్యానములు. అందు శతపథ బ్రాహ్మణమున నిట్లున్నది. (స హోవాచ....)

యాజ్ఞవల్క్యుడు శాకల్యునితో ననుచున్నాడు:- వ్యావహారిక దేవతలు ముప్పది మూడు (౩౩) గలవు. ఎనిమిది (౮) వసువులు, పదునొకండు (౧౧) రుద్రులు, పది రెండు (౧౨) ఆదిత్యులు, ఇంద్రుడు (౧), ప్రజాపతి(౧).

(8) ఎనిమిది వసువులు:- అగ్ని, పృథివి-భూమి, వాయువు, అంతరిక్షము, ఆదిత్యుడు, ద్యౌః (దివము), చంద్రుడు, నక్షత్రములు.

ఆదిత్యుడన సూర్యలోకము. దాని ప్రకాశము ద్యులోకము (ద్యౌః) అందురు. అది సూర్యునకు సమీపమునను, పృథివ్యాదిలోకము లందును నుండును. అగ్నిలోక మగ్నియే యగును.

పూ. వీనిని వసువులని యేల చెప్పుదురు?

ఉః పదార్థము లన్నియు వీనియందే వసించును. ఈ లోకములే యన్నింటికి నివాసస్థానములు - కావున వసువు లనబడును.

(౧౧) ఏకాదశరుద్రులు :- శరీరమున గల పది ప్రాణములు - ప్రాణము, అపానము, వ్యానము, సమానము, ఉదానము, నాగము, కూర్మము, కృకలము, దేవదత్తము, ధనంజయము - అనునవి పదియు, పదునొకండవది జీవాత్మ కలిసి ఏకాదశరుద్రు లనబడును.

పూ: వీనిని రుద్రులందు రేల?

ఉః ఇవి యన్నియు శరీరమునుండి వెడలిపోయినపుడు మృత్యువు సంభవించును. మరణించిన వ్యక్తికి

సంబంధించిన వారపుడు రోదనము సేయుదురు. ఇట్టివి బంధువుల రోదనమునకు హేతువులై రుద్రులనబడును.

(౧౨) ఆదిత్యులు :- చైత్రము మొదలు ఫాల్గునము వఱకు గల పండ్రెండు మాసములు ఆదిత్యులనబడును. కారణమేమన:- అన్నింటి ఆయువును గ్రహించుచు మాసములు గతించును - కావున నాదిత్యు లనబడును.

(౧) విద్యుత్తు ఇంద్రు డనబడును. అది యుత్తమమగు నైశ్వర్య విద్యకు ముఖ్యహేతువు.

ప్రజాపతి యన యజ్ఞము. ఇయ్యది వాయువును, వృష్టిజలమును శుద్ధముచేసి ప్రజలను పాలించును. పశువులు కూడ యజ్ఞనామముచే జెప్పబడును. వాని వలనను ప్రజలకు జీవన మేర్పడును.

ఇట్లే ముప్పది మూడును తమ తమ దివ్యగుణములు కారణములుగ దేవత లనబడును. పూర్వము చెప్పిన దేవశబ్ద నిర్వచనమును బట్టి యీ దేవత లన్నియు వ్యావహారికములు.

మూడు లోకములు కూడ మూడు దేవత లనబడును. అవి యెయ్యవి యన - : ౧. స్థానము, ౨. నామము, ౩. జన్మము - అని నిరుక్తకారుని సమాధానము.

౧. వాక్కు పృథివీలోక మనియు, ౨. మనస్సు అంతరిక్షమనియు, ౩. ప్రాణము ద్యులోక మనియు శతపథము చెప్పుచున్నది.

౧. అన్నము, ౨. ప్రాణము, ౩. అధ్యర్ధము. ఈ మూడును దేవతలనియు నందే యున్నది. ఇందు అధ్యర్ధమువలన నెల్లరి ధారణ, వృద్ధియు గలుగును. సమస్తజగమున వ్యాపించి సూత్రాత్మగా నుండు వాయువే అధ్యర్ధ దేవత యనబడును.

పూ: ఈ దేవతలన్నియు మానవు లుపాసింపదగినవియేనా?

ఉ: పైన వర్ణింపబడిన దేవతలలో నొక్కటియు మానవుడుపాసింపదగినది లేదు. కాని, లోకవ్యవహారములు సిద్ధించుట కవి యుపయుక్తములగును. మనుష్యులెల్లరు నుపాసింపదగినది యొక్క పరబ్రహ్మము - పరమేశ్వరుడు మాత్రమే. ఇందులకు ప్రమాణము:-

('స బ్రహ్మా త్యదిత్యాచక్షతే' శత...) సర్వజగత్కర్త, సర్వశక్తిమంతుడు, ఎల్లరకు నిష్టుడు, ఎల్లరిచే నుపాసింపదగినవాడు, సర్వ ధారణకర్త, సర్వవ్యాపకుడు, సర్వకారణుడు ఆద్యంతములు లేనివాడు, సచ్చిదానంద స్వరూపుడు, అజన్ముడు న్యాయకర్త- మున్నగు విశేషణములతో వేదాదిశాస్త్రములందు వర్ణింపబడిన పరమేశ్వరుడే ముప్పది నాల్గవ దేవత. అతడే యెల్లరికి నిష్టదేవుడు. అతనికంటె భిన్నవ్యక్తిని గాని, భిన్న పదార్థములనుగాని యిష్టదేవుడుగా నంగీకరించు వాడనార్యుడు- అనాడి-యనదగును.

శతపథ బ్రాహ్మణ మార్యుల యితిహాసమును దెలుపును. అందిట్లున్నది. (ఆత్మేత్యేవ..) ఎల్లరకు నాత్మయగు పరమేశ్వరు నెల్లమానవులు నుపాసింపవలయును.

(స యో...) ఎవడేని 'పరమేశ్వరుని విడిచి యన్యు నీశ్వరుడని యెంచి వానియందు భక్తియుంచవలయు' నని చెప్పిన నతనితో 'నీ వెల్లప్పుడు దుఃఖములతో నేడ్చుచుందువు. ఈశ్వరు నుపాసించువాడే యానందమున నుండును' అని యనవలయును.

(యోఽన్యా...) పరమేశ్వరునికంటె భిన్నమగు పదార్థము నీశ్వరబుద్ధితో నుపాసించువా డేమియు నెఱుగడు. కావున నతడు విద్వాంసుల మధ్య పశువు-గార్దభముతో సమానుడుగా నుండును.

ఈ ప్రమాణములం బట్టి యార్యులెల్లపుడు నొక్క యీశ్వరునే యుపాసించుచు వచ్చిరని తెలియుచున్నది.

సం॥ అతః ఫలితార్థోఽయం జాతః– దేవశబ్దే 'దివు' ధాతోర్ యే దశార్థాస్తే సంగతా భవంతీతి. తద్యథా– ౧. క్రీడా, ౨. విజిగీషా, ౩. వ్యవహారః, ౪. ద్యుతిః, ౫. స్తుతిః, ౬. మోదః, ౭. మదః, ౮. స్వప్నః, ౯. కాంతిః, ౧౦ గతిశ్చేతి. ఏషా ముభయత్ర సమానార్థత్వాత్; పరంత్వన్యాః సర్వా దేవతాః, పరమేశ్వర ప్రకాశ్యాః సంతి. స చ స్వయం ప్రకాశోఽస్తి. తత్ర– క్రీడనం క్రీడా; దుష్టాన్ విజేతు మిచ్ఛా విజిగీషా; వ్యవహ్రియంతే యస్మిన్ వ్యవహరణం వ్యవహారః; స్వప్నో నిద్రా; మదో గ్లేపనం దీనతా. ఏతే ముఖ్యతయా లౌకిక వ్యవహార వృత్తయో భవంతి. తత్సిద్ధి హేతవోఽగ్న్యాదయో దేవతాః సంతి, అత్రాపి నైవ సర్వథా పరమేశ్వరస్య త్యాగో భవతి. తస్య సర్వత్రాఽఽనుషంగితయా సర్వోత్పాదకాధారకత్వాత్. తథాః– ద్యుతిర్ ద్యోతనం, ప్రకాశనమ్, స్తుతిర్ గుణేషు గుణకథనమ్, స్థాపనం చ. మోదో హర్షః, ప్రసన్నతా కాంతిః, శోభా గతిర్ జ్ఞానం, గమనం, ప్రాప్తిశ్చేతి. ఏతే పరమేశ్వరే ముఖ్యవృత్యా యథావత్ సంగచ్ఛంతే. అతోఽన్యత్ర తత్ సత్తయా గౌణ్యా వృత్త్యావర్తంతే. ఏవం గౌణముఖ్యాభ్యాం హేతుభ్యా ముభయత్ర దేవతాత్వం సమ్యక్ ప్రతీయతే.

తె॥ 'దివు' ధాతువునకు గల పది యర్థములు వ్యవహారము నందును, పరమార్థమునందును సరిగా వర్తించును. వేదములం దీ రెండు విధములగు నర్థములు బాగుగ వివరింపబడినవి. వానిలో నొకింత భేదమున్నది. పూర్వము వర్ణింపబడిన వస్వాదిదేవతలు పరమేశ్వరుని ప్రకాశముచే ప్రకాశింపజేయబడుచున్నారు. పరమేశ్వరుడు – దేవుడు– మాత్రము తన ప్రకాశముతోనే యెల్లపుడు ప్రకాశితు డగును. కావున నతడొక్కడే యెల్లరకు పూజ్యుడు. 'దివు' ధాతువునకు గల పది యర్థములు:– ౧. క్రీడా–ఆట. ౨. శత్రువుల జయించు కోరిక–విజిగీష, ౩. వ్యవహారము, అది రెండు విధములు– బాహ్యము, ఆభ్యంతరము. ౪ నిద్ర, ౫ మదము. ఈ యైదర్థములు ముఖ్యముగా వ్యవహారమునందే వర్తించును. అగ్నిమున్నగు పదార్థములు లోకవ్యవహారసిద్ధికి హేతువులు. కాని, పరమాత్మ–దేవున కీయర్థములతో నేమియు సంబంధముండదని యెంచరాదు. అగ్న్యాది దేవతలన్నియు పరమేశ్వరుని వ్యాపకతవలనను. అతనిచే రచియింపబడుట వలనను దివ్యగుణములు కలవియైనవి. ౧. ద్యుతి= ప్రకాశించుట, ౨. స్తుతి = గుణములను కీర్తించుట, ౩. మోదము = ప్రసన్నత, ౪. కాంతి=శోభ, ౫. గతి= జ్ఞానము, గమనము, ప్రాప్తి. ఈ యైదర్థములు, పరమేశ్వరునియందు ముఖ్యముగా వర్తించును. పరమేశ్వరుని కంటె భిన్నములగు పదార్థములలో గౌణముగ – అప్రధానముగ వర్తించును. వానిలోనుండు గుణములనుబట్టి వాని దేవత్వము నిర్ణయింపబడును. పరమేశ్వరునందు సర్వశక్తి మత్త్వాది సర్వగుణములు ననంతములై యున్నవి. కావున నతడే పూజ్యదేవుడు. కావునగౌణముఖ్యభేదములతో వ్యవహారము, పరమార్థము నను రెండు స్థలములందును దేవతాపదము వ్యవహరింపబడును.

*సం॥ పూ : అత్ర కేచి దాహు : వేదేషు జడచేతనయోః పూజాభి ధానాత్ వేదా : సంశయాస్పదం ప్రాప్తాః సంతీతి గమ్యతే.*

*ఉ, అత్రోచ్యతే. నైవం భ్రమితవ్యమ్; ఈశ్వరేణ సర్వేషు పదార్థేషు స్వాతంత్ర్యస్య రక్షితత్వాత్. యథా చక్షుషి రూపగ్రహణ శక్తిస్తేన రక్షితా అస్తి, అత శ్చక్షుష్మాన్ పశ్యతి, నైవాంధ శ్చేతి వ్యవహారోఽస్తి.*

*అత్ర కశ్చిద్ బ్రూయాత్ – నేత్రేణ సూర్యాదిభిశ్చ వినా ఈశ్వరో రూపం కథం దర్శయతీతి; యథా తస్య వ్యర్థేయం శంకాస్తి; తథా పూజనం– పూజా– సత్కారః. ప్రియాచరణ మనుకూలాచరణం చేత్యాదయః పర్యాయా భవంతి; ఇయం పూజా చక్షుషోఽపి సర్వైర్ జనైః క్రియతే, ఏవ మగ్న్యాదిషు యావ దర్థద్యోతకత్వం విద్యా క్రియోప యోగిత్వం చాస్తి, తావ ద్దేవతాత్వ మప్యస్తు నాత్ర కాచిత్ క్షతి రస్తి.*

పూ : కుతః ?

ఉ : వేదేషు యత్ర యత్రో పాసనా విధీయతే, తత్ర తత్ర దేవతాత్వే నేశ్వర స్యైవ గ్రహణాత్.

తె॥ పూ : వేదములందు జడములను, చేతనములను రెండింటిని పూజింపవలయునని యున్నందున వేదము లొక్క యీశ్వరునే యుపాసింప నుపదేశించినట్లెల యెంచవలయును? అని కొందఱాక్షేపింతురు.

ఉ: ఇట్లు భ్రమపడవద్దు. ఈశ్వరుడు సర్వ పదార్థములందును స్వతంత్రగుణముల నుంచి యున్నాడు. చూచుటకు వలయు సామర్థ్యమును నేత్రమునందుంచినాడు. అందువలన దానితో వస్తువు కనిపించును. నేత్రముతో చూచుట లోక వ్యవహారము. 'సూర్యుడు, నేత్రములు లేకున్నను వస్తువులు కనబడునట్లు ఈశ్వరుడేల చేయలేదు' అని యెవడేని ప్రశ్నించిన, నతని ప్రశ్న మర్థము లేనిదగును. అట్లే పూజా విషయమునను నెఱుంగవలయును. ఇతరులను సత్కరించుట, ప్రియము నొనర్చుట-ఇతరుల కనుకూలముగ వర్తించుట – పూజ యనబడును. అనుకూలాచరణ మనెడి పూజ నేత్రమునకు గూడ చేయనగును. అట్లు చేయుట మనుష్యుల కెల్లరకు నుచితము కూడ. (నేత్రమున కనుకూలాచరణమన దానితో సరిగ వ్యవహరించుట, చూచుటకు దానిని చక్కగా నుపయోగించుట యని భావము). ఇట్లే అగ్ని, జలము మున్నగు పదార్థముల మూలమున వస్తువుల ప్రకాశింప జేయవచ్చును; దివ్యములగు గుణ క్రియలను సిద్ధ పఱచు కొన వచ్చును. మఱియు నితరోపకారములను బొంద వచ్చును. వస్తువులను ప్రకాశింప జేసి, ఇతర క్రియా నిర్వహణలో నుపయుక్తములై యగ్ని మున్నగు వస్తువులు దేవత లనబడినందున గలుగు హాని యేమి యున్నది? కాని, వేదములలో నెటనుపాసనము విధింపబడి యున్నదో యట్టి యెడ నద్వితీయుడగు పరమేశ్వరుడే గ్రహింప దగినవాడు.

సం॥ తత్రాపి మత ద్వయం విగ్రహ వదవిగ్రహ వద్ దేవతా భేదాత్. తచ్చోభయం పూర్వం ప్రతిపాదితమ్ – అన్యచ్చ; మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ. అతిథిదేవో భవ.

వై. ప్ర. ౭, అను, ౧౧.

"త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి." తై : ఉ. ప్ర౭–౧

ఇతి సర్వ మనుష్యోపాస్యాః పంచ దేవతా స్తైత్తిరీయోపనిషదుక్తాః యథాత్ర మాతాపితరా వాచార్యో ఽతిథిశ్చేతి సశరీరా దేవతాః సన్తి. ఏవం సర్వథా నిః శరీరం బ్రహ్మాఽస్తి.

తె" దేవతలు ద్వివిధములుగ నున్నవి. ౧ . మూర్తి మంత ములు, ౨ అమూర్తి మంతములు. మాత, పిత, ఆచార్యుడు, అతిథి యను నీ నలువురు మూర్తి మంతములగు దేవతలు. ఐదవదియగు పరబ్రహ్మ మను దేవత, ఎన్నడును మూర్తి మంతము కాదు. బ్రహ్మమున కేవిధమగు మూర్తియు నుండదు. ఈ యైదు దేవతల పూజలో గల యీ భేదమును గుర్తింపవలయును. తైత్తిరీయోపనిషత్తునందీయైదు దేవతలు వర్ణింపబడి యున్నవి.

సం॥ తథైవ పూర్వోక్తాసు దేవతాసు అగ్ని పృథి వ్యాదిత్య చంద్రమా నక్షత్రాణి చేతి పంచ వసవో విగ్రహ వత్యః సంతి. ఏవ మేకాదశ రుద్రాః, ద్వాదశాదిత్యాః, మనః షష్ఠాని జ్ఞానేంద్రియాణి, వాయు రంతరిక్షం ద్యౌర్ మంత్రాశ్చేతి శరీర రహితాః తథాస్తనయిత్ను విధియజ్ఞౌ చ సశరీరాశరీరే దేవతే స్త ఇతి. ఏవం సశరీర నిఃశరీర భేదేన దేవతాద్వయం భవతి. తత్రైతాసాం వ్యవహారోపయోగిత్వ మాత్ర మేవ దేవతాత్వం గృహ్యతే. ఇత్థమేవ మాతృపిత్రాచార్యాతిథీనాం వ్యవహారోపయోగిత్వం పరమార్థ ప్రకాశకత్వం చైతావన్ మాత్రం చ. పరమేశ్వర స్తు ఖల్విష్టోపయోగిత్వే నైవోపాస్యోఽస్తి : నాతో వేదేషు హ్యపరా కాచి ద్దేవతా పూజ్యోపాస్యత్వేన విహితాఽస్తీతి నిశ్చీయతామ్.

తె॥ ఇట్లే పూర్వము వర్ణింపబడిన ఎనిమిది వసువులందు అగ్ని, పృథివి, ఆదిత్యుడు, చంద్రుడు, నక్షత్రములు నను నీ దేవతలు మూర్తి మంతములు. ఏకాదశరుద్రులు, ద్వాదశ ఆదిత్యులు, మనస్సు నైదింద్రియములు, అంతరిక్షము, వాయువు, ద్యులోకము, మంత్రములు నను నివి యన్నియు మూర్తి మంతములు కాని దేవతలు. అట్లే విద్యుత్తు, విధియజ్ఞము నను నివి మూర్తి మంతములు, అ మూర్తి మంతములును. ఇట్లు సాకార నిరాకార భేదముతో దేవతలలో రెండు విధములైన వ్యవస్థ యున్నట్లు గుర్తింపవలయును. పృథివ్యాదులందు వ్యవహారోపయోగిత్వ మను దేవత్వమున్నది. తల్లి, తండ్రి, ఆచార్యుడు, అతిథి వీరి యందు వ్యవహారోపయోగిత్వము, పరమార్థ ప్రకాశకత్వము నను దేవత్వ మున్నది. అట్లే మనస్సు ఇంద్రియములు నను వీని యుపయోగము వ్యవహారమునందును, పరమార్థమునందును గలదు. కాని, మానవుల కెల్లరకు నుపాసింపదగిన వాడు పరమేశ్వరు డొక్కడే. అతడు తక్క, మఱియే దేవత వేదములందు ఉపాస్యుడని కాని, పూజ్యుడని కాని చెప్ప బడలేదు.

*సం॥పూ : అత ఇదానీంతనా : కేచి దార్యాః, యూరోపఖండవాసినశ్చ భౌతిక దేవతానా మేవ పూజనం వేదే వ్యష్టీ త్యూచుర్ వదంతి చ.*

*ఉ : త దలీకతర మస్తి.*

*పూ : తథా యూరోపఖండవాసినో బహవ ఏవ వదంతి – పురా హ్యార్యా భౌతిక దేవతానాం పూజకా ఆసన్. పునస్తైః సంపూజ్య సంపూజ్య చ బహుకాలాంతరే పరమాత్మానం పూజ్యం విదు రితి.*

*ఉ : తద ప్యసత్, తేషాం సృష్ట్యారంభ మారభ్యానేకై రింద్ర వరుణాగ్న్యాదిభిర్ నామభిర్ వేదోక్తరీ త్యేశ్వరస్యైవోపాసనానుష్ఠానాచారాగమాత్.*

తె॥ పూ : వేదములలో పృథివ్యాది భూతముల పూజ వర్ణింప బడినదని యెందఱో నేటి యార్య విద్వాంసులు, ఐరోపా దేశవాసులైన యింగ్లీషు మున్నగు భాషలను మాట్లాడువారును చెప్పుదురు.

ఉ : వారు చెప్పునది యసత్యము.

పూ : వారింకను నిట్లందురు. 'ఆర్యులు మొదట అగ్న్యాది పంచభూతములనే పూజించెడివారు; బహుకాలము తరువాత వారు పరమేశ్వరుని బూజించుట తెలిసికొనిరి' అని.

ఉ : ఇదియు నిజము కాదు. ఆర్యులు సృష్ట్యారంభమునుండి నేటి వఱకు నింద్రుడు, వరుణుడు, అగ్ని మున్నగు నామములతో వేదోక్త ప్రమాణముల మూలముననే యీశ్వరునే యుపాసించుచు వచ్చిరి. ఇందుల కనేక ప్రమాణము లున్నవి. వానిలో కొన్నింటిని నిట నుదాహరించుచున్నాము.

*సం॥ అత్ర ప్రమాణాని :–*

*(అగ్నిమీ...) అస్య మంత్రస్య వ్యాఖ్యానే హి 'ఇంద్రం మిత్రం' (ఋఙ్మం త్రోఽయమ్) అస్యోపరి ('ఇమ మేవాగ్నిం మహాంత మాత్మాన మేక మాత్మానం బహుధా మేధావినో వదంతి. ఇంద్రం మిత్రం వరుణ మగ్నిం దివ్యం చ గరుత్మంతమ్.' నిరు. ౭–౧౮) నిరుక్తం చ లిఖితం తత్ర ద్రష్టవ్యమ్. తథా 'తదేవాగ్నిస్త దాదిత్య.' ౩౨–౧. ఇతి యజుర్ మంత్రశ్చ.*

*"తమీశానం జగతస్తస్థుషస్పతిం ధియం జిన్వ మవసే హూమహే వయమ్, పూషా నో యథా వేదసా మసద్ వృధే రక్షితా పాయు రదబ్ధః స్వస్తయే." ౧. ఋ. అ, ౧–౬,౧౫–౫.*

f24

"హిరణ్య గర్భః సమవర్త తాగ్రే భూతస్య జాతః పతి రేక ఆసీత్.
స దాధార పృథివీం ద్యా ముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ." ౨. ఋ. ౮-౭,౩ ౧.
ఇత్యాదయో మంత్రా నవ వీతద్విషయాః సన్తి
"ప్రతద్వోచే దమృతం ను విద్వాన్ గంధర్వో ధామ విభృతం
గుహా సత్. త్రీణి పదాని నిహితా గుహాస్య యస్తాని వేద స పితుః పితా సత్." ౩.
యజు, ౩౨-౯.

"స నో బంధుర్ జనితా స విధాతా ధామాని వేద భువనాని విశ్వా
యత్ర దేవా అమృత మానశానా స్తృతీయే ధామ న్నధ్యైరయంత." యజు. ౩౨-౧౦.
"పరీత్య భూతాని పరీత్య లోకాన్ పరీత్య సర్వాః ప్రదిశో దిశశ్చ.
ఉపస్థాయ ప్రథమ జామృతస్యాత్మ నాత్మాన మభిసంవివేశ." ౫. యజు. ౩౨-౧౧.
"వేదాహ మేతం పురుషం మహాంత మాదిత్య వర్ణం తమసః పరస్తాత్.
తమేవ విదిత్వాఽతిమృత్యు మేతి. నాన్యః పంథా విద్యతే ఽయనాయ." ౬.యజు. ౩౧ ౧౮.
"త దేజతి తన్నైజతి తద్దూరే తద్వంతికే. తదంతరస్య సర్వస్య. తదు సర్వస్యాస్య బాహ్యతః"
౭యజు. ౪౦-౫

"స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ మిత్యాది చ." యజు. ౪౦-౮
"య ఇమా విశ్వా భువనాని జుహ్వ ద్రుషిర్ హోతా న్యసీదత్ పితా నః; స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః ప్రథమచ్ఛదవరాఁ ౨ ఆవివేశ." ౮ యజు ౧౭-౧౭
"కింస్వి దాసీ దధిష్ఠాన మారంభణం కతమత్ స్విత్ కథాసీత్, యతో భూమిం జనయన్ విశ్వకర్మా విద్యా మౌర్ణోన్మహినా విశ్వచక్షాః." ౯ యజు. ౧౭-౧౮
"విశ్వత శ్చక్షు రుత విశ్వతో ముఖో విశ్వతో బాహు రుత విశ్వత స్పాత్.
సంబాహుభ్యాం ధమతి సంపతత్రై ర్ ద్యావాభూమీ జనయన్ దేవ ఏకః." ౧౦.యజు. ౧౭-౧౯
ఇత్యాదయో మంత్రా యజుషి బహవః సంతి.
తథా – సామవేద స్యోత్తరార్చికే త్రికమ్. ౧౧
"అభిత్వా శూర నోను మోఽదుగ్ధా ఇవ ధేనవః,
ఈశాన మస్య జగతః స్వర్ దృశ మీశాన మింద్ర తస్థుషః," సామ ప్ర ౧, అ ౧ఖం ౪, మం ౧.౧౧
"న త్వావాఁ అన్యో దివ్యో న పార్థివో న జాతో న జనిష్యతే, అశ్వాయంతో మఘువ న్నింద్ర వాజినో గవ్యంత స్త్వా హవామహే." ౧౨.
సామ ౧-౧౬౫-౨
ఇత్యాదయశ్చ.
"నాసదాసీ న్నో సదాసీ త్తదానీం నాసీ ద్రజో నో వ్యోమా పరో యత్
కిమా వరీవః కుహకస్య శర్మ న్నంభః కిమాసీద్ గహనం గభీరమ్." ౧౩. ఋ ౮-౭-౧౭-౧

"ఇయం విసృష్టిర్ యత ఆ బభూవ యది వాదధే, యది వా న,
యో అస్యాధ్యక్షః పరమే వ్యోమన్ త్సో అంగ వేద యది వా న వేద." ఋ. ౧౦-౧౨౯-౭

ఇత్యంతాః సప్తమంత్రా ఋగ్వేదే.

"యత్ పరమ మవమం యచ్చ మధ్యమం ప్రజాపతిః ససృజే విశ్వరూపమ్. కియతా స్కంభః ప్రవివేశ తత్ర యన్న ప్రావిశత్ కియత్తద్ బభూవ." అథ. ౧౦-౭-౮

"యస్మిన్ భూమి రంతరిక్షం ద్యౌర్ యస్మిన్నధ్యాహితా, యత్రాగ్ని శ్చంద్రమా
సూర్యో వాత స్తిష్ఠం త్యర్పితాః స్కంభం తం బ్రూహి కతమః స్వి దేవ సః." అథ. ౧౦-౭-౧౨

ఇత్యాదయో ఽథర్వవేదే ఽపి బహవో మంత్రాః సన్తి. ఏతేషాం మంత్రాణాం మధ్యాత్ కేషాంచి దర్థః పూర్వం ప్రకాశితః; కేషాంచి దగ్రే విధాస్యతే; అత్ర ప్రసంగాన్ నోచ్యతే.

"అణో రణీయాన్ మహతో మహీయా నాత్మాస్య జంతో ర్నిహితో గుహాయామ్.
త మక్రతుః పశ్యతి వీతశోకో ధాతుః ప్రసాదాన్మహిమాన మాత్మనః." కఠ ౨-౨౦

"అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం తథా ఽరసం నిత్య మగంధవచ్చ యత్.
అనాద్యనంతం మహతః పరం ధ్రువం నిచాయ్య తం మృత్యుముఖాత్ ప్రముచ్యతే." కఠ ౩-౧౫

"యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ
మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి." కఠ ౪-౧౦

"ఏకో వశీ సర్వభూతాంతరాత్మా ఏకం రూపం బహుధా యః కరోతి, త మాత్మస్థం యే ఽను పశ్యంతి ధీరా స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్." కఠ. ౫-౧౨

"నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానా మేకో బహూనాం యో విదధాతి కామాన్; త మాత్మస్థం యే ఽనుపశ్యంతి ధీరా స్తేషాం శాంతిః శాశ్వతీ నేతరేషామ్." కఠ. ౫-౧౩

"దివ్యో హ్యమూర్తః పురుషః స బాహ్యాభ్యంతరో హ్యజః
అప్రాణో హ్యమనాః శుభ్రో హ్యక్షరా త్పరతః పరః" ముండక. ౨-౧-౨

"యః సర్వజ్ఞః సర్వ విద్ యస్యైష మహిమా భువి,
దివ్యే బ్రహ్మ పురే హ్యేష వ్యోమ్న్యాత్మా ప్రతిష్ఠితః." ముండక. ౨-౨-౭

"నాంతః ప్రజ్ఞం న బహిః ప్రజ్ఞం నోభయతః ప్రజ్ఞం న ప్రజ్ఞాన ఘనం న ప్రజ్ఞం, నా ప్రజ్ఞం, అదృష్ట మవ్యవహార్య మగ్రాహ్య మలక్షణ మచింత్య మవ్యపదేశ్య మేకాత్మ ప్రత్యయసారం ప్రపంచోపశమం శాంతం శివమద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మా స విజ్ఞేయః." (మాండూ. ౭)

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ యో వేద నిహితం గుహాయామ్.
పరమే వ్యోమన్ త్సో ఽశ్నుతే సర్వాన్ కామాన్ బ్రహ్మణా విపశ్చితేతి." తైత్తి. బ్ర. వ. ౧-౧.

"యో వై భూమా తత్సుఖం నాల్పే సుఖ మస్తి భూమైవ సుఖమ్. భూమాత్వేవ విజిజ్ఞాసితవ్యః." ఛాందోగ్య. ౭-౨౩-౧

సహ బ్రహ్మణే త్యుపనిషత్ బ్రహ్మోపనిషద్

"యత్ర నాన్యత్ పశ్యతి నాన్య చ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా. అథ యత్రాన్యత్ పశ్యత్యన్య చ్ఛృణోతి అన్యద్విజానాతి తదల్పమ్. యోవై భూమా తదమృతం, అథ యదల్పం తన్మర్త్యం స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి స్వే మహిమ్ని, ఛాందో ౭–౨౩–౧,

వేదోక్తేశానాది విశేషణ ప్రతిపాదితః, 'అణో రణీయా' నిత్యా ద్యుపనిషదుక్త విశేషణ ప్రతిపాదితశ్చ యః పరమేశ్వరోఽస్తి, స ఏవార్యైః సృష్టి మారభ్యాద్యపర్యంతం యథావద్ విదిత్వోపాసితో ఽస్తీతి మన్యధ్వమ్. ఏవం పరబ్రహ్మ విషయ ప్రకాశకేషు ప్రమాణేషు సత్సు. భట్టమోక్షమూలరై రుక్తమ్ – "ఆర్యాణాం పూర్వ మీశ్వరజ్ఞానం నాసీత్; పునః క్రమా జ్జాత" మితి;న తచ్ఛిష్ట గ్రహణార్హ మస్తీతి విజానీమః."

తె॥ వేదాది సత్య శాస్త్రములందు ఏకేశ్వర పూజా విషయక ప్రమాణము లెన్నో యున్నవి. ఉపరిలిఖిత మంత్రములలో కొన్నింటి యర్థము పూర్వము వ్రాయబడినది. మిగిలినవాని యర్థము ముందు వ్రాయబడును. అందువలన వాని యర్థమిట వ్రాయలేదు. వేదములందలి 'ఈశానుడు' మున్నగు విశేషణములతోను, ఉపనిషత్తులోని 'అణువు కంటె నణువు' మున్నగు విశేషణములతోను, ఏ ఈశ్వరుడు ప్రతిపాదింపబడెనో యాతనినే ఆర్యులు సృష్ట్యారంభమునుండి నేటివఱకునుపాసించుచున్నారు. ప్రాచీనార్యులు పలుదేవతలను, (అగ్ని మున్నగు) భూతములను పూజించెడి వారని కొందఱు ఆర్యులు, ఐరోపా ఖండమున నుండెడి 'మోక్ష ముల్లర్' మున్నగు విద్వాంసులు చెప్పుదురు. కాని, వారి కథనము వ్యర్థమైనదియే. సత్యము కాదు. వేదములందును, వాని ప్రాచీన వ్యాఖ్యానము (బ్రాహ్మణము) లందును అగ్ని మున్నగు నామములతో పరమేశ్వరునే యుపాసనకు గ్రహించినట్లు గలదు. ఆర్యులు పరమేశ్వరునే యుపాసించుచుండిరి. ఈ విషయమున సంశయము తగదు.

*సం॥ కించ – 'హిరణ్య గర్భః సమవర్త తాగ్రే భూతస్య జాతః పతి...' ఏతన్మంత్ర వ్యాఖ్యానావసరే 'అయం మంత్రోఽర్వాచీనోఽస్తి ఛందసు, ఇతి శారమణ్య దేశోత్పన్నైర్ భట్ట మోక్షమూలరైః స్వకీయ సంస్కృత సాహిత్యాఖ్యేగ్రంథ ఏతద్విషయే యదుక్తం, తన్న సంగచ్ఛతే. యచ్చ వేదానాం ద్వౌ భాగా వేకశ్ఛందో. ద్వితీయో మంత్రశ్చ. తత్ర యత్ సామాన్యార్థాభిధానం పరబుద్ధి ప్రేరణా జన్యం స్వకల్పనయా రచనా భావం, యథా హ్యజ్ఞానినో ముఖా దకస్మా న్నిస్సరే దీదృశం యద్వచనం తచ్ఛంద ఇతి విజ్ఞేయమ్. తస్యోత్పత్తి సమయే ఏకత్రింశ చ్ఛతాని వర్షా ణ్యధికాధికాని వ్యతీతాని. తథైకోన త్రింశచ్ఛతాని వర్షాణి మంత్రోత్పత్తౌ చేత్యనుమానం తేషా మస్తి. తత్ర నైరుక్తాని ప్రమాణాని– "అగ్ని ః పూర్వేభిర్ ఋషిభి రీడ్యో నూతనై రుత" ఇత్యాదీని జ్ఞాతవ్యాని; తదిద మప్యన్యథాఽస్తి.*

*పూ : కుతః ?*

*ఉ : హిరణ్య గర్భ శబ్ద స్యార్థజ్ఞానాభావాత్. అత్ర ప్రమాణాని :–*

*"జ్యోతిర్ వై హిరణ్యం జ్యోతి రేషోఽమృతగ్ం హిరణ్యమ్."* శత. కాం.౯, అ ౩

*"కేశీ కేశా రశ్మయ స్తై స్తద్వాన్ భవతి. కాశనాద్ వా ప్రకాశనాద్ వా కేశీదం జ్యోతి రుచ్యతే."* నిరుక్త . ౧౨–౨ గ

*"యశో వై హిరణ్యమ్.'* ఐత. పం. ౭అ. ౩

*"జ్యోతి రేవాయం పురుష ఇత్యాత్మ జ్యోతిః"* శత. ౧౪–౭

"జ్యోతి రింద్రాగ్నీ."

శత.కాం.౧౦, అ. ౪

ఏషా మర్థః— జ్యోతిర్ విజ్ఞానం గర్భః స్వరూపం యస్య స హిరణ్యాగర్భః ఏవం చ జ్యోతిర్ హిరణ్యం ప్రకాశో, జ్యోతి రమృతం మోక్షో, జ్యోతిరాదిత్యాదయః కేశాః ప్రకాశకా లోకాశ్చ, యశః సత్కీర్తిర్ ధన్య వాదశ్చ. జ్యోతి రాత్మా జీవశ్చ. జ్యోతి రింద్ర : సూర్యోఽగ్ని శ్చైతత్ సర్వం హిరణ్యాఖ్యం గర్భే సామర్థ్యే యస్య స హిరణ్యాగర్భః – పరమే శ్వరః అతో హిరణ్య గర్భ శబ్ద ప్రయోగాద్ వేదానా ముత్తమత్వం సనాత నత్వం తు నిశ్చీయతే ; న నవీనత్వం చ. అస్మాత్ కారణా-త్ యత్తై రుక్తం "హిరణ్య గర్భ శబ్ద ప్రయోగా న్మంత్ర భాగస్య నవీనత్వం తు ద్యోతితం భవతి, కిం త్వస్య ప్రాచీనత్వే కిమప ప్రమాణం నోపలభామహే " ఇతి; తద్ భ్రమమూల మేవ విజ్ఞేయమ్. యచ్చోక్తం మంత్ర భాగ నవీనత్వే 'అగ్నిః పూర్వేభి 'రిత్యాది కారణం. తదపి తాదృశమేవ.

పూ. కుత : ?

ఉ : ఈశ్వరస్య త్రికాల దర్శిత్వాత్. ఈశ్వరో హి త్రీన్ కాలాన్ జానాతి. భూత భవిష్యద్వర్తమాన కాలస్థైర్ మంత్ర ద్రష్టృభిర్ మనుష్యైర్ మంత్రైః ప్రాణై స్తర్కై శ్చర్షిభి రహమే వేద్యో బభూవ, భవామి, భవిష్యామి చేతి విదిత్వా ఇద ముక్త మిత్యదోషః అన్యచ్చ – యే వేదాది శాస్త్రాణ్యధీత్య విద్వాంసో భూత్వాఽధ్యాపయంతి, తే ప్రాచీనా :. యే చాధీయతే తే నవీనాః తైర్ ఋషిభి రగ్ని : పరమేశ్వర ఏ వేద్యోఽస్త్యతశ్చ.

తె॥ ఈ విషయమును గుఱించియే డా. మోక్షమూలర్ మహోదయుడు. తనచే వ్రాయబడిన 'సంస్కృత సాహిత్య' నామక గ్రంథమునందిట్లు వ్రాసి యున్నాడు.:-"ఆర్యులకు క్రమముగా చాల కాలమునకు తదుపరి యీశ్వరుని జ్ఞానము కలిగినది. వేదములు ప్రాచీనము లనుటకు తగిన ప్రమాణ మొక్కటియును లేదు. పై పెచ్చు అవి నవీనము లనుటకు బహు ప్రమాణములు లభించు చున్నవి." అని వ్రాసి, ఛందో భాగమునకంటె మంత్రభాగమురెండు వందల వత్సరములు వెనుక రచింపబడినదనియు, అందులకు హిరణ్య గర్భ శబ్దము ప్రమాణమనియు వ్రాసి యున్నాడు. మఱియు నతడిట్లు నుడివియున్నాడు. వేదమున రెండు భాగములున్నవి. ఒకటి ఛందస్సు; రెండవది మంత్రము. అందు ఛందోభాగము సామాన్యార్థముతో కూడి యున్నది. ఇతరుని బుద్ధి ప్రేరణ వలన ప్రకాశితమైనట్లు కనిపించుచున్నది. అదీ కర్తృబుద్ధి ప్రేరణతో నుత్పన్నము కాజాలదు. అందలి ఉక్తి- కథన ప్రకారము –అజ్ఞాని ముఖము నుండి యకస్మాత్తుగ వెలువడిన వచనముల వలె నున్నది. అది యుత్పన్నమై యెక్కువలో నెక్కువ (౩౦౦౦) ముప్పది యొక్క వందల సంవత్సరములు గడచియుండును. మంత్ర భాగ ముత్పన్నమై (౨౯౦౦) యిరువది తొమ్మిది వందల యేండ్లు గతించియుండును. " ఈ విషయమును రుజువు చేయుటకు 'అగ్నిః పూర్వేభిః' అను మంత్రమును ప్రమాణముగ నిచ్చి యున్నాడు. కాని, యిది యంతము సరికాదు.

పూ. ఎందువలన ?

ఉ : వారికి (హిరణ్య గర్భః), (అగ్నిః పూర్వేభిః) అనురెండు మంత్రముల యర్థము సరిగా తెలియదు. హిరణ్య గర్భశబ్దము వారికి నవీనముగా కనబడినట్లున్నది. వారు హిరణ్యమును బంగారముగా నెంచి, అదియు మానవ సృష్టి యేర్పడిన తదుపరి మానవులలో నాగరికత బాగుగా కలిగి, రాజ ప్రజా సంబంధము లేర్పడిన బహు కాలమునకు భూమి నుండి త్రవ్వి తీయబడినదని భావించియున్నారు. కాని యిది యంతయు వారి భ్రమ. శతపథ బ్రాహ్మణాదుల ప్రమాణములనుబట్టి హిరణ్య శబ్దమున కీ క్రింది యర్థము లున్నట్లు తెలియనగును.

౧. హిరణ్యం = జ్యోతి : - విజ్ఞానము. అది స్వరూపముగ గలవాడు= హిరణ్య గర్భుడు.

౨. హిరణ్యం = జ్యోతిః - అమృతము - మోక్షము. అది సామర్థ్యమున గలవాడు హిరణ్యగర్భుడు. (శతపథము)

౩ హిరణ్యమ్ జ్యోతి := ప్రకాశ స్వరూప సూర్యాది లోకములు గర్భమునందు గలవాడు = హిరణ్య గర్భుడు. (నిరుక్తము)

౪. హిరణ్యం = యశస్సు, అది యెవని స్వరూపముగ నుండునో వాడు హిరణ్యగర్భుడు. (ఐతరేయము).

౫. హిరణ్యం = జ్యోతిః- జీవాత్మ గర్భమునందు సామర్థ్యమున కలవాడు హిరణ్యగర్భుడు. (శతపథము)

౬. హిరణ్యం= జ్యోతిః, ఇంద్రుడు, సూర్యుడు, అగ్ని ఇవి యన్నియు నెవని సామర్థ్యమున నుండునో యతడు హిరణ్య గర్భుడు. (శత పథము)

ఈ యర్థములన్నియు పరమేశ్వరునకు తక్క యితరులకు వర్తింపవు. కావున హిరణ్యగర్భుడు పరమేశ్వరుడగును; కాని, బంగారము కాదు. హిరణ్య గర్భ పద ప్రయోగమును బట్టి వేదములు సనాతనములనియు, నుత్తమములు ననియు బోధపడును. కాని యాధునికములని తెలియుట కవకాశము లేదు. కావున, మోక్షమూలర్ మహాశయుడు నుడివినది సత్యము కాదు. ఇట్లే (అగ్ని : పూర్వేభిః.....) అను మంత్రమును కూడ వేదములు నవీనము అనుటకు ప్రమాణముగ నిచ్చియున్నాడు. అదియు భ్రమ మూలకమే.

కారణ మేమందు రేని, ఋషి శబ్దము మనుష్యుడు మంత్రము, ప్రాణము, తర్కము ననువానికి నామము.

"ఈ త్రికాలములందుండు ఋషుల (మంత్రముల) ద్వారమున నాస్తుతి చేయబడినది, చేయబడుచున్నది, చేయబడగలదు- అని యీశ్వరుడు చెప్పుచున్నాడు. అతడు త్రికాల దర్శి" అని మంత్రార్థమగును. మఱియు నీ మంత్రమున, 'వేదములను జదివి పూర్వము విద్వాంసులయినవారును. ఇప్పుడు జదువు వారును, ఇక ముందు భవిష్యత్తున జదువు వారును నెల్లరు - ప్రాచీనార్వాచీన ఋషులు (మనుష్యులు) నా స్తుతి జేయుదురు గాక !' అని త్రికాలదర్శియైన యీశ్వరుడు - వేదకర్త భూత భవిష్య ద్వర్తమాన వ్యవహారములను బాగుగ నెఱిగి చెప్పియున్నాడు. కావున దీనిం బట్టియు వేదముల సనాతనత్వము, ఉత్తమతయును సిద్ధ మగునే కాని, నవీనత్వము సిద్ధింపదు. అందువలన మోక్షమూలరుని కథనము సరికాదు.

*సం॥ అత్ర నిరుక్తేఽపి ప్రమాణమ్ – తత్ ప్రకృతీతర ద్వర్తన సామాన్యాదిత్యయం మంత్రార్థ చింతా భ్యూహోఽభ్యూఢోఽపి శ్రుతితోఽపి తర్కతో, న తు పృథక్త్వేన మంత్రా నిర్వక్తవ్యాః, ప్రకరణశ ఏవ తు నిర్వక్తవ్యాః న హ్యేషు ప్రత్యక్ష మస్త్యనృషేరతపసో వా పారోవర్యవిత్సు తుఖలు వేదితృషు భూయో విద్యః ప్రశస్యోభవతీత్యుక్తం. "పురస్తాన్మనుష్యా వా ఋషి ష్వూత్క్రామత్సు దేవా నబ్రువన్ కో న ఋషిర్ భవిష్యతీతి? తేభ్య ఏతం తర్క మృషిం ప్రాయచ్ఛన్ మంత్రార్థ చింతాఽభ్యూహ మభ్యూఢమ్. తస్మాద్ యదేవ కించానూచానోఽభ్యూహ త్యార్షం తద్ భవతి."*

ని. ౧౩-౧౨

అస్యార్థః– (తత్ ప్రకృతీ....) తస్య మన్త్ర సమూహస్య పద శబ్దాక్షర సముదాయానా మితరత్ పరస్పరం విశేష్య విశేషణతయా సామాన్య వృత్త్యా వర్త మానానాం మన్త్రాణా మర్థ జ్ఞాన చింతా భవతి. కోఽయం ఖల్వస్య మన్త్రస్యార్థో భవిష్యతీ త్యభ్యూహెూ బుద్ధ్యా వాభిముఖ్యేనోహెూ విశేష జ్ఞానార్థస్తర్కో మనుష్యేణ కర్తవ్యః. నైతే శ్రుతితః శ్రవణమాత్రేణైవ తర్క మాత్రేణ చ పృథక్ పృథక్ మన్త్రార్థా నిర్వక్తవ్యాః. కింతు ప్రకరణానుకూలతయా పూర్వాపరసంబంధేనైవ నితరాం వక్తవ్యాః కించ నైవేతేషు మన్త్రేష్వనృషే రతపసోఽ శుద్ధాంతఃకరణ స్యావిదుషః ప్రత్యక్షం జ్ఞానం భవతి. న యావద్వా పారోవర్యవిత్సు కృత ప్రత్యక్షమన్త్రార్థేషు మనుష్యేషు భూయోవిద్యో బహువిద్యాన్వితః ప్రశస్యోఽత్యుత్తమో విద్వాన్ భవతి. న తావ దభ్యూఢః సుతర్కేణ వేదార్థ మపి వక్తు మర్హతీ త్యుక్తం సిద్ధ మస్తి.

అత్రేతిహాస మాహ–పురస్తాత్ కదాచి న్మనుష్యా ఋషిషు మన్త్రార్థ ద్రష్టృష్వూత్క్రామ త్సూతీతేషు సత్సు దేవాన్ విదుషోఽబ్రువ న్నపృచ్ఛన్. కోఽస్మాకం మధ్యే ఋషిర్ భవిష్యతీతి. తేభ్యః సత్యాసత్య విజ్ఞానేన వేదార్థ బోధార్థం చైనం తర్క మృషిం తే ప్రాయచ్ఛన్. దత్తవంతోఽయ మేవ యుష్మాసు ఋషిర్ భవిష్యతీత్యుత్తర ముక్తవంతః

పూః కథం భూతం తం తర్కమ్ ?

ఉః మన్త్రార్థ చింతాభ్యూహ మభ్యూఢమ్. మన్త్రార్థ విజ్ఞాన కారకమ్.

ఉః అతః కిం సిద్ధమ్

పూః యః కశ్చి దనూచానో, విద్యాపారగః, పురుషోఽభ్యూహతి, వేదార్థమభ్యూహతే, ప్రకాశయతే, తదే వార్షమృషిప్రోక్తం వేదవ్యాఖ్యానం భవతీతి మంతవ్యమ్. కించ యదల్పవిద్యే నాల్పబుద్ధినా పక్షపాతినా మనుష్యేణ చాభ్యూహ్యతే, తదనార్ష మనృతం భవతి. నైతత్ కేనా ప్యాదర్తవ్యమ్ ఇతి.

పూః కుతః ?

ఉః తస్యానర్థయుక్తత్వాత్. తదాదరేణ మనుష్యాణా మప్యనర్థాపత్తే శ్చేతి. అతః పూర్వేభిః ప్రాక్తనైః ప్రథమోత్పన్నై స్తర్కైర్ ఋషిభి స్తథా నూతనైర్ వర్తమానస్తై శ్చేతాపి భవిష్యద్భిశ్చ త్రికాలస్థై రగ్నిః పరమేశ్వర ఏవేడ్యోఽస్తి. నైవాస్మాద్ భిన్నః కశ్చిత్ పదార్థః కస్యాపి మనుష్య స్యేడ్యః, స్తోతవ్యః, ఉపాస్యోఽస్తీతి నిశ్చయః ఏవ మగ్నిః పూర్వేభిర్ ఋషిభిరీడ్యో నూతనైరుతే త్యస్య మన్త్రస్యార్థ సంగతేః, నైవ వేదేషు అర్వాచీనాఖ్యః కశ్చి ద్దోషో భవితు మర్హతీతి.

తె॥ వేదమునకు విరుద్ధముకాని తర్కము కూడ నొక ఋషియే. ఆ తర్కము మూలమున వేదార్థమెట్లు చేయవలయునో యాస్కముని చెప్పుచున్నాడు :

(తత్ ప్రకృతీత....) మంత్రములం దెల్ల యెడల సామాన్యముగ పదములు, శబ్దములు, అక్షర సముదాయము పరస్పరము విశేష్య విశేషణ భావమును గల్గియున్నవి. కావున మంత్రార్థముల నెఱుగవలయు నను కోరిక గలుగును. అట్టి యెడ మంత్రార్థముల విశేష జ్ఞానము కొఱకు, 'ఈ మంత్రమున కర్థ మేమగును?' అను నిట్టి యూహాపోహలు ప్రతి మానవునకును కలుగ వలయును. కేవల శ్రవణమువలనగాని, శుష్కతర్కమువలన గాని మంత్రములను వాని ప్రకరణము నుండి వేఱు చేసి వాని కర్థము చెప్ప జాలము. ఆ మంత్రములకున్న పూర్వాపర సంబంధముల నెఱిగి ప్రకరణానుకూలముగ నర్థము చెప్ప వలయును. ఋషులు కాని వారు, తపస్వులు కాని వారు - అంతఃకరణము శుద్ధము కాని యవిద్వాంసులు

మంత్రార్థములను ప్రత్యక్షము చేసికొనజాలరు. వేదార్థముల నెఱిగిన మనుష్యులలో గూడ నధిక విద్వాంసుడైన వాడే ప్రశస్యుడగును. అతడే వేదమునకు విరుద్ధము కాని సుతర్కముతో మంత్రమున కుపయుక్తమగు నర్థము చెప్పగలడు. ఈ విషయమును స్పష్టము చేయుటకే యాస్కముని యొక గాథను కల్పించి యున్నాడు :- పూర్వ కాలమున నొకప్పుడు మంత్రార్థద్రష్టలు మహర్షులు గతించిపోగా, మానవులు విద్వాంసుల చెంత జేరి 'మాలో నిపుడు మంత్రార్థ ద్రష్ట- ఋషి యెవరు?' అని ప్రశ్నించిరి. అంతట నా విద్వాంసులు సత్యా సత్యజ్ఞానము ద్వారమున వేదార్థము నెఱుంగుటకు 'తర్క' మనెడి ఋషిని మానవులకునొసంగి 'ఈ తర్కమే మీలో ఋషి కాగలడు' అని నుడివిరి.

పూ : ఆ తర్క మెట్టిది ?

ఉ : దాని మూలమున మంత్రార్థము తెలియగలదు.

పూ : ఇందువలన సిద్ధించిన దేమి?

ఉ : దీని వలన పూర్ణ విద్వాంసుడైన పురుషు డెవడేని వేదార్థమును జెప్పిన, అది ఋషిప్రోక్తమగు నర్థముగ భావించవలయునని సిద్ధించుచున్నది. ఇంతేకాక, అల్పబుద్ధిగలవాడు చెప్పిన మంత్రార్థము ఆర్షము కాదని యెంచి దాని నాదరింపరాదనియు తెలియును.

పూ : ఎందువలన ?

ఉ : అల్ప బుద్ధి చెప్పు మంత్రార్థ మనర్థయుక్తమై యుండును. వాని నాదరించు మానవులకును ననర్థము వాటిల్లును.

అందువలన (పూర్వేభి :, నూతనై రుత) భూత భవిష్య ద్వర్తమాన కాలములం దుత్పన్నులగు 'తర్కరూప' ఋషులచే నా యగ్ని - 'ప్రకాశ' స్వరూపుడగు పరమేశ్వరుడే - స్తుతింపబడ నర్హుడై యున్నాడు. ఇతర పదార్థ మేదియు మానవులచే స్తుతియింపబడ నర్హము కాదు అని తెలియనగును. కావున, (అగ్ని : పూర్వేభిర్ ఋషిభి రీడ్యో నూతనై రుత...) అను మంత్రమున కిట్లు అర్థముచెప్పుకొనిన, వేదములు నవీనములని చెప్పుట కవకాశముచిక్కదు. అవి సనాతనము లనియే సిద్ధమగును.

స॥ అన్యచ్చ :-"ప్రాణా వా ఋషయో దైవ్యాస :" ఐ. పం. ౨.అ.౪

పూర్వేభి : పూర్వ కాలావస్థాస్తై: ప్రాణై : కార్య ద్రవ్య స్థైర్ నూతనై శ్చర్షిభి : సహైవ సమాధియోగేన సర్వైర్ విద్వద్భి : అగ్ని : పరమేశ్వర ఏవేడ్యోఽస్తి అనేన శ్రేయో భవతీతి మంతవ్యమ్.

తె ॥ మఱియు నైతరేయమున ప్రాణములే ఋషులని చెప్ప బడినది. జగత్తున కుపాదానకారణమగు ప్రకృతిలోనుండు ప్రాణములు ప్రాచీన ఋషులు, ప్రకృతినుండి యేర్పడిన కార్యములగు మహత్తత్త్వాహంకారాదులలో నుండు ప్రాణములు నూతన ఋషులు నని చెప్పుదురు. కావున విద్వాంసులెల్లరు నా ప్రాణములను ఋషులతో యోగాభ్యాసము నొనర్చి యగ్ని నామక పరమేశ్వరుని స్తుతి ప్రార్థనోపాసనాదులు సేయదగుదురు. దీనింబట్టి మోక్షమూలర్ ప్రభృతులగు పాశ్చాత్యవిద్వాంసులు (అగ్ని: పూర్వే) అను మంత్రమునకు జేసిన యర్థము తప్పు డర్థమని సులభముగా దెలిసికొననగును.

స॥ యచ్చోక్తం – ఛందో మంత్రయోర్ భేదో ఽస్తీతి, తద వ్యసంగతమ్.

పూ : కుతః?

ఉ : ఛందోవేదనిగమమంత్రశ్రుతీనాం పర్యాయవాచకత్వాత్. తత్ర ఛందః అనేకార్థ వాచక మస్తి-

వైదికానాం గాయత్ర్యాదివృత్తానాం, లౌకికానామార్యాదీనాం చ వాచకమ్. క్వచిత్ స్వాతంత్ర్యస్యాపి. అత్రాహుర్యాస్కాచార్యా :-

"మంత్రా మననాత్, ఛందాంసి చ్ఛాదనాత్, స్తోమస్తవనాత్,యజుర్ యజతేః, సామ సంమిత మృచా."
ని. అ. ౭–౧౨

అవిద్యాది దుఃఖానాం నివారణాత్ సుఖై రాచ్ఛాదనాత్ ఛందో వేదః తథా "ఛందే రాదేశ్చ ఛః ఇత్యౌణాదికం సూత్రమ్. 'చది– ఆహ్లాదనే దీప్తౌ చ' ఇత్యస్మా ద్ధాతో రసున్ ప్రత్యయే పరే చకారస్య ఛకారాదేశే చ కృతే. 'ఛందస్' ఇతి శబ్దో భవతి; వేదాధ్యయనేన సర్వ విద్యాప్రాప్తేర్ మనుష్యః ఆహ్లాది భవతి, సర్వార్థజ్ఞాతా చ ; అత శ్ఛందో వేదః.

"ఛందాంసి వై దేవా వయోనాధా శ్ఛందోభిర్ హీదగ్ం సర్వం వయునం నద్ధమ్." "ఏతా వై దేవతా శ్ఛందాగ్ంసి.
శత. ౮–౨,౩

అస్యాయ మభిప్రాయ :– మత్రి – గుప్త పరిభాషణే' అస్మా ద్ధలశ్చేతి సూత్రేణ ఘ ఞ్ ప్రత్యయే కృతే, మంత్ర శబ్దస్య సిద్ధిర్ జాయతే. గుప్తానాం పదార్థానాం భాషణం యస్మిన్ వర్తతే స మంత్రో వేదః. తదవయవానా మనేకార్థానామపి మంత్ర సంజ్ఞా భవతి, తేషాం తదర్థవత్వాత్. తథా మనజ్ఞానే. అస్మా ద్ధాతోః "సర్వ ధాతుభ్యఃష్ట్రన్" ఇత్యుణాదిక సూత్రేణష్ట్రన్ ప్రత్యయేకృతే మంత్రశబ్దోవ్యుత్పద్యతే. మన్యంతే జ్ఞాయంతే. సర్వైర్ మనుష్యైః, సత్యాః పదార్థా యేన, యస్మిన్ వా, స మంత్రో. వేదః. తదవయవాః అగ్ని మీడే పురోహిత మిత్యాదయో మంత్రా గృహ్యంతే. యాని గాయత్ర్యాదీని ఛందాంసి తదన్వితా మంత్రా :, సర్వార్థ ద్యోతకత్వా ద్దేవతాశబ్దేన గృహ్యన్తే. అతశ్చ ఛందాంస్యేవ దేవాః వయో నాధాః సర్వ క్రియా విద్యానిబంధనా స్తై శ్ఛందోభి రేవ వేదైర్ వేద మంత్రై శ్చేదం సర్వం విశ్వం వయునం కర్మాది చ ఈశ్వరేణ నద్ధం బద్ధం కృతమితి విజ్ఞేయమ్. యేన ఛందసా ఛందోభిర్ వా సర్వా విద్యా : సంవృతా ఆవృతా : సమ్యక్ స్వీకృతా భవంతి. తస్మా చ్ఛందాంసి వేదా మననా న్మంత్రాశ్చేతి పర్యాయౌ. ఏవం 'శ్రుతిస్తు వేదో విజ్ఞేయ' ఇతి మనుస్మృతౌ, "ఇత్యపి నిగమో భవతీతి' నిరుక్తే. శ్రుతిర్ వేదో మంత్రశ్చ నిగమోవేదో మంత్రశ్చేతి పర్యాయా స్త :. శ్రూయంతే వా సకలా విద్యా యయా సా శ్రుతిర్ వేదో, మంత్రాశ్చ శ్రుతయః, తథా నిగచ్ఛంతి నితరాం జానంతి ప్రాప్నువంతి వా సర్వా విద్యా యస్మిన్, స నిగమో వేదః మంత్రశ్చేతి.

తె॥ ఛందస్సులు వేఱు, మంత్రములు వేఱునని మోక్షమూలర్ చెప్పినదియు సరికాదు.

పూ : ఎందువలన ?

ఉ : ఛందస్సు, నిగమము, వేదము, మంత్రము, శ్రుతి యను నివి యన్నియు పర్యాయపదములే. 'ఛందస్సు' పదమున కనే కార్థములు నున్నవి. వైదికములయిన 'గాయత్రి' మున్నగు వృత్తములకును, లౌకికములయిన 'ఆర్యా మున్నగు వృత్తములకును ఛందస్సులని పేరు గలదు. ఒక్కొక్క యెడ 'ఛందస్' పదము, స్వాతంత్ర్యమును గూడ తెలుపును.

"మననము వలన మంత్రములు ఆచ్ఛాదము వలన ఛందస్సులు ననబడుచున్న " వని యాస్కముని మంత్రఛందశ్శబ్దములను నిర్వచించియున్నాడు.

అవిద్యాది దుఃఖములను నివారించి, సుఖములతో నాచ్ఛాదించుట– కప్పుట వలన వేదములు

ఛందస్సులనబడును. ఆహ్లాదనము, దీప్తి యను రెండర్థములు గల'చది' ధాతువునకు పరమున 'అసున్' ప్రత్యయము చేర్చి, 'చ' కారస్థానమున 'ఛ' కారము ఆదేశించినందున 'ఛందస్' శబ్దము సిద్ధించును. వేదాధ్యయనము వలన మానవు డెల్లవిద్యలు నేర్చి యాహ్లాదము- ప్రసన్నతను బొందును, ఆనందించును. సర్వార్థముల నెఱుగజాలును, కావున ఛందస్సన వేదమని యర్థము. గుప్త పరిభాషణ మర్థముగాగల 'మత్రి' ధాతువునకు పరమున 'హలశ్చ' అను పాణినీయ సూత్రము ననుసరించి 'ఘఞ్' ప్రత్యయము చేర్చిన 'మంత్ర' శబ్ద మేర్పడును. కావున గూఢ పదార్థముల జ్ఞానము దేని వలన గలుగునో యట్టి వేదము మంత్రమనబడును. వేదావయవములగు, 'అగ్ని మీడే' మున్నగునవి యుపర్యుక్త యర్థము నందును, క్రింది యర్థము లందును మంత్రము లనబడును. ఇట్లే, జ్ఞానార్థకమగు 'మన' ధాతువునకు పరమున 'సర్వధాతుభ్య ష్ట్రన్ ' అను ఉణాది సూత్రము ననుసరించి 'ష్ట్రన్' ప్రత్యయము జేర్చినను 'మంత్ర' శబ్దము సిద్ధమగును. దేని వలన, లేక దేనియందు మనుష్యులు సత్య పదార్థముల నెఱుగుదురో యా వేదమునకు 'మంత్ర' మని నామము.

శతపథమునందు'గాయత్ర్యాది ఛందస్సులు, ఆ ఛందస్సులతో గూడిన మంత్రములు 'దేవత'లనబడును. అవి సర్వార్థములను ప్రకాశింపజేయును' అని చెప్పబడినది.

ఈ ఛందస్సులే దేవతలు. ఛందో రూపములగు వేదములు, వేద మంత్రములు నను వానితో పరమేశ్వరుడు సంపూర్ణ విశ్వమును, కర్మములను బంధించియుంచును. ఈ ఛందో రూపవేదములు, వేద మంత్రములే సర్వ సత్య విద్యలతో పరిపూర్ణములయి యున్నవి.

మనుస్మృతి 'శ్రుతి' శబ్దము వేద వాచక మనుచున్నది. నిరుక్త మా వేదమునకే 'నిగమము' వాచకమనుచున్నది. వేదములను విని, చదివి, యభ్యసించుట వలన మానవులు సర్వ సత్య విద్యల నెఱుగ జాలుదురు. అందువలన శ్రుతు లనబడును. వేదములందు సర్వ విద్యల యథార్థజ్ఞానము కలుగును కావున నవి నిగమము లనబడును. కావున ఛందస్సు, మంత్రము, శ్రుతి, నిగమము నను నాలుగు పదముల యర్థమొక్కటియే యని యెఱుంగవలయును. అన్నియు వేద వాచకములే.

*సం॥ తథా వ్యాకరణేఽపి –*

*"మంత్రేఘసహ్వరణ శవృదహాద్ వృచ్ కృగమిజనిభ్యోలిః" ౧.*

*అష్టాధ్యాయ్యామ్, పాణి, ౨-౪-౮౦.*

*"ఛందసి లుఙ్ లఙ్ లిటః."* ౨. పా. ౩.౪-౬

*"వా ష పూర్వస్య నిగమే."* ౩. పా. ౬-౪-౯

*అత్రాపి ఛందో-మంత్ర- నిగమాః పర్యాయవాచినః సంతి. ఏవం ఛంద ఆదీనాం పర్యాయసిద్ధేర్ యో భేదం బ్రూతే, తద్వచన మప్రమాణ మేవాస్తీతివిజ్ఞాయతే.*

తె॥ వ్యాకరణ శాస్త్ర గ్రంథ మయిన అష్టాధ్యాయిలో వర్ణింప బడిన పై సూత్రములనుబట్టియు ఛందస్సు, మంత్రము, నిగమము నను నీ మూడు పదములు వేద వాచకము లనియే స్పష్టమగుచున్నది. కావున ఛందో మంత్రములలో పరస్పర భేదమును జెప్పువారి వచనములు ప్రమాణములు కావు.

వేద విషయ విచారము సమాప్తము.

# వేద సంజ్ఞా విచారః

సం॥ పూ : అథ కోఽయం వేదో నామ ?

ఉ. మంత్రభాగసంహితేత్యాహ

పూ : కించ, "మంత్ర బ్రాహ్మణయోర్ వేదనామధేయమి" తి కాత్యాయనోక్తేర్ బ్రాహ్మణ భాగస్యాపి వేద సంజ్ఞా కుతో న స్వీక్రియత ఇతి?

ఉ : మైవం వాచ్యమ్. న బ్రాహ్మణానాం వేద సంజ్ఞా భవితు మర్హతి.

పూ. కుతః ?

ఉ : పురాణేతిహాససంజ్ఞకత్వాద్ వేదవ్యాఖ్యానాద్ ఋషిభి రుక్తత్వా దనీశ్వరోక్తత్వాత్ కాత్యాయనభిన్నైర్ ఋషిభిర్ వేదసంజ్ఞాయా మస్వీకృతత్వా న్మనుష్య బుద్ధి రచితత్వా చ్చేతి. యథా బ్రాహ్మణ గ్రంథేషు మనుష్యాణాం నామలేఖపూర్వకా లౌకికా ఇతిహాసాః సంతి న చైవం మంత్రభాగే.

తె॥ పూ : వేదమని వేనికి నామము?

ఉ : మంత్ర సంహితలకు.

పూ : మంత్ర బ్రాహ్మణ గ్రంథములకు వేదమను నామ మున్నట్లు కాత్యాయనుడు చెప్పగా మీరు బ్రాహ్మణములను గూడ వేదముగా నేల యంగీకరింపరు?

ఉ : బ్రాహ్మణ గ్రంథములు వేదములు కావు. కారణ మేమన : వానికే ఇతిహాసములు, పురాణములు,కల్పములు, గాథలు, నారాశంసములు నని పేర్లు గలవు. అవి వేదములకు వ్యాఖ్యానములు. ఋషులచే వ్రాయబడినవి. ఈశ్వరోక్తములు కావు. కాత్యాయనుడు తక్క యితర ఋషులెవ్వరును, వానిని వేదములని యంగీకరింపరు. మానవ బుద్ధిరచితములు. ఈకారణములవలన బ్రాహ్మణ గ్రంథములకు వేద నామము లేదు. మంత్ర సంహితలు ఈశ్వర రచితములు; సర్వ విద్యలకు మూలములు. కావున నవి వేదములనబడును. మఱియు బ్రాహ్మణ గ్రంథములలో నున్నట్లు మానవ నామ పూర్వకముగల లౌకిక - ఇతిహాసములు వేదములందు లేవు. కావున మంత్ర భాగములే వేదములు.

సం॥ పూ : కించ భో :!

"త్ర్యాయుషం జమదగ్నేః కశ్యపస్య త్ర్యాయుషమ్,
యద్దేవేషు త్ర్యాయుషం తన్నోఽస్తు త్ర్యాయుషమ్." ౧

యజు. ౩-౬౨

ఇత్యాదీని వచనాని ఋషీణాం నామాంకితాని యజుర్వేదాది ష్వపి దృశ్యంతే. అనేనేతిహాసాది విషయే మంత్ర బ్రాహ్మణయోస్తుల్యతా దృశ్యతే. పునర్ బ్రాహ్మణానా మపి వేద సంజ్ఞా కుతోనమన్యతే.

ఉ : మైవం భ్రమి. నై వాత్ర జమదగ్ని కశ్యపౌ దేహధారిణో మనుష్యస్య నామ్నీ స్తః.

అత్ర ప్రమాణమ్ -

"చక్షుర్ వై జమదగ్నిర్ ఋషిర్ య దేనేన జగత్
పశ్యత్యథో మనుతే తస్మా చ్చక్షుర్ జమదగ్నిర్ ఋషిః." శత. ౮—౧
"కశ్యపో వై కూర్మ :, ప్రాణో వై కూర్మ :." శత. ౭ —౫

అనేన ప్రాణస్య కూర్మ : కశ్యపశ్చ సంజ్ఞాస్తి. శరీరస్య నాభౌ తస్య కూర్మాకారావస్థితేః అనేన మంత్రే ణేశ్వర ఏవ ప్రార్థ్యతే. తద్యథా –

హే జగదీశ్వర! భవత్ కృపయా నోఽస్మాకం జమదగ్ని సంజ్ఞకస్య చక్షుషః కశ్యపాఖ్యస్య ప్రాణస్య చ త్ర్యాయుషం త్రిగుణ మర్థాత్ త్రీణి శతాని వర్షాణి యావ త్తావ దాయు రస్తు. చక్షురి త్యుపలక్షణ మింద్రియాణాం ప్రాణో మన ఆదీనాం చ. ( యద్దేవేషు త్ర్యాయుషమ్) అత్ర ప్రమాణమ్–

"విద్వాగ్ంసో హి దేవాః" శత. ౩—౭,

అనేన విదుషాం దేవ సంజ్ఞాస్తి.

దేవేషు విద్వత్సు యద్ విద్యాప్రభావయుక్తం త్రిగుణ మాయుర్ భవతి (తన్నోఽస్తు త్ర్యాయుషమ్)తత్సేంద్రియాణాం సమనస్కానాం నో ఽస్మాకం పూర్వోక్తం సుఖయుక్తం త్రిగుణ మాయు రస్తు భవేత్. యేన సుఖయుక్తావయం తావ దాయుర్ భుంజీమహి. అనేనాన్యదప్యుపదిశ్యతే – బ్రహ్మ చర్యాదిసునియమైర్ మనుష్యై రేతత్ త్రిగుణ మాయు : కర్తుం శక్య మస్తీతి గమ్యతే.

అతోఽర్థాభిధాయకైర్ జమదగ్న్యాదిభి : శబ్దై రర్థమాత్రం వేదేషు ప్రకాశ్యతే. అతో నాత్ర మంత్రభాగే హీతిహాసలే శోఽప్యస్తీత్యవగంతవ్యమ్. అతో యచ్చ సాయణాచార్యాదిభిర్ వేద ప్రకాశాదిషు యత్ర కుత్రేతిహాస వర్ణనం కృతం తద్ భ్రమ మూల మస్తీతి మంతవ్యమ్.

తె ॥ పూ : ఐతరేయాది బ్రాహ్మణ గ్రంథములలో యాజ్ఞ వల్క్యుడు, మైత్రేయి జనకుడు, మున్నగు వారి యితి వృత్తములు వ్రాయబడియున్నట్లు (త్ర్యాయుషం...) అను నిట్టి వేద మంత్రములలో గూడ కశ్యపుడు మున్నగు మహర్షుల నామము అంకితములై యున్నందున నితిహాస విషయమున మంత్ర బ్రాహ్మణములు రెండును సమానములే యగుచున్నవి. కావున బ్రాహ్మణము లేల వేదములు కావు?

ఉ : ఇట్లు భ్రమపడరాదు. జమదగ్ని, కశ్యపుడు మున్నగు మంత్రస్థ పదములు దేహధారులైన మనుజుల నామములు కావు. ఇందులకు శతపథ బ్రాహ్మణమే ప్రమాణము.

"చక్షువు పేరు జమదగ్ని. దీనితో జూడనగును తెలియనగును : ఇట్లే 'ప్రాణము కశ్యపుడు, కూర్మము ననబడును. ప్రాణము కూర్మము వంటి యాకృతి కలిగి నాభియందుండును.' (శత పథము)

కావున నిట ప్రాణపదముచే నంతః కరణము, చక్షువుచే నింద్రియములు గ్రహింపదగును. ప్రాణులు వీని సహాయముననే బాహ్యాంతరములలో జూచును.

(త్ర్యాయుషం) ఈ మంత్రమున నీశ్వరుని ప్రార్థన చేయబడినది. 'ఓ జగదీశ్వర! నీ యనుగ్రహమున మా కశ్యపనామక ప్రాణము మున్నగు నంతః కరణములు, జమదగ్ని నామక నేత్రాది సర్వేంద్రియములు మూడువందల (౩౦౦) సంవత్సరముల వఱకు జీవించియుండునుగాక! (యజుర్వేదము)

శతపథమున దేవశబ్దము విద్వ ద్వాచకమని చెప్పబడినది. కావున 'విద్వాంసులు విద్యా ప్రభావము వలన మూడు వందల సంవత్సరముల కాలము జీవించునట్లు ఇంద్రియములతోను, మనస్సుతోను

మేమును త్రిగుణమగు నాయువును సుఖముగ ననుభవింతుము గాక ! అట్లే (త్ర్యాయుషం) ఇట్టి మంత్రోక్తార్థములను బట్టి, మానవుడు బ్రహ్మ చర్యాదినియమములను పాలించి త్రిగుణము, చతుర్గుణమునగు నాయువు ననుభవింపవచ్చునని తెలియుచున్నది. నాల్గువందల (४००) యేండ్లు మనుష్యుడు నియమములను బాలించి బ్రతుకవచ్చునని యభిప్రాయము.

వేదములందు సత్యములగు నర్థములను దెలుపు జమదగ్న్యాది పదముల మూలమున సత్య విద్యలు ప్రకటితము లగును; కాని, లౌకికములగు నితిహాసములు తెలుపబడవు. సాయణుడు మున్నగు నాచార్యులు వేదములకు వ్రాసిన వ్యాఖ్యానములందు వర్ణింపబడిన యితి హాసములు కల్పితములని ఉపర్యుక్త లేఖను బట్టి తెలియనగును.

సం॥ తథా బ్రాహ్మణగ్రంథానా మేవ పురాణేతిహాసాది నామాస్తి : న బ్రహ్మవైవర్త శ్రీమద్ భాగవతాదీనాం చేతి నిశ్చీయతే.

పూ : కించ భో : బ్రహ్మయజ్ఞ విధానే యత్ర క్వచిద్ బ్రాహ్మణ సూత్ర గ్రంథేషు 'యద్బ్రాహ్మణా నీతిహాసాన్ పురాణాని కల్పాన్ గాథా నారాశంసీ' రిత్యాదీని వచనాని దృశ్యంతే. ఏషాంమూల మథర్వ వేదే వ్యస్తి.

'స బృహతీం దిశ మనువ్యచలత్, తమితిహాసశ్చ పురాణం చ గాథాశ్చ నారాశంసీ శ్చాను వ్యచలన్, ఇతిహాసస్య చ వై స పురాణస్య చ గాథానాంచ నారాశంసీనాం చ ప్రియం ధామ భవతి య ఏవం వేద. అథర్వ. కాం ౧౫, ప్ర.౩౦, అ.౧, మం. ४

అతో బ్రాహణగ్రంథేభ్యో భిన్నా భాగవతాదయో గ్రంథా ఇతిహాసాది సంజ్ఞయా కుతో న గృహ్యంతే?

ఉ : మైవం వాచి. ఏతైః ప్రమాణైర్ బ్రాహ్మణగ్రంథానా మేవ గ్రహణం జాయతే.

న శ్రీమద్ భాగవతాదీనా మితి.

పూ. కుతః ?

ఉ : బ్రాహ్మణగ్రంథే ష్వితిహాసాదీనా మంతర్భావాత్.

"తత్ర దేవాసురా : సంయత్తా ఆస" న్నిత్యాదయ ఇతిహాసా గ్రాహ్యా :.

"సదేవ సోమ్యేద మగ్ర అసీ దేకమే వాద్వితీయమ్." ఛాందోగ్య. ప్ర.పా.౬.

"ఆత్మా వా ఇదమేకమేవాగ్ర ఆసీన్నాన్యత్ కించన మిషత్."

ఐతరేయారణ్య కోప. అ. ౧. ఖం. ౧

"అపో హ వా ఇదమగ్రే సలిల మేవాస." శత. ౧౧-౧.

'ఇదం వా అగ్రే నైవ కించి దాసీత్.'

ఇత్యాదీని జగతః పూర్వావస్థాకథన పూర్వకాణి వచనాని బ్రాహ్మ

ణాంతర్గతాన్యేవ పురాణాని గ్రాహ్యాణి.

కల్పా మంత్రార్థ సామర్థ్య ప్రకాశకాః. తద్యథా – "ఇషే త్వోర్జే త్వేతి వృష్టై తదాహ. యదా హ్యేషే త్వేత్యూర్జే త్వేతి యో వృష్టా దూర్గ్రసో జాయతే తస్మై తదాహ. సవితా వై దేవానాం ప్రసవితా సవితృప్రసూతాః." ఇత్యాదయో గ్రాహ్యాః–

శత. ౧–౭

గాథాః – యథా –

శతపథబ్రాహ్మణే యాజ్ఞవల్క్యజనక సంవాదో, గార్గి మైత్రేయ్యాదీనాం పరస్పరం ప్రశ్నోత్తర కథనయుక్తాః సంతీతి.

నారాశంస్యశ్చ– అత్రాహుర్ యాస్కాచార్యాః–

"నారాశంసో యజ్ఞ ఇతి కథక్యా, నరా అస్మిన్ ఆసీనాః శంసం త్యగ్ని రితి శాకపూణిర్ నరైః ప్రశస్యో భవతి." ని. అ. ౮, ఖం. ౬

నృణాం యత్ర ప్రశంసా, నృభిర్ యత్ర ప్రశస్యతే, తా బ్రాహ్మణ నిరుక్తా ద్యంతర్గతాః కథాః నారాశంస్యో గ్రాహ్యాః, నాతోఽన్యా ఇతి. కించ తేషు తేషు వచనేష్వపీద మేవ విజ్ఞాయతే, యత్ యస్మాద్ బ్రాహ్మణానీతి సంజ్ఞి వద మితిహాసాది ష్వేషాం సంజ్ఞేతి. తద్యథా– బ్రాహ్మణా న్యేవేతిహాసాన్ జానీయాత్, పురాణాని, కల్పాన్, గాథా నారాశంసీ శ్చేతి.

తె॥ ఈ కారణము వలన బ్రాహ్మణ గ్రంథములకే ఇతిహాసాది నామములని యెఱుగవలయును. శ్రీమద్ భాగవతాదులకు కాదు.

పూ : బ్రహ్మయజ్ఞమును విధించు స్థలములలో బ్రాహ్మణ సూత్రగ్రంథములలో బ్రాహ్మణము, ఇతిహాసము, పురాణము, కల్పము, గాథ, నారాశంసము మున్నగు పదములు గనఁబడును. వానికి మూలము అథర్వవేదము నందలి "స బృహతీం దిశ మనువ్యచలత్" అను నిట్టి మంత్రములలో లభించుచున్నది. ఆ మంత్రములలో బ్రాహ్మణాది శబ్దములు ప్రయోగింపబడియున్నవి. కాబట్టి పురాణాది శబ్దములచే బ్రాహ్మణాది గ్రంథములకంటె భిన్నములయిన బ్రహ్మవైవర్తభాగవత మహాభారతాది గ్రంథము లేల గ్రహింపరాదు?

ఉ : ఈ ప్రమాణముల వలన బ్రాహ్మణాదులే గ్రహింపనగును. భాగవతాదులు కావు.

పూ : ఎందువలన ?

ఉ : బ్రాహ్మణ గ్రంథములలో నితిహాసాదుల కంతర్భావమగును. భాగవతాది గ్రంథములు చెప్పు మతముల – అభిప్రాయములలో పరస్పర విరోధము లున్నవి. ఎన్నియో యసంభవము లగు కథలు వానిలో కల్పితములు వ్రాసియున్నారు. కావున, వానిని ఇతిహాసములనియు, పురాణములనియు నెంచుట యెవ్వరికిని తగదు.

శతపథాది బ్రాహ్మణ గ్రంథములందు 'దేవాసుర్యాః సంయత్తా ఆసన్' విద్వాంసులు, మూర్ఖులు పరస్పరము యుద్ధము చేయ సన్నద్ధు లైరి' అను నిట్టి వాక్యములు ఇతిహాస మనబడును.

(సదేవ....ఆత్మా వా ఇదం..., ఆపోహవా..., ఇదం హై...) మున్నగు ఛాందోగ్యాఽఽథరేయ, శతపథాదిగ్రంథ వాక్యములందు జగదుత్పత్తి మున్నగు విషయములు వర్ణింపబడియున్నవి. అట్టి బ్రాహ్మణ భాగములు పురాణము లనబడును.

(ఇషేత్వోర్జేత్వేతి.....) ఇట్టి వేదమంత్రార్థములను దెలుపు భాగములలో పదార్థసామర్థ్యము చెప్పబడుట వలన నవి కల్పములనబడును.

ఇట్లే శతపథ బ్రాహ్మణమున, జనకుడు, యాజ్ఞవల్క్యుడు, గార్గి, మైత్రేయి మున్నగువారి కథలు చెప్పు భాగములు గాథ లనబడును.

'నారాశంసి' శబ్దమునకు 'యజ్ఞము' అర్థమని యాజ్ఞవల్క్యుడంగీకరించినట్లు నిరుక్తమున నున్నది. యజ్ఞమున నుపస్థితులయిన నరులు-మనుష్యులు, స్తుతి (శంసి) పాఠము చేయుదురు. కావున 'నారాశంసి' యన యజ్ఞమని యతని అభిప్రాయము. కాని, శాకపూర్ణి ఆచార్యుడు నారాశంసి యన అగ్ని యని చెప్పుచున్నాడు. యజ్ఞాగ్ని మనుజులచే ప్రశంసింపబడును కావున, అగ్నియే నారాశంసి యని యతని మతము. ధర్మము ఈశ్వరుడు మున్నగు పదార్థవిద్యలును, మనుష్యులును నెందు ప్రశంసింపబడుదురో యవి నారాశంసులని యభిప్రాయము.

(బ్రాహ్మణా నీతిహాసాన్....) ఈ వాక్యమునందు బ్రాహ్మణ పదము సంజ్ఞి - సంజ్ఞ గలది. ఇతిహాసము సంజ్ఞ. బ్రాహ్మణ గ్రంథములకు ఇతిహాసములు, పురాణములు, గాథలు, నారాంశసములు నని నామములని భావము. కావున, బ్రాహ్మణములలోను, నిరుక్తాది గ్రంథములందును నేయే కథ లెట్లెట్లు వ్రాయబడినవో, వానినే యితిహాసాది పదములచే గ్రహింపవలయును. ఇతరముల గ్రహింపరాదు.

సం॥ అన్య దప్యత్ర ప్రమాణ మస్తి. న్యాయదర్శన భాష్యే -

సూ ః 'వాక్యవిభాగస్య చార్థగ్రహణాత్." ౧ న్యా.౨-౧.౬౧

అస్యోపరి వాత్స్యాయన భాష్యమ్ ః-

'ప్రమాణం శబ్దో యథా లోకే; విభాగశ్చ బ్రాహ్మణ వాక్యానాం త్రివిధః-'

అయ మభిప్రాయః ః- బ్రాహ్మణగ్రంథశబ్దా లౌకికా ఏవ. న వైదికా ఇతి. తేషాం త్రివిధో విభాగో లక్ష్యతే.

సూ ః- 'విధ్యర్థవాదానువాదవచనవినియోగాత్.' ౨. న్యా౨,౧-౬౨

అస్యోపరి వాత్స్యాయనభాష్యమ్-త్రిధా ఖలు బ్రాహ్మణవాక్యాని వినియుక్తాని. విధి వచనాని, అర్థవాదవచనాని, అనువాదవచనానీతి.

తత్ర సూః- "విధిర్ విధాయకః" 3 న్యా. ౨-౧-౬౩

వా.భాః- యద్ వాక్యం విధాయకం చోదకం న విధిః. విధిస్తు నియోగోఽనుజ్ఞా వా. యథా 'అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గకామః' ఇత్యాది బ్రాహ్మణవాక్యానా మితి శేషః.

సూత్రమ్ః- "స్తుతి ర్నిందా పరకృతిః పురాకల్ప ఇత్యర్థవాదః." ౬ న్యా. ౨-౧-౬౪

వా. భా ః- విధేః ఫలవాదలక్షణా యా ప్రశంసా సా స్తుతిః. సంప్రత్యయార్థం స్తూయమానం శ్రద్ధధీతేతి ప్రవర్తికా చ, ఫలశ్రవణాత్ ప్రవర్తతే. 'సర్వజితా వైదేవాః సర్వ మజయన్ సర్వస్యాప్త్యై సర్వస్య జిత్యై సర్వమే వైతేనాప్నోతి, సర్వం జయతీ త్యేవ మాది.

అనిష్టఫలవాదో నిందా, వర్జనార్థం 'నిందితం న సమాచరేత్' ఇతి. "స ఏష వా ప్రథమో యజ్ఞో యజ్ఞానాం యజ్జ్యోతిష్టోమో య ఏతేనా నిష్ట్వా ఽన్యేన యజతే గర్తే పతత్యయ మేత జ్జీర్యతే వా ఇత్యేవ మాది."

అన్యకర్తృకస్య వ్యాహతస్య విధేర్ వాదః-పరకృతిః. "హుత్వావపా మేవాగ్రేఽభిఘారయంతి. అథ పృషదాజ్యం. తదు హ చరకాధ్వర్యవః పృషదాజ్యమేవాగ్రేఽభిఘారయంతి, అగ్నేః ప్రాణాఃపృషదాజ్యం స్తోమమి త్యేవ మభిదధతి." ఇత్యేవమాది.

"ఐతిహ్యసమాచరితో విధిః పురాకల్పః" ఇతి. 'తస్మాద్ వా ఏతేన బ్రాహ్మణా హవిః పవమానం సామ స్తోమ మస్తౌషన్ యోనేర్ యజ్ఞం ప్రతనవామహే." ఇత్యేవమాది

పూః కథం పరకృతి పురాకల్పౌ అర్థవాదా ఇతి? స్తుతినిందావాక్యే నాభిసంబంధాద్, విధ్యాశ్రయస్య కస్యచి దర్థస్య ద్యోతనా దర్థవాద ఇతి.

సూ :- "విధివిహితస్యానువచన మనువాదః," గ. న్యా: ౨-౧-౬౫

వా. భా :- విధ్యనువచనం చానువాదో, విహితానువచనం చ. పూర్వః శబ్దానువాదః, అపరోఽర్థానువాదః.

సూ :- "న చతుష్ట్వ మైతిహ్యార్థాపత్తి సంభవాభావ ప్రామాణ్యాత్," ఉ న్యా. అ. ౨-౨-౧

వా. భా :- న చత్వా ర్యేవ ప్రమాణాని; కిం తర్హి, ఐతిహ్యమ్, అర్థాపత్తిః సంభవః అభావ ఇత్యేతాన్యపి ప్రమాణాని. "ఇతి హోచుః" త్యనిర్దిష్ట ప్రవక్తృకం ప్రవాదపారంపర్య మైతిహ్యమ్,

అనేన ప్రమాణేనా పీతిహాసాదినామభిర్ బ్రాహ్మణాన్యేవ గృహ్యంతే, నాఽన్య దితి.

తె॥ బ్రాహ్మణ గ్రంథముల కితిహాస మను నామమున్నదనుటకు న్యాయదర్శనముకూడ ప్రమాణము.

"లోకమున ముప్విధములగు వచనములున్నట్లు బ్రాహ్మణ గ్రంథములందును గలవు. బ్రాహ్మణ గ్రంథములలోని శబ్దములు లౌకికములే కాని, వైదికములు కావు.

౧. ఆ ముప్విధములగువాక్యములలో నొక రకమునకు విధి వాక్యములని పేరు. లోకమునందు "సుఖము కొఱకు దేవదత్తుడు గ్రామమునకు వెళ్ళవలయును. అనునది విధి వాక్యము. అట్లే బ్రాహ్మణమున, (అగ్నిహోత్రం జుహుయాత్) 'స్వర్గమును కాంక్షించువాడు సుఖము కొఱకు అగ్నిహోత్ర మాచరింపవలయును.' అను నీ వాక్యము విధి వాక్యముగ నెంచబడును.

౨. రెండవది అర్థవాదము. అది నాలుగు విధములుగ నుండును. 1. స్తుతి, 2. నింద, 3. పరకృతి, 4 పురాకల్పము.

1. స్తుతి :- ఫలమును జెప్పి పదార్థముల గుణములను వర్ణించుట. అందువలన మానవులకు నుత్తమకర్మముల నొనర్చుట యందును, మంచి గుణములను గ్రహించుటలోను శ్రద్ధకలుగును.

2. నింద :- చెడు ఫలములను వర్ణించి చెడు కర్మములను జేయుటలో గల దోషముల నెన్నుటవలన వానిని చేయకుందురు.

3. పరకృతి :- ఇతరుడు చేసిన పనిని చెప్పుట. కొండొకచోరుడు చెడుపని చేసినందున నతనికి దండన లభించినది. ఒక సావుకారు మంచి పని చేసినందున నతనికి ప్రతిష్ఠ కలిగినది.

4. పురాకల్పము :- పూర్వము జరిగిన వృత్తము. జనకుని సభలో యాజ్ఞవల్క్యుడు, గార్గి, శాకల్యుడు మున్నగువారు చేరి పరస్పర ప్రశ్నోత్తర రూపమున సంవాదమొనర్చిరి. ఇట్టి యితిహాసములు పురాకల్ప మనబడును.

పూ : పరకృతిని, పురాకల్పమును అర్థవాదమని యేల చెప్పుదురు ?

ఉ : వీనిలో గూడ స్తుతి, నిందలకు సంబంధించిన వాక్యము లుండును. కొండొక మంచి విషయమున ప్రవృత్తునొనర్చుటకు విధాన ముండును.

3. బ్రాహ్మణ వాక్యములందలి మూడవ విధము – అనువాదము :– పూర్వము విధించినదానిని స్మరించుటయు, మరల చెప్పుటయు అనువాద మనబడును. ఈ యనువాదము రెండు రకములు. ఒకటి శబ్దమునకు సంబంధించినది – రెండవది అర్థమునకు సంబంధించినది. 'అతడు విద్య నేర్వవలయును' ఇది శబ్దానువాదము. ఇందు విధి వాక్యములోని శబ్దములే మరల చెప్పబడెను. 'విద్య నేర్చినందున జ్ఞానము కలుగును' దీని నర్థానువాద మందురు. ఇందు శబ్దములను మరల చెప్పక వాక్యములోని యర్థము మఱి కొన్ని శబ్దములతో చెప్పబడినది.

ఒక విషయమును ప్రతిజ్ఞచేసి, అది నిరూపించుటకు – హేతువు, ఉదాహరణము, ఉపనయము, నిగమనము చెప్పి వివరించుటయు అనువాదమగును. ప్రతిజ్ఞ :– 'పరమేశ్వరుడు–నిత్యుడు.' హేతువు – 'వినాశరహితుడగుటవలన.' ఉదాహరణము:– 'ఆకాశము వలె' ఉపనయము:– ఎట్లు ఆకాశము నిత్యత్వధర్మమును సాధించు వినాశరహితత్వ మనెడి ధర్మముతో కూడి యున్నదో యట్లే పరమేశ్వరుడు కూడ. పై నాలిగింటిని (ప్రతిజ్ఞా హేతూదాహరణోపనయములు) క్రమముగానుచ్చరించి, పక్షము (సాధ్యాధికరణము) నందు వానిని బాగుగ సమన్వయ పఱచి చెప్పుట నిగమన మందురు. 'అందువలన పరమేశ్వరుడు కూడ వినాశ రహితుడై నందున – ఆకాశము వలె నిత్యుడు.' ఇదియే నిగమనము. ఈ ప్రయోగమునందేయే శబ్దములు, అర్థములు రెండవ పర్యాయ ముచ్చరింపబడినవో, ఆలోచింపబడినవో వానిని అనువాద మందురు. ఇయ్యది బ్రాహ్మణ గ్రంథములలో బాగుగ వ్రాయబడినది. అందువలనను బ్రాహ్మణ గ్రంథములు ఇతిహాసాది నామములతో చెప్పబడునని గ్రహింపనగును. వీనిలో ఇతిహాసము, పురాణము, కల్పము, గాథ, నారాశంసము నను నీ యైదు విధములగు కథలన్నియు సరిగా వ్రాయబడియున్నవి. భాగవతాదులలో నబద్ధపు కథలు మిక్కిలిగనున్నవి. సత్యకథలు లేవు. కావున వాని నితిహాసము లనరాదు. వాత్స్యాయనముని, ఇతిహాసమున కిట్లు లక్షణము కూడ చెప్పి యున్నాడు :–

'ఏవిషయములు పరంపరగా వినుచున్నామో, వేనిని చెప్పిన వ్యక్తులు 'ఫలానా' అని నిశ్చితముగ జెప్పజాలమో, కాని, యేవి సత్యములో యవియే యితిహాస మనబడును.అందువలననే యితిహాసము శబ్దప్రమాణాంతర్గత మౌచున్నది. శబ్దప్రమాణము, ఇతిహాసము రెండును సత్యములే. కావున భాగవతాది గ్రంథములలో నట్టి సత్యము లేనందున నవి యితిహాసములు కావు.

**సం॥** అన్యచ్చ–బ్రాహ్మణాని తు వేదవ్యాఖ్యానా న్యేవ సంతి. నైవ వేదాఖ్యానీతి.

**పూ : కుతః ?**

**ఉ:** 'ఇషేత్వోర్జేత్వేతి.' శత. ౧–౭. ఇత్యాదీని మంత్రప్రతీకాని ధృత్వా, బ్రాహ్మణేషు వేదానాం **వ్యాఖ్యానకరణాత్.**

తె॥ బ్రాహ్మణ గ్రంథములు వేదవ్యాఖ్యానములే కాని వేద (నామక) ములుకావు. కారణ మేమన : (ఇషేత్వోర్జేత్వేతి) 'ఇషేత్వా' 'ఊర్జేత్వా' అని వేదమంత్రములలోని పదములు గ్రహించి హానికి వ్యాఖ్యానము చేసి యున్నందున నవివ్యాఖ్యాన గ్రంథములే యగును; మూల వేదములు కావు. మంత్రభాగమున నెక్కడను బ్రాహ్మణ గ్రంథవాక్యములలోని పదములు ప్రతీకగా గ్రహించి, వాని కర్థము చెప్పుట జూడ నేరము. దీనింబట్టి ఈశ్వరోక్తములు – మంత్రభాగములే యనియు – అవియే సంహితలు, వేదములు ననబడుననియు స్పష్టమగు చున్నది. బ్రాహ్మణములు వేదములు కావు.

సం॥ అన్యచ్చ మహాభాష్యే ౽ పి –

'కేషాం శబ్దానామ్' లౌకికానాం వైదికానాం చ; తత్ర లౌకికా స్తావత్ గౌ రశ్వః పురుషో హస్తీ శకునిర్ మృగో బ్రాహ్మణ ఇతి. వైదికాః ఖల్వపి :– 'శన్నో దేవీ రభిష్టయ', 'ఇషేత్వోర్జేత్వా', 'అగ్ని మీడె పురోహితమ్'. 'అగ్న ఆయాహి వీతయే' ఇతి.

యది బ్రాహ్మణ గ్రంథానా మపి వేద సంజ్ఞా అభీష్టా౽భూత్, తర్హి తేషా ముదాహరణ మదాత్. అత ఏవ మహాభాష్యకారేణ మంత్రభాగ స్యైవ వేద సంజ్ఞాం మత్వా ప్రథమ మంత్రప్రతీకాని వైదికేషు శబ్దే షూదాహృతాని. కింతు, యాని గౌరశ్వ ఇత్యాదీని లౌకికోదాహరణాని దత్తాని తాని బ్రాహ్మణాది గ్రంథేష్వేవ ఘటంతే.

పూ : కుతః ?

ఉ : తేష్వీదృశ శబ్దపాఠవ్యవహారదర్శనాత్. '

(౧) ద్వితీయా బ్రాహ్మణే.' అ. ౨–౩ –౬౦

(౨) 'చతుర్థ్యర్థే బహులం ఛందసి.' అ. ౨–౩–౬౨

(౩) 'పురాణప్రోక్తేషు బ్రాహ్మణ కల్పేషు.' అ. ౪–౩–౧౦౫

ఇత్యష్టాధ్యాయ్యాం సూత్రాణి.

అత్రాపి పాణిన్యాచార్యైర్ వేదబ్రాహ్మణ యోర్ (నామ) భేదేనైవ ప్రతిపాదితమ్. తద్యథా :–

పురాణైః ప్రాచీనైర్ బ్రహ్మాదృషిభిః ప్రోక్తా బ్రాహ్మణ కల్ప గ్రంథా వేదవ్యాఖ్యానాః సంతి. అత ఏవైతేషాం పురాణేతిహాససంజ్ఞా కృతా౽స్తి. యద్యత్ర ఛందో బ్రాహ్మణయోర్ వేదసంజ్ఞా౽భీష్టా భవే త్తర్హి 'చతుర్థ్యర్థే బహులం ఛందసీ' తి ఛందోగ్రహణం వ్యర్థం స్యాత్.

పూ : కుతః ?

ఉ. 'ద్వితీయా బ్రాహ్మణే' ఇతి బ్రాహ్మణశబ్దస్య ప్రకృతత్వాత్, అతో విజ్ఞాయతే – న బ్రాహ్మణగ్రంథానాం వేదసంజ్ఞా౽స్తీతి.

పూ : అతః కిం సిద్ధమ్ ?

ఉ : బ్రహ్మేతి బ్రాహ్మణానాం నామాస్తి. అత్ర ప్రమాణమ్. బ్రహ్మవై బ్రాహ్మణః, క్షత్రం రాజన్యః" శత. ౧౩–౧

"సమానార్థా వేతౌ వృషశబ్దో వృషన్ శబ్దశ్చ,

బ్రహ్మన్ శబ్దో బ్రాహ్మణశబ్దశ్చ" ఇతి వ్యాకరణమహాభాష్యే. అ. ౫. పా. ౧. ఆ. ౧

"చతుర్వేదవిద్భిర్ బ్రహ్మభిర్ బ్రాహ్మణైర్ మహర్షిభిః

ప్రోక్తాని యాని వేదవ్యాఖ్యానాని తాని బ్రాహ్మణాని,"

అన్యచ్చ:– కాత్యాయనేనాపి బ్రహ్మణా వేదేన సహచరితత్వాత్ సహచారోపాధిం మత్వా బ్రాహ్మణానాం వేదసంజ్ఞా సంమతేతి విజ్ఞాయతే. ఏవమపి న సమ్యగస్తి.

పూ॰ కుతః ?

ఉ॰ ఏవం తేనానుక్తత్వా దతోఽన్యైర్ ఋషిభిః అగృహీతత్వాత్. అనేనాపి న బ్రాహ్మణానాం వేదసంజ్ఞా భవితు మర్హతీతి. ఇత్యాది బహుభిః ప్రమాణైర్ మంత్రాణా మేవ వేదసంజ్ఞా, న బ్రాహ్మణ గ్రంథానా మితి సిద్ధమ్.

తె॥ వ్యాకరణ మహాభాష్య ప్రమాణమును బట్టియు బ్రాహ్మణములు వేదములు కావని తెలియుచున్నది. మహాభాష్యమునందు లోక వేదములకు సంబంధించిన భిన్న భిన్న ఉదాహరణములు చూపబడినవి. 'గౌః అశ్వః' అను పదములు లౌకికములనియు, 'శన్నో దేవీ రభిష్టయ' అను మంత్రములు వైదికములనియు నం దుదాహరింపబడినవి. వైదిక శబ్దముల కుదాహరణములుగా నిచ్చిన వాక్యములలో బ్రాహ్మణ గ్రంథపు వాక్య మొక్కటియు లేదు. లౌకిక పదములకు నుదాహరణముగా నిచ్చిన గౌః అశ్వః అనునవి బ్రాహ్మణ గ్రంథములలోనివే. కారణ మేమన? వానిలో నట్లే యున్నది. అందువలన బ్రాహ్మణములకు వేదనామము లేదు.

'ఛందస్సు', 'బ్రాహ్మణము' నను వానికి రెంటికి వేద సంజ్ఞయిష్టమగు పక్షమున, పాణిని మునిచే రచియింపబడిన 'చతుర్థ్యర్థే బహులం ఛందసి' అను సూత్రమునందు 'ఛందసి' అను పదము చేర్పనక్కఱలేదు. కారణ మడుగుదురేని, వినుడు – ఆ సూత్రమునకు పూర్వపు సూత్రమునందు 'ద్వితీయా బ్రాహ్మణే' అని బ్రాహ్మణ శబ్దమున్నది. ఆ శబ్దము 'చతుర్థ్యర్థే బహులమ్, అను సూత్రమునందనువర్తించును. 'ఛందసి' అని సూత్రమున చేర్పవలసిన పని యేమున్నది? చేర్పబడినది కావున బ్రాహ్మణము, ఛందస్సు, నను రెండుపదములు పర్యాయములు కావని స్పష్టమగుచున్నది. కావున బ్రాహ్మణములు–వేదములు, ఛందస్సులు కావని సిద్ధమగుచున్నది.

'పురాణప్రోక్తేషు' అను నిట్టి పాణినిముని ప్రయోగముల ననుసరించి పురాణ–ప్రాచీన బ్రహ్మాది ఋషులచే చెప్పబడిన(ప్రోక్తములు) బ్రాహ్మణ కల్పాది గ్రంథములు వేదవ్యాఖ్యానము లనియే తెలియుచున్నది. కావున నీ బ్రాహ్మణ గ్రంథములకే పురాణములు, ఇతిహాసములు – అను నామము వర్తించును.

పూ ॰ దీనివలన నేమి సిద్ధించును ?

ఉ ॰ బ్రహ్మ యని బ్రాహ్మణునకు నామము. కావున బ్రహ్మాది వేదవిదులయిన మహర్షులచే వ్రాయబడిన యైతరేయ శతపథాది బ్రాహ్మణములు వేదవ్యాఖ్యానములని దీనివలన సిద్ధమగుచున్నది.

శతపథమున 'బ్రహ్మ' శబ్దమునకు బ్రాహ్మణుడనియు, 'క్షత్' శబ్దమునకు రాజన్యుడనియు వ్రాయబడినది. ఇట్లే వ్యాకరణ మహాభాష్యమునందును 'వృషన్, వృష' శబ్దములు ॰ బ్రహ్మ, బ్రాహ్మణ శబ్దములు సమానార్థకములనియు వ్రాయబడియున్నది.

సహచారోపాధిలక్షణ ననుసరించి – వేదములకు బ్రాహ్మణములు సహచరితములై నందున కాత్యాయనుడు మంత్ర, బ్రాహ్మణములు రెండును వేదములే యని చెప్పినాడనుటయు తగదు. (సహచారోపాధి లక్షణకు ఉదాహరణము ॰– ఒకడు మఱియొకనితో 'ఆదండమునకు భోజనము పెట్టుము' అనిన, అది వినిన వ్యక్తి దండము – కఱ్ఱ – భోజనము చేయలేదు; కావున దండము పట్టుకొనిన వ్యక్తికి భోజనము పెట్టుము' అని చెప్పినట్లు గ్రహించి యట్లుచేయును.) బ్రాహ్మణములు వేదసంజ్ఞ కలవిగా జెప్పుట కీ 'లక్షణ' యుపయోగింపదని యభిప్రాయము.

పూ. ఎందువలన ?

ఉ : సహచారోపాధి లక్షణతో బ్రాహ్మణములకు వేదసంజ్ఞ కలిగినదని కాత్యాయనుడు కూడ చెప్పలేదు. ఇతర ఋషులలోనొక్కరు కూడ బ్రాహ్మణములకు వేదనామ మున్నట్లు చెప్పియుండనులేదు. కాబట్టి బ్రాహ్మణములు వేదములు కావు. ఇట్లనేక ప్రమాణముల మూలమున మంత్రభాగముతే వేదములనియు, బ్రాహ్మణములు వేదములు కావనియు నిశ్చిత మగుచున్నది.

సం॥ పూ: కించ భోః! బ్రాహ్మణ గ్రంథానా మపి వేదవత్ప్రామాణ్యం కర్తవ్యమ్ అహోస్విన్నేతి?

ఉ: అత్ర బ్రూమః. నైతేషాం వేదవత్ ప్రామాణ్యం కర్తుం యోగ్యమస్తి.

పూ; కుతః ?

ఉ: ఈశ్వరోక్తాభావాత్, తదనుకూలతయైవ ప్రమాణార్హత్వాచ్చేతి. పరంతు, సంతి తాని పరతః ప్రమాణయోగ్యాన్యేవేతి.

ఇతి వేద సంజ్ఞావిచారః

తె॥ పూ: వేదములవలె బ్రాహ్మణములు కూడ తుల్యప్రమాణములేనా ?

ఉ : బ్రాహ్మణములు వేదములకు తుల్యప్రమాణములుకావు. కారణమేమి ? అన; అవి ఈశ్వరోక్తములు కావు. కావున వేదానుకూలముగ నున్నంతవఱకు నవి ప్రమాణములగును. కాని, అవి స్వతః ప్రమాణములుకావు. పరతః ప్రమాణములని యెంచవలెను. (బ్రాహ్మణములు వేదమునకు విరుద్ధముగా జెప్పు తావున, వేదములే ప్రమాణములగును. బ్రాహ్మణములు కావు.)

వేదసంజ్ఞావిచారము సమాప్తము.

# అథ బ్రహ్మవిద్యావిషయః

సం॥ పూ : వేదేషు సర్వా విద్యాః సన్త్యాహోస్విన్నేతి ?

ఉ; అత్రోచ్యతే – సర్వాః సన్తి మూలోద్దేశతః తత్రాదిమా బ్రహ్మ విద్యా సంక్షేపతః ప్రకాశ్యతే –

"త మీశానం జగత స్తస్థుషస్పతిం ధియం జిన్వ మవసే హూమహే వయం, పూషా నో యథా వేదసా మస ద్వృధే రక్షితా పాయు రదబ్ధః స్వస్తయే." ౧ ఋ. ౧. ౬.–౧౫–౫

"తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః, దివీవ చక్షు రాతతమ్." ౨ ఋ. ౧. ౨–౭–౫

అనయో రర్థ :– (తమీశానమ్) ఈష్టేఽసా వీశానః. సర్వ జగత్కర్తా, (జగత స్తస్థుషస్పతిమ్) జగతో జంగమస్య, తస్థుషః స్థావరస్య చ పతిః స్వామీ, (ధియం జిన్వమ్) యో బుద్ధే స్తృప్తికర్తా, (అవసే హూమహే వయం) తమవసే రక్షణాయ, వయం హూమహే – ఆహ్వాయామః, (పూషా) పుష్టికర్తా, (నః)స ఏవాఽస్మాకం పుష్టికారకోఽస్తి (యథా వేదసామసద్ వృధే) హే పరమేశ్వర ! యథా యేన ప్రకారేణ వేదసాం విద్యా సువర్ణాదీనాం ధనానాం వృధే వర్ధనాయ భవా నస్తి, తథైవ కృపయా, (రక్షితాఽసత్) రక్షకోఽప్యస్తు, ఏవం (పాయు రదబ్ధః స్వస్తయే) అస్మాకం రక్షణే స్వస్తయే సర్వసుఖాయ, (అదబ్ధః)అనలసః, సన్ పాలనకర్తా సదైవాస్తు.

తద్విష్ణోరితి మంత్రస్యార్థో వేదవిషయ ప్రకరణే విజ్ఞానకాండే గదితః, తత్ర ద్రష్టవ్యః.

తె॥ పూ : వేదములందు సర్వవిద్యలు నున్నవా లేవా ?

ఉ: మూలరూపమున నన్నియునున్నవి. ప్రపంచమున గల సత్యవిద్యలన్నియు వేదములనుండియే వెలువడినవి. వానిలో మొదట బ్రహ్మవిద్యను గూర్చి సంక్షేపముగ నిట వ్రాయుచున్నాము.

తమీశాన మంత్రార్థము:– (తమీశానం) సర్వజగత్కర్తయై, (జగతః తస్థుషః పతిం) చరాచరాత్మక జగత్తును పాలించు, (ధియం జిన్వమ్) మానవబుద్ధి నానందముచే నింపువాడును నగు పరమేశ్వరుని (అవసేహూమహే) రక్షణ కొఱకు మన మాహ్వానించుచున్నాము, ప్రార్థించుచున్నాము.(పూషా నః) అతడు మన పోషణ కర్త, (యథా వేదసా మసద్ వృధే) ఓ పరమేశ్వర! నీవు కృపతో మా సర్వవిద్యలను, సువర్ణాదిధనములను నెట్లు వర్ధిల్ల జేయుదువో యట్లే, (రక్షితా) ఎల్లరకు రక్షకుడవుగమ్ము, (పాయు రదబ్ధః స్వస్తయే) నీవెట్లు మమ్ములను రక్షించుచున్నావో, అట్లే యనలసుడవై సర్వసుఖములను ప్రసాదింపుము

(తద్విష్ణోః...) అను నీమంత్రమున కర్థము వేదవిషయ ప్రకరణమున బాగుగ వివరింపబడినది. అక్కడ జూడవచ్చును.

సం॥ "పరీత్య భూతాని, పరీత్య లోకాన్, పరీత్య సర్వాః ప్రదిశో దిశశ్చ. ఉపస్థాయ ప్రథమజామృతస్యాత్మ నాత్మాన మభిసంవివేశ." ౩ యజు.౩౨–౧౧

(పరీత్య) యః పరమేశ్వరో, భూతాన్యాకాశాదీని పరీత్య సర్వతోఽభివ్యాప్య. సూర్యాదీన్ లోకాన్ పరీత్య, పూర్వాది దిశః పరీత్య, ఆగ్నేయాది ప్రదిశశ్చపరీత్య, పరితః సర్వతః, ఇత్వా ప్రాప్య, విదిత్వా

చ, (ఉపస్థాయ) యః స్వసామర్థ్యస్యా ప్యాత్మాస్తి. యశ్చ ప్రథమాని సూక్ష్మ భూతాని జనయతి, తం పరమానాంద స్వరూపం మోక్షాఖ్యం పరమేశ్వరం, యో జీవః, ఆత్మనా స్వసామర్థ్యే నాంతఃకరణే నోపస్థాయ తమే వోపగతోభూత్వా, విదిత్వా, చాభిసంవిశేశ - అభిముఖ్యేన సమ్యక్ ప్రాప్య, స ఏవ మోక్షాఖ్యం సుఖ మనుభవతీతి.

తె॥ (పరీత్య...) ఆకాశాది పంచభూతములందును, సూర్యాది లోకములలోను, పూర్వాది దిక్కులందును, ఆగ్నేయాది దిక్కోణములందును పరమేశ్వరుడు నిరంతరము వ్యాపించి యున్నాడు. ప్రత్యణువు నతనితో నిండియున్నది. అతడు సర్వము నెఱుగును. (ఋతస్య...) ఎవడు తన సామర్థ్యమునకు దానే యాత్మయో, (ప్రథమజాం) ఎవడు కల్పారంభమున సృష్టి నొనరించునో, ఆ ఆనందస్వరూపుడగు పరమేశ్వరుని తన మనస్సు-సామర్థ్యముతో సరిగా నెఱుగు జీవుడే యతనిని బొందును. (అభిసంవిశేశ) ఎల్లపుడు మోక్షసుఖము ననుభవించును.

సం॥ "మహ ద్యక్షం భువనస్య మధ్యే తపసి క్రాంతం సలిలస్య పృష్ఠే, తస్మిఞ్ ఛ్రయంతే య ఉ కే చ దేవా వృక్షస్య స్కంధః పరిత ఇవ శాఖాః." ౪. అథర్వ. ౧౦, ౨౩-౪-౩౮

(మహద్యక్షం..) యన్మహత్ సర్వేభ్యో మహత్తరం యక్షం సర్వమనుష్యైః పూజ్యం, (భువనస్య) సర్వసంసారస్య, (మధ్యే) పరిపూర్ణం. (తపసి క్రాంతం) విజ్ఞానే వృద్ధం, (సలిలస్య) అంతరిక్షస్య కారణ రూపేణ కార్యస్య ప్రలయానంతరం, (పృష్ఠే) పశ్చాత్ స్థిత మస్తి, తదేవ బ్రహ్మ విజ్ఞేయమ్, (తస్మిఞ్ ఛ్రయ) తస్మిన్ బ్రహ్మణి యే కే చాపి దేవా స్త్రయ స్త్రింశద్ వస్వాదయః, తే సర్వే తదాధారేణైవ తిష్ఠంతి. కస్య కా ఇవ?

తె॥ (మహద్యక్షం) బ్రహ్మము అన్నింటికంటెను పెద్దది. అది మానవుల కందఱికి పూజ్యము. (భువనస్య...) లోకముల కన్నింటికి మధ్యనుండి యుపాసింప దగియున్నది. (తపసి క్రాంతం) విజ్ఞానాది గుణములలో నన్నింటికంటె బెద్దది. (సలిలస్య పృష్ఠే) అంతరిక్షఆకాశమునకు గూడ నాధారమై, అందే వ్యాపకమై, తరువాత జగత్తు ప్రళయమైన తదుపరి కూడ నిత్యమై, నిర్వికారమై యుండును. (తస్మిన్ శ్రయంతే..) అతని యాశ్రయముననే పూర్వము చెప్పబడిన వస్వాది ముప్పది మూడు దేవతలు నున్నవి. (వృక్షస్య స్కంధః పరితః శాఖాః) మొదట భూమి నుండి యంకుర ముద్భవించి, అదియే స్థూలమై స్కంధమనబడి, క్రమముగ శాఖల కాధారమగును. ఇట్లే సమస్త బ్రహ్మాండమున కాధారము పరమేశ్వరుడగును.

సం॥ "న ద్వితీయో న తృతీయ శ్చతుర్థో నాప్యుచ్యతే." ౫

"న పంచమో, న షష్ఠః సప్తమో నా ప్యుచ్యతే." ౬

నాష్టమో, న నవమో దశమో నాప్యుచ్యతే." ౭

తదిదం నిగతం సహః స ఏక ఏష ఏకవృ దేక ఏవ." ౮

"సర్వే అస్మిన్ దేవా ఏకవృతో భవంతి." ౯

అథర్వ. ౧౩-౪-౧౬, ౧౭, ౧౮, ౨౦, ౨౧

(న ద్వితీయ...) ఏతై ర్మంత్రై రిదం విజ్ఞాయతే- "పరమేశ్వర ఏక ఏవాస్తీతి. నైవాతో భిన్నః కశ్చిదపి ద్వితీయః తృతీయః చతుర్థః," ౫

"పంచమః. షష్ఠః, సప్తమః." ౬

"అష్టమో నవమో దశమ శ్చేశ్వరో విద్యతే" ౭

యతో నవభిర్ నకారైర్ ద్విత్వ సంఖ్యా మారభ్య శూన్య పర్యంతే నైక మీశ్వరం విధాయ అస్మాద్భిన్నేశ్వరభావ స్యాతిశయతయా నిషేధో వేదేషు కృతోఽస్తి; అతో ద్వితీయ స్యోపాసన మత్యంతం నిషిధ్యతే. సర్వాంతర్యామితయా ప్రాప్తః సన్ జడంచేతనం చ ద్వివిధం సర్వం జగత్ స ఏవ పశ్యతి, నాస్య కశ్చిద్ ద్రష్టాస్తి. న చాయం కస్యాపి దృశ్యో భవితు మర్హతి.

యేనేదం జగద్ వ్యాప్తం. తమేనం పరమేశ్వర మిదం సకలం జగ దపి (నిగతం) నిశ్చితం ప్రాప్త మస్తి, వ్యాపకాద్ వ్యాప్యస్య సంయోగ సంబంధత్వాత్ (సహః) యతః సర్వం సహతే, తస్మాత్ స ఏవైష సహోఽస్తి. స ఖల్వేక ఏవ వర్తతే. న కశ్చిద్ ద్వితీయ స్తదధిక స్తత్తుల్యో వాఽస్తి. ఏకశబ్దస్య త్రిర్ గ్రహణాత్. అతః సజాతీయ – విజాతీయ – స్వగత భేదరాహిత్య మీశ్వరే వర్తత ఏవ, ద్వితీయేశ్వర స్యాత్యంత నిషేధాత్.

పూః కస్మాత్?

ఉ :– ఏక వృదేక ఏవే త్యుక్తత్వాత్. న ఏష ఏక ఏకవృత్. ఏకేన చేతనమాత్రేణ వస్తునైవ వర్తతే. పునరేక ఏవాసహాయః సన్, య ఇదం సకలం జగద్ రచయిత్వా ధారయ తీత్యాది విశేషణ యుక్తోఽస్తి.. తస్య సర్వశక్తిమత్వాత్.

అస్మిన్ సర్వశక్తిమతి పరమాత్మని, సర్వే దేవా పూర్వోక్తా వస్వాదయ ఏకవృత ఏకాధికరణా ఏవ భవంతి, అర్థాత్ ప్రళయానంతర మపి తత్ సామర్థ్యం ప్రాప్యైకకారణవృత్తయో భవంతి. ౯

ఏవం విధా శ్చాన్యేఽపి బ్రహ్మవిద్యా ప్రతిపాదకాః "స పర్యగాచ్ఛుక్రమకాయ" మిత్యాదయో మంత్రా వేదేషు బహవః సంతి. గ్రంథాధిక్యభియా నాత్ర లిఖ్యంతే. కింతు యత్ర యత్ర వేదేషు తే మంత్రాః సంతి, తత్తద్ భాష్యకరణావసరే తత్ర తత్రార్థానుదాహరిష్యామి ఇతి.

ఇతి బ్రహ్మవిద్యా విషయ విచారః

తె॥ (న ద్వితీయో న...) ఈ మంత్రము లన్నింటి మూలమున, 'పరమేశ్వరు డొక్కడే. అతనికి భిన్నముగ రెండవ వాడు, మూడవ వాడు, నాల్గవవాడు ననదగు పరమేశ్వరు డెవడును లేడు' అని నిశ్చిత మగుచున్నది.

(న పంచమో న...) ఐదవవాడుగాని, ఆఱవవాడుగాని, ఏడవ వాడుకాని ఈశ్వరు డనబడువాడు లేడు.

(నాష్టమో న...) ఎనిమిదవ, తొమ్మిదవ, పదవవాడు ఈశ్వరుడనదగినవా డింకొకడు లేడు.

"ఈ మంత్రములలో, రెండు మొదలు పదివఱకు గల సంఖ్యను లెక్కించి, ఒక్కనికి మించి మఱియొక యీశ్వరుడు లేడని నిషేధింపబడినది. సర్వసంఖ్యలకు మూలము – ఒకటి (౧) యను సంఖ్యయే యని దీని యభిప్రాయము. ఆ యొకటితోనే రెండు, మూడు, నాలుగు, ఐదు, ఆఱు, ఏడు, ఎనిమిది, తొమ్మిది ( ౧,౨,౩,౪,౫,౬,౭,౮,౯) సంఖ్యలేర్పడుచున్నవి. ఒకటికి తరువాత సున్న పెట్టిన

(౧౦) పది యగును. ఈ సంఖ్యలతో నీశ్వరు డొక్కడే యనియు, వేదములం దింకొక యీశ్వరుడు వర్ణింపబడ లేదనియు నిర్ణయింపబడినది. భగవంతుని యేకత్వమునందును భేదము లేదు. అతడు శూన్యుడును కాడు. అందువలన నతనిని విడిచి యన్యునుపాసింపరాదనియు నిషేధింపబడినది. అతడు సచ్చిదానందాది లక్షణయుక్తుడు; ఏకరసుడు. అతడే యెల్లపుడు సమస్తజగత్తునందును పరిపూర్ణుడై యున్నాడు. జడ-చేత నాత్మకమగు నీ జగత్తు నీక్షించును. అతనిని జూచు ద్రష్ట లేడు. అతడు స్వయముగ నెవరికిని దృశ్యుడును గాడు. ౮

సంపూర్ణ విశ్వమునందు వ్యాపకుడై యున్న పరమేశ్వరున కీ జగత్తంతయు (నిగతం) నిశ్చితము ప్రాప్తమై యున్నది. వ్యాపకముతో వ్యాప్యమునకు సంయోగ సంబంధముండును. (సహః) పరమేశ్వరుడు సర్వము సహించును. కావున నతడు 'సహుడు' అనబడును. అతడొక్కడే. అతనికి తుల్యుడు కాని, అతనికంటె నధికుడు కాని మఱియొకడు లేడు. ఈ మంత్రమున 'ఏకః=ఒక్కడు.' ఒక్కడు అను పదము మూడు పర్యాయములు ప్రయోగింపబడినది. కావున పరమేశ్వరుడొక్కడే యని తెలియుచున్నది. 1. అతనిలో సజాతీయ భేదము లేదు. అతనివంటి పదార్థమింకొకటి లేదు. 2. అతనిలో విజాతీయ భేదమును లేదు. అతనికంటె నెక్కుడు సామర్థ్యము గల పరమేశ్వరుడు కాని, అతనికంటె తక్కువ సామర్థ్యము గల పరమేశ్వరుడుకాని లేడు. 3. అతనిలో స్వగత భేదముకూడ లేదు. అతనిని ఖండించి విభజించుటకు వీలు లేదు- అతడేకరసుడు.

పూః ఎందువలన?

ఉ. మంత్రమున 'ఏకవృ దేక ఏవ' అనియున్నది. అది యొక చేతనము మాత్రమే. ఆ పరమేశ్వరుడు పృథివ్యాది సమస్త లోకములను సృష్టించి, తన సామర్థ్యముతో ధరించియున్నాడు. అతడు తన సృష్టి రచనాదికార్యమున నితర సహాయ మపేక్షింపడు. అతడు సర్వశక్తి మంతుడు.

(సర్వే అస్మిన్) ఆ పరమాత్ముని సామర్థ్యమునందే వస్వాది సర్వదేవతలు - పృథివ్యాది సర్వలోకములు- నిలిచియున్నవి. ప్రళయము నందును నతని సామర్థ్యమునందే సూక్ష్మరూపమున నుండును.

ఇట్టి మంత్రములు వేదములందు పెక్కు కలవు. ఇక్కడ వాని నన్నింటిని వ్రాయ నావశ్యకము లేదు. భాష్యమున నాయా స్థలములందు వాని కర్థములు వ్రాయబడును. ఇక్కడ వ్రాసిన గ్రంథము విస్తారమగును.

బ్రహ్మవిద్యావిషయ విచారము సమాప్తము

# అథ వేదోక్తధర్మవిషయః

(సంక్షేపతః ప్రకాశ్యతే)

సం॥ "సం గచ్ఛధ్వం సం వదధ్వం సం వో మనాంసి జానతామ్,

దేవా భాగం యథాపూర్వే సంజానానా ఉపాసతే." —౧ ఋ.౮,౮-౪౯-౨

(సం గచ్ఛధ్వం) ఈశ్వరోఽభివదతి– "హేమనుష్యాః! మయోక్తం న్యాయ్యం పక్షపాతరహితం సత్య లక్షణోజ్జ్వలం ధర్మం యూయం సం గచ్ఛధ్వం – సమ్యక్ ప్రాప్నుత – అర్థాత్ తత్ ప్రాప్త్యర్థం సర్వం విరోధం విహాయ పరస్పరం సంగతా భవత, యేన యుష్మాక ముత్తమం సుఖం సర్వదా వర్ధేత, సర్వదుఃఖనాశశ్చ భవేత్. (సంవదధ్వం) సంగతా భూత్వా పరస్పరం జల్పవితండాది విరుద్ధ వాదం విహాయ సంప్రీత్యా ప్రశ్నోత్తర విధానేన సంవాదం కురుత. యతో యుష్మాసు సమ్యక్ సత్యవిద్యాద్యుత్తమ గుణాః సదా వర్ధేరన్. (సం వో మనాంసి జానతామ్) యూయం జానంతో విజ్ఞానవంతో భవత. జానతాం వో యుష్మాకం మనాంసి యథా జ్ఞానవంతి భవేయు స్తథా సమ్యక్ పురుషార్థం కురుత. అర్థాత్ యేన యుష్మ న్మనాంసి సదానంద యుక్తాని స్యు స్తథా ప్రయతధ్వమ్. యుష్మాభిర్ధర్మ ఏవ సేవనీయో నాధర్మశ్చే త్యత్ర దృష్టాన్త ఉచ్యతే. (దేవా భాగం యథా) యథా పూర్వే సంజానానా యే సమ్యగ్ జ్ఞానవంతో దేవా విద్వాంసః ఆప్తాః పక్షపాతరహితా ఈశ్వరధర్మోపదేశప్రియా శ్చాసన్, యుష్మత్ పూర్వం విద్యా మధీత్య వర్తంతే, కిం వా యే మృతాస్తే యథా భాగం భజనీయం సర్వశక్తి మదాది లక్షణ మీశ్వరం మదుక్తం ధర్మం చోపాసతే తథైవ యుష్మాభి రపి స ఏవ ధర్మ ఉపాసనీయో, యతో వేదప్రతిపాద్యో ధర్మో నిఃశంకతయా విదితశ్చ భవేత్.

తె॥ వేదోక్తపద్ధతిలో ధర్మలక్షణములు వర్ణింతుము.

(సం గచ్ఛధ్వం) పరమేశ్వరుడు మానవులనుద్దేశించి యీ మంత్రమున ధర్మము నుపదేశించుచున్నాడు– "ఓ మానవులార! పక్షపాత రహితమును, న్యాయసత్యాచరణములతో గూడినదియునగు ధర్మమునే గ్రహింపుడు. దానికి విపరీతముగ నెన్నడు నడవకుడు. దానిని పొందుటకే విరోధము విడిచి పరస్పర సాంగత్యము చేయుడు. అందువలన మీ కెల్లపుడు నుత్తమ సుఖము వర్ధిల్లును; దుఃఖము కలుగదు. (సం వదధ్వమ్) జల్పము,వితండ, మున్నగు విరుద్ధవాదములను వదలి పారస్పరిక ప్రేమతో చదివి, చదివించి ప్రశ్నోత్తరపూర్వక సంవాద మొనర్పుడు. అందువలన మీలో సత్యవిద్యాది–ఉత్తమ గుణములు పెంపగును. (సం వో మనాంసి జానతామ్) మీరు మీ యథార్థ జ్ఞానమును నిత్యము పెంచుకొనుడు. మీ మనస్సందువలన ప్రకాశయుక్తమగును. ఇట్లే యెల్లపుడు పురుషార్థ మొనర్పుడు. జ్ఞానులయిన నిత్యానందమున నుండగలరు. మీరు ధర్మమునే సేవింపుడు. అధర్మమును కాదు. ఇందులకు దృష్టాంతము – (దేవా భాగం...) పక్షపాత రహితులు, సమ్యగ్ జ్ఞానయుక్తులు ధర్మాత్ములు నగు విద్వాంసులు – ఈశ్వరప్రియులు, ధర్మోపదేశప్రియులు, నైనట్లు మీరు కూడ నాధర్మము నుపాసింప దగుదురు. అందువలన వేదప్రతిపాద్య ధర్మము మీకు నిస్సందిగ్ధముగ దెలియును. మీకు పూర్వులు – గతించిన వారు కాని, జీవించియున్నవారుకాని విద్యలను జదివి, భజనీయుడును, సర్వశక్తిమత్వాది లక్షణయుక్తుడు నగు నీశ్వరు నెట్లు సేవించిరో, నాచే నుపదిష్టధర్మము నెట్లాచరించిరో, అట్లే మీరు నాచరింపుడని భావము. ధర్మజ్ఞానము ముప్విధముల కలుగును. ౧.

ధర్మాత్ములైన విద్వాంసుల శిక్షణ వలనను, ౨. ఆత్మ శుద్ధి వలనను, సత్యము నెఱుంగు కోరికవలనను, ౩. పరమేశ్వర ప్రసాదితమగు వేదవిద్య నభ్యసించుటవలనను మానవులు సత్యాసత్యములను యథార్థముగ నెఱుగగల్గుదురు.

సం॥" సమానో మంత్రః. సమితిః సమానీ. సమానం మనః సమచిత్త మేషామ్, సమానం మంత్ర మభిమంత్రయే వః సమానేన వో హవిషా జుహోమి. "౨ ఋ. ౮-౪౯-౩.

(సమానో మంత్రః) హే మానవాః! వో యుష్మాకం మంత్రోఽర్థాన్మా మీశ్వర మారభ్య పృథివీ పర్యంతానాం గుప్త ప్రసిద్ధ సామర్థ్య గుణానాం పదార్థానాం భాషణ ముపదేశనం జ్ఞానం వా భవతి యస్మిన్ యేన వా, స మంత్రో విచారో భవితు మర్హతి. తద్యథా – రాజ్ఞో మంత్రీ సత్యాసత్య వివేక కర్తేత్యర్థః. సోఽపి సత్యజ్ఞానఫలః సర్వోపకారకః. సమాన స్తుల్యోఽర్థాద్ విరోధ రహిత ఏవ భవతు. యదా బహుభిర్ మనుష్యైర్ మిలిత్వా సందిగ్ధ పదార్థానాం విచారః కర్తవ్యో భవేత్, తదా ప్రథమతః పృథక్ పృథగపి సభాసదాం మతాని భవేయుః, తత్రాపి సర్వేభ్యః సారం గృహీత్వా యద్యత్ సర్వమనుష్యహిత కారకం సద్గుణ లక్షణాన్వితం మతం స్యాత్. తత్తత్సర్వం జ్ఞాత్వైకత్ర కృత్వా నిత్యం సమాచరత. యతః ప్రతిదినం సర్వేషాం మనుష్యాణా ముత్తరోత్తర ముత్తమం సుఖం వర్ధేత. తథా (సమితిః సమానీ) సమితిః సామాజిక నియమ వ్యవస్థా, అర్థా ద్యా న్యాయప్రచారాఢ్యా సర్వమనుష్యాణాం మాన్య జ్ఞానప్రదా, బ్రహ్మచర్య విద్యాభ్యాస శుభగుణసాధికా, శిష్ట సభయా రాజ్యప్రబంధా ద్యాహ్లాదితా, పరమార్థ వ్యవహార శోధికా, బుద్ధి శరీర బలారోగ్య వర్ధినీ శుభమర్యాదాపి సమానీ సర్వమనుష్య స్వతంత్ర దాన సుఖ వర్ధనా యైకరసైవ కార్యేతి. (సమానం మనః) మనః సంకల్ప వికల్పాత్మకం, సంకల్పోఽభిలాషే చ్ఛేత్యాది. వికల్పోఽప్రీతిర్ద్వేష ఇత్యాది. శుభగుణాన్ ప్రతిసంకల్పః. అశుభగుణాన్ ప్రతి వికల్పశ్చ రక్షణీయః. ఏతద్ ధర్మకం యుష్మాకం మనః సమాన మన్యోన్య మవిరుద్ధ స్వభావ మేవాస్తు. యచ్చిత్తం పూర్వాపరానుభూతం స్మరణాత్మకం ధర్మేశ్వరచింతనం, తదపి సమాన మర్థాత్ సర్వప్రాణినాం దుఃఖనాశాయ సుఖవర్ధనాయ చ స్వాత్మవత్ సమ్యక్ పురుషార్థే నైవ కార్యమ్. (సహ) యుష్మాభిః పరస్పరస్య సుఖోపకారాయైవ సర్వం సామర్థ్యం యోజనీయమ్. (ఏషాం) యే హ్యేషాం సర్వజీవానాం సంగే స్వాత్మవద్ వర్తంతే తాదృశానాం పరోపకారిణాం పరమసుఖదాతౄణా ముపరి అహం కృపాలుర్ భూత్వా. (అభిమంత్రయే వః) యుష్మాన్ పూర్వాపరోక్తం ధర్మ మాజ్ఞాపయామి – ఇత్థమేవ సర్వైః కర్తవ్యమితి. యేన యుష్మాకం మధ్యే నైవ కదాచిద్ సత్యనాశోఽసత్యవృద్ధిశ్చ భవేత్.

(సమానేన వో) హవిర్ దానం గ్రహణం చ, తదపి సత్యేన ధర్మేణ యుక్తమేవ కార్యమ్ తేన సమానేనైవ హవిషా వో యుష్మాన్ జుహోమి. సత్యధర్మేణ సహైవాహం సదా నియోజయామి.. అతో మదుక్త ఏవ ధర్మో మంతవ్యో, నాన్య ఇతి.

తె॥ (సమానో మంత్రః) ఈశ్వరుడు మొదలు భూమివఱకు గల పదార్థములలో గుప్తములు, ప్రసిద్ధములు నగు సామర్థ్యము, గుణములు దేనిమూలమున దెలియబడునో, లేక దేనియం దుపదేశింపబడునో యది మంత్రము-విచారము- అనబడును. సత్యాసత్యములను వేఱుచేసి తెలుపగలవాడు కావుననే రాజమంత్రియు మంత్రి యనిపించుకొనును. ఓ మానవులార! సత్యాసత్యములకు సంబంధించిన మీ విచారణ (మంత్రము) జ్ఞానము, ఫలము సత్యములగు గాక! అయ్యది సర్వోపకారకమై, సమానమై, విరోధరహితమై యుండుగాక! మీరెల్లరు కలిసి యాలోచింపుడు. ఆలోచనలు చేయునపుడు ఎల్లరి మాటలు విని, వాని సారమును గ్రహించి, అందరి ధర్మయుక్తములు, సర్వహిత కారకములు నగు వానిని

వేఱుచేయుడు. అట్లు చేసి, వానినే ప్రచారముచేయుడు. అట్లే యాచరింపుడు. అందువలన నెల్లరిసుఖములు క్రమముగా వర్ధిల్లును. (సమితిః సమానీ) మీ సామాజిక నియమవ్యవస్థ సమానమై యుండనగును. సమాజములోని మానవులెల్లరు సమానముగ గౌరవమును బొందవలెను. ఎల్లరకు జ్ఞానము విద్యాభ్యాసము లభించునట్లు ఏర్పాట్లు చేయనగును. బ్రహ్మచర్యాద్యాశ్రమవ్యవస్థ చెడకుండునట్లు చూడవలెను. శుభకర్మములు జరుగుటకు దగిన యేర్పాట్లుండవలెను. రాజ్యవ్యవస్థయు నుత్తమ మానవులసభ మూలమున జరుగునట్లు చూడవలెను. అందువలన బుద్ధి, శరీరము, బలము, పరాక్రమము మున్నగు గుణములు వర్ధిల్లును. పరమార్థము, వ్యవహారము శుద్ధములై యుండు నుత్తమ మర్యాదయు నెల్లరికి నొకటిగ నుండవలెను. అందువలన మీ శ్రేష్ఠకార్యములన్నియు సఫలమగును. (సమానం మనః సహచిత్తం) మీ సంకల్పవికల్పాత్మకమగు మనస్సులలో కూడ విరోధముండరాదు.

శుభగుణములను బొందవలెనను కోరిక - సంకల్పమనబడును. దుష్టగుణములను త్యజింపవలెనను కోరిక - వికల్పము. మీ చిత్తము కూడ నొకటిగ నుండవలెను. ఎల్ల యర్థములను స్మరించునట్టిదియు, పూర్వాపరకర్మములను సరిగా విచారించునదియు, ధర్మమును, ఈశ్వరుని గూర్చి యాలోచించునదియు చిత్తమనబడును. సర్వప్రాణుల దుఃఖముల నశింపజేయుటకును, సుఖమును జేకూర్చుటకును మీ చిత్తము సమానముగ పురుషార్థమొనర్చునదిగ నుండవలెను (సహ) మీరు పరస్పరము నొకరి సుఖముకొఱ కింకొకరు పాటుపడవలెను. పరోపకారము చేయ నుద్యుక్తులై యుండవలెను. (ఏషాం) ఇట్లు పరులకెల్లరకు నుపకారము చేయుచు సుఖము నొడగూర్చువారిపై నే నెల్లప్పుడు కృపగలిగి యుందును. (సమానం మంత్ర మభిమంత్రయే వః) నా యీ యాజ్ఞకనుకూలముగ నడచుకొనువారి నాశీర్వదింతును; యాజ్ఞాపింతును. అందువలన వారి సత్యధర్మము వర్ధిలును- అసత్యము నశించును. (సమానేన వో హవిషా జుహోమి) ఓ మానవులారా! మీ రొక వస్తువును మఱియొకని కిచ్చునపుడును మఱియొకనినుండి మీరు గ్రహించునపుడును నది ధర్మయుక్తముగ నుండునట్లు చూడుడు. అందులకు విరుద్ధముగ నెన్నడు వ్యవహరింపకుడు. సత్యముతో మిమ్ములను, మీతో సత్యమును జోడింతునని మీరు నిశ్చయముగ నెఱుగుడు. కావున మీరు మానవులు దీనినే ధర్మమని యెఱింగి యెల్లపుడు నాచరింపుడు. ఇందుకు భిన్నమైనది యధర్మమనియు నెఱుగుడు.

సం॥ "సమానీ వ ఆకూతిః సమానా హృదయాని వః,

సమాన మస్తు వో మనో యథా వః సుసహాసతి." ఋ, ౮, ౮-౪౯-౪.

అస్యాయ మభిప్రాయః; హే మానవా! వో యుష్మాకం యత్ సర్వసామర్థ్యమస్తి, తద్ధర్మసంబంధే పరస్పర మవిరుద్ధం కృత్వా సర్వైః సుఖం సదా సంవర్ధనీయ మస్తి. (సమానీవ) ఆకూతి రధ్యవసాయ ఉత్సాహః అప్తరీతిర్ వా, సాపి వో యుష్మాకం పరస్పరోపకార కరణేన సర్వేషాం జనానాం సుఖాయైవ భవతు. యథా మదుపదిష్టస్యాస్య ధర్మస్య విలోపో న స్యా త్తథైవ కార్యమ్ (సమానా హృదయాని వః) వో యుష్మాకం హృదయాని/అర్థాన్మానసాని ప్రేమప్రచురాణి కర్మాణి నిర్వైరాయ సమానాని అవిరుద్ధాన్యేవ సంతు, (సమానమస్తు వో మనః)

అత్ర ప్రమాణమ్-

"కామః సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా ధృతి రధృతిర్ హ్రీర్ ధీర్ భీరిత్యేత త్సర్వం మన ఏవ తస్మాదపి పృష్ఠత ఉపస్పృష్టో మనసా విజానాతి." శత. ౧౪-౪

మనసా వివిచ్య పున రనుష్ఠాతవ్యమ్.

(౧) శుభగుణానా మిచ్ఛా-కామః (౨) తత్ ప్రాప్త్యనుష్ఠానేచ్ఛా- సంకల్పః. (౩) పూర్వం సంశయం కృత్వా, పున ర్నిశ్చయకరణేచ్ఛా సంశయో-విచికిత్సా (౪) ఈశ్వర సత్యధర్మాదిగుణానా ముప ర్యత్యంతం విశ్వాసః శ్రద్ధా. (౫) అనీశ్వరవాద - అధర్మా ద్యుపరి సర్వథా హ్యనిశ్చయః - అశ్రద్ధా. (౬) సుఖ దుఃఖప్రాప్త్యాపి ఈశ్వర ధర్మాద్యుపరి సదైవ నిశ్చయ రక్షణం-ధృతిః. (౭) అశుభగుణానా మాచరణం నైవ కార్యమిత్యధైర్యం - అధృతిః. (౮) సత్యధర్మానాచరణేऽసత్యాచరణే మనసః సంకోచో ఘృణా-హ్రీః (౯) శుభ గుణాన్ శీఘ్రం ధారయేది తి ధారణావతీవృత్తిః - ధీః. (౧౦) అసత్యాచరణా దీశ్వరాజ్ఞాభంగాత్ పాపాచరణా దీశ్వరో నః సర్వత్ర పశ్యతీత్యాది వృత్తిర్ - భీః.

వీతద్ధర్మకం మనో వో యుష్మాకం సమానం తుల్య మస్తు. (యథా వః సుసహాసతి) హే మనుష్యాః! వో యుష్మాకం యథా పరస్పరం సుసహాయేన వ్యసతి సమ్యక్ సుఖోన్నతిః స్యాత్తథా సర్వైః ప్రయత్నో విధేయః సర్వాన్ సుఖినో దృష్ట్వా చిత్తే ఆహ్లాదః కార్యః. నైవ కంచి దపి దుఃఖితం దృష్ట్వా సుఖం కేనాపి కర్తవ్యమ్. కింతు, యథా సర్వే స్వతంత్రాః సుఖినః స్యుః తథైవ సర్వైః కార్య మితి.

తె॥ (సమానీవ ఆకూతి ః) (ఈశ్వరు డీ మంత్రమున మానవుల నుద్దేశించి యుపదేశించుచున్నాడు.) ఓ మానవులార! 'మీ సామర్థ్యము నంతటిని ధర్మముతో జోడించి సర్వసుఖముల నెల్లపుడు పెంపుజేసి కొనుడు. నిశ్చయము, ఉత్సాహము, ధర్మాత్ముల యాచరణము 'ఆకూతి' యనబడును. అట్టి మీ యాకూతి 'మానవులార!' పరస్పరోపకారము కొఱకును, సర్వజీవుల సుఖము కొఱకును నగు గాక! అందువలన నా యుపదిష్టధర్మము త్యజింపబడకుండును. అట్లు సతతము ప్రయత్నించుచుండురేని, (సమానా హృదయాని వః) మీ హృదయములు- మానసిక వ్యవహారములన్నియు నెల్లపుడు విరోధములేనివై ప్రేమ సహితములై యుండును. (సమాన మస్తు వో మనః) ఈ మంత్రమున మనః శబ్ద మనేక పర్యాయములు గ్రహింపబడుట వలన మనశ్శబ్ద మున కనేకార్థము లున్నవని తెలిసికొనవలెను. ఇందులకు శతపథము ప్రమాణము. (కామః సంకల్పో....) ప్రథమమున చక్కగ నాలోచించియే యెల్ల ఉత్తమ వ్యవహారము లాచరింపవలెను.

౧. కామః ః- శుభగుణేచ్ఛ - మంచి గుణములను గోరుట.

౨. సంకల్పః ః- సుఖము, విద్య మున్నగు శుభ గుణములను బొందుటకు ప్రయత్న పూర్వకముగ పురుషార్థ మొనర్చుటకై కోరుట సంకల్ప మగును.

౩. విచికిత్సాః- చేయదలచిన పనిలో ముందు శంకించి సరియైన నిశ్చయము కొఱకు జేయు సందేహము విచికిత్స యనబడును.

౪. శ్రద్ధా ః- ఈశ్వరునియందు, సత్యధర్మము మున్నగు శుభ గుణముల యందును నిశ్చయపూర్వక విశ్వాసమును స్థిరముగ నుంచుట - శ్రద్ధ.

౫. అశ్రద్ధా ః- అవిద్య, కుతర్కము, దుష్కర్మాచరణము, ఈశ్వరు నంగీకరింపకుండుట, అన్యాయాది దుర్గుణముల నుండి దూరముగ నుండుట - అశ్రద్ధ యగును.

౬. ధృతి ః ః- సుఖ దుఃఖములు, హాని లాభములు కలిగినపుడు కూడ నీశ్వరునిపై, ధర్మముపై నిశ్చయము కలిగియుండి ధైర్యమును విడువకుండుట.

౭. అధృతి ః ః- చెడు కర్మలలో దృఢత లేకుండుట.

౮. హ్రీ ః - అసత్యాచరణము చేయుటలోను, సత్యాచరణములను జేయకుండుటలోను సిగ్గు పడుట.

౯. ధీః– శ్రేష్ఠగుణములను శీఘ్రముగ ధారణచేయువృత్తి.

౧౦. భీః :– ఈశ్వరాజ్ఞ - సత్యము నాచరించుట, ధర్మము నాచరించుట, వీనికి విరుద్ధములైన పాపాచరణమున కెల్లపుడు భయపడుట–ఈశ్వరుడు మన కర్మములనన్నింటిని జూచును–అని యెంచి యతనికి భయపడుట –పాపముచేసి ఈశ్వరుడు తనపై నప్రసన్నుడగునని యెంచుట–మున్నగు గుణములు భీః=భయము అనబడును.

ఇట్టి మీ మనస్సు సమానముగ నుండును గాక! ఎల్లరకు సుఖము నొడగూర్చుగాక! (యథా నుసహాసతి) ఓ మానవులార! పూర్వోక్త ధర్మాచరణమువలన మీకు ఉత్తమ సుఖ ప్రాప్తి గలుగును. పరస్పరము శ్రేష్ఠ సహాయము చేసికొనుచు సుఖములను బెంచుకొనుడు. ఇతరుల దుఃఖమును జూచి మనస్సున సుఖ పడకుడు. ఎల్లరు సుఖులై యుండునట్లు సతతము యత్నింపుడు.

"దృష్ట్వా రూపే వ్యాకరోత్ సత్యాఽనృతే ప్రజాపతి :,
అశ్రద్ధా మనృతేఽదధా చ్ఛ్రద్ధాగ్ం సత్యే ప్రజాపతి :." యజు. ౧౯–౭౭

అస్యాయ మర్థః–(దృష్ట్వా) ప్రజాపతిః పరమేశ్వరో ధర్మ ముపదిశతి. సర్వైర్ మనుష్యైః సర్వథా సత్య ఏవ సమ్యక్ శ్రద్ధా రక్షణీయా, అనత్యే చాశ్రద్ధా ఇతి. (ప్రజాపతిః) పరమేశ్వరః, (సత్యానృతే) ధర్మాధర్మౌ (రూపే) ప్రసిద్ధాప్రసిద్ధ లక్షణౌ దృష్ట్వా (వ్యాకరోత్) సర్వజ్ఞయా స్వయా విద్యయా విభక్తౌ కృతవానస్తి. కథ మిత్యత్రాహ (అశ్రద్ధాం) సర్వేషాం మనుష్యాణా మనృతేఽసత్యేఽధర్మే ఽన్యాయే ఽశ్రద్ధా మదధాత్. అర్థాత్అధర్మేఽశ్రద్ధాం కర్తు మాజ్ఞాపయతి. తథైవ వేద శాస్త్ర ప్రతిపాదితే, సత్యే, ప్రత్యక్షాదిభిః ప్రమాణైః పరీక్షితే, పక్షపాత రహితే, న్యాయ్యే ధర్మే ప్రజాపతిః సర్వజ్ఞ ఈశ్వర : శ్రద్ధాం చాదధాత్. ఏవం సర్వైర్ మనుష్యైః పరమ ప్రయత్నేన స్వకీయం చిత్తం ధర్మే ప్రవృత్త మధర్మా న్నివృత్తం చ సదైవ కార్యమితి." ౪

తె॥ (దృష్ట్వా) సర్వజగత్తునకు స్వామియగు పరమేశ్వరుడు మానవుల నుద్దేశించి, 'మీరు సర్వవిధముల, సర్వకాలములందును, సత్యమునందే ప్రీతి కలిగియుండుడు; అసత్యమునందెన్నడు ప్రీతి నుంచకుడు' అని యుపదేశించుచున్నాడు.

(ప్రజాపతిః) పరమేశ్వరుడు, (సత్యానృతే) ప్రకటములు, గుప్తములు నగు లక్షణములు గల ధర్మాధర్మములను, (దృష్ట్వా వ్యాకరోత్) తన సర్వజ్ఞత్వ రూపమగు విద్యతో నెఱింగి వేఱు చేసెను. ఎట్లనః– (అశ్రద్ధాం) మానవులార! అధర్మమున న్యాయమును జేయుటలో శ్రద్ధను జూపకుడు. అశ్రద్ధను జూపుడు (శ్రద్ధాం) వేద శాస్త్ర విహితమై, ప్రత్యక్షాది ప్రమాణములచే బరీక్షింపబడి, పక్షపాత రహితమైన న్యాయధర్మము నాచరించుటలో నెల్లపుడు ప్రీతి నుంచుడు. పరమేశ్వరుని ఆజ్ఞలను పాలించుటలో నెల్లపుడు ఆత్మమనఃప్రాణముల నుపయోగించి పురుషార్థ మొనర్చుడు. ఎల్ల వేళల సత్యధర్మమునందే ప్రవృత్తులై యుండుడు.

సం॥ "దృతే దృగ్ ంహ మా మిత్రస్య మా చక్షుషా సర్వాణి భూతాని సమీక్షంతామ్. మిత్ర స్యాహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే. మిత్రస్య చక్షుషా సమీక్షామహే" ॥ యజు. ౩౬–౧౮

(దృతే దృగ్ంహ....) అస్యాయ మభిప్రాయః–సర్వే మనుష్యాః సర్వథా సర్వదా సర్వైః సహ సౌహార్దేనైవ వర్తేరన్నితి. సర్వైః ఈశ్వరోక్తోఽయం ధర్మః స్వీకార్యః, ఈశ్వరః ప్రార్థనీయశ్చ. యతో ధర్మనిష్ఠా స్యాత్. తద్యథా– (దృతే!) హే సర్వదుఃఖవినాశకేశ్వర! మదుపరి కృపాం విధేహి.

యతో౽హం సత్య ధర్మం యథావద్ విజానీయామ్ ; పక్షపాత రహితస్య సుహృద శ్చక్షుషా ప్రేమభావేన సర్వాణి భూతాని. (మా) మాం సదా సమీక్షంతామ్–అర్థాన్మమ మిత్రాణి భవంతు. ఇతీచ్ఛా విశిష్టం మాం, సదా (దృగ్ంహ) దృంహ సత్యసుఖైః శుభగుణైశ్చ సహ సదా వర్ధయ. (మిత్ర స్యాహం) ఏవమహమపి మిత్రస్యస్య చక్షుషా స్వాత్మవత్ ప్రేమబుద్ధ్యా (సర్వాణి భూతాని సమీక్షే) సమ్యక్ పశ్యామి. (మిత్రస్య చ) ఇత్థమేవ మిత్రస్య చక్షుషా నిర్వైరా భూత్వా, వయమన్యోన్యం సమీక్షామహే ; సుఖ సంపాదనార్థం సదా వర్తామహే. ఇతీశ్వరోపదిష్టో ధర్మో హి సర్వైర్ మనుష్యై రేక ఏవ మంతవ్యః.

తె॥ మనుష్యులు పరస్పర ప్రేమతో నెల్లపుడు వర్తింపవలెనని యీ మంత్రాభిప్రాయము. వేదములం దీశ్వరునిచే విధింపబడిన ధర్మములనే మానవు లాచరింపదగుదురు. మానవులకు ధర్మమున ప్రవృత్తి కలుగుటకు వేదోక్తరీతితోనే పరమేశ్వరు నుపాసింపదగును. ఎట్లన ; (దృతే) ఓ దుఃఖనాశక ! పరమేశ్వర! మేము పరస్పరము వైరభావమును విడిచి ప్రేమించునట్లు అనుగ్రహింపుము. (మిత్రస్య మా) సర్వ ప్రాణులు నన్ను తమ మిత్రునిగ భావించి బంధువువలె నాతో వర్తించుదురుగాక! ఇట్టి కోరికతో నుండు మమ్ములను (దృంహ) సత్య సుఖముతోను, శుభ గుణములతోను వర్ధిల్లజేయుము. (మిత్రస్యాహం) ఇట్లే నేను కూడ మనుష్యాది సర్వ ప్రాణులను నాకు మిత్రములుగ నెంచి, హాని లాభములలోను, సుఖ దుఃఖములలోను, వానిని నాతో సమానముగ నెంచెదను గాక! (మిత్రస్య చ) మే మెల్లరము పరస్పరము కలిసి మిత్రభావముతో నుందుముగాక ! సత్యధర్మము నాచరించి సత్య సుఖములను నిత్యము బొందుదుము గాక! ఇట్లీశ్వరునిచే బోధింపబడిన ధర్మమే, మానవుల కెల్లరకు స్వీకరింపబడదగియున్నది.

సం॥ "అగ్నే వ్రతపతే వ్రతం చరిష్యామి తచ్ఛకేయమ్
తన్మే రాధ్యతామ్, ఇదమహ మనృతా త్సత్య ముపైమి." యజు. ౧-౫

(అగ్నే...) అస్యాభిప్రాయః– సర్వైర్ మనుష్యై రీశ్వరస్య సహాయేచ్ఛా సదా కార్యేతి. నైవ తస్య సహాయేన వినా సత్యధర్మ జ్ఞానం, తస్యానుష్ఠానపూర్తి శ్చ భవతః. హే అగ్నే వ్రతపతే! సత్యపతే, (వ్రతం) సత్యధర్మం చరిష్యా మ్యనుష్ఠాస్యామి. అత్ర ప్రమాణమ్:–

"సత్యమేవ దేవా అనృతం మనుష్యాః.
ఏతద్ధ వై దేవా వ్రతం చరంతి, యత్ సత్యమ్. శ.కాం. ౧-౧.

సత్యాచరణా ద్దేవాః అసత్యాచరణా న్మనుష్యాశ్చ భవంతి. అతః సత్యాచరణ మేవ ధర్మ మాహురితి.

(తచ్ఛకేయమ్) యథా తత్సత్యాచరణం ధర్మం కర్తుమహం శకేయం సమర్థో భవేయమ్. (తన్మే రాధ్యతామ్) తత్సత్యధర్మానుష్ఠానం మే మమ భవతా రాధ్యతామ్ – కృపయా సమ్యక్ సిద్ధం క్రియతామ్. 'కించ తద్ వ్రతమ్? ఇత్యత్రాహ (ఇదమహ మనృతాత్ సత్యముపైమి) యత్ సత్యధర్మ స్యైవాచరణమ్. అనృతా దసత్యాచరణాద్ అధర్మాత్ పృథగ్ భూతం, తదేవోపైమి ప్రాప్నోమీతి. అస్యైవ ధర్మస్యానుష్ఠాన మీశ్వర ప్రార్థనయా స్వపురుషార్థేన చ కర్తవ్యమ్. నాపురుషార్థినం మనుష్య మీశ్వరో౽నుగృహ్ణాతి. యథా చక్షుష్మంతం దర్శయతి, నాంధం చ. ఏవమేవ ధర్మం కర్తు మిచ్ఛంతం పురుషార్థ కారిణ మీశ్వరానుగ్రహాభిలాషిణం ప్రత్యేవ ఈశ్వరః కృపాలుర్ భవతి, నాన్యం ప్రతి చేతి. కుతః? జీవే తత్సిద్ధిం కర్తుం సాధనానా మీశ్వరేణ పూర్వ మేవ రక్షితత్వాత్. తదుపయోగకరణాచ్చ

యేన పదార్థేన యావా నుపకారో గ్రహీతుం శక్యః ; తావాన్ స్వేనైవ గ్రహీతవ్యః; తదుపరి ఈశ్వరాను గ్రహేచ్ఛా కార్యేతి.

తె॥ మంత్రాభిప్రాయము;- (అగ్నే వ్రత....) మనుష్యులీశ్వరుని సహాయము నపేక్షింపవలెను. అతని సహాయము లేక ధర్మము పూర్ణముగ తెలియదు. దాని యనుష్ఠానమును పూర్తి కాదు. కావున ఓ సత్యపతీ! పరమేశ్వర ! (వ్రతం) నేను సత్యధర్మము ననుష్ఠింప దలచితిని, నీ కృప వలననే యది సిద్ధించును.

సత్యాచరణరూప వ్రతము నాచరించువారు దేవతలనియు, అసత్యాచరణము నొనర్చువారు మనుష్యులనియు శత పథమున (సత్యమేవ....) వర్ణింపబడినది.

కావున నేనును సత్య వ్రతము నాచరింపదలచుచున్నాను. (తచ్ఛ కేయమ్) సత్యధర్మానుష్ఠానమును పూర్ణ మొనర్చు శక్తి నొసంగి యనుగ్రహింపుము. (తన్మే రాధ్యతాం) ఆయనుష్ఠానమును సిద్ధింపజేయు వాడవు నీవే. కావున దయతో సత్యధర్మానుష్ఠానమును సిద్ధింప జేయుము. ఆ వ్రత మేమనః- (ఇదమహ మనృతాత్ సత్యముపైమి) అసత్య కార్యములనుండి విడివడి యెల్లపుడు సత్యము నాచరించుటలో దృఢముగా నుందును. ఈశ్వరుడు మనుష్యునిలో నెట్టి సామర్థ్యము నుంచెనో, అట్టి పురుషార్థమును ధర్మానుష్ఠాన మొనర్చి యనంతరము, పరమేశ్వరుని సహాయ మపేక్షింపవలెను. మనుష్యుడు తన పురుషార్థముతో సత్యాచరణ మొనర్చుటకే యీశ్వరుడతనిలో సామర్థ్యము నుంచియున్నాడు. పురుషార్థమొనర్పని వాని నీశ్వరుడు కరుణింపడు. కన్నులున్న వానికే వస్తువులను జూపగలముకాని, అంధునకు జూపలేము. అట్లే సత్య భావముతో పురుషార్థ మొనర్చి ధర్మము నాచరించువానినే, ఈశ్వరుడు కృపతో జూచును; కాని యితరులను జూడడు. కారణమేమన : ఈశ్వరుడు మానవునకు ధర్మానుష్ఠాన మొనర్చుటకును, బుద్ధిని పెంచుకొనుటకును దగిన సాధనముల నిచ్చియున్నాడు. జీవు డా సాధనముల నుపయోగించి ప్రయత్నించినపుడే పరమేశ్వరుడు తన సర్వ సామర్థ్యముతో నతని ననుగ్రహించును. జీవులు కర్మనొనర్చుటలో స్వాధీనులు, ఫలము ననుభవించుటలో పరాధీనులునై యున్నారు.

సం॥ "వ్రతేన దీక్షా మాప్నోతి దీక్ష యాప్నోతి దక్షిణామ్
దక్షిణా శ్రద్ధా మాప్నోతి శ్రద్ధయా సత్యమాప్యతే." య. అ. ౧౯-౩౦

అస్యాభిప్రాయః- (వ్రతేన) యదా మనుష్యో ధర్మం జిజ్ఞాసతే, సత్యం చికీర్షతి, తదైవ సత్యం విజానాతి. తత్రైవ మనుష్యైః శ్రద్ధేయమ్, నాసత్యే చేతి. యో మనుష్యః సత్యం వ్రతమాచరతి. తదా దీక్షా ముత్తమాధికారం ప్రాప్నోతి. (దీక్షయాప్నోతి ద....) యదా దీక్షితః సన్నుత్తమ గుణై రుత్తమాధికారీ భవతి, తదా సర్వతః సత్కృతః ఫలవాన్ భవతి. సాఽస్య దక్షిణా భవతి, తాం దీక్షయా శుభగుణాచరణేనైవాప్నోతి. (దక్షిణాశ్ర..) సా దక్షిణా యదా బ్రహ్మచర్యాది సత్యవ్రతైః సత్కారాఢ్యా, స్వస్యాన్యేషాం చ భవతి, తదాచరణే శ్రద్ధాం దృఢం విశ్వాస ముత్పాదయతి.

పూ : కుత :?

ఉ : సత్యాచరణ మేవ సత్కార కారకమస్త్వత : (శ్రద్ధయా) యదా ఉత్తరోత్తరం శ్రద్ధా వర్ధేత, 'తదా తయా శ్రద్ధయా మనుష్యైః పరమేశ్వరో మోక్ష ధర్మాదికం చాప్యతే ప్రాప్యతే నాన్యథేతి.

పూ : అత : కిమాగతమ్ ?

ఉ : సత్య ప్రాప్త్యర్థం సర్వదా శ్రద్ధోత్సాహాది పురుషార్థో వర్ధయితవ్య :

తె॥ పై మంత్రాభిప్రాయము :- 'మనుజుడు ధర్మము నెఱుగ గోరినపుడు, సత్యము నాచరింపదలచినపుడే యీ సత్యము నతడెఱుగును. సత్యమునందే శ్రద్ధ యుంచవలెను. కాని, అసత్యమునందు కాదు." (వ్రతేన) మనుజుడు దృఢతతో సత్యము నాచరించినపుడే దీక్ష-ఉత్తమాధికారమును బొందును. (దీక్షయాప్నోతి) దీక్షితుడై యుత్తమ గుణములతో నుత్తమాధికారియైనపుడతని నెల్లరు సత్కరింతురు. ఆ సత్కారమే యతనికి దక్షిణ యగును. ధర్మాది శుభగుణములతో మనుజుడా దక్షిణను బొందును – లేకున్న నతని కది లభింపదు. (దక్షిణా శ్రద్ధా మాప్నోతి) బ్రహ్మచర్యాది సత్యవ్రతముల మూలమున తనకును. నితరులకును సత్కారము లభించినపుడే దానియందు విశ్వాసము గలుగును.

అది యెట్లన ? సత్య ధర్మాచరణము వలననే మనుజులకు సత్కారము లభించును. (శ్రద్ధయా) సత్య ధర్మాచరణమున శ్రద్ధ – విశ్వాస మెక్కువైనకొలది మనుష్యుడు పరమేశ్వరుని, మోక్షధర్మాదులను బొంది, పరమార్థ సుఖమును బొందును. అధర్మాచరణమున నట్లు పొందజాలడు.

దీని వలన సిద్ధించిన దేమి? అన; సత్య ప్రాప్తి కొఱకు నిత్యము శ్రద్ధ, ఉత్సాహము, పురుషార్థము నను వానిని మనుజులు పెంపొందించుకొనవలెను. నాడే సత్య ధర్మము లభింపగలదు.

*సం॥ "శ్రమేణ తపసా సృష్టా బ్రహ్మణా విత్త ఋతే శ్రితా." ౮ అథర్వ. ౧౨–౫–౧*

*అయమ్ అభిప్రాయః– (శ్రమేణ...) శ్రమేణేత్యాది మంత్రేషు ధర్మస్య లక్షణాని ప్రకాశ్యంత ఇతి. శ్రమః ప్రయత్నః, పురుషార్థ ఉద్యమ ఇత్యాది. తపో ధర్మానుష్ఠానమ్, తేన శ్రమేణైవ తపసా చ సహ ఈశ్వరేణ సర్వే మనుష్యాః సృష్టా రచితాః, అతః (బ్రహ్మణా) వేదేన పరమేశ్వర జ్ఞానేన చ యుక్తాః సంతో జ్ఞానినః స్యుః (ఋతేశ్రితా) ఋతే బ్రహ్మణి పురుషార్థే చాశ్రితాః, ఋతం సేవమానాశ్చ సదైవ భవంతు.*

తె॥ 'శ్రమేణ' మున్నగు మంత్రములలో ధర్మ లక్షణములు చెప్పబడినవి. కావున నీ మంత్రముల వలన నియ్యది సిద్ధించును. కావున మనుష్యులెల్లరు 'శ్రమేణ' మున్నగు మంత్రములవలన ధర్మ లక్షణములను గ్రహింపవలయును. (శ్రమేణ) పరమ ప్రయత్నము, (తపసా) ధర్మాచరణము అను రెండు ధర్మ లక్షణములతో కూడియుండునట్లు మానవులను పరమేశ్వరుడు సృష్టించియున్నాడు. కావున (బ్రహ్మణా) వేద విద్యతోను, పరమేశ్వరుని జ్ఞానముతోను గూడి మానవులు తమ జ్ఞానమును బెంచుకొనవలెను. (ఋతే శ్రితా) బ్రహ్మము. పురుషార్థము, సత్య విద్య, ధర్మాచరణము నను నిట్టి శుభగుణములను మానవులెల్లరు సేవింపవలయును.

*సం॥ " సత్యేనావృతా శ్రియా ప్రావృతా యశసా పరివృతా :." అథర్వ. ౧౨–౫–౨*

*(సత్యేనావృతా) వేద శాస్త్రేణ ప్రత్యక్షాదిభిః ప్రమాణైశ్చ పరీక్షితేన అవ్యభిచారిణా సత్యేనావృతా యుక్తాః సర్వే మనుష్యాః సంతు. (శ్రియా ప్రా...) శ్రియా శుభగుణాచరణోజ్జ్వలయా చక్రవర్తి రాజ్యసేవ మానయా ప్రకృష్టయా లక్ష్మ్యాఽఽవృతా యుక్తాః, పరమ ప్రయత్నేన భవంతు. (యశసా) ఉత్కృష్ట గుణ గ్రహణం – సత్యాచరణం యశస్తేన పరితః సర్వతో వృతా యుక్తాః సంతః, ప్రకాశయితారశ్చ స్యుః.*

౯

తె॥ ( సత్యేనావృతా,) మనుష్యులెల్లరు వేద శాస్త్రముల మూలమునను, ప్రత్యక్షాది ప్రమాణముల వలనను సత్యమును బరీక్షించి సత్యాచరణయుక్తులు కావలెను. (శ్రియా ప్రావృతా,) మానవులార! మీరు శుభగుణములతో బ్రకాశితులయి, చక్రవర్తి రాజ్యాద్యైశ్వర్యములను బొంది, శ్రేష్ఠమగు లక్ష్మితో గూడి,

కాంతితో శోభిల్లుడు. (యశసా పరివృతాః) ఉత్తమ గుణములను గ్రహించి, సత్యాచరణము తోను, కీర్తితోను గూడియుండుట మానవుల కెల్లరకు దగును.

సం॥ "స్వధయా పరిహితా, శ్రద్ధయా పర్యూఢా,
దీక్షయా గుప్తా, యజ్ఞే ప్రతిష్ఠితా లోకో నిధనమ్." అథర్వ. ౧౨-౫-౩ ౧౦

(స్వధయా పరి....) పరితః సర్వతః స్వకీయ పదార్థ శుభ గుణ ధారణే నైవ సంతుష్య సర్వే మనుష్యాః సర్వేభ్యో హితకారిణః స్యుః. (శ్రద్ధయా...) సత్యమేవ విశ్వాసమూలమస్తి నాసదితి. తయా సత్యోపరి దృఢ విశ్వాస రూపయా శ్రద్ధయా, పరిత : సర్వత ఊఢాః ప్రాప్తవంతః సంతు. (దీక్షయాగుప్తాః) సద్భిరాప్తై ర్విద్వద్భిః కృత సత్యోపదేశయా దీక్షయా గుప్తా రక్షితా : సర్వమనుష్యాణాం చ రక్షితారశ్చ స్యుః. (యజ్ఞే ప్రతిష్ఠితాః) 'యజ్ఞో వై విష్ణుః) వ్యాపకే పరమేశ్వరే సర్వోప కారకేఽశ్వమేధాదౌ శిల్ప విద్యా క్రియాకుశలత్వే చ ప్రతిష్ఠితాః ప్రాప్తప్రతిష్ఠాశ్చ భవంతు. (లోకో నిధనమ్) అయం లోకః సర్వేషాం మనుష్యాణామ్ నిధనం- యావన్ మృత్యుర్ న భవేత్, తావత్ సర్వోపకారకం సత్కర్మానుష్ఠానం కర్తుం యోగ్య మస్తీతి సర్వైర్ మంతవ్యమ్ - ఇతి ఈశ్వరోపదేశః.

తె॥ (స్వధయా పరిహితా) మనుజు లెల్ల విధముల తమ పదార్థములతోను, శుభగుణములతోను గూడినవారై సంతుష్టులగుచు నెల్లరకు హిత మొనర్ప దగును. ఇట్టి యమృత రూప వ్యవహారము నెన్నడు విడువ రాదు. ( శ్రద్ధయా పర్యూఢాః) సత్యవ్యవహారముపై నెల్లరకు గాఢ విశ్వాస ముండవలెను. సత్యమే విశ్వాసమునకు మూలము; సత్యాచరణమే యా విశ్వాసమునకు ఫలము, స్వరూపమును; అసత్య మెన్నడును గాదు. (దీక్షయా గుప్తాః) విద్వాంసుల సత్య శిక్షణ వలన రక్షణ బొంద వలెను. మనుష్యాది ప్రాణులను రక్షించుటకు బరమ పురుషార్థ మొనర్పవలెను. (యజ్ఞే ప్రతిష్ఠితాః) యజ్ఞము- 1 సర్వము నందు వ్యాపకుడగు పరమేశ్వరుడు; 2. సమస్త ప్రపంచమున కుపకార మొనర్చు అశ్వమేధాది యజ్ఞములు, 3. శిల్ప విద్యాదులలో కుశలత సంపాదించుట – ఈ ముప్విధములగు యజ్ఞము లందును మనుష్యులెల్లరు సరియైన ప్రవృత్తి గలవారై ప్రతిష్ఠను బొందుడు. (లోకో నిధనమ్)'జీవించినంతకాలము సర్వోపకారకములగు సత్యకర్మములను సాధించుటకు పురుషార్థ మొనరింపుడు – ఇందలసత కూడదు.'అను నీ యీశ్వరోపదేశము మానవు లెల్లరు పాటింపదగును.

సం॥ "ఓజశ్చ తేజశ్చ సహశ్చ బలం చ వాక్ చేంద్రియం చ
శ్రీశ్చ ధర్మశ్చ." ౧౧ అథర్వ . ౧౨-౫-౭

అన్వచ్చ – (ఓజశ్చ) న్యాయ పాలనాన్వితః పరాక్రమః, (తేజశ్చ) ప్రగల్భతా, ధృష్టతా, నిర్భయతా, నిర్దీనతా, సత్యే వ్యవహారే కర్తవ్యా (సహశ్చ) సుఖ దుఃఖహాని లాభాది క్లేశ ప్రద వర్తమాన ప్రాప్తావపి హర్షశోకా కరణం, తన్నివారణార్థం పరమ ప్రయత్నానుష్ఠానం చ సహనం సర్వైః సదా కర్తవ్యమ్, (బలం చ) బ్రహ్మ చర్యాది సునియమాచరణేన శరీర బుద్ధ్యాది రోగనిరాకరణం దృఢాంగతా – నిశ్చల బుద్ధిత్వ సంపాదనం, భీషణాది కర్మయుక్తం బలం చ కార్యమితి. (వాక్ చ) విద్యాశిక్షా సత్యమధుర భాషణాది శుభగుణయుక్తా వాణీ కార్యేతి, (ఇంద్రియం చ) మన ఆదీని వాగ్ భిన్నాని షడ్ జ్ఞానేంద్రియాణి, 'వాక్ చేతి కర్మేంద్రి యాణా ముపలక్షణేన కర్మేంద్రియాణి చ. సత్యధర్మా చరణ యుక్తాని పాపాద్ వ్యతిరిక్తాని చ సదైవ రక్షణీయాని. (శ్రీ శ్చ) సమ్రాడ్ రాజ్యశ్రీః పరమ పురుషార్థేన కార్యేతి. (ధర్మశ్చ) అయమేవ వేదోక్తో న్యాయః పక్షపాత రహితః సత్యాచరణయుక్తః సర్వోపకారకశ్చ ధర్మ : సదైవ సర్వైః సేవనీయః. అస్యైవేయం పూర్వాపరా సర్వా వ్యాఖ్యా అస్తీతి బోధ్యమ్. ౧౧

తె॥ (ఓజః చ) ధర్మపాలనయుక్త పరాక్రమము. (తేజః చ) ప్రగల్భత- సత్యవ్యవహారమున భయపడనివాడై దీనతను దరిజేరనీయ కుండుట, (సహః చ) సుఖ దుఃఖములు, హాని లాభములు మున్నగునవి యొదవినపుడు హర్ష శోకములను విడిచి సత్యధర్మమున దృఢముగ నుండుట, దుఃఖములను నివారించుటయు, సహించుటయును, (బలం చ) బ్రహ్మ చర్యాది సునియమముల మూలమున నాధివ్యాధులను దూరమొనర్చి, తన యంగములనుదృఢముగ నుంచుట; బుద్ధిని స్థిరముగ నుంచుట; గొప్ప కార్యములను సాధించుటకు వలయు శక్తి యుక్త బలమును సంపాదించుట. (వాక్ చ) తన వాణిని సత్య విద్యా శిక్షణతో గూడినదిగను, సత్యము, మధురము, కోమలము, ప్రియ భాషణము మున్నగు శుభ గుణములతో గూడినదిగను జేయుట, (ఇంద్రియం చ) మనస్సును, పంచజ్ఞానేంద్రియములను, పంచకర్మేంద్రియములను పాప కర్మములనుండి తొలగించి యెల్లపుడు సత్యపురుషార్థములందు వర్తిల్లునట్లు చేయుట. (శ్రీః చ) చక్రవర్తి రాజ్యమునకు వలయు సామగ్రిని చేకూర్చుట. (ధర్మః చ) వేదోక్తము, న్యాయయుక్తమునై, పక్షపాతములేని సత్యమును సతత మాచరించుచు నసత్యమును ద్యజించుట, ఎల్లరకు నుపకారమొనర్చునదై, ఇహపరజన్మములందానందము ఫలము గాగలది ధర్మమగును; దీనికి విపరీతమైనది యధర్మమగును. (సంగచ్ఛధ్వం) అను మంత్రము మొదలు (యతోఽభ్యుదయ) అను సూత్రము వఱకు నెన్ని ధర్మలక్షణములు చెప్పబడినవో యా ధర్మ లక్షణములకు చెందినదిగా నీవ్యాఖ్యానము గ్రహింపనగును. ఇట్టి లక్షణములనే మానవు లెల్లరు గ్రహింపవలెను.

సం॥ "బ్రహ్మ చ క్షత్రం చ రాష్ట్రం చ విశశ్చ త్విషిశ్చ
యశశ్చ వర్చశ్చ ద్రవిణం చ." ౧౨ అథర్వ. ౧౨-౫-౫-౨-౮

ఇత్యాద్యనేక మంత్ర ప్రమాణైర్ ధర్మోపదేశో వేదేష్వీశ్వరేణైవ సర్వమనుష్యార్థ ముపదిష్టోఽస్తి. (బ్రహ్మ చ) బ్రాహ్మణోపలక్షణం సర్వోత్తమ విద్యాగుణ కర్మవత్వం, సద్గుణ ప్రచారకరణత్వం చ బ్రాహ్మణ లక్షణం; తచ్చ సదైవ వర్ధయితవ్యమ్. (క్షత్రం చ) క్షత్రియోపలక్షణం, విద్యా చాతుర్య, శౌర్య, ధైర్య వీరపురుషాన్వితం చ సదై వోన్నేయమ్; (రాష్ట్రం చ) సత్పురుషసభయా సునియమైః సర్వసుఖాఢ్యం శుభగుణాన్వితం చ రాజ్యం సదైవ కార్యమ్. (విశశ్చ) వైశ్యాది ప్రజానాం వ్యాపారాదికారిణాం భూగోలే హ్యవ్యాహతగతి సంపాదనేన వ్యాపారాద్ ధన వృద్ధ్యర్థం సంరక్షణం చ కార్యమ్, (త్విషిశ్చ) దీప్తిః శుభగుణానాం ప్రకాశః, సత్యగుణకామనా చ, శుద్ధా ప్రచారణీయేతి. (యశశ్చ) ధర్మాన్వితాఉత్తమాకీర్తిః సంస్థాపనీయా. (వర్చశ్చ) సద్విద్యాప్రచారం సమ్యగధ్యయనాధ్యాపన ప్రబంధం కర్మ సదా కార్యమ్; (ద్రవిణం చ) అప్రాప్తస్య పదార్థస్య న్యాయేన ప్రాప్తిశ్చా కార్యా, ప్రాప్తస్య సంరక్షణం, రక్షితస్య వృద్ధిః వృద్ధస్య సత్కర్మసు వ్యయశ్చ యోజనీయః. వీతచ్చతుర్విధపురుషార్థేన ధనధాన్యోన్నతి సుఖే సదైవ కార్యే. ౧౨

తె॥ 'బ్రహ్మ చ' మున్నగు మంత్రప్రమాణముల మూలమున వేదములం దీశ్వరుడే మానవుల కెల్లరకు ధర్మమునుపదేశించి యున్నాడు. (బ్రహ్మ చ) ఉత్తమవిద్యను సంపాదించి, శ్రేష్ఠకర్మముల నాచరించు వారికే బ్రాహ్మణవర్ణాధికార మియ్యవలెను. వారిచే విద్యాప్రచారము చేయింపవలెను. వారును స్వయముగ విద్యాప్రచారమున తత్పరులై యుండవలెను. (క్షత్రం చ) కార్యములలో చతురత, వీరత, శూరత, ధీరత గలవారై వీరపురుషులతో యుక్తమగు సేన కలిగియుండి, దుష్టులను దండించుచు, శిష్టులను బాలించుచుండువారికి క్షత్రియ వర్ణాధికారము నొసంగవలెను. (రాష్ట్రం చ) శ్రేష్ఠపురుషులసభచే నిర్ణయింప బడిన మంచి నియమములతో రాజ్యమును సర్వసుఖములతో గూడినదిగ జేయవలెను. ఉత్తమగుణసహితులై సర్వకార్యముల నెల్లపుడు నిర్వర్తించుచుండవలెను. (విశశ్చ) వైశ్యాది వర్ణములవారు వ్యాపారాది వ్యవహారముల కొఱకు

భూగోళమున సర్వదేశవిదేశములకు వెళ్లుటకు, వచ్చుటకు తగిన వ్యవస్థలు చేయవలెను. వారిని బాగుగ రక్షింపవలెను. అందువలన ప్రపంచమున ధనాదులవృద్ధి కలుగును. (త్విషిశ్చ) మానవులలో నెల్లరిలోను నెల్లపుడు సత్యగుణములనే ప్రకాశింప జేయవలెను. (యశశ్చ) ఉత్తమకార్యము లొనర్చి భూమండలమున శ్రేష్ఠ కీర్తిని పెంపొందించుట యుచితము. (వర్చః చ) సత్య విద్యలను ప్రచారమొనర్చుటకు వలయు పాఠశాలలను నిర్మించి, అందు బాలబాలికలను బాగుగ జదివింపదగు ప్రచారమెల్లపుడు వృద్ధిజేయవలెను. (ద్రవిణం చ) అప్రాప్తపదార్థములను న్యాయపూర్వకముగ పొందగోరవలెను. లభించిన పదార్థములను జక్కగ రక్షింపవలెను. రక్షిత పదార్థములను వృద్ధిజేయవలెను. పెంపుచేసిన ధనాదులను ధర్మ ప్రచారాది కార్యములందు వ్యయింపవలెను. ఇట్టి చతుర్విధ పురుషార్థములతో ధనధాన్యాదులను వృద్ధిజేసి, సుఖము నెల్లప్పుడు నధికము సేయవలెను.

*సం॥* "ఆయుశ్చ రూపం చ, నామ చ కీర్తిశ్చ ప్రాణశ్చాపానశ్చ చక్షుశ్చ శ్రోత్రం చ." ౧౩
అథర్వ ౧౨-౫-౫-౨-౯

(ఆయుశ్చ) వీర్యాది రక్షణేన భోజనాచ్ఛాదనాది సునియమేన బ్రహ్మచర్య సుసేవనేన ఆయుర్ బలం చ కార్యమ్, (రూపం చ) నిరంతరవిషయాసేవనేన సదైవ సౌందర్యాదిగుణయుక్తం స్వరూపం రక్షణీయమ్, (నామ చ) సత్కార్మానుష్ఠానేన నామప్రసిద్ధిః కార్యా. యతోఽన్యస్యాపి సత్కర్మను ఉత్సాహవృద్ధిః స్యాత్. (కీర్తి శ్చ) సద్గుణ గ్రహణార్థ మీశ్వరగుణానా ముపదేశార్థం కీర్తనం, స్వసత్కీర్తి మత్వం చ సదైవ కార్యమ్; (ప్రాణశ్చాపానశ్చ) ప్రాణాయామరీత్యా ప్రాణాపానయోః శుద్ధిబలే కార్యే. శరీరాద్ బాహ్యదేశం యో వాయుర్ గచ్ఛతి, స ప్రాణః; బాహ్యదేశాచ్ఛరీరం ప్రవిశతి స వాయు రపానః. శుద్ధ దేశ నివాసాది నైనయోః ప్రచ్ఛర్దనవిధారణాభ్యాం బుద్ధిశరీరబలం చ సంపాదనీయమ్. (చక్షుశ్చ శ్రోత్రం చ) చాక్షుషం ప్రత్యక్షం, శ్రౌత్రం శబ్దజన్యం చ. అనుమానాదీన్యపి ప్రమాణాని యథావద్ వేదితవ్యాని. తైః సత్యం విజ్ఞానం చ సర్వథా కార్యమ్." ౧౩

తె॥ (ఆయుశ్చ) వీర్యాది ధాతువులను శుద్ధముగా నుంచుకొని, వానిని రక్షించుట, యుక్తిపూర్వకముగ భోజనాచ్ఛాదనాదుల నొనర్చుట, బ్రహ్మచర్యమును బాగుగ పాలించుట మున్నగు మంచి నియములతో నెల్లపుడు నాయువును పెంచుకొనవలెను. (రూపం చ) విషయముల నధికముగ సేవింపక, శుద్ధవస్త్రాదులను ధరించుచు శరీర స్వరూపమును కాపాడుకొనవలెను. (నామ చ) ఉత్తమ కర్మముల నొనర్చి, కీర్తిగడింపవలెను. అందువలన నితరులకు గూడ శ్రేష్ఠ కార్యముల నొనర్చుటలో నుత్సాహము కలుగును. (కీర్తిశ్చ) శ్రేష్ఠగుణములను గ్రహించునిమిత్తము పరమేశ్వర గుణశ్రవణము చేయవలెను. వాని నితరులకు నుపదేశింపవలెను. అందువలన యశస్సు పెంపగును. (ప్రాణశ్చాపానశ్చ) శరీరమునుండి వెలుపలకు బోవు వాయువు ప్రాణ మనబడును. వెలుపలనుండి శరీరమునందు ప్రవేశించు వాయువు అపానమనబడును. యోగాభ్యాసము శుద్ధప్రదేశ నివాసమునందొనర్పవలెను. శ్వాసకోశములనుండి బలపూర్వకముగ వాయువు బయటికి నిఃశ్వసించి (నాసికాపుటముల ద్వారమున వెడలగ్రక్కి) కొంచెము తడవు వెలుపలి వాయువును శ్వాసకోశములందు నింపక, వానిని శూన్యము (కాళీ)గ నుంచుటవలన శారీరికరోగములు పోగొట్టుకొని బుద్ధిని వర్ధిల్ల సేయుము. (చక్షుశ్చ శ్రోత్రం చ) ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, ఐతిహ్యము, అర్థాపత్తి, సంభవము, అభావము నను ఎనిమిది ప్రమాణముల జ్ఞానము మూలమున సత్యమును నిత్యము పరిశోధించి గ్రహించుచుండ దగును.

*సం॥* "పయశ్చ రసశ్చాన్నం చాన్నాద్యం చ ఋతం చ
సత్యం చేష్టం చ పూర్తం చ ప్రజా చ పశవశ్చ." ౧౪ అథర్వ. ౧౨-౫-౫-౨-౧౦

(పయశ్చ రసశ్చ) పయోజలాదికం, రసో - దుగ్ధఘృతాదిశ్చ; నీతా వైద్యక రీత్యా సమ్యక్ శోధయిత్వా భోక్తవ్యౌ (అన్నం చాన్నాద్యం చ) అన్నమ్ ఓదనాదిక మన్నాద్యం భోక్తు మర్హం శుద్ధం సంస్కృతమన్నం సంపాద్యైవ భోక్తవ్యమ్. (ఋతం చ సత్యంచ) ఋతం బ్రహ్మ సర్వైర్దేవోపాసనీయం, సత్యం ప్రత్యక్షాదిభిః ప్రమాణైః పరీక్షితం యాదృశం స్వాత్మన్యస్తి, తాదృశం సదా సత్యమేవ వక్తవ్యం మన్తవ్యం చ. (ఇష్టం చ పూర్తం చ) ఇష్టం బ్రహ్మోపాసనం సర్వోపకారకం యజ్ఞానుష్ఠానం చ, పూర్తం తు యత్ పూర్త్యర్థం మనసా వాచా కర్మణా సమ్యక్ పురుషార్థేనైవ సర్వవస్తుసంభారై శ్చోభయానుష్ఠాన పూర్తిః కార్యేతి. (ప్రజా చ పశవశ్చ) ప్రజా సంతానాదికా, రాజ్యం చ సుశిక్షా విద్యా సుఖాన్వితా, హస్త్యశ్వాదయః పశవశ్చ సమ్యక్ శిక్షాన్వితాః కార్యాః బహుభిశ్చకారై రన్యేపి శుభగుణా అత్ర గ్రాహ్యాః

తె॥ (పయశ్చ రసశ్చ) జలాదులు, క్షీరము, చక్కెర, ఓషధులు, ఘృతము మున్నగునవి వైద్యక శాస్త్రమున జెప్పినట్లు శుద్ధి చేసి భుజింపవలెను. (అన్నం చాన్నాద్యం చ) బియ్యము మున్నగు భోజ్య వస్తువులను వైద్యక శాస్త్రమునందు జూపినట్లు శుద్ధమొనర్చి భుజింపవలెను. (ఋతం చ సత్యం చ) ఋతం = బ్రహ్మమునే యుపాసింపవలెను. ప్రత్యక్షాది ప్రమాణముల మూలమున హృదయమున నెట్టి జ్ఞానము కలుగునో యట్లే భాషింపవలెను = సత్యము నంగీకరింపవలెను. (ఇష్టం చ పూర్తంచ) ఇష్టం = బ్రహ్మము, దానినే యుపాసింపవలెను. పూర్వ నిర్దిష్ట యజ్ఞము సమస్త ప్రపంచమునకు నుపకార మొనర్చుచు నదియు నిష్టమనబడును. (పూర్తంచ) ఆయిష్టసిద్ధి నొనర్చుటకు త్రికరణములతో వలయు నుత్తమ పదార్థములను సంపాదించి, పూర్ణానుష్ఠాన మొనర్పవలెను. (ప్రజా చ పశవశ్చ) మనుష్యు లెల్లరు తమ సంతానమునకు, రాజ్యమునకును నుత్తమ శిక్షణ నొసంగవలెను. ఏనుగులు, గుఱ్ఱములు మున్నగు పశువులకును శిక్షణ నొసంగవలెను. మంత్రమున ననేక 'చ' కారములను గ్రహించుటవలన నితర శుభ గుణములను కూడ గ్రహింపవలెనని తెలియుచున్నది. పై మంత్రముల వలన నితర ప్రయోజనములు కూడ ననేకములు సిద్ధించుననియు నూహింపవలెను.

సం॥ అత్రధర్మవిషయే తైత్తిరీయ శాఖాయా అన్యదపి ప్రమాణమ్—

"ఋతం చ స్వాధ్యాయ ప్రవచనే చ. సత్యం చ స్వాధ్యాయ ప్రవచనే చ, తపశ్చ స్వా.... దమశ్చ స్వా..., శమశ్చ స్వా.... అగ్నయశ్చ స్వా...., అగ్నిహోత్రం చ స్వా..., అతిథయశ్చ స్వా.... మానుషం చ స్వా..., ప్రజా చ స్వా..., ప్రజనశ్చ స్వా.... ప్రజాతిశ్చ స్వా...' సత్యమితి సత్యవచా రాథీతరః. తప ఇతి తపో నిత్యః పౌరుశిష్టిః, స్వాధ్యాయ ప్రవచన ఏవేతి నాకో మౌద్గల్యః. తద్ధి తపః తద్ధి తపః. ౧.

తైత్తిరీయారణ్యకే ప్ర. పా. ౭, అను ౯

వేద మనూచ్యాచార్యోఽంతే వాసిన మనుశాస్తి, సత్యం వద. ధర్మం చర. స్వాధ్యాయాన్మా ప్రమదః, ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః, సత్యాన్న ప్రమదితవ్యమ్, ధర్మాన్న ప్ర.... కుశలాన్న ప్రమ...భూత్యై న ప్ర...., స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్ర.... దేవపితృ కార్యాభ్యాం న ప్ర..., మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ. యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని, నో ఇతరాణి. యాన్యస్మాకగ్ం సుచరితాని, తాని త్వయోపాస్యాని, నో ఇతరాణి.

ఏకే చాస్మచ్ఛ్రేయాగ్ంసో బ్రాహ్మణాః, తేషాం త్వయాఽసనేన ప్రశ్వసితవ్యమ్. శ్రద్ధయా దేయమ్. అశ్రద్ధయా దేయమ్. శ్రియా దేయమ్. హ్రియా దేయమ్. భియా దేయమ్. సంవిదా దేయమ్. అథ యది తే కర్మవిచికిత్సా వా వృత్త విచికిత్సా వా స్యాత్, యే తత్ర బ్రాహ్మణాః సమ్మర్శినః యుక్తా

అయుక్తాః అలూక్షా ధర్మకామాః స్యుః యథా తే తత్ర వర్తేరన్, తథా తత్ర వర్తేథాః అథాభ్యాఖ్యాతేషు. యే తత్ర బ్రాహ్మణాః సమ్మర్శినః, యుక్తా అయుక్తాః, అలూక్షా ధర్మ కామాః స్యుః, యథా తే తేషు వర్తేరన్, తథా తేషు వర్తేథాః, ఏష ఆదేశః, ఏష ఉపదేశః, ఏషా వేదోపనిషత్. ఏతదనుశాసనమ్, ఏవ ముపాసితవ్యమ్, ఏవ ముచైత దుపాస్యమ్." ౨ తై. అ. ౭-౧౧

ఏతేషా మభిప్రాయః-

సర్వైర్ మనుష్యైరేతాని వక్ష్యమాణాని ధర్మ లక్షణాని సదైవ సేవ్యానీతి. (ఋతం చ) యథార్థ స్వరూపం వా జ్ఞానం (సత్యం చ) సత్యస్యాచరణం చ, (తపశ్చ) జ్ఞాన ధర్మయోర్ ఋతాది ధర్మలక్షణానాం యథావదనుష్ఠానమ్. (దమశ్చ) అధర్మాచరణా దింద్రియాణి సర్వథా నివర్త్య, తేషాం సత్య ధర్మాచరణే సదైవ ప్రవృత్తిః కార్యా. (శమశ్చ) నైవ మనసాపి కదాచి దధర్మాచరణేచ్ఛా కార్యేతి. (అగ్నయశ్చ) వేదాది శాస్త్రేభ్యోఽగ్న్యాది పదార్థేభ్యశ్చ పారమార్థిక వ్యావహారిక విద్యోపకారకరణమ్. (అగ్నిహోత్రం చ) నిత్య హోమ మారభ్యాశ్వమేధపర్యంతేన యజ్ఞేన వాయువృష్టి జల శుద్ధి ద్వారా సర్వప్రాణినాం సుఖసంపాదనం కార్యమ్. (అతిథయశ్చ) పూర్ణవిద్యావతాం ధర్మాత్మనాం సంగసేవాభ్యాం సత్యశోధనం ఛిన్న సంశయత్వం చ కార్యమ్. (మానుషం) మనుష్య సంబంధి రాజ్య విద్యాది విత్తం సమ్యక్ సిద్ధం కర్తవ్యమ్. (ప్రజా చ) ధర్మేణైవ ప్రజా ముత్పాద్య, సా సదైవ సత్య ధర్మ విద్యా సుశిక్షయాఽన్వితా కార్యా. (ప్రజనశ్చ) వీర్యవృద్ధిః పుత్రేష్టిరీత్యా, ఋతు ప్రదానం చ కర్తవ్యమ్. (ప్రజాతిశ్చ) గర్భరక్షా జన్మ సమయే సంరక్షణం సంతాన శరీర బుద్ధి వర్ధనం చ కర్తవ్యమ్.

(సత్యమితి) మనుష్యః సదా సత్యవక్తైవ భవేదితి రాథీతరాచార్యస్య మతమస్తి. (తప ఇతి) యదృతాది సేవనేనైవ సత్య విద్యా ధర్మానుష్ఠాన మస్తి తన్నిత్యమేవ కర్తవ్యమితి పౌరుశిష్టే రాచార్యస్య మతమస్తి. పరం తు నాకో మౌద్గల్యస్యేదం మతమస్తి - స్వాధ్యాయో వేద విద్యాధ్యయనం, ప్రవచనం తదధ్యాపనం చేత్యుభయం సర్వేభ్యః శ్రేష్ఠతమం కర్మాస్తి. ఇదమేవ మనుష్యేషు పరమం తపోఽస్తి నాతః పరముత్తమం ధర్మ లక్షణం కించిద్విద్యత" ఇతి.

(వేదమనూచ్యా) ఆచార్యః శిష్యాయ వేదానధ్యాప్య ధర్మ ముపదిశతి :- "హే శిష్య ! త్వయా సదైవ సత్యమేవ వక్తవ్యమ్. సత్యభాషణాదిలక్షణో ధర్మశ్చ సేవనీయః. శాస్త్రాధ్యయనాధ్యాపనే కదాపి నైవ త్యాజ్యే. ఆచార్యసేవా, ప్రజోత్పత్తిశ్చ సత్యధర్మకుశలతైశ్వర్య సంవర్ధనసేవనే సదైవ కర్తవ్యే, దేవా విద్వాంసః. పితరో జ్ఞానినశ్చ, తేభ్యో జ్ఞానగ్రహణం తేషాం సేవనం చ సదైవ కార్యం. ఏవం మాతృ పితృాచార్యాతిథీనాం సేవనం చైతత్సర్వం సంప్రీత్యా కర్తవ్యమ్, నైతత్ కదాఽపి ప్రమాదాత్త్యాజ్య మితి.

వక్ష్యమాణరీత్యా మాత్రాదయ ఉపదిశేయు :- భోః పుత్రాః! యాన్యుత్తమాని కర్మాణి వయం కుర్మః, తాన్యేవ యుష్మాభి రాచరితవ్యాని, యాని తు పాపాత్మకాని కానిచిదస్మాభిః క్రియంతే, తాని కదాపి నైవాచరణీయాని.

యేఽస్మాకం మధ్యే విద్వాంసో బ్రహ్మవిదః స్యుః, తత్సంగ స్తదుక్త విశ్వాసశ్చ సదైవ కర్తవ్యో నేతరేషామ్. మనుష్యైర్ విద్యాది పదార్థదానం ప్రీత్యాఽప్రీత్యా, శ్రియా, లజ్జయా, భయేన, ప్రతిజ్ఞయా చ, సదైవ కర్తవ్యమ్. అర్థాత్ ప్రతిగ్రహాద్దాన మతీవ శ్రేయస్కరమితి. భోః శిష్య! తవ కస్మింశ్చిత్ కర్మణ్యాచరణే చ సంశయో భవేత్, తదా బ్రహ్మవిదాం పక్షపాత రహితానాం యోగినా మధర్మాత్ పృథగ్ భూతానాం విద్యాదిగుణైః స్నిగ్ధానాం ధర్మకామానాం విదుషాం సకాశా దుత్తరం గ్రాహ్యమ్. తేషా

మేవాచరణం చ; యాదృశేన మార్గేణ తే విచరేయుః, తేనైవ మార్గేణ త్వయాపి గంతవ్యమ్. అయమేవ యుష్మాకం హృదయ ఆదేశ ఉపదేశో హి స్థాప్యతే. ఇయమేవ వేదానా ముపనిషదస్తి. ఈదృశ మేవానుశాసనం సర్వైర్ మనుష్యైః కర్తవ్యమ్. ఈదృగాచరణ పురః సరమేవ పరమశ్రద్ధయా సచ్చిదానందాది లక్షణం బ్రహ్మోపాస్యం, నాన్యథేతి.

తై॥ తైత్తిరీయశాఖలో గూడ ధర్మ విషయమిట్లు చెప్పబడినది. (ఋతం చ....) మానవులు తమ జ్ఞానమును విద్యను పెంచుచు పరమేశ్వరునే యుపాసించుట తగును. దానితో బాటు వేద శాస్త్రములను జదువుచు, జదివించుచు నుండవలెను.

(సత్యం చ) ప్రత్యక్షాది ప్రమాణముల ద్వారమున విషయములను జక్కగా బరీక్షించి నీవు తెలిసికొనినట్లు ఇతరులకు జెప్పుము. దానినే యంగీకరించుము. దానితోబాటు చదువుటయు జదివించుటయు నెన్నడు మానకుము. (తపశ్చ...) విద్యలను గ్రహించుటకు బ్రహ్మ చర్యాశ్రమమును బూర్ణముగ పాలించి ధర్మనిరతుడవు కమ్ము (దమశ్చ....) నేత్రాదీంద్రియముల నధర్మమునుండి, ఆలస్యమునుండియు తప్పించి యెల్లపుడు ధర్మమున నుంచుము. (శమశ్చ...) నీయాత్మను, మనస్సును నెల్లప్పుడు ధర్మమును సేవించుటలో స్థిరముగ నుంచుము. (అగ్నయశ్చ....) వేదములు, అగ్ని మున్నగు పదార్థములు ననువాని మూలమున ధర్మార్థ కామమోక్షములు సాధింపుము. అట్లే నానావిధములగు శిల్ప విద్యల నభివృద్ధి నొందించుము. (అగ్ని హోత్రం చ...) అగ్ని హోత్రము మూలమున వాయువును, వృష్టిజలమును శుద్ధ మొనర్చి, లోకమునకు మేలు చేయుము. అశ్వ మేధాద్యుత్తమ యజ్ఞముల ద్వారమున సృష్టికంతటికి నుపకారమొనర్పుము, (అతిథయశ్చ) జగత్తునకంతటికి నుపకృతి యొనర్చుటకు సత్యమును జెప్పుచు, సత్యమే యాచరించుచు పూర్ణ విద్వాంసులై యెల్లరకు సుఖము నాకాంక్షించు సత్పురుషులను సేవించి, సత్యమును శోధన మొనర్చి, సంశయములను బోగొట్టుకొని కర్తవ్యకర్మములను నిరంతరము చేయుచుండుము. (మానుషం చ...) మానవ మర్యాదలకు, రాజ్య ప్రజావ్యవస్థలకు భంగము కలుగని విధమున సంపాదించి వృద్ధి నొనర్పుము. వానిని రక్షించి సత్కార్యములందు వినియోగింపుము. తన్మూలమున 'ధర్మార్థ కామమోక్షము' లను చతుర్విధ పురుషార్థములను సాధించి జన్మము తరింపజేయుము. (ప్రజా చ....) స్వసంతానమును దగినట్లు పాలింపుము. వారికి మంచి విద్యాబుద్ధులను నేర్పి విద్వాంసుల నొనర్చి యెల్లపుడు వారు ధర్మాత్ములు, పురుషార్థ పరులు నగునట్లు చూడుము. (ప్రజనశ్చ....) సంతానము నుత్పన్నము జేయుట కనువగు వ్యవహారము పుత్రేష్టి. అందు శ్రేష్ఠ భోజన మెల్లపుడు చేయుచుండుము. ఔషధములను సేవింపుము. గర్భమును చక్కగా రక్షింపుము. (ప్రజాతిశ్చ...) బాల బాలికలను, జన్మ సమయమునను, తరువాతను బాగుగ కాపాడి, వారిశరీరమును, బుద్ధిని పెంపు చేయుము. (సత్యమితి) 'మనుష్యుడు సత్యము నెల్లపుడు చెప్పవలెను' అని రాథీతరాచార్యుని మతము, (తప ఇతి) 'పూర్వోక్త ఋతాదులను సేవించుచు, సత్య విద్యాభ్యాసమును, సత్యధర్మానుష్ఠానము నెల్లపుడు జేయవలెను' అని పౌరుశిష్టి ఆచార్యుని మతము. కాని, 'స్వాధ్యాయము- వేదాధ్యయనము - అధ్యాపనము నను నీ రెండు కర్మములే మిక్కిలి శ్రేష్ఠములు. ఇదియే మనుజులు చేయు పరమ తపస్సు. ఇంతకు మించిన ధర్మ లక్షణ మొండును లేదు' అని మౌద్గల్యుని మతము. ఋతము మొదలు ప్రజాతి వఱకు జెప్పబడిన పంద్రెండు ధర్మ లక్షణములతో బాటు స్వాధ్యాయ ప్రవచనములు - వేదము చదువుట - చదివించుటయును జోడింపబడినవి. దీనిం బట్టి మనుష్యులు సత్య విద్యలను జదువుట వలనను, జదివించుట వలనను పూర్వ వర్ణితధర్మ లక్షణములను సాధింపగలరు. లేకున్న ధర్మానుష్ఠానము పూర్తికాదు అని మౌద్గల్యుని యభిప్రాయము. సర్వగుణములలోను విద్యయే యుత్తమ గుణము. కావున స్వాధ్యాయ ప్రవచనముల నెన్నడు విడువరాదు. ఇతర ధర్మానుష్ఠాన సమయమునందును, స్వాధ్యాయ ప్రవచనములను జరుపుచునే యుండవలెను. దాని వలన నెల్లరు నెల్లప్పుడు సుఖమును బొందుదురు.

(వేద. మనూచ్య....) ఆచార్యుడు - విద్యాశిక్షణల నొసంగువాడు, తన పుత్రులకు, శిష్యులకును విద్యాధ్యయనము చేయించు సమయమున, అధ్యయనము పూర్తి కానంత వఱకు నిట్లుపదేశింపవలెను:- 'ఓ పుత్రులార! మీరు సత్యమునే చెప్పుడు. సత్యభాషణాదులు లక్షణములు గాగల ధర్మముల నాచరించి, పరమేశ్వరుని భక్తితో సేవింపుడు. ఇందాలస్య ప్రమాదముల నొనర్పకుడు. ఆచార్యున కనేకములగు నుత్తమ పదార్థముల నొసంగి ప్రసన్నుని జేయుడు, యువావస్థ వచ్చిన తరువాతనే వివాహమాడి సంతానవంతు లగుదురుగాక! సత్య ధర్మమును విడువకుడు. చతురతతో నుత్తమైశ్వర్యమును సంపాదించి, పెంపుజేయుడు: అధ్యయనాధ్యాపనములలో ఆలస్య ప్రమాదములను జేయకుడు.

(దేవ పిత్ర...) విద్వాంసులయు, జ్ఞానులయు సాంగత్యము, సేవ చేసి, విద్యలను గ్రహించుటలో నాలస్య ప్రమాదము లొనర్పరాదు. తల్లి తండ్రి, ఆచార్యుడు - విద్యాదాత, అతిథి - సత్యోపదేష్టయగు విద్వాంసుడు - వీరిని సేవించుటలో నలసత జూపకుడు. సత్యభాషణాది శుభ గుణములను, కర్మములను నెల్లపుడు సేవింపుడు. మిథ్యాభాషణా ద్యశుభగుణముల గ్రహింపకుడు. 'శిష్యులార! మా సుచరితముల - సత్కార్యములను మాత్రము గ్రహింపుడు; కాని దుష్కార్యముల ననుకరింపకుడు. మాలో విద్వాంసులు, బ్రహ్మజ్ఞులు, ధర్మాత్ములు నైనవారినిజేరి, వారి మాటలను విశ్వసింపుడు. వారికి ప్రీతితో గాని, అప్రీతితోగాని, శ్రీతోగాని, లజ్జతోకాని, భయముతోగాని, ప్రతిజ్ఞతోగాని యెల్లపుడు దాన మొనర్పుడు. విద్యాదానము నిరంతరము చేయుచుండుడు. తీసికొనుటకంటె దాన మొనర్చుట శ్రేష్ఠము. మీ కేదేని విషయమునందు సంశయము కలిగినపుడావిషయమును గూర్చి పూర్ణ విద్వాంసులు, పక్షపాత రహితులు, ధర్మాత్ములు నగు వారి నాలోచించి వారు చెప్పినట్లు చేయుడు. సంశయమును బోగొట్టుకొనుడు. వారాయా ధర్మ కార్యములం దెట్లు నడచుకొనిరో యట్లే మీరును వర్తింపుడు. ఇదియే ఆదేశము. అవిద్యను దొలగించి దాని స్థానమున విద్యను, అధర్మమును దొలగించి దాని స్థానమున ధర్మమును స్థాపింపుడు. ఇదియే శిక్షణ, ఉపదేశము ననబడును. ఇట్లే శుభ లక్షణములను గ్రహించి యెల్లపుడు పరమేశ్వరుని నుపాసింపుడు.

సం॥ *"ఋతం తపః, సత్యం తపః, శ్రుతం తపః, శాంతం తపో దమస్తపః శమస్తపో.*

*దానం తపో, యజ్ఞస్తపో భూర్ భువః సువర్ బ్రహ్మైతదుపా స్స్వైతత్తపః* తై. అ, ౧౦-౮

*ఇదానీం తపసో లక్షణ ముచ్యతే–*

*(ఋతం....) యత్తత్త్వం బ్రహ్మణ ఏవోపాసనం, యథార్థజ్ఞానం చ. (సత్యం) సత్యకథనం, సత్యమాచరణం చ, (శ్రుతం) సర్వ విద్యాశ్రవణం శ్రావణం చ, (శాంతం) అధర్మాత్ పృథక్ కృత్య మనసో ధర్మే సంస్థాపనం మనఃశాంతిః. (దమస్తపః) ఇంద్రియాణాం ధర్మ ఏవ ప్రవర్తనం, అధర్మాన్నివర్తనం చ. (శమస్తపః) మనసోఽపి నిగ్రహ శ్చ–అధర్మాద్ధర్మే ప్రవర్తనం చ, (దానం తపః) తథా సత్య విద్యాదిదానం సదా కర్తవ్యమ్. (యజ్ఞస్తపః) పూర్వోక్తం యజ్ఞానుష్ఠానం చైతత్ సర్వం తపశ్శబ్దేన గృహ్యతే నాన్యదితి. అన్యచ్చ– (భూర్ భువః) హే మనుష్య! సర్వ లోక వ్యాపకం యద్ బ్రహ్మాస్తి, తదేవ త్వముపాస్వ; ఇదమేవ తపో మన్యధ్వం. నాతో విపరీతమితి.*

తె॥ తపోలక్షణము-

(ఋతం తపః) తపస్సు ఋతము-యథార్థతత్త్వము నంగీకరించుట తపస్సనబడును. (సత్య)సత్యమును జెప్పుటయు, నాచరించుటయు తపస్సగును. (శ్రుత) సర్వ విద్యలను గూర్చి వినుటయు, వినిపించుటయు తపస్సగును. (శాంత) ఉత్తమ కర్మముల నాచరించుట; సుస్వభావము గలిగియుండుట; (దమ) ఇంద్రియములను

ధర్మమునందు ప్రవర్తింపజేయుట, అధర్మమున వర్తింపజేయకుండుట, (శమ) మనస్సును అధర్మమునుండి తొలగించి ధర్మమునందుంచుట, (దాన) సత్యవిద్యాదుల నితరుల కొసంగుట, పూర్వోక్తమగు యజ్ఞము ననుష్ఠించుట, యివి యన్నియు తపస్సనబడును. (భూర్....) ఓ మానవ! త్రిభువనములందును వ్యాపకుడై యుండు పరమేశ్వరుని నుపాసింపుము. అదియే తపస్సని యెంచుము. దీనికి విపరీతము తపస్సుకాదు.

సం॥ "సత్యం పరం పరగ్ం సత్యగ్ం సత్యేన న సువర్గాల్లోకాచ్చ్యవంతే కదాచన. సతాంహి సత్యం, తస్మాత్ సత్యే రమంతే. తప ఇతి తపో నానశనాత్ పరం, యద్ధి పరం తపస్తద్దుర్ధర్షం, తద్దురాధర్షం; తస్మాత్తపసి రమన్తే. దమ ఇతి నియతం బ్రహ్మచారిణ స్తస్మా ద్దమే రమన్తే. శమ ఇత్యరణ్యే మునయస్తస్మా చ్ఛమే రమన్తే, దాన మితి సర్వాణి భూతాని ప్రశగ్ంసంతి; దానాన్నాతి దుష్కరం తస్మా ద్దానే రమన్తే ధర్మ ఇతి ధర్మేణ సర్వ మిదం పరిగృహీతం, ధర్మాన్నాతిదుశ్చరం తస్మాద్ధర్మే రమన్తే. ప్రజన ఇతి భూయాగ్ంస స్తస్మాద్ భూయిష్ఠాః ప్రజాయంతే, తస్మాద్ భూయిష్ఠాః ప్రజననే రమన్తే. అగ్నయ ఇత్యాహ. తస్మాదగ్నయ ఆధాతవ్యాః అగ్నిహోత్రమిత్యాహ, తస్మా దగ్ని హోత్రే రమన్తే, యజ్ఞ ఇతి యజ్ఞేన హి దేవా దివంగతా స్తస్మాద్యజ్ఞే రమన్తే. మానసమితి విద్వాగ్ంస, స్తస్మాద్ విద్వాగ్ంస ఏవ మానసే రమన్తే. న్యాస ఇతి బ్రహ్మ, బ్రహ్మ హిపరః, పరోహి బ్రహ్మ, తాని వా ఏతాన్యవరాణి తపాగ్ంసి, న్యాస ఏవాత్యరేచయత్. య ఏవం వేదేత్యుపనిషత్. ౪ తై. ఆ. ౧౦-౬౨

"ప్రాజాపత్యో హారుణిః సుపర్ణేయః ప్రజాపతిం పితర ముపససార. కిం భగవంతః పరమం వదంతీతి. తస్మై ప్రోవాచ. సత్యేన వాయు రావాతి. సత్యేనాదిత్యో రోచతే దివి. సత్యం వాచః ప్రతిష్ఠా. సత్యే సర్వం ప్రతిష్ఠితం, తస్మాత్ సత్యం పరమం వదంతి. తపసా దేవా దేవతా మగ్ర ఆయన్. తపసర్షయః సువ రన్వవిందన్, తపసా సపత్నాన్ ప్రణుదా మారాతీ, స్తపసి సర్వం ప్రతిష్ఠితం, తస్మాత్తపః పరమం వదన్తి. దమేన దాంతాః కిల్బిష మవధూన్వంతి, దమేన బ్రహ్మచారిణః సువ రగచ్ఛన్, దమో భూతానాం దురాధర్షం, దమే సర్వం ప్రతిష్ఠితం, తస్మాద్దమం పరమం వదన్తి. ప. శమేన శాంతాః శివ మాచరంతి, శమేన నాకం మునయోఽన్వవిందన్ ఛమో భూతానాం దురాధర్షం, శమే సర్వం ప్రతిష్ఠితం, తస్మాచ్ఛమం ప..; దానం యజ్ఞానాం వరూథం, దక్షిణా, లోకే దాతారగ్ం సర్వ భూతాన్యుపజీవంతి, దానేనా రాతీ రపానుదంత, దానేన ద్విషంతో మిత్రా భవంతి, దానే సర్వం ప్రతిష్ఠితం తస్మాద్దానం ప... ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా, లోకే ధర్మిష్ఠం ప్రజా ఉపసర్పంతి; ధర్మేణ పాప మపనుదంతి, ధర్మే సర్వం ప్రతిష్ఠితం, తస్మాద్ధర్మం ప..., ప్రజననం వై ప్రతిష్ఠా, లోకే సాధు ప్రజాయాస్తంతుం తన్వానః పితౄణా మనృణో భవతి; తదేవ తస్య అనృణం; తస్మాత్ప్రజననం ప....

అగ్నయో వై త్రయీ విద్యా దేవయానః పంథా, గార్హపత్యం ఋక్, పృథివీ రథంతర, మన్వాహార్యపచనో యజు రంతరిక్షం వామదేవ్య మాహవనీయః సామ సువర్గో లోకో బృహత్, తస్మాదగ్నీన్ ప...; అగ్ని హోత్రగ్ం సాయం ప్రాతర్ గృహాణాం నిష్కృతిః, స్విష్టగ్ం, సుహుతం, యజ్ఞ క్రతూనాం ప్రాయణగ్ం సువర్గస్య లోకస్య జ్యోతి స్తస్మాదగ్ని హోత్రం ప...; యజ్ఞ ఇతి యజ్ఞేన హి దేవా దివం గతాః, యజ్ఞేనాసురా నపానుదంత, యజ్ఞేన ద్విషంతో మిత్రా భవంతి, యజ్ఞేన సర్వం ప్రతిష్ఠితం, తస్మాద్ యజ్ఞం ప...; మానసం వై ప్రాజాపత్యం పవిత్రం, మానసేన మనసా సాధు పశ్యతి, మానసా ఋషయః ప్రజా అసృజన్త; మానసే సర్వం ప్రతిష్ఠితం, తస్మాన్మానసం పరమం వదంతి." గ.

తైత్తి. ఆ. ౧౦-౬౩

అయ మభిప్రాయః–

(సత్యం ప....) సత్యభాషణాత్ సత్యాచరణాచ్చ పరం ధర్మ లక్షణం కించి న్నాస్త్యేవ.

పూ : కుతః ?

ఉ : సత్యేనైవ నిత్యం మోక్ష సుఖం సంసార సుఖం చ ప్రాప్య పునస్తస్మాన్నైవ కదాపి చ్యుతిర్ భవతి. సత్పురుషాణామపి సత్యాచరణమేవ లక్షణ మస్తి. తస్మాత్ కారణాత్ సర్వైర్ మనుష్యైః సత్యే ఖలు రమణీయ మితి. తపస్తు ఋతాది ధర్మ లక్షణానుష్ఠానమేవ గ్రాహ్యమ్. ఏవం సమ్యగ్ బ్రహ్మ చర్య సేవనేన విద్యాగ్రహణం బ్రహ్మ ఇత్యుచ్యతే. ఏవమేవ దానాదిష్వర్థగతిః కార్యా. విదుషో లక్షణం మానసో వ్యాపారః ఏవమేవ సత్యేన బ్రహ్మణా వాయు రాగచ్ఛతి సత్యేనాదిత్యః ప్రకాశితో భవతి. సత్యేనైవ మనుష్యాణాం ప్రతిష్ఠాజాయతే, నాన్యథేతి. మానసా ఋషయః ప్రాణాః విజ్ఞానాదయశ్చేతి.

తె॥ (సత్యం పరం) సత్యభాషణము, సత్యాచరణముకంటె నుత్తమ లక్షణము ధర్మమున కొండు లేదు.

పూ : కారణమేమి?

ఉ : సత్యము వలననే మనుజుల వ్యవహారము నిర్వర్తింపబడును; ఉత్తమ ముక్తి– సుఖము లభించును. దానివలన నా యుత్తమ సుఖము నుండి విడివడి దుఃఖము ననుభవింపరు. సత్పురుషులలో గల సత్పురుషత్వము కూడ సత్యమే. కావున నెల్లరు సత్యమునందే రమింపవలెను.

(తప ఇతి) అన్యాయముతో నన్యుని పదార్థమును గ్రహింప కుండుట తపస్సనబడును. ఋత సత్యాదులు కూడ తపస్సు లక్షణము లని పూర్వము చెప్పబడినది. తపస్సు మిక్కిలి ఉత్తమము. ఆచరణలో కఠినమైనను బుద్ధిమంతులకు దాని నాచరించుట సుగమమే యగును. కావున తపస్సునందే నిత్యము నిశ్చితముగా నుండుటయే మంచిది. (దమ ఇతి) ఇంద్రియములను వశపఱచుకొని, సదా విద్యాభ్యాసము, ధర్మాచరణము నొనర్చుట 'దమ' మనబడును. మానవులిందు నిత్యము వర్తింపవలెను. (శమ ఇతి) క్రోధాది దోషముల నంతఃకరణమునుండి తొలగించి, మునివృత్తితో నెల్లరు నేకాంత వాసము చేయవలెను. (దానమితి) దానము నెల్లరు స్తుతి చేయుదురు. దానముకంటె మించిన కఠిన కర్మ మింకొకటి లేదు. దాని వలన శత్రువులు కూడ మిత్రులగుదురు. కావున నెల్లరు దానము సేయు స్వభావము సంపాదించుకొనవలెను. (ధర్మ ఇతి) ధర్మమునకు లక్షణ మింతకు పూర్వమే వ్రాసి యుంటిమి. ఇకముందు చెప్పు లక్షణములు నీ ధర్మమునకు జెందినవే. న్యాయము– పక్షపాతము విడిచి సత్యాచరణ మొనర్చుట, అసత్యమును త్యజించుట – ధర్మ మనబడును. అట్టి ధర్మమువలననే యీ ప్రపంచము నడచుచున్నది. ఈ ధర్మమన్నింటికంటెను కఠినము, నుత్తమమునై యున్నది. (ప్రజన ఇతి) ప్రజనము వలన మనుష్యుల వృద్ధి కలుగును. దీనిలో మనుజులు రమింతురు. కావున జన్మము ప్రజనము (అగ్నయ ఇతి) వేదములు, అగ్ని మున్నగు పదార్థములు. వీని వలన సర్వ శిల్ప విద్యలు సిద్ధము చేసి కొనవలయును. (అగ్ని హోత్రం చ) అగ్ని హోత్రము మొద లశ్వ మేధము వఱకు గల హోమాదుల నొనర్చి సర్వజగత్తున కుపకారమొనర్చుటకు యత్నింపవలెను. ఈ యజ్ఞ విద్య వలననే విద్వాంసులు సుఖించిరి.

(మానసమితి) ఆలోచించువారు విద్వాంసులగుదురు. విద్వాంసు లందువలననే ఆలోచన–విచారణలో నెల్లప్పుడు రమింతురు. మనస్సునకు విజ్ఞానాది గుణములతో సంబంధమున్నది. ఆ విజ్ఞానాది గుణముల నిమిత్తమే యీశ్వరుడు సృష్టిని జేయును. జీవుడును ప్రపంచములో వ్యవహారోపయోగి పదార్థములను కొన్నింటిని నిర్మించును. కావున మనస్సును బలపఱచుటయు, దానిని శుద్ధ మొనర్చుటయు నుత్తమ ధర్మ మగును.

(న్యాసఇతి) బ్రహ్మ-నాలుగు వెదముల నెఱింగి, సాంసారిక వ్యవహారములను విడిచి, సంన్యాసియై-మానవుల కెల్లరకు సత్యధర్మము, సత్యవిద్య, వీని మూలమున లాభము చేకూర్చుచుండవలెను. విద్వాంసులైన వారు ధర్మ లక్షణ మెఱిగి యిదియు జేయవలయును. (సత్యేన వా) సత్యముత్తమము. అది బ్రహ్మము. దాని వలన నెల్లలోకములకు ప్రకాశము, వాయ్వాది పదార్థముల రక్షణమును లభించును. సత్యము వలన నెల్ల వ్యవహారములు నడచుచున్నవి. పర బ్రహ్మమును బొంది, యుత్తమ సుఖము కూడ బొందగలుగుదుము. సత్పురుషులలో గల సత్ పురుషత్వము సత్యాచరణమే. (తపసా దేవా) పూర్వోక్త తపస్సు వలననే విద్వాంసులు దేవదేవుడగు పరమేశ్వరుని బొందుదురు. కామక్రోధాది శత్రువులను జయింతురు. పాపములను విడిచి, ధర్మమున స్థిరులగుదురు. కావున తపస్సు శ్రేష్ఠము. (దమేన...) దమమువలన మానవుడు పాపములను వదలి, బ్రహ్మ చర్యాశ్రమమును నిర్వహించి విద్యనభ్యసించును. కావున దమము కూడ ధర్మమునకొక యుత్తమ లక్షణము. (శమేన....) శమముగల మనుష్యులు శుభము నాచరింతురు. కావున శమము కూడ ధర్మ లక్షణములలో నొకటి. (దానేన...) దానము వలననే యజ్ఞము సంపన్నమగును. దాతల నాశ్రయించి ప్రాణుల జీవనము నడచును. దానము వలన శత్రువులను జయించి మిత్రులుగా జేసికొందురు. కావున నిదియు ధర్మ లక్షణమే యగును. (ధర్మోవి...) సర్వజగత్తుకు ప్రతిష్ఠ ధర్మమే. ధర్మాత్ముని లోకులు విశ్వసింతురు. ధర్మము వలననే మానవులు పాపములు విడుతురు. ఉత్తమ కార్యములన్నియు ధర్మమనియే యెంచబడును. కావున నన్నింటికంటె ధర్మ ముత్తమ మని యెంచవలెను. (ప్రజననం.....) ప్రజననము వలన మానవుల సంఖ్య పెరుగును. పరంపరను నిలిపి జ్ఞానుల సేవ జేయుట వలన ఋణము తీరును. కావున ప్రజననము కూడ ధర్మలక్షణమే. మనుష్యులు పుట్టకున్న ధర్మాచరణ మొనర్చు వారెవరు? కావునను ధర్మము ప్రధానముగ నెఱుగ వలెను. (అగ్నయో వై...) సాంగోపాంగ వేదములను జదువుము. విద్వాంసుల జ్ఞాన మార్గమును బొంది, పృథివి, ఆకాశము, స్వర్గము నను ముల్లోకములకు సంబంధించిన విద్యలను నేర్వనగును. కావున అగ్నులు- వేదములు శ్రేష్ఠము లందురు. (అగ్నిహోత్రం...) అగ్నిహోత్రము మూలమున సాయం ప్రాతః కాలములలో వాయువును, వృష్టి జలమును దుర్గంధము నుండి విడిపించి వేఱు చేసి, సుగంధితములుగ నొనర్చుట వలన నెల్లరకు సుఖ-స్వర్గప్రాప్తి కలుగును. కావున నగ్ని హోత్రము కూడ ధర్మ లక్షణమే. (యజ్ఞ ఇతి) యజ్ఞ విద్యవలననే విద్వాంసులు స్వర్గము-సుఖమును బొందుదురు. శత్రువులను జయించి తమకు మిత్రములుగ జేసి కొందురు. కావున యజ్ఞముకూడ ధర్మమునకు లక్షణమే. (మానసం వై....) మనస్సు శుద్ధమగుటవలననే విద్వాంసులు ప్రజాపతి - పరమేశ్వరుని నెఱింగి నిత్యసుఖమును బొందుదురు. పవిత్రమగు మనస్సువలననే సత్యజ్ఞానము గలుగును. ఆ మనస్సున విజ్ఞానాదులగు నే (ఋషి) గుణములున్నవో వాని మూలమున నీశ్వరుడు, జీవులును తమ తమ ప్రజల నుత్పన్నము చేయుదురు. (మానసఋషి - జ్ఞానము-ప్రాణము మున్నగు వానిమూలమున ప్రజ - సంతానము కలుగును) కావున మనస్సును పవిత్రము; విద్యాయుక్తము జేయుటయు ధర్మమే యగును; ధర్మసాధనమే యగును; మనస్సు పవిత్రమగుటవలననే ధర్మ కార్యము లన్నియు సిద్ధించును. ఇవి యన్నియు ధర్మలక్షణములే. ధర్మమునకు గల లక్షణములలో కొన్ని పూర్వము చెప్పబడినవి. ఇంకను కొన్ని ముందు చెప్పబడును.

*సం॥ "సత్యేన లభ్యస్తపసా హ్యేష ఆత్మా, సమ్యగ్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యమ్, అంతఃశరీరే జ్యోతిర్మయో హి శుభ్రో యం పశ్యంతి యతయః క్షీణదోషాః."* ౧
ముం.ఉ. ౩-౧-౫

*"సత్యమేవ జయతే నానృతం. సత్యేన పంథా వితతో దేవయానః, యేనాక్రమన్త్యృషయో హ్యాప్తకామా యత్ర తత్ సత్యస్య పరమం నిధానమ్,"* ౨
ముం. ౩-౧-౬

అనయోరర్థః – (సత్యేన లభ్యః) సత్యధర్మాచరణేనైవ ఆత్మా పరమేశ్వరో లభ్యో నాన్యథేత్యయం మంత్రః సుగమార్థః.

(సత్యమేవ) సత్యమాచరితమేవ జయతే; తేనైవ మనుష్యః సదా విజయం ప్రాప్నోతి; అనృతే నాధర్మాచరణేన పరాజయం చ. తథా సత్యధర్మేణైవ దేవయానో – విదుషాం యః సదానందప్రదో మోక్షమార్గో ఽస్తి, సోఽపి సత్యేనైవ విస్తృతః ప్రకాశితో భవతి. యేన చ సత్యధర్మానుష్ఠాన ప్రకాశితేన మార్గేణ ఆప్తకామా ఋషయ స్తత్రాక్రమంతి గచ్ఛంతి, యత్ర సత్యస్య ధర్మస్య పరమం నిధాన మధికరణం బ్రహ్మ వర్తతే. తత్ ప్రాప్య నిత్యానందమోక్ష ప్రాప్తా భవంతి. నాన్యథేతి. అతఏవ సత్యధర్మానుష్ఠానం, అధర్మత్యాగశ్చ సర్వైః కర్తవ్య ఇతి.

తె॥ (సత్యేన లభ్యః) సత్యాచరణమనెడి ధర్మానుష్ఠానము, యథార్థజ్ఞానము బ్రహ్మచర్యము మున్నగు శుభగుణములవలన నెల్లరకు నాత్మయగు పరమేశ్వరుడు తెలియబడును. దోషరహితులు – ధర్మాత్ములు, జ్ఞానులునైన సంన్యాసులు చూచు – సాక్షాత్కారము జేసికొను పరమేశ్వరుడు శుద్ధుడు; ప్రకాశస్వరూపుడు; ఎల్లరి యాత్మలకు నాత్మ. అతని యాజ్ఞలనే యెల్లరు పరిపాలింపవలెను.

(సత్యమేవ...) సత్యము నాచరించువాడే యెల్లపుడు విజయమును, సుఖమును బొందును. మిథ్యాచారి – అసత్యకర్మముల నాచరించువాడు, సతతము పరాజయమును, దుఃఖమును బొందును. విద్వాంసుల కానందము నొసంగు మోక్షమార్గము కూడ సత్యాచరణము వలననే ప్రకటమగును. ఆ మార్గముననే నడచి యాప్తకాములైన ఋషులు, ధర్మాత్ములైన విద్వాంసులు సత్యసుఖము ననుభవింతురు. నిత్యము ప్రకాశించు బ్రహ్మముయొక్క సత్యస్వరూపమగు సుఖమును కూడ సత్యాచరణమువలననే వారు పొందుదురు. అసత్యము వలన నెన్నడును బొందజాలరు. కావున నెల్లరు సత్యధర్మము నాచరించి యసత్యమును త్యజింపవలెను.

సం॥ అన్యచ్చ, "చోదనాలక్షణోఽర్థో ధర్మః" ౧ పూ.మీ. ౧–౧–౨

"యతోఽభ్యుదయ నిఃశ్రేయస సిద్ధిః స ధర్మః, ' ౨ వై.ద.౧–౧–౨

అనయో రర్థః – (చోదనా) వేదద్వారా యా సత్యధర్మాచరణస్య ప్రేరణాఽస్తి తయైవ సత్యధర్మో లక్ష్యతే. యోఽనర్థా దధర్మాచరణాద్ బహిరస్తి, అతో ధర్మాఖ్యాం లబ్ధ్వాఽర్థో భవతి. యస్యేశ్వరేణ నిషేధః క్రియతే, సోఽనర్థరూపత్వా దధర్మోఽయమితి జ్ఞాత్వా సర్వై ర్మనుష్యై స్త్యాజ్య ఇతి. ౧

(యతోఽభ్యుద) యస్యాచరణా దభ్యుదయః–సాంసారిక మిష్టసుఖం సమ్యక్ ప్రాప్తం భవతి, యేన చ నిఃశ్రేయసం – పారమార్థికం మోక్షసుఖం చ, స ఏవ ధర్మో విజ్ఞేయః; అతో విపరీతో హ్యధర్మశ్చ. ఇదమపి వేదానామేవ వ్యాఖ్యాన మస్తి.

ఇత్యనేక మంత్రప్రమాణ సాక్ష్యాది ధర్మోపదేశో వేదేష్వీశ్వరేణ సర్వమనుష్యార్థ ముపదిష్టోఽస్తి. ఏక ఏవాయం సర్వేషాం ధర్మోఽస్తి. నైవచాస్మాద్ ద్వితీయోఽస్తీతి వేదితవ్యమ్.

ఇతి వేదోక్త ధర్మవిషయః సంక్షేపతః సమాప్తః

తె॥ రెండు సూత్రములకు నర్థము :–

(చోదనా) వేదములం దీశ్వరుడు మానవుల కేదిచేయుట కాజ్ఞాపించియున్నాడో, ప్రేరణ చేసియున్నాడో యదియే ధర్మము; ఏదిచేయరానిదని నిషేధించియున్నాడో యది యధర్మము. కాని,

యా ధర్మము అర్థయుక్తము - అధర్మాచరణ మనెడి యనర్థము లేనిదిగనుండును. ఈశ్వరుడు దేనిని నిషేధించియున్నాడో యది యనర్థరూపమగుటచే నధర్మమనబడును. ఇట్లు తెలిసికొని మానవులెల్లరు నధర్మమును విడిచి, ధర్మము నాచరింపవలెను. అదియే మానవత.

(యతోఽభ్యు) దేని నాచరించుటవలన లోకమునం దుత్తమసుఖము, నిః శ్రేయసము - మోక్షసుఖము, లభించునో, యదియే ధర్మము. ఇదియును వేదవ్యాఖ్యానమే.

ఇట్టి యనేక వేదమంత్ర ప్రమాణములను, ఋషులయు, మనులయు సాక్ష్యములను జూచినపుడు, 'ఈశ్వరుడు మనుష్యులకు హితమొనర్చుటకై వేదములందు ధర్మము నుపదేశించి, నట్లు తెలియుచున్నది. కావున మానవులెల్లరు నీ ధర్మమునే యాచరింపవలెను. దీనింబట్టి మానవులకెల్లరకు ధర్మమొక్కటియే యనియు, దీనికి భిన్నమైనది మఱియొండు లేదనియు విదితమగుచున్నది. దీనికి భిన్నముగా నెంచువాడు మిథ్యావాదియు, నజ్ఞానియు నగుచున్నాడు. ఇట్లే యధర్మమును గూర్చియు నెఱుగనగును.

వేదోక్త ధర్మవిషయము సంక్షేపముగ తెలుపబడినది.

# అథ సృష్టి విద్యావిషయః

(సంక్షేపతః)

సం॥ "నాసదాసీ న్నో సదాసీత్తదానీం నాసీద్రజో నో వ్యోమాఽపరో యత్
కిమావరీవః కుహకస్య శర్మ న్నంభః కిమాసీద్ గహనం గభీరమ్." ౧

"న మృత్యు రాసీదమృతం న తర్హి న రాత్ర్యా అహ్న ఆసీత్ ప్రకేతః,
ఆసీదవాతం స్వధయా తదేకం తస్మాద్ధాన్య న్నపరః కించనాస." ౨

"తమ ఆసీత్తమసా గూఢమగ్రేఽ ప్రకేతం సలిలం సర్వమా ఇదమ్,
తుచ్ఛ్యే నాభ్వపిహితం యదాసీత్తపసస్తన్మహినా జాయతైకమ్." ౩

"కామస్తదగ్రే సమవర్తతాధిమనసో రేతః ప్రథమం యదాసీత్,
సతో బంధు మసతి నిరవిందన్ హృది ప్రతీష్యా కవయో మనీషా' ౪

"తిరశ్చీనో వితతో రశ్మిరేషా మధఃస్వి దాసీ౩దుపరి స్విదాసీ౩త్,
రేతోధా ఆసన్ మహిమాన ఆసన్త్స్వధా అవస్తాత్, ప్రయతిః పరస్తాత్." ౫

"కో అద్ధా వేద క ఇహ ప్రవోచత్ కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః
అర్వాగ్దేవా అస్య విసర్జనే నాథా కో వేద యత ఆబభూవ." ౬

"ఇయం విసృష్టిర్ యత ఆబభూవ యది వా దధే యది వా న,
యో అస్యాధ్యక్షః పరమే వ్యోమన్త్సోఽఙ్గ వేద యది వా న వేద" ౭

ఋగ్, అ. ౨౮. ౭వ. ౧౭ మం. ౧ నుండి ౭

ఏతేషా మభిప్రాయార్థః–

యదిదం సకలం జగద్ దృశ్యతే, తత్ పరమేశ్వరేణైవ సమ్యగ్ రచయిత్వా. సంరక్ష్య, ప్రలయావసరే వియోజ్య చ వినాశ్యతే, పునఃపున రేవ మేవ సదా క్రియత ఇతి.

(నాసదాసీత్) యదా కార్యం జగన్నోత్పన్న మాసీత్తదాఽసత్ సృష్టేఃప్రాక్ శూన్యమాకాశ మపి నాసీత్.

పూః కుతః?

ఉ : తద్వ్యవహారస్య వర్తమానాభావాత్ (నో సదాసీత్తదానీం) తస్మిన్ కాలే సత్ – ప్రకృత్యాత్మక మవ్యక్తం సత్ సంజ్ఞకం య జ్జగత్ కారణం, తదపి నో ఆసీత్ – నావర్తత. (తద్వ్యవహారస్య వర్తమానాభావాత్. అజాతపుత్రే దేవదత్తే పితృత్వ వ్యవహారాభావాత్. పితా నాస్తీతి వ్యవహారవత్. తత్త్వాంతరాభావే తత్త్వాంతరోపాదనత్వరూప ప్రకృతిత్వ వ్యవహారాభావాత్, సత్యపి స్వరూపతో జగత్కారణే 'ప్రకృత్యాత్మక మవ్యక్తన్నాసీత్)
సంపాదకలేఖనమ్

(నాసీద్ర) పరమాణావోఽపి నాసన్ తద్వ్యవహారస్య వర్తమానాభావాత్, పరమాణువ్యవహారస్య అణువ్యవహారసాపేక్షత్వాత్, అణోశ్చేదానీ మనుత్పన్నత్వాత్, తత్షష్టితమ భాగరూప పరమాణు వ్యవహారానవకాశాత్. 'పరమాణువ్యవహారో నాసీత్' ఇత్యభిప్రాయేణ "పరమాణావోఽపి నాసన్నిత్యుక్తిర్ నానంగతా 'అణోః షష్టితమో భాగః పరమాణురి' త్యత్ర నత్యార్థ ప్రకాశాష్టమసముల్లాసే శ్రీ దయానందస్వామినః సృష్ట్యుత్పత్తి ప్రక్రియాసందర్భోఽప్యనుసంధేయః. తథైవాత్రాపి ప్రసిద్ధాఽప్యుక్తిః.

"జాలాంతరగతే భానౌ సూక్ష్మం యద్దృశ్యతే రజః

తస్య షష్టితమో భాగః పరమాణుః స ఉచ్యతే." (సంపాదకః)

(నో వ్యోమాపరో యత్)వ్యోమాకాశమపరం యస్మిన్ విరాడాఖ్యే, సోఽపి నో ఆసీత్. కింతు పరబ్రహ్మణః సామర్థ్యాఖ్య మతీవ సూక్ష్మం సర్వస్యాస్య పరమకారణసంజ్ఞకమేవ తదానీం సమవర్తత. (కి మావరీవః) యత్ ప్రాతః కుహకస్య వర్షాకాలే ధూమాకారేణ వృష్టం కంచిజ్జలం వర్తమానం భవతి. యథా నైతజ్జలేన పృథివ్యావరణం భవతి, నదీప్రవాహాదికం చ చలతి అతఏవోక్తం తజ్జలం గహనం గభీరం కిం భవతి? నేత్యాహ. కింత్వావరీవః, ఆవరకమాచ్ఛాదకం భవతి నైవ కదాచిత్. తస్యాతీవాల్పత్వాత్. తథైవ సర్వం జగత్ తత్సామర్థ్యా దుత్పద్యాస్తి. తచ్ఛర్మణి శుద్ధే బ్రహ్మణి కిం గహనం గభీర మధికం భవతి? నేత్యాహ. అతస్తద్ బ్రహ్మణః కదాచిన్నై వావరకం భవతి.

పూః కుతః?

ఉః "జగతః కించిన్మాత్రత్వాద్ బ్రహ్మణోఽనంతత్వాచ్చ" న మృత్యురాసీదిత్యాదికం సర్వం సుగమార్థమ్; వీషామర్థం భాష్యే వక్ష్యామి.

(ఇయం విసృష్టిః) యతః పరమేశ్వరా దియం ప్రత్యక్షా విసృష్టిర్వివిధా సృష్టి రాబభూవోత్పన్నాఽఽసీ దస్తి. తాం స ఏవ దధే ధారయతి రచయతి, యది వా వినాశయతి, యది వా న రచయతి, యోఽస్య సర్వ స్యాధ్యక్షః స్వామీ. (పరమే వ్యోమన్) తస్మిన్ పరమాకాశాత్మని పరమే ప్రకృష్టే. పరమే వ్యోమవద్ వ్యాపకే పరమేశ్వర ఏ వేదానీ మపి సర్వా సృష్టిర్ వర్తతే ప్రలయావసరే సర్వస్యాదికారణే పరబ్రహ్మ సామర్థ్యే ప్రలీనా చ భవతి. (సోఽధ్యక్షః) స సర్వాధ్యక్షః పరమేశ్వరోఽస్తి. (అఙ్గవేద) హే అఙ్గ ! మిత్ర! జీవ ! తం యో వేద, స విద్వాన్ పరమానంద మాప్నోతి. యది తం సర్వేషాం మనుష్యాణాం పరమిష్టం సచ్చిదానందాది లక్షణం నిత్యం కశ్చిన్నైవ వేద, వా నిశ్చయార్థే, స పరమం సుఖమపి నాప్నోతి. ౭

తె॥ పరమేశ్వరుడే యీ సంపూర్ణ విశ్వమును సృష్టించును; రక్షించును; ప్రళయ కాలమున నాశ మొనర్చును. ఈ సృష్టి స్థితిలయ చక్రము ఎల్లపుడు నడచుచునే యుండును.

(నా సదాసీత్) ఈ కార్య సృష్టి యేర్పడుటకు ముందు సర్వశక్తిమంతుడగు పరమేశ్వరుడు, జీవాత్మలు, జగత్కారణము – జగత్తును నిర్మించుటకు వలయు సామగ్రియు నుండెను. అపుడు (అసత్) శూన్యము–ఆకాశము – కంటికి కనబడనిది కూడ లేకుండెను.

పూ : ఎందువలన?

ఉ : ఆ సమయమున దాని వ్యవహారమే లేకుండెను. (నో సదాసీత్తదానీమ్) ఆ సమయమున, (సత్) సత్వగుణము, రజోగుణము, తమోగుణము నను పేరుగల ప్రకృతికి సంబంధించిన వ్యవహారము కూడ లేదు. (జగత్తున కుపాదాన కారణము 'ప్రకృతి' యనబడును. ప్రకృతి యున్నదను వ్యవహారము

కార్యజగత్తేర్పడినపుడే యుండును. దేని నుండి 'మఱియొక తత్త్వ ముత్పన్నమగునో యది ప్రకృతి' యని దార్శనికులు వ్యవహరింతురు. పుత్రుడు కలుగనంతవఱకు తండ్రి తండ్రియని వ్యవహరింపబడడు. పుత్రుడు కలిగిన తరుపరి తండ్రి పిత యని పిలువబడును. ఇట్లే యెటనైన ప్రకృతి యుత్పన్నమైనదను ప్రయోగము లభించిన 'నట కార్యోత్పత్తికి తరువాతనే 'ప్రకృతి' శబ్దప్రయోగము చేయబడినట్లు తెలియనగును' (అని మూల గ్రంథ సంపాదకుడు)

(నాసీద్రజః) ఆ సమయమున పరమాణువుల వ్యవహారమును లేదు. పరమాణు పద వ్యవహార మణు వ్యవహారమునకు తరువాతనే యేర్పడును. (౬౦) అఱువది పరమాణువులు కలిసి యొక 'అణు' వగును. అణు వేర్పడకముందు దాని యఱువదియవ అంశమగు పరమాణు వ్యవహారమెట నుండగలదు? ౬౦ పరమాణువు లొక యణువగునని సత్యార్థ ప్రకాశపు టెనిమిదవ సముల్లాసమున దయానంద స్వాములు వ్రాసియుండిరి. కావున 'పరమాణవోఽపి నాసన్' అను వాక్యమునకు పై అనువాదము చేయబడినది. అణువులలో నఱువది యవ భాగము పరమాణువు. దీనిని దెలుపు ప్రసిద్ధశ్లోక మొకటి యున్నది.

"జాలాంతరగతే భానౌ సూక్ష్మం యద్ దృశ్యతే రజః

తస్య షష్టితమో భాగః పరమాణుః స ఉచ్యతే."

"కిటికీ నుండి లోపల ప్రవేశించు సూర్యకాంతిలో గనబడు నలకలలో నఱువదియవ యంశము పరమాణువని చెప్పబడును." అట్లే (నోవ్యో) విరాట్టు- సమస్త స్థూలజగత్తుకు నివాస స్థానము-ఆధారము కూడ నప్పుడు లేదు.

(ఇట విరాట్టు పదమునకు సర్వ శరీరములకు చెందిన సమష్టి దేహమని యర్థము గ్రహింపవలెను. ఇదియే సంపూర్ణ సృష్టికి నాధారము. సర్వ బ్రహ్మాండము దీనికి శరీరమని భావము. సూర్య చంద్రులు నేత్రములు, వాయువు ప్రాణము, భూమి పాదములు. విరాట్ పదమునకు దయానందస్వామి 'తతో విరాడజాయత' అను మంత్ర వ్యాఖ్యానమున నీ యర్థమే వివరించిరి.)

ఆ సమయమున స్థూల జగత్తునకు సూక్ష్మోపాదాన కారణము - పరమేశ్వరుని సామర్థ్యము లేక సంపత్తి - పరమేశ్వరుని కంటె భిన్నముగ నింకొకటి యుండెను.

(సృష్టి యేర్పడుటకు పూర్వము జగత్తునకు ఉపాదాన కారణమును ప్రకృతియని కాని, పరమాణువు లని కాని వ్యవహరింపననువుగానిచో, ఏ నామము వ్యవహరింపదగియుండెనను ప్రశ్న యుదయించును. దానికి సమాధానముగ మహర్షి దయానందులు 'బ్రహ్మ సామర్థ్య' మని చెప్ప వచ్చునని యీ మంత్ర వ్యాఖ్యానమున సూచించి యున్నారు. సంస్కృత సాహిత్యమున రాజ సేనను 'రాజబల' మని వ్యవహరింతురు. సేన రాజుకంటె భిన్నమైనను రాజబలమను పేరుతో వ్యవహరింతురు. దానితోనే రాజు విజయమును సంపాదించును. అట్లే స్థూల జగత్తునకు, సృష్టికి, ఉపాదాన కారణమగు ప్రకృతి పరమేశ్వరుని కంటె భిన్నమే. అయినను, నది పరమేశ్వరుని సామర్థ్యము - సంపత్తి యనదగును దాని నుండియే యీ కార్య జగత్తును పరమేశ్వరుడు సృష్టించును. కావున సృష్టికి పూర్వము - ప్రళయ కాలమున పరమేశ్వరుడు కాక ప్రకృతి - అతని సామర్థ్యము, ఒకటి పరమేశ్వరునకు భిన్నముగ నున్నదను వ్యాఖ్యానము సముచితమే.)

(కిమావరీః) ఈ వర్తమాన జగత్తు కూడ ననంతము, శుద్ధమునగు బ్రహ్మమును గప్ప జాలదు. అంతకంటె నధికముగాని, అగాధము కాని కాజాలదు- మంచు భూమిని కప్పి పుచ్చ జాలనట్లు, నదిలో ప్రవాహమును గల్పింప జాలనట్లు ఈప్రపంచము కూడ పరమేశ్వరునికంటె నధికమై యతని కావరణము గలిగింప జాలదని తెలియుచున్నది.

పూ : ఎందువలన?

ఉ : పరమేశ్వరుడు అనంతుడు. అతనిచే నిర్మింపబడిన యీ జగత్తు నతనితో బోల్చిన నత్యల్పమగును.

(న మృత్యు...) జగత్తు లేనపుడు మృత్యువును లేకుండెను. జగత్తు సంయోగముచే నేర్పడియున్నపుడు శరీరాదుల వియోగ మేర్పడు నవకాశముండును. ఈ వియోగమునకే మృత్యువని పేరు. కావున స్థూల జగత్తేర్పడుటకు ముందు మృత్యువునకు స్థానమెక్కడినుండి వచ్చును? మృత్యువు లేనపుడమరత్వము కూడ నుండదు. (రాత్ర్యాఽహ్న:) రాత్రింబవళ్ళను విభాగమునకు సంబంధించిన (ప్రకేత) జ్ఞానము కూడ లేదు. అపుడు ఒక యాత్మతత్త్వము (స్వధయా) తన శక్తితో - స్వధా= మూలకారణముతో ప్రాణవాయువులేని చేతనము మాత్రముండెను. దానికి భిన్నముగ కొండొక శ్రేష్ఠ వస్తువు లేదని నిశ్చయముగ నెఱుగుము.

(తమ ఆసీదితి) ఈ జగత్తంతయు సృష్టికి పూర్వమున నంధకారముతో నావృతమై, రాత్రి రూపమున నెఱుగుట కనర్హమై యుండెను. ఈ జగత్తంతయు నాకాశ రూపమున నుండెను. పరమేశ్వరున ందేక దేశమున తుచ్ఛమై-అల్పమై, ఆచ్ఛాదితమై యుండెను. తదుపరి పరమేశ్వరుడు తన సామర్థ్యముచే కారణ రూపమున నున్న జగత్తును - ప్రకృతిని - కార్య రూపమున - స్థూల జగద్రూపమున నొనర్చెను.

(కామస్తదగ్రే) ఈ ప్రథమ సమయమున మనఃశక్తి యొకటి యుండెను. దానిలో సంకల్ప ముదయించెను. దానితో సమస్త జగత్తు నేర్పడెను. సత్, అసత్ - చేతనము, జడము, ఆత్మ, అనాత్మ అను వీనిలో పరస్పర బంధుత్వము - సంబంధము కలదని జ్ఞానులు తెలిసి కొనిరి. జ్ఞానులు దూరదృష్టితోను, సూక్ష్మ బుద్ధితోను తమ హృదయములందే యాథార్థ్యము నెఱుగుదురు. కావుననే చేతనమగు నాత్మ సంకల్పము జడమగు మనస్సుతో గలిసి కార్య మొనర్పగలదు.

(తిరశ్చీనో) పరమాత్మ, జీవాత్మ, జగత్తునకు మూల కారణమగు ప్రకృతి- అను నీ మూడింటి తేజఃకిరణ మొకటి యన్ని వైపుల వ్యాపించెను. అయ్యది పైన, క్రింద, నాలుగు వైపుల నాశ్చర్య కారకమయ్యెను. బలమును ధరించి, పోషించు జీవులనేకులు గలరు. ఆత్మలో మొదటి నుండియు నిజధారణశక్తియు, నంతము వఱకు నడచు ప్రయత్నమును నున్నవి. (కో అద్ధా.....) మనుష్యులకు జగత్తును రచించుటకు వలయు ప్రక్రియ సాక్షాత్తుగ తెలియదు. సృష్ట్యుత్పత్తి విషయమున ప్రత్యక్ష జ్ఞానము కలుగుట యసంభవము. సూర్యచంద్రాది కాంతిమంతములగు పదార్థములేర్పడుటకు పూర్వమే సృష్టి ప్రారంభమై యుండెను. అది యెప్పుడు ప్రారంభమైనదో, యెక్కడి నుండి ప్రారంభమైనదో మనుష్యుడెవ డెఱుగగలడు ?

(ఇయం విసృష్టిః) ఈ నానా విధములగు జగత్తును రచియించిన పరమేశ్వరుడే దీనిని ధరించును; నాశనము జేయును, అతడే దీనికి స్వామి. మిత్రములార! పరమేశ్వరుని బుద్ధితో దెలిసికొనినవారే యతనిని బొందుదురు. ఎఱుగని వాడు దుఃఖమున బడియుండును. పరమేశ్వరుడాకాశము వలె వ్యాపకుడు. అతనియందే సమస్తజగత్తు నివసించు చున్నది. ప్రళయమునను కారణ రూపమున నీశ్వరుని సామర్థ్యము నందే యుండును. మరల నతని వలననే యుత్పన్నమగును.

సం॥ "హిరణ్య గర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్,

స దాధార పృథివీం ద్యా ముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ" ౮

ఋ.అ.౮, ౭-౩-౧

(హిరణ్యగర్భః) అగ్రే సృష్టేః ప్రాక్, హిరణ్యగర్భః పరమేశ్వరో జాతస్యోత్పన్నస్య జగత ఏకోఽద్వితీయః పతిరేవ సమవర్తత. స పృథివీ మారభ్య ద్యుపర్యంతం సకలం జగద్రచయిత్వా (దాధార) ధారితవానస్తి. తస్మై సుఖ స్వరూపాయ దేవాయ హవిషా వయం విధేమేతి. ౮

తె॥ (హిరణ్య....) పరమేశ్వరు డొక్కడే సృష్టికి పూర్వముండెను. అతడే సమస్త జగమునకు స్వామి. అతడే భూమి మొదలు సూర్యుని వఱకు గల సర్వ జగత్తును రచియించి ధరించుచున్నాడు. కావున నా సుఖ స్వరూపుడగు దేవునే మన మెల్లరము నుపాసింపవలెను. ఇతరు నుపాసింపరాదు.

సం॥ "సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్,
స భూమిగ్ం సర్వతః స్పృత్వాఽత్యతిష్ఠ ద్దశాంగులమ్.' ౯ యజు. ౩౧.౧

(సహస్రశీర్షా....) అత్ర మంత్రే పురుష ఇతి పదం విశేష్య మస్తి. సహస్ర శీర్షేత్యాదీని విశేషణాని చ. అత్ర పురుషశబ్దార్థే ప్రమాణాని– "పురుషం పురిశయ ఇత్యాచక్షీరన్." ని.౧–౧౧

(పురి) పురి సంసారే శేతే సర్వమభివ్యాప్య వర్తతే, స పురుషః పరమేశ్వరః.

పురుషః పురిసాదః పురిశయః, పూరయతేర్ వా. పూరయత్యంతరి త్యంతర పురుష మభిప్రేత్య– "యస్మాత్ పరం చాపరమస్తి కించిద్, యస్మాన్నాణీయో న జ్యాయోఽస్తి కించిత్, వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠ త్యేక స్తేనేదం పూర్ణం పురుషేణ సర్వం" ఇత్యపి నిగమో భవతి. ని. అ.౨ ఖం. ౩

(పురుష.) పురి సర్వస్మిన్ సంసారేఽ భివ్యాప్య సీదతి వర్తత ఇతి. (పూరయతేర్ వా) యః స్వయం పరమేశ్వర ఇదం సర్వం జగత్ స్వరూపేణ పూరయతి వ్యాప్నోతి తస్మాత్ స పురుషః (అంతరితి) యో జీవస్యాప్యంతర్ మధ్యేఽభివ్యాప్య పూరయతి తిష్ఠతి స పురుషః, త మంతర పురుష మంతర్యామినం పరమేశ్వర మభిప్రేత్యేయమ్ ఋక్ ప్రవృత్తాస్తి, (యస్మాత్పరం) యస్మాత్ పూర్ణాత్ పరమేశ్వరాత్ పురుషాఖ్యాత్ పరం ప్రకృష్ట ముత్తమం కించిదపి వస్తు నాస్త్యేవ; తథా యస్మా దణీయః సూక్ష్మం, జ్యాయః స్థూలం మహద్వా, కించిదపి ద్రవ్యం న భూతం; న భవతి; నైవ చ భవిష్య తీత్యవధేయమ్. యః స్తబ్ధో నిష్కంపః సర్వస్యాస్థిరతాం కుర్వన్సన్ స్థిరోఽస్తి, క ఇవ? (వృక్ష ఇవ) యథా వృక్షః శాఖాపత్ర పుష్పఫలాదికం ధారయన్ తిష్ఠతి, తథైవ పృథివీ సూర్యాదికం సర్వం జగద్ ధారయన్, పరమేశ్వరోఽ భివ్యాప్య స్థితో ఽస్తీతి. యశ్చైకోఽద్వితీయోఽస్తి నాస్య కశ్చిత్ సజాతీయో విజాతీయో వా ద్వితీయ ఈశ్వరోఽస్తీతి. తేన పురిషేణ పురుషేణ పరమాత్మనా యత ఇదం సర్వం జగత్ పూర్ణం కృతమస్తి, తస్మాత్ పురుషః పరమేశ్వర ఏవోచ్యతే. ఇత్యయం మంత్రో నిగమో నిగమనం పరం ప్రమాణం భవతీతి వేదితవ్యమ్.

"సర్వం వై సహస్రగ్ం సర్వస్య దాతాఽసీదిత్యాది." శత. ౭.౫

(సర్వం) సర్వమిదం జగత్ సహస్రనామక మస్తీతి విజ్ఞేయమ్.

(సహస్రశీ) సహస్రాణ్యసంఖ్యాతా న్యస్మ దాదీనాం శిరాంసి యస్మిన్ పూర్ణే పురుషే పరమాత్మని, స సహస్రశీర్షా పురుష ః (సహస్రాక్షః స) అస్మదాదీనాం యస్మిన్ సహస్రాణ్యక్షీణ్యస్మిన్, ఏవ మేవ సహస్రాణ్యసంఖ్యాతాః పాదాశ్చ వర్తంతే, స సహస్రాక్ష ః సహస్రపాచ్చ ( స భూమిం సర్వతః స్పృత్వా) స పురుషః పరమేశ్వరః సర్వతః సర్వేభ్యో బాహ్యాంతర్దేశేభ్యో ( భూమిరితి) భూతానా ముపలక్షణం,

భూమి మారభ్య ప్రకృతి పర్యంతం సర్వం జగత్ స్పృత్వాఽభివ్యాప్య వర్తతే (అత్య) దశాంగులమితి బ్రహ్మాండ హృదయయో రుపలక్షణమ్. అంగుల మిత్యవయవోప లక్షణేన మితస్య జగతోఽత్ర గ్రహణం భవతి.పంచ స్థూల భూతాని, పంచసూక్ష్మాణి చైత దుభయం మిలిత్వా, దశావయవాఖ్యం సకలం జగదస్తి. అన్యచ్చ – పంచప్రాణాః, సేంద్రియం చతుష్టయ మంతఃకరణం. దశమో జీవశ్చ, ఏవమేవాన్యదపి. జీవశ్చ హృదయం దశాంగుల పరిమితం చ తృతీయం గృహ్యతే. ఏతత్ త్రయం స్పృత్వా వ్యాప్యాత్యతిష్ఠత్. ఏతస్మాత్ త్రయాద్ బహిరపి వ్యాప్తః సన్నవస్థితః, అర్థాత్ బహిరంతశ్చ పూర్ణో భూత్వా పరమేశ్వరోఽ వతిష్ఠత ఇతి వేద్యమ్.

తె॥ (సహస్రశీ) ఈ మంత్రమున 'పురుష' శబ్దము విశేష్యము. ఇతర 'సహస్రశీర్షా' మున్నగు పదములన్నియు దానికి విశేషణములు. నిరుక్తమున జెప్పిన వ్యుత్పత్తిననుసరించి యీ సమస్త జగత్తున పూర్ణుడై యుండువాడు పురుషుడనబడును. తన వ్యాపకత్వముతో జగత్తును నింపు వాడు– పూరించువాడు పురుషుడని భావము. పురమునకు బ్రహ్మాండ మని కాని, శరీరమని కాని యర్థము. వానియందు సర్వత్ర వ్యాప్తుడై జీవులలోను వ్యాపకుడై యుండువాడు పురుషుడు. అంతర్యామి యనబడును. ఈ యంతర్యామి యను నర్థమును నిరూపించుటకు యాస్కముని యుల్లేఖించిన ప్రమాణముల కర్థమీ క్రింది పంక్తులలో జదువుడు.

(యస్మాత్ పరం) పూర్ణుడగు నా పరమేశ్వరుని కంటె నుత్కృష్టుడు–గొప్పవాడు–కాని, పూర్వుడు కాని మఱియొకడు లేడు. ( నాపర మస్తి) అతనికి సమానమైన వస్తువు కాని, యుత్తమమగు వస్తువుకాని, యతనికి తరువాత మిగిలియుండు వస్తువు కాని యింకొకటి లేదు. అతని కంటె సూక్ష్మమగు వస్తువు కాని, గొప్ప వస్తువు కాని లేదు; ఉండబోదు; ఉండియుండదు. ఆ పరమేశ్వరుడను పదార్థము స్థిరమైనది. వృక్షము పత్రపుష్పఫలములను, కొమ్మలను ధరించి స్థిరముగ నుండునట్లు పరమేశ్వరుడు పృథివ్యాది సూర్యపర్యంత సమస్త బ్రహ్మాండమును ధరించి యందు వ్యాపకుడై, స్థిరుడై యున్నాడు. అతడద్వితీయుడు. అతనికి సజాతీయుడు కాని, విజాతీయుడు కాని యీశ్వరుడింకొకడు లేడు. అతడే సంపూర్ణ జగత్తునందు పూర్ణుడై వ్యాప్తుడై యున్నాడు; కావున పురుషుడనబడును. పురుష శబ్దార్థమునకు నిరుక్తాది ప్రమాణములు సంస్కృతమున వ్రాయబడినవి. అందు జూడనగును. శత పథమున సంపూర్ణ జగత్తునకు, అసంఖ్యాతకు నామము 'సహస్ర' మని చెప్పబడినది.

(సహస్రశీ) ఎవనిలో సంపూర్ణ విశ్వమునందలి ప్రాణుల యసంఖ్య శిరస్సులు, నేత్రములు పాదములు నున్నవో యతడు ఆ పరమేశ్వరుడు సహస్రశీర్షుడు, సహస్రాక్షుడు, సహస్రపాదుడు ననబడును. అతడనంతుడు. ఆకాశమున సర్వ పదార్థములు నుండును. కాని, యాకాశము వాని నంటకయుండును– దేనిచేతను నది బంధింపబడదు. అట్లే పరమేశ్వరునియందు సర్వము నుండును. కాని, యతడు దేనికిని బద్ధుడు కాడని యెఱుంగనగును.

(స భూమిగ్ం సర్వతః స్పృత్వా) ఆ పురుషుడు సమస్త జగత్తు నంతటను స్పృశించుచు పూర్ణుడై పృథివ్యాది సర్వ లోకములను ధరించు చున్నాడు. (అత్యతిష్ఠత్) దశాంగుల పదము బ్రహ్మాండమునకును, హృదయమునకును వాచకము – నామము. అంగుల పద మవయవ (అంగ) బోధకము కావున నీ పదముచే నిట స్థిమిత ప్రపంచము గ్రహింప నగును. పంచస్థూల భూతములు, పంచ సూక్ష్మ భూతములు కలిసి పది దశ– జగత్తున కవయవములు. పంచ ప్రాణములు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, జీవుడు నను పదియు నవయవములుగ గ్రహింపనగును. శరీరమున హృదయము కూడ దశాంగుళ పరిమాణము గలదిగ నెంచబడును. ఇట్లు దశాంగుళపదముచే జగత్తు ప్రాణాదులు, హృదయము నను మూడును గ్రహింపవచ్చును.

పరమేశ్వరుడీ మూడింటియందును పూర్ణుడై యున్నాడు. కావున పురుషుడనబడును. దశాంగుల పద వాచ్యములయిన జగదాదుల నుల్లంఘించి-యతిక్రమించి స్థిరుడై యున్నాడు; కావున నతడే యీ జగత్తును రచించువాడునై యున్నాడు.

సం॥ "పురుష ఏవేదగ్ం సర్వం యద్ భూతం యచ్చ భావ్యం

ఉతామృతత్వస్యేశానో యదన్నేనాతి రోహతి." ౧౦ యజు. ౩౧—౨

(పురుష ఏవేదం) ఏతద్విశేషణ యుక్త పురుషః పరమేశ్వరః (యద్ భూతం) యజ్జగదుత్పన్నమభూత్. యద్ భావ్య ముత్పత్స్య మానం 'చ' కారాద్ వర్తమానం చ, తత్ త్రికాలస్థం సర్వం విశ్వం, పురుష ఏవ కృతవానస్తి; నాన్యః నైవాతో హి పరః కశ్చిజ్జగద్రచయితాఽస్తీతి నిశ్చేతవ్యమ్. ఉతాపి స ఏవేశాన ఈషణశీలః, సర్వస్యేశ్వరోఽమృతత్వస్య మోక్షభావస్య స్వామీ దాతాస్తి. నైవైతద్దానే కస్యాప్యన్యస్య సామర్థ్యమస్తీతి. పురుషో యద్ యస్మాదన్నేన పృథివ్యాదినా జగతా సహాతిరోహతి వ్యతిరిక్తస్సన్ జన్మాదిరహితోఽస్తి. తస్మాత్ స్వయమజః సన్ సర్వం జనయతి. స్వసామర్థ్యాది కారణాత్ కార్యం జగదుత్పాదయతి. నాస్యాదికారణం కించిదస్తి, కించ సర్వస్యాదినిమిత్త కారణం పురుషఏవాస్తీతి వేద్యమ్. ౧౦

తె॥ (పురుష ఏవేదం) పూర్వ మంత్రమున వర్ణింపబడిన పురుషుడేపరమేశ్వరుడే పూర్వముత్పన్నమైనట్టియు, ఇప్పుడుత్పన్నమగు చున్నట్టియు, నికముందుత్పన్నము కానున్నట్టియు జగత్తును రచించువాడై యున్నాడు. అతడుతక్క మరియొకడెవడును నీజగత్తును రచించువాడు లేడు. అతడు (ఈశానః) సర్వశక్తిమంతుడు. (అమృతత్వస్య) మోక్షము నొసంగువాడును నతడే. (అన్నేన) అతడీ జగత్తుతో బాటు వ్యాపకుడై యుండుటయే కాక, జగత్తునకు వేఱుగ దీనిని మించియు నున్నాడు. అతనికి జన్మాదులు లేవు. అతడే తన యాదినిమిత్తభూత సామర్థ్యము నుండి సమస్తజగత్తు నుత్పన్నము చేయును. స్వయముగ నెన్నడు జన్మింపడు. అతని కాదికారణమొండును లేదు. అతడే సమస్త సృష్టికి నాది నిమిత్త కారణము. ౧౦

సం॥ "ఏతావానస్య మహిమాఽతో జ్యాయాంశ్చ పూరుషః

పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి." ౧౧ యజు. ౩౧—౩

(ఏతావాన్) అస్య పురుషస్య భూత భవిష్యద్ వర్తమానస్థో యావాన్ సంసారోఽస్తి. తావాన్ మహిమా వేదితవ్యః.

పూ : ఏతావానస్య మహిమాస్తి చేత్తర్హి తస్య మహిమ్నః పరిచ్ఛేద ఇయత్తా జాతేతి గమ్యతే?

ఉ : అత్ర బ్రూతే. (అతో జ్యాయాంశ్చ పూరుషః) నైతావాన్మాత్ర ఏవ మహిమేతి. కింతర్హి! అతోఽప్యధికతమో మహిమానంత స్తస్యాస్తీతి గమ్యతే. అత్రాహ. (పాదోఽస్య) అస్యానంత సామర్థ్యస్యేశ్వరస్య (విశ్వా) విశ్వాని ప్రకృత్యాది పృథివీ పర్యంతాని సర్వాణిభూతాన్యేకః పాదోఽస్తి. ఏకస్మిన్ దేశాంశే సర్వం విశ్వం వర్తతే, (త్రిపాదస్యా) అస్య దివి ద్యోతనాత్మకే స్వస్వరూపేఽమృతం మోక్ష సుఖమస్తి, తథాఽస్య దివి ద్యోతకే స్వస్వరూపేఽమృతం మోక్షసుఖమస్తి, తథాఽస్య దివి ద్యోతకే సంసారే త్రిపా జ్జగదస్తి. ప్రకాశ్యమానం జగ దేక గుణ మస్తి, ప్రకాశకం చ తస్మాత్త్రిగుణమితి, స్వయం చ మోక్ష స్వరూపః సర్వాధిష్ఠాతా సర్వోపాస్యః సర్వానందః సర్వ ప్రకాశకోఽస్తి. ౧౧

తె॥ (ఏతావానస్య) భూత భవిష్యద్వర్తమాన కాలములందెల్లప్పుడు నుండు నీ ప్రపంచమంతయు నా పరమేశ్వరుని మహిమయే.

పూ : 'పరమేశ్వరుని మహిమ ప్రపంచమంత' యని నుడివిన దానికి కొలత యేర్పడుచున్నది. అందువలన దానికంతము అవధి యున్నదన వచ్చునా?

ఉ : (అతో జ్యాయాంశ్చ పూరుషః) ఆ పరమేశ్వరుని మహిమ కంతము లేదు. (పాదో ఽస్య విశ్వా భూతాని) ఈ ప్రకటమగు విశ్వమంతయు నా పరమేశ్వరుని యందెక్కడనో యొక యంశమున మాత్రమే యున్నది (త్రిపాదస్యామృతం దివి) ఈ జగత్తును ప్రకాశింపజేయు పరమేశ్వరుడు జగత్తునకంటె మూడింతలగును. ప్రకాశ్యమాన జగత్తొక యంశమైన ప్రకాశక జగత్తు - పరమేశ్వరుడు - మూడంశము లెక్కువ. ద్యోత నాత్మకమగు పరమేశ్వరుని స్వరూపమునందే మోక్షసుఖ మున్నది. పరమేశ్వరుడు స్వయం మోక్షస్వరూపుడు. సర్వమునకు నత డధిష్ఠాత. ఎల్లరకు నుపాస్యుడు నానంద ప్రదుడునై యున్నాడు. ౧౧

సం॥ "త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః పాదోఽస్యేహాభవత్పునః
తతో విష్వఙ్ వ్యక్రామత్ సాశనానశనే అభి." ౧౨ యజు. ౩౧. ౪

(త్రిపాద్) అయం పురుషః పరమేశ్వరః పూర్వోక్తస్య త్రిపాదోపలక్షితస్య సకాశా దూర్ధ్వ ముపరిభాగేఽర్థాత్ పృథగ్ భూతోఽస్త్యేవే త్యర్థః ఏకపాదోపలక్షితం యత్ పూర్వోక్తం జగదస్తి, తస్మా దపీహాస్మిన్ సంసారే స పురుషః పృథగ్భవత్-వ్యతిరిక్త ఏవాస్తి. స చ త్రిపాత్, సంసార ఏకపాచ్చ మిలిత్వా సర్వ శ్చతుష్పాద్ భవతి. అయం సర్వః సంసార ఇహాస్మిన్ పరమాత్మ న్యేవ వర్తతే. పునర్ లయసమయే తత్ సామర్థ్య కారణే ప్రలీనశ్చ భవతి. తత్రాపి స పురుషోఽవిద్యాంధకారాజ్ఞాన జన్మ మరణ జ్వరాది దుఃఖాదూర్ధ్వః పరః (ఉదైత్) ఉదితః ప్రకాశితో వర్తతే. (తతో వి) తతస్తత్సామర్థ్యాత్ సర్వమిదం విశ్వముత్పద్యతే. కించ తత్? (సాశనానశనే.) యదేక మశనేన భోజనకరణేన సహవర్తమానం జంగమం జీవ – చేతనాది సహితం జగత్; ద్వితీయ మనశన మవిద్యమాన మజ్ఞానం భోజనం యస్మిం తత్ పృథివ్యాదికం చ యజ్జడం– జీవ సంబంధ రహితం జగద్ వర్తతే, తదుభయం తస్మాత్ పురుషస్య సామర్థ్య కారణాదేవ జాయతే. యతః స పురుష ఏతద్ ద్వివిధం జగద్ వివిధతయా సుష్ఠు రీత్యా సర్వాత్మతయాఽఞ్చతి, తస్మాత్ సర్వం ద్వివిధం జగదుత్పాద్య (అభివ్యక్రామత్) సర్వతో వ్యాప్త వానస్తి. ౧౨

తె॥ (త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః) పురుషుడు - పరమేశ్వరుడు - ప్రకాశకుడునగు నా త్రిపాదుడు, జగత్తునకు పైన వేఱుగనుండియు జగత్తునందు వ్యాపకుడై యున్నాడు. అతడు ప్రకాశస్వరూపుడు, సర్వవ్యాపకుడు అన్నింటికంటెను భిన్నుడు. ఒక పాదమని వర్ణింపబడిన నీ జగత్తునకును నతడు భిన్నుడే. (పాదోఽస్యేహాభవ త్పునః) పరమేశ్వరుని బట్టి చూచిన నీ జగత్తంతయు నతనిలో కొంచెము స్థలములో నున్నది. ఈ స్థూల జగత్తునకు జన్మము, వినాశము నెల్లప్పుడు జరుగుచుండును. పురుషునకు జన్మవినాశాది ధర్మములుండవు. అతడు సదా ప్రకాశమానుడై యున్నాడు. (తతో విష్వఙ్ వ్యక్రామత్) ఈ నానా విధములగు జగత్తంతయు నా పరమేశ్వరుని సామర్థ్యమునుండియే యుత్పన్నమయినది. (సాశనానశనే) ఈ జగత్తు ద్వివిధము. ఒకటి చేతనాత్మకము; భోజనాదులకొఱకది చేష్టించును. జీవసంయుక్తమై యుండును. రెండు - అనశనము జడము. భోజనాదుల కది చేష్టింపదు. స్వయమది భోజనమగుట కేర్పడినది. దానిలో జ్ఞానమే యుండదు. స్వయముగ చేష్టల నొనర్పజాలదు. ఇట్లు ద్వివిధములగు నీజగత్తంతయు నా పురుషుని సామర్థ్యమునుండియే యుత్పన్నమగును, ఆ పురుషుడు దీనిని నిర్మించును. అతడే యీ సమస్తజగత్తు నన్నివిధముల నాకర్షించుచున్నాడు. ౧౨

సం॥ "తతో విరాడజాయత విరాజో అధిపూరుషః

స జాతో అత్యరిచ్యత పశ్చాద్ భూమి మథో పురః" ౧౩ యజు. ౩౧, ౫

(తతో విరాడజాయత) తతస్తస్మాద్ బ్రహ్మాండశరీరః సూర్య చంద్ర నేత్రో, వాయుప్రాణః, పృథివీపాదః – ఇత్యాద్యలంకారలక్షణ లక్షితో హి సర్వశరీరాణాం సమష్టిదేహో వివిధైః పదార్థై రాజమానః సన్, విరాట్ అజాయతోత్పన్నోఽస్తి. (విరాజో అధిపూరుషః) తస్మాద్ విరాజోఽధి ఉపరి పశ్చాత్ బ్రహ్మాండతత్త్వావయవైః పురుషః సర్వ ప్రాణినాం జీవాధికరణోదేహః, పృథక్ పృథక్ అజాయతోత్పన్నోఽభూత్. (స జాతో అ) స దేహో బ్రహ్మాండావయవైరేవ వర్ధతే. నష్టః సంస్తస్మిన్నేవ ప్రలీయత ఇతి. పరమేశ్వరస్తు సర్వేభ్యో భూతేభ్యోఽత్యరిచ్యతాతిరిక్తః పృథగ్ భూతోఽస్తి. (పశ్చాద్ భూమి మథో పురః) పురః పూర్వం భూమి ముత్పాద్య ధారితవాం స్తతః పురుషస్య సామర్థ్యాత్ స జీవోఽపి దేహం ధారితవానస్తి, న చ పురుషః పరమాత్మా తతస్తస్మా జ్జీవా దప్యత్యరిచ్యత పృథగ్ భూతోఽస్తి. ౧౩

తె॥ (తతో విరా డజాయత) ఆ పురుషుని నుండి విరాట్టు జన్మించెను. సంపూర్ణ బ్రహ్మాండ మీ విరాట్టునకు శరీరము, సూర్యచంద్రులు నేత్రములు. వాయువు ప్రాణము, భూమి పాదములు, సమస్తప్రాణుల శరీరముల కావిరాట్టు సమష్టి దేహ మనవచ్చును. వివిధములగు పదార్థములవలన నది ప్రకాశించుచున్నది కావున విరాట్టనబడును. (విరాజోఽధిపూరుషః) ఆ విరాట్టు .. సమష్టి దేహమునకు తదుపరి బ్రహ్మాండమున కవయవములనదగిన పృథివ్యాదిభూతములవలన ప్రాణుల శరీరములు వేఱువేఱుగ నుత్పన్నము లయ్యెను. (స జాతో అ...) ఆ ప్రాణుల శరీరములు పృథివ్యాదుల కవయవము లనదగిన యోషధులవలన వృద్ధి నొందును. కొంతకాలముండి, మరల నాశము నొంది, యా శరీరములు తమకు సమష్టి దేహమయిన పృథివ్యాదులలో లీనమగును. కాని, పరమేశ్వరుడు మాత్ర మీ ప్రపంచరూప దేహమునకు భిన్నముగనే యుండును – అది యతనిని లిప్తుని జేయదు. (పశ్చాద్ భూమి మథో పురః) ప్రథమమున పరమేశ్వరుడు భూమి నుత్పన్నముచేసి దానిని ధరించెను. అనంతరము పరమాత్ముని సామర్థ్యమువలననే జీవాత్మయు దేహధారి యయ్యెను. పరమేశ్వరు డా జీవుని కంటెను భిన్నుడై వేఱుగనే యుండును. ౧౩

స॥ "తస్మాద్ యజ్ఞాత్ సర్వహుతః సంభృతం పృషదాజ్యమ్,

పశూంస్తాంశ్చక్రే వాయవ్యా నారణ్యా గ్రామ్యాశ్చ యే." ౧౪ యజు, ౩౧–౬

(తస్మాద్ యజ్ఞాత్) అస్యార్థో వేదోత్పత్తి ప్రకరణే కశ్చిదుక్తః, తస్మాత్ పరమేశ్వరాత్ (సంభృతం పృషదాజ్యమ్) పృషుసేచనే ధాతుః, పర్షంతి సించంతి క్షున్నివృత్త్యాదికారక మన్నాదివస్తు యస్మిం స్తత్ పృషత్. ఆజ్యం–ఘృతం, మధు, దుగ్ధాదికం చ, పృషదితి భక్ష్యాన్నోప లక్షణమ్. యావద్ వస్తు జగతి వర్తతే తావత్ సర్వం పురుషాత్ పరమేశ్వరసామర్థ్యాదేవ జాతమితి బోధ్యమ్. తత్ సర్వమీశ్వరేణ స్వల్పం స్వల్పం జీవైశ్చ సమ్యగ్ ధారితమస్తి. అతః సర్వై రనన్య చిత్తే నాయం పరమేశ్వర ఏవో పాస్యో నాన్యశ్చేతి. (పశూన్ తాన్ చక్రే) య ఆరణ్యా వనస్థాః పశవో, యే చ గ్రామ్యాగ్రామస్థా స్తాన్ సర్వాన్ స ఏవ చక్రే, కృతవానస్తి. స చ పరమేశ్వరో వాయవ్యాన్ వాయుసహచరితాన్ పక్షిణ శ్చక్రే. చకారా దన్యాన్ సూక్ష్మ దేహధారిణః కీటపతంగాదీనపి కృతవానస్తి. ౧౪

తె॥ (తస్మాత్ యజ్ఞాత్) ఈ మంత్రమున కర్థము వేదోత్పత్తి ప్రకరణమున నొక కొంత వ్రాయబడినది. పూర్వోక్తపురుషునివలననే (సంభృతం పృషదాజ్యం) సర్వవిధములగు భోజనపదార్థములు, అన్న వస్త్రములు, జలము, ఘృతము, మధువు, దుగ్ధము మున్నగు వస్తువులు మానవులకు లభించినవి.

అతని సామర్థ్యమువలననే లోకమున నీవస్తువులేర్పడు చున్నవి. అతనివలననే ప్రాణులకు జీవనము లభించుచున్నది. కావున నెల్లరు నతనినే యుపాసింపవలెను, ఇతరుల నుపాసింప జనదు. (పశూన్ తాన్ చక్రే) గ్రామ్యములు, వన్యములు నగు జంతువుల నన్నింటిని పరమేశ్వరుడే యుత్పన్నము చేసియున్నాడు. ఇట్లే పక్షులు, సూక్ష్మములగు క్రిములు కీటకములు నన్నియు నతని మూలముననే జనించినవి. సర్వజీవుల దేహముల నతడే నిర్మించెను. ౧౪

సం॥ "తస్మాద్ యజ్ఞాత్ సర్వహుత ఋచః సామాని జజ్ఞిరే,

ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాద్ యజుస్తస్మా దజాయత." ౧౫ యజు. ౩౧–౭

అస్యార్థ ఉక్తో వేదోత్పత్తి ప్రకరణే,

తె॥ ఈ మంత్రార్థము వేదోత్పత్తి ప్రకరణమున జూడవచ్చును.

సం॥ "తస్మా దశ్వా అజాయంత యే కే చోభయాదతః

గావో హ జజ్ఞిరే తస్మాత్తస్మాజ్జాతా అజావయః." ౧౬ యజు, ౩౧–౮

(తస్మాదశ్వా) తస్మాత్ పరమేశ్వరసామర్థ్యా దేవాశ్వా స్తురంగా అజాయన్త. గ్రామ్యారణ్యపశూనాం మధ్యేఽశ్వాదీనామంతర్భావా దేషా ముత్తమగుణవత్వప్రకాశనార్థ మయమారంభః. (యే కే చోభయాదతః) ఉభయతో దంతా యేషాం త ఉభయాదతో, యే కేచిదుభయాదత ఉష్ట్రగర్దభాదయస్తేఽప్యజాయంత. (గావో హ జ) తథా తస్మాత్ పురుష సామర్థ్యాదేవ గావో ధేనవః కిరణాశ్చేంద్రియాణి చ జజ్ఞిరే జాతాని. (తస్మాజ్జాతా అ....) ఏవమేవ చాజా శ్ఛాగా అవయశ్చ జాతా ఉత్పన్నా ఇతి విజ్ఞేయమ్. ౧౬
యజు. ౩౧–౮

తె॥ (తస్మాదశ్వా) ఆ పురుషుని సామర్థ్యము వలననే అశ్వములు – గుఱ్ఱములు – విద్యుత్తు మున్నగు పదార్థములుత్పన్నము లయ్యెను. (యే కే చోభయాదతః) నోటిలో పై భాగమునను క్రింది భాగమునను దంతములు గల జంతువులు 'ఉభయాదతః' అనబడును. అట్టి యొంటెలు, గాడిదలు మున్నగు పశువులు నతని వలననే జనించినవి. (గావో హ) అతని వలననే, గోవులు, పృథివి, కిరణములు, ఇంద్రియములు నుత్పన్నములయ్యెను. (తస్మా జ్జాతా అజా) ఇట్లే యతని వలన గొఱ్ఱెలు, మేకలు గూడ జనించెను. గ్రామములలో నుండు జంతువులు, అరణ్యములలో నుండు జంతువులు పుట్టినవి యని పూర్వమంత్రమున వర్ణింపబడినది. అశ్వాది పశువులు కూడ వానిలో చేరినవే యైనను మరల నీ మంత్రమున నశ్వాదులు గ్రహింపబడినందున నవి పశువులలో శ్రేష్ఠములని తెలియనగును. ౧౮

సం॥ "తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్ పురుషం జాత మగ్రతః

తేన దేవా అయజంత సాధ్యా ఋషయశ్చ యే." ౧౭ యజు. ౩౧–౯

(తం యజ్ఞం) యమగ్రతో జాతం ప్రాదుర్భూతం జగత్కర్తారం, పురుషం పూర్ణం, యజ్ఞం సర్వపూజ్యం, పరమేశ్వరం, బర్హిషి హృదయాంతరిక్షే ప్రౌక్షన్ ప్రకృష్టతయా యస్యై వాభిషేకం కృతవంతః, కుర్వంతి, కరిష్యంతి చేత్యుపదిశ్యత ఈశ్వరేణ, (తేన దేవా) తేన పరమేశ్వరేణ పురుషేణ వేదద్వారో పదిష్టా స్తే సర్వే దేవా విద్వాంసః, సాధ్యా జ్ఞానిన ఋషయో మంత్రద్రష్టారశ్చ యే చాన్యే మనుష్యా స్తం పరమేశ్వర మయజన్త – అపూజయంత. అనేన కిం సిద్ధం ? సర్వే మనుష్యాః పరమేశ్వరస్య స్తుతి ప్రార్థనోపాసనా పురఃసరమేవ సర్వ కర్మానుష్ఠానం కుర్యు రిత్యర్థః" ౧౭

తె॥(తం యజ్ఞం) అందఱికంటె ప్రథముడును, సర్వజగత్కర్తయు, సమస్త జగత్తునందు పరిపూర్ణుడై యుండువాడును, పూజ్యుడు నగు పరమేశ్వరుని ఏ మనుజుడు హృదయాకాశమున ప్రేమ, భక్తి, సత్యాచరణము మున్నగు వానితో బాగుగ బూజించునో, అతడే యుత్తమ పురుషుడు - మనుజుడు. ఇది యీశ్వరుడెల్లరకు నొసంగిన యుపదేశము. (తేన దేవా అయజంత) వేదోక్తములగు పరమేశ్వరుని యుపదేశముల వలననే విద్వాంసులు, జ్ఞానులు, వేదమంత్రార్థముల నెఱుంగు ఋషులు, నితర మనుష్యులును పరమేశ్వరుని సత్కార పూర్వకముగ నెల్ల యుత్తమ కార్యముల నొనర్చువారై సుఖులగుదురు. శ్రేష్ఠ కార్యముల నొనర్చుటకుముందే పరమేశ్వరుని ప్రార్థన, స్మరణోపాసనాదుల నొనర్పవలెను. దుష్టకార్యముల నెవరును జేయరాదుః

సం॥ "యత్ పురుషం వ్యదధుః కతిధా వ్యకల్పయన్

ముఖం కి మస్యాసీత్ కిం బాహూ కిమూరూ పాదా ఉచ్యేతే" ౧౮ యజు. ౩౧-౧౦.

(యత్ పురుషం వ్య.) యద్యస్మాదేతం పూర్వోక్తలక్షణం పురుషం పరమేశ్వరం, కతిధా - కియత్ ప్రకారైః (వ్యకల్పయన్) తస్య సామర్థ్య గుణకల్పనం కుర్వంతీత్యర్థ. (వ్యదధుః) తం సర్వశక్తిమంత మీశ్వరం వివిధ సామర్థ్యకథనే నాదధుః; అర్థాత్ అనేక విధం తస్య వ్యాఖ్యానం కృతవంతః, కుర్వంతి కరిష్యంతి చ. (ముఖం కిమ్) అస్య పురుషస్య ముఖం ముఖ్యగుణేభ్యః కిముత్పన్నమాసీత్? (కిం బాహూ) బలవీర్యాది గుణేభ్యః కిముత్పన్నమాసీత్ ? (కిమూరూ) వ్యాపారాది మధ్యమైర్ గుణైః కిముత్పన్నమాసీత్ ? (పాదా ఉచ్యేతే) పాదా వర్థా మ్మూర్ఖత్వాది నీచగుణైః కిముత్పన్నం వర్తతే? ౧౮

తె॥ (యత్ పురుషం) సర్వశక్తిమంతుడగు నీశ్వరుడు పురుషుడనబడును. (కతిధా వ్యకల్పయన్) అతని సామర్థ్యము ననేక విధముల ప్రతిపాదింతురు. అతనిలో చిత్ర విచిత్రమును, నానావిధములుగలదియు నగు సామర్థ్యము కలదు. అనేకవిధ కల్పనలతో దానిని వర్ణింతురు; వర్ణింపగలరు; వర్ణించి యుండిరి. (ముఖం కిమస్యాసీత్) ఈ పురుషుని ముఖము-ముఖ్య గుణముల వలన, యీ ప్రపంచమున నేమి యుత్పన్నమైనది? (కిం బాహూ) బలము, వీర్యము, శూరత, యుద్ధాదివిద్యా గుణములవలన నీ ప్రపంచమున నేపదార్థ ముత్పన్నమయ్యెను? (కిమూరూ) వ్యాపారాది మధ్యమ గుణముల వలన దేని యుత్పత్తి జరిగినది? (పాదాఉచ్యేతే) మూర్ఖత్వాది నీచగుణములవలన నేమి జనించినది? ౧౮

సం॥ అస్యోత్తరమాహః-

"బ్రాహ్మణోఽస్య ముఖ మాసీద్ బాహూ రాజన్యఃకృతః

ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాం శూద్రో అజాయత," ౧౯యజు. అ. ౩౧.మ,౧౧

(బ్రాహ్మణోఽస్య) అస్య పురుషస్య-ముఖం యే విద్యాదయో గుణాః, సత్యభాషణోపదేశాదీని కర్మాణి చ సంతి, తేభ్యో బ్రాహ్మణ ఆసీ దుత్పన్నో భవతీతి. (బాహూ రాజన్యః కృతః) బలవీర్యాది లక్షణాన్వితో రాజన్యః క్షత్రియస్తేన కృత ఆజ్ఞప్త ఆసీ దుత్పన్నో భవతి. ('ఆసీదాస్తే' ఇతి హస్త లిఖిత భూమికాయాం ద.) (ఊరూ తదస్య) కృషివ్యాపారాదయోగుణా మధ్యమాస్తేభ్యో వైశ్యో వణిగ్ జనోఽస్య పురుషస్యోపదేశా దుత్పన్నో భవతీతి వేద్యమ్. (పద్భ్యాం శూద్రో) పద్భ్యాం పాదేంద్రియం నీచత్వం, అర్థాజ్జడబుద్ధిత్వాది గుణేభ్యః శూద్రః సేవాగుణ విశిష్టః పరాధీనతయా ప్రవర్త మానోఽజాయత జాయత ఇతి వేద్యమ్. ౧౯

"అస్యోపరి ప్రమాణాని వర్ణాశ్రమ ప్రకరణే వక్ష్యంతే 'ఛందసి లుఙ్ లఙ్ లిటః' అష్టాధ్యాయీ, ౩, ౪, ౬. ఇతి సూత్రేణ సామాన్య కాలే త్రయోలకారా విధీయంతే.

తె॥ పూర్వమంత్రమున వర్ణింపబడిన నాలుగు ప్రశ్నలకు నీ మంత్రమున నీ క్రింది సమాధానములు చెప్పబడినవి.

(బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్) పరమేశ్వరుని యాజ్ఞానుసారము విద్యాద్యుత్తమగుణములవలనను, సత్యభాషణము, సత్యోపదేశము మున్నగు నుత్తమ కర్మములవలనను బ్రాహ్మణ వర్ణ ముత్పన్నమయ్యెను. ఇట్టి ముఖ్యగుణములు, కర్మములు గలిగియుండుటవలన బ్రాహ్మణ వర్ణస్థుడు మనుష్యులలో నుత్తముడగును. (బాహూ రాజన్యః కృతః) ఈశ్వరుడు బలపరాక్రమములు మున్నగు గుణములతో యుక్తమగు క్షత్రియవర్ణము నుత్పన్నము చేసెను. (ఊరూ తదస్య యద్ వైశ్యః) పరమపురుషుని యుపదేశము ననుసరించి, కృషి, వ్యాపారము, సర్వదేశభాషలు నేర్చుట, పశుపాలనము మున్నగు మధ్యమ గుణములతో వైశ్యవర్ణము సిద్ధించెను. (పద్భ్యాగ్ం శూద్రో...) పాదములు శరీరమున క్రింది యవయవములు. అట్లే మూర్ఖత్వాది ౨౯
నీచగుణముల వలన శూద్రవర్ణ మేర్పడెను.

ఈ విషయమునకు చెందిన ప్రమాణములు వర్ణాశ్రమ ప్రకరణవ్యాఖ్యలో ముందు వ్రాయుదుము. ("ఛందసి లుఙ్ లఙ్ లిటః" అష్టా. ౩-౪-౬.) ఈ సూత్రము ననుసరించి వేదమునందు సామాన్య కాలమును దెలుపుటకు లుఙ్, లఙ్, లిట్, లకారములు మూడును ప్రయోగింపబడును.

సం॥ "చంద్రమా మనసో జాత శ్చక్షోః సూర్యో అజాయత,
శ్రోత్రాద్ వాయుశ్చ ప్రాణశ్చ ముఖాదగ్ని రజాయత." ౨౦ యజు. ౩౧-౧౨

(చంద్రమా మనసో...) తస్యాస్య పురుషస్య మనసో మనన శీలాత్ సామర్థ్యా చ్చంద్రమా జాత ఉత్పన్నోఽస్తి. తథా చక్షోర్ జ్యోతిర్ మయాత్ సూర్యో అజాయత ఉత్పన్నోఽస్తి. శ్రోత్రాద్వా శ్రోత్రాకాశమయా దాకాశో నభ ఉత్పన్నమస్తి. వాయుమయాద్ వాయురుత్పన్నోఽస్తి. ప్రాణశ్చ, సర్వేంద్రియాణి చోత్పన్నాని సంతి. ముఖాన్ముఖ్యజ్యోతిర్మయా దగ్నిరజాయతోత్పన్నోఽస్తి. ౨౦

తె॥ (చంద్రమా) ఆపురుషుని మననము - జ్ఞానస్వరూపసామర్థ్యమువలన చంద్రుడును, తేజస్స్వరూపమువలన సూర్యుడును నుత్పన్నమయ్యెను. (శ్రోత్రా ద్వాయుశ్చ) అవకాశరూప సామర్థ్యము వలన నాకాశమును, వాయురూప సామర్థ్యమువలన వాయువును నుద్భవించెను. అట్లే సర్వేంద్రియములును తమ తమ కారణములనుండి యుద్భవించినవి. మఱియు, ముఖ్యమగు జ్యోతిస్స్వరూప సామర్థ్యము వలన ౨౦
నగ్ని జనించినది.

సం॥ "నాభ్యా ఆసీదంతరిక్షగ్ం శీర్ష్ణోర్ ద్యౌః సమవర్తత,
పద్భ్యాం భూమిర్ దిశః శ్రోత్రా త్తథా లోకాఁ అకల్పయన్," ౨౧ యజు. ౩౧-౧౩

(నాభ్యా) అస్య పురుషస్య నాభ్యా అవకాశమయాత్ సామర్థ్యా దంతరిక్ష ముత్పన్నమాసీత్. ఏవం శీర్ష్ణః శిరోవ దుత్తమసామర్థ్యాత్ ప్రకాశమయాత్, (ద్యౌః) సూర్యాదిలోకః ప్రకాశాత్మకః సమవర్తత, సమ్యగుత్పన్నః సన్ వర్తతే. (పద్భ్యాం భూమిః) పృథివీకారణమయాత్ సామర్థ్యాత్ పరమేశ్వరేణ. భూమిర్ ధరణి రుత్పాదితాఽస్తి. జలం చ. (దిశః శ్రోత్రాత్) శబ్దాకాశకారణమయాత్ తేన దిశ ఉత్పాదితాః సంతి. (తథా లోకాన్ అకల్పయత్) తథా తేనైవ ప్రకారేణ, సర్వలోక కారణ మయాత్

సామర్థ్యా దన్యాన్ సర్వాన్ లోకాం స్తత్రస్థాన్ స్థావరజంగమాన్ పదార్థాన్ అకల్పయత్ పరమేశ్వర ఉత్పాదితవా నస్తి. ౨౧

తె॥ (నాభ్యా ఆసీత్) ఆ పురుషుని యత్యంత సూక్ష్మమగు నవకాశరూప సామర్థ్యము వలన అంతరిక్షము - భూమికి సూర్యాది లోకములకు మధ్యనున్న కాళీచోటు-నియత మొనర్పబడినది. (శీర్ ష్ణోర్ ద్యౌః) అతని సర్వోత్తమ సామర్థ్యము వలన సర్వలోకములను ప్రకాశింపజేయు సూర్యాది లోకములు జనించెను. (పద్ భ్యాం భూమిః) పార్థివ పరమాణు కారణరూప సామర్థ్యమువలన పరమేశ్వరుడు భూమిని జనింపజేసెను. అట్లే జలమును కూడ దాని కారణము నుండి యుత్పన్న మొనర్చెను. (దిశః శ్రోత్రా) అతడు శ్రోత్రరూప - శబ్దాకాశకారణ రూపసామర్థ్యమువలన దిక్కులను గలిగించెను. (తథా లోకాన్ అకల్పయత్) అట్లే కారణరూప సామర్థ్యము వలన పరమేశ్వరుడు సర్వలోకములను, వానిలోని పదార్థములను సృజియించెను.) ౨౧

సం॥ "యత్ పురుషేణ హవిషా దేవా యజ్ఞ మతన్వత,

వసంతోఽస్యాసీదాజ్యం గ్రీష్మ ఇధ్మః శరద్ధవిః" ౨౨ యజు. ౩౧-౧౪

(యత్ పురుషేణ) దేవా విద్వాంసః పూర్వోక్తేన పురుషేణ హవిషా గృహీతేన దత్తేన చాగ్నిహోత్రాద్యశ్వమేధాంతం శిల్పవిద్యామయం చ యద్ యజ్ఞం ప్రకాశిత మతన్వత - విస్తృతం కృతవంతః. కుర్వంతి కరిష్యంతి చ. ఇదానీం జగదుత్పత్తౌ కాల స్యావయవాఖ్యా సామగ్ర్యుచ్యతే - (వసంతో) అస్య యజ్ఞస్య పురుషా దుత్పన్నస్య వా బ్రహ్మాండమయస్య వసంతః, ఆజ్యం ఘృత వదస్తి. (గ్రీష్మ ఇధ్మః) గ్రీష్మర్తుః. ఇధ్మ ఇంధనాన్యగ్నిర్ వాఽస్తి - (శరద్ధవిః) శరదృతుః పురోడా శాదివ ద్ధవిర్ హవనీయమస్తి. ౨౨

తె॥ (యత్ పురుషేణ) దేవా-విద్వాంసులను కూడ వారివారి కర్మములననుసరించి పరమేశ్వరుడు సృష్టించి యున్నాడు. వారు నీశ్వరదత్త పదార్థములను గ్రహించి, పూర్వోక్తములగు నగ్నిహోత్రాది అశ్వమేధపర్యంతములగు యజ్ఞములను శిల్పవిద్యామయ యజ్ఞమును విస్తారపూర్వకముగ ననుష్ఠించుచున్నారు, అనుష్ఠింపగలరు. ఇక జగదుత్పత్తిలో నవయవరూపమగు కాలమనెడి సామగ్రిని వర్ణించు చున్నాడు. (వసంతో) ఈ పూర్వోక్త యజ్ఞమునందు కాని, లేక పరమేశ్వరునిచే రచియింపబడిన బ్రహ్మాండరూపమగు యజ్ఞము నందు కాని, వసంతర్తువు-చైత్ర వైశాఖములు - ఘృతమునకు సమానములు (గ్రీష్మ ఇధ్మః) గ్రీష్మర్తువు - జ్యేష్ఠాషాఢములు - ఇంధనములు. శ్రావణ భాద్ర పదములు వర్షర్తువు, ఆశ్వీజ కార్తీకములు

---

) (౨౦-౨౧ సంఖ్యగల మంత్రములకు దయానందమహర్షి వ్రాసిన యర్థములను జదివినపుడు 'వాస్తవమున పరమేశ్వరుని సామర్థ్య మేకరన' మని బోధపడును. కాని, భిన్న భిన్న పదార్థముల నుత్పన్నము చేసినందున నాయా పదార్థముల యుత్పత్తి కనుకూలముగ సామర్థ్యమునందును నౌపాధిక భేదము కల్పింపబడినది. ఇట్లే యుత్పన్నములగు పదార్థముల సమవాయి-ఉపాదాన-కారణములతో పరమాత్మని సామర్థ్యమున కభేదము కూడ నారోపమాత్రమే. రాజు తన సేన విషయములో 'ఇది నా బలము' అనును. వాస్తవమున సేన రాజబలముకంటె భిన్నమే. సంస్కృతసాహిత్యమున సేన, బల మనబడుట కిదియే కారణము. ఈ దృష్టితోనే మహర్షి పలు తావులలో ప్రతిపదార్థమునకు మూల కారణమును, సమస్తజగత్తునకు మూలకారణమైన ప్రకృతిని 'సామర్థ్య' శబ్దముతో వ్యవహరించి యున్నాడు. ప్రకృతి పరమాత్మని సామర్థ్యము. దీనినుండియే ప్రపంచమును రచించును ) మూ. గ్రం.సం.

శరదృతువు, మార్గశిర పుష్యమాసములు హేమంతము, మాఘఫాల్గునములు శిశిరఋతువు. ఇవియన్నియు నీ యజ్ఞమున హవిస్సులు. ఇట రూపకాలంకారముతో బ్రహ్మాండమును వర్ణించినట్లెంచవలెను.

సం॥ "సప్తాస్యాసన్ పరిధయ స్త్రిః సప్త సమిధః కృతాః,

దేవా యద్ యజ్ఞం తన్వానా అబధ్నన్ పురుషం పశుమ్." ౨౩ యజు. ౩౧–౨౫

(సప్తాస్యా) అస్య బ్రహ్మాండస్య సప్త పరిధయః సంతి, పరిధిర్ హి గోల స్యోపరిభాగస్య యావతా సూత్రేణ పరివేష్టనం భవతి, స పరిధిర్ జ్ఞేయః. అస్య బ్రహ్మాండస్య బ్రహ్మాండాంతర్గత లోకానాం వా సప్త సప్త పరిధయో భవంతి. సముద్ర ఏకః. తదుపరి త్రసరేణు సహిత వాయుర్ ద్వితీయః, మేఘ మండలం తత్రస్థో వాయుస్తృతీయః, వృష్టి జలం చతుర్థః, తదుపరి వాయుః పంచమః, అత్యంత సూక్ష్మో ధనంజయ షష్ఠః, సూత్రాత్మా సర్వత్రవ్యాప్తం సప్తమశ్చ ఏవమేకైకస్యోపరి సప్త సప్తావరణాని స్థితాని సంతి. తస్మాత్తే పరిధయో విజ్ఞేయాః (త్రిఃసప్త సమిధః కృతాః) ఏకవింశతిః పదార్థాః సామగ్ర్యస్య చాస్తి. ప్రకృతిర్, మహత్, బుద్ధ్యాద్యంతః కరణం, జీవ శ్చైషైకా సామగ్రీ పరమసూక్ష్మత్వాత్, దశేంద్రియాణి – శ్రోత్రం, త్వక్, చక్షుః, జిహ్వా, నాసికా, వాక్పాదౌ, హస్తౌ, పాయుః, ఉపస్థంచేతి, శబ్దస్పర్శరూపరసగంధాః, పంచతన్మాత్రాః, పృథివ్యాపస్తేజోవాయు రాకాశమితి పంచభూతాని చ మిలిత్వా దశ భవంతి. ఏవం, సర్వా మిలిత్వైక వింశతిర్ భవంతి – అస్య బ్రహ్మాండరచనస్య సమిధః కారణాని విజ్ఞేయాని – ఏతేషా మవయవ రూపాణి తు తత్త్వాని బహూని సంతీతి బోధ్యమ్. (దేవా య) తదిదం యేన పురుషేణ రచితం తం యజ్ఞపురుషం పశుం సర్వద్రష్టారం సర్వైః పూజనీయం దేవా విద్వాంసః (అబధ్నన్) ధ్యానేన బధ్నంతి; తం విహా యేశ్వరత్వేన కస్యాపి ధ్యానం నైవ బధ్నంతి నైవ ౨౩ కుర్వం తీత్యర్థః.

తె॥ (సప్తాస్యా...) పరమేశ్వరు డొక్కొక్క లోకమున కన్నివైపుల-చుట్టు-నేడేడు పరిధులు నిర్మించియున్నాడు. గుండ్రని వస్తువును దారముతో చుట్టుకొలత చేసినపుడు వచ్చుకొలతకు పరిధి యందురు. బ్రహ్మాండమునగల లోకముల కన్నింటికి చుట్టు నేడేడు పరిధుల నీశ్వరు డేర్పఱచి యున్నాడు. ౧. మొదటిది సముద్రము, ౨. రెండవది త్రసరేణువులు, ౩. మూడవది మేఘమండల వాయువు, ౪. నాల్గవది వృష్టిజలము, ౫. ఐదవది వృష్టి జలమునకు పైనుండు వాయువిశేషము ౬. ఆఱవది యత్యంత సూక్ష్మ వాయువు – ధనంజయ వాయువు, ౭. ఏడవది సూత్రాత్మ వాయువు. ఇది ధనంజయ వాయువుకంటెను సూక్ష్మము. ఈ యేడును పరిధులనబడును.

(త్రిః సప్త సమిధః) ఈ బ్రహ్మాండపు సామగ్రి యిరువది యొక్క విధములుగ నుండును:–

౧ వది ప్రకృతి, బుద్ధి, జీవులు; ఈ మూడును కలిసియుండును. ఇవి సూక్ష్మములు. ౨-వది శ్రోత్రము. ౩-వది త్వక్కు. ౪-వది నేత్రము. ౫-వది జిహ్వ. ౬-వది నాసిక-ముక్కు. ౭-వది వాక్కు. ౮-వది పాదములు. ౯-వది హస్తములు. ౧౦-యవది గుదము. ౧౧-వది ఉపస్థము. ౧౨-వది శబ్దము. ౧౩-వది స్పర్శ . ౧౪-వది రూపము - రంగు. ౧౫-వది రసము- రుచి. ౧౬-వది గంధము. ౧౭-వది పృథివి - భూమి. ౧౮-వది జలము. ౧౯-వది అగ్ని. ౨౦-వది వాయువు. ౨౧-వది ఆకాశము. ఈ యిరువది యొక్క పదార్థములు సమిధలు (దేవాయద్) విద్వాంసులు సర్వజగద్రచయితయు, సర్వజగద్ ద్రష్టయు, పూజ్యుడు నగు పరమేశ్వరుని గూర్చియే విందురు. అతని యుపదేశముల మూలమున నతని గుణకర్మములను కీర్తింతురు, ప్రకటింతురు; ధ్యానింతురు. అతనిని దక్క యితరుని నీశ్వరుడని యెవడును

సంగీకరింపడు. అతని ధ్యానమునందే తమ యాత్మలను దృఢముగ నిలుపుటవలననే - బంధించుటవలననే కల్యాణము - శుభము కలుగునని యెఱుగుచున్నారు. ౨౩

సం॥"యజ్ఞేన యజ్ఞ మయజన్త దేవా స్తాని ధర్మాణి ప్రథమా న్యాసన్, తే హ నాకం మహిమానః సచంత యత్ర పూర్వే సాధ్యాః సన్తి దేవాః."౨౪ యజు.౩౧-౧౬

**(యజ్ఞేన యజ్ఞం)** యే విద్వాంసో యజ్ఞం యజనీయం పూజనీయం పరమేశ్వరం, యజ్ఞేన, తత్ స్తుతి ప్రార్థనోపాసనరీత్యా పూజనేన, తమేవాయజన్త; యజంతే; యక్ష్యంతి చ. తాన్యేవ ధర్మాణి ప్రథమాని సర్వకర్మభ్య ఆదౌ సర్వైర్ మనుష్యైః కర్తవ్యాన్యాసన్. న చ తైః పూర్వం కృతైర్ వినా కేనాపి కించిత్ కర్మ కర్తవ్యమితి. **(తే హ నా...)** త ఈశ్వరోపాసకాః, హేతి ప్రసిద్ధం, నాకం సర్వదుఃఖరహితం పరమేశ్వరం, మోక్షం చ, మహిమానః పూజ్యాః సంతః, సచంత సమవేతా భవంతి, కీదృశం తత్? **(యత్ర పూర్వే సాధ్యాః)** సాధ్యాః సాధనవంతః, కృతసాధనాశ్చ. దేవా విద్వాంసః, పూర్వే అతీతాః, యత్ర మోక్షాఖ్యే పరమే పదే సుఖినః సంతి. న తస్మాద్ బ్రాహ్మణ శ్శతవర్ష సంఖ్యాతాత్ కాలాత్. **(పూర్వమ్)** కదాచిత్ పునరావర్తన్త ఇతి. కింతు తమేవ సమసేవంత.

అత్రాహు ర్నిరుక్తకారా యాస్కాచార్యాః-

"యజ్ఞేన యజ్ఞ మయజన్తదేవాః, అగ్నినాగ్నిమయజంత దేవాః. 'అగ్నిః పశురాసీత్తమాలభంత తేనాయజంతే' తి చ బ్రాహ్మణమ్. 'తాని ధర్మాణి ప్రథమాన్యాసన్' తే హ నాకం మహిమానః సమసేవంత. యత్ర పూర్వే సాధ్యాః సంతి దేవాః సాధనాః, ద్యుస్థానో దేవగణ ఇతి నైరుక్తాః." నిరుక్తం ౧౨-౪౧

అగ్నినా జీవేన అన్తఃకరణేన వా అగ్నిం - పరమేశ్వరమయజన్త. అగ్నిః పశురాసీత్తమేవ దేవా ఆలభంత. సర్వోపకారక మగ్నిహోత్రా ద్యశ్వమేధాంతం భౌతికాగ్నినాపి యజ్ఞం దేవాః సమసేవంతేతి వా. సాధ్యాః సాధనవంతో, యత్ర పూర్వే పూర్వం భూతా మోక్షాఖ్యానందే పదే సంతి. తమభిప్రే త్యాత ఏవ 'ద్యుఃస్థానే దేవగణః' ఇతి నిరుక్త కారా వదంతి. ద్యుస్థానః ప్రకాశమయః పరమేశ్వరః స్థానం స్థిత్యర్థం యస్య సః. యద్వా సూర్యప్రాణస్థానాః విజ్ఞానకిరణా స్తత్రైవ దేవగణో దేవసమూహో వర్తత ఇతి. ౨౪

తె॥ (యజ్ఞేన యజ్ఞం) విద్వాంసులను దేవతలందురు. వారు స్తుతి, ప్రార్థన, ఉపాసన యనెడి రీతితో, పూజనము మూలమున (యజ్ఞం) ఆ పూజనీయుడగు పరమేశ్వరుని పూజించుచుందురు. పూజింప గలరు. (తాన్యేవ) ఆ ధర్మములే శుభకర్మము లన్నింటికిని ముందుచేయవలెను. స్తుతి ప్రార్థనోపాసనలను ముందొనర్చక యెవడును నే శుభ కార్యము నొనరింపరాదు. (తేహ నాకం) ఈశ్వరు నుపాసించువారు దుఃఖరహితమగు మోక్షమును - సుఖస్వరూపుడగు పరమేశ్వరుని బొందుదురు. అట్టివారు మనుష్యులలో పూజ్యులగుదురు. యోగసాధనముల ననుష్ఠించు విద్వాంసులు, పరమపురుషార్థములో నే పదమునుబొంది నిత్యానందమున నుందురో, అది మోక్షమనబడును. మోక్ష సుఖానుభవకాలము నూఱు బ్రహ్మవర్షములు. ౧ ముక్తాత్మ లింతకాలము మోక్షసుఖము ననుభవించి, తదుపరి ముక్తి నుండి తిరిగి వత్తురు.

---

౧ ముక్తి సమయ పరిమాణము నూఱు బ్రహ్మవర్షములు - వాని వివరణము :-

౪౩౨౦౦౦౦౦౦౦ సంవత్సరము లొక బ్రహ్మదినము - సృష్టికాలము - ఇన్ని సంవత్సరములే బ్రహ్మరాత్రి-ప్రళయకాలము. ౪౩౨౦౦౦౦౦౦౦ = ౮౬౪౦౦౦౦౦౦౦, ఎనిమిది యరబుల, యఱువది నాలుగుకోట్ల వర్షములొక బ్రహ్మోహోరాత్రములగును.

నిరుక్త రచయిత యగు యాస్కుని అభిప్రాయము :-

యజ్ఞము = అగ్ని, జీవుడు = అంతఃకరణము. విద్వాంసులు, అగ్ని మూలమున గాని, అంతఃకరణము ద్వారమునగాని, అగ్ని - పరమాత్ముని బూజింతురు. లేక, యెల్లరకు నుపకారమొనర్చు భౌతికాగ్ని మూలమున విద్వాంసులు యజ్ఞమాచరింతురు. పరమేశ్వరుని బూజించియే విద్వాంసులు ముక్తిసుఖమును బడయుదురు. ఈ అభిప్రాయముతోనే దేవతలు 'ద్యుఃస్థాను'లుగ జెప్పబడిరి. ద్యుః= ప్రకాశమయ - జ్ఞానమయ పరమేశ్వరుడు స్థానముగ గలవారని యభిప్రాయము. విజ్ఞానము, కిరణములు నిట దేవతలని చెప్పబడినవి. దేవ- విజ్ఞానమునకు స్థానము (ద్యు) ప్రాణము. దేవ-కిరణములకు స్థానము (ద్యు) సూర్యుడు. ౨౪

సం॥ "అద్భ్యః సంభృతః పృథివ్యై రసాచ్చ విశ్వకర్మణః సమవర్తతాగ్రే, తస్య త్వష్టా విదధద్ రూపమేతి తన్మర్త్యస్య దేవత్వ మాజానమగ్రే." ౨౫ యజు, ౩౧-౧౭

(అద్భ్యః సంభృతః) తేన పురుషేణ పృథివ్యై పృథివ్యుత్పత్త్యర్థం, అద్భ్యోరసః సంభృతః సంగృహ్య, తేన పృథివీ రచితా, ఏవ మగ్నిరసేన అగ్నేః సకాశా దాప ఉత్పాదితాః. అగ్నిశ్చ వాయోః సకాశాద్, వాయురాకాశా దుత్పాదితః, ఆకాశః ప్రకృతేః, ప్రకృతిః స్వసామర్థ్యాచ్చ. విశ్వం సర్వం కర్మక్రియమాణమస్య స విశ్వకర్మా, తస్య పరమేశ్వరస్య సామర్థ్య మధ్యే కారణాఖ్యేఽగ్రే సృష్టేః ప్రాగ్ జగత్ సమవర్తత వర్తమానమాసీత్. తదానీం సర్వమిదం జగత్ కారణభూతమేవ నేదృశమితి. తస్య సామర్థ్యస్యాంశాన్ గృహీత్వా. త్వష్టా రచనకర్తేదం సకలం జగద్ విదధత్. పునశ్చేదం విశ్వం రూపవత్త్వమేతి. తదేవ మర్త్యస్య మరణధర్మకస్య విశ్వస్య మనుష్యస్యాపి చ రూపవత్త్వం భవతి. (ఆజానమగ్రే) వేదాజ్ఞాపనసమయే పరమాత్మా ఆజ్ఞప్తవాన్ – వేదరూపా మాజ్ఞాం దత్తవాన్ మనుష్యాయ. ధర్మయుక్తే నైవ సకామేన కర్మణా కర్మదేవత్వయుక్తం శరీరం ధృత్వా, విషయేంద్రియ సంయోగజన్య మిష్టం సుఖం భవతు. తథా నిష్కామేన విజ్ఞాన పరమం మోక్షాఖ్యం చేతి. ౨౫

తె॥ (అద్భ్యః సంభృతః) భూమి నుత్పన్న మొనర్చుటకు పరమేశ్వరుడు జలసారాంశమును గ్రహించి, భూజల పరమాణువులను గలిపి భూమిని రచియించెను. ఇట్లే యగ్ని సారాంశము నొకటం జేర్చి, అగ్ని పరమాణువులతో జల పరమాణువులను జేర్చి జలము నుద్భవింపజేసెను. వాయు సారాంశము నొకట జేర్చి, వాయు పరమాణువులతో నగ్ని పరమాణువులను జేర్చి అగ్నిని బుట్టించెను. ఆకాశమునకు తదుపరి వాయు పరమాణువుల వలన వాయువును, జగత్తున కాదికారణ (ఉపాదానకారణ) మగు ప్రకృతినుండి యాకాశమును రచియించెను. ఆకాశము సర్వతత్త్వములుండుటకు స్థానము. జగత్తునకు మూలకారణమగు ప్రకృతికి 'ప్రకృతి' యను వ్యవహారము కూడ పరమాత్ముని సామర్థ్యము వలననే కలిగినది. అతడే సమస్త ప్రపంచము నుత్పన్నము చేసియున్నాడు. సర్వపదార్థములను -విశ్వమును- రచించినందున పరమేశ్వరునకు విశ్వకర్మయను నామ మేర్పడినది. జగత్తు పుట్టకముం దది యీశ్వరుని సామర్థ్యము (వశము) న కారణరూపమున నుండెను. (తస్య) ఈశ్వరుడు తన సామర్థ్యము (ప్రకృతి) నుండి యీ కార్యజగత్తును రచించినపుడది రూపగుణములు కలదై, స్థూలమై చూడనగును. (తన్మర్త్యస్య దేవత్వం) పరమేశ్వరుడు మానవశరీరాదులను నిర్మించి యున్నాడు. కాని, మనుష్యుడు దివ్యకర్మముల నొనర్చి

---

౮౬౪౦౦౦౦౦౦౦ × ౩౬౦ = ౩౧౧౦౪౦౦౦౦౦౦౦౦౦, ముప్పదియొక్క ఖర్వముల, పదియరబుల, నలువది కోట్ల వర్షములు ఒక బ్రహ్మవర్షము. ౩౧౧౦౪౦౦౦౦౦౦౦౦౦ × ౧౦౦ = ౩౧౧౦౪౦౦౦౦౦౦౦౦౦౦౦, ముప్పదియొక్క నీలముల, పదిఖర్వముల, నలువది యరబుల వర్షములు ముక్తిసుఖ మనుభవించుకాలము.

దేవతయనబడును. ఈశ్వరోపాసనవలన విద్య, విజ్ఞానము మున్నగు సత్యుత్తమ గుణములను బొంది, మనుష్యులుత్తమ దేవతలనబడుదురు. సకామకర్మములకంటె నుపాసన, జ్ఞానము, నుత్తమములు. ఉత్తమ సకామ కర్మముల నొనరించుమనుజుడు ప్రపంచమున నుత్తమ సుఖములను బొందునని యీశ్వరాజ్ఞ. పరమేశ్వర ప్రాప్తి రూప మోక్షము నభిలషించి, ఉత్తమ నిష్కామ కర్మముల నొనర్చుచు ఉపాసనయందును, జ్ఞాన సంపాదనలోను పురుషార్థ మొనర్చు మనుజు డుత్తమ దేవతగా నెంచబడును. ౨౫

సం॥ "వేదాహ మేతం పురుషం మహాంత మాదిత్యవర్ణం తమసః పరస్తాత్

తమేవ విదిత్వాతిమృత్యు మేతి నాన్యః పంథా విద్యతేఽయనాయ." ౨౬

యజు. ౩౧-౧౮

పూ : కిం విదిత్వా త్వం జ్ఞానీ భవసీతి పృచ్ఛ్యతే.

ఉ : తదుత్తర మాహ (వేదాహ మేతం) యతః పూర్వోక్తలక్షణ విశిష్టం, సర్వేభ్యో మహాంతం, వృద్ధతమ మాదిత్యవర్ణం, స్వప్రకాశ విజ్ఞానస్వరూపం, తమసోఽజ్ఞానాఽవిద్యాంధకారాత్ పరస్తాత్ పృథగ్ వర్తమానం పరమేశ్వరం పురుషమహం వేద-జానా మ్యతోఽహం జ్ఞాన్యస్మీతి నిశ్చయః, నైవ తమవిదిత్వా కశ్చిజ్ జ్ఞానీ భవితు మర్హతీతి. కుతః? (తమేవ విదిత్వా) మనుష్య స్తమేవ పురుషం పరమాత్మానం విదిత్వా, అతిమృత్యుం మృత్యుమతిక్రాంతం మృత్యోః పృథగ్ భూతం మోక్షాఖ్యమానంద మేతి ప్రాప్నోతి. నైవాతోఽన్యథేతి. ఏవకారాత్ తమీశ్వరం విహాయ నైవ కస్యచి దన్యస్య లేశమాత్రా ప్యుపాసనా కేనచిత్ కదాచిత్ కార్యేతి గమ్యతే.

పూ : కథమిదం విజ్ఞాయతేఽన్యస్యోపాసనా నైవ కార్యేతి?

ఉ : (నాన్యః పంథా విద్యతేఽయనాయ) ఇతి వచనాత్. అయనాయ వ్యావహారికపారమార్థిక సుఖాయఽన్యో ద్వితీయః పంథా మార్గో న విద్యతే, కింతు తస్యైవోపాసన మేవ సుఖస్య మార్గః, అతోభిన్న స్యేశ్వరగణనోపాసనాభ్యాం మనుష్యస్య దుఃఖమేవ భవతీతి నిశ్చయః. అతః కారణాత్, "ఏష ఏవ పురుషః సర్వై రుపాసనీయః" ఇతి సిద్ధాంతః. ౨౬

తె॥ పూ॰ ఏ పదార్థము నెఱింగి మనుష్యుడు జ్ఞాని యగును?

ఉ : (వేదేహ...) పూర్వము వర్ణింపబడిన లక్షణములు గల పరమేశ్వరునే సరిగా నెఱిగి మనుష్యుడు జ్ఞాని యగును. లేకున్న కాజాలడు. అందఱికంటె బెద్దవాడును, నెల్లరను ప్రకాశింపజేయు వాడును, అవిద్యాజ్ఞానాదిదోషములు లేని వాడునునగు నా పురుషుని నే నిష్టదేవునిగ నెఱుగుదును. అతని నెఱుగని మనుజు డెవడును సరియైన జ్ఞాని కాజాలడు. కారణమేమన?

(తమేవ విదిత్వా) ఆ పరమేశ్వరు నెఱిగి - ప్రాప్తించి జన్మమరణాది క్లేశములకు జెందిన సముద్రము వంటి దుఃఖములనుండి తరించి, పరమానంద స్వరూపమోక్షమును బొందును. మఱియొక విధమున మోక్షసుఖము లభింపదు. దీనింబట్టి పరమేశ్వరునే యెల్లరు నుపాసింప వలెననియు, నితరుని నుపాసించుట యే మానవునకు దగదనియు సిద్ధించుచున్నది.

పూ : ఇతరోపాసన సేయరాదని యెట్లు తెలిసినది?

ఉ : మోక్షము నొసంగువాడు పరమేశ్వరుడొక్కడే. ఇతరుడు కాడు. ఇందులకు ప్రమాణము (నాన్యః పంథా...) వ్యావహారిక, పారమార్థిక సుఖముల నొసంగు మార్గము - పరమేశ్వరుని యుపాసన, అతని జ్ఞానము

తక్క మఱియొండు లేదు. పరమేశ్వరుని యుపాసన, జ్ఞానమును మానవునకు సుఖము నొసంగును. అన్యపదార్థము నీశ్వరుడని యెంచి యుపాసించిన మనుజునకు దుఃఖములే లభించును. కావున నెల్లరు పరమేశ్వరునే యుపాసింపవలెను. ఇతరము నుపాసింపరాదు. ౨౬

సం॥ "ప్రజాపతి శ్చరతి గర్భే అంతరజాయమానో బహుధా విజాయతే.

తస్య యోనిం పరిపశ్యంతి ధీరా స్తస్మిన్ హ తస్థుర్ భువనాని విశ్వా." ౨౭

యజు. ౩౧–౧౯

(ప్రజాపతిః) స ఏవ ప్రజాపతిః సర్వస్య స్వామీ, జీవస్యాన్యస్య చ జడస్య జగతోఽంతర్గర్భే మధ్యే అంతర్యామి రూపేణాజాయమానోఽను త్పన్నోఽజః సన్ నిత్యం చరతి. తత్సామర్థ్యాదేవేదం సకలం జగద్ బహుధా బహుప్రకారం విజాయతే విశిష్టతయోత్పద్యతే. (తస్యయోనిం) తస్య పరబ్రహ్మణో యోనిం సత్యధర్మానుష్ఠానం వేదవిజ్ఞానమేవ ప్రాప్తి కారణం ధీరా ధ్యానవంతః (పరిప...) పరితః సర్వతః ప్రేక్షంతే (తస్మిన్ హ తస్థుర్ భు...) తస్మిన్ భువనాని విశ్వాని సర్వాణి సర్వే లోకా స్తస్థుః – స్థితిం చక్రిరే. హేతి నిశ్చయార్థే. తస్మిన్నేవ పరమే పురుషే ధీరా జ్ఞానినో మనుష్యా మోక్షానందం ప్రాప్య తస్థుః – స్థిరా భవంతీ త్యర్థః. ౨౭

తె॥ (ప్రజాపతి) అతడే ప్రజాపతి – సర్వజగత్తునకు స్వామి. అతడే యీ జడచేతనములకు లోపల వెలుపలనంతటను వ్యాపించియున్నాడు. అతడు సమస్త ప్రపంచము నుత్పన్న మొనర్చి స్వయ మజన్ముడై యుండును. (తస్య యోనిం) ఆ పరబ్రహ్మప్రాప్తికి కారణములైన సత్యాచరణమును, సత్యవిద్యను ధ్యానముతో విద్వాంసు లెఱింగి పరమేశ్వరుని బొందుదురు. (తస్మిన్ హ తస్థుర్ భు...) అతనిలోనే సర్వలోకములు నున్నవి. ఆ పరమేశ్వరునందే జ్ఞానులు సత్యనిశ్చయముతో మోక్షసుఖమునుబొంది, జన్మమరణ రూపములగు నాగమన గమనములనుండి విడివడి ఆనందమగ్ను లగుదురు. ౨౭

సం॥ "యో దేవేభ్య ఆతపతి యో దేవానాం పురోహితః

పూర్వో యో దేవేభ్యో జాతో నమో రుచాయ బ్రాహ్మయే." ౨౮ యజు. ౩౧–౨౦

(యో దేవేభ్యః) యః పూర్ణః పురుషో దేవేభ్యో విద్వద్భ్యస్తత్ప్రకాశార్థ మాతపతి– ఆసమంతాత్తదంతః కరణే ప్రకాశయతి, నాన్యేభ్యశ్చ. యశ్చ దేవానాం విదుషాం పురోహితః సర్వైః సుఖైః సహమోక్షం విదుషో దధాతి. (పూర్వో యో దేవేభ్యో జాతో) దేవేభ్యో విద్వద్భ్యో యః పూర్వః పూర్వమేవ సనాతనత్వేన వర్తమానః సన్‌జాతః ప్రసిద్ధోఽస్తి. (నమో రుచాయ) తస్మై రుచాయ రుచికరాయ బ్రహ్మణే నమోఽస్తు. యశ్చ దేవేభ్యో విద్వద్భ్యో బ్రహ్మోపదేశం ప్రాప్య బ్రహ్మరుచిర్ బ్రాహ్మిర్ బ్రహ్మణోఽపత్యమివ వర్తమానోఽస్తి తస్మా అపి బ్రాహ్మయే బ్రహ్మసేవకాయ నమోఽస్తు. ౨౮

తె॥ (యో దేవేభ్యః) ఏ పరమేశ్వరుడు విద్వాంసులకు ప్రకాశస్వరూపుడో – విద్వాంసుల యాత్మలను ప్రకాశమున నుంచునో – ఎవడు విద్వాంసులకు పురోహితుడో – మిక్కిలి సుఖముల నిచ్చి పోషించునో, (పూర్వో....జాతః) ఎవడు సర్వవిద్వాంసులకు నాది విద్వాంసుడో, విద్వాంసుల జ్ఞానమువలననే యెవడు ప్రసిద్ధుడో, విద్వాంసులకే యెవడు ప్రత్యక్షమగునో (నమో రుచాయ) యత్యంతము నానంద స్వరూపుడై, సత్యమునందు రుచి గలిగించు నాబ్రహ్మకు మా నమస్కారములు. ఇట్లే విద్వాంసులనుండి వేదవిద్యాదులను బాగుగ జదివి, బ్రహ్మమును పితృతుల్యముగా నెంచి, సత్యభావముతో ప్రేమించి సేవించు విద్వాంసులకును మేము నమస్కరించుచున్నాము.

సం॥ "రుచం బ్రాహ్మం జనయంతో దేవా అగ్రే తదబ్రువన్,

యస్త్వైవం బ్రాహ్మణో విద్యాత్తస్య దేవా అసన్ వశే." ౨౧ యజు. ౩౧–౨౧

(రుచం బ్రాహ్మం) రుచం ప్రీతికరం బ్రాహ్మం బ్రహ్మణోఽపత్య మివ బ్రహ్మణః సకాశాజ్జాతం జ్ఞానం జనయంత ఉత్పాదయంతో దేవా విద్వాంసః అన్యేషామగ్రే తజ్జ్ఞానం తజ్జ్ఞానసాధనం వాఽబ్రువన్ బ్రువంతూపదిశంతు చ. (యస్త్వైవం) యస్త్వైవ మమునా ప్రకారేణ తద్బ్రహ్మ బ్రాహ్మణో విద్యాత్ (తు) పశ్చాత్తస్త్యైవ బ్రహ్మవిదో బ్రాహ్మణస్య దేవా ఇంద్రియాణి వశే అసన్ భవంతి నాన్య స్యేతి. ౨౧

తె॥ (రుచం బ్రాహ్మం) బ్రహ్మజ్ఞాన మానందదాయకము. అది మనుజునకు బ్రహ్మమున రుచిని బెంచును. అట్టి బ్రహ్మజ్ఞానమును, దానిసాధనములను, విద్వాంసు లన్యమానవుల యెదుట నుపదేశించి వాని నానందింప జేయుదురు. (యస్త్వైవం బ్రాహ్మణో) ఏమనుష్యుడిట్లు బ్రహ్మము నెఱుంగునో, యట్టి విద్వాంసునకే మనస్సు మున్నగు నింద్రియములన్నియు వశమున నుండును. ఇతరున కుండవు.

సం॥ "శ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యావహోరాత్రే పార్శ్వే నక్షత్రాణి రూప మశ్వినౌ వ్యాత్తమ్,

ఇష్ణన్నిషాణాముం మ ఇషాణ సర్వలోకం మ ఇషాణ." ౩౦, యజు. ౩౧–౨౨

"(శ్రీశ్చ తే) హే పరమేశ్వర! తే తవ (శ్రీః) సర్వా శోభా, (లక్ష్మీః) శుభలక్షణవతీ ధనాదిశ్చ, ద్వే ప్రియే పత్న్యౌ పత్నీవత్ సేవమానే స్తః. తథాఽహోరాత్రే ద్వే, తే తవ (పార్శ్వే) పార్శ్వవత్ స్తః, యే కాల చక్రస్య కారణభూతస్యాపి కక్షావయవవద్ వర్తేతే, సూర్యాచంద్రమసౌ నేత్రే వా, తథైవ నక్షత్రాణి తవైవ సామర్థ్యస్యాది కారణస్యావయవాః సంతి. తత్త్వయిరూపవ దస్తి. అశ్వినౌ ద్యావాపృథివ్యౌ తవైవ, (వ్యాత్తమ్) వికాశితం ముఖమివ వర్తతే. తథైవ యత్ కించిత్ సౌందర్య గుణయుక్తం వస్తు జగతి వర్తతే, తదపి రూపం తవైవ సామర్థ్యాజ్ జాతమితి జానీమః, హే విరాడధికరణేశ్వర! మే మమాముం పరలోకం మోక్షాఖ్యం పదం కృపాకటాక్షేణ (ఇష్ణన్) ఇచ్ఛన్ సన్ (ఇషాణ) స్వేచ్ఛయా నిష్పాదయ. తథా సర్వలోకం సర్వలోకరాజ్యం వా, మదర్థం కృపయా త్వమిషాణ – ఇచ్ఛ. స్వారాజ్యం సిద్ధం కురు. ఏవమేవ సర్వాః శోభాః, లక్ష్మీశ్చ శుభలక్షణవతీః సర్వాః క్రియాః మే–మదర్థ మిషాణ; హే భగవన్ ! పురుష ! పూర్ణపరమేశ్వర! సర్వశక్తిమన్! కృపయాసర్వాన్ శుభాన్ గుణాన్ మహ్యం దేహి, దుష్టా నశుభ దోషాంశ్చ వినాశయ. సద్యః స్వానుగ్రహేణ సర్వోత్తమ గుణభాజనం మాం భవాన్ కరోత్వితి.

అత్ర ప్రమాణాని :–– "శ్రీర్హి పశవః" శత. ౧–౮

"శ్రీర్ వై సోమః" శత. ౪–౧

"శ్రీర్ వై రాష్ట్రం, శ్రీర్ వై రాష్ట్రస్య భారః" శత. ౧౩–౧

"లక్ష్మీర్ లాభాద్ వా, లక్షణాద్ వా, లప్స్యమానాద్ వా, లాంఛ నాద్ వా, లషతేర్ వా స్యాత్ ప్రేప్సాకర్మణో, లష్టతేర్ వా స్యాదశ్లాఘా కర్మణః, శ్రిపే ఇత్యుపరిష్టాద్ వ్యాఖ్యాస్యామః" నిరు. ౪–౧౦

ఇతి పురుషసూక్త వ్యాఖ్యా సమాప్తా.

తె॥ (శ్రీశ్చ తే) ఓ పరమేశ్వర! నీ యనంత శోభారూపమగు శ్రీ యును, అనంత శుభలక్షణయుక్తమగు లక్ష్మియును పత్నులవలె నున్నవి. పత్ని పతిని సేవించును. అట్లే నీ సేవ నీకే ప్రాప్తించును. నీవే యీ సమస్త జగత్తునకును శోభను, శుభలక్షణములను ప్రసాదించియున్నావు. లోకమునగల శోభ, సత్యభాషణాది ధర్మలక్షణముల వలన లభించులాభము, రెండును నిన్ను సేవించుటకే. జగత్తున గల పదార్థము లన్నియు పరమేశ్వరుని యధీనముననే యుండును; కావున శోభాదులు, ఇట రూపకాలంకారముతో పత్నులుగా వర్ణింపబడినవని యెంచవలెను. అట్లే రాత్రింబవళ్ళు పార్శ్వములు అని చెప్పబడినవి. సూర్యచంద్రులు కూడ పరమేశ్వరునకు పార్శ్వములుగాను లేక నేత్రస్థాను లనబడినవి. నక్షత్రములన్నియు నీరూపస్థానులు. పృథివికి, సూర్య లోకమునకు మధ్యభాగము - అంతరిక్షము తెఱచియుంచిన పరమేశ్వరుని నోటికి సమానము. క్రింద భూలోకము, పైన సూర్యాదులలోకము రెండును పెదవులకు సమానముగ నున్నవి. ఇట్లే యెల్లపదార్థములలో గల సౌందర్యమంతయు పరమేశ్వరుని సామర్థ్యమువలన నేర్పడినదియే.

సమస్త జగత్తున కాధారభూతుడగు నో దేవ! (ఇష్ణన్) నీవు నీదయతో ఇచ్ఛాపూర్వకముగ (అముం) పరలోకమును - మోక్షసుఖమును మా కొసంగుము. కృపాదృష్టితో నేనీ ప్రపంచమునగల గుణము లతో గూడినవాడనై సర్వలోకసుఖముల కధికారినగునట్లు అనుగ్రహింపుము. నా కొఱకు స్వారాజ్యమును సిద్ధింపజేయుము. ఈ జగత్తున నన్ను ఉత్తమ శోభతోను, లక్ష్మితోను గూడియుండునట్లు చేయుదువు గాక! సర్వశక్తిమంతుడ వగు నో పూర్ణపురుష! నీవు కృపతో నాయందలి దుర్గుణములను దూరమొనర్పుము. సమస్త శుభగుణములను నాయందాధానము చేయుము. మేము ప్రార్థించున దిదియే. దయతో మా యీప్రార్థనను సఫలము చేయుము.

శతపథ బ్రాహ్మణమున శ్రీ శబ్దమునకు పశువు, సోమము, రాష్ట్రము, రాష్ట్ర భారము నను నర్థములు చూడనగును. నిరుక్తమున లక్ష్మీపదమున కీక్రింది యర్థములు చెప్పబడినవి -

(౧) లక్ష్మి వలన అనేక పదార్థములు లభించును. (౨) పురుషుడు లక్షితుడగును. లక్ష్మిగల మనుష్యు డితరులలో విశిష్టుడుగా జూడబడును. (౩) లక్ష్మి నెల్లరుగోరుదురు. (౪) లగ్యతేర్వా స్యాదా శ్లేషకర్మణః - లక్ష్మినెల్లరు నాలింగనము చేయగోరుదురు. (౫) అశ్లాఘార్థక 'లస్జ' ధాతువుతోను లక్ష్మి శబ్దము సిద్ధించును. కావున, పై మంత్రమున 'శ్రీ, లక్ష్మి' పదములకు జెప్పిన యర్థము సంగతమనియే యెంచవలెను. ౩౦

సం॥ "యత్ పరమ మవమం యచ్చ మధ్యమం ప్రజాపతిః ససృజే విశ్వరూపమ్, కియతా స్కంభః ప్రవివేశ తత్ర యన్నప్రావిశత్ కియత్తద్ బభూవ." ౩౧ అథర్వ. ౧౦, ౭-౪-౮

(యత్ పరమం) యత్ పరమం సర్వోత్కృష్టం ప్రకృత్యాదికం జగత్, యచ్చ (అవమం) నికృష్టం తృణ మృత్తికాక్షుద్రకృమికీటాదికం చాస్తి, (యచ్చ మధ్యమం) యన్మనుష్యదేహాద్యాకాశపర్యంతం మధ్యమం చ, తత్ త్రివిధం సర్వం జగత్ ప్రజాపతిరేవ, (ససృజే) స్వసామర్థ్య రూపకారణా దుత్పాదితవానస్తి. యోఽస్య జగతో వివిధం రూపం సృష్ట వానస్తి, (కియతా) వీతస్మిన్నిత్యారభ్య, 'కియద్ బభూ' వేతి పర్యంత సందర్భస్థానే, "సృష్ట్వా త్రివిధే జగతి స్కంభః ప్రజాపతిః పరమేశ్వరః స కియతా సంబంధేన ప్రవివేశ; తత్ర పరమేశ్వరే యత్త్రివిధం జగన్న ప్రావిశత్, తత్ కియద్ బభూవేతి" హస్తలిఖితభూమికాయాం పాఠః. వీతస్మింస్త్రివిధే జగతి స్కంభః ప్రజాపతిః స పరమేశ్వరః కియతా సంబంధేన ప్రవివేశ; న చైతత్ పరమేశ్వరే, (యన్న) యత్ త్రివిధం జగ న్నప్రావిశత్, తత్ కియద్ బభూవ? తదిదం జగత్ పరమేశ్వరా పేక్షయా అల్పమేవాస్తీతి. ౩౧

తె॥ (యత్ పరమ....) ౧. పరమము - సర్వోత్కృష్ట ప్రకృత్యాది జగత్తు; ౨. అవమము- నికృష్టము, తృణము, మట్టి, చిన్న చిన్న క్రిములు కీటకములు మున్నగు జగత్తు; 3. మధ్యమము - మనుష్యాదుల శరీరములు మొదలు ఆకాశపర్యంతమగు జగత్తు. ఈ ముప్పిధములయిన ఉత్తమ, మధ్యమ, నికృష్ట జగత్తంతయు పరమేశ్వరునిచే రచియింప బడినది. (జగత్తును సృష్టించి యా త్రివిధమగు జగత్తునందు పరమేశ్వరు డెంతభాగముతో సంబద్ధుడై యున్నాడు? ఆ పరమేశ్వరునం దేభాగమున త్రివిధ జగత్తునకు సంబంధము లేదో యా భాగ మెంత ?') అతడే విశ్వమున నానా విధములగు రచన నొనర్చుచున్నాడు. ఆ రచనల నన్నింటిని వాడే యెఱుగును. విద్వాంసులును పరమేశ్వరుని రచనలలో కొన్నింటినే యెఱుగ గలరు. పరమేశ్వరు డన్నింటిని రచించును. కాని, యతడా రచనలలో నెన్నడు చిక్కు పడడు. ఈ సంపూర్ణ విశ్వమతని కంటె నెంతో చిన్నది. ౩౧

సం॥ "దేవాః పితరో మనుష్యా గంధర్వాప్సరసశ్చ యే

ఉచ్ఛిష్టా జ్జజ్ఞిరే సర్వే దివి దేవా దివి శ్రితాః" ౩౨ అథర్వ. ౧౧, ౪-౭-౨౭

(దేవాః) దేవాః - విద్వాంసః, సూర్యాదయో లోకాశ్చ, పితరో జ్ఞానినః, మనుష్యా మననశీలాః, గంధర్వా గానవిద్యావిదః, సూర్యాదయో వా, అప్సరసః - ఏతేషాం స్త్రియశ్చ, యే చాపి జగతి మనుష్యాది జాతిగణా వర్తంతే, తే సర్వే, ఉచ్ఛిష్టాత్ సర్వస్మాదూర్ధ్వం శిష్టాత్ పరమేశ్వరాత్ తత్సామర్థ్యాచ్చ జజ్ఞిరే జాతాః సంతి, యే (దివి దేవాః దివి శ్రితాః) దివి దేవాః సూర్యాదయో లోకాః, యే చ దివి శ్రితాశ్చంద్రపృథివ్యాదయో లోకాస్తేపి సర్వే, తస్మాదేవోత్పన్నా ఇతి." ౩౨

ఇత్యాదయో మంత్రా ఏతద్విషయా వేదేషు బహవః సంతి.

ఇతి సంక్షేపతః సృష్టివిద్యావిషయః సమాప్తః

తె॥ (దేవాః) విద్వాంసులు, సూర్యాదిలోకములు, (పితరః) యథార్థవిద్యల నెఱుగు జ్ఞానులు, (మనుష్యాః) విచారశీలురు, (గంధర్వాః) గానవిద్యావిశారదులు, సూర్యాదిలోకములు, (అప్సరసః) పైన వర్ణింపబడిన వారి స్త్రీలు నెల్లరు నా యీశ్వరుని సామర్థ్యమువలననే జనించిరి. (దివి దేవాః) ప్రకాశించువారు, ప్రకాశస్వరూపము గల సూర్యాదిలోకములు, (దివి శ్రితాః) చంద్రుడు, పృథివి మున్నగు ప్రకాశరహితములగు నాకాశస్థితలోకములు నన్నియు నతని సామర్థ్యమువలననే జనించినవి.

వేదములందు నిట్టి సృష్టివిద్యావిషయమునకు సంబంధించిన మంత్రములు బహుసంఖ్యలో నున్నవి. గ్రంథవిస్తరభీతితో నిట సృష్టి విషయము సంక్షేపముగ వ్రాయబడినది.

సృష్టి విద్యావిషయము సమాప్తము.

# అథ పృథివ్యాదిలోక భ్రమణ విషయః

సం॥ అథేదం విచార్యతే పృథివ్యాదయో లోకా భ్రమన్త్యాహోస్విన్నేతి?

అత్రోచ్యతే -

వేదాదిశాస్త్రోక్త రీత్యా పృథివ్యాదయో లోకాః సర్వే భ్రమన్త్యేవ, తత్ర పృథివ్యాదిభ్రమణవిషయే ప్రమాణమ్ -

"ఆయం గౌః పృశ్నిరక్రమీదసదన్మాతరం పురః. పితరం చ ప్రయన్త్స్వః" యజు. ౩-౬

అస్యాభిప్రాయః-- "ఆయం గౌః" ఇత్యాది మంత్రేషు పృథివ్యాదయో హి సర్వే లోకా భ్రమన్త్యేవేతి విజ్ఞేయమ్, (ఆయం గౌః) ఆయం గౌః పృథివీగోలః, సూర్యశ్చంద్రోఽన్యో లోకో వా, పృశ్నిమంతరిక్ష మ్యాక్రమీద్ ఆక్రమణం కుర్వన్ సన్ గచ్ఛతీతి. తథాఽన్యేపి. తత్ర పృథివీ మాతరం సముద్రజల మసదత్ సముద్రజలం ప్రాప్తా సతీ, తథా (స్వః) సూర్యం పితర మగ్నిమయం చ, పురః పూర్వం పూర్వం ప్రయన్త్సన్ సూర్యస్య పరితో యాతి, ఏవమేవ సూర్యో వాయుం పితర మాకాశం మాతరం చ, తథా చంద్రోఽగ్నిం పితర మపో మాతరం ప్రతి చేతి యోజనీయమ్,

అత్ర ప్రమాణానిః-

"గౌః, గ్మా, జ్మేత్యాద్యేకవింశతిషు పృథివీ నామసు, గౌరితి పఠితం, యాస్కకృతే నిఘంటౌ."
అ. ౧-౧

"తథా చ-స్వః. పృశ్నిః, నాక ఇతి షట్సు సాధారణనామసు." నిఘంటు అ. ౧-౪

"పృశ్నిరిత్యంతరిక్షస్య నామోక్తమ్.' నిరుక్తే ౨-౪-౧౪

'గౌరితి పృథివ్యా నామధేయం యద్ దూరం గతా భవతి, యచ్చాస్యాం భూతాని గచ్ఛంతి,'
ని. ౨-౫

'గౌరాదిత్యో భవతి, గమయతి రసాన్, గచ్ఛత్యంతరిక్షే' అథ ద్యౌర్యత్ పృథివ్యా అధిదూరం గతా భవతి, యచ్చాస్యాం జ్యోతీంషి గచ్ఛంతి.' ని. ౨-౧౪

"సూర్యరశ్మిశ్చంద్రమా గంధర్వ' ఇత్యపి నిగమో భవతి, సోఽపి గౌరుచ్యతే."నిరు. అ. ౨-౬

'స్వరాదిత్యో భవతి.' నిరు. ౨-౧౪

'గచ్ఛతి ప్రతిక్షణం భ్రమతి యా సా గౌః పృథివీ. 'అద్భ్యః పృథివీ' తి తైత్తిరీయోపనిషది,'
ఆనంద, ౧

యస్మాద్ యజ్జాయతే, సోఽర్థస్తస్య మాతా పితృవద్ భవతి. తథా స్వః శబ్దేనాదిత్యస్య గ్రహణాత్ పితుర్విశేషణత్వా దాదిత్యోఽస్యాః పితృవదితి నిశ్చీయతే. యద్ దూరంగతా, దూరం దూరం

సూర్యాద్ గచ్ఛతీతి విజ్ఞేయమ్. ఏవమేవ సర్వే లోకాః స్వస్య స్వస్య కక్షాయాం వాయ్వాత్మనా ఈశ్వరసత్తయా చ ధారితాః సంతో భ్రమంతీతి సిద్ధాంతో బోధ్యః.

తె॥ సృష్టివిద్యావిషయ వర్ణనానంతరము పృథివ్యాదిలోకములు తిరుగుచున్నవా? లేదా? యను విషయమునుగూర్చి యిట వ్రాయబడును.

వేదశాస్త్రముల ప్రమాణముల వలనను, యుక్తి వలనను, భూమి, సూర్యాదిలోకములు తిరుగుచున్నవి యనియే సిద్ధాంతము. ఇందుకు ప్రమాణముః

(ఆయం గౌః) భూమి, సూర్యుడు, చంద్రుడు మున్నగు లోకములకు 'గౌః' అని నామము. ఇవి యన్నియు నంతరిక్షమున తమ పరిధులలో నెల్లపుడు తిరుగుచుండును. జలము భూమికి మాత వంటిది. జలపరమాణువులతో భూపరమాణువులు సంయుక్తము లగుటవలన భూమి యేర్పడును. అట్లే యీ పృథివి మేఘమండలగత జలగర్భము మధ్యలో నెల్లపుడు నుండును. సూర్యుడు పృథివికి తండ్రి వంటివాడు, పృథివి సూర్యునిజుట్టి తిరుగును. ఇట్లే సూర్యునకు తండ్రి వాయువు; తల్లి యాకాశము. చంద్రున కగ్ని తండ్రి; జలము తల్లి, ఇట్లే లోకము లన్నియు వాని వాని కక్ష్యలో తిరుగుచుండును.

ఈ మంత్రార్థవిషయమున నీ క్రింది ప్రమాణములు గ్రహింపదగినవిః-

'గౌః' పదమున కర్థము పృథివియని నిరుక్తమున వ్రాయబడినదిః నిఘంటువునే పృథివీపర్యాయములలో 'గౌః' అను పదము పఠింప బడినది.

౧. సూర్యునకు దూర దూరమున నిది గతి గలిగియుండును.

౨ దీనిలో ప్రాణులు గతి కలిగియుండును.

నిరుక్తమున సూర్యుడు కూడ 'గౌః' అని చెప్పబడినాడు. అతడు (౧) రసము నాకర్షించును, (౨) స్వయముగ నంతరిక్షమున చలించు చుండును.

'గౌః' అను పదమునకు ద్యులోకమనియు నిరుక్తమున నున్నది. (౧) ద్యులోకము పృథివికి చాల దూరమున నున్నది. (౨) ఇందు సూర్యాది జ్యోతిర్మయ లోకములు తిరుగుచుండును.

నిరుక్తమున, నాదిత్యునకు, 'స్వః' అనియు నామము చూడ నగును. (౧) అంధకారమును బూర్ణముగ దూరమొనర్చును. (౨) రసములను బ్రతిగ్రహించుట కాదిత్యుడు దూరము పోయియున్నాడు. (౩) చంద్రుడు, పృథివి మున్నగు లోకములను బ్రకాశింపజేయును. (౪) దీప్తియుక్తమై యున్నది.

'పృశ్ని' అనగా నంతరిక్షమని నిరుక్తము. అందు సూర్యాది జ్యోతిర్మయలోకము లున్నవి.

పృథివి జలమునుండి యుత్పన్నమైనట్లు తైత్తిరీయోపనిషత్తు నందును వర్ణింపబడినది.

ఇట్లే సూత్రాత్మ యగు వాయువు యొక్క యాధారమునకు, ఆకర్షణమువలనను సర్వలోకములు ధరింపబడుచున్నవి - తిరుగాడుచున్నవి, అట్లే పరమేశ్వరుడు దన సామర్థ్యముతో పృథివ్యాది లోకముల ధారణ, భ్రమణ పోషణములను జరుపుచున్నాడు.

*సం॥* "యా గౌర్ వర్తనిం పర్యేతి నిష్కృతం పయో దుహానా వ్రత నీరవారతః, సా ప్రబ్రువాణా వరుణాయ దాశుషే దేవేభ్యో దాశద్ధవిషా వివస్వతే. ౨ ఋ. ౮, ౨-౧౦-౧

*(యా గౌర్ వర్తనిం) యా పూర్వోక్తా గౌర్ వర్తనిం స్వకీయమార్గం (అవారతః) నిరంతరం భ్రమతీ*

సతీ పర్యేతి, వివస్వతేఽర్థాత్ సూర్యస్య పరితః సర్వతః స్వస్వమార్గం గచ్ఛతి (నిష్కృతం) కథం భూతం మార్గం తత్తద్గమనార్థ మీశ్వరేణ నిష్పాదితమ్? (పయో దుహానా) అవారతో నిరంతరం పయో దుహానాఽనేకరసఫలాదిభిః ప్రాణినః ప్రపూరయంతీ, తథా (వ్రతనీః) వ్రతం స్వకీయభ్రమణాది సత్యనియమం ప్రాపయంతీ, (సా ప్ర....) దాశుషే దానకర్త్రే. వరుణాయ శ్రేష్ఠకర్మ కారిణే దేవేభ్యో విద్వద్భ్యశ్చ, హవిషా హవిర్దానేన సర్వాణి సుఖాని దాశత్ దదాతి. కిం కుర్వతీ? ప్రబ్రువాణా సర్వ ప్రాణినాం వ్యక్తవాణ్యా హేతుభూతా సతీయం వర్తత ఇతి.

తె॥ (యా గౌర్....) పూర్వమంత్రార్థమున నేయే లోకములు 'గౌః' నామముతో చెప్పబడినవో యవియన్నియు తమ తమ కక్షలలో తిరుగును. భూమి తన కక్షలో సూర్యుని జుట్టి తిరుగుచున్నది. పరమేశ్వరు డేయే లోకమున కేయే మార్గము తిరుగుటకు నిశ్చయించెనో యాయా మార్గములందు లోకములన్నియు దిరుగుచున్నవి. (పయో దుహానా) ఆగోవు - పృథివ్యాది లోకములు, నానావిధ ఫలములు, రసములు, పుష్పములు, తృణములు, అన్నము-మున్నగు పదార్థములతో నిరంతరము ప్రాణులను పూర్ణమొనర్చును. అట్లే సర్వ లోకములు తమ తమ మార్గములలో నియమబద్ధములై తిరుగు చుండును. (సా ప్రబ్రువాణా) విద్యాద్యుత్తమ గుణముల నిచ్చు పరమేశ్వరు నెఱుగుట కీ సంపూర్ణ జగత్తొక దృష్టాంత మనదగియున్నది; విద్వాంసులకీ లోక ముత్తమపదార్థముల మూలమున ననేక విధములగు సుఖముల నాడగూర్చుచున్నది. పృథివి, సూర్యుడు, చంద్రుడు, వాయువు మున్నగు గోపద వాచ్యలోకములే సర్వప్రాణుల వాణికి నిమిత్తములు.

సం॥ "త్వం సోమ పితృభిః సంవిదానోఽను ద్యావాపృథివీ ఆతతంథ, తస్మై త ఇంద్రో హవిషా విధేమ వయం స్యామ పతయో రయీణామ్." 3 ఋ, ౬, ౪-౧౩-౩

అస్యాభిప్రాయః :-

(త్వం సోమ....) అస్మిన్ మంత్రే చంద్రలోకః పృథివీ మనుభ్రమతీత్యయం విశేషోఽస్తి. అయం సోమశ్చంద్రలోకః, పితృభిః పితృవత్ పాలకైర్ గుణైః సహ సంవిదానః సమ్యగ్ జ్ఞాతః సన్ భూమి మనుభ్రమతి. కదాచిత్ సూర్యపృథివ్యోర్ మధ్యేపి భ్రమన్ సన్నా గచ్ఛతీత్యర్థః, అస్యార్థం భాష్యకరణసమయే స్పష్టతయా వక్ష్యామి. తథా ద్యావాపృథివీ ఏజేతే; ఇతి మంత్రవర్ణార్థాత్, ద్యౌః సూర్యః, పృథివీ చ భ్రమత శ్చలత ఇత్యర్థః, అర్థాత్ స్వస్యాం కక్షాయాం సర్వే లోకా భ్రమంతీతి సిద్ధమ్.

ఇతి సంక్షేపతః పృథివ్యాదిలోకభ్రమణ విషయః.

తె॥ (త్వం సోమ....) ఈ మంత్రమున తండ్రివలె పోషకగుణములతో గూడిన చంద్రలోకము పృథివిని చుట్టి తిరుగుచున్నట్లు వర్ణింప బడినది. అప్పుడప్పు డీ చంద్రుడు సూర్యునకును భూమికిని మధ్య వచ్చుచుండును. ఈ మంత్రార్థము భాష్యమున వివరముగ వ్రాయుదును. (ద్యావా పృథివీ) ప్రకాశయుక్త సూర్యాదిలోకములు, ప్రకాశరహితము లగు భూమి, చంద్రుడు మున్నగు లోకములు నన్నియు తమ తమ కక్షలలో నెల్లప్పుడు తిరుగుచుండును. కావున లోకములన్నియు భ్రమణ మొనర్చుచుండుననియే సిద్ధమగుచున్నది.

పృథివ్యాదిలోక భ్రమణ విషయము సమాప్తము.

# అథాకర్షణానుకర్షణ విషయః

సం॥ "యదా తే హర్యతా హరీ వావృధాతే దివే దివే.

ఆదిత్తే విశ్వా భువనాని యేమిరే." ౧ ఋ, ౬, ౧-౬-౩

(యదా తే....) అస్యాభిప్రాయః :-- సూర్యేణ సహ సర్వేషాం లోకానాం ఆకర్షణమస్తి ఈశ్వరేణ సహ సూర్యాదిలోకానాం చేతి, హే ఇంద్రేశ్వర! వా వాయో! సూర్య! యదా యస్మిన్ కాలే తే హరీ ఆకర్షణ ప్రకాశన హరణశీలౌ బలపరాక్రమగుణా వశ్వౌ కిరణౌ వా, హర్యతా హర్యతౌ, ప్రకాశవంతా వత్యంతం వర్ధమానౌ భవతస్తాభ్యామ్ (ఆదిత్) తదనంతరం (దివే దివే) ప్రతిదినం ప్రతిక్షణం చ తే తవ గుణాః ప్రకాశాకర్షణాదయో. (విశ్వా) విశ్వాని సర్వాణి భువనాని సర్వాన్ లోకా నాకర్షణేన యేమిరే నియమేన ధారయంతి. అతఃకారణాత్ సర్వే లోకాః స్వాం స్వాం కక్షాం విహాయ, ఇతస్తతో నైవ విచలంతీతి. ౧

తె॥ (యదా తే....) సర్వలోకములతో సూర్యునకును, సూర్యాది లోకములతో నీశ్వరునకును నాకర్షణ మున్నదని యీ మంత్రాభిప్రాయము;౧ (యదా తే) ఓ ఇంద్ర! పరమేశ్వర! నీ యనంత బలపరాక్రమాది గుణముల మూలమున బ్రహ్మాండ ధారణము, (హరణ) ఆకర్షణము, పాలనము (ప్రకాశనము)లు జరుగుచున్నవి. నీ గుణములే సూర్యాదిలోకములను ధరించుచున్నవి. కావున నెల్ల లోకములు తమ కక్షలు విడిచి యిటు నటు చలింపజాలవు. ౨. ఇంద్రుడు=వాయువు= సూర్యుడు. సూర్యునిలో నీశ్వరునిచే రచియింపబడిన ఆకర్షణము, బలము, ప్రకాశము మున్నగు గొప్ప గుణములున్నవి. ఆ గుణముల వలన ప్రతిదినము, ప్రతి క్షణము సర్వలోకముల యొక్క ధారణాకర్షణ ప్రకాశాదులు నిర్వర్తింపబడుచున్నవి. అందువలన లోకములన్నియు వాని వాని కక్షలలో దిరుగుచు నిటునటు విచలితములు కావు.

సం॥ "యదా తే మారుతీర్ విశ్వస్తుభ్య మింద్ర నియేమిరే,

ఆదిత్తే విశ్వా భువనాని యేమిరే." ౨ ఋ.౬.౧-౬-౪

అస్యాభిప్రాయ :- అత్రాపి పూర్వమంత్రవ దాకర్షణ విద్యాఽస్తీతి. (యదా తే...) హే పూర్వోక్తేంద్ర! యదా తే తవ మారుతీర్ -మారుత్యో మరణ ధర్మాణో మరుత్ ప్రధానా వా విశః ప్రజా స్తుభ్యం యేమిరే తవాకర్షణ ధారణ నియమం ప్రాప్నువంతి; తదైవ సర్వాణి విశ్వాని భువనాని, స్థితిం లభంతే, తథా తవైవ గుణైర్ నియేమిరే, ఆకర్షణ నియమం ప్రాప్తవంతి సంతి. అత ఏవ సర్వాణి భువనాని యథాకక్షం భ్రమంతి వసంతి చ." ౨

తె॥ అభిప్రాయ :- ఈ మంత్రము నందును నాకర్షణ విద్యా విషయమున్నది. (యదా తే మారుతీః) ఓ పరమేశ్వర! ఉత్పత్తి, స్థితి, లయములు గల నీ ప్రజలో-సృష్టిలో-వాయువు ప్రధానము-ముఖ్యమైనది. అయ్యది నీ యాకర్షణాది నియమముల వలనను, సూర్యలోకాకర్షణము వలనను స్థిరముగా నున్నది. నీ గుణము లీ ప్రజను నియమములందుంచుట వలననే లోకములన్నియు వాని వాని కక్షలలో దిరుగు చున్నవి; వాని వాని స్థానములలో నిలిచి యున్నవి.

సం॥ "యదా సూర్యమముం దివి శుక్రం జ్యోతి రధారయః,
అదిత్తే విశ్వా భువనాని యేమిరే." ఋ.౬-౧-౬-౫ 3

అభి :- అత్రాపి పూర్వ వదభిప్రాయః (యదా సూర్య...) హే పరమేశ్వర! అముం సూర్యం భవాన్ రచితవానస్తి. యద్దివి ద్యోత నాత్మకే త్వయి శుక్ర మనంతం సామర్థ్యం జ్యోతిః ప్రకాశమయం వర్తతే, తేన త్వం సూర్యాది లోకా నధారయో ధారితవానసి, (ఆదిత్తే) తదనంతరం, (విశ్వా) విశ్వాని సర్వాణి భువనాని, సూర్యాదయో లోకా అపి (యేమిరే) తదాకర్షణ నియమేనైవ స్థిరాణి సంతి. అర్థాద్ యథా సూర్యస్యాకర్షణేన పృథివ్యాదిలోకా స్తిష్ఠన్తి, తథా పరమేశ్వర స్యాకర్షణేనైవ సూర్యాదయః సర్వేలోకా నియమేన సహ వర్తన్త ఇతి. 3

తె॥ అభి:- ఈ మంత్రము కూడ నాకర్షణ విషయకమే. (యదా సూర్య) ఓ పరమేశ్వర ! యీ సూర్యాది లోకములను నీవే రచించితివి. నీ ప్రకాశము చేతనే యివి ప్రకాశితము అగుచున్నవి. నీవు నీ యనంత సామర్థ్యముతో వీనిని ధరించుచున్నావు. అందువలననే సూర్యుడు, పృథివి మున్నగు లోకములు కూడ తమ స్వరూపమును నిలుపు కొనుచున్నవి. ఇతర సర్వలోకములతో బాటు ఆకర్షణవలననే యీ సూర్యాది లోకములయు ధారణ జరుగుచున్నది. సూర్యుని యాకర్షణవలననే సూర్యాది సర్వలోకములు నియమబద్ధములై యున్నవి. దీనిం బట్టి పరమేశ్వరుడు సర్వలోకముల నాకర్షించుచున్నాడు; ధరించుచున్నాడని సిద్ధమగుచున్నది.

సం॥ "వ్యస్తభ్నా ద్ రోదసీ మిత్రో అద్భుతోఽంతర్వావదకృణో జ్యోతిషాతమః విచర్మణీవ ధిషణే అవర్తయద్ వైశ్వానరో విశ్వ మధత్త వృష్ణ్యమ్. ౪ ఋ.౪,౫-౧౦-౩

అభి :- (వ్యస్తభ్నాద్ రోదసీ) పరమేశ్వర సూర్యలోకౌ సర్వాంల్లోకా నాకర్షణ ప్రకాశాభ్యాం ధారయత ఇతి. హే పరమేశ్వర! తవ సామర్థ్యేనైవ వైశ్వానరః పూర్వోక్తః సూర్యాదిలోకో రోదసీ ద్యావా పృథివ్యౌ భూమి ప్రకాశౌ వ్యస్తభ్నాత్ స్తంభితవానస్తి. అతో భవాన్ మిత్ర ఇవ సర్వేషాం లోకానాం వ్యవస్థాపకోఽస్తి. అద్భుత ఆశ్చర్య స్వరూపః స సవితాది లోకో జ్యోతిషా తమోంతరకృణో త్తిరోహితం నివారితం తమః కరోతి. వావత్తథైవ ధిషణే ధారణ కర్త్ర్యౌ ద్యావాపృథివ్యౌ ధారణాకర్షణేన వ్యవర్తయత్, వివిధత యెతయోర్ వర్తమానం కారయతి. కస్మిన్నివ? చర్మ ణ్యాకర్షితాని లోమానీవ. యథా త్వచి లోమాని స్థితా న్యాకర్షితాని భవంతి. తథైవ సూర్యాది బలాకర్షణేన సర్వే లోకాః స్థాపితాః సంతీతి విజ్ఞేయమ్. అతః కిమాగతమ్? వృష్ణ్యం వీర్యవద్ విశ్వం సర్వం జగచ్చ సూర్యాదిలోకో ధారయతి, సూర్యాదేర్ ధారణ మీశ్వరః కరోతి" ఇతి. ౪

తె॥ అభి:- ఈ మంత్రమునందు నాకర్షణవిషయమే వర్ణింపబడినది. పరమేశ్వరుడు సూర్యలోకము రెండును నాకర్షణ ప్రకాశముల మూలమున సర్వలోకములను ధరించుచున్నవి. ఓ పరమేశ్వర ! నీ ప్రకాశము వలననే వైశ్వానర, సూర్యాదిలోకముల ధారణ ప్రకాశములు గలుగుచున్నవి. కావుననే సూర్యాదిలోకములు కూడ తమ యాకర్షణ వలన తమ యొక్కయు, పృథివ్యాదిలోకములయు ధారణ నొనర్చుటలో సమర్థములగుచున్నవి. కాబట్టి నీవు సర్వలోకములకు పరమ మిత్రుడవు; స్థాపన కర్తవును. నీ సామర్థ్య మత్యంతాశ్చర్యకరము. నీ యద్భుత స్వరూపము కారణముగ సూర్యాదిలోకములు తమ ప్రకాశముతో నంధకారమును దొలగించుచున్నవి. అట్లే ప్రకాశ రూపులు, నప్రకాశరూపులు నగు నుభయలోక సముదాయము ధారణాకర్షణ వ్యవహారమున వర్తించుచున్నది. అందువలననే యీ లోకముల వలన నానా విధ వ్యవహారములు సిద్ధించుచున్నవి. చర్మముల రోమముల యాకర్షణ యున్నట్లు సూర్యాదిలోకముల యాకర్షణతో బాటు

సర్వలోకముల యాకర్షణ జరుగుచున్నది. ఇదియే యాకర్షణ రీతి. దీనింబట్టి వీర్యము వలె సూర్యాదిలోకములు సమస్త విశ్వమును ధరించు చున్నవనియు, పరమేశ్వరుడు కూడ నీ సూర్యాది లోకముల నాకర్షించి ధరించు చున్నాడనియు తేలుచున్నది.

సం॥ "ఆకృష్ణేన రజసా వర్తమానో నివేశయ న్నమృతం మర్త్యం చ.

హిరణ్యయేన సవితా రథేన దేవో యాతి భువనాని పశ్యన్." ౫ యజు. ౩౩–౪౩

అభి :– (ఆకృష్ణేన) అత్రా ప్యాకర్షణ విద్యాఽస్తీతి. సవితా పరమాత్మా సూర్యలోకో వా, రజసా సర్వైర్ లోకైః సహాకృష్ణేనాకర్షణ గుణేన సహవర్తమానోఽస్తి. కథం భూతేన గుణేన? హిరణ్యయేన జ్యోతిర్మయేన. పునః కథం భూతేన? రమణానందాది వ్యవహారసాధక జ్ఞాన తేజోరూపేణ రథేన కిం కుర్వన్ సన్? మర్త్యం మనుష్యలోక మమృతం సత్య విజ్ఞానం కిరణ సమూహం వా స్వస్వకక్షాయాం నివేశయన్ వ్యవస్థాపయన్ సన్. తథా చ మర్త్యం పృథివ్యాత్మకం లోకం ప్రత్యమృతం మోక్ష మోషధ్యాత్మకం వృష్ట్యాదికం రసం చ ప్రవేశ యన్ సన్ సూర్యో వర్తమానోఽస్తి. స చ సూర్యో దేవో ద్యోతనాత్మకో భువనాని సర్వాన్ లోకాన్ ధారయతి తథా పశ్యన్ దర్శయన్ సన్ రూపాదికం విభక్తం యాతి ప్రాపయతీత్యర్థః అస్మాత్ పూర్వమంత్రాత్ "ద్యుభిరక్తుభి" రితి పదానువర్తనాత్ సూర్యోద్యుభిః సర్వైర్ దివసై రక్తుభిః సర్వాభి రాత్రిభి శ్చార్థాత్ సర్వాన్ లోకాన్ ప్రతిక్షణ మాకర్షతీతి గమ్యతే. ఏవం సర్వేషు లోకే ష్వాత్మికా స్వాస్వా ప్యాకర్షణశక్తి రస్త్యేవ. తథా అనంతాకర్షణ శక్తిస్తు ఖలు పరమేశ్వరేఽస్తీతి మన్తవ్యమ్.

రజో లోకానాం నామాస్తి. అత్రాహుర్ నిరుక్త కారా యాస్కాచార్యాః "లోకా రజాం స్యుచ్యంతే" ని. ౪–౧౯

"రథో రంహతే ర్గతి కర్మణః స్థిరతేర్ వా స్యా ద్విపరీతస్య.

రమమాణోఽస్మింస్తిష్ఠతీతి వా, రపతేర్ వా, రసతేర్ వా," నిరు. ౯–౧౧

"విశ్వానరస్యాదిత్యస్య" నిరు. ౧౨–౨౧

అతో రథ శబ్దేన రమణానందకరం జ్ఞానం తేజో గృహ్యతే. ౧౫

ఇత్యాదయో మంత్రా వేదేషు ధారణాకర్షణ విధాయకా బహవః సంతీతి బోధ్యమ్.

ఇతి ఆకర్షణానుకర్షణ విషయః సమాప్తః

తె॥ అభిప్రాయము :– ఈ మంత్రమునందును నాకర్షణను గూర్చియే వర్ణింపబడినది. (ఆకృష్ణేన) సవితా– పరమేశ్వరుడు, సూర్యుడు సర్వలోకములతో బాటు ఆకర్షణ, ధారణగుణములతో గూడియున్నాడు. పరమాత్ముడు, సూర్యుడు నిరువురును (హిరణ్య) జ్యోతిర్మయులు. (రథేన) అట్లే క్రమముగ వారిరువురు నానందాది వ్యవహారసాధకము లగు జ్ఞానము, తేజస్సుతో గూడియున్నారు. పరమేశ్వరుడు మర్త్యుల మనుష్యుల హృదయములలో నమృతము–సత్య విజ్ఞానమును ప్రకాశింప జేయును. సూర్యుడును రసాది పదార్థములను మనుష్యలోకమున బ్రవేశింపజేయును. పరమేశ్వరుడు, సూర్యుడు నిరువురును సర్వలోకములను వాని వాని స్థానములలో నుండునట్లు చేయుచున్నారు. పరమేశ్వరుడు ధర్మాత్ములు, జ్ఞానులు నగు వారికి

నమృతరూపమోక్షము నొసంగును. సూర్యలోకము నట్లే రసయుక్తములగు నోషధులను, వృష్టిజలరూపమగు నమృతమును పృథివికి నొసంగును. పరమేశ్వరుడు సత్యాసత్యముల ప్రకాశమును, సర్వలోక ప్రకాశమును జేసి యెల్లరకు తెలియజేయును. అట్లే సూర్యలోకము గూడ రూపాదివిభాగజ్ఞానము గలిగించును. ఇట్లీరువురు సర్వలోకధారకు లగుచున్నారు. ఈ మంత్రమున దీనికి పూర్వపు మంత్రము నుండి ద్యుభిః అక్తుభిః'పదముల నన్వయించిన (ద్యు=దినము, అక్తు=రాత్రిరేయింబవళ్ళు - ఎల్లప్పుడు సర్వలోకములను సూర్యుడాకర్షించుచున్నట్లును, నా సూర్యాదిలోకములను పరమేశ్వరు డాకర్షించుచున్నట్లును దెలియును. ఇట్లు ఈశ్వర రచనవలననే సర్వలోకములందును నాయా లోకముల యాకర్షణ జరుగుచున్నది. పరమేశ్వరుని యాకర్షణ శక్తి మాత్ర మనంతము.

రజస్సన లోకములని యాస్కముని, అతడు రథ శబ్దమున కనే కార్థములు చెప్పి యున్నాడు. (౧) గమనార్థకమగు 'రంహ' ధాతువుతో రథ శబ్ద మేర్పడును. మనుష్యుడు రథ సహాయమున నిటునటు వెళ్ళును. (౨) 'స్థిర' శబ్దమున గల యక్షరములను విపరీతము చేసిన 'రస్థి', రస్థ, రథము అని క్రమముగ నేర్పడుచున్నది. మానవుడు రథము మీద స్థిరముగా కూర్చుండగలడని భావము. (3) రస్ + స్థా + డ = రథము. దీని మీద మనుష్యుడు ఆనందముగ లేక విశ్రాంతిగ గూర్చుండనగును. (౪) శబ్దార్థకమగు 'రప' ధాతువు వలన గాని, 'రస' ధాతువు వలనగాని రథ శబ్దము సిద్ధించును. నడచునపుడు ధ్వని యగును కావున రథమన బడునని భావము.

కావున దేనివలన రమణము - ఆనందము - ప్రాప్తించునో యది రథమని చెప్పబడును. ఈ కారణమువలననే రథమున కర్థము ఆనంద దాయక జ్ఞానము తేజస్సునని చెప్పబడినది. ఈ విషయమున నిరుక్త ప్రమాణము నీ మంత్ర భాష్యమునందే వ్రాసితిమి చూడవచ్చును.

నిరుక్తమున ఆదిత్యుడను నర్థమున 'విశ్వానర' పదము చూడనగును. విశ్వానర శబ్దమునకీ క్రింది యర్థము లున్నవి.

(౧) (విశ్వాన్ నరాన్ నయతి) సూర్యుడు పృథివ్యాదిలోకముల నన్నింటిని నాకర్షణము మూలమున దనతో తీసికొనిపోవును. (౨) (విశ్వ ఏనం) మనుష్యులెల్లరు నీ సూర్యుని తేజస్సును పొందుదురు. (౩) (విశ్వాన్ పదార్థాన్ అరః గతః) సర్వ పదార్థములందును నితడు ప్రాప్తించియున్నాడు. లేక సర్వ పదార్థముల నితడు వ్యాపించియున్నాడు. సూర్యుడు కూడ లోకముల నాకర్షించి, ధరించునని భావము.వేదములందు ధారణాకర్షణాదులను దెలుపు మంత్రములు పెక్కుకలవు.

ధారణాకర్షణ విద్యా విషయము సమాప్తము.

# అథ ప్రకాశ్య ప్రకాశక విషయః

(సంక్షేపతః)

సం॥ సూర్యేణ చంద్రాదయః ప్రకాశితా భవంతీత్యత్ర విషయే విచారః–

"సత్యేనోత్తభితా భూమిః సూర్యేణోత్తభితా ద్యౌః,

ఋతే నాదిత్యా స్తిష్ఠంతి దివి సోమో అధిశ్రితః." ౧ అథర్వ, ౧౪–౧–౧

"సోమేనాదిత్యా బలినః సోమేన పృథివీ మహీ,

అథో నక్షత్రాణా మేషా ముపస్థే సోమ ఆహితః. ౨ అథర్వ, ౧౪–౧–౨

"కః స్వి దేకాకీ చరతి క ఉ స్విజ్జాయతే పునః,

కిం స్విద్ధిమస్య భేషజం కిం వా వపనం మహత్." ౩ యజు. ౨౩–౯

"సూర్య ఏకాకీ చరతి చంద్రమా జాయతే పునః.

అగ్నిర్ హిమస్య భేషజం భూమి రావపనం మహత్." ౪ యజు, ౨౩–౧౦

ఏషామభిప్రాయః–

(సత్యేనోత్తభితా) అత్ర చంద్రపృథివ్యాదిలోకానాం సూర్యః ప్రకాశకోఽస్తీతి. ఇయం భూమిః సత్యేన నిత్యస్వరూపేణ, బ్రహ్మణోత్తభితా ఊర్ధ్వమాకాశమధ్యే ధారితాఽస్తి వాయునా సూర్యేణ చ. (సూర్యేణ) తథా ద్యౌః సర్వః సూర్యేణోత్తభితో ధారితః (ఋతేన) కాలేన సూర్యేణ వాయునా వా ఆదిత్యా ద్వాదశమాసాః, కిరణాస్త్రసరేణవో బలవంతః సంతో వా తిష్ఠంతి. (దివి సోమోఽధి శ్రితః) ఏవం దివి ద్యోతనాత్మకే సూర్య ప్రకాశే సోమశ్చంద్రమా అధిశ్రిత ఆశ్రితః సన్ ప్రకాశితో భవతి, అర్థాచ్చంద్రలోకాదిషు స్వకీయః ప్రకాశో నాస్తి, సర్వే చంద్రాదయో లోకాః సూర్యప్రకాశేనైవ ప్రకాశితా భవంతీతి వేద్యమ్. ౧

(సోమేనాదిత్యా) సోమేన చంద్రలోకేన సహాదిత్యాఃకిరణాః సంయుజ్య, తతో నివృత్య చ భూమిం ప్రాప్య బలినో బలం కర్తుం శీలా భవంతి, తేషాం బలప్రాపక శీలత్వాత్. తద్యథా–యావంతో (యావతి) అంతరిక్షదేశే సూర్యప్రకాశస్యావరణం పృథివీ కరోతి, తావతి దేశేఽధికం శీతలత్వం భవతి. తత్ర సూర్యకిరణపతనాభావాత్త దభావే చోష్ణత్వాభావాత్తే బలకారిణో బలవంతో భవంతి. సోమేన చంద్రమసః ప్రకాశేన సోమాద్యోషధ్యాదినా చ పృథివీ మహీ బలవతీ పుష్టా భవతి. అథో ఇత్యనంతర మేషాం నక్షత్రాణా ముపస్థే సమీపే చంద్రమా ఆహితః స్థాపితఃసన్ వర్తత ఇతి విజ్ఞేయమ్. ౨

(కిం స్విద్...) ౧. కోహ్యేకాకీ బ్రహ్మాణ్డే చరతి? కోఽత్ర స్వేనైవ స్వయం ప్రకాశితః సన్ భవతీతి? ౨. కః పునః ప్రకాశితో జాయతే? ౩. హిమస్య శీతస్య భేషజ మౌషధం కిమస్తి? ౪తథా బీజారోపణార్థం మహత్ క్షేత్రమివ కిమత్ర భవతీతి? ప్రశ్నాశ్చత్వారః ౩

ఏషాం క్రమేణోత్తరాణి – (సూర్య ఏకాకీ) ౧. అస్మిన్ సంసారే సూర్య ఏకాకీ చరతి, స్వయం ప్రకాశమానః సన్నన్యాన్ సర్వాన్ లోకాన్ ప్రకాశయతి. ౨. తస్యైవ ప్రకాశేన చంద్రమాః పునః ప్రకాశితో .జాయతే. న హి చంద్రమసి స్వతఃప్రకాశః కశ్చిదస్తీతి, ౩. అగ్నిర్ హిమస్య శీతస్య భేషజ మౌషధమస్తీతి. ౪. భూమిర్ మహదావపనం బీజారోపణాదే రధికరణం క్షేత్రం చేతి. ౪

వేదేష్వేతద్విషయ ప్రతిపాదకా ఏవం భూతా మంత్రా బహవఃసంతి.

తె॥ లోకములు రెండు విధములు. స్వయం ప్రకాశించు లోకము లొకరకము. పరప్రకాశితములగు లోకములు రెండవరకము. పై మంత్రములలో నిట్ట లోకముల విషయమే వర్ణింపబడినది.

(సత్యేనోత్తభితా భూమిః) సత్యస్వరూపుడగు పరమేశ్వరుడు తన సామర్థ్యముతో సూర్యాదిలోకముల ధరించియున్నాడు. అతని సామర్థ్యము వలననే సత్యము–సూర్యలోకము కూడ నన్యలోకముల నాకాశమున ప్రకాశింపజేయుచున్నది. (ఋతేన) కాలము, సూర్యుడు, వాయువు వీని యాధారమున క్రమముగ పంద్రెండు మాసములు, కిరణములు, త్రసరేణువులు స్థితములై యున్నవి. ('అట్లే ఋతము–కాలము, మహి, సూర్యుడు, కిరణములు, వాయువు నన్నియు వాని వానికి తగినట్లు సూక్ష్మములు, స్థూలములునగు త్రసరేణ్వాది పదార్థములను ధరించియున్నవి.' అను నీ పాఠము హస్తలిఖిత పుస్తకములో నధికముగ నున్నట్లు మూల గ్రంథ సంపాదకుడు.) (దివిసోమో...) ఇట్లే సూర్యుని ప్రకాశ సహాయముతో చంద్రుడు ప్రకాశితుడగుచున్నాడు. చంద్రుని వంటి లోకములందు స్వయముగ ప్రకాశించు శక్తిలేదు. చంద్ర, పృథివ్యాదిలోకములన్నియు సూర్యుని ప్రకాశము వలననే ప్రకాశించుచున్నవి. ఈశ్వరుని ప్రకాశమెల్లయెడల నుండును. ౧

(సోమేనాదిత్యా) సూర్యకిరణములు చంద్రలోకమును జేరి యట నుండి ప్రతి ఫలితములై భూమిని ప్రాపించి బలము నొసంగును. బలము నొసంగుట వానికి స్వభావము అవి శీతలములు కూడ. ఆకాశమున నేయే ప్రదేశములలో భూమి సూర్యకిరణముల నడ్డగించునో యాదేశములందు శీత మెక్కుడగును. ఏ ప్రదేశములలో సూర్యకిరణములు వంకరగా ప్రసరించునో యట వేడిమి తక్కువగా నుండును. వేడి తగ్గి శీత మెక్కువయైన తావులలో మూర్తిమంతములగు పదార్థములలోని పరమాణువులు ఘనీభవించును. అందువలన పుష్టి యేర్పడును. సూర్యుని తేజోరూప కిరణములు పదార్థములపై బడినపుడు వాని నుండి బాష్పము బయలు వెడలును. వాని యోగముచే కిరణములు బలపడును. జలమునందు సూర్యుని ప్రతిబింబ మెక్కువగా ప్రకాశించును. చంద్రుని ప్రకాశము వలన సోమలతాద్యోషధులు పుష్టి గలవి యగును. వాని వలన పృథివి పుష్టమగును. కావుననే యీశ్వరుడు నక్షత్రలోకములకు సమీపమున చంద్రుని నిలిపినాడు. ౨

(క ః స్వి...) ఈ మంత్రమున నాలుగు ప్రశ్నలున్నవి. ౧. ఈ బ్రహ్మాండమున నెవడేకాకియై చరించుచున్నాడు? తన ప్రకాశముచే నెవడు ప్రకాశించుచున్నాడు? ౨. ఇతరుని ప్రకాశముచే బ్రకాశించు వాడెవడు? ౩. చలికి ఔషధ మేమి? ౪. బీజములను నాటుటకు పెద్ద క్షేత్రము వంటిది–స్థూల పదార్థముల నుంచుటకు స్థాన మెయ్యది? ౩

పై నాలుగు ప్రశ్నలకు క్రమముగా నీ మంత్రమున సమాధానములు చెప్పబడినవి.

(సూర్య ఏకాకీ) ౧. ఈ బ్రహ్మాండమున సూర్యుడేకాకియై తిరుగుచున్నాడు. అతడు తన యక్షము పైననే చలించును; తాను స్వయం ప్రకాశ స్వరూపుడై యెల్లలోకములను బ్రకాశింపజేయువాడై యున్నాడు. ౨. ఆ సూర్యుని ప్రకాశముచేతనే చంద్రుడు ప్రకాశించు చున్నాడు. ౩. చలికి ఔషధ మగ్ని.

౪. పృథివి సాకార వస్తువుల నుంచుటకు స్థానమై యున్నది; విత్తనముల నన్నింటిని నాటుటకు వలసి నంత పెద్ద క్షేత్రము.

వేదములం దీ విషయమును ప్రతిపాదించు మంత్రము లెన్నో యున్నవి. వానిలో కొన్నింటి నిట ప్రదర్శించితిమి. వేద భాష్యమున నెల్ల విషయములు విస్తారముగ వ్రాయుదుము.

ప్రకాశ్య ప్రకాశక విషయము సమాప్తము.

# అథగణిత విద్యా విషయః

సం॥ "ఏకా చ మే, తిస్రశ్చ మే తిస్రశ్చ మే, పంచ చ మే పంచ చ మే, సప్త చ మే సప్త చ మే, నవ చ మే నవ చ మే, ఏకాదశ చ మ ఏకాదశ చ మే, త్రయోదశ చ మే త్రయోదశ చ మే, పంచ దశ చ మే పంచదశ చ మే, సప్తదశ చ మే సప్తదశ చ మే, నవ దశ చ మే నవదశ చమ, ఏక విగ్ంశతిశ్చమ ఏకవిగ్ంశతిశ్చమే, త్రయోవిగ్ంశతిశ్చమే త్రయోవిగ్ంశతిశ్చ మే, పంచవిగ్ంశతిశ్చ మే పంచవిగ్ంశతిశ్చమే, సప్తవిగ్ంశతిశ్చమే సప్తవిగ్ంశతిశ్చమే, నవవిగ్ంశతిశ్చ మే నవవిగ్ంశతిశ్చమే, ఏక త్రిగ్ంశచ్చ మ ఏక త్రిగ్ంశచ్చమే, త్రయస్త్రిగ్ంశచ్చ మే యజ్ఞేన కల్పంతామ్." ౧ యజు. ౧౮—౨౪

చతస్రశ్చమేఽష్టౌ చ మేఽష్టౌ చ మే, ద్వాదశ చ మే ద్వాదశ చ మే, షోడశ చ మే షోడశ చమే, విగ్ంశతిశ్చ మే విగ్ంశతిశ్చమే. చతుర్విగ్ంశతిశ్చ మే చతుర్విగ్ంశతిశ్చ మేఽష్టావిగ్ంశతిశ్చ మేఽష్టావిగ్ంశతిశ్చమే. ద్వాత్రిగ్ంశచ్చ మే ద్వాత్రిగ్ంశచ్చ మే షట్త్రిగ్ం శచ్చ మే షట్ త్రిగ్ంశచ్చమే, చత్వారిగ్ంశచ్చ మే చత్వారిగ్ంశచ్చ మే, చతుశ్చత్వారిగ్ంశచ్చమే చతుశ్చత్వారిగ్ంశచ్చ మేఽష్టాచత్వారిగ్ంశచ్చ మే యజ్ఞేన కల్పంతామ్. ౨ య. అ, ౧౮—౨౫

అభిప్రాయః— అనయోర్ మంత్రయోర్ మధ్యే ఖల్వీశ్వరేణాంక బీజరేఖాగణితం ప్రకాశితమితి.

(ఏకా) ఏకార్థస్య యా వాచికా సంఖ్యాస్తి (౧). సైకేన యుక్తా ద్వౌ భవతః (౨). యత్ర ద్వావేకేన యుక్తౌ సా త్రిత్వ వాచికా (3). ౧.

ద్వాభ్యాం ద్వౌ యుక్తౌ చత్వారః (౪); ఏవం తిసృభిస్త్రిత్వ సంఖ్యాయుక్తా షట్ (౬). ఏవమేవ "చతస్రశ్చ మే పంచ చ మే" ఇత్యాదిషు పరస్పరం సంయోగాది క్రియయా అనేక విధాంకైర్ గణిత విద్యా సిద్ధ్యతి. అన్యత్ ఖల్వ త్రానేక చకారాణాం పాఠాన్మనుష్యై రనేక విధా గణిత విద్యాః సంతీతి వేద్యమ్.

సేయం గణిత విద్యా వేదాంగే జ్యోతిషశాస్త్రే ప్రసిద్ధాఽస్త్యతో నాత్ర లిఖ్యతే, పరంత్వీదృశా మంత్రా జ్యోతిషశాస్త్రస్థ గణిత విద్యాయా మూలమితి విజ్ఞాయతే. ఇయమంకసంఖ్యా నిశ్చితేషు సంఖ్యాతపదార్థేషు ప్రవర్తతే.

యే చాజ్ఞాత సంఖ్యాః పదార్థా స్తేషాం విజ్ఞానార్థం బీజ గణితం ప్రవర్తతే. తదపి విధానమేకా చేతి $^2$అ—కో ఇత్యాది సంకేతైనైతన్మంత్రాదిభ్యో బీజగణితం నిఃసరతీత్యవధేయమ్.

తె॥ ఈ మంత్రములలో బరమేశ్వరుడు అంకగణితము, బీజగణితము, రేఖాగణితమునకు సంబంధించిన విద్యను ప్రకటించియున్నాడు.

(ఏకా) అందు ప్రథమాంకము ౧. అది రెండు మారులు లెక్కించిన రెంటికి వాచకముగును ౧+౧=౨. అట్లే ఒకటి తరువాత నొకటి, ఒకటికి తరువాత రెండు, లేక రెంటికి తరువాత నొకటి, మున్నగు సంఖ్యలు జోడించినపుడును దెలిసికొనవలెను. ఇట్లే ఒకటితో మూడు కలిపిన నాలుగు ౪ మూటితో మూడు కలిపిన ఆఱు ౬. మూటిని మూటితో గుణించిన 3×3=౯ తొమ్మిది అగును.

ఇట్లే నాలుగుతో నాలుగు, నైదుతో నైదు, ఆఱుతో నాఱు, ఎనిమిదితో నెనిమిది మున్నగునవి కలిపినను, లేక గుణించినను కలుగు పరిణామము తెలిసికొననగును. అట్లే యెల్ల మంత్రముల యాశయము విస్తరింపజేసినచో సంపూర్ణ గణిత విద్య తెలియనగును, ఐదు సంఖ్యకు ప్రక్కన నైదు, ఆఱుకు ప్రక్కన నాఱు, ఏడుకు ప్రక్కన నేడు వ్రాసి నందున గలుగు సంఖ్యలు, (౫౫, ౬౬,౭౭) తెలియనగును,ఇట్లే యీ మంత్రముల యర్థములను యోచించినచో నంకెలతో ననేక విధములగు గణిత విద్య సిద్ధించును. ఈ మంత్రముల యర్థముల మూలమునను, ప్రయోగములవలనను ననేక విధములగు గణిత విద్యలను మనుష్యులెఱుంగవలెను.

ఇట్టి మంత్రాభిప్రాయముల సహాయముతోనే జ్యోతిషశాస్త్రము గణితవిద్య సిద్ధము చేయబడినది, అంకెల మూలమున నేర్పడు గణిత విద్య నిశ్చితములు, సంఖ్యాతములునగు పదార్థములలో నుండును.

ఏ పదార్థముల సంఖ్య తెలియదో దానిని తెలిసికొనుటకు నుపయోగించు బీజగణితము కూడ (ఏకా చ మే) అను నీ మంత్రముల వలన సిద్ధమగును. (అ$^2$ + క$^2$) (అ$^2$ - క$^3$) (క$^3$ ÷ అ$^7$) ఇట్టి సంకేతములవలన నజ్ఞాత వస్తుసంఖ్య తెలియనగును. ఈ బీజగణితము కూడ ఋషులు మునులు వేద మంత్రములనుండియే కనిపెట్టిరి.

సం॥ "అగ్న (2 3) ఆయాహి (1 3) వీతయే (2 1 2) గృణానో (3 2) హవ్యదాతయే, (3 1 2) నిహోతా (1 44 2)
"నత్సి బర్హిషి (2 1 2)." ౩ సామ. ఛ, ప్ర.౧ ఖం-౧.మం౧

యథైకా క్రియా ద్వ్యర్థకరీ ప్రసిద్ధేతి న్యాయేన స్వరసంకేతాం కైర్ బీజగణితమపి సాధ్యత ఇతి బోధ్యమ్

తె॥ (అగ్న (2 3) ఆ (1)) ఈ మంత్రమున స్వరమును సూచించు నంకెల మూలమునను బీజగణితము తెలియనగును. ౩

సం॥ఏవం గణిత విద్యాయా రేఖాగణితం తృతీయో భాగః; సోఽప్యత్రోచ్యతే. "ఇయం వేదిః పరో అంతః పృథివ్యా అయం యజ్ఞో భువనస్య నాభిః, అయగ్ం సోమో వృష్ణో అశ్వస్య రేతో బ్రహ్మాయం వాచః పరమం వ్యోమ" ౪ య.౨౩-౬౨

"కాసీత్ ప్రమా ప్రతిమా కిం నిదాన మాజ్యం కిమాసీత్ పరిధిః క ఆసీత్, ఛందః కిమాసీత్ ప్రఉగం కిముక్థం యద్దేవా దేవ మయజంత విశ్వే." ౫ ఋ.౮, ౭-౧౮-౩

(ఇయం వేదిః) అభిప్రా:- అత్ర మంత్రయో రేఖాగణితం ప్రకాశ్యత ఇతి. ఇయం యా వేది స్త్రికోణా, చతురస్రా, సేనాకారా, వర్తులాకారాదియుక్తా క్రియతే, అస్యా వేదే రాకృత్యా రేఖాగణితోపదేశ లక్షణం విజ్ఞాయతే. ఏవం పృథివ్యాః పరోఽంతో యో భాగోఽర్థాత్ సర్వతః సూత్ర వేష్టనవ దస్తి, స పరిధి రిత్యుచ్యతే. యశ్చాయం యజ్ఞో హి సంగమనీయో రేఖాగణితే మధ్యో వ్యాసాఖ్యో. మధ్యరేఖాఖ్యశ్చ సోయం భువనస్య భూగోలస్య బ్రహ్మాండస్య వా నాభిరస్తి (అయగ్ంసో) సోమ లోకో ప్యేవమేవ పరిధ్యాదియుక్తోఽస్తి. (వృష్ణో అశ్వ) వృష్టికర్తుః సూర్యస్యాగ్నేర్ వాయోర్ వా వేగహేతోరపి పరిధ్యాదికం తథైవాస్తి. (రేతః) తేషాం వీర్యమోషధిరూపేణ సామర్థ్యార్థం విస్తృత మప్యస్తీతి వేద్యమ్. (బ్రహ్మాయం వా) యద్ బ్రహ్మాస్తి తద్వాణ్యాః (పరమంవ్యోమ)అర్థాత్ పరిధి రూపేణాంతర్ బహిః స్థిత మస్తి. ౪

(కాసీత్ ప్రమా) యథార్థ జ్ఞానం – యథార్థ జ్ఞానవాన్ – తత్ సాధికా బుద్ధిః కాసీత్? సర్వ స్యేతి శేషః ఏవమ్ (ప్రతిమా) ప్రతిమీయతే ఽనయా సా ప్రతిమా, యయా పరిమాణం క్రియతే, సా కాసీత్? ఏవమేవాస్య (నిదానమ్) కారణం కిమస్తి? (ఆజ్యం) జ్ఞాతవ్యం ఘృతవత్ సారభూతం చాస్మిన్ జగతి కిమాసీత్ ? సర్వదుఃఖనివారక మానందేన స్నిగ్ధం సారభూతం చ? (పరిధిః క) తథాస్య సర్వస్య విశ్వస్య వృష్ఠావరణమ్. (క ఆసీత్?) గోలస్య పదార్థ స్యోపరి సర్వతః సూత్ర వేష్టనం కృత్వా యావతీ రేఖా లభ్యతే, స పరిధి రిత్యుచ్యతే. (ఛందః) స్వచ్ఛందం స్వతంత్రం వస్తు, (కిమాసీత్?). (ప్రఉగం) గ్రహోక్థం స్తోతవ్యం (కిమాసీత్?) ఇతి ప్రశ్నాః

ఏషా ముత్తరాణి – (యద్దేవాదే...) యత్ యం దేవం పరమేశ్వరం విశ్వే దేవాః సర్వే విద్వాంసః, (అయజంత) సమపూజయంత, పూజయంతి, పూజయిష్యంతి చ, స ఏవ సర్వస్య (ప్రమా) యథార్థతయా జ్ఞాతాస్తి. (ప్రతిమా) పరిమాణకర్తా. ఏవమేవాగ్రేఽపి పూర్వోక్తోఽర్థో యోజనీయః.

అత్రాపి పరిధిశబ్దేన రేఖా గణితోపదేశ లక్షణం విజ్ఞాయతే, సేయం విద్యా జ్యోతిషశాస్త్రే విస్తరశ ఉక్తాఽస్తి. ఏవమేతద్విషయ ప్రతిపాదకా అపి వేదేషు బహవో మంత్రాః సంతి.

ఇతి సంక్షేపతో గణిత విద్యా విషయః,

తె॥ గణిత విద్యలో మూడవ భాగ మగు రేఖాగణితము కూడ నిట్లు వేదము వలన సిద్ధమగును.

(ఇయం వేదిః) అభిప్రాయము- ఈ మంత్రములలో రేఖాగణితము ప్రకటింపబడినది. యజ్ఞ వేదికను రచించు విధానమున రేఖాగణితము కూడ నుపదేశింపబడినది.

త్రికోణము, చతుష్కోణము, శ్యేనపక్షి యాకారము, గోళాకారమునను నానావిధాకారములలో వేదిక సిద్ధము చేయబడును. ఈ యాకారములు రేఖాగణితమునకు దృష్టాంతములుగ నార్యులు గ్రహించియున్నారు. (పరో అన్తః పృ...) పృథివి యొక్క చుట్టుకొలత పరిధి యనబడును. (యజ్ఞో) పైనుండి క్రింది వఱకు కలుపు పృథివి యొక్క రేఖ వ్యాస మనబడును. ఇదియే సమస్త ప్రపంచమునకు నాభి. (అయగ్ం సోమ) చంద్రాదిలోకములు కూడ నిట్లే పరిధి, వ్యాసము కలిగియున్నవి. (వృష్ణీ అశ్వ) వర్షము నొసంగు సూర్యుడు, అగ్ని, వేగమునకు హేతువగు వాయువు మున్నగు వానికి కూడ పరిధి, వ్యాసము నున్నవి. (రేతః) శక్తి నుత్పన్నము చేయుటకు నోషధిరూపమున నుండు వీని వీర్యము కూడ నెల్ల యెడల వ్యాప్తమైయున్నది (బ్రహ్మాయంవా) బ్రహ్మము (పరమం వ్యోమ) వాణియొక్క పరిధి రూపమున లోపల వెలుపల నంతటను నున్నది. ఇట్లే యీ మంత్రము వలన నాది మధ్యాంతాది రేఖలను సైత మెఱుంగవలెను. తిర్యగ్ రేఖలు, విషువత్ రేఖలు కూడ నిట్లే తెలియనగును.

(కాసీత్ ప్ర....) ౧. యథార్థజ్ఞాన మెయ్యది?(ప్రతిమా) ౨ పదార్థములను తూచున దేది? (నిదానమ్) ౩॰ దేనివలన కార్యముత్పన్నమగునో యా కారణ మెయ్యది? (ఆజ్యం) ౪జగత్తున దెలియదగు ఘృతమువలె సారభూత వస్తువెయ్యది? లేక సర్వదుఃఖ నివారకమగు నానందముతో స్నిగ్ధమైన సారభూత వస్తువెయ్యది? (పరిధి) ౫. పరిధి యని దేనినందురు? (ఛందః) ౬. స్వతంత్ర వస్తువెయ్యది? (ప్ర ఉ) ౭. ప్రయోగించుటకు యోగ్యము స్తుతించుటకు యోగ్యము నెయ్యది? ఈ యేడు ప్రశ్నలకును సమాధానముః- (యద్దేవా దేవ) విద్వాంసులెల్లరు దేనిని పూజించిరో, పూజించుచున్నారో, పూజింతురో యా పరమేశ్వరుడే "ప్రమ" మున్నగు నామములతో జెప్పబడును. (ప్రమా) యథార్థజ్ఞానము గలవాడు. (ప్రతిమా) పరిమాణమును కొలుచు వాడు. ఇట్లే ముందు రాబోవు శబ్దముల కర్థము చెప్పుకొనవలెను.

ఈ మంత్రములందును పరమేశ్వరుడు ప్రమ, పరిధి మున్నగు శబ్దములతో రేఖాగణితమును సిద్ధ మొనర్చుట కుపదేశించియున్నాడు. కావున త్రివిధములగు నీ గణిత విద్యను ఆర్యులు వేదములనుండియే కనిపెట్టిరి. ఈ విద్య యార్యావర్తమునుండియే యితర దేశములందన్నింటిలోను వ్యాపించినది. ఈ విద్య జ్యోతిష శాస్త్రమున విపులముగ జూడనగును. ఈ విషయమును ప్రతిపాదించు మంత్రములు వేదములందు పెక్కు కలవు.

సంక్షేపముగ గణిత విద్యా విషయము సమాప్తము.

# అథేశ్వరస్తుతి ప్రార్థనా యాచనాసమర్పణోపాసనా విద్యా విషయః

సం॥ స్తుతి విషయస్తు "యో భూతం చే" త్యారభ్యోక్తో వక్ష్యతే చ. అథేదానీం ప్రార్థనా విషయ ఉచ్యతే

తేజోసి తేజో మయి ధేహి; వీర్యమసి వీర్యం మయి ధేహి; బలమసి బలం మయి ధేహి; ఓజో స్యోజో మయి ధేహి; మన్యురసి మన్యుం మయి ధేహి; సహోఽసి సహో మయి ధేహి." ౧
య. ౧౯-౯

"మయీదమింద్ర ఇంద్రియం దధాత్వస్మాన్ రాయో మఘవా నః సచంతామ్, అస్మాకగ్ం సంత్వాశిషః సత్యా నః సంత్వాశిషః." ౨
య.౨-౧౦

"యాం మేధాం దేవగణాః పితరశ్చోపాసతే,

తయా మామద్య మేధయాగ్నే మేధావినం కురు స్వాహా." ౩ య. ౩౨-౧౪

అభిప్రాయః- తేజోఽసీత్యాదిమంత్రేషు పరమేశ్వరస్య స్తుతి ప్రార్థనాది విషయాః ప్రకాశ్యంత ఇతి బోధ్యమ్.

(తేజోఽసి) హే పరమేశ్వర ! త్వం తేజో ఽస్యనంత విద్యాదిగుణైః ప్రకాశమయోఽసి. మయ్యప్యసంఖ్యాతం తేజో విజ్ఞానం ధేహి, (వీర్యమసి) హే పరమేశ్వర! త్వం వీర్య మస్యనంత పరాక్రమవానసి. కృపయా మయ్యపి శరీరబుద్ధి శౌర్యస్ఫూర్త్యాది వీర్యం పరాక్రమం స్థిరం ధారయ (బలమసి) హే మహా బలేశ్వర! త్వమనంత బలమసి. మయ్య వ్యనుగ్రహేత ఉత్తమం బలం ధేహి స్థాపయ. (ఓజోఽసి) హే పరమేశ్వర! త్వమోజోఽసి. మయ్యప్యోజః సత్యం విద్యాబలం ధేహి. (మన్యురసి) హే పరమేశ్వర! త్వం మన్యుర్ దుష్టాన్ ప్రతి క్రోధకృదసి, మయ్యపి స్వసత్తయా దుష్టాన్ ప్రతి మన్యుం ధేహి. (సహోఽసి) సహన శీలేశ్వర! త్వం సహోఽసి, మయ్యపి సుఖదుఃఖ యుద్ధాది సహనం ధేహి. ఏవం కృప యైతదాది శుభాన్ గుణాన్ మహ్యం దేహీత్యర్థః ౧

(మయీద మింద్రః) హే ఇంద్ర! పరమైశ్వర్యవన్! పరమాత్మన్! మయి మదాత్మని శ్రోత్రాదికం మనశ్చ సర్వోత్తమం భవాన్ దధాతు. తథాఽస్మాంశ్చ పోషయతు. అర్థాత్ సర్వోత్తమైః పదార్థైః సహ వర్త మానా నస్మాన్ సదా కృపయా కరోతు పాలయతు చ. (అస్మాన్ రాయో) తథా నోఽస్మభ్యం, మఘం పరమం విజ్ఞానాది ధనం విద్యతే యస్మిన్ స మఘవా, భవాన్ స పరమోత్తమం రాజ్యాది ధన మస్మదర్థం దధాతు, (సచంతాం) సచతాం తత్ర చాస్మాన్ సమవేతాన్ కరోతు, తథా భవంత ఉత్తమేషు గుణేషు సచంతాం సమవేతా భవంత్వితీశ్వరా జ్ఞాఽస్తి. (అస్మాకగ్ంస) తథా హే భగవన్! త్వత్ కృపయాఽస్మాకం సర్వా ఆశిష ఇచ్ఛాః సర్వదా సత్యా భవంతు; మా కాశ్చిదస్మాకం చక్రవర్తి రాజ్యాను శాసనాదయ ఆశిష ఇచ్ఛామోఘా భవేయుః. ౨

(యాం మేధాం) హే అగ్నే పరమేశ్వర! పరమోత్తమయా మేధయా ధారణావత్యా ధియా బుద్ధ్యా సహ (మా) మాం మేధావినం సర్వదా కురు. కా మేధేత్యుచ్యతే (దేవగణాః) విద్వత్సమూహాః పితరో విజ్ఞానినశ్చ యా ముపాసతే (తయా) తయా మేధయా (అద్య) వర్తమానదినే మాం సర్వదా యుక్తం కురు–సంపాదయ. (స్వాహా) అత్ర స్వాహాశబ్దార్థే ప్రమాణం నిరుక్తకారా ఆహుః–

"స్వాహా కృతయః స్వాహేత్యేతత్ సుఆహేతి వా, స్వా వాగాహేతి వా, స్వం ప్రాహేతి వా, స్వాహుతం హవిర్ జుహోతీతి వా, తాసామేషా భవతి." ని.అ–౨౦

స్వాహా శబ్ద స్యాయమర్థః :– (సు ఆహేతి వా) (సు) సుష్ఠు కోమలం మధురం కళ్యాణకరం ప్రియం వచనం సర్వైర్ మనుష్యైః సదా వక్తవ్యమ్, (స్వా వాగాహేతి వా) యా జ్ఞాన మధ్యే స్వకీయా వాగ్ వర్తతే సా యదాహ, తదేవ వాగింద్రియేణ సర్వదా వాచ్యమ్. (స్వం ప్రాహేతి వా) స్వం స్వకీయ పదార్థం ప్రత్యేవ స్వత్వం వాచ్యం, న పర పదార్థం ప్రతి చేతి. (స్వాహుతం హవిర్ జుహోతీతివా) సుష్ఠు రీత్యా సంస్కృత్య సంస్కృత్య హవిః సదా హోతవ్య మితి స్వాహా శబ్ద పర్యాయార్థాః.

తె॥ గణిత విద్యా విషయ మొకింత వివరించి, తదుపరి 'తేజోఽసి' మున్నగు మంత్రముల మూలమున ముఖ్యముగా ప్రార్థన, యాచన, సమర్పణము, ఉపాసనములను గూర్చి వ్రాయుచున్నాము. 'యో భూతం చ' మున్నగు మంత్రములందు గల యర్థములను వివరించుచు నుపాసనను గూర్చి యింతకు పూర్వమే కొంత వ్రాసియున్నాము. ఇంకను ముందు వ్రాయనున్నాము. ఇట ముందు ప్రార్థనా విషయము వ్రాయుచున్నాము.

(తేజోఽసి) ఓ పరమేశ్వర! నీ వనంత విద్యాదిగుణములచే ప్రకాశ స్వరూపుడవు; కృపతో నా హృదయమునందు విజ్ఞానరూప ప్రకాశమును గలిగింపుము. (వీర్యమసి) ఓ జగదీశ్వర! నీ పరాక్రమమున కంతము లేదు; నా శరీరము నందును, బుద్ధి యందును శౌర్యము, స్ఫూర్తి మున్నగు గుణ రూప పరాక్రమము గలుగ జేయుము. (బలమసి) ఓ యనంతబల యుక్తమహేశ్వర! దయయుంచి నా శరీరమునందును ఆత్మయందును పూర్ణ బలమును జేకూర్చుము. (ఓజోసి) ఓ సర్వ శక్తి మంతుడ! సమస్త సామర్థ్యమునకు నీవు నిలయము. కరుణించి నాయందును నుచిత సామర్థ్యమును గలిగించుము – నాకు సత్య విద్యాబలము నొసంగుము. (మన్యురసి) ఓ దుష్టులపై క్రోధమును జూపు దేవ! దుష్టకార్యములను, దుష్టులను కోపించు స్వభావము నాకును గలిగించుము. (సహోసి) ఎల్లరను సహించు స్వభావము గల యీశ్వర! నీవు పృథివ్యాదిలోకములను ధరించువాడవు – నాస్తికుల దుష్టవ్యవహారములను గూడ సహింతువు. అట్లే సుఖ దుఃఖములు, హాని లాభములు, శీతోష్ణములు, క్షుత్పిపాసలు, యుద్ధము మున్నగు వాని నన్నింటిని సహించువానినిగ నన్ను జేయుము – సర్వ శుభగుణములను నాకొసంగి, దుర్గుణముల నన్నింటిని దూరమొనర్తువుగాక!

(మయీదమింద్ర) ఓ యుత్తమైశ్వర్యయుక్త పరమేశ్వర! కరుణించి యుత్తమములగు శ్రోత్రాదీంద్రియములను, శ్రేష్ఠస్వభావయుక్తమగు మనస్సును నాకు ప్రసాదింపుము–ఉత్తమ గుణములను, పదార్థములను మా కెల్లపుడు జేకూర్చుము. (అస్మాన్ రాయో) ఓ పరమైశ్వర్యయుక్త దేవ! ఉత్తమరాజ్యాదిధనము గలవారమగునట్లు మమ్ముల ననుగ్రహింపుము. (సచంతామ్) మే మెల్లపుడు నుత్తమగుణములను గ్రహించువారమై, యుత్తమ కర్మముల నొనర్చువారమగు నట్లనుగ్రహింపుము.

(అస్మాకగ్ంస) ఓ పరమేశ్వర! నీ కృపవలన మా కోరిక లెల్లపుడు సత్యము లగుగాక! సత్యకర్మముల నొనర్చుటకే మాకు కోరిక యుదయించును గాక ! చక్రవర్తి రాజ్యస్థాపనాది గొప్ప కార్యము లొనర్పగల యోగ్యత మాకు ప్రసాదింపుము. ౨

(యాం మేధాం) ఓ పరమాత్మ! అత్యంతోత్తమములగు సత్య విద్యాది గుణములను ధారణసేయగల బుద్ధిని మాకు దయతో నొసంగుము. విద్వాంసులు, జ్ఞానులు నే మేధాబుద్ధి నుపాసించిరో యా మేధా బుద్ధిని మాకు నొసంగుము. దానితో మేము సదా నిన్నుపాసింతుము.

'స్వాహా' శబ్దము నీ క్రింద జూపిన విధమున నిరుక్తమున యాస్కముని పలువిధముల నిర్వచించియున్నాడు. చూడుడు:-

(సు ఆహేతి వా) మధురము, శుభంకరము నగు ప్రియవచనమునే యెల్లపుడు నెల్లరు పలుకవలెను. (స్వా వాగాహేతి వా) మానవులు తమ జ్ఞానమున నున్నట్లే జిహ్వతో గూడ చెప్పవలెనని గుర్తింప వలెను. (స్వం ప్రాహేతి వా) ఎల్లరు తమ పదార్థములనే తమవిగా చెప్పవలెను. ఇతరులవి తమవిగా జెప్పరాదు- ధర్మముతో ప్రయత్నించి సంపాదించిన దానితో తృప్తి నొందవలెను. (స్వాహుతం వా) సుగంధయుక్త పదార్థములను బాగుగ సంస్కరించి వానితో జగత్తున కుపకరించు హోమ మొనర్పవలెను. 3

సం॥ "స్థిరా వః సన్త్వాయుధా పరాణుదే వీలూ ఉత ప్రతిష్కభే.

యుష్మాక మస్తు తవిషీ పనీయసీ మా మర్త్యస్య మాయినః" ४ ఋ. ౧-౩-౧౮-౨

అభి :- (స్థిరా వః) ఈశ్వరో జీవస్య ఆశీర్ దదాతీతి విజ్ఞేయమ్. హే మనుష్యాః! వో యుష్మాకం (ఆయుధా) ఆయుధాన్యాగ్నేయ్యాస్త్రాదీని, శతఘ్నీభుశుండీ ధనుర్బాణాదీని శస్త్రాణి చ, (స్థిరాః) స్థిరాణి మదనుగ్రహేణ సంతు. ( పరాణుదే) దుష్టానాం శత్రూణాం పరాజయాయ యుష్మాకం విజయాయ చ సంతు. తథా (వీలూ) అత్యంత దృఢాని ప్రశంసితాని చ, (ఉత) ఏవం శత్రు సేనాయా అపి (ప్రతిష్కభే) ప్రతిష్టంభనాయ పరాఙ్ముఖతయా పరాజయ కరణాయ చ సంతు. తథా ( యుష్మాక మస్తు తవిషీ) యుష్మాకం తవిషీ సేనాఽత్యంత ప్రశంసనీయా బలం చాస్తు. యేన యుష్మాకం చక్రవర్తి రాజ్యం స్థిరం స్యాద్దుష్ట కర్మ కారిణాం యుష్మద్ విరోధినాం శత్రూణాం పరాజయశ్చ సదా భవేత్. (మా మర్త్యస్య మా) పరంత్వయమాశీర్వాదం సత్య కర్మానుష్ఠానిభ్యో హి దదామి. కింతు మాయినోఽన్యాయ కారిణో మర్త్యస్య మనుష్యస్య చ కదాచిన్మాస్తు. అర్థాన్నైవ దుష్ట కర్మకారిభ్యో మనుష్యేభ్యోఽహమాశీర్వాదం కదాచిద్ దదామీత్యభిప్రాయః.

తె॥ (స్థిరా వః) ఈ మంత్రమున నీశ్వరుడు మానవుల నాశీర్వదించుచున్నాడు. "ఓ మానవులార! మీరు నిరంతర ముత్తమబలము కలిగియుండుడు. (ఆయుధాః) మీయాగ్నేయాద్యస్త్రములు, శతఘ్నులు, భుశుండులు, తుపాకులు, ధనుర్బాణములు మున్నగు శస్త్రములు నన్నియు స్థిరములగు గాక! (పరాణుదే) అట్లే నా కృప వలన మీ యస్త్ర శస్త్రము లన్నియు శత్రువులను జయింపదగినవిగ నుండును గాక! (వీలూ) మీ యస్త్రములు దృఢములు, ప్రశంసనీయములు నగుగాక! (ఉత ప్రతిష్కభే) మీ యస్త్ర శస్త్రములు దుష్ట శత్రువుల సేనల వేగము నడ్డగింప సమర్థము లగుగాక! (యుష్మాకమస్తు తవిషీ) మీ సేనయు ప్రశంసాపాత్ర మగుగాక! అందువలన మీ బల మఖండితమై, చక్రవర్తి రాజ్యము స్థిరముగా నుండుగాక! మీ దుష్ట శత్రువులు సదా పరాజయమును బొందుదురు గాక! కాని, నాయీ యాశీర్వాదము ధర్మాత్ములు, న్యాయకారులు నగు శ్రేష్ఠమానవులకు మాత్రమే వర్తించును. ( మా మర్త్యస్య) మాయావులు, కపటులు, అన్యాయ కారులు, దుష్టులు నగు మనుష్యులకుగాదు. వారు సదా పరాజయమునే పొందుదురు. కావున మీ రెల్లపుడు ధార్మికులుగా నుందురు గాక!" ४

సం॥ "ఇషే పిన్వస్వోర్జే పిన్వస్వ, బ్రహ్మణే పిన్వస్వ, క్షత్రాయ పిన్వస్వ, ద్యావా పృథివీభ్యాం పిన్వస్వ,, ధర్మాసి సుధర్మా మేన్యస్మే నృమ్ణాని ధారయ;బ్రహ్మ ధారయ, క్షత్రం ధారయ. విశం ధారయ." ౫

యజు. ౩౮-౧౪

(ఇషే పిన్వస్వ) హే భగవన్! ఇషే ఉత్తమేచ్ఛాయై, పరమోత్కృష్టాయాన్నాయ చాస్మాన్ త్వం పిన్వస్వ. స్వతంత్రతయా సదైవ పుష్టిమతః ప్రసన్నాన్ కురు. (ఊర్జే) వేద విద్యా విజ్ఞాన గ్రహణాయ పరమ ప్రయత్న కారిణో బ్రాహ్మణ వర్ణయోగ్యాన్ కృత్వా సదా పిన్వస్వ. దృఢోత్సాహయుక్తా నస్మాన్ కురు. (క్షత్రా) క్షత్రాయ సామ్రాజ్యాయ పిన్వస్వ. పరమవీర (వ) తః క్షత్రియ స్వభావయుక్తాన్ చక్రవర్తి రాజ్య సహితా నస్మాన్‌కురు. (ద్యావా పృ....) ఏవం యథా ద్యావాపృథివీభ్యాం సూర్యాగ్ని భూమ్యాదిభ్యః పదార్థేభ్యః సర్వజగతే ప్రకాశోపకారౌ భవతః, తథైవ కలాకౌశలయాన చాలనాదివిద్యాం గృహీత్వా సర్వమను ష్యోపకారం వయం కుర్మః. ఏతదర్థమస్మాన్ పిన్వ స్వోత్తమ ప్రయత్న వతః కురు. (ధర్మాసి) హే సుధర్మ పరమేశ్వర! త్వం ధర్మాసి న్యాయ కార్యసి. అస్మానపి న్యాయధర్మ యుక్తాన్ కురు. (అమేని) హే సర్వహితకారకేశ్వర! యథా త్వమమేనిర్ నిర్వైరోఽసి, తథాఽ స్మానపి సర్వమిత్రాన్ నిర్వైరాన్ కురు. యథా (అస్మే) అస్మ దర్థం (నృమ్ణాని) కృపయా సురాజ్య సునియమ సురత్నాదీని ధారయ, ఏవ మేవాస్మాకం (బ్రహ్మ) వేద విద్యాం బ్రాహ్మణ వర్ణం చ ధారయ. (క్షత్రం) రాజ్యం క్షత్రియ వర్ణం చ ధారయ. (విశం) వైశ్య వర్ణం ప్రజాం చ ధారయ. అర్థాత్ సర్వోత్తమాన్ గుణాన్ అస్మన్నిష్ఠాన్ కుర్వితి ప్రార్థ్యతే, యాచ్యతే చ భవాన్; తస్మాత్ సర్వా మస్మదిచ్ఛాం సంపూర్ణాం సంపాదయేతి. ౫

తె॥ (ఇషే పిన్వస్వ) హే భగవన్! మాకు శుభకర్మముల నొనర్చుటకే కోరికలు కలుగు గాక! మా శరీరముల నుత్తమ భోజ్య పదార్థముల ద్వారమున పుష్టములగునట్లు చేయుము. (ఊర్జే) నీదయ వలన మే ముత్తమ పరాక్రమ యుక్తులమై, దృఢ ప్రయత్నముల నొనర్చు వారలమగున ట్లనుగ్రహింపుము. (బ్రహ్మణే) సత్యశాస్త్రములను-వేద విద్యలను చదివి, చదివించి, వాని నుండి తగిన యుపకారమును బొందుటకు సామర్థ్యము నొసంగుము. అందువలన మేముత్తమ విద్యాదిగుణ కర్మములు గలవారమై బ్రాహ్మణ వర్ణమునకు యోగ్యుల మగుదుము. (క్షత్రాయ) ఓ పరమేశ్వర! నీ కృప వలన మేము చక్రవర్తి రాజ్యము గలవారమై శూరులము, వీరులము నగుదుము గాక! ఉత్తమ సేనగల వారమగుదుము గాక! ఇట్లు క్షత్రియ వర్ణమునకధికారుల మగునట్లు చేయుము. (ద్యావా పృథివీ) భూమి, జలము, సూర్యుడు, వాయువు మున్నగు పదార్థముల వలన సమస్తజగత్తునకు ప్రకాశము, ఉపకారము గలుగునట్లు కలాకుశలులమై విమానాది యానములను నడపుటకు మమ్ముల నుత్తమ సుఖయుక్తుల నొనర్పుము. అందువలన మేమును సృష్టిగత ప్రాణుల కుపకార మొనర్పగలము గాక! (ధర్మాసి) ఓ సుధర్మా! న్యాయ కారివగు నో ప్రభూ! మమ్ములను న్యాయ యుక్తుల నొనర్పుము. (అమే) ఓ స్వామీ! నీవు నిర్వైరివి. వైరభావము విడిచి వర్తించునట్లు మమ్ముల ననుగ్రహింపుము. (అస్మే) ఓ పరమ కారుణిక! మాకు (నృమ్ణాని) ఉత్తమ రాజ్యమును, ఉత్తమ ధనమును, శుభ గుణములను బ్రసాదింపుము. (బ్రహ్మ) ఓ పరమేశ్వర! మాలో బ్రాహ్మణుల నుత్తమ విద్యాయుక్తుల నొనర్పుము. (క్షత్రమ్) మిక్కిలి చతురులము, శూర వీరులము, క్షత్రియ వర్ణమున కధికారులము నగునట్లు మమ్మను గ్రహింపుము. (విశమ్) వైశ్య వర్ణమును, మా ప్రజను సదా రక్షింపుము; మేము శుభగుణ యుక్తులమై పురుషార్థపరుల మగునట్లనుగ్రహింపుము.

సం॥ "యజ్జాగ్రతో దూరముదైతి దైవం తదు సుప్తస్య తథైవైతి, దూరంగమం జ్యోతిషాం జ్యోతిరేకం తన్మే మనః శివసంకల్పమస్తు." ౬

య. అ. ౩౪-౧

"వాజశ్చ మే, ప్రసవశ్చ మే, ప్రయతిశ్చ మే, ప్రసితిశ్చ మే, ధీతిశ్చ మే, క్రతుశ్చ మే."

(యజ్జాగ్రతో దూ...) యన్ మనో జాగ్రతో మనుష్యస్య దూరము దైతి. సర్వేషామింద్రియాణా మువరి వర్తమానత్వా దధిష్ఠాతృత్వేన వ్యాప్నోతి. (దైవమ్) జ్ఞానాది దివ్యగుణయుక్తం (తదు) తత్ ఉ, ఇతి వితర్కే. సుప్తస్య పురుషస్య (తథైవ) తేనైవ ప్రకారేణ స్వప్నే దివ్య పదార్థ ద్రష్ట్ర (ఏతి) ప్రాప్నోతి, ఏవం సుషుప్తౌ చ దివ్యానందయుక్తతాం చైతి. తథా (దూరం గమమ్) అర్థాద్దూరగమనశీలమస్తి. (జ్యోతిషాం జ్యోతి) జ్యోతిషా మింద్రియాణాం సూర్యాదీనాం చ జ్యోతిః సర్వ పదార్థ ప్రకాశకం (ఏకం) అనహాయం మన్మనోఽస్తి, హే ఈశ్వర ! భవత్ కృపయా, (తన్మే) తత్ మే మమ, మనో మనన శీలం సత్, శివ సంకల్పం కల్యాణేష్టధర్మ శుభగుణ ప్రియమస్తు.

ఏవ మేవ వాజశ్చ మ ఇత్యష్టాదశాధ్యాయస్థైర్ మంత్రైః సర్వస్వసమర్పణం పరమేశ్వరాయ కర్తవ్యమితి వేదే విహితమ్. అతః పరమోత్తమపదార్థం మోక్షమార భ్యాన్నపానాదిపర్యంత మీశ్వరాద్ యాచితవ్యమితి సిద్ధమ్.

తె॥ (యజ్జాగ్రతో) హే సర్వ వ్యాపక పరమేశ్వర! నా మనస్సు జాగ్రదవస్థలో దూరము వెళ్ళు చుండును. సమస్తేంద్రియములకు నది స్వామి. (దైవమ్) జ్ఞానాదిగుణయుక్తము. అది ప్రకాశ స్వరూపమై యున్నది, (తదు సు...) అట్లే నిద్రావస్థయందును నది శుద్ధము నానందయుక్తమునై యుండుగాక ! (దూరం గమమ్) దూరము వెళ్ళు స్వభావము గలది. (జ్యోతిషాం) ఇంద్రియములయు, సూర్యుడు మున్నగు జ్యోతిస్సులయు ప్రకాశమునకు ప్రకాశకము అది ఒక్కటే. (తన్మే) ఓ పరమేశ్వర! అట్టి నా మనస్సు నీ కృప చేత,(శివ సంకల్పమస్తు) శుభ మొనర్చునదియు, శుద్ధ స్వభావయుక్తము నగుగాక! అధర్మ కార్యములం దెన్నడు ప్రవృత్తము గాకుండుగాక!

ఇట్లే (వాజశ్చ మే) మున్నగు శుక్ల యజుర్వేదపు పదునెనిమిదవ యధ్యాయములోని మంత్రములు సర్వస్వము నీశ్వరునకు సమర్పింపుడని విధించును. అన్నిటికంటె నుత్తమమగు మోక్ష సుఖము మొదలు సమస్త పదార్థముల కొఱకు నీశ్వరునే యాచింపనగును; కాని యన్యుని ప్రార్థింపరాదు.

సం॥ "ఆయుర్ యజ్ఞేన కల్పతాం, ప్రాణో యజ్ఞేన కల్పతాం, చక్షుర్ యజ్ఞేన కల్పతాగ్ం, శ్రోత్రం యజ్ఞేన కల్పతాం. వాగ్ యజ్ఞేన కల్పతాం, మనో యజ్ఞేన కల్పతా, మాత్మా యజ్ఞేన కల్పతాం, బ్రహ్మ యజ్ఞేన కల్పతాం, జ్యోతిర్ యజ్ఞేన కల్పతాగ్ం, స్వర్ యజ్ఞేన కల్పతాం, పృష్ఠం యజ్ఞేన కల్పతాం, యజ్ఞో యజ్ఞేన కల్పతామ్. స్తోమశ్చ, యజుశ్చ ఋక్ చ సామ చ, బృహచ్చ, రథంతరం చ, స్వర్ దేవా అగన్ మాఽమృతా అభూమ, ప్రజాపతేః ప్రజా అభూమ వేట్ స్వాహా. ౩

య. ౧౮—౨౯

(ఆయుర్ యజ్ఞేన) 'యజ్ఞో వై విష్ణుః,' శత. ౧—౨—౧౩

వేవేష్టి వ్యాప్నోతి సర్వం జగత్ స విష్ణు రీశ్వరః. హే మనుష్యాస్తేన యజ్ఞేనేశ్వరప్రాప్త్యర్థం సర్వం స్వకీయ మాయుః కల్పతామితి. యదస్మదీయ మాయు రస్తి తదీశ్వరేణ కల్పతాం. పరమేశ్వరాయ సమర్పితం భవతు. ఏవమేవ (ప్రాణః) (చక్షుః), (వాక్) వాణీ, (మనః) మననం జ్ఞానం. (ఆత్మా) జీవః, (బ్రహ్మ) చతుర్వేద జ్ఞాతా యజ్ఞానుష్ఠానకర్తా, (జ్యోతిః) సూర్యాది ప్రకాశ (ధర్మః) న్యాయః (స్వః) సుఖం, (పృష్ఠం) భూమ్యాద్యధికరణం, (యజ్ఞో) అశ్వమేధాదిః శిల్ప క్రియామయోవా, (స్తోమః) స్తుతి సమూహః (యజుః) యజుర్వేదాధ్యయనమ్, (ఋక్) ఋగ్వేదాధ్యయనం, (సామ)

సామవేదాధ్యయనమ్, చకారాదథర్వవేదాధ్యయనం చ, (బృహచ్చ రథంతరం చ) మహత్ క్రియా సిద్ధి ఫలభోగః శిల్ప విద్యాజన్యం వస్తు చాస్మదీయ మేతత్సర్వం పరమేశ్వరాయ సమర్పితమస్తు; యేన వయం కృతజ్ఞాః స్యామ. ఏవం కృతే పరమకారుణికః, పరమేశ్వరః సర్వోత్తమం సుఖ మస్మభ్యం దద్యాత్. యేన వయం (స్వర్దేవా) సుఖే ప్రకాశితాః (అమృతా) పరమానందం మోక్షం (అగన్మ) సర్వదా ప్రాప్తా భవేమ. తథా ( ప్రజా పతేః) వయం పరమేశ్వర స్యైవ ప్రజా (అభూమ) అర్థాత్ పరమేశ్వరం విహా యాన్యమనుష్యం రాజానం నైవ కదాచి న్మన్యామహ ఇతి. ఏవం జాతే (వేట్ స్వాహా) సదా వయం సత్యం వదామో, భవదాజ్ఞాకరణే పరమ ప్రయత్నత ఉత్సాహవంతోఽభూమ భవేమ, మా కదాచిద్ భవదాజ్ఞావిరోధినో వయ మభూమ; కింతు భవత్సేవాయాం సదైవ పుత్రవద్ వర్తేమహి." ౭

ఇతి ప్రార్థనా యాచనా సమర్పణ విషయః

తె॥ ("యజ్ఞో వై విష్ణుః") విష్ణువునకు యజ్ఞమని నామము శతపథ బ్రాహ్మణమున నట్లు చెప్పబడినది.

(ఆయుర్ యజ్ఞేన) ఆ యీశ్వరుడు సమస్తజగత్తునను వ్యాపకుడై యున్నాడు. అతడే విష్ణువన బడును. అతనికే సమస్త పదార్థములు సమర్పింపవలెను. ఈ మంత్రమున నీ విషయమే వర్ణింపబడినది. మనుష్యులెల్లరు తమ యాయువునంతటిని నీశ్వరుని సేవించుటకు, నతని యాజ్ఞలను బాలించుటకు నర్పింపవలెను. (ప్రాణో) ప్రాణమును కూడ నీశ్వరున కర్పింపవలెను. (చక్షుః) ప్రత్యక్షప్రమాణము, నేత్రము, (శ్రోత్రం) శ్రవణ విద్య, శబ్ద ప్రమాణాది, (వాక్) వాణి, (మనో) మనస్సు విజ్ఞానము, (ఆత్మా) జీవుడు, (బ్రహ్మ) నాలుగు వేదములను జదివి పురుషార్థమును సాధించువాడు, (జ్యోతిః) సూర్యాదుల ప్రకాశము, (స్వః) సుఖము, (పృష్ఠం) ఉత్తమ కర్మముల ఫలము, స్థానము, (యజ్ఞో) వేద విషయ విచారమున వర్ణింపబడిన త్రివిధములగు యజ్ఞములు, (స్తోమశ్చ) స్తుతి సమూహము, (యజుశ్చ) సర్వక్రియలకు సంబంధించిన విద్య, (ఋక్ చ) ఋగ్ వేదము - స్తుతి స్తోత్రము, (సామచ) గానవిద్య, (చ) అథర్వ వేదము, (బృహచ్చ) గొప్ప గొప్ప వస్తువులు, (రథంతరం చ) తన యధీనమున నున్న శిల్ప విద్యా ఫలములు నన్నియు పరమేశ్వరున కర్పింపవలెను. వస్తువులన్నియు నీశ్వర నిర్మితములే. ఇట్లు సర్వము పరమేశ్వరున కర్పించిన మనుజున కాపరమేశ్వరుడు సర్వ సుఖములను జేకూర్చును. (స్వర్దేవా) పరమేశ్వరుని కృపవలన పరమ ప్రకాశ రూప విజ్ఞానమును బొంది శుద్ధులమై, ప్రపంచమున కీర్తిమంతులమై, మనము పరమానందరూప మోక్షమును, (అగన్మ) ఎల్లప్పుడు బొందుదుము గాక! (ప్రజాపతేః) సర్వజ్ఞుడు, న్యాయకారి, ఎల్లరకు దండ్రియు నగు పరమేశ్వరునే యుపాసింపవలెను; కాని, యే మానవుని గూడ మానవులు తమకు రాజుగా నుపాస్యునిగా నెంచరాదు. పరమేశ్వరుడే యెల్లరకు నుత్తమ సత్యన్యాయము నొనర్చును-ఇతరులెవ్వరు నట్లు చేయజాలరు. (వేట్ స్వాహా) సర్వజ్ఞుడు, సత్యస్వరూపుడు, సత్యన్యాయకర్తయు నగు పరమేశ్వరుని ప్రజలమై మన మెల్లపుడును సత్యమునే యంగీకరింపవలెను. సత్యమునే చెప్పవలెను. సత్యమే యాచరింపవలెను. పరమేశ్వరుని యాజ్ఞాపాలనమున నెల్లప్పుడు నిరతులము కావలెను. 'ఓకృపానిధీ! నీ యాజ్ఞ నెన్నడు విరోధింపకుందుముగాక! ఎల్లపమెడు నీ సేవయందే పుత్రులవలె ప్రేమతో వర్తింతుము గాక!' అని పరమేశ్వరుని మానవులెల్లరు ధ్యాన మొనర్పవలెను.

ప్రార్థనా యాచనా సమర్పణ విషయము సమాప్తము.

# అథోపాసనావిషయః

(సంక్షేపతః)

సం॥ "యుంజతే మన ఉత యుంజతే ధియో విప్రా విప్రస్య బృహతో విపశ్చితః విహోత్రా దధే వయునా విదేక ఇన్మహీ దేవస్య సవితుః పరిష్టుతిః." ౧ ఋ.౪-౪-౨౪-౧; యజు౧౧-౪

(యుంజతే) అస్యాభిప్రా :- అత్ర జీవేన సదా పరమేశ్వర స్యైవోపాసనా కర్తవ్యేతి విధీయతే. (విప్రాః) ఈశ్వరోపాసకా మేధావినః (హోత్రాః) యోగినో మనుష్యాః (విప్రస్య) సర్వజ్ఞస్య పరమేశ్వరస్య మధ్యే (మనః) (యుంజతే) యుక్తం కుర్వంతి. (ఉత) అపి ధియో బుద్ధి వృత్తీస్తస్యైవ మధ్యే యుంజతే. కథం భూతః స పరమేశ్వరః? సర్వ మిదం జగత్ యః (విదధే) విదధే. తథా (వయునా) సర్వేషాం జీవానాం శుభాశుభాని యాని ప్రజ్ఞానాని ప్రజాశ్చ తాని యో వేద స వయునావిత్, (ఏకః) స ఏకోఽద్వితీయోఽస్తి. (ఇత్) సర్వత్ర వ్యాప్తో జ్ఞాన స్వరూపశ్చ. నాస్మాత్ పర ఉత్తమః కశ్చిత్ పదార్థో వర్తత ఇతి. తస్య (దేవస్య) సర్వజగత్ ప్రకాశకస్య (సవితుః) సర్వజగదుత్పాద కస్యేశ్వరస్య సర్వైర్ మనుష్యైః (పరిష్టుతిః) పరితః సర్వతః స్తుతిః కార్యా, కథం భూతా స్తుతిః? (మహీ) మహతీత్యర్థః ఏవం కృతే సతి జీవాః పరమేశ్వర ముపగచ్ఛంతీతి. ౧

తె॥ వేదములందు వర్ణింపబడిన యీశ్వరోపాసన విషయ మిట సంక్షేపముగ వ్రాయబడును.

(యుంజతే మన) జీవునకు నిత్య మీశ్వరో పాసన యొనర్చుట యుచితము. ఉపాసన సమయమున మనస్సు నీశ్వరునందు స్థిర పఱుపవలెను. (విప్రాః) ఈశ్వరోపాసకులైన బుద్ధిమంతులు, (హోత్రాః) ఉపాసనా యోగమును గ్రహించువారును, (విప్రస్య) ఎల్లర నెఱుగు నట్టియు, (బృహతః) నెల్లరికంటె గొప్పవాడుననగు (విపశ్చితః) సర్వ విద్యాయుక్తుడు నగు పరమేశ్వరుని యందు (మనః యుంజతే) తమ మనస్సును బాగుగ యుక్తము చేయుదురు. (ఉత ధియః) అట్లే తమ బుద్ధివృత్తులను, జ్ఞానమును, (యుంజతే) ఎల్లప్పుడు పరమేశ్వరుని యందే స్థిరము సేయుదురు. ఏ పరమేశ్వరుడీ సర్వజగత్తును (విదధే) ధరించి చేయుచున్నాడో, (వయునా విదేక ఇత్) ఎవడు సర్వజీవుల జ్ఞానములకు, ప్రజకును సాక్షియో, ఆ పరమేశ్వరుడొక్కడే సర్వ వ్యాపకుడై యున్నాడు. అతనిని మించిన యుత్తమ పదార్థ మొండును లేదు. (దేవస్య) సర్వజగత్తును ప్రకాశింపజేయువాడును (సవితుః) సర్వము నుత్పన్నము చేయువాడును నగు నా దేవుని (పరిష్టుతిః) సర్వ విధముల స్తుతియింతుము గాక! (మహీ) ఆ స్తుతి యన్నింటికంటెను గొప్పది - పరమేశ్వరుని స్తుతికి సమానమగు స్తుతి మఱియొండు లేదు. ఇట్లు స్తుతి జేసినందువలననే జీవుడు పరమేశ్వరుని బొందగలడు. ౧

సం॥ "యుంజానః ప్రథమం మనస్తత్త్వాయ సవితా ధియమ్,

అగ్నేర్ జ్యోతిర్నిచాయ్య పృథివ్యా అధ్యాభరత్." ౨ యజు. ౧౧-౧

(యుంజానః) యోగం కుర్వాణః సన్ (తత్త్వాయ) బ్రహ్మాది తత్త్వజ్ఞానాయ ప్రథమం మనో యుంజానఃసన్ యోఽస్తి. తస్య ధియం (సవితా) కృపయా పరమేశ్వరః స్వస్మిన్నుపయుంక్తే, (అగ్నేర్ జ్యోతిః) యతోఽగ్నే రీశ్వరస్య ప్రకాశ స్వరూపం (నిచాయ్య) యథావత్ నిశ్చిత్య (అధ్యాభరత్) స

యోగీ స్వాత్మని పరమాత్మానం ధారితవాన్ భవేత్. ఇదమేవ పృథివ్యా మధ్య యోగిన ఉపాసకస్య లక్షణమితి వేదితవ్యమ్. ౨

తె॥ (యుంజానః) యోగి, (తత్త్వాయ) బ్రహ్మజ్ఞానము కొఱకు, (ప్రథమం మనః) తన మనస్సును మొదట పరమేశ్వరునందు లగ్న మొనర్చునపుడు (సవితా) పరమేశ్వరుడు (ధియం) వాని బుద్ధిని కృపతో తన యందు లగ్నము చేసికొనును. (అగ్నేర్ జ్యోతిః) ఆ యోగి పరమేశ్వరుని ప్రకాశమును, పరమేశ్వరునిదిగా నిశ్చయించి (అధ్యాభరత్) తనలో పరమేశ్వరుని ధరించును (పృథివ్యా) పృథివిలో యోగిలక్షణ మిదియే.

*సం॥* "యుక్తేన మనసా వయం దేవస్య సవితుః సవే, స్వర్గ్యాయ శక్త్యా." ౩ యజు.అ.౧౧మ.౨

సర్వే మనుష్యా ఏవమిచ్ఛేయుః. (స్వర్గ్యాయ) మోక్ష సుఖాయ, (శక్త్యా) యోగబలోన్నత్యా, (దేవస్య) స్వప్రకాశస్యానంద ప్రదస్య, (సవితుః) సర్వాంతర్యామినః, పరమేశ్వరస్య. (సవే) అనంతైశ్వర్యే, (యుక్తేన మనసా) యోగయుక్తేన శుద్ధాంతఃకరణేన వయం సదోపయుంజీమహీతి.

తె॥ (వయం) మన మెల్లరము, (స్వర్గ్యాయ) మోక్షసుఖము కొఱకు, (శక్త్యా) తన యోగబలోన్నతితో, (దేవస్య) పరమేశ్వరుని సృష్టిలో నుపాసనాయోగ మొనర్చి తన యాత్మశుద్ధి నొనర్చుకొనవలెను. (యుక్తేన మనసా) శుద్ధ మనస్సుతో పరమేశ్వర ప్రకాశమనెడి యానందమును బొందవలెను. మానవులెల్లరు నిట్టి కోరిక గలిగియుండవలెనని మంత్రాభిప్రాయము. ౩

*సం॥* "యుక్త్వాయ సవితా, దేవాన్ త్స్వర్యతో ధియా దివమ్.

బృహజ్జ్యోతిః కరిష్యతః సవితా ప్రసువాతి తాన్." ౪ యజు.౧౧-౩

ఏవం యోగాభ్యాసేన కృతేన, (స్వర్యతః) శుద్ధ భావ ప్రేమ్ణా, (దేవాన్) ఉపాసకాన్ యోగినః, (సవితా) అంతర్యామీశ్వరః కృపయా, (యుక్త్వాయ) తదాత్మసు ప్రకాశకరణేన సమ్యగ్ యుక్త్వా, (ధియా) స్వకృపాధారవృత్త్యా (బృహజ్జ్యోతిః) అనంత ప్రకాశం, (దివం) దివ్యం స్వస్వరూపం, (ప్రసువాతి) ప్రకాశయతి, తథా (కరిష్యతః) సత్యభక్తిం కరిష్యమాణా నుపాసకాన్ యోగినః (సవితా) పరమకారుణి కాంతర్యా మీశ్వరో మోక్ష దానేన సదా ఆనందయతీతి.

తె॥ ఇట్లు యోగాభ్యాస మొనర్చుటవలన, (స్వర్యతః దేవాన్) శుద్ధ భావముతో, ప్రేమతో ఉపాసన మొనర్చు యోగులపై (సవితా) అంతర్యామి యగు నీశ్వరుడు కృపతో (యుక్త్వా) వారి యాత్మలయందు ప్రకాశము గలుగజేయుట మూలమున యుక్తుడై, (ధియా) తన కృపాబుద్ధితో (దివం బృహజ్జ్యోతిః) తన దివ్య స్వరూపమగు ననంత ప్రకాశమును (ప్రసువాతి) ప్రకటమొనర్చును. (కరిష్యతః) అట్లే సత్యమైన ప్రేమతో నుపాసకులగు యోగులకు, (సవితా) పరమదయాలువు, నంత ర్యామియు నగు నీశ్వరుడు మోక్షము నొసంగి యెల్లప్పుడు నానందములో నుంచును.

*సం॥* "యుజే వాం బ్రహ్మ పూర్వ్యం నమోభిర్ విశ్లోక ఏతు పథ్యేవ సూరేః శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రా ఆయే ధామాని దివ్యాని తస్థుః." ౫ యజు. ౧౧-౫

ఉపాసనా ప్రదోపాసనా గ్రహీతారౌ ప్రతి పరమేశ్వరః ప్రతి జానీతే. (బ్రహ్మ పూర్వ్యమ్) యదా తౌ పురాతనం సనాతనం బ్రహ్మ, (నమోభిః) స్థిరేణ ఆత్మనా సత్యభావేన నమస్కారై రుపాసతే తదా

తద్ బ్రహ్మ తాభ్యామాశీర్దదాతి, (శ్లోకః) సత్యకీర్తిః, (వాం) (ఏఏతు) వ్యేతువ్యాప్నోతు, కస్య కేవ ? (సూరేః) పరమవిదుషః, (పథ్యేవ) ధర్మమార్గ ఇవ. (యే) ఏవం య ఉపాసకాః. (అమృతస్య) మోక్షస్వరూపస్య నిత్యస్య పరమేశ్వరస్య, (పుత్రాః) తదాజ్ఞానుష్ఠాతారస్తత్సేవకాః సంతి త ఏవ, (దివ్యాని) ప్రకాశస్వరూపాణి విద్యోపాసనాయుక్తాని కర్మాణి తథా దివ్యాని, (ధామాని) సుఖస్వరూపాణి జన్మాని, సుఖయుక్తాని స్థానాని వా, (ఆతస్థుః) ఆ సమంతాత్ తేషు స్థిరా భవంతి. తే (విశ్వే) సర్వే, (వాం) ఉపాసనోపదేష్ట్రుపదేశ్యౌ ద్వౌ, (శృణ్వంతు) ప్రఖ్యాతౌ జానంతు. ఇత్యనేన ప్రకారేణోపాసనాం కుర్వాణౌ వాం యువాం ద్వౌ ప్రతీశ్వరోఽహం యుజే, కృపయా సమవేతో భవామీతి. ౫

తె॥ ఉపాసన నుపదేశించువానిని గూర్చియు, గ్రహించువానిని గూర్చియు పరమేశ్వరుని యుపదేశము, (పూర్వ్యమ్) నీవు, సనాతన బ్రహ్మమును, (నమోభిః) సత్యమగు ప్రేమభావనతో నీ యాత్మను స్థిరమొనర్చుకొని నమస్కారాది రీతులతో నుపాసించినపుడు, నేను నిన్నాశీర్వదింతును. (శ్లోకః) సత్యకీర్తి (వాం) మిమ్ముల నిరువురను, (ఏతు) పొందునుగాక. ( పథ్యేవ సూరేః) విద్వాంసునకు ధర్మ మార్గము ప్రాప్తించునట్లు మీకును సత్యమును సేవించుట వలన సత్యకీర్తి లభించును. (యే) ఇట్లే యుపాసకులు, (అమృతస్య) మోక్షరూపుడగు నిత్యపరమేశ్వరునకు, (పుత్రాః) ఆజ్ఞాపాలకులు, సేవకులు నగుదురో, (దివ్యాని) ప్రకాశ స్వరూపమగు విద్యతోను, ఉపాసనతోను యుక్తము లగు కర్మములందు (ధామాని) దివ్య స్థానములందును (ఆతస్థుః) బాగుగా స్థిరులగుదురు. (విశ్వే) ఆయమృతపుత్రులందఱు, (వాం) ఉపాసన నుపదేశించువాడు, ఆ యుపదేశమును గ్రహించువాడు నను నీ యిరువురను, (శృణ్వంతు) ప్రసిద్ధులుగా నెఱుగుదురు గాక! ఇట్లుపాసన నొనరించుమీ యిరువురితో, (యుజే) ఈశ్వరుడ నగు నేను యుక్తుడ నగుదును. ౫

*సం॥* "సీరా యుంజంతి కవయో యుగా వితన్వతే పృథక్,

ధీరా దేవేషు సుమ్నయా." ౬ యజు. ౧౨–౬౭

(కవయః) విద్వాంసః, క్రాంత దర్శనాః క్రాంత ప్రజ్ఞా వా, (ధీరాః) ధ్యానవంతో యోగినః, (పృథక్) విభాగేన. (సీరాః) యోగాభ్యాసోపాస నార్థం నాడీర్ యుంజంతి, అర్థాత్ తాసు పరమాత్మానం జ్ఞాతు మభ్యస్యన్తి. తథా (యుగా) యుగాని యోగయుక్తాని కర్మాణి. (వితన్వతే) విస్తారయంతి, య ఏవం కుర్వంతి తే, (దేవేషు) విద్వత్సు యోగిషు, (సుమ్నయా) సుఖేనైవ స్థిత్వా పరమానందం యుంజంతి, ప్రాప్నువంతీ త్యర్థః."

తె॥ (కవయః) విద్వాంసులును, యోగులును, (ధీరాః) ధ్యానులు . నగువారు (పృథక్ సీరా యుంజంతి) భిన్న భిన్న నాడులను ఉపాసనా యోగము కొఱకు యుక్తము చేయుదురు-పరమాత్మ సాక్షాత్కారము కొఱకు నుపాసనా యోగము నభ్యసింతురు. (యుగా) యోగయుక్త కర్మములను, (వితన్వతే) నిరంతరము విస్తరింపజేయుదురు యోగా భ్యాసమున తత్పరులగుదురు. (దేవేషు సుమ్నయా) విద్వాంసులలో ప్రశంసితులై పరమానందము ననుభవింతురు.

*సం॥* "యునక్త సీరా వి యుగా తనుధ్వం కృతే యోనౌ వపతే హ బీజమ్,

గిరా చ శ్రుష్టిః సభరా అసన్నో నేదీయ ఇత్సృణ్యః పక్వమేయాత్." ౭ య. ౧౨–౬౮

హే యోగినో! యూయం యోగాభ్యాసోపాసనేన పరమాత్మ యోగేన ఆనందం, (యునక్త) తద్యుక్తా భవత, ఏవం మోక్ష సుఖం సదా (వితనుధ్వం) విస్తారయత. తథా (యుగా) ఉపాసనాయుక్తాని కర్మాణి. (సీరాః) ప్రాణాదిత్యయుక్తా నాడీశ్చ. యునక్తోపాసనా కర్మాణి యోజయత. ఏవం (కృతే

యోనౌ) అంతఃకరణే శుద్ధే కృతే పరమానందయోనౌ కారణ ఆత్మని, (వపతే హ బీజమ్) ఉపాసనా విధానేన యోగోపాసనాయా విజ్ఞానాఖ్యం బీజం వపత; తథా (గిరా చ) వేద వాణ్యా విద్యయా, (యునక్త) యుంక్త- యుక్తా భవత, కించ (శ్రుష్టిః) క్షిప్రం శీఘ్రం యోగఫలం, (నో నేదీయః) నోఽస్మాన్నేదీయోతిశయేన నికటం పరమేశ్వరానుగ్రహేణ, (అసత్) అస్తు. కథం భూతం ఫలమ్? (పక్వం) శుద్ధానంద సిద్ధం, (ఏయాత్) ఆసమంతా దియాత్ ప్రాప్నుయాత్. (ఇత్ సృణ్యః) ఉపాసనాయుక్తాస్తా యోగవృత్తయః శృణ్యః సర్వక్లేశహంత్ర్య ఏవ భవంతి. ఇదితి నిశ్చయార్థే. పునః కథం భూతాస్తాః? (సభరాః) శాంత్యాదిగుణపుష్టాః, ఏతాభిర్ వృత్తిభిః పరమాత్మ యోగం వితనుధ్వమ్.

అత్ర ప్రమాణమ్:- "శ్రుష్టీతి క్షిప్రనామను అష్టీతి." నిరు. ౬-౧౩

"ద్వివిధా సృణిర్ భవతి; భర్తా చ హంతా చ" నిరు. ౧౩-౫

తె॥ ఓ యుపాసకులార! మీరు యోగాభ్యాసము వలనను, పరమాత్ముని యోగము వలనను నాడులలో ధ్యాన మొనర్చి పరమానందముతో (యునక్త) యుక్తులు గండు, ఇట్లే మోక్ష సుఖమును (వితనుధ్వమ్) విస్తరింపజేయుడు. మఱియు, (కృతే యోనౌ) అంతః కరణమును శుద్ధ మొనర్చినమీదట పరమానందమునకు కారణభూతమగు తన యాత్మయందు ఉపాసనావిధానముతో ఉపాసనాయోగ సంబంధమగు విజ్ఞాన రూప (బీజం) బీజమును (వపత) బాగుగ నాటుడు. (గిరాచ) వేదవాణి ద్వారమున, పరమాత్మునియందు, (యునక్త) యుక్తులై యతని స్తుతి ప్రార్థనోపాసనలయందు ప్రవృత్తులు గండు. (శ్రుష్టిః) ఉపాసనాయోగ ఫలము మిక్కిలి శీఘ్రముగ, (నో నేదీయః) మనకత్యంత సమీపమున (అసత్) ఉండును గాక ! ఈశ్వరానుగ్రహముచే మనకు నుపాసనా యోగ ఫలము శీఘ్రముగ లభించుగాక! ఆ ఫలము, (పక్వం) పరిపక్వమై, శుద్ధము, పరమము నగు నానంద ముతో నిండియుండి, మోక్ష సుఖమును చేకూర్చును. (ఇత్ సృణ్యః) ఉపాసనా యోగవృత్తులన్నియు క్లేశములను నాశమొనర్చునవియై, (సభరాః) శాంత్యాది సర్వగుణములతో నిండియుండును. ఆ యుపాసనా యోగవృత్తులతో పరమాత్మ సంబంధమును మీ మీ యాత్మలలో ప్రకాశితము చేసికొనుడు.

యాస్క నిరుక్తమున శ్రుష్టి, సృణి, శబ్దములకు నీ క్రింది వ్యుత్పత్త్యర్థము చెప్పబడినదిః (శ్రుష్టీతి) శ్రుష్టి=శీఘ్రము. 'అశూఙ్' వ్యాప్తౌ, క్తిన్, జీప్, శు (అశు) అష్టి = శ్రుష్టి

(ద్వివిధా) సృణి = కొడవలివలె పరమాత్మ క్లేశములను హరించును;ఖండించును.

సం॥ "అష్టావింశాని శివాని శగ్మాని సహ యోగం భజంతు మే, యోగం ప్రపద్యే క్షేమం చ,

క్షేమం ప్రపద్యే యోగం చ నమోఽహోరాత్రాభ్యామస్తు." ౮ అథ.౧౯, ౧-౮-౨

హే పరమేశ్వర! భగవన్! (అష్టావింశాని) కృపయాఽష్టావింశాని, (శివాని) కల్యాణాని, కల్యాణ కారకాణి సంతు-అర్థాత్ దశేంద్రియాణి. దశ ప్రాణా. మనోబుద్ధి చిత్తాహంకార విద్యాస్వభావ శరీర బలం చేతి, (శగ్మాని) సుఖ కారకాణి భూత్వా, (అహోరాత్రాభ్యాం) దివసే, రాత్రౌ, చోపాసనా వ్యవహారం యోగం (మే) మమ, (భజంతు) సేవంతాం, తథా భవత్ కృపయాఽహం (యోగం ప్రపద్యే) ప్రాప్య. (క్షేమం చ, ప్రపద్యే) క్షేమం ప్రాప్య, యోగం చ ప్రపద్యే. యతో ఽస్మాకం సహాయ కారీ భవాన్ భవేత్ ఏతదర్థం సతతం నమోఽస్తు తే. ౮

తె॥ (అష్టావింశాని శివాని) ఓ పరమైశ్వర్యయుక్త మంగలమయదేవ! నీ కృపవలన నుపాసనా యోగము నాకు లభించును గాక! దాని వలన నాకు సుఖము గలుగు గాక! ఇట్లే దశేంద్రియములు, దశ ప్రాణములు,

మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, విద్య, స్వభావము, శరీరము, బలము నను నీ యిరువది యెనిమిదియు సర్వ శుభములందును ప్రవృత్తములై నా యుపాసనా యోగమును, (అహోరాత్రాభ్యాం) అహర్నిశలు సేవించును గాక! అట్లే మేమును, నీ కృపవలన, (యోగం) యోగము మూలమున, (క్షేమం) రక్షణను, రక్షణవలన యోగమును బొంద గోరుచున్నాము. ఈ కార్యమున మాకు నీవు తోడ్పడుదువుగాక! కావున మేము రాత్రిందివములు నీకు నమస్కరించుచున్నాము. ౮

*సం॥ "భూయానరాత్యాః శచ్యాః పతిస్త్వమింద్రాసి*
*విభూః ప్రభూరితి త్వోపాస్మహే వయమ్."* అథ. ౧౯–౧౩౪–౪౭

*ఇమే వక్ష్యమాణాశ్చ మంత్రా అథర్వ వేదస్య సంతీతి బోధ్యమ్. (పంచదశ సంఖ్యాకమంత్రావధి.)*

*(ఇంద్ర) హే ఇంద్ర–పరమేశ్వర! త్వం (శచ్యాః) ప్రజ్ఞాయా వాణ్యాః కర్మణో వా పతి రసి. తథా, (భూయాన్) సర్వశక్తి మత్త్వాత్ సర్వోత్కృష్టత్వా దతిశయేన బహురసి, తథా (అరాత్యాః) శత్రుభూతాయా వాణ్యాస్తాదృశస్య కర్మణో వా శత్రుః, అర్థాత్ భూయాన్ని వారకోఽసి. (విభూః) వ్యాపకః (ప్రభూః) సమర్థశ్చాసి. (ఇతి) అనేన ప్రకారేణైవం భూతం (త్వా) త్వాం (వయమ్) సదైవ (ఉపాస్మ హే) అర్థాత్తవైవోపాసనం కుర్మహ ఇతి.* ౯

*అత్ర ప్రమాణమ్ :–*

*"వాచో నామసు శచీతి పఠితమ్."* ని. ౧–౧౧

*"తథా కర్మణాం నామసు శచీతి పఠితమ్."* ని. ౨–౧

*"తథా ప్రజ్ఞా నామసు శచీతి పఠితమ్."* ని. ౩–౯

తె॥ (భూయానరాత్యాః) ఓ జగదీశ్వరా! నీవు (శచ్యాః) సర్వ ప్రజ్ఞకు, వాణికి, కర్మములకు (పతిః) స్వామివి. అట్లే, (భూయాన్) సర్వశక్తి మత్త్వాది గుణయుక్తుడవు. (అరాత్యాః) నీవు-దుష్ట ప్రజ్ఞను, మిథ్యావాణిని, పాపకర్మములను నశింపజేయుటలో నతి సమర్థుడవు. (విభూః) నీవు వ్యాపకుడవు, (ప్రభూః) సర్వసామర్థ్య యుక్తుడవు, కావున మేము నిన్నుపాసింతుము. ౯

యాస్కముని నిర్మిత నిరుక్తమున శచీ శబ్దమునకు వాణి, కర్మము, ప్రజ్ఞ అను మూడర్థములు గలవని చెప్పబడినది.

*సం॥ "నమస్తే అస్తు పశ్యత పశ్య మా పశ్యత." ౧౦* అథ. ౧౯–౧౩౪–౪౮

*ఈశ్వరోఽభివదతి హే మనుష్యాః! యూయ ముపాసనారీత్యా సదైవ (మా) మాం, (పశ్యత) సమ్యగ్ జ్ఞాత్వా చరత, ఉపాసక ఏవం జానీయాద్, వదేచ్చ–హే పరమేశ్వర! అనంత విద్యాయుక్త! (నమస్తే అస్తు) తే తుభ్యమస్మాకం సతతం నమోఽస్తు భవతు.* ౧౦

తె॥ (నమస్తే అస్తు) పరమేశ్వరుడు మానవుల నుద్దేశించి యీ మంత్రమున నిట్లుపదేశించుచున్నాడు. "ఓ యుపాసకులార! మీరు (మా) నన్ను ప్రేమభావముతో నుపాసనా యోగము వలన నిజాత్మలలో (పశ్యత) ఎల్లపుడు చూడుడు. నా యాజ్ఞల నెఱుగుడు. వేద విద్య నభ్యసించి యందు విధించిన విధమున నాచరింపుడు. 'ఓ పరమేశ్వర! నీవు కృపాదృష్టితో (పశ్యమా) మమ్ములను నిరంతరము జూడుము. (నమస్తే అస్తు) మేము నీ కెల్లపుడు నమస్కరింతుము' అని యుపాసకులు కూడ ప్రార్థించవలెను. ౧౦

సం॥ "అన్నాద్యేన యశసా తేజసా బ్రాహ్మణ వర్చసేన." ౧౧ అథ. ౧౯—౧౩౪—౪౯

(అన్నాద్యేన) కస్మై ప్రయోజనాయ? అన్నాదిరాజ్యైశ్వర్యేణ. (యశసా) సర్వోత్తమ సత్కర్మానుష్ఠానోద్భూత సత్యకీర్త్యా (తేజసా) నిర్దీనతయా ప్రాగల్భ్యేన చ ( బ్రాహ్మణ వర్చసేన) పూర్ణ విద్యయా సహ వర్తమానా నస్మాన్ హే పరమేశ్వర! త్వం కృపయా సదైవ (పశ్య) సంప్రేక్షస్వ, ఏతదర్థం వయం త్వాం సర్వదోపాస్మ హే.

తె॥ ఓ పరమేశ్వరా! (అన్నాద్యేన) అన్నాద్యైశ్వర్యములతోను, (యశసా) సర్వోత్తమకీర్తితోను, (తేజసా) తేజస్సుతోను-దీనత్వము, భయము లేకుండుటతోను, (బ్రాహ్మణ వర్చసేన) సంపూర్ణ విద్యతోను మమ్ములను యుక్తులనుజేసి యనుగ్రహింపుము. ఇందులకే మే మెల్లప్పుడు నిన్నుపాసింతుము. ౧౧

సం॥ "అంభో అమో మహః సహ ఇతి త్వోపాస్మ హే వయమ్." ౧౨ అథ. ౧౩—౪—౫౦

[హే బ్రహ్మన్!] [అంభః] వ్యాపకం, శాంత స్వరూపం, జలవత్ ప్రాణస్యాపి ప్రాణమ్. ', 'ఆప్లధాతో 'రసున్' ప్రత్యయాంతస్యాయం ప్రయోగః. [అమః] జ్ఞాన స్వరూపం, [మహః] పూజ్యం, సర్వేభ్యో మహత్తరం, (సహః) సహన స్వభావం బ్రహ్మ. (త్వా) త్వాం జ్ఞాత్వా (ఇతి) అనేన ప్రకారేణ (వయం) సతత ముపాస్మ హే. ౧౨

తె॥ ఓ భగవన్ ! (అంభః) నీ వన్నింటను వ్యాపకుడవు, శాంత స్వరూపుడవు, జలము వలె ప్రాణమునకు ప్రాణము. (ఆప్ల) ధాతువునకు 'అసున్' ప్రత్యయము జేర్చిన 'అంభస్' శబ్దము సిద్ధించును. (అమః) నీవు జ్ఞాన స్వరూపుడవు, జ్ఞానము నిచ్చువాడవు. (మహః) అందఱికి బూజ్యుడవు, అందఱికంటె గొప్ప వాడవు. (సహః) అందఱను సహించు వాడవు. (ఇతి త్వా వయం ఉపాస్మహే) అని యిట్లు నిన్నెఱింగి యెల్లపుడు మే ముపాసింతుము. ౧౨

సం॥ "అంభో అరుణం రజతం రజః సహ ఇతి త్వోపాస్మ హే వయమ్." ౧౩అథ. ౧౩—౪—౫౧

(అంభః) ఆదరార్థో ద్విరాంభః, అస్యార్థ ఉక్తః, (అరుణమ్) ప్రకాశ స్వరూపమ్, (రజతమ్) రాగ విషయ మానంద స్వరూపం, (రజః) సర్వలోకైశ్వర్యసహితమ్ (సహః) సహన శక్తి ప్రదం, (ఇతి త్వోపాస్మ హే వయమ్) త్వాం విహాయ నైవ కశ్చిదన్యోఽర్థః కస్యచి దుపాస్యోఽస్తీతి. ౧౩

తె॥ ((అంభః) ఈ పదమునకు పూర్వమంత్రమున నర్థము చెప్పబడినది. గౌరవార్థము రెండవసారి యీ మంత్రమున నీ పదము గ్రహింపబడినది.)

(అరుణమ్) ఓ పరమేశ్వర! నీవు ప్రకాశ స్వరూపుడవు. సర్వ దుఃఖములను నాశన మొనరింతువు. (రజతమ్) ప్రీతికి పరమ హేతువగు నానంద స్వరూపుడవు. ( రజః) సర్వలోకరూపమగు నైశ్వర్యవంతుడవు. (సహః) సహన శీలుడవు. (ఈ పదము కూడ రెండవసారి ప్రయోగింప బడినది. ) (ఇతి....మహే...) అని మే ముపాసింతుము.

సం॥ "ఉరుః పృథుః సుభూర్భువ ఇతి త్వోపాస్మ హే వయమ్." ౧౪ అథ. ౧౩—౪—౫౨

(ఉరుః) సర్వ శక్తిమాన్. (పృథుః) అతీవవిస్తృతో వ్యాపకః, (సు భూర్ భువః) సుష్ఠుతయా, సర్వేషు పదార్థేషు భవతీతి సుభూః, అంతరిక్షవ దవకాశ రూపత్వాద్ భువః, (ఇతి) ఏవం జ్ఞాత్వా (త్వా) త్వాం (ఉపాస్మ హే వయమ్) ౧౪

"బహునామసు ఉరురితి ప్రత్యక్షమస్తి." నిఘం.౩—౧

తె॥ ఓ యీశ్వర! (ఉరుః) నీవు సర్వశక్తి మంతుడవు, (పృథుః) అద్యంతరహితుడవు, వ్యాపకుడవు, (సుభూః) సర్వ పదార్థములందుండు వాడవు. (భువః) అవకాశ స్వరూపుడవగుటచే నంతయు నీయందున్నది. అని యెఱింగి నిన్నెల్లప్పుడు నుపాసింతుము. నిన్నే యాశ్రయించి యున్నాము.

యాస్క నిఘంటువునందు 'ఉరు' శబ్దమునకు బహు - అనేకము అని యర్థమున్నది. ౧౪

సం॥ "ప్రథో వరో వ్యచో లోక ఇతి త్వోపాస్మహే వయమ్." ౧౫ అథ. ౧౩–౪–౫౩

(ప్రథః) సర్వ జగత్ ప్రసారకః, (వరః) శ్రేష్ఠః, (వ్యచః) వివిధ తయా సర్వం జగజ్జానాతీతి, (లోకః) లోక్యతే సర్వైర్ జనైర్ లోకయతి సర్వాన్వా. (ఇతిత్వో...) వయమీదృక్ స్వరూపం సర్వజ్ఞం త్వా ముపాస్మహే." ౧౫

తె॥ (ప్రథో వరో) ఓ పరమేశ్వర! నీవు సర్వ జగత్తును విస్తరింప జేయువాడవు. ఉత్తముడవు. (వ్యచః) సర్వజ్ఞుడవు; ధారణ, పాలన, వినాశము లనెడి ముప్విధక్రియలకు కర్తవు. (లోకః) విద్వాంసుల కెల్లరకు తెలిసికొనదగినవాడవు. ఎల్లరను చూచువాడవు - నెఱుగు వాడవు నీవే. అన్యుడెవడును కాడు. ఇట్టి సర్వజ్ఞ స్వరూపుడవగు నిన్ను మేము సతత ముపాసింతుము. ౧౫

సం॥ "యుంజంతి బ్రధ్నమరుషం చరంతం పరితస్థుషః. రోచంతే రోచనాదివి." ౧౬
ఋ.౧.౧–౧౧–౧

౧. (యుంజంతి) యే యోగినో విద్వాంసః, (పరితస్థుషః) పరితః సర్వతః సర్వాన్ జగత్పదార్థాన్ మనుష్యాన్ వా చరంతం జ్ఞాతారం సర్వజ్ఞం, (అరుషం) అహింసకం కరుణామయం. (రుషహింసాయామ్), (బ్రధ్నం) విద్యాయోగాభ్యాస ప్రేమ భరేణ సర్వానంద వర్ధకం మహాంతం పరమేశ్వర మాత్మనా సహ యుంజంతి. (రోచనాః) త ఆనందే ప్రకాశితా రుచిమయా భూత్వా, (దివి) ద్యోతనాత్మకే సర్వ ప్రకాశకే పరమేశ్వరే (రోచంతే) పరమానంద యోగేన ప్రకాశంతే. ఇతి ప్రథమోఽర్థః. ౨. అథ ద్వితీయః– (పరితస్థుషః) చరంతమరుష మగ్నిమయం బ్రధ్నమాదిత్యం సర్వే లోకాః పదార్థాశ్చ. (యుంజంతి) తదాకర్షణేన యుక్తాః సంతి, ఏతే సర్వే తస్యైవ (దివి) ప్రకాశే, (రోచనాః) రుచికరాః సంతః, (రోచంతే) ప్రకాశంతే, ఇతి ద్వితీయోఽర్థః. ౩. అథ తృతీయః,– య ఉపాసకాః పరితస్థుషః సర్వాన్ పదార్థాన్ చరంత మరుషం సర్వ మర్మస్థం (బ్రధ్నం) సర్వా వయవవృద్ధికరం ప్రాణమాదిత్యం ప్రాణాయామరీత్యా (దివి) ద్యోత నాత్మ కే పరమేశ్వరే వర్తమానం (రోచనాః) రుచిమంతః సంతో యుంజంతి యుక్తం కుర్వంతి. అతస్తే తస్మిన్ మోక్షానందే పరమేశ్వరే రోచంతే సదైవ ప్రకాశంతే. ౧౬

అత్ర ప్రమాణాని.– మనుష్య నామను 'తస్థుషః' 'పఙ్చజనాః' ఇతి పఠితమ్. నిఘం.అ.౨–౩

'మహత్'. 'బ్రధ్న' (ఇతి) మహన్నామసు పఠితమ్. నిఘం. అ. ౩–౩

తథా యుంజంతి బ్రధ్న మరుషం చరంతమితి, అసౌ వా ఆదిత్యో బ్రధ్నోఽరుషోఽముమేవాస్మా ఆదిత్యం యునక్తి స్వర్గస్య లోకస్య సమృష్ట్యై. ౧ శత. కాం.౧౩, అ.౨

"ఆదిత్యో హ వై ప్రాణో రయి రేవ చంద్రమా రయిర్ వా ఏతత్ సర్వం యన్ మూర్తం చామూర్తం చ తస్మా న్మూర్తి రేవ రయిః." ౨ ప్రశ్న. ఉ. ప్ర. ౧, మం.౫

పరమేశ్వరాత్ మహాన్ కశ్చిదపి పదార్థో నాస్త్యే వాతః ప్రథమేఽర్థే యోజనీయమ్. తథా శత పథ ప్రమాణం ద్వితీయ మర్థం ప్రతి. ఏవమేవ ప్రశ్నోపనిషత్ ప్రమాణం తృతీయమర్థం ప్రతి చ.

క్వచిన్నిఘంటావశ్వస్యాపి బ్రధ్నారుషీ నామ్నీ పఠితే. పరం త్వస్మిన్ మంత్రే తద్ ఘటనా నైవ సంభవతి. శతపథాదివ్యాఖ్యాన విరోధాత్. మూలార్థ విరోధా దేకశబ్దే నాప్యనేకార్థ గ్రహణాచ్చ.

ఏవం సతి భట్టమోక్షమూలరైర్ ఋగ్వేదస్యేంగ లేండభాషయా వ్యాఖ్యానే యదశ్వస్య పశోరేవ గ్రహణం కృతం తద్ భ్రాంతిమూల మేవాస్తి. సాయణాచార్యేణాస్య మంత్రస్య వ్యాఖ్యాయా మాదిత్య గ్రహణాదేకస్మిన్నంశే తస్య వ్యాఖ్యానం సమ్యక్ కృతమస్తి. పరన్తు న జానే భట్ట మోక్షమూలరేణాయమర్థ ఆకాశాద్ వా పాతాలాద్ వా గృహీతః. అతో విజ్ఞాయతే స్వకల్పనయా లేఖనం కృతమితి జ్ఞాత్వా ప్రమాణార్హం నాస్తీతి.

తె॥ ౧. మొదటి యర్థము – (యుంజంతి) ముక్తికి నుత్తమ సాధన ముపాసన. అందువలన విద్వాంసులు, (పరితస్థుషః) సర్వ జగత్తునందును, సర్వ ప్రాణుల హృదయములందును, వ్యాపకుడై యున్న సర్వజ్ఞుడగు నీశ్వరుని యుపాసన వలన తమ యాత్మలతోయుక్తము జేసికొందురు. ఆ యీశ్వరుడు (చరంతం) సర్వజ్ఞుడు, (అరుషం) హింసాదిదోషరహితుడు, కృపాసముద్రుడు, (బ్రధ్నం) విద్యవలనను, యోగాభ్యాసము వలనను జనించు నగాధ ప్రేమతో సర్వానందములను బెంచువాడు, సర్వ విధముల పెద్దవాడు, (రోచనాః) కావున నుపాసకుల యాత్మలు అవిద్యాది సర్వదోషము లనెడి యంధకారమునుండి విడివడి (దివి) ఆత్మలను బ్రకాశింపజేయు పరమేశ్వరునియందు (రోచంతే) ప్రకాశితము లగును.

౨. రెండవ యర్థముః– (పరితస్థుషః) సూర్యలోకము, తన కిరణములతో మూర్తి మంతములగు సర్వ ద్రవ్యములను బ్రకాశింప జేయుటలోను, ఆకర్షించుటలోను, (బ్రధ్నం) అన్నింటికంటె పెద్దదియు, (అరుషం) రక్త గుణయుక్తము, అగ్నిమయమును నై యున్నది. సర్వ లోకములు దాని యాకర్షణముతో యుక్తములై యున్నవి. (దివి రోచనాః) అట్లే సర్వ పదార్థములు నా సూర్యుని ప్రకాశమువలననే ప్రకాశితములగు చున్నవి. విద్వాంసులాయాదిత్యునే సర్వలోకముల నాకర్షించువాడని యెఱుగుదురు.

౩. మూడవ యర్థముః– (యుంజంతి) ఉపాసకులు సర్వావయవ వృద్ధికి ముఖ్య హేతువగు ప్రాణమును ప్రాణాయామముతో ప్రీతి పూర్వకముగ పరమేశ్వరుని యందు లగ్నము చేయుదురు. అందువలననే వారు మోక్షమును బొంది సదానందమున నుందురు.

మంత్రములోని పదములకు మూడర్థములు చెప్పుటకు దగిన ప్రమాణములుః–

యాస్క నిఘంటువున, 'తస్థుష' శబ్దము మానవార్థమున గ్రహింపబడినది. అట్లే శతపథ బ్రాహ్మణమున 'బ్రధ్న, అరుష' శబ్దములు ఆదిత్యుడను నర్థము దెలుపుచున్నవి. ఈ 'బ్రధ్న' శబ్దమున కర్థము యాస్కనింఘటువున 'మహత్' అని యున్నది. ప్రశ్నోపనిషత్తునందు ఆదిత్యుడు 'ప్రాణ' శబ్దముచే జెప్పబడెను. కావున 'బ్రధ్న, అరుష' శబ్దములచే ప్రాణమును గ్రహింపనగును.

పరమేశ్వరుని మించిన గొప్ప పదార్థ మింకొకటి లేదు. కావున పైన జూపిన యాస్క నిఘంటు ప్రమాణము మంత్రము యొక్క ప్రథమార్థమున నుపయుక్తమగును. శతపథప్రమాణము ద్వితీయార్థము నందును, ప్రశ్నోపనిషత్ ప్రమాణము తృతీయార్థమునందు నుపయుక్తములగునని గ్రహింపవలెను.

యాస్క నిఘంటువునందు 'బ్రధ్న', అరుష' శబ్దములు 'అశ్వ' నామములందును పఠింపబడినవి. కాని, ఆయర్థ మీ మంత్రమున గ్రహింపదగదు. శతపథాది గ్రంథ వ్యాఖ్యానముల కది విరుద్ధమగును. మూలార్థము సంగతమును కాదు. ఒక శబ్దమున కనేకార్థము లుండ వచ్చును. కాని, అర్థములన్నియు నొకే స్థలమున నుపయుక్తములు కావు. కావున భట్ట మోక్షముల్లర్ ఆంగ్లేయభాషలో నీ మంత్రమున కర్థము

వ్రాయుచు పై పదమునకు 'అశ్వ' మని వ్రాసియున్నాడు. అది సరికాదు. సాయణాచార్యు డీ మంత్ర వ్యాఖ్యానము నందు ఆదిత్యుని గ్రహించి యున్నాడు. ఒక యంశమున నీ వ్యాఖ్య సరియనియే చెప్ప వచ్చును. కాని, భట్ట మోక్షమూల రీ యర్థము నెటనుండి గ్రహించెనో తెలియకున్నది. అతని కల్పనా మాత్రమనియే చెప్పనగును. కావున ప్రామాణికము కాదు.

సం॥ ఇదానీ ముపాసనా కథం రీత్యా కర్తవ్యేతి లిఖ్యతే.

తత్ర శుద్ధ ఏకాంతేఽభీష్టే దేశే శుద్ధమానసః సమాహితో భూత్వా సర్వాణీంద్రియాణి మనశ్చైకాగ్రీకృత్య, సచ్చిదానందస్వరూప మంతర్యామినం న్యాయ కారిణం పరమాత్మానం సంచింత్య, తత్రాత్మానం నియోజ్య చ, తస్యైవ స్తుతి ప్రార్థనా నుష్ఠానే సమ్యక్ కృత్వోపాసనయా ఈశ్వరే పునః పునః స్వాత్మానం సంలగయేత్.

అత్ర పతంజలి మహామునినా స్వకృత సూత్రేషు వేదవ్యాసకృత భాష్యే చాయ మనుక్రమో యోగశాస్త్రే ప్రదర్శితః. తద్ యథా–

"యోగశ్చిత్తవృత్తినిరోధః" ౧ యో. ౧–౨

ఉపాసనాసమయే వ్యవహారసమయే వా, పరమేశ్వరా దతిరిక్త విషయాత్ అధర్మ వ్యవహారాచ్చ మనసో వృత్తిః సదైవ నిరుద్ధా రక్షణీయేతి. ౧

పూ. సః నిరుద్ధా సతీ సా క్వావతిష్ఠతే?

ఉ. సః ఇత్యత్రోచ్యతే.

"తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్." ౨ యో. ౧–౩

యదా సర్వస్మాద్ వ్యవహారా న్మనోఽవరుధ్యతే, తదా అస్యోపాసకస్య మనో ద్రష్టుః సర్వజ్ఞస్య పరమేశ్వరస్య స్వరూపే స్థితిం లభతే." ౨

పూ. సః యదా ఉపాసకో యోగీ ఉపాసనాం విహాయ సాంసారిక వ్యవహారే ప్రవర్తతే, తదా సాంసారిక జనవత్తస్యాపి ప్రవృత్తిర్ భవత్యాహోస్విద్ విలక్షణా?

ఉ. సః ఇత్యత్రాహ.

"వృత్తి సారూప్యమితరత్ర. యో. ౧–౪

ఇతరత్ర సాంసారిక వ్యవహారే ప్రవృత్తేఽప్యుపాసకస్య యోగినః శాంతా ధర్మారూఢా విద్యా విజ్ఞాన ప్రకాశా సత్యతత్త్వ నిష్ఠా అతీవ తీవ్రా సాధారణమనుష్య విలక్షణా అపూర్వైవ వృత్తిర్ భవతీతి. నైవేదృశీ అనుపాసకానా మయోగినాం కదాచిద్ వృత్తిర్ జాయత ఇతి.

పూ. సః కతి వృత్తయః సంతి? కథం నిరోద్ధవ్యాః?

ఉ. సః ఇత్యత్రాహ–

"వృత్తయః పంచతయ్యః క్లిష్టాక్లిష్టాః" ౪ యో. ౧–౫

"ప్రమాణ విపర్యయ వికల్ప నిద్రా స్మృతయః" ౫ యో. ౧–౬

"తత్ర ప్రత్యక్షానుమానాగమాః ప్రమాణాని" ౬ యో.౧-౭

"విపర్యయో మిథ్యాజ్ఞానమతద్రూప ప్రతిష్ఠమ్" ౭ యో.౧-౮

"శబ్ద జ్ఞానానుపాతీ వస్తు శూన్యో వికల్పః" ౮ యో. ౧-౯

"అభావ ప్రత్యయాలంబనా వృత్తిర్ నిద్రా" ౯ యో. ౧-౧౦

"అనుభూత విషయా సంప్రమోషః స్మృతిః" ౧౦ యో.౧-౧౧

"అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః" ౧౧ యో. ౧-౧౨

పూ. ప్ర: ఉపాసనాయాః సిద్ధేః సహాయకారి పరమం సాధనం కిమస్తి?

ఉ.ప్ర: ఇత్యత్రోచ్యతే, "ఈశ్వర ప్రణిధానాద్వా" ౧౨ యో.౧-౨౩

భాష్యమ్ :- ప్రణిధానాద్ భక్తివిశేషాదావర్జిత ఈశ్వర స్తమనుగృహ్ణాత్యభిధ్యానమాత్రేణ, తదభిధ్యానాదపి యోగిన ఆసన్నతమః సమాధిలాభః ఫలం చ భవతీతి. ౧౨

తె॥ ఉపాసన చేయవలసిన రీతి యిపుడిట వ్రాయుచున్నాము. మనుజు లీశ్వరు నుపాసింపదలతురేని, తమ కోరిక కనుకూలమగు నేకాంత స్థలమున నాసీనులై మనస్సును శుద్ధ మొనర్చుకొని; స్థిర పఱచుకొనవలెను. సర్వేంద్రియములను, మనస్సును సచ్చిదానందాది లక్షణ యుక్తుడును, అంతర్యామి - సర్వ వ్యాపకుడు - న్యాయ కారియు నగు పరమేశ్వరుని వంకకు బాగుగ మరల్చి, లెస్సగ నాలోచింపవలెను; పరమేశ్వరునియందు తమ యాత్మలను నియోగింపవలెను. మఱియు స్తుతి, ప్రార్థనోపాసనలను బలుమాఱు చేసి తమ యాత్మల నతని యందు లగ్నము చేయవలెను. పతంజలి మునికృత యోగ శాస్త్రము, ఆశాస్త్ర గత సూత్రములకు వేద వ్యాసముని కృత భాష్య ప్రమాణముల ననుసరించి, యుపాసించురీతి నిట వ్రాయుచున్నాము.

(యోగశ్చిత్త....) ఉపాసించు సమయమున పరమేశ్వరునికంటె భిన్నములగు విషయములనుండియు, వ్యవహార సమయమున అధార్మికములగు సర్వ వ్యవహారములనుండియు తన మనోవృత్తి నెల్లప్పుడు నిరోధింపవలెను - అడ్డగింపవలెను. ఇట్లు చేయుటయే యోగము. ఇట్లే పరమేశ్వరుని నుండి దూరమగుటయు, నతని యాజ్ఞలకు విరుద్ధముగ చెడుగులందు జిక్కుపడుటయు వియోగ మనబడును.

పూ. ప్ర: వెలుపలి వ్యవహారములనుండి వేఱు చేసి వృత్తి స్థిర మొనర్చినపుడదెక్కడ స్థిరమగును?

ఉ. ప్ర: (తదా ద్రష్టుః....) జల ప్రవాహము నొకవైపున దృఢ మగు నానకట్టతో నడ్డగించి నపుడది నిమ్న స్థలమునుజేరి యట స్థిర మగును. అట్లే మనోవృత్తిని బాహ్యము నుండి యడ్డగించిన నపుడది సర్వజ్ఞుడైన పరమేశ్వరుని యందు స్థిరమగును.

పూ. ప్ర: ఉపాసకుడగు యోగి యుపాసనను విడిచి సాంసారిక వ్యవహారములందు ప్రవృత్తుడైనపుడతని ప్రవృత్తి సాంసారిక పురుషుల ప్రవృత్తివలె నుండునా? దానికి విలక్షణమున నుండునా?

ఉ. ప్ర: (వృత్తి సారూప్య మితరత్ర) ఉపాసకుడైన యోగి సాంసారిక వ్యవహారములందు ప్రవర్తించినపుడతని వృత్తి హర్ష శోకములు లేనిదై శాంతము, ధర్మారూఢము, విద్యా విజ్ఞాన ప్రకాశము, సత్యతత్త్వనిష్ఠయు కలదై, మిక్కిలి తీవ్రమై, సాధారణ మనుష్య విలక్షణమై, అపూర్వమునై యుండును. సాంసారిక మనుజుని వృత్తి యట్లుగాక హర్ష శోకములతో గూడి దుఃఖసాగరమున మునుకలు వేయుచుండును. (ఉపాసకుని వృత్తి జ్ఞాన రూప ప్రకాశమున వర్ధిల్లును. సాంసారికుని వృత్తి సతత మంధకారమున చిక్కుపడుచుండును.)

ఘ : (అనాత్మను) ఆత్మ కానిదాని నాత్మయని యెంచుట - జడమగు శరీరమును చేతన మనుకొనుట - చేతనమును జడమని యెంచుట, అవిద్యలో నాల్గవ భాగము :- ఈ యవిద్య ప్రపంచమునందలి యజ్ఞానులగు జీవుల బంధమునకు హేతువై, వారి నెల్లపుడు నాడించుచుండును. ఇట్లే పూర్వము చెప్పబడిన అనిత్యాశుచి దుఃఖానాత్మలను అనిత్యాశుచి దుఃఖానాత్మలని యెంచుటయు, నిత్యశుచి సుఖాత్మలను నిత్య శుచి సుఖాత్మలుగా నెంచుటయు విద్య యనబడును. విద్య వలన న విద్య తొలగినపుడు బంధనము నుండి విడివడి జీవుడు ముక్తుడగును. ౩

౨. అవిద్యా కార్యమైన యస్మితకు లక్షణము :-

(అస్మితా) రెండవ క్లేశము అస్మిత. వాస్తవమున జీవుడు వేఱు, బుద్ధి వేఱు. భిన్నములైన జీవ బుద్ధుల,నేకమని యెంచుట యస్మిత యగును. దీనివలన నభిమానము-అహంకారము కలుగును. అందువలన వ్యక్తి తన నందఱికంటె గొప్పగా నెంచసాగును. సమ్యక్ జ్ఞానము వలన నభిమానము నశించి, అస్మిత దూరమగును. అప్పుడే మంచి గుణములను గ్రహింప రుచిగలుగును.

౩. రాగ లక్షణము :-

(సుఖానుశయీ రాగః) లోకమున సుఖముల ననుభవించినపుడు వానివలన గలుగు సంస్కారముల వలన మరల నా సుఖములు స్మరణకు వచ్చును. అప్పుడా సుఖములయందును, ఆ సుఖములు కలిగించు సాధనములందును తృష్ణ-ఆశ-లోభము కలుగును. అదియే రాగము. మనుజుడు సంయోగము వియోగాంత మనియు, వియోగము సంయోగాంతమనియు దెలిసిననాడు, అట్లే వృద్ధి కంతము క్షయమనియు, క్షయమున కంతము వృద్ధి యనియు గుర్తించిననాడును రాగము నివృత్తమగును. ౫

ద్వేషలక్షణము :- (దుఃఖాను) పూర్వమనుభవించిన దుఃఖముల గూర్చియు, వాని సాధనముల గూర్చియు క్రోధ బుద్ధి గలిగియుండుట ద్వేషమనబడును. రాగనివృత్తిగలిగిన ద్వేషనివృత్తి గలుగును.౬

౫. అభినివేశలక్షణము :-(స్వరసవా) ప్రాణులన్నియు నెల్లపుడు శరీరముతో నుండవలయుననియు, చావకూడదనియు ఆశించుచుండును. పూర్వజన్మమున నెల్లరు మృత్యుభయము ననుభవించి యుండుట వలననే అభినివేశము కలుగును. దాని స్మరణవలన నిప్పుడెవ్వడును చావగోరడు. దీని వలన పూర్వ జన్మ మున్నట్లు సిద్ధించుచున్నది. కృమికీటకాదుల కన్నిటికి మరణ భయము కలుగును. కావున నీ క్లేశము నభినివేశమందురు. జీవుడు, పరమేశ్వరుడు, ప్రకృతి నిత్యములనియు కార్య ద్రవ్య సంయోగ వియోగము లనిత్యములని గ్రహించిననాడు ఈ క్లేశము నివృత్త మగును. క్లేశములు నివృత్తములైనపుడు జీవులకు మోక్షసుఖప్రాప్తి కలుగును.

(తదభావాత్...) అవిద్యాది క్లేశములు తొలగి, విద్యాది శుభ గుణములు లభించినపుడు జీవుడు తనకు బుద్ధితో గల సంయోగాది సర్వబంధనముల నుండియు, దుఃఖముల నుండియు విడివడి ముక్తిని బొందును.

(తద్వైరాగ్యా....) శోకరహితములగు విశోకాది సిద్ధులవలనను విరక్తుడై, సర్వక్లేశములకు, దోషములకు మూల-బీజ-మగు నవిద్యను నశింపజేయుటకు దగిన యత్న మొనర్పవలెను. అవిద్య నశింపక మోక్షమెన్నడు లభింపనేరదు.

(సత్వ పురుష....) బుద్ధి, పురుషుడు నను నీ రెండింటిశుద్ధి కలుగక మోక్షము లభింపదు. ౧౦

(బుద్ధియందుగల కర్తృత్వాభిమానము పోయి యది తనకు కారణమగు ప్రకృతియందు లీనమగుటయే బుద్ధి శుద్ధియనబడును. బుద్ధి ద్వారమున తనకు లభించు సుఖదుఃఖముల ననుభవింపకుండుటయే జీవునిశుద్ధి.)

(తదావివేక...) సర్వదోషములనుండి వేఱై, జ్ఞానము వంక జీవుడు మరలి నపుడు; కైవల్య -మోక్ష- ధర్మమునకు సంబంధించిన సంస్కారములతో నతనిచిత్తము పరిపూర్ణమగును. అప్పుడే జీవునకు మోక్షము లభించును. బంధన హేతువులగు కర్మములలో జీవుడు చిక్కియున్నంత వఱకు నతనికి ముక్తి లభించుట యసంభవము. ౧౧

కైవల్య-మోక్ష-లక్షణము :-

(పురుషార్థ....) కారణ - ప్రకృతికి -సంబంధించిన సత్వరజస్తమోగుణములు, వాని సర్వకార్యములు పురుషార్థ శూన్యము అయిననాడు, పురుషున కవి చేకూర్చవలసిన భోగాపవర్గములను చేకూర్చి చరితార్థము అయిననాడు, ఆ గుణములు వాని కార్యములును, తమకు కారణమగు ప్రకృతి-ప్రధానములో లీనములగును. అప్పుడు జీవుని యందు విజ్ఞానము, శుద్ధియు నేర్పడి జీవునకు స్వరూప ప్రతిష్ఠ కలుగును- జీవుడు తన స్వాభావిక శక్తితోను, గుణములతోను యుక్తుడయియుండును. శుద్ధస్వరూపుడగు పరమేశ్వరుని స్వరూపమగు విజ్ఞానము-ప్రకాశము-నిత్యానందమున నుండును. ఆ స్థితినే కైవల్యము-మోక్షము-అందురు. ౧౨

సం॥ అథ న్యాయశాస్త్ర ప్రమాణాని :-

"దుఃఖ జన్మ ప్రవృత్తి దోష మిథ్యాజ్ఞానానా ముత్తరోత్త రాపాయే తదనంతరాపాయా దపవర్గః" ౧ న్యా. ౧-౧-౨

"బాధనాలక్షణం దుఃఖమితి" ౨ న్యా. ౧-౧-౨౧

"తదత్యంత విమోక్షోఽపవర్గః" ౩ న్యా. ౧-౧-౨౨

తె॥ ముక్తి విషయమున గౌతమ నిర్మిత న్యాయదర్శన ప్రమాణములుః-

(దుఃఖజన్మ...) యథార్థజ్ఞానమువలన మిథ్యాజ్ఞానము - అవిద్య- నశించును. అప్పుడు జీవునియందుగల రాగద్వేషములనెడి దోషములు నష్టమగును. అటుపైన ప్రవృత్తి - అధర్మము, అన్యాయము, విషయాసక్తి మున్నగు వాసనలు దూరమగును. ప్రవృత్తి లేనపుడు,దాని వలన గలిగెడి జన్మము కూడ దొలగిపోవును. జన్మము లేనందున సర్వదుఃఖములు బొత్తిగా లేకుండ పోవును. ఇట్లు దుఃఖాభావము కలిగి జీవుడు పరమానంద ప్రదమగు మోక్షదశలో పరమాత్మతో గూడి యానందమునే యనుభవించును. ఇదియే మోక్షము. ౧

(బాధనా.....) సర్వవిధములగు బాధ-ఇచ్ఛావిఘాతము-పరతంత్రత-దుఃఖమనబడును. ౨

(తదత్యంత...) అట్టి దుఃఖాత్యంతాభావమువలనను, పరమాత్మసంబంధమువలనను పరమానందము ప్రాప్తించును. ఆ పరమ సుఖ ప్రాప్తియే మోక్షమనబడును. ౩

సం॥ అథ వేదాంతశాస్త్రస్య ప్రమాణాని :-

"అభావం బాదరి రాహ హ్యేవమ్" ౧ బ్రహ్మసూ. ४-४-౧౦

"భావం జైమినిర్ వికల్పామననాత్" ౨ బ్ర. ४-४-౧౧

"ద్వాదశాహవ దుభయవిధం బాదరాయణోఽతః" ౩ బ్ర. ४-४-౧౨

"యదా పంచావతిష్ఠంతే జ్ఞానాని మనసా సహ బుద్ధిశ్చ న విచేష్టతే తామాహుః పరమాం గతిమ్" ౧ కఠ. ౬-౧౦

"తాం యోగమితి మన్యంతే, స్థిరామింద్రియ ధారణామ్, అప్రమత్త స్తదా భవతి, యోగో హి ప్రభవావ్యయౌ" ౨ కఠ. ౬-౧౧

"యదా సర్వే ప్రముచ్యంతే కామాయేఽస్య హృది శ్రితాః, అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే" ౩ కఠ. ౬-౧౪

"యదా సర్వే ప్రభిద్యంతే హృదయ స్యేహ గ్రంథయః, అథమర్త్యోఽమృతో భవత్యేతావద నుశాసనమ్ ౪ కఠ. ౬-౧౫

"దైవేన చక్షుషా మనసైతాన్ కామాన్ పశ్యన్ రమతే" ౫ ఛాందో. ౮-౧౨-౫

"య ఏతే బ్రహ్మలోకే, తం వా ఏతం దేవా ఆత్మాన ముపాసతే తస్మాత్తేషాగ్ం సర్వే చ లోకా ఆత్తాః సర్వే చ కామాః స సర్వాగ్ంశ్చ లోకానాప్నోతి. సర్వాగ్ంశ్చ కామాన్, యస్త మాత్మాన మనువిద్య (వి) జానాతీతి హ ప్రజాపతి రువాచ, ప్రజాపతి రువాచ" ౬ ఛాం ౮-౧౨-౬

"యదంతరాపస్తద్ బ్రహ్మ తదమృతగ్ం స ఆత్మా, ప్రజాపతేః సభాం వేశ్మ ప్రపద్యే. యశోఽహం భవామి, బ్రాహ్మణానాం యశో రాజ్ఞాం యశో విశామ్ యశోఽహమనుప్రాపత్సి, సహోహం యశసాం యశః" ౭ ఛాం. ౮-౧౪-౧

తె॥ వ్యాసరచిత (బ్రహ్మ సూత్రములు) వేదాంత దర్శనములోను నుపనిషత్తులలోను వ్రాయబడిన ముక్తి స్వరూప లక్షణముల నిట వ్రాయుచున్నాము.

(అభావం....) వ్యాసుని తండ్రి బాదరి. అతడాచార్యుడు. ముక్తి విషయమున నతని యభిప్రాయము- 'జీవుడు ముక్త దశను బొంది నపుడు శుద్ధ మనస్సు (శుద్ధ సంకల్పమొనర్చు శక్తి)తో పరమేశ్వరునితో బాటు పరమానందమగు మోక్షమున నుండును. ఈ రెండింటికి (జీవాత్మ - శుద్ధ సంకల్పశక్తి) భిన్నమైన శరీరము కాని, ఇంద్రియాది ప్రాకృతిక పదార్థములుకాని యట నుండవు.

(భావం జైమినిః...) ఈవిషయమునందే వ్యాసునకు ముఖ్యశిష్యుడైన జైమిని ముని యభిప్రాయము. 'మోక్షమున శుద్ధ మనస్సు (శుద్ధమానసిక శక్తి) ఉండును. అట్లే శుద్ధ సంకల్పమయ శరీరము, అట్లే ప్రాణాదులు, ఇంద్రియముల శుద్ధ శక్తియు నుండును. కారణమేమన :- ఉపనిషత్తునందు 'స ఏకథా భవతి, ద్విధా భవతి, త్రిధా భవతి' (ఛాం. ౭-౨౬-౨) 'అతడొకటిగాను, రెండుగాను, మూడుగాను అగును) అని వికల్పములు - అనేక భావములను ప్రతిపాదించు వచనము లీ విషయమున ప్రమాణములుగా నున్నవి. ముక్త జీవుడు సంకల్పమాత్రమున నానావిధములగు నప్రాకృతికములు, దివ్యములునగు సాంకల్పిక శరీరములను రచించుకొనును. కోరినంత వానిని వెంటనే విడువనుగలడు. అతనికి శుద్ధ జ్ఞాన ప్రకాశమట నుండును. ౨

(ఇట దివ్య శరీరమన, వాస్తవమున నటనేదో యొక శరీరముండునని యభిప్రాయము కాదు. "మనవంటి సాధారణ పురుషుల శరీరముకంటె ముక్తపురుషుని శరీరము మిక్కిలి సుందరమై, శోభనాంగములు కలదై, అధిక శక్తి మంతమై యుండుననియు దివ్య శరీరమున కభిప్రాయము కాదు. ముక్తావస్థయందు జీవునకు ప్రకృతితో నెట్టి సంబంధమునుండదు. కావున ఆ సమయములో ప్రాకృతికములగు దివ్యమైన లేక అదివ్యమైన శరీరముల యునికికి సంబంధమగు సంభావనయే యుండదు. మనస్సు విషయములోను నిట్లే యెంచవలెను. మనస్సు కూడ ప్రాకృతికమే. జీవుడు బంధనావస్థలో నున్నపు డేశక్తులమూలమున మనస్సు, ఇంద్రియములు మున్నగువాని వలన సాంసారిక సుఖముల ననుభవించునో యాశక్తులు

ముక్తావస్థయందు జీవుడు స్వస్వరూపమున నున్నపుడు-బాగుగ వికసించును. సంసారావస్థలో జీవుని యందీశక్తులున్నను నవి యవిద్యాదులవలన నణగియుండును. కార్యకరణశక్తి యుడిగియుండును. అందువలన సాంసారిక సుఖముల ననుభవించుటకు జీవునకు ప్రాకృతి కములయిన మనస్సు మున్నగు ఇంద్రియము లావశ్యకములగును. ముక్తావస్థయందవిద్య యుండదు. కావున నాస్వాభావిక శక్తులు ప్రకటములై జీవున కానందము ననుభవింపజేయ సమర్థములగును. అప్పుడు ప్రాకృతికములైన మనస్సు మున్నగు సాధనము లావశ్యకములు కావు. ఈ భావమునే మహర్షి దయానందుడు, సత్యార్థ ప్రకాశమున నవమస ముల్లాసమునందు 'శృణ్వాన్ శ్రోత్రం భవతి' అను శత పథ బ్రాహ్మణ వాక్య ప్రమాణములతో స్పష్టము చేసియున్నాడు. ఈ శుద్ధ శక్తుల సముదాయమే యాముక్త దశలో నాత్మకు శరీరమగును. ఇవియే యింద్రియములు, మనస్సు కూడ. ఇదియే దివ్య శరీరము. దీనితోనే పరమాత్మలో నతడిటునటు చరించును. కావున ముక్త దశలో మనస్సు మున్నగు నామములతో జెప్పబడు శుద్ధ శక్తుల భావము, ప్రాకృతికములయిన మనస్సు మున్నగువాని యభావము రెండును నుండును :- అప్పుడు సద్ గుణముల భావము, అసద్ గుణముల యభావము నుండును. ఈభావాభావముల యునికిని వ్యాసమహర్షి తదుపరి సూత్రమున ప్రకటించియున్నాడు. దీనిని మహర్షి దయానందుడు నంగీకరించియున్నాడు.)

(ద్వాదశాహ...) ఈముక్తి విషయమున బాదరాయణుని - వ్యాసమహర్షి యభిప్రాయము ;- "ముక్తి యందు భావము అభావము రెండును నుండును ప్రాకృతికములగు మనస్సు, ఇంద్రియములు, శరీరము మున్నగు సాధనములు లేనందున నవిద్యాది క్లేశములు, అజ్ఞానము, అశుద్ధి మున్నగు దోషముల యభావ మేర్పడును. శుద్ధ సామర్థ్యము (శక్తి)తో గూడిన జీవుడు ముక్తియందుండుటవలన పరమానందము, జ్ఞానము శుద్ధత మున్నగు సర్వసత్యగుణముల భావముండును. ఇందులకు దృష్టాంతము. వాన ప్రస్థాశ్రమమున పండ్రెండుదినములు ప్రాజాపత్యవ్రత మొనరింపవలసి యున్నది. అప్పుడు కొలదిగా భుజించుటవలన కొలదిగా నాకలియుండును:- క్షుత్తు (ఆకలి)నకు కొంత భాగము, కొంత యభావమునుండును. ఇట్లే మోక్షము నందును పూర్వము చెప్పినట్లు భావాభావము లుండునని యెంచవలెను.

('ద్వాదశాహవత్' అను సూత్రమున ద్వాదశాహమను సత్రము ఉదాహరణముగ గ్రహింపబడినది. వాని వ్యాఖ్యానము క్షుత్తు-ఆకలి-యొక్క భావాభావములని అజమీర్‌లో అచ్చైన భాష్యభూమికలో నున్నట్లు వ్రాయబడినది. ఇయ్యది పండితుల కాలోచనీయాంశము. పండితమండలిలో నీ ద్వాదశాహ పదము యాగవాచకముగ బ్రసిద్ధమైయున్నది. ద్వాదశాహ యాగమునకు సత్రమనియు, అహీనమనియు రెండు నామములున్నవి. ఇందులకు ప్రమాణ వాక్యములున్నవి. ఇట్లే ముక్తావస్థయందును భావా భావములను దెలుపు వాక్యములును గలవు. కావున ముక్తియందు భావా భావము లున్న వనుట నిక్కువము. 'ద్వాదశాహమునకు సత్రమనుటకు కారణము :- 'సత్ర' లక్షణము ననుసరించి (క) ఈ యాగమున యజమానుల నేకులుందురు. (ఖ) 'య ఏవం విద్వాంసః సత్రముపయంతి' అను నీ వాక్యమున ద్వాదశాధి కారమున 'ఉపయంతి' శబ్ద ప్రయోగ మున్నది. (గ) అట్లే "సప్తదశావరా శ్చతుర్వింశతిపరమాః సత్రమాసీరన్" ఈ వాక్యమున 'ఆసీరన్' అను పదమున్నది. ఈ మూడును 'సత్ర'మునకు లక్షణములు. ఈయాగమును 'అహీన' మనియునందురు. ఇందు ('క) యజమానుడు నియతుడగును. (ఖ) 'ద్వాదశాహేన ప్రజాకామం యాజయేత్' ఈ వాక్యమున 'యాజయేత్' అని ప్రేరణ చేయబడినది.

ఇట్లు వేదాంత శాస్త్రమున ముక్తి విషయము నిరూపింపబడినది. ఇక నుపనిషత్ కారుల మతము వ్రాయుచున్నాము.

(యదా పంచావ....) మనస్సుతో బాటు జ్ఞానేంద్రియములైదును పరమేశ్వరుని యందు స్థిరములై, యెల్లపుడు నతనియందే రమించు నపుడు బుద్ధి యంతయు నందులకు విరుద్ధముగా ప్రవర్తింపకున్న పరమ

గతి - మోక్షమనబడును.

(ఇది జీవన్ముక్తావస్థ - దీనికి పిమ్మట విదేహముక్తి యనాయాసముగ సిద్ధించును.)

(తాం యోగం...) ఇంద్రియ శుద్ధిని స్థిరతను విద్వాంసులు యోగమందురు. మనుష్య డుపాసనా యోగమువలన పరమేశ్వరుని బొంది, ప్రమాద రహితుడై నపుడు, వాడు మోక్షమును బొందినట్లెంచవలెను. ఆ యుపాసనాయోగము (ప్రభవః) శుద్ధిని, సత్యగుణములను ప్రకాశింపజేయునదియు, (అప్యయః) సమస్తాశుద్ధిని, దోషములను, అసత్య గుణములను నశింప జేయునదియు నగును. కావున నుపాసనాయోగమే ముక్తికి సాధనము.

(యదా సర్వే...) మనుష్యుని హృదయము చెడు కర్మముల నుండి వేఱై శుద్ధమైన నాడతడు మోక్షమును బొంది బ్రహ్మానంద యుక్తుడగును.

పూ. ప : ఈ మోక్షపద మేదేని స్థానాంతరమా ? లేక బ్రహ్మకంటె భిన్నమైన పదార్థవిశేషమా ? అదియొక స్థానమున నుండునా ? అంతట నుండునా ?

ఉ. ప : అది స్థానాంతరము కాదు. అంతట వ్యాపకముగ నుండు బ్రహ్మపదమే మోక్షపద మనబడును. ముక్తపురుషు డామోక్షపదమునే పొందును. (యదా సర్వే-) జీవుని యవిద్యాది బంధన గ్రంథులన్నియు విడివడినపు డతనికి ముక్తి లభించును. ఇదియే శాస్త్రశిక్షణ. ౪

పూ. ప : ముక్తియందు శరీరము, ఇంద్రియాదులు నుండవు కావున జీవాత్మ వ్యవహారము నెట్లెఱుగును? ఎట్లు చూడగలుగును ?

ఉ. ప : (దైవేన...) ఆ జీవుడు ఇంద్రియాదులకు చెందిన శుద్ధశక్తి, మనస్సు యొక్క శుద్ధశక్తితో ఆనందరూపమగు కార్యము నెఱుగగలుగును. భోగించుచు నెల్లపుడు బ్రహ్మమునందు రమించును. ౫

పూ. ప : ముక్తజీవుడు సృష్టిలో నంతట దిరుగునా ? లేక యొక చోట నిలకడగా నుండునా ?

ఉ. ప : (య ఏతే బ్రహ్మలోకే...) ముక్తజీవులు పరమేశ్వరుని బొంది సర్వాత్మయగు నతని నుపాసించుచు, నతనియాశ్రమముననే యుందురు. కావున నా జీవులు లోకములలో నంతట వచ్చుచు బోవుచు నుందురు. ఎక్కడను నాజీవుల కాటంక ముండదు. కామనలన్నియు పూర్ణము లగును; ఏదియు నపూర్ణము కాదు. కావున నేమనుజుడు పూర్వోక్తరీతితో పరమేశ్వరుని సర్వాత్మగా నెఱింగి, యుపాసించునో, అతడు తన కామనల నన్నింటిని పూర్ణముగ బొందును. ప్రజాపతియగు పరమేశ్వరు డీ విషయమును వేదములందు జీవుల కెల్లరకు జెప్పియున్నాడు.

మోక్షము నెల్ల జీవులు కోరవలెనని యభిప్రాయము. (యదంతరా) ఆత్మలకు నంతర్యామియగు వానిని బ్రహ్మమందురు. అతడే యమృతము-మోక్షస్వరూపుడు. అతడన్నింటికి నంతర్యామియే కాని, యతనికి నంతర్యామి యొండునులేదు. అట్టి ప్రజానాథుడగు పరమేశ్వరుని వ్యాప్తరూపమును నేను శరణుజొత్తును. లోకమునగల పూర్ణ విద్వాంసులైన బ్రాహ్మణులలో నేను (యశః) కీర్తిని బొందుదును గాక ! (రాజ్ఞాం) క్షత్రియులయు, (విశాం) వైశ్యులయు, మధ్య నేను యశస్వి నగుదును గాక ! ఓ పరమేశ్వర! నేను యశస్వులలో యశస్వినిగా నెంచుచున్నాను. నీవును కృపతో నీ సమీపమున జేర్చుకొనుము. ౬ నేను జన్మబంధనమున బడకుందునుగాక !

---

(ఈ వాక్యమునకు మూల మంత్రభాగమిది "బిందుమాభిగామ్")

సం॥ "అణుః పంథా వితరః పురాణో మాగ్ం స్పృష్టో విత్తో మయైవ, తేన ధీరా అపి యంతి బ్రహ్మవిద ఉత్క్రమ్య స్వర్గం లోకమితో విముక్తాః" ౧ శ. ౧౪-౭-౨-౧౧

"తస్మిఞ్ ఛుక్ల ముత నీలమాహుః పింగలం హరితం లోహితంచ, ఏష పంథా బ్రహ్మణా హానువిత్త స్తేనైతి బ్రహ్మవిత్తైజసః పుణ్యకృచ్చ." ౨ శ. ౧౪-౭-౨-౧౨

"ప్రాణస్య ప్రాణముత చక్షుషశ్చక్షు రుత శ్రోత్రస్య శ్రోత్ర మన్నస్యాన్నం మనసో యే మనో విదుః తే నిచిక్యుర్ బ్రహ్మ పురాణ మగ్ర్యం మనసై వాప్తవ్యం నానాస్తి కించన" ౩ శ. ౧౪-౭-౨-౨౧

"మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి. మనసైవానుద్రష్టవ్య మేతద ప్రమేయం ధ్రువమ్" ౪ శ. ౧౪-౭-౨-౨౨

"విరజః పర ఆకాశాత్ అజ ఆత్మా మహా ధ్రువః

తమేవ ధీరో విజ్ఞాయ. ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః" ౫ శ. ౧౪-౭-౨-౨౩

"స హెూవాచ, ఏతద్ వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదంతి అస్థూల మనణ్వహ్రస్వ మదీర్ఘమలోహిత మస్నేహ మచ్ఛాయ మతమో ఽ వాయ్వనాకాశ మసంగ మస్పర్శ మగంధ మరస మచక్షుష్క మశ్రోత్ర మవాగమనో ఽ తేజస్క మప్రాణ మముఖమనామాగోత్రమజర మమర మభయమమృతమరజో ఽ శబ్ద మవివృత మసంవృత మపూర్వ మనపర మనంతర మబాహ్యం న తదశ్నోతి కశ్చ నతదశ్నోతి కశ్చన" ౬ శత. ౧౪-౬-౮-౮

ఇతి ముక్తైః ప్రాప్తవ్యస్య మోక్షస్వరూపస్య సచ్చిదానందాదిలక్షణస్య పరబ్రహ్మణః ప్రాప్త్యా జీవః సదా సుఖీ భవతీతి బోధ్యమ్.

తె॥ శతపథ బ్రాహ్మణము ననుసరించి ముక్తి మార్గ స్వరూప వర్ణనము.

(అణుః పంథా....) ముక్తి మార్గ మత్యంత సూక్ష్మము (వితరః)ఆ మార్గమున, సుదృఢమగు నౌకతో సముద్రమును తరించునట్లు సర్వదుఃఖములను సుగమముగ దరింపనగును. (పురాణః) ఈ మార్గము ప్రాచీనము. (స్పృష్టః) ఈశ్వరుని కృపచే నాకది లభించినది. ఆ మార్గము మూలముననే సర్వ దోషములనుండియు, దుఃఖములనుండియు ముక్తులైన (ధీరాః) విచారశీలురు, బ్రహ్మ విదులు, వేద విదులునైన జీవులు (ఉత్ క్రమ్య) సత్యమగు తమ పురుషార్థముతో సర్వ దుఃఖముల నుల్లంఘించి, (స్వర్గం లోకం) సుఖ స్వరూపమగు బ్రహ్మలోకము బొందుదురు.

(తస్మిన్ శుక్ల....) ఆ మోక్షపదమగు బ్రహ్మమునందు, (శుక్ల) శ్వేతము, (నీలము) శుద్ధ ఘన శ్యామము, (పింగల) పీత శ్వేతము, (హరిత) ఆకు పసుపు (లోహిత) ఎఱుపు మున్నగు గుణములుగల లోక లోకాంతరము లిమిడియున్నవి - లేక ప్రకాశితములగుచున్నవి. ఈ మోక్షమార్గము పరమేశ్వరుని ప్రేమించువారికే లభించును. ఆ మార్గము తోనే బ్రహ్మము నెఱుగువాడు, (తైజసః) శుద్ధ స్వరూపుడు, పుణ్యాచరణుడునగు మనుష్యుడు మోక్ష సుఖమును బొందును. మఱియొక విధమున బొందడు. ౨

(ప్రాణస్య ప్రాణ...) ప్రాణమునకు ప్రాణము, నేత్రమునకు నేత్రము, శ్రోత్రమునకు శ్రోత్రము, అన్నమున కన్నము, మనస్సునకు మనస్సును నగు పరమేశ్వరు నెఱుంగు విద్వాంసుడు - పురాతనము, సర్వశ్రేష్ఠము, మనస్సుతో ప్రాపింప యోగ్యమునగు బ్రహ్మమును బొందును. ఇట్లు మోక్షసుఖమును బొంది

యానందమున నుండును. (నేహ నానా) ఆమోక్షపద బ్రహ్మ మొక్కటియే. ఆయద్వైత (ఏక) బ్రహ్మమును బొందుటకే ప్రతివాడును యత్నింపవలెను. 3

(మృత్యోః స మృత్యు...) బ్రహ్మము నొక్కటిగా నెంచక, రెండు మూడు పది యిరువది బ్రహ్మములున్నవని, అనేక పదార్థముల కలయికచే బ్రహ్మమయినదని కాని యెంచువాడు మాటి మాటికి మృత్యువాతంబడును. జన్మ మరణములను బొందును. సచ్చిదానంద స్వరూపము బ్రహ్మ మొక్కటియే. అయ్యది వ్యాపకమై యన్నింటియందును స్థిరమై యున్నది. దానిని మనస్సుతోనే యెఱుంగ గలము. ఇతర సాధనములతో నెఱుగ జాలము. అది యన్నింటికంటె సూక్ష్మము.

(విరజఃపర ఆ...) ఆ బ్రహ్మము నిక్షేపరహితము; రాగరహితము. ఆకాశము కంటెను బరమ సూక్ష్మము, (అజః) జన్మ రహితము, (మహాధ్రువ) మిక్కిలి నిశ్చలము. జ్ఞానులైనవా రాబ్రహ్మమునే యెఱింగి, తమ బుద్ధి విశాలమొనర్చు కొనవలెను. అప్పుడే వారు బ్రాహ్మణు లనబడుదురు.

(స హోవాచ ఏ....) యాజ్ఞవల్క్య డనుచున్నాడు. ఓగార్గి! విద్వాంసులిట్లు చెప్పుచున్నారు. 'ఆ బ్రహ్మము స్థూలము కాదు. సూక్ష్మముకాదు. లఘువు కాదు. దానిలో ఎఱుపు, స్నేహము, ఛాయ, అంధకారము, నేదియు లేదు. అది వాయువు కాదు; ఆకాశము కాదు. దాని యందు, సంగము, శబ్ద స్పర్శ గంధరసములు, నేత్ర కర్ణ వాఙ్మనస్సులు, తేజస్సు, ప్రాణము, ముఖ్యనామ గోత్రములు, వృద్ధావస్థ, మరణము, భయము, రాగము, సంకోచ వికాసములు, పూర్వాపరములు, బాహ్యాభ్యంతరములు మున్నగు గుణదోషము లేమియు లేవు. అది మోక్షస్వరూపము. సాకారపదార్థము లభించినట్లు అది యెవరికిని లభింపదు. ఎవడును నా బ్రహ్మమును మూర్తద్రవ్యమువలె ప్రాప్తింపడు. అది యన్నింటియందు పరిపూర్ణమై యుండి యన్నింటినంటకయుండు నద్భుతస్వరూపము కలది. మూర్తద్రవ్యమువలె చక్షురాదీంద్రియములతో జూడబడదు. అది బాహ్యేంద్రియములకు గనిపింపదు. ౬

మనుజుడిట్లు మోక్షపద బ్రహ్మమును బొంది సుఖించును.

అథ వైదిక ప్రామాణ్యమ్.-

"యే యజ్ఞేన దక్షిణయా సమక్తా ఇంద్రస్య సఖ్య మమృతత్వ మానశ, తేభ్యో భద్రమంగిరసో వో అస్తు. ప్రతి గృభ్ణీత మానవం సుమేధసః" ౧ ఋ. ౮-౨-౧-౧

"స నో బంధుర్ జనితా స విధాతా ధామాని వేద భువనాని విశ్వా,

యత్ర దేవా అమృత మానశానా స్తృతీయే ధామ న్న ధ్యైరయంత" ౨ య. ౩౨-౧౦

అవిద్యాస్మితేత్యారభ్యాధ్యైరయంతేత్యంతేనమోక్షస్వరూప నిరూపణ మస్తీతి వేదితవ్యమ్. ఏషా మర్థః ప్రాకృత భాషాయాం ప్రకాశ్యతే.

ఇతి ముక్తి విషయః సంక్షేపతః

---

తె॥ (యే యజ్ఞేన-) పూర్వోక్తమగు జ్ఞాన రూపమగు యజ్ఞము, ఆత్మాది ద్రవ్యములను పరమేశ్వరునకు దక్షిణగా నర్పించు ముక్త జీవులు మోక్షమున ప్రసన్నులుగ నుందురు. (ఇంద్రస్య) పరమేశ్వరుని మైత్రితో మోక్షభావమును బొందినవారికే భద్రమను పేరుగల సర్వసుఖములు నియతము చేయబడినవి. (అంగిరసః) వారి ప్రాణములు, (సుమేధసః) వారిజ్ఞానమును మిక్కిలిగ బెంచును. అవి మోక్షప్రాప్తమగు మనుష్యుని తమ

సమీపమున నానందమున నుంచును. ముక్త పురుషులు తమ జ్ఞానములో పరస్పర మొకరి నొకరు చూతురు. కలిసికొందురు. ౧

(సనో బంధుః-) మానవులెల్లరు "నా పరమేశ్వరుడు తమకు బంధువు-దుఃఖములను నాశమొనర్చువాడు., (జనితా) అతడే సర్వసుఖములను, సమస్తజగత్తును నుత్పన్నము చేయువాడు, (విధాతా) పాలించువాడునై యున్నాడు. అతడే సర్వకామములను బూర్ణ మొనర్చువాడు; సర్వలోకములను నెఱుగువాడు. ఆ పరమేశ్వరునందే విద్వాంసులు మోక్షమును బొంది సదానందమున నుందురు. తృతీయధామము-శుద్ధ సత్వ సహితమగు సర్వోత్తమ సుఖమునందు సదా స్వచ్ఛందులై రమింతురు" అని యెఱుంగవలెను.

ఇట్లు ముక్తి విషయము సంక్షేపముగ కొంత వర్ణింపబడినది. ముందు కూడ నక్కడక్కడ వర్ణింతుము. (వేదాహమేతం) అను మంత్రమున గూడ కొంతముక్తి విషయము పూర్వము చెప్పబడినది.

సంక్షేపముగ ముక్తి విషయము సమాప్తము.

# అథ నౌ విమానాది విద్యా విషయ స్సంక్షేపతః

సం॥ "తుగ్రో హ భుజ్యుమశ్వినోదమేఘే రయిం న కశ్చిన్ మమృవాం అవాహాః; తమూహథుర్ నౌభిరాత్మన్వతీభి రంతరిక్షప్రుద్భి రపోదకాభిః" ౧ ఋ. ౧—౮—౮—౩

"తిస్రః క్షప స్త్రిరహాతి వ్రజద్భిర్ నాసత్యా భుజ్యు మూహథుః పతంగైః. సముద్రస్య ధన్వన్నార్ద్రస్య పారే త్రిభీ రథైః శతపద్భిః షడశ్వైః" ౨ ఋ. ౧—౮—౮—౪

"అనారంభణే తదవీరయేథా మనాస్థానే అగ్రభణే సముద్రే, యదశ్వినా ఊహథుర్ భుజ్యుమస్తం శతారిత్రాం నావ మాతస్థివాంసమ్" ౩ ఋ. ౧—౮—౮—౫

ఏషామభిప్రాయః—

తుగ్రో హేత్యాదిషు మంత్రేషు శిల్ప విద్యా విధీయత ఇతి. (తుగ్రోహ) తుజి— హింసా బలాదాన నికేతనేషు, అస్మాద్ధాతోః ఔణాదికే రక్ ప్రత్యయే కృతే తుగ్ర ఇతి పదం జాయతే. యః కశ్చిద్ధనాభిలాషీ భవేత్ స (రయిం) ధనం కామయమానో (భుజ్యుం) పాలన భోగమయం ధనాదిపదార్థ భోగమిచ్ఛన్ విజయం చ పదార్థ విద్యయా స్వాభిలాషం ప్రాప్నుయాత్. స చ (అశ్వినా) పృథివీమయైః కాష్ఠలోష్ఠాదిభిః పదార్థైర్ నావం రచయిత్వా అగ్నిజలాది ప్రయోగేణ (ఉదమేఘే) సముద్రే గమయే దాగమయేచ్చ. తేన ద్రవ్యాది సిద్ధిం సాధయేత్. ఏవం కుర్వన్ (న కశ్చిన్ మమృవాన్) యోగక్షేమ విరహః సన్ మరణం కదాచిత్ ప్రాప్నోతి.

పూ. సః కుతః?

ఉః సః తస్య కృతపురుషార్థత్వాత్. అతో నావం (అవాహాః) అర్థాత్ సముద్రే ద్వీపాంతరగమనం ప్రతి నావో వాహనావహనే పరమప్రయత్నేన నిత్యం కుర్యాత్. కౌ సాధయిత్వా? (అశ్వినా) ద్యౌరితి ద్యోతనాత్మక—అగ్ని ప్రయోగేణ పృథివ్యా పృథివీమయేనాయస్తామ్రరజత ధాతు కాష్ఠాది మయేన చేయం క్రియాసాధనీయా. అశ్వినౌ యువాం తౌ సాధితౌ ద్వౌ నావాదికం యానం (ఊహథుః) దేశాంతర గమనం సమ్యక్ సుఖేన ప్రాపయతః. పురుషవ్యత్యయేనాత్ర ప్రథమ పురుషస్థానే మధ్యమ పురుష ప్రయోగః. కథం భూతైర్ యానైః? ) (నౌభిః) సముద్రే గమనాగమన హేతు రూపాభిః (ఆత్మన్వతీభిః) స్వయం స్థితాభిః స్వాత్మీయస్థితాభిర్ వా, రాజ పురుషైర్ వ్యాపారిభిశ్చ మనుష్యైర్ వ్యవహారార్థం సముద్ర మార్గేణ తాసాం గమనాగమనే నిత్యం కార్య – ఇతి శేషః. తథా తాభ్యా ముక్త ప్రయత్నాభ్యాం భూయాం స్యన్యాన్యపి విమానాదీని సాధనీయాని.

ఏవ మేవ (అంతరిక్షప్రుద్భిః) అంతరిక్షం ప్రతి గంతృభిర్ విమానాఖ్య యానైః సాధితైః సర్వైర్ మనుష్యైః పరమైశ్వర్యం సమ్యక్ ప్రాపణీయమ్. పునః కథం భూతాభిర్ నౌభిః? (అపోదకాభిః) అపగతం దూరీకృతం (ఉదకం) జలలేపో యాసాం తా అపోదకా నావః; అర్థాత్ సచ్చిక్కనాః, తాభిః ఉదరే జలాగమన రహితాభిశ్చ సముద్రే గమనం కుర్యాత్. తథైవ భూ యానైర్ భూమౌ. జలయానైర్ జలే, అంతరిక్షయానైశ్చాంతరిక్షే, చేతి త్రివిధం యానం రచయిత్వా జల భూమ్యాకాశ గమనం యథావత్ కుర్యాదితి. అత్ర ప్రమాణమ్ :—

"అథాతో ద్యుస్థానా దేవతా స్తాసామశ్వినౌ ప్రథమాగామినౌ భవతోఽశ్వినౌ యద్ వ్యశ్నువాతే సర్వం, రసేనాన్యో, జ్యోతిషాఽన్యః, అశ్వైరశ్వినా విత్యౌర్ణవాభః తత్ కావశ్వినౌ? ద్యావాపృథివ్యావిత్యేకే. అహో రాత్రా విత్యేకే, సూర్యాచంద్రమసావిత్యేకే. నిరు. ౧౨–౧

"తథాశ్వినౌ చాపి భర్తారౌ, జర్ భరీ భర్తారా విత్యర్థః తుర్ ఫరీతూ హన్తారౌ ; ఉదన్యజేవేత్యుదకజే ఇవ రత్నే సాముద్రే." నిరు. ౬ ౧౩–౫

ఏతైః ప్రమాణైరేతత్ సిద్ధ్యతి :– వాయు జలాగ్ని పృథివీ వికార కలాకౌశల సాధనేన త్రివిధం యానం రచనీయమితి. ౧

(త్రిస్రః క్షపస్త్రిరహా...) కథం భూతైర్ నావాదిభిః? తిసృభీ రాత్రిభి స్త్రిభిర్ దినైః (ఆర్ద్రస్య) జలేన పూర్ణస్య సముద్రస్య తథా (ధన్వనః) స్థలస్య అంతరిక్షస్య పారే (అతివ్రజద్భిః) అత్యంత వేగవద్భిః పునః కథం భూతైః? (పతంగైః) ప్రతిపాతం వేగేన గంతృభిః, తథా (త్రిభీరథైః) త్రిభీ రమణీయ సాధనైః, (శత పద్భిః) శతేనా సంఖ్యాతేన వేగేన పద్భ్యాం యథా గచ్ఛేత్తాద్భశైరత్యంత వేగవద్భిః (షడశ్వైః) షడశ్వా ఆశుగమన హేతవో యంత్రాణ్యగ్నిస్థానాని వా యేషు తాని షడశ్వాని, తైః షడశ్వైర్ యానైస్త్రిషు మార్గేషు సుఖేన గంతవ్యమితి శేషః. తేషాం యానానాం సిద్ధిః కేన ద్రవ్యేణ భవతీత్య త్రాహ? (నా సత్యా) పూర్వోక్తాభ్యా మశ్విభ్యామ్. అత ఏవోక్తం 'నా సత్యౌద్యావాపృథివ్యౌ'. ('నా సత్యౌ చాశ్వినౌ' ఇతి నిరుక్తే : ౬–౧౩) తాని యానాని (ఊహథుః) (పూర్వోక్తౌ ద్యావా పృథివ్యౌ తాని యానా న్యూహతురిత్యర్థః) ఇత్యత్ర పురుషవ్యత్యయేన ప్రథమస్య స్థానే మధ్యమః, ప్రత్యక్ష విషయవాచకత్వాత్. అత్ర ప్రమాణమ్:–

"వ్యత్యయో బహులమ్" అష్టా. ౩–౧–౮౫

అత్రాహ మహాభాష్యకారః–

"సుప్తిఙుపగ్రహలింగనరాణాం కాలహలచ్ స్వరకర్తృ యఙాశ్చ).

వ్యత్యయ మిచ్ఛతి శాస్త్ర కృదేషాం, సోఽపి చ సిద్ధ్యతి బాహుల కేన" ఇతి మహాభాష్య ప్రామాణ్యాత్.

తావేవనాసత్యావశ్వినౌ సమ్యగ్ యానాని వహతః, ఇత్యత్ర సామాన్యకాలే లిడ్ విధానాత్ ఊహథురిత్యుక్తమ్. తావేవ తేషాం యానానాం ముఖ్యే సాధనే స్తః. ఏవం కుర్వంతో భుజ్యుముత్తమ సుఖభోగం ప్రాప్నుయుర్ నాన్యథేతి. ౨

హేమనుష్యాః! పూర్వోక్తాభ్యాం ప్రయత్నాభ్యాం కృత సిద్ధయానైః (అనారంభణే) ఆలంబరహితే, (అనాస్థానే) స్థాతుమశక్యే, (అగ్రభణే) హస్తాలంబనావిద్యమానే, (సముద్రే) సముద్రవంత్యాపో యస్మిన్ తస్మిన్ జలేనపూర్ణే, అంతరిక్షేవా, కార్యసిద్ధ్యర్థం యుష్మాభిర్ గంత వ్యమితి, 'అశ్వినా ఊహథుర్భుజ్యు' మితి పూర్వవద్ విజ్ఞేయమ్. తద్యానం సమ్యక్ ప్రయుక్తాభ్యాం తాభ్యామశ్విభ్యాం (అస్థం) క్షిప్తం చాలితం సమ్యక్ కార్యం సాధయతీతి. కథంభూతాం నావం సముద్రే చాలయేత్? (శతారిత్రామ్) శతాని అరిత్రాణి లోహమయాని సముద్ర స్థలాంతరిక్షమధ్యే స్తంభనార్థాని గాధ గ్రహణార్థాని చ భవంతి యస్యాం తాం శతారిత్రామ్ ఏవమేవ శతారిత్రం భూమ్యాకాశ విమానం ప్రతి యోజనీయమ్. తథా తదేతత్ త్రివిధం యానం శతకలం శతబంధనం శతస్తంభనసాధనం చ రచనీయమితి. తద్యానైః కథం భూతం భుజ్యుం భోగం ప్రాప్నువంతి? (తస్థివాంసం) స్థితి మంతమిత్యర్థః, ౩

తె॥ ముక్తి విషయక వర్ణనానంతరమున సముద్రము, భూమి, అంతరిక్షము వీనిలో శీఘ్రగమనమునకు దగిన యానములకు సంబంధించిన విద్యను గూర్చియు, శిల్ప విద్యను గూర్చియు వేదములందు వర్ణింపబడిన విధమును వ్రాయుదుము. పూర్వ నిర్దిష్ట వేద మంత్రముల యభిప్రాయము :-

(తుగ్రోహ) తుజిధాతువునకు పరమున ఔణాదిక 'రక్' ప్రత్యయము జేర్చిన 'తుగ్ర' శబ్దము సిద్ధించును. ఈ 'తుజి' ధాతువునకు హింస, బలము, గ్రహించుట, స్థానమునని నాలుగర్థములు. కావున నీవైదిక 'తుగ్ర' పదమునకు శత్రువులను హింసించువాడు, విజయుడు, బలశాలి, ధనాది పదార్థములను గ్రహించువాడు., తన యానముల మూలమున సుఖముగ నుత్తమోత్తమ స్థానములకే వాడు స్వామియు నని యర్థములు. (రయిం) ఉత్తమ విద్యను, సువర్ణాద్యుత్తమ పదార్థములను కామించు ధనకామి, (భుజ్యాం) పాలనకు, భోగమునకు నుపయోగించు ధనాది పదార్థముల ప్రాప్తిని, భోగమును విజయేచ్ఛను ముందు వ్రాయబోవు పదార్థ విద్యాపద్ధతుల వలన పూర్ణము చేసికొన వలెను. (అశ్వినా) సువర్ణము, రజతము, రాగి, ఇత్తడి, ఇనుము, కాష్ఠము మున్నగు పదార్థములతో ననేక విధములగు యాంత్రిక రచనలతో గూడిన నౌకలను సిద్ధము చేసికొని, వానియందు అగ్ని, వాయువు, జలము మున్నగువాని నుచిత రీతి నుపయోగించి, వ్యాపారమునకు దగిన వస్తువులను వానిలోనింపి, వ్యాపారము కొఱకు, (ఉదమేఘే) సముద్రము, నదములు మున్నగు వానిలో (అవాహః) వచ్చుచు పోవుచు నుండునో ప్రయాణమొనర్చునో-అతనికి ద్రవ్యాది వస్తువులకు జెందిన వ్యాపారి కోన్నతి గలుగును. ఇట్లు పురుషార్థ మొనర్చువాడు, (న కశ్చిన్ మమృవాన్) పదార్థములను సంపాదించి, వానిని రక్షించి దుఃఖముతో నెన్నడు మరణింపడు. అతడలసతను వీడి పురుషార్థపరుడగును. ఆనౌకాదుల నిర్మాణ క్రియ (అశ్వినా) ద్యు, పృథివి- ప్రకాశాత్మకమగు నగ్నిని ప్రయోగించుటవలనను, పార్థివములగు రాగి, వెండి, మున్నగు ధాతువుల మూలమునను, కాష్ఠాదుల వలనను సిద్ధించును - వీని మూలమున యానములందు వేగము జనించునని భావము. వేదోక్తమగు యుక్తితో సిద్ధము చేయబడిన నౌక, విమానము, భూమియందు నడచు రథముబండి-పైన జెప్పిన 'అశ్వి' ఆగ్నేయములు, పార్థివములునయిన సాధనముల మూలమున, (ఊహథుః) దేశ దేశాంతరములలో రాకపోకలు సుఖముగ జరుగును. ఈ మంత్రమున 'ఊహతుః' అను నీ ప్రథమ పురుష క్రియను ప్రయోగించుటకు బదులు 'ఊహథుః' అని మధ్యమ పురుష క్రియ ప్రయోగింపబడినది. ఉక్త పదార్థములతో (నౌభిః) సముద్రమున సుఖముగ రాకపోకల కనువగు నౌకలు మంచివి సిద్ధమగును. (ఆత్మ న్వతీభిః) ఆ నౌకలను యజమానులో, లేక నౌకరులో నడపవీలగును. వ్యాపారులు, రాజ్యకార్యనిర్వాహకులు నీ యానములందు సముద్రములలో ప్రయాణమొనర్పవలెను. (అంతరిక్షప్రుద్ భిః) విమానశబ్ద వాచ్యము లగు యానములలో నాకాశగమనము సిద్ధించును. (అపోదకాభిః) సముద్ర నౌకలు జలమునందు తడిసి చివుకకుండునట్లును, శీఘ్రముగ విరుగక, పగులక యుండునట్లును శుద్ధముగాను, నునుపుగాను నుండవలెను. ఇట్లు భూయానములతో భూమిమీదను, ఆకాశ యానములగు విమానములతో నాకాశమునందును, జలయానములతో జలమునందును రాకపోకలు జరుగవలెను. ఆ త్రివిధములగు యానములను పూర్వము చెప్పినట్లు నికముందు జెప్పబోవునట్లును బాగుగ సిద్ధము చేసికొనవలెను. (అశ్వినా) అను శబ్దార్థ విషయ నిరుక్త ప్రమాణము.

(అథాతో ద్యుస్థానాదే.) ద్యుస్థానమునగల దేవతలను వర్ణించుచున్నాము. వానిలో అశ్వి దేవతలు ప్రథమములు. వాయువు, అగ్నియను నీ రెంటి నామము 'అశ్వి' పదార్థములలో నన్నింటిలో ధనంజయ రూపమున వాయువు, విద్యుద్రూపమున నగ్నియు వ్యాపించి యున్నవి. జలము, అగ్నియు 'అశ్వి' యనబడును. అగ్ని జ్యోతితో యుక్తమై, జలము రసయుక్తమై వ్యాప్తములై యున్నవి. (అశ్వైః) ఔర్ణవాభ నిరుక్త కారుని మతమున వేగాది గుణములతో గూడి యున్నందునను నగ్ని మున్నగునవి 'అశ్వి'

యనబడును. విమానాదులను సిద్ధము చేయగోరువారు వాయు జలాగ్నులతో వానిని సిద్ధము చేయవలెనని ఔర్ణ వాభాచార్యుని మతము. ఋషులలో ననేకుల మతము. ౧. (ద్యావాపృథివ్యౌ) అగ్ని లేక సూర్యుడు, పృథివియు అశ్వి యనబడును. అగ్ని తన ప్రకాశముతోను, పృథివి యన్న రసముతోను నన్నింటిలో వ్యాప్తమై యున్నవి. రెండును వేగవంతములు కూడ. పృథివికి సంబంధించిన కొయ్య, యినుము మున్నగు వస్తువులతో నిర్మింపబడిన యంత్రములను నడుపుటవలన నానావిధములగు వేగాది గుణములు వాహనములందును, నితర కృత్రిమ పదార్థములందును నుత్పన్నము చేయవచ్చును. విద్వాంసులలో ననేకుల యభిప్రాయ మిట్లున్నది-౨ (అహోరాత్రౌ) రాత్రింబవళ్ళు 'అశ్వి' యనబడును. పగలు తన ప్రకాశముతోను, రాత్రి తన మంచుతోను నన్నింటను వ్యాప్తములై యున్నవి. ఇవి రెండును వేగవంతములు కూడ. వీని వలనను పదార్థములలో సంయోగ వియోగము లేర్పడి వేగాది గుణములకు కారణములగును. అందువలననే శరీరమున ఓషధులు మున్నగు వాని వలన వృద్ధిక్షయములు కలుగుచున్నవి. ఇట్లు శిల్ప విద్యలలో నిపుణులైన విద్వాంసుల యభిప్రాయములో, ౩ (సూర్యాచంద్రమసౌ) సూర్యచంద్రులు 'అశ్వి' యనబడుచున్నవి. సూర్యుడు తన కాంతితోను, చంద్రుడు తన యాహ్లాద రసముతోను నన్నింటను వ్యాప్తులగు చున్నారు. వారిరువురు వేగముగలవారు కూడ. సూర్య చంద్రుల యాకర్షణాది గుణముల వలన విశ్వమునందలి పృథివ్యాది పదార్థములలో సంయోగ వియోగములు, వృద్ధిక్షయములు మున్నగు శ్రేష్ఠ గుణము లుత్పన్నములగుచున్నవి.

(తథాశ్వి....) 'జర్ భరీ, తుర్ఫరీతు, అనునివియు 'అశ్వి' యనబడును. (జర్ భరీ) విమానాది యానములను ధరించునది. (తుర్ ఫరీ) యంత్రము మూలమున విమానములందు గతి కల్పించునది. ఇట్లు వాయువు, అగ్ని, జలము, పృథివి మున్నగు వస్తువులను యుక్తితో వాడుకొనుటవలన విమానాదుల ధారణ పోషణలు జరుగును. వానిలో వేగాది గుణము లుత్పన్నములగును. గుఱ్ఱములు, ఎద్దులు కొరడాతో కొట్టిన వేగముగ నడుచునట్లు యంత్ర నైపుణ్యము వలన ధారణయు, వాయ్వాదులను యంత్రము మూలమున ప్రేరించుటవలన సర్వ విధములగు శిల్ప విద్యలు సిద్ధించును. (ఉదన్యజే) నిరుక్తమున నీయశ్వి ఉదన్యజమనియు చెప్పబడినది. ఉదన్యజమన సముద్రములోని రత్నము. ఈ యగ్ని మున్నగునవి. 'అశ్వి' సముద్ర రత్నములు. అగ్ని, వాయువు, జలము మున్నగు వానిని సరిగా ప్రయోగించుట వలన సముద్రమున సుఖపూర్వకముగ పయనింపవచ్చునని యభిప్రాయము. పైన జూపిన ప్రమాణములన్నింటిని బట్టి వాయువు, అగ్ని, జలము, పృథివియను వీని వలన నేర్పడిన సాధనములతో ముప్విధములగు యంత్రములను యానములను జేయవలెనని సిద్ధమగుచున్నది. ౧

(నాసత్యా) ద్యు, పృథివి అనువాని వికారములయిన జలము, అగ్ని, వాయువు మున్నగునవి యన్నియు (భుజ్యుమూహథుః) నుత్తమ సుఖాది భోగములను ధరించునవియై యున్నవి. వాని మూలముననే భూయానములు, జలయానములు, అంతరిక్షయానములు, నాయాస్థానములందు నిర్మింపబడి సంచరించును. ఈ యానముల ద్వారముననే (తిస్రః క్షపస్త్రిరహా) మూడు రాత్రులు పవళ్ళు (ఆర్ద్రస్య) జలపూర్ణ సముద్రమున, (ధన్వనః) భూమిని, అంతరిక్షమును దాటి (అతి వ్రజద్భిః) శీఘ్రముగవెళ్ళనగును. ఆయానములు (పతంగైః) తమ ప్రతి గమనమునందును వేగవంతములై యుండును. (త్రిభీరథైః) భూజలాంతరిక్ష యానముల రూపమున నెక్కిపోవుటకవి సుందరమైన ముప్విధములగు సాధనములు (శతపద్భిః) వందలాది కాళ్ళుగల వానివలె నవి మిక్కిలివేగముగ నడచును. (షడశ్వైః) వానిలో తీవ్రగతి గలిగించుటకు నాఱు యంత్రములుండును. లేక వానిలో నగ్ని మున్నగువాని కాఱుస్థానము లుండును. ఈ యంత్రమునందును 'ఊహతుః' అను ప్రథమపురుషక్రియకు బదులు 'ఊహథుః' అను మధ్యమ పురుషక్రియ ప్రయోగింపబడినది. కారణమేమన నిది ప్రత్యక్షవిషయము.

వేదమునందిట్లు పురుషవ్యత్యయము జరుగుననుటకు పాణిని కృతాష్టాధ్యాయి, పతంజలి మునికృత మహాభాష్యము ప్రమాణములు.

"వ్యత్యయో బహులమ్" అష్టా. ౩-౧-౮౫

ఈ సూత్రముననుసరించి, విశేషావస్థయందు, శప్, శ్యన్, శ్న మున్నగు వికరణములలో వ్యత్యయము - పారస్పరిక పరివర్తనము జరుగును.

ఉదా : "ఆండా శుష్ణస్య భేదతి" ఋ. ౮-౪౦-౧౧

అను నీఋక్కునందు, రుధాదిగణమునకు జెందిన 'భిద్' ధాతువు యొక్క భినత్తి రూపము ప్రయోగింప వలసియుండ దాని స్థానమున 'భేదతి' అని 'శప్' వికరణముతో గూడిన రూపము ప్రయోగింప బడినది.

మహాభాష్యకారుని సిద్ధాంతమునుబట్టి పాణినిముని యీ క్రింద జూపిన స్థలములలో విశేషావస్థలలో వ్యత్యయము నంగీకరించును.

(౧) సుప్ వ్యత్యయము-ఉదా: "ధురి దక్షిణాయాః" (ఋక్.౧.౧౬౪-౯.) ఈ ఋక్కునందు 'దక్షిణాయాం' స్థానమున 'దక్షిణాయాః' అని ప్రయోగింపబడినది.

(౨) తిఙ్ వ్యత్యయము - ఉదా: "చషాలం యే అశ్వయూపాయ తక్షతి" (ఋగ్-౧-౧౬౨-౬) ఈ ఋక్కునందు 'తక్షంతి' స్థానమున "తక్షతి" అని ప్రయోగింప బడినది.

(౩) ఉపగ్రహము - పరస్మైపదము, ఆత్మనే పదములలో వ్యత్యయము. ఉదా: 'బ్రహ్మచారిణ మిచ్ఛతే' ఈ వాక్యమున ఇచ్ఛతి స్థానమున 'ఇచ్ఛతే' అని ప్రయోగింపబడినది.

(౪) లింగవ్యత్యయము - ఉదా: "మధోస్తృప్తా ఇవాసతే" ఇందు 'మధునః' అని నపుంసకలింగ స్థానమున,'మధోః' అని పుంలింగ ప్రయోగము చేయబడినది.

(౫) పురుష వ్యత్యయము - ఉదా: అధా స వీరైర్ దశభిర్ వియూయాః. ఇక్కడ 'వియూయాత్' అని ప్రథమ పురుషక్రియ ప్రయోగింప వలసినచోట 'వియూయాః' అని మధ్యమపురుష ప్రయోగము చేయబడినది.

(౬) కాలమును దెలుపు ప్రత్యయములో మార్పులు.

ఉదా: 'శ్వోఽగ్నీనాధాస్యమానేన' ఇందు 'లుట్' స్థానమున 'ల్ఋట్' ప్రయోగింపబడినది.

'శ్వోఽగ్నీనాధాతా' అని యుండవలసినది.

(౭) హల్-వ్యంజనములలో వ్యత్యయము - ఉదా: 'తమసోగాఅదుక్షత' ఇందు లోక వ్యాకరణము ననుసరించి 'అధుక్షత' అని యుండవలసినది. కాని, 'అదుక్షత' అని 'ద' కారమట్లే యుంచబడినది.

(౮) అచ్చులలో వ్యత్యయము - ఉదా: 'మిత్రవయం చ సూరయః' ఇక్కడ 'మిత్రావయం' అని యుండవలసినది. 'మిత్రవయం' అనియే యుంచబడినది.

(౯) ఉదాత్తాది స్వరవ్యత్యయము - ఉదా: 'గవామివశ్రియసే' అను నీ వాక్యమున 'తుమ'ర్థమున 'కసేన్' చేర్చిన మీదట 'ఞ్నిత్యాదిర్ నిత్యమ్' (పాణి. ౬-౧-౧౯౭) సూత్రము ననుసరించి ఆద్యుదాత్తము ప్రాప్తింపగా వ్యత్యయమువలన మధ్యోదాత్తమైనది.

(౧౦) కర్త, మున్నగు కారకములలో వ్యత్యయము సంస్కృతమున జూపిన మహాభాష్యకారుని కారిక 'సుప్తిఙ్..........' లో 'కర్త' యన కారకములని యభిప్రాయము-ఇందు కృత్, తద్ధిత ప్రత్యయములలో వ్యత్యయము జరుగును; కావున కృత్తద్ధిత ప్రత్యయ వ్యత్యయమనవలెను.

ఉదా : 'అన్నాదాయ' ఇందు వేదమున 'అణ్' ప్రత్యయస్థానమున 'అచ్' ప్రత్యయము చేయబడినది, ఈ రెండు ప్రత్యయములందును రూపము 'అన్నాదాయ' అనియే యేర్పడును. కాని, సంధి విడదీయు నపుడు 'అన్న + అద్ + అణ్ = అన్న + ఆద = అన్నాదః' అనియు, అన్న + అద్ + అచ్ = అన్న + అద = అన్నాదః ఇట్లు భేదము కలుగును. కావున 'అణ్' ప్రత్యయము వచ్చినపుడు అన్న + ఆదాయ = అన్నాదాయ యనియు, 'అచ్' వచ్చినపుడు 'అన్న + అదాయ = అన్నాదాయ' యనియు సంధివిభేదము గలుగును.

(౧౧) యఙ్ వ్యత్యయము : పైనజూపిన సంస్కృత కారికలోని 'యఙ్' ఒక ప్రత్యాహారము. యఙ్‌లోని 'య' కారము మొదలు పాణినీయ : ౩-౧-౨౨. సూత్రము వలన జేయబడు 'అఙ్' ప్రత్యయములోని 'ఙ్' చేర్చిన ప్రత్యాహారమగును. అందువలన నీ ప్రత్యాహారములో నీక్రింది ప్రత్యయములు గ్రహింపబడును. అవి వేదమున విశేషావస్థలలో వ్యత్యయమును బొందును.

(క) యఙ్, (ఖ) ణిచ్, (గ) యక్ కండూయాదిగణము. (ఘ) ఆయః, (ఙ) ఈయఙ్ (చ) ణిఙ్, (ఛ) స్య, తాసి, (జ) సిప్, (ఝ) ఆమ్, (ఞ) చ్లి, సిచ్, క్స, చఙ్, అఙ్, చిణ్, (ట)యక్ కర్మవాచ్యము, (ఠ) వికరణము శప్, శ్యన్, శ్ను, శ, శ్నమ్, ఉ, శ్నా, ఆశీర్లింగ్ యొక్క 'అఙ్' ఉదా : భేదతి, మరతే, నేషతు మున్నగునవి.

ఆ యశ్వులు నీ సర్వయానములను ధరించును. ఈ సామాన్యకాల ప్రయోగమునందే యిట 'ఊహథుః' అనురూపముతో లిట్ లకారము విధింపబడినది. ఆ యశ్వివే యీ యానముల కన్నింటికి ముఖ్యసాధనములు. ఇట్లీయానములనుపయోగించినపుడే యుత్తమ సుఖము ప్రాప్తించును, లేకున్న లభింపదు.

(అనారంభణే) ఓ మానవులార ! పూర్వము చెప్పినట్లు మీరు అనారంభణ ఆలంబన రహితమగు సముద్రమునందు, ఆకాశమునందు, కార్యనిర్వాహకములగు యానములను రచింపుడు. (తదవీరయేథామ్) ఆయానములు పూర్వోక్తములగు 'అశ్వి' తోనే రాకపోకలకు వీలుగ సిద్ధించును. (అనాస్థానే) ఆలంబనములేక దేని యందెవడునిలువజాలడో, (అగ్రభణే) దేనియందు చేతితో బట్టుకొనుటకును నాధారమొండును లభింపదో, (సముద్రే) అట్లే పృథివి మీదను జలపూర్ణ సముద్రముమీదను, ఆకాశము నందును మీరు మీ ప్రయత్నముతో సాధించిన యానములతో రాకపోకలు జరుపుడు. (యదశ్వినా ఊహథుర్ భు...) వాయ్వాది 'అశ్వి'తో నిర్మింపబడిన యానము శ్రేష్ఠభోగమును గలుగజేయును. (అస్తం) అశ్వులవలన నడపబడు యానము భూమి, జలాంతరిక్షములలో నన్నికార్యములు సిద్ధింపజేయును. (శతారిత్రామ్) నౌకలు మున్నగు యానములలో వందలకొలది 'అరిత్ర' జలములోతును దెలిసికొనుటకు, ఆయానముల నాపుటకు, వాయ్వాదులవలన నేర్పడు విఘ్నములనుండి వానిని రక్షించుటకు నినుపలంగరులు మున్నగునవి యుంచుకొనవలెను. ఇట్టి యానములవలన (తస్థివాంసమ్) స్థిరభోగమును మానవులు పొందుదురు.

సం॥ "యమశ్వినా దదథుః శ్వేతమశ్వమఘాశ్వాయ శశ్వదిత్ స్వస్తి.
తద్వాం దాత్రం మహి కీర్తేన్యం భూత్పైద్వో వాజీ సదమిద్ధవ్యో అర్యః" ౪
ఋ. ౧-౧౧౬-౧

యద్యస్మా దేవం భోగో జాయతే తస్మాదేవం సర్వమనుష్యైః ప్రయత్నః కర్తవ్యః

(యమశ్వినా) యం సమ్యక్ ప్రయుక్తాభ్యా మగ్నిజలాభ్యా మశ్విభ్యాం శుక్లవర్ణం బాష్పాఖ్యమశ్వం (అఘాశ్వాయ) శీఘ్రగమనాయ శిల్పవిద్యావిదో మనుష్యాః ప్రాప్నువంతి, తమేవాశ్వం గృహీత్వా పూర్వోక్తాని యానాని సాధయంతి. (శశ్వత్) తాని శశ్వన్నిరంతరమేవ (స్వస్తి) సుఖకారకాణి భవంతి. తద్యాన సిద్ధిం, (అశ్వినా) (దదథుః) దత్తస్తాభ్యామేవాయం గుణో మనుష్యైర్ గ్రాహ్య ఇతి. (వామ్) అత్రాపి పురుష వ్యత్యయః, తయోరశ్వినోర్ మధ్యే యత్ సామర్థ్యం వర్తతే తత్ కీదృశం ? (దాత్రం) దానయోగ్యం, సుఖకారకత్వాత్ పోషకం చ. (మహి) మహాగుణయుక్తం, (కీర్తేన్యమ్) కీర్తనీయ మత్యంత ప్రశంస నీయమ్. "కృత్యార్థే తవైకేన కేన్యత్వన" (పాణి ౩-౪-౧౪) ఇతి కేన్యప్రత్యయః. అన్యేభ్యస్త ప్రేష్ఠోపకారకమ్ (భూత్) అభూత్ భవతీతి. అత్ర లడర్థే లుఙ్ విహిత ఇతి వేద్యమ్, స చ అగ్న్యాఖ్యో (వాజీ) వేగవాన్, (పైద్వః) యో యానం మార్గే శీఘ్రవేగేన గమయితాఽస్తి.

"పైద్వపతంగా వశ్వనామ్నీ" నిఘం. ౧-౧౪

(సదమిత్) యః సదం వేగం ఇత్ ఏతి ప్రాప్నోతీ తీదృశోఽ శ్వోఽగ్నిరస్మాభిః (హవ్యః) గ్రాహ్యోఽస్తి. (అర్యః) తమశ్వమర్యో వైశ్యో వణిగ్ జనోఽవశ్యం గృహ్ణీయాత్. 'అర్యః స్వామివైశ్యయోః' ఇతి పాణిని సూత్రాత్ అర్యో వైశ్యస్వామివాచీతి. పాణి. ౩-౧-౧౦౩

తె॥ (యమశ్వినా) అశ్వి, అగ్ని, జలముల సంయోగమువలన (శ్వేతమశ్వం) బాష్పరూపమగు తెల్లని గుఱ్ఱ మత్యంత వేగముగలది యుత్పన్నమగును. దానితో శిల్పులు యానములను (అఘాశ్వాయ) శీఘ్రగమనము కొఱకు వేగయుక్తములను జేయుదురు. ఆ వేగమున కెన్నడు హాని గలుగదు. ఎంత పెంచ దలచిన నంతగ పెరుగును. బాష్పముతోనే పూర్వోక్త యానములను సిద్ధము చేయవలెను. (శశ్వదిత్ స్వస్తి) ఆయానములందారూఢులై సముద్రమునందును, అంతరిక్షమునందును రాకపోకలు చేయుటవలన సుఖము వర్ధిల్లును. (అశ్వినా దదథుః) వాయువు, అగ్ని, జలము మున్నగు వానిచే నుత్పన్నమగు వేగగుణమును బాగుగనాలోచించి గ్రహింపవలెను. (వామ్) ఈ సామర్థ్యము పూర్వోక్తములగు నశ్వులలోనే యున్నది. (తత్) ఆ సామర్థ్యము, (దాత్రమ్) దానము చేయదగినదియు, సుఖకారకము నగుటచే పోషకము, (మహి) గొప్పగొప్ప శుభగుణములతో యుక్తము, (కీర్తేన్యమ్) మిక్కిలి ప్రశంసనీయము. సర్వమానవులకు నుపకారకము (భూత్) నై యున్నది. (వాజీ) ఆ బాష్పాశ్వము వేగవంతము (పైద్వః) మార్గమున నది యానమును వేగముగ నడపును. (సదమిత్) ఇట్లత్యంత వేగయుక్తమగు బాష్పాశ్వము (హవ్యః) ఆదానప్రదాన యోగ్యమై యుండును. (అర్యః) వైశ్యుడు, శిల్పవిద్యాస్వామియు దీనిని తప్పక గ్రహింపనగును. ఇట్టి యానములు లేకున్న ద్వీపాంతరములకు రాకపోకలు జరుగజాలవు.

'వామ్' ప్రథమ పురుషస్థానమున మధ్యమపురుష ప్రయోగము. 'కృత్యార్థే తవై కేన కేన్యత్వనః' అను పాణినీయ సూత్రము ననుసరించి 'కీర్తేన్యమ్' అను పదమునందు 'కేన్య' ప్రత్యయము చేయబడినది.

'భూత్ = అభూత్' ఈ లుఙ్ లకార ప్రయోగము 'లట్' లకారార్థమున జేయబడినది.

యాస్కనిఘంటువు ప్రమాణముననుసరించి 'పైద్వః' శబ్దమునకు 'అశ్వము' అర్థము.

*సం॥* త్రయః పవయో మధువాహనే రథే సోమస్య వేనామనువిశ్వ ఇద్విదుః. త్రయః స్కంభాసః స్కభితాస ఆరభే త్రిర్నక్తం యాథస్త్రిర్వశ్వినా దివా. ఋ. ౧-౩-౪-౨

(మధువాహనే) మధురగతిమతి రథే (త్రయః పవయః) వజ్రతుల్యాః చక్ర సమూహాః, కలాయంత్రయుక్తా దృఢాః శీఘ్రం గమనార్థం త్రయః కార్యాః. తథైవ శిల్పిభిః, (త్రయః స్కంభాసః) స్తంభనార్థాః స్తంభాః త్రయః కార్యాః, (స్కభితాసః) కిమర్థాః? సర్వకలానాం స్థాపనార్థాః. (విశ్వే) సర్వే శిల్పినో విద్వాంసః (సోమస్య) సోమగుణ విశిష్టస్య సుఖస్య (వేనాం) కమనీయాం కామనాసిద్ధిం (విదుర్) జానంత్యేవ. అర్థాత్ (అశ్వినా) అశ్విభ్యా మేవైతద్ యానమారబ్ధుమిచ్ఛేయుః. కుతః? తావేవాశ్వినౌ తద్యానసిద్ధిం (యాథః) ప్రాపయతఇతి. తత్ కీదృశ మిత్యత్రాహ. (త్రిర్నక్తం త్రిర్దివా) తిసృభీ రాత్రిభి స్త్రిభిర్ దినైశ్చాతిదూరమపి మార్గం గమయతీతి బోధ్యమ్. ౫

తె॥ (మధువాహనే రథే) మధురగతిగల రథమునందు (త్రయః పవయః) పృథివీజలాదులపై నడప వీలగునట్లు మూడుచక్రముల సముదాయము లుండవలెను. వాని యంగములన్నియు వజ్రతుల్యముగ దృఢముగ నుండవలెను. దృఢములగు మరలు కూడ నందుండవలెను. వానివలన రథమునందు శీఘ్రగమన ముత్పన్నము చేయగలిగి యుండవలెను. (త్రయః స్కంభాసః) ఆ రథమునందు మూడుమూడు స్తంభము లుండవలెను. వాని యాధారమున (స్కభితాసః) కలాయంత్రములు స్థాపితములై యుండవలెను. (విశ్వే) శిల్పవిద్వాంసులెల్లరు, (సోమస్యవేనామ్) సుందరము, శాంతమునగు సుఖేచ్ఛాసిద్ధి నెఱిగియే యున్నారు. శిల్పులు అగ్నివాయ్వాదులను ప్రయోగించి యానములను సుఖకారకములుగ జేయ నెఱుగుదురని భావము. (అశ్వినా ఆరభే) కావున వారు పూర్వోక్తములగు నశ్వులతోనే యానము నారంభింప గోరవలెను. (యాథః) కారణమేమన, ఆ యశ్వులే యా యానములను సిద్ధము చేయును. ఆ యానము (త్రిర్నక్తం త్రిర్దివా) మూడు రాత్రింబవళ్ల దూరముననుండు ద్వీపద్వీపాంతరములకు యాత్ర చేయుచుండును. ౫

సం॥ "త్రిర్ నో అశ్వినా యజతా దివే దివే పరిత్రిధాతు పృథివీమశాయతమ్, తిస్రో నాసత్యా రథ్యా పరావత ఆత్మేవ వాతః స్వసరాణి గచ్ఛతమ్" ౬ ఋ. ౧-౩-౫-౧

యత్ పూర్వోక్తం భూమిసముద్రాంతరిక్షేషు గమనార్థం యానముక్తంతత్ పునఃకీదృశమ్ కర్తవ్య మిత్యత్రాహ (పరిత్రిధాతు) అయ స్తామ్రరజతాది ధాతుత్రయేణ రచనీయమ్. ఇదం కీదృగ్వేగం భవతీత్యత్రాహ – (ఆత్మేవ వాతః) ఆగమనాగమనే. యథాత్మా మనశ్చ శీఘ్రం గచ్ఛత్యాగచ్ఛతి, తథైవ కలాప్రేరితౌ వాయ్వగ్నీ అశ్వినౌ తద్ యానం త్వరితం గమయతః, ఆగమయతశ్చేతి విజ్ఞేయమితి సంక్షేపతః" ౬

తె॥ (త్రిర్నో అశ్వినా...పృథివీమశాయతమ్) భూజలాంతరిక్షములలో మన రాకపోకలు ప్రతి దినము సుఖముగా జరుగునట్లు యానములు నిర్మింపవలెను. (పరిత్రిధాతు) అవి ఇనుము, రాగి, వెండి మున్నగు త్రిధాతువులతో చేయబడును. (రథ్యాపరావతః) నగరవీథులలోను, గ్రామములందుగల గొందులలోను సులభముగ రాకపోకలు జరుగును. అట్లే దూరదేశముల కా యానములతో శీఘ్రముగ రాకపోకలును జరుగును. (నాసత్యా) ఇట్లే యెల్లరును విద్యానిమిత్తము, పూర్వము వర్ణింపబడిన 'అశ్వి' సహాయమున కఠిన మార్గములందును ననాయాసముగ రాకపోకలు జరుపవలెను.

(ఆత్మేవ వాతః) ఆత్మ, మనస్సులవలె యానముల మూలమున నెల్ల దేశములకు శీఘ్రముగ రాకపోకలు జరుపవలెను. యంత్రప్రేరితములగు నగ్నిజలాదులు ఆ యానములను వేగముగ నడపును. ౬

సం॥ "అరిత్రం వాం దివస్పృథు తీర్థే సింధూనాం రథః, ధియా యుయుజ్ర ఇందవః" ౭ ఋ. ౧-౩-౩౪-౩

తచ్చ కీదృశం యాన మిత్యత్రాహ – (అరిత్రం) స్తంభనార్థసాధన యుక్తం (పృథు) అతివిస్తీర్ణమ్, ఈదృశః స రథః అగ్న్యశ్వయుక్తః (సింధూనాం) మహాసముద్రాణామ్, (తీర్థే) తరణే కర్తవ్యే అలం వేగవాన్ భవతీతి బోధ్యమ్, (ధియా) తత్ర త్రివిధే రథే (ఇందవః) జలాని బాష్పవేగార్థం, (యుయుజ్రే)యథావద్ యుక్తాని కార్యాణి, యేనాతీవ శీఘ్రగామీ స రథః స్యాదితి.

'ఇందవః' ఇతి జలనామసు, నిఘంటౌ, అధ్యాయే ప్రథమే ఖండే ౧౨ పఠితమ్.

'ఉందేరిచ్చాదేః' ఉణాదౌ ప్రథమే పాదే సూత్రమ్. సూ. ౧౨–౭

తె॥ (అరిత్రం వాం) యానము ఆపుటకునువగు పూర్వోక్త సాధనములతో గూడినదిగ జేయబడును. (తీర్థే సింధూనాం రథః) ఆ రథము పెద్ద పెద్ద సముద్రములను దాటుటకును శ్రేష్ఠమగును. (దివస్పృథు) అది యతి విస్తృతమును ఆకాశమునందు, సముద్రమునందు ప్రయాణముచేయ ననువుగను నుండును. (ధియా యుయుజ్ర ఇందవః) ఆమువ్విధములగు యానములందును బాష్ప వేగము కొఱకొక జలాశయ మేర్పఱచి అందు జలము నింపియుంచవలెను. అందువలన నాయాన మతి వేగముగ నడచునది యగును. 'ఇందు' పదము జలవాచకమని యాస్కనిఘంటువు 'ఉందేరిచ్చాదేః' అను ఉణాది సూత్రముతో 'ఇందు' శబ్దము సిద్ధించును. ఉందీ =క్లేదనే ధాతువు. ౭

సం॥ "వి యే భ్రాజంతే సుమఖాస ఋష్టిభిః ప్రచ్యావయంతో అచ్యుతా చిదోజసా, మనోజువో యన్మరుతో రథేష్వా వృషవ్రాతాసః పృషతీరయుగ్ధ్వమ్" ౮ ఋ. ౧–౬–౯–౪

హే మనుష్యాః ! (మనోజువః) మనోవద్ గతయో వాయవః, యంత్ర కలాచాలనై స్తేషు రథేషు పూర్వోక్తేషు త్రివిధయానేషు యూయమ్ (అయుగ్ధ్వమ్) తాన్ (వాయూన్) యథావద్ యోజయత. కథంభూతా అగ్నివాయ్వాదయః? (ఆవృషవ్రాతాసః) జలసేచనయుక్తాః. యేషాం సంయోగే బాష్పజన్య వేగోత్పత్త్యా వేగవంతి తాని యానాని సిద్ధ్యంతీ త్యుపదిశ్యతే. ౮

తె॥ (వి యే భ్రాజంతే) ఓ మానవులార ! (మనోజువః) మనోవేగముగల యానములను సిద్ధము చేయుడు. (యన్ మరుతో రథేషు)ఆ రథములలో వాయ్వగ్నులను మనోవేగముతో సమానముగ నడపుడు. (ఆవృషవ్రాతాసః) వాని యోగమున జలమునుగూడ నుంచుడు. (పృషతీ రయుగ్ధ్వం) బాష్పము తిరుగునట్టి చక్రములు మున్నగు యంత్రసాధనములను వేగవంతములుగ చేయును. కావున ప్రతి యానమునందును నట్టి యేర్పాటు చేయుడు. ఇట్లు యాన నిర్మాణ మొనర్చువారు, (విభ్రాజంతే) వివిధములగు భోగములతో ప్రకాశింతురు. (సుమఖాసః) ఇట్టి శిల్పవిద్యారూప శ్రేష్ఠ యజ్ఞముల నొనర్చువారు సర్వసుఖయుక్తు లగుదురు. (అచ్యుతాచిదోజసా) ఎన్నడును దుఃఖితులై నశింపరు. ఎల్లపుడు పరాక్రమముతో వృద్ధినొందుదురు. కారణమేమన : వారు కలాకౌశలయుక్తులై వాయ్వగ్ని ప్రభృతి పదార్థములతో నిర్మిత (ఋష్టిభిః) యంత్రముల ద్వారమున (ప్రచ్యా) పూర్వ స్థానమును విడిచి మనోవేగముగల యంత్రయుక్త యానములతో రాకపోకలను నిర్వర్తింతురు. వానివలననే మానవులలో సుఖము వర్ధిల్లును. కావున నుత్తమ యానములను నిర్మింపవలెను. ౮

సం॥ "ఆ నో నావా మతీనాం యాతం పారాయ గంతవే; యుంజాథా మశ్వినా రథమ్. ౯
ఋ. ౧–౩–౩౪–౨

సముద్రే భూమౌ అంతరిక్షే, గమనయోగ్య మార్గస్య (పారాయ) (గంతవే) గంతుం యానాని రచనీయాని. (నావామతీనామ్) యథా సముద్రగమన వృత్తీనాంమేధావినాం నావా నౌకయా పారం

గచ్ఛంతి, తథైవ (నః) అస్మాకమపి నౌ రుత్తమా భవేత్. (ఆ యుంజాథామ) యథా మేధావిభిరగ్నిజలే ఆ సమంతాత్ యానేషు యుజ్యేతే తథాఽ స్మాభిరపి యోజనీయే భవతః. ఏవం సర్వైర్ మనుష్యైః సముద్రాదీనాం పారావారగమనాయ పూర్వోక్త యానరచనే ప్రయత్నః కర్తవ్య ఇత్యర్థః.

'మతయః' ఇతి మేధావినామసు నిఘంటౌ తృతీయే అధ్యాయే ౧౫ ఖండే పఠితమ్. ౯

తె॥ (నౌ నావా మతీనామ్) బుద్ధిమంతులచే నిర్మితములైన నౌకలు మున్నగు యానములతో (పారాయ గంతవే) సముద్రమును దాటుట సుగమము; కావున నెల్లరు నా యానములతో దాటునట్లు మా నౌకలు కూడ నుత్తమములు, సముద్రమును దాటించుటకు సమర్థములు నగుగాక ! (ఆ యుంజాథామ) బుద్ధిమంతులు అగ్ని జల రూపమగు 'అశ్వి'ని యానములందు ప్రయోగించునట్లు మేముకూడ 'అశ్వి'ని ప్రయోగింతుము కాక ! ఓ మానవులార ! రండు, పరస్పరము సర్వ దేశ దేశాంతరములలో రాకపోకలు జరుప ననువగు యానములను రచియింతము.

యాస్కనిఘంటువునందు మేధావి నామములందు 'మతయః' పదము పఠింపబడినది. ౯

సం॥ "కృష్ణం నియానం హరయః సుపర్ణా అపో వసానా దివముత్పతంతి, త ఆవవృత్రన్ త్సదనా-దృతస్యాదిద్ ఘృతేన పృథివీ వ్యుద్యతే" ౧౦ ఋ. ౨-౩-౨౩-౧

హే మనుష్యాః ! (సుపర్ణాః) శోభనపతన శీలాః (హరయః) అగ్న్యాదయోఽశ్వాః, (అపోవసానాః) జలపాత్రాచ్ఛాదితా అధస్తా జ్జ్వాలా రూపాః కాష్ఠేంధనైః ప్రజ్వాలితాః, కలాకౌశలభ్రమణయుక్తాః కృతాశ్చేత్ తదా (కృష్ణం) పృథివీ వికారమయం, (నియానం) నిశ్చితం యానం (దివము త్పతంతి) ద్యోతనాత్మక మాకాశ ముత్పతంతి, ఊర్ధ్వం గమయం తీత్యర్థః. ౧౦

తె॥ (కృష్ణం) కాష్ఠలోహాది పార్థివ పదార్థములతో నిర్మింపబడి, యాకర్షణ యుక్తమగు, (నియానం) విమానమును, (హరయః) వేగాది గుణయుక్తములగు (సుపర్ణాః) బాగుగ గమనము చేయింపగల పూర్వోక్తములయిన యగ్ని జలాద్యశ్వములు (అపోవసానాః) జలసేచనయుక్త బాష్పమును బొంది యాంత్రికగతితో (దివముత్పతంతి) ప్రకాశయుక్తమగు నాకాశమందు పైకెగసిపోవునట్లు చేయును. (తఆవవృ)అవి చతుర్దిశలనుండి సదనము-జలము-వలన వేగయుక్తములయినపుడు (ఋతస్య) యథార్థసుఖము నొసంగునవి యగును. (పృథివీఘృ) జలయంత్రములతో భూమి జలయుక్తము చేయబడినపుడు దానివలన నుత్తమోత్తమ భోగములు ప్రాప్తించును. ౧౦

సం॥ "ద్వాదశ ప్రధయ శ్చక్రమేకం త్రీణి నభ్యాని క ఉ తచ్చికేత. తస్మిన్ త్సాకం త్రిశతా న శంకవోఽర్పితాః షష్టిర్ న చలాచలాసః" ౧౧ ఋ. -౨-౩-౨౩-౨

(ద్వాదశప్రధయః) తేషు యానేషు ప్రధయః సర్వకలాయుక్తానామరాణాం ధారణార్థా ద్వాదశ కర్తవ్యాః; (చక్రమేకం) తన్మధ్యే సర్వకలాభ్రామణార్థం ఏకం చక్రం రచనీయమ్. (త్రీణి నభ్యాని) మధ్యస్థాని మధ్యావయవధారణార్థాని త్రీణి యంత్రాణి రచనీయాని తైః (సాకం) (త్రిశతా) త్రీణిశతాని (శంకవోఽర్పితాః) యంత్రకలా రచయిత్వా స్థాపనీయాః, (చలాచలాసః) తాః కలాః చలాః చాలనార్హాః, అచలాః స్థిత్యర్హాః (షష్టిః) షష్టిసంఖ్యాకాని కలాయంత్రాణి స్థాపనీయాని; తస్మిన్ యానే ఏతదాది విధానం సర్వం కర్తవ్యమ్. (క ఉ తచ్చికేత) ఇత్యేతత్ కృత్యం కో విజానాతి ? (న) నహి సర్వే" ౧౧

ఇత్యాదయ ఏతద్విషయా వేదేషు బహవో మంత్రాః సంతి; అప్రసంగాదత్ర సర్వే నోల్లిఖ్యంతే.

ఇతి నౌవిమానాదివిద్యావిషయః సంక్షేపతః

తె॥ (ద్వాదశ ప్రధయః) ఆ యానములలో సర్వకలాయుక్తములగు నరలు ధరించుటకు పండ్రెండు ప్రధలుండవలెను. (చక్రమేకం) వానిమధ్య సర్వయంత్రములను ద్రిప్పుటకొక చక్రము నిర్మింపవలెను. (త్రీణి నభ్యాని) మధ్యలో మధ్యావయవములను బట్టియుంచుటకు మూడు యంత్రములు నిర్మింపవలెను. (సాకం త్రిశతా) వానితో మూడు వందలు (శంకవోఽర్పితాః) యంత్రపు మరలుచేసి కూర్పవలెను. అవి (చలాచలాసః) యానమును నడపుటకు, నాపుటకు వీలుగనుండవలెను. (షష్టిః) అఱువది యంత్రపుమరలు కలాయంత్రములు కూడ దానియందేర్పఱచవలెను. ఆ యానమున నివియన్నియు జేయవలెను. (క ఉ తచ్చికేత) ఈ కార్యము నంతటిని నెవరెఱుగుదురు? (న) అందఱు నెఱుగరు. ఈ విద్యలో నిపుణులైనవారే యెఱుగగలరు.

వేదములం దీవిషయమునకు సంబంధించిన మంత్రములెన్నో యున్నవి. ప్రసంగవశమున కొన్నింటి నిట వ్రాసితిమి. అన్నియు వ్రాయలేదు.

నౌవిమానాది విద్యావిషయము సంక్షేపముగ సమాప్తము.

# అథ తారవిద్యామూలం సంక్షేపతః

సం॥ యువం పేదవే పురవారమశ్వినా స్పృధాం శ్వేతం తరుతారం దువస్యథః, శర్యై రభిద్యుం పృతనాసు దుష్టరం చర్కృత్యమింద్రమివ చర్షణీసహమ్" ౧ ఋ. ౧-౮-౨౧-౧౦

అస్యాభిప్రాయః – అస్మిన్ మంత్రే తారవిద్యాబీజం ప్రకాశ్యతఇతి. హే మనుష్యాః (అశ్వినా) అశ్వినోర్ గుణయుక్తం (పురువారం) బహుభిర్ విద్వద్భిః స్వీకర్తవ్యమ్ బహూత్తమ గుణయుక్తం (శ్వేతం) అగ్నిగుణ విద్యున్మయం శుద్ధధాతు నిర్మితమ్, (అభిద్యుం) ప్రాప్తవిద్యుత్ ప్రకాశం, (పృతనాసు దుష్టరం) రాజసేనాకార్యేషు దుస్తరం ప్లవితుమశక్యం (చర్కృత్యం) వారంవారం సర్వక్రియాసు యోజనీయమ్, (తరుతారం) తారాఖ్యం యంత్రం యూయం కురుత. కథం భూతైర్ గుణైర్ యుక్తమ్ ? (శర్యైః) పునఃపునర్హనన ప్రేరణ గుణైర్ యుక్తమ్. కస్మై ప్రయోజనాయ ? (పేదవే) పరమోత్తమ వ్యవహార సిద్ధిప్రాపణాయ. పునః కథం భూతమ్ ? (స్పృధాం) స్పర్ధమానానాం శత్రూణాం పరాజయాయ స్వకీయానాం వీరాణాం విజయాయ చ పరమోత్తమమ్. పునః కథంభూతమ్ ? (చర్షణీసహమ్) మనుష్య సేనాయాః కార్యసహనశీలమ్. పునః కథం భూతమ్ ? (ఇంద్రమివ) సూర్యవత్ దూరస్థమపి వ్యవహార ప్రకాశన సమర్థమ్. (యువం) యువామశ్వినౌ, (దువస్యథః) పురుష వ్యత్యయేన పృథివీవిద్యుదాఖ్యా వశ్వినౌ సమ్యక్ సాధయిత్వా తత్తారాఖ్యం యంత్రం నిత్యం సేవధ్వమితి బోధ్యమ్. ౧

ఇతి తారవిద్యామూలం సంక్షేపతః

---

తె॥ (యువం పేదవే) ఈ మంత్రమున తంత్రీవార్త (టెలిగ్రాం) కు సంబంధించిన విషయము బోధింపబడినది. భూమినుండి పుట్టిన ధాతువులు, కాష్ఠాది యంత్రములు, విద్యుత్తు వీని ప్రయోగమువలన తంత్రీవార్తలకు చెందిన విద్య సిద్ధమగును. ('ద్యావా పృథివ్యావిత్యేకే') నిరుక్త. ౧౨.౧. అను నిరుక్త ప్రమాణమువలన పార్థివ పదార్థములు, విద్యుత్తు రెండును 'అశ్వి' అనబడును. (పురువారమ్) ఈ తంత్రీవార్తలకు చెందిన విద్యను పలువురు విద్వాంసులంగీకరింతురు. ఇందు ఉత్తమ గుణములు నున్నవి. (స్పృధామ్) శత్రువుల పరాజయమునకు, తమ వీరుల రక్షణకు నీవిద్య యుద్ధమొనర్చు రాజపురుషుల కత్యంత హితకారి యగును. (శ్వేతం) ఆ తంత్రీవార్తలను గ్రహించు యంత్రము అతి శుద్ధమైన ధాతువులతో నిర్మింపబడవలెను. (అభిద్యుమ్) దానిని విద్యుత్తుతో జోడింపవలెను. (పృతనాసు దుష్టరమ్) సర్వ సేనలకు మధ్య దాని ప్రకాశము దుఃసహమగును. దాని నుల్లంఘింపవలనుకాదు. (చర్కృత్యమ్) అది సర్వక్రియలను నడపుటకు పలుమారు తగియుండును. (శర్యైః) నానావిధములగు యంత్రములను నడపుటవలన నుత్తమ వ్యవహారము లనేకములు సిద్ధించుటకుగాను విద్యుత్తు నుత్పన్నముచేసి దాని నుపయోగింపవలెను. (తరుతారమ్) తంత్రీ యంత్రమును నిర్మించి దానినుపయోగించుకొనవలెను. (పేదవే) పరమోత్తమ వ్యవహారముల సిద్ధికొఱకును, (స్పృధాం) దుష్టశత్రువుల పరాజయముకొఱకు, శ్రేష్ఠపురుషుల విజయము కొఱకును తంత్రీవిద్య సిద్ధపఱచుకొనవలెను. (చర్షణీసహమ్) ఈ తంత్రీయంత్రము యుద్ధాది కార్యములందు సైనికుల కత్యంతముపకారకమగును. (ఇంద్రమివ) సమీపమునను దూరమున నుండు పదార్థములను సూర్యుడు ప్రకాశింపజేయునట్లు తంత్రీయంత్రము కూడ సమీపమునను దూరమునందును జరుగు

వ్యవహారముల ప్రకటింప గలదు. (యువం దువస్యథః) ఈ యంత్రము పూర్వము వర్ణించిన 'అశ్విగుణములవలననే సిద్ధించును. ప్రయత్నపూర్వముగ దీనిని కనిపెట్టి యుపయోగించు కొనవలెను. (దువస్యథః) ఈ మంత్రమునందును క్రియాప్రయోగమున ప్రథమపురుష స్థానమున మధ్యమపురుష ప్రయోగము చేయబడినది.

తంత్రీవిద్యామూలము సమాప్తము.

# అథ వైద్యకశాస్త్రమూలోద్దేశః సంక్షేపతః

సం॥ "సుమిత్రియా న ఆప ఓషధయః సంతు దుర్మిత్రియా స్తస్మై సంతు యోఽస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మః" ౧ యజు. ౬–౨౨

అస్యాభిప్రాయార్థః ః ఇదం వైద్యకశాస్త్రస్యాయుర్వేదస్య మూలమస్తి. హేపరమవైద్యేశ్వర ! భవత్ కృపయా (నః) అస్మభ్యం (ఓషధయః) సోమాదయః (సుమిత్రియాః)

అత్ర "ఇయాడియాజీకారాణా ముపసంఖ్యానమ్" ఇతి వార్తికేన 'జసః' స్థానే 'డియాచ్' ఇత్యాదేశః, సుమిత్రియాః సుఖప్రదా రోగనాశకాః సంతు, యథావద్ విజ్ఞాతాశ్చ, తథైవ (ఆపః) ప్రాణాః సుమిత్రాః సంతు. తథా (యోఽస్మాన్ద్వేష్టి) యోఽధర్మాత్మా కామక్రోధాదిర్వా రోగశ్చ విరోధీ భవతి. (యం చ వయం ద్విష్మః) యమధర్మాత్మానం రోగం చ వయం ద్విష్మః (తస్మై) దుర్మిత్రియా దుఃఖప్రదా విరోధిన్యః సంతు. అర్థాత్ యే సుపథ్యకారిణస్తేభ్య ఓషధయో మిత్రవద్ దుఃఖనాశకా భవంతి. తథైవ కుపథ్యకారిభ్యో మనుష్యేభ్యశ్చ శత్రువద్ దుఃఖాయ భవంతీతి.

ఏవం వైద్యకశాస్త్రస్య మూలార్థవిధాయకా వేదేషు బహవో మంత్రాః సంతి. ప్రసంగాభావాన్నాత్ర లిఖ్యంతే. యత్రయత్ర తే మంత్రాః సంతి, తత్ర తత్రైవ తేషామర్థాన్ యథావ దుదాహరిష్యామః.

ఇతి వైద్యకవిద్యావిషయః సంక్షేపతః

---

తె॥ అభిప్రాయార్థము ః ఈ మంత్రమున నాయుర్వేద మూలము లభించును. ఓ పరమవైద్య ! ఈశ్వర ! నీ కృపవలన, (నః) మాకు (ఓషధయః) సోమాది ఓషధులు (సుమిత్రియాః) సుఖప్రదములు, రోగనాశకములు నగుగాక ! వానిజ్ఞానము మాకు బాగుగ కలుగుగాక ! ఇట్లే (ఆపః) ప్రాణములుకూడ మాకు మిత్రములగుగాక ! (యోఽస్మాన్ ద్వేష్టి) పాపి, కామక్రోధాది దోషములు, రోగములు మున్నగు మా విరోధులను, (యం చ వయం ద్విష్మః) మేము ద్వేషించుపాపిని, కామక్రోధాది దోషములను, రోగములను, (తస్మై) అతనికి, ఓషధులు, ప్రాణములు దుఃఖదాయకములు, విరుద్ధములు నగుగాక, ఓషధులు సుపథ్యమొనర్చు వారికి సుఖకరములు, రోగనాశకములునగును; కుపథ్యమొనర్చు వారి కవి శత్రువులవలె దుఃఖదాయకము లగునని భావము.

'ఇయాడియాజీకారాణాముపసంఖ్యానమ్' అను వార్తికము ననుసరించి 'సుమిత్రియా' పదమునందు 'జస్' స్థానమున 'డియాచ్' ప్రత్యయము చేయబడినది. వైద్యశాస్త్రమునకు సంబంధించిన మంత్రములనేకములు వేదముననున్నవి. వేదమున నక్కడక్కడ వాని వ్యాఖ్యానములు వివరముగ వ్రాయబడును.

వైద్యకవిద్యావిషయము సమాప్తము.

# అథ పునర్జన్మ విషయః సంక్షేపతః

సం॥ "అసునీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణమిహ నో ధేహి భోగమ్, జ్యోక్ పశ్యేమ సూర్యముచ్చరంత మనుమతే మృడయా నః స్వస్తి" ౧ ఋ. ౮-౧-౨౩-౧

"పునర్ నో అసుం పృథివీ దదాతు పునర్ ద్యౌర్ దేవీ పునరంతరిక్షమ్, పునర్ నః సోమస్తన్వం దదాతు పునః పూషా పథ్యాం యా స్వస్తి" ౨ ఋ. ౮-౧-౨౩-౨

"పునర్మనః పునరాయుర్ మ ఆగన్ పునః ప్రాణః పునరాత్మా మ ఆగన్ పునశ్చక్షుః పునః శ్రోత్రం మ ఆగన్. వైశ్వానరో అదబ్ధస్తనూపా అగ్నిర్ నః పాతు దురితాదవద్యాత్" ౩ య. ౪-౧౫

ఏతేషామభిప్రాయ :- ఏతదాది మంత్రేష్వత్ర పూర్వజన్మాని పునర్జన్మాని చ ప్రకాశ్యంతఇతి. (అసునీతే) అసవః ప్రాణాః నీయంతే యేన సోఽసునీతిః. తత్ సంబుద్ధౌ మే అసునీతే ఈశ్వర ! మరణానంతరం ద్వితీయ శరీరధారణే వయం సదా సుఖినో భవేమ. (పునరస్మాసు) అర్థాద్ యదా వయం పూర్వం శరీరం త్యక్త్వా ద్వితీయ శరీర ధారణం కుర్మస్తదా (చక్షుః) చక్షురిత్యుపలక్షణ మింద్రియాణామ్, పునర్జన్మని సర్వాణీంద్రియాణ్యస్మాసు ధేహి. (పునః ప్రాణమ్) ప్రాణమితి వాయోరంతః కరణస్యోపలక్షణమ్. పునర్ ద్వితీయ జన్మని ప్రాణమంతఃకరణం చ ధేహి. ఏవం హేభగవన్ ! పునర్జన్మసు. (నః) అస్మాకం (భోగం) భోగపదార్థాన్ (జ్యోక్) నిరంతర మస్మాసు ధేహి. యతో వయం సర్వేషు జన్మసు (ఉచ్చరంతం సూర్యం) శ్వాసప్రశ్వాసాత్మకం ప్రాణం ప్రకాశమయం సూర్యలోకం చ నిరంతరం పశ్యేమ. (అనుమతే) హే అనుమంతః పరమేశ్వర ! (నః) అస్మాన్ సర్వేషు జన్మసు (మృడయ) సుఖయ; భవత్ కృపయా పునర్జన్మసు (స్వస్తి) సుఖమేవ భవేదితి ప్రార్థ్యతే."

(పునర్నో) హే భగవన్ ! భవదనుగ్రహేణ (నః) అస్మభ్యం (అసుం) ప్రాణమన్నమయం బలం చ (పృథివీ పునర్ దదాతు) తథా (పునర్ ద్యౌః) పునర్ జన్మని ద్యౌర్ దేవీ ద్యోతమానా సూర్యజ్యోతి రసుం దదాతు (పునరంతరిక్షమ్) తథాంతరిక్షం పునర్ జన్మ న్యసుం జీవనం దదాతు (పునర్ నః సోమస్త) తథా సోమః ఓషధిసమూహజన్యోరసః పునర్ జన్మని తన్వం శరీరం దదాతు. (పునః పూషా) హే పరమేశ్వర ! పుష్టికర్తా భవాన్ (పథ్యాం) పునర్ జన్మని ధర్మమార్గం దదాతు. తథా సర్వేషు జన్మసు (యా స్వస్తి) సా భవత్ కృపయా నోఽస్మభ్యం సదైవ భవత్వితి ప్రార్థ్యతే భవాన్. ౨

(పునర్ మనః పు) హే జగదీశ్వర ! భవదనుగ్రహేణ విద్యాది శ్రేష్ఠగుణయుక్తం మనః. ఆయుఃప్రాణశ్చ (మే) మహ్య మాగన్ పునః పునర్ జన్మసు ప్రాప్నుయాత్. (పునరాత్మా) పునర్జన్మని మదాత్మా విచారః శుద్ధః సన్ ప్రాప్నుయాత్. (పునశ్చక్షుః) చక్షుః, (శ్రోత్రం) చ మహ్యం ప్రాప్నుయాత్. (వైశ్వానరః) యః సకలస్య జగతో నయనకర్తా (అదబ్ధః) దంభాది దోషరహితః (తనూపాః) శరీరాదిరక్షకః, (అగ్నిః) విజ్ఞానానంద స్వరూపః, పరమేశ్వరః, (పాతు దురి) జన్మజన్మాంతరే దుష్టకర్మభ్యోఽస్మాన్ పృథక్ కృత్య పాతు రక్షతు. యేన వయం నిష్పాపా భూత్వా సర్వేషు జన్మసు సుఖినో భవేమ. ౩

తె॥ పై మంత్రముల యభిప్రాయము :

ఈ మంత్రములలో పూర్వోత్తర జన్మల విషయము వర్ణింపబడినది.

(అసునీతే) ఓ ప్రాణదాయక పరమేశ్వర ! మేము మరణించి మఱియొక శరీరమును ధరించినపుడు కూడ మమ్ములను సతతము సుఖము గలవారలనుగ జేయుము. (పునరస్మాసు చక్షుః) పునర్ జన్మలో కృపతో మాకునుత్తమనేత్రాదీంద్రియముల నొసంగుము. (పునః ప్రాణం) ప్రాణవాయువు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, బలము, పరాక్రమము మున్నగు వానితో మా శరీరములు యుక్తములగునట్లు పునర్జన్మయందును ననుగ్రహింపుము. (ఇహ నో ధేహి భోగం) ఓ జగదీశ్వర ! ఈ జన్మమునందును పరజన్మమునందును మేముత్తమ భోగములను బొందుదుముగాక ! (జ్యోక్ పశ్యేమ సూర్యముచ్చరంతమ్) ఓ భగవంతుడ ! నీ కృపవలన మేము సూర్యలోకమును, శ్వాసప్రశ్వాసాత్మకమగు ప్రాణమును విజ్ఞానముతోను, ప్రేమతోను నెల్లప్పుడు జూతుముగాక ! (అనుమతే మృడయానః స్వస్తి) ఓ యనుమతీ ! ఎల్లరకు మానము నొసంగుదేవ ! సర్వజన్మములందును మాకు (మృడయ) సుఖములను జేర్పుము. అందువలన మాకు శుభము చేకూరుగాక ! ఇదియే మా ప్రార్థన.

(పునర్ నో అసుం పృథివీ దదాతు) ఓ సర్వశక్తిమంతుడ ! నీయనుగ్రహమువలన పృథివి మాటిమాటికి మాకు ప్రాణమును, అన్నమువలన నేర్పడు బలమును, ప్రకాశాత్మకమగు నా సూర్యుని జ్యోతిస్సు జీవనమును, అంతరిక్షముకూడ పునర్జన్మమునందు జీవనమును నెల్లప్పుడిచ్చునుగాక ! (పునర్ నః సోమస్తన్వం దదాతు) పునర్జన్మలో సోమము-ఓషధీరసము మాకు నుత్తమ శరీరములనొసంగుటకు తోడ్పడునుగాక ! (పూషా) పుష్టినొసంగు పరమేశ్వరుడు, పునర్జన్మమున మాకు (పథ్యాం) ధర్మమార్గము ప్రసాదించునుగాక ! అట్లే సర్వజన్మములందును మాకు సర్వసుఖములనిచ్చి దుఃఖములను నివారించుటకు యోగ్యమగు స్వస్తి నొసంగుము.

(పునర్మనః పునరాత్మా) ఓ సర్వజ్ఞుడవగు నీశ్వర ! మేము జన్మము లెన్నిసారులెత్తినను మాకు శుద్ధమనస్సు, పూర్ణాయుస్సు, ఆరోగ్యము, ప్రాణము, ఆత్మ-శుద్ధమగు నాలోచన, శ్రేష్ఠ నేత్రములు, మంచిచెవులు లభించునుగాక ! (వైశ్వానరోఽదబ్ధః) విశ్వమునందంతట విరాజిల్లువాడును, దంభాది దోషరహితుడును, (తనూపాః) మా శరీరములను రక్షించువాడును, (అగ్నిః) సచ్చిదానంద స్వరూపుడునగు పరమేశ్వరుడు (నః పాతు దురితా దవద్యాత్) మమ్ములను దుష్కర్మములనుండియు, సర్వదుఃఖముల నుండియు జన్మజన్మాంతరములందు వేఱుగనుంచి కాపాడునుగాక ! అందువలన మేము పాపరహితులమై యెల్ల జన్మములందును సుఖములనుభవించు వారమగుదుము. 3

సం॥ "పునర్ మైత్వింద్రియం పునరాత్మా ద్రవిణం బ్రాహ్మణం చ,

పునరగ్నయో ధిష్ ణ్యా యథాస్థామ కల్పంతామిహైవ" ౪ అథర్వ. ౭-౬-౬౭-౧

**(పునర్మైతు) హే భగవన్! పునర్ జన్మనీంద్రియ మర్థాత్ సర్వాణీంద్రియాణ్యాత్మా ప్రాణధారకో బలాఖ్యః (ద్రవిణం) విద్యాది శ్రేష్ఠ ధనం. (బ్రాహ్మణం చ) బ్రహ్మనిష్ఠాత్వం, (పునరగ్నయః) మనుష్య శరీరం ధారయిత్వా ఆహవనీయాద్యగ్న్యాధానకరణం (మైతు) పునః పునర్ జన్మ న్యేతాని మా మాప్నువంతు, (ధిష్ణ్యా యథాస్థామ) హే జగదీశ్వర! వయం యథా యేన ప్రకారేణ పూర్వేషు జన్మసు ధిష్ణ్యా ధారణవత్యా ధియా సోత్తమ శరీరేంద్రియా అస్థామ, తథైవేహ అస్మిన్ సంసారే పునర్జన్మని బుద్ధ్యా సహ స్వస్వకార్యకరణే సమర్థా భవేమ, యేన వయం కేనాపి కారణేన కదాచిద్ వికలా భవేమ.** ౪

తె॥ (పునర్ మైత్వింద్రియమ్) ఓ జగదీశ్వర! నీ కృపవలన పునర్జన్మమునందు మనస్సు మున్నగు నేకాదశేంద్రియములు నాకు మరల లభించుగాక! సతతము మనుష్యదేహము ప్రాప్తించునుగాక! అని

యభిప్రాయము. (పునరాత్మా) ప్రాణధారణనొనర్చు సామర్థ్యము నాకు ప్రాప్తమగును గాక! అందువలన నే రెండవ జన్మమునందును నూఱుగాని అంతకంటె నెక్కువ వత్సరములు కాని శుభాచరణ మొనర్చుచు జీవింపగలుగుదును. (ద్రవిణం) సత్యవిద్యాది శ్రేష్ఠధనము కూడ పునర్జన్మమున ప్రాప్తించునుగాక! (బ్రాహ్మణం చ) ఎల్లపుడు వేద వ్యాఖ్యాన సహిత విజ్ఞానము, పరమేశ్వర నిష్ఠయు లభించుగాక! (పునరగ్నయః) అట్లే జగదుపకారార్థ మగ్నిహోత్రాది శుభకర్మముల నాచరింతుముగాక! (ధిష్ణ్యా యథా స్థామ) ఓ జగదీశ్వర! మేము పూర్వజన్మమున నెట్లు శుభగుణములుగల బుద్ధియు, నుత్తమ శరీరేంద్రియాదులుగల వారముగ నుంటిమో యట్లే యీలోక పునర్జన్మము నందును బుద్ధితో మనుష్య దేహమునకు జెందిన కృత్యములు నొనర్చుటలో సమర్థుల మగుదుముగాక! ఇవి యన్నియు శుద్ధ బుద్ధితో బాటు (మైతు) నాకు ప్రాప్తమగుగాక! (ఇహైవ) వానితో మేమీలోకమున మనుష్య జన్మను బొంది ధర్మార్థ కామమోక్షములను సాధింతుము గాక! ఈ సాధన గాక, ఆ భక్తి వలన మాకే జన్మమునందును దుఃఖము కలుగకుండుగాక! ౪

సం॥ "ఆ యో ధర్మాణి ప్రథమః ససాద తతో వపూంషి కృణుషే పురూణి, ధాస్యుర్ యోనిం ప్రథమ ఆవివేశ యో వాచమనుదితాం చికేత" ౫ అథర్వ. ౫-౧-౧-౨

(ఆ యో ధ) యో జీవః (ప్రథమః) పూర్వ జన్మని (ధర్మాణి) యాదృశాని ధర్మ కార్యాణి (ఆససాద) కృతవానస్తి. స (తతోవపూంషి) తస్మాత్ ధర్మ కరణాత్ బహూన్యుత్తమాని శరీరాణి పునర్జన్మని కృణుషే ధారయతి. ఏవం యశ్చాధర్మకృత్యాని చకార, స నైవ పునః పునర్ మనుష్య శరీరాణి ప్రాప్నోతి. కింతు పశ్వాదీని హి శరీరాణి ధారయిత్వా దుఃఖాని భుఙ్క్తే. ఇదమేవ మంత్రార్థేనేశ్వరో జ్ఞాపయతి. (ధాస్యుర్యోనిం) ధాస్యతీతి ధాస్యురర్థాత్ పూర్వ జన్మ కృత పాప పుణ్య ఫల భోగశీలో జీవాత్మా, (ప్రథమః) పూర్వం దేహం త్యక్త్వా వాయుజలౌషధ్యాది పదార్థాన్ (ఆవివేశ) ప్రవిశ్య పునః కృత పాపపుణ్యానుసారిణీం యోని మావివేశ ప్రవిశతీత్యర్థః. (యోవాచమ) యో జీవోఽనుదితా మీశ్వరోక్తాం వేదవాణీం ఆ సమంతాత్ విదిత్వా ధర్మ మా చరతి,స పూర్వవద్దివ్యచ్ఛరీరం ధృత్వా సుఖమేవ భుఙ్క్తే. తద్విపరీతాచరణః తిర్యగ్ దేహం ధృత్వా దుఃఖభాగీ భవతీతి విజ్ఞేయమ్. ౫

తె॥ (ఆయో ధర్మాణి) పూర్వ జన్మమున ధర్మాచరణ మొనర్చిన మనుజుడు (తతో వపూంషి కృణు పురూణి) ధర్మాచరణకు ఫలముగా ననేకోత్తమ శరీరములను ధరించును. అధర్మాచరణుడైన మనుష్యుడు నీచములగు పశ్వాది శరీరములను బొందును; దుఃఖము ననుభవించును. ఈ మంత్రమున నర్ధభాగమునం దీవిషయమునే యీశ్వరుడు తెలిపెను. (ధాస్యుర్ యోనిం) పూర్వ జన్మమున నొనర్చిన పాపపుణ్యముల ఫలము ననుభవించుచు జీవుడు పూర్వ శరీరమును విడిచి, వాయువుతో నుండును. తదుపరి జలము, ఓషధి, ప్రాణము మున్నగువానియందు ప్రవేశించి వీర్యమున జేరును. తరువాత యోని-గర్భాశయమున స్థిరుడై మరల జన్మించును. (యో వాచ మనుదితాం) ఆచికేత వేదమునందీశ్వరుడు ఆజ్ఞాపించినట్లు, ఎవడు సత్యభాషణాదులను సరిగా నొనర్చువాడై ధర్మమునందే (ససాద) దృఢముగా నుండునో, అతడు పూర్వము వలెనే మనుష్యయోనియందుత్తమ శరీరమును ధరించి యనేక సుఖముల ననుభవించును. దానికి విపరీతముగన ధర్మము నాచరించువాడు నీచ శరీరముల ననేకములను కీటపతంగాదులకు జెందిన వానిని, పశ్వాది శరీరములను బొంది యనేక దుఃఖముల ననుభవించును.

సం॥ "ద్వేసృతీ అశృణవం పితౄణామహం దేవానా ముత మర్త్యానామ్. తాభ్యామిదం విశ్వమేజత్ సమేతి, యదంతరా పితరం మాతరం చ" ౬ యజు. ౧౯-౪౭

(ద్వే సృతీ) అస్మిన్ సంసారే పాపపుణ్య ఫలభోగాయ ద్వౌ మార్గౌ స్తః. ఏకః– పితౄణాం జ్ఞానినాం దేవానాం విదుషాం చ, ద్వితీయః (మర్త్యానాం) విద్యా విజ్ఞాన రహితానాం మనుష్యాణామ్. తయోరేకః

పిత్ర్యయానో, ద్వితీయో దేవయానశ్చేతి. యత్ర జీవో మాతాపితృభ్యాం దేహం ధృత్వా పాపపుణ్యఫలే సుఖదుఃఖే పునః పునర్ భుఙ్క్తే. అర్థాత్ పూర్వాపర జన్మాని చ ధారయతి సా పిత్ర్యయానాఖ్యా సృతిరస్తి. తథా యత్ర మోక్షాఖ్యం పదం లబ్ధ్వా జన్మ మరణాఖ్యాత్ సంసారాద్ విముచ్యతే, సా ద్వితీయా సృతిః భవతి, తత్ర ప్రథమాయాం సృతౌ పుణ్య సంచయ ఫలం భుంక్త్వా పునర్ జాయతే మ్రియతే చ. ద్వితీయాయాం చ సృతౌ పునర్ న జాయతే న మ్రియతే చేతి అహమేవం భూతే ద్వే సృతీ (అశృణవం) శ్రుతవానస్మి. (తాభ్యామిదం విశ్వం) పూర్వోక్తాభ్యాం ద్వాభ్యాం మార్గాభ్యాం సర్వం జగత్ (ఏజత్ సమేతి) కంపమానం గమనాగమనే సమేతి సమ్యక్ ప్రాప్నోతి.(యదంతరా పితరం మాతరం చ) యదా జీవః పూర్వ శరీరం త్యక్త్వా వాయుజలౌషధ్యాదిషు భ్రమిత్వా పితృశరీరం మాతృశరీరం వా ప్రవిశ్య పునర్ జన్మ ప్రాప్నోతి. తదా స సశరీరో జీవో భవతీతి విజ్ఞేయమ్."

తె॥ (ద్వే సృతీ) పాపపుణ్య ఫలముల ననుభవించుట కై ప్రపంచమున రెండు మార్గములున్నవి.

౧. (క) పితృ-జ్ఞానుల మార్గము [నిష్కామబుద్ధితో కేవలము కర్తవ్యమని యెంచి కర్మముల నాచరించు పురుషుల మార్గము.] (ఖ) దేవ-విద్వాంసుల మార్గము [బ్రహ్మజ్ఞుల మార్గము.]

౨. (మర్త్యానాం) పైన జెప్పిన రెండురకముల మనుష్యులకంటె భిన్నులై విద్యా విజ్ఞానములు లేని మానవుల మార్గము ( సకామ కర్మముల నొనర్చు సామాన్య మానవుల మార్గము.) పై రెండు మార్గము లలో మొదటిది దేవయానమురెండవది పిత్ర్యయానము. మాతాపితల వలన శరీరమునుబొంది మాటి మాటికి పాపపుణ్య ఫలములయిన దుఃఖ సుఖముల ననుభవించు మార్గము పిత్ర్యయాన మనబడును. ఒకదాని తదుపరి మఱియొకటి చొప్పున పూర్వా పర జన్మము లనేకములు జీవునకు గలుగును. జన్మ మరణరూప సంసారమునుండి విడివడి మోక్షపదమును బొందు మార్గము దేవయానమనబడును. పిత్ర్యయానమునందు జీవుడు సంచిత పుణ్య పాప ఫలముల ననుభవించుచు నిరంతరము జన్మ మరణ రూప బంధనమున బడియుండును. దేవయానమునందు జీవునకు జన్మ మరణ రూపనిరంతర బంధనము విడిపోవును. (పరాంతకాల పరిమాణసమయమున నా జీవుడు పరమానందము ననుభవించును.) ఇట్లు రెండు విధములగు మార్గములను నేను(అశృణవమ్) వినియున్నాను. (తాభ్యామిదం విశ్వం) పూర్వోక్తములగు రెండు మార్గములతో నీ సంపూర్ణ విశ్వము (ఏజత్ సమేతి) నియమిత రూపమున చలించుచున్నది. (యదంతరాపితరం మాతరం చ) జీవుడు పూర్వశరీరమును విడిచి, వాయుజలౌష ధ్యాదుల ద్వారమున పితృశరీరమున గాని మాతృశరీరమునగాని ప్రవేశించి పునర్ జన్మమును బొందును. అప్పుడు జీవుడు శరీరధారణము సేయునని యెఱుంగనగును. ౬

సం॥ "మృతశ్చాహం పునర్జాతో జాతశ్చాహం పునర్ మృతః
నానాయోని సహస్రాణి మయోషితాని యాని వై." ౧
"ఆహారా వివిధా భుక్తాః పీతా నానావిధాః స్తనాః,
మాతరో వివిధా దృష్టాః పితరః సుహృదస్తథా" ౨
"అవాఙ్ముఖః పీడ్యమానో జంతుశ్చైవ సమన్వితః" ౩ నిరు. ౧౪-౬

అత్ర 'మృతశ్చాహం పునర్ జాత' ఇత్యాది నిరుక్త కారైరపి పునర్ జన్మ ధారణముక్త మితి బోధ్యమ్. ౧-౨-౩

తె॥ వేదములందు పూర్వా పరజన్మములు జీవులకు గలవని వర్ణించి నట్లు నిరుక్తకారుడును పునర్జన్మమును ప్రతిపాదించియున్నాడు. జ్ఞానియైన మనుజుడు (మృతశ్చాహం) 'నేను పలుమాఱులు జననమరణములను బొంది, నానావిధములగు యోనులందు నివసించియుంటిని' అని యెఱుగును. ౧

(ఆహారా) ఆ యోనులందు బహువిధములగు నాహారములను భుజించితిని. పలువురు తల్లుల స్తన్యమును ద్రావితిని. తల్లులను, తండ్రులను, సుహృత్తులను ననేకులను జూచితిని. ౨

(అవాఙ్ముఖః) 'నేను గర్భమున తలక్రిందుగా నుండి నానావిధ బాధలతో గూడిన జన్మల ననేకముల ధరించితిని' కాని, యిప్పుడిక పరమేశ్వరునందు పూర్ణభక్తి గలిగి వాని యాజ్ఞలను పాలించినప్పుడే యీ మహాదుఃఖములనుండి ముక్తుడనగుదును. లేకున్న నీ జన్మ–మరణ రూప దుఃఖసాగరమునుండి యెన్నడును ముక్తుడగాజాలను. ౩

సం॥ "స్వరసవాహీ విదుషోఽపి తథారూఢోఽభినివేశః" ౧ పాతం, ౨–౯

(స్వరస) యోగశాస్త్రే పతంజలి మహామునినా, తదుపరి భాష్య కర్త్రా వేదవ్యాసేన చ పునర్ జన్మ సద్భావః ప్రతిపాదితః. యా సర్వేషు ప్రాణిషు జన్మారభ్య మరణత్రాసాఖ్యా ప్రవృత్తిర్ దృశ్యతే, తయా పూర్వాపరజన్మాని భవంతీతి విజ్ఞాయతే.

పూ. పః కుతః?

ఉ. పః జాతమాత్రకృమిరపి మరణత్రాస మనుభవతి. తథా విదుషోఽ ప్యనుభవో భవతీత్యతో జీవేనానేకాని శరీరాణి ధార్యంతే. యది పూర్వ జన్మని మరణానుభవో న భవేచ్ఛే త్తర్హి తత్ సంస్కారోఽపి న స్యాత్; నైవ సంస్కారేణ వినా స్మృతిర్ భవతి, స్మృత్యా వినా మరణ త్రాసః కథం జాయేత?

పూ. పః కుతః?

ఉ. పః ప్రాణిమాత్రస్య మరణభయ దర్శనాత్ పూర్వాపర జన్మాని భవంతీతి వేదితవ్యమ్. ౧

తె॥ (స్వరస) యోగ దర్శనమును రచియించిన పతంజలి మునియు, దానికి భాష్యకర్తయైన వేదవ్యాసుడు పునర్జన్మమున్నదని ప్రతిపాదించిరి. ప్రాణులకన్నింటికి జన్మించినప్పటినుండియు మరణ భయముండును. ఆ మరణభీతి జీవునకు పూర్వాపరజన్మములున్నవని సిద్ధము చేయుచున్నది. కారణమేమి? యన :

ఇప్పుడిప్పుడే పుట్టిన కీటకమునకు, బాగుగ జదివిన విద్వాంసునకు నెల్లరకు మరణభయ మెన్నడో కలిగియుండును. ఆ యనుభవము నిప్పుడు స్మరించి ప్రతి ప్రాణియు మృత్యువునకు భయపడుట జూచు చున్నాము. కావున జీవుడనేక శరీరములను ధరించు ననకతప్పదు. పూర్వ జన్మమున మృత్యు భయము ననుభవింపకున్నచో దానికి సంబంధించిన సంస్కారము ప్రాణియంతఃకరణమున నేర్పడదు. సంస్కారము లేని నాడు స్మరణము కలుగదు. అప్పుడు భయము కలుగుటకు వీలేమియు నుండదు.

పూ. పః దీనివలన పూర్వ జన్మమెట్లు సిద్ధించినది?

ఉ. పః ప్రతి ప్రాణియు మృత్యువునకు భయపడుచున్నది. కావున నట్టి భయము పూర్వ జన్మమందనుభవింపకున్న నిప్పుడు కలుగ వీలు లేదు. అందువలన జీవునకు పూర్వా పర జన్మములున్నవనక తప్పదు.

సం॥ "పునరుత్పత్తిః ప్రేత్యభావః" ౧ న్యాయ. ౧-౧-౧౯

(పునరు) తథా మహా విదుషా గోతమేనర్షిణా న్యాయదర్శనే తద్ భాష్యకర్త్రా వాత్స్యాయనేనాపి పునర్ జన్మ భావో మతః. యత్ పూర్వ శరీరం త్యక్త్వా పునర్ ద్వితీయ శరీరధారణం భవతి ; తత్ ప్రేత్య భావాఖ్యః పదార్థో భవతీతి విజ్ఞేయమ్. ప్రేత్య అర్థాన్మరణం ప్రాప్య, భావోఽర్థాత్ పునర్ జన్మ ధృత్వా, జీవో దేహవాన్ భవతీత్యర్థః ౧

తె॥ (పునరు) ఇట్లే న్యాయ దర్శనమునందును మహావిద్వాంసుడగు గోతమమహర్షియు, న్యాయ సూత్రములకు భాష్యము వ్రాసిన వాత్స్యాయనమునియు, నిరువురును పునర్జన్మము నంగీకరించియున్నారు. పూర్వ శరీరము విడిచి మఱియొక శరీరమును ధరించుటకే ప్రేత్యభావమని పేరు. ప్రేత్య=మృత్యువును బొంది-చచ్చి, భావః-మరల శరీరము ధరించుట- జీవుడు శరీరముగలవాడగును. ౧

సం॥ అత్ర కేచి దేకజన్మ వాదినో వదంతి :

పూ. ప : యది పూర్వ జన్మాసీత్తర్హి తత్ స్మరణం కుతో న భవతి?

ఉ. ప : ఇత్యత్ర బ్రూమః; భోః జ్ఞాననేత్రముద్ఘాట్య ద్రష్టవ్యమ్; అస్మిన్నేవ శరీరే జన్మతః పంచ వర్ష పర్యంతం యద్ యత్ సుఖం దుఃఖం చ భవతి, యచ్చ జాగరి తావస్థాస్థానాం సర్వవ్యవహారాణాం, సుషుప్త్యవస్థాయాం చ, తదనుభూత స్మరణం న భవతి; పూర్వ జన్మవృత్త స్మరణస్యతు కా కథా!

పూ. ప : యది పూర్వ జన్మ కృతయోః పాపపుణ్యయోః సుఖ దుఃఖఫలే హీశ్వరోఽస్మిన్ జన్మని దదాతి; తయోశ్చాస్మాకం సాక్షాత్కారాభావాత్ సోఽన్యాయకారీ భవతి; నాతో ఽస్మాకం శుద్ధిశ్చేతి?

ఉ. ప : అత్ర బ్రూమః :- ద్వివిధం జ్ఞానం భవతి; ఏకం ప్రత్యక్షం, ద్వితీయ మానుమానికం చ, యథా కస్యచిద్ వైద్యస్య అవైద్యస్య చ శరీరే జ్వరావేశో భవేత్తత్రఖలు వైద్యస్తు విద్యయా కార్యకారణ సంగత్యనుమానతో జ్వర నిదానం జానాతి నాపరశ్చ. పరంతు వైద్యక విద్యా రహితస్యాపి జ్వరస్య ప్రత్యక్షత్వాత్ 'కిమపి మయా కుపథ్యం పూర్వం కృతమితి జానాతి, వినా కారణేన కార్యం నైవ భవతీతి దర్శనాత్. తథైవ న్యాయ కారీశ్వరోఽపి వినా పాపపుణ్యాభ్యాం న కస్మైచిత్ సుఖం దుఃఖం చ దాతుం శక్నోతి. సంసారే నీచోచ్చ సుఖి దుఃఖి దర్శనాద్ విజ్ఞాయతే పూర్వ జన్మకృతే పాపపుణ్యే బభూవతురితి. అత్ర ఏక జన్మ వాదినామన్యేఽపి ఈదృశాః ప్రశ్నాః సంతి తేషాం విచారేణోత్తరాణి దేయాని. కించ న బుద్ధిమతః ప్రత్యఖిల లేఖనం యోగ్యం భవతి; తేహ్యుద్దేశ్యమాత్రేణాధికం జానంతి. గ్రంథోపి భూయాన్నభవేదితి మత్వా అత్రాధికం నోల్లిఖ్యతే.

పునర్జన్మ విషయః సంక్షేపతః

---

తె॥ ఏక జన్మ వాదులిట్లు ప్రశ్నింతురు.

పూ. పః పూర్వజన్మమున్నదందురేని యీజన్మమున దాని స్మరణమేల కలుగదు?

ఉ. పః ఈజన్మమునందే బాల్యావస్థలో నైదేండ్ల ప్రాయమున బొందిన సుఖదుఃఖములనే స్మరియింపజాలము. ఇంతేకాదు; నిత్యము మనుజులు తాము చదివే చదువులలోను, ఇతర వ్యవహారములందును ననేక విషయముల నప్పటికప్పుడే స్మరియింపజాలరు; మఱచిపోవుదురు. అట్టియెడ పూర్వ జన్మ

వార్తలెట్లు గుర్తుండును. జాగ్రదవస్థలో నొనరించిన వ్యవహారములు నిద్రావస్థలో విస్మరింతుము కావున పూర్వ జన్మవృత్తమెట్లు ఈ జన్మమున స్మరింపగలము?

పూ. ప॥ పూర్వజన్మమున జేసిన పాపపుణ్యముల జ్ఞానము మన కిప్పుడుండదు. ఈశ్వరు డా పాపపుణ్యములకు ఫలముగ సుఖదుఃఖములను గలిగించును. అట్టి యెడల నీశ్వరుడు న్యాయకారి యనుట గాని, జీవులు తమ తప్పులు దిద్దుకొని సంస్కరింపబడుదురనుట గాని యెట్లు చెల్లును?

ఉ. ప॥ జ్ఞానము రెండు విధముల గలుగును. ఒకటి ప్రత్యక్షము రెండవది యానుమానికము. ఇద్దఱు వ్యక్తులున్నారనుకొనుడు. ఒకడు వైద్యుడు, రెండవ వాడు వైద్యము తెలియనివాడును. వారిరువురికి జ్వరము వచ్చిన దనుకొనుడు. అప్పుడు వైద్యుడు కార్యకారణజ్ఞానము గలవాడగుటచే జ్వరము వచ్చుటకు గల కారణము ననుమానము ఊహతో దెలిసికొనును. రెండవ వాడట్లు తన జ్వరమునకు నిదాన కారణమేమో గుర్తింపజాలడు. జ్వరము మాత్ర మిరువురకును ప్రత్యక్షమే. దానికి పూర్వము వారు చేసిన కుపథ్యము వైద్యునకు దెలియును. అ వైద్యునకు దెలియదు. కారణము లేక కార్యము కలుగదు కావున కుపథ్యమువలన జ్వరము వచ్చినదని యూహించి, వైద్యుడు సరిగా తెలిసికొనగలడు. అవైద్యున కీవిషయము సరిగా తెలియకున్నను జ్వరము వచ్చుటకేదో కారణమున్నట్లు తెలిసికొనును. ఈశ్వరుడు న్యాయకారి కావున నతడు నిష్కారణముగ నెవనికిని సుఖము కాని, దుఃఖము కాని కలిగింపడు. పుణ్యపాపములకు ఫలము-కార్యము-సుఖదుఃఖములని మనకు తెలిసినమీదట, సుఖదుఃఖములు ప్రత్యక్షముగ తెలియుచున్నందున వానికి కారణముల నూహించి - అనుమానించి తెలిసికొనవచ్చును. ఇట్లే పూర్వ జన్మమున జేసిన పాపపుణ్యములు కారణములుగ జీవులకు నుత్తమ మధ్యమాధమ శరీరములు లభించినవని నిశ్చయమగుచున్నది. అందువలన నీశ్వరుడు న్యాయకారి యనియు జీవులు తమకు గలుగు సుఖదుఃఖముల మూలమున పూర్వపు కర్మముల నూహించి తెలిసికొని, మానవజన్మమున తమ్ముదాము సంస్కరించుకొనగల యవకాశ మున్నదనియు స్పష్టమగుచునే యున్నది. ఇట్లే యేకజన్మవాదు లడుగు ప్రశ్నములకు సమాధానము లూహింపనగును. బుద్ధిమంతుల కంతయు వ్రాయు నావశ్యక ముండదు. కొలదిగ నిర్దేశించిన చాలును. మిగిలినది యూహింపగలరు. గ్రంథ విస్తరభీతిచే నిట నీ విషయము నెక్కుడుగ వ్రాయ దలపమైతిమి.

పునర్జన్మ విషయము సమాప్తము.

# అథ వివాహ విషయః సంక్షేపతః

సం॥ "గృభ్ణామి తే సౌభగత్వాయ హస్తం మయా పత్యా జరదష్టిర్ యథాసః భగో అర్యమా సవితా పురంధిర్మహ్యం త్వాదుర్ గార్హపత్యాయ దేవాః" ౧
ఋ. ౮-౩-౨౭-౧

"ఇహైవ స్తం మా వియౌష్టం విశ్వమాయుర్ వ్యశ్నుతమ్, క్రీడంతౌ పుత్రైర్ నప్తృభిర్ మోదమానౌ స్వే గృహే" ౨
ఋ. ౮-౩-౨౮-౨

(అనయోరభి) అత్ర వివాహ విధానం క్రియతే ఇతి. హేకుమారి! యువతి! కన్యే! (సౌభగత్వాయ) సంతానోత్పత్త్యాది ప్రయోజన సిద్ధయే, (తే) తవ, (హస్తం గృభ్ణామి) గృహ్ణామి; త్వయా సహాహం వివాహం కరోమి; త్వం చ మయా సహ. హేస్త్రి ! (యథా) యేన ప్రకారేణ, (మయా పత్యా) 'సహ' (జరదష్టిః ఆసః) జరావస్థాం ప్రాప్నుయామ్. ఏవ మావాం సంప్రీత్యా పరస్పరం ధర్మ మానందం కుర్యావహి. (భగః) సకలైశ్వర్య సంపన్నః (అర్యమా) న్యాయ వ్యవస్థా కర్తా, (సవితా) సర్వజగదుత్పాదకః (పురంధిః) సర్వజగద్ధారకః పరమేశ్వరః (మహ్యం గార్హపత్యాయ) గృహ కార్యాయ త్వాం మదర్థం దత్తవాన్. తథా, (దేవాః) అత్ర సర్వే విద్వాంసః సాక్షిణః సంతి. యద్యావాం ప్రతిజ్ఞోల్లంఘనం కుర్యావహి, తర్హి పరమేశ్వరదండ్యౌ, విద్వద్దండ్యౌ చ భవేవేతి" ౧

వివాహం కృత్వా పరస్పరం స్త్రీ పురుషౌ కీదృశవర్తమానౌ భవేతా మేత దర్థమీశ్వర ఆజ్ఞాం దదాతి (ఇహైవస్తం) హేస్త్రీ పురుషౌ! యువాం ద్వావిహాస్మింల్లోకేగృహాశ్రమే సుఖేనైవ సదా (స్తమ్) నివాసం కుర్యాతమ్ (మా వియౌష్టమ్) తథా కదాచిద్ విరోధేన, దేశ దేశాంతర గమనేన వా వియుక్తౌ వియోగం ప్రాప్తౌ మా భవేతమ్, ఏవం మదాశీర్వాదేన ధర్మం కుర్వాణౌ. సర్వోపకారిణౌ మద్ భక్తి మాచరంతౌ, (విశ్వ మాయుర్ వ్యశ్నుతమ్) వివిధ సుఖరూప మాయుః ప్రాప్నుతమ్, పునః (స్వేగృహే) స్వకీయే గృహే పుత్రైర్ నప్తృభిశ్చ సహ మోదమానౌ సర్వానందం ప్రాప్నువంతౌ (క్రీడంతౌ) సద్ధర్మ క్రియాం కుర్వంతౌ సదైవ భవతమ్. ౨

ఇత్యనేనాపి ఏకస్యాః ఏక ఏవ పతిర్ భవతు; ఏకస్య పురుషస్య ఏకైవ స్త్రీ చేతి అర్థాదనేక స్త్రీభిః సహ వివాహనిషేధో నరస్య, తథా అనేకైః పురుషైః సహైకస్యాః స్త్రియాశ్చేతి, సర్వేషు వేదమంత్రేష్వేక వచన స్యైవ నిర్దేశాత్ ఏవం వివాహవిధాయకా వేదేష్వనేకే మంత్రాః సంతీతి విజ్ఞేయమ్.

వివాహ విషయః సమాప్తః

---

తె॥ పై రెండు మంత్రముల యభిప్రాయము :

ఈ మంత్రములలో వివాహము విధింపబడియున్నది. (గృభ్ణామి తే సౌభగత్వాయ హస్తం) ఓ కుమారీ! యువతీ! కన్యా! నేను సౌభాగ్యము - గృహాశ్రమమున సంతానోత్పత్తి మున్నగు ప్రయోజనములు చేకూరుటకు నీ హస్తమును గ్రహించుచున్నాను- నేను నిన్ను వివాహమాడుచున్నాను. నీవును నన్ను నట్లే గ్రహించు చున్నావు. ఓ స్త్రీ ! (యథా మయా పత్యా జరదష్టిః ఆసః) ఎట్లు పతినైన నాతో నీవు వృద్ధావస్థను బొందుదువో, నేను నట్లే నీతో వృద్ధుడనగుదును. మనమిరువురము సదాచారవంతులమై, చెడుగుల

నానర్చక, వృద్ధుల మగువలకు నానందదాయకముగ వ్యవహరించుదము. మన యీ ప్రతిజ్ఞల నెల్లరు సత్యమని యెఱుంగవలెను. దీనికి వ్యతిరేకముగ నెన్నడు వర్తింపము. (భగః) ఐశ్వర్యవంతుడు, (అర్యమా) న్యాయకారి - సర్వజీవులకు పాపపుణ్యముల ఫలములను తూచి యిచ్చువాడును. (సవితా) సర్వ జగత్తును పుట్టించి సమస్తైశ్వర్యముల నొసంగువాడును, (పురంధిః) సర్వ ప్రపంచమును ధరించువాడును నగు పరమేశ్వరుడు మన యిరువురకు సాక్షి. (మహ్యం త్వా) పరమేశ్వరుడును, విద్వాంసులును నాకు నిన్నును, నీకు నన్నును ఇచ్చినారు. మనము పరస్పర ప్రీతితో గృహ కార్యములను నిర్వర్తించుదము. అసత్యభాషణాదులను విడిచి, సతతము ధర్మమునందే వర్తించుదము. జగత్తున కుపకార మొనరించుటకు సత్య విద్యలను ప్రచారము చేయుదము. ధర్మ పూర్వకముగ సంతానముంబడసి సుశిక్షితము చేయుదము. ఇట్టి ప్రతిజ్ఞల నీశ్వరుని సాక్షిగా నెంచి చేయుచున్నాము. ఈ నియమములను చక్కగా పాలించుదము. మన మొండొరులను విడిచి యన్యులనెన్నడు మనస్సునను వాంఛింపకుందుము గాక ! (దేవాః) ఓ విద్వాంసులారా ! మీరు కూడ మాకు సాక్షులుగ నుండుడు. మేమిరువురముగృహాశ్రమ ధర్మముల నిర్వర్తింప వివాహమాడుచున్నాము. వివాహ సమయమున స్త్రీ పురుషులిరువురు 'నేనీ స్త్రీని విడిచి యన్య స్త్రీని మనోవాక్కాయములతో నెన్నడు గోరను, 'నేనీ పురుషుని విడిచి యన్య పురుషుని మనో వాక్కాయములతో నెన్నడు కోరను'అని ప్రతిజ్ఞలు చేయవలెను. ఈ ప్రతిజ్ఞలకు విరుద్ధముగా నడచుకొనినపుడు వారు పరమేశ్వరుని దండనకు, విద్వాంసుల దండనకు పాత్రులగుదురు. ౧

(ఇహైవ స్తం) మీరిరువురు వివాహితులై గృహాశ్రమమున శుభ వ్యవహారము లొనర్చుడు. (మా వియౌష్టం) విరోధించి వేఱు గాకుందురుగాక! వ్యభిచారాదులకు బూనుకొనకుడు. ధర్మ కార్యము లొనర్చుచు, పరమేశ్వరునియందు భక్తి గలిగి యుండుడు. (విశ్వమాయుర్ వ్యశ్నుతమ్) సంపూర్ణమగు నాయువును సుఖముగ ననుభవింపుడు. (క్రీడంతౌ) మీ మీ గృహములందు పుత్ర పౌత్రులతో ధర్మ కార్యము లొనర్చుచు నానందము ననుభవింపుడు. దీనికి విపరీతముగ నెన్నడు వర్తింపకుడు. అని యీ మంత్రమున పరమేశ్వరుడు వివాహిత దంపతులనుగూర్చి యాశీర్వదించుచున్నాడు; ఉపదేశించుచున్నాడు. ౨

ఈ మంత్రార్థమును బట్టి యొక స్త్రీకి ఒక్కడే పతి కావలెననియు, ఒక పురుషున కొక స్త్రీయే పత్ని కావలెననియు, స్పష్టమగుచున్నది. ఒక పురుషుడనేక స్త్రీలనుగాని, ఒక స్త్రీ యనేక పురుషులనుగాని వివాహము చేసికొనుట వేద విరుద్ధము కావున తగదు. వివాహ ప్రతిపాదక మంత్రములలో నెల్లయెడల నేక వచన ప్రయోగమే కనబడుచున్నది. వివాహ విషయమునకు చెందిన మంత్రములిట్టివి పెక్కు గలవు.

వివాహ విషయము సమాప్తము

# అథ నియోగ విషయః సంక్షేపతః

సం॥ "కుహస్విద్దోషా కుహ వస్తోరశ్వినా కుహాభిపిత్వం కరతః కుహోషతుః, కో వాం శయుత్రా విధవేవ దేవరం మర్యం న యోషా కృణుతే సధస్థ ఆ" ౧ ఋ. ౭-౮-౧౮-౨

"ఇయం నారీ పతిలోకం వృణానా నిపద్యత ఉపత్వా మర్త్య ప్రేత్యమ్. ధర్మం పురాణ మనుపాలయంతీ తస్యై ప్రజాం ద్రవిణం చేహ ధేహి." ౨ అథర్వ. ౧౮-౩-౩-౧

"ఉదీర్ష్వ నార్యభిజీవ లోకం గతాసుమేత ముపశేష ఏహి. హస్త గ్రాభస్య దిధిషోస్త్వ వేదం పత్యుర్జనిత్వ మభిసంబభూథ" ౩ ఋ. ౧౦-౧౮-౮

ఏషామభిప్రాయః :- అత్ర విధవా, విస్త్రీక, నియోగ వ్యవస్థా విధీయత ఇతి. (కుహస్విద్దోషా) హే (అశ్వినా) వివాహితౌ స్త్రీ పురుషౌ! యువాం (కుహ) కస్మిన్ స్థానే, (దోషా) రాత్రౌ (వస్తోః) వసథః. (కుహ అశ్వినా) దివసే చ క్వ వాసం కురుథః (కుహాభి) క్వాభిపిత్వం ప్రాప్తిం (కరతః) కురుతః (కుహోషతుః) క్వ యువయోర్ నిజవాస స్థానమస్తి (కో వాం శయుత్రా) శయనస్థానం యువయోః క్వాస్తి. ఇతి స్త్రీ పురుషౌ ప్రతిప్రశ్నేన ద్వివచనోచ్చారణేన చైకస్య పురుషస్యైకైవ స్త్రీ కర్తుం యోగ్యాస్తి. తథైకస్యాః స్త్రియా ఏక ఏవ పురుషశ్చ. ద్వయోః పరస్పరం సదైవ ప్రీతిర్ భవేన్న కదాచిద్ వియోగ వ్యభిచారౌ భవేతా మితి ద్యోత్యతే. (విధవేవ దేవరం) కంకేవ? యథా దేవరం ద్వితీయం వరం నియోగేన ప్రాప్తం విధవా ఇవ. అత్ర ప్రమాణమ్- 'దేవరః కస్మాద్ ద్వితీయో వర ఉచ్యతే" ని. ౩-౧౫

విధవాయా ద్వితీయపురుషేణ సహ నియోగకరణే ఆజ్ఞాస్తి; తథా పురుషస్య చ విధవయా సహ. విధవా స్త్రీ మృతకస్త్రీకపురుషేణ సహైవ సంతానార్థం నియోగం కుర్యా న్న కుమారేణ సహ, తథా కుమారస్య విధవయా సహ చ. అర్థాత్ కుమారయోః స్త్రీ పురుషయో రేకవారమేవ వివాహః స్యాత్, పునరేవం నియోగశ్చ. నైవ ద్విజేషు ద్వితీయవారం వివాహో విధీయతే. పునర్వివాహస్తు ఖలు శూద్రవర్ణ ఏవ విధీయతే, తస్య విద్యావ్యవహారరహితత్వాత్, నియోజితౌ స్త్రీ పురుషౌ కథం పరస్పరం వర్తేతా మిత్యత్రాహ - (మర్యం న యోషా) యథా వివాహితం మనుష్యం (సధస్థే) సమానస్థానే సంతానార్థం యోషా వివాహితా స్త్రీ (కృణుతే) ఆకృణుతే, తథైవ విధవా విగతస్త్రీకశ్చ సంతానోత్పత్తికరణార్థం పరస్పరం నియోగం కృత్వా వివాహిత స్త్రీ పురుషవద్ వర్తేయాతామ్. ౧

(ఇయం నారీ) ఇయం విధవా నారీ (ప్రేతం) మృతం పతిం విహాయ (పతిలోకం) పతిసుఖం (వృణానా) స్వీకర్తు మిచ్ఛంతీ సతీ (మర్త్య) హే మనుష్య ! (త్వా) త్వాముపనిపద్యతే, త్వాం పతిం ప్రాప్నోతి. తవ సమీపం నియోగవిధానేనాగచ్ఛతి. తాం త్వం గృహాణ; అస్యాం సంతానాన్యుత్పాదయ. కథం భూతా సా ? (ధర్మం పురాణం) వేదప్రతిపాద్యం సనాతనం ధర్మమనుపాలయంతీ సతీ త్వాం నియోగేన పతిం వృణుతే, త్వమపీమాం వృణు. (తస్యై) విధవాయై (ఇహ) అస్మిన్ సమయే లోకే వా (ప్రజాం ధేహి) త్వమస్యాం ప్రజోత్పత్తిం కురు. (ద్రవిణం) ద్రవ్యం వీర్యం (చ) అస్యాం ధేహి, అర్థాత్ గర్భాధానం కురు. ౨

(ఉదీర్ష్వనా) హేవిధవే ! నారి ! (ఏతం) (గతాసుం) గతప్రాణం మృతం వివాహితం పతిం త్యక్త్వా (అభిజీవలోకం) జీవంతం దేవరం ద్వితీయవరం పతిం (ఏహి) ప్రాప్నుహి, (ఉపశేషే) తస్యైవోపశేషే సంతానోత్పాదనాయ వర్తస్వ. తత్ సంతానం (హస్తగ్రాభస్య) వివాహే సంగృహీత హస్తస్యపత్యుః స్యాత్. యది నియుక్తపత్యర్థో నియోగః కృతస్తర్హి (దిధిషోః) తస్యైవ సంతానం భవేత్. (తవేదం) ఇదమేవ విధవాయాస్తవ (జనిత్వం) సంతానం భవతి. హే విధవే ! విగతవివాహితస్త్రీకస్య పత్యుశ్శ్రైతన్నియోగకరణార్థం త్వం (ఉదీర్ష్వ) వివాహిత పతి మరణానంతరమిమం నియోగమిచ్ఛ; తథా (అభిసంబభూథ) సంతానోత్పత్తిం కృత్వా సుఖసంయుక్తా భవ. 3

తె॥ విధవయు, విధురుడు (చనిపోయిన భార్యగలవాడు) ను పరస్పరము నియోగముతో సంతానము గనవచ్చును. నియోగ విషయమున నిట్టి నియమమును పాలింపవలెను. భార్యచచ్చిన పురుషుడు కాని భర్తచచ్చిన స్త్రీకాని, లేక, భార్యాభర్తలలో నెవరికైన స్థిరమైన వ్యాధియేర్పడినపుడు, వ్యాధిలేని పురుషుడుకాని, స్త్రీకాని. లేక, భర్త నపుంసకుడైన భార్యకాని భార్యవంధ్య (గొడ్రాలు) యైన భర్తకాని, యువావస్థలో నుండి, సంతానము కావలయునని కోరిక గలిగినపుడు స్త్రీ విధురునితోను, పురుషుడు విధవతోను నియోగముచేసి సంతానము బడయవచ్చును. ఈ వ్యవస్థకే నియోగమనిపేరు. ఇందులకు శాస్త్రీయ ప్రమాణములు.

(యువాం) (కుహస్విత్) వివాహిత స్త్రీపురుషులైన మీరిరువురు (దోషా) రాత్రియందెక్కడ నివసించితిరి? (కుహవస్తోరశ్వినా) మీరిరువురు దినమునందెక్కడ నుండిరి ? (కుహాభిపిత్వం కరతః) మీ రన్నవస్త్ర ధనాదుల నెటనుండి పొందియున్నారు ? (కుహోషతుః) మీ నివాసస్థానమెక్కడ ? (కోవాం శయు) రాత్రియందు మీరెక్కడ శయనించితిరి ?

వేదములందు స్త్రీపురుషులకు సంబంధించిన యిట్టి ప్రశ్నలున్నందునను, స్త్రీపురుషుల వివాహమునకు సంబంధించిన మంత్రములలో నేకవచనము స్త్రీపురుషులకు ప్రయోగింపబడినందునను దంపతులను చెప్పునప్పుడు ద్వివచనముండుటవలనను నొకపురుషు డొకే స్త్రీని వివాహమాడవలెననియు, ఒక స్త్రీ యొకే పురుషుని పరిణయము చేసికొనవలెననియు వేదములంగీకరించుచున్నట్లు నిశ్చితమగుచున్నది. స్త్రీ పురుషులిరువురు వివాహితులై పరస్పరము ప్రేమతో నొకరినొకరు విడువక యుండవలెననియు, వ్యభిచారాదుల నొనరింపరాదనియు స్పష్టమగుచున్నది.

స్త్రీ పురుషులార ! (విధవేవ దేవరమ్) విధవాస్త్రీ దేవరుని వలన సంతానము బడయునట్లు మీరును సంతానమును బడయుడు. విధవకు సంతానము బడయుటకై నియుక్తుడగు పతి దేవరుడనబడును. యాస్కముని నిరుక్తమున నిట్లే దేవరశబ్దమును నిర్వచించెను.

బ్రాహ్మణక్షత్రియ వైశ్యులు (పుర్వోక్తదశయందు) నియోగము మూలమున స్త్రీపురుషులొక్కొరొక్కరు తమకొలకు సంతాన ద్వయమును బొందవచ్చునని యేర్పడుచున్నది. విద్యాబుద్ధులు లేనివారగుటచే శూద్రులు మాత్రము పునర్వివాహము చేసికొనవలెను. ద్విజులకు పునర్వివాహము విహితముకాదు. నియోగమే విహితము :- వేదప్రతిపాదితము. కుమారీ కుమారులలో కుమారుడు విధవతోకాని, కుమారి విధురునితోగాని నియోగము జరుపరాదు. మాత, గురుపత్ని, భగిని, కన్య, పుత్రవధువు (కోడలు) మున్నగు సమీప సంబంధముగల వ్యక్తులతో నియోగమొనర్చుట యేవిధముగను తగదు. ఈ నియోగము శిష్టపురుషుల సమ్మతితో నియోగమునకు సిద్ధమైన స్త్రీపురుషులు ప్రసన్నతా పూర్వకముగ జరుపవలెను. రెండవ గర్భధారణమైన తదుపరి నియోగ సంబంధమువిడిపోవలెను. ఈ నియమము నుల్లంఘించిన వారిని వెంటనే ద్విజకులమునుండి వేఱుచేసి శూద్రకులమున జేర్పవలెను.

నియుక్త స్త్రీపురుషులెట్లు వర్తింపవలెనన :

(మర్యం న యోషా సధస్థే) వివాహితస్త్రీ తన వివాహిత పురుషునకు సంతానార్థము తన సమానస్థానమును (కృణుతే) ఇచ్చునట్లు, విధవాస్త్రీ విధురపురుషుడు ఇరువురు సంతానముకొఱకు పరస్పరము నియోగము ద్వారమున వివాహిత స్త్రీ పురుషులవలె సంతానముత్పన్నము చేయవలెను. ౧

(ఇయం నారీ పతిలోకం) విధవయైన స్త్రీ పతివలన బొందవలసిన సుఖమునుగోరి, నియోగము చేయదలచినచో (ప్రేతమ్) పతి మరణించిన తదుపరి మఱియొక పతిని బొందవచ్చును. (మర్త్య!) ఓ మానవ ! (ధర్మం పురాణమనుపాలయంతీ) సనాతనమగు నియోగ ధర్మమును రక్షించునట్టి స్త్రీ (త్వా ఉపనిపద్యతే) నిన్ను నియుక్తపతిగానెంచి, నియోగార్థము నీ సమీపమునకు వచ్చుచున్నది. నీవీమెకు సంతానము గల్గునట్లు (తస్యై ప్రజాం ద్రవిణం చేహ ధేహి) ధర్మపూర్వకముగ వీర్యదానమొనర్పుము. అందువలన నామె సంతానవతియై యానందము ననుభవించును. అట్లే యొక పురుషుడు భార్యచనిపోయిన తదుపరి సంతానమపేక్షించి నియోగమొనర్చి యతనికొఱకై సంతానమును గనుట కంగీకరింపవలెను. వేదము ద్వారమున పరమేశ్వరుడు మానవులకిది ధర్మముగా బోధించి, యాజ్ఞాపించియున్నాడు. ఇట్టి విధులను విడిచి స్త్రీ పురుషులెన్నడును వ్యభిచారాదుల నొనరింపరాదు. ధర్మపూర్వకముగ వివాహము చేసికొనియు, విధవావిధురులు నియోగము మూలముసను సంతానము గనవలెను. ౨

(ఉదీర్ష్వ నారి) ఓ స్త్రీ ! నీవు నీ మృతపతిని విడిచి (అభిజీవలోకం) యీ జీవలోకమునందు, (ఏతముపశేష ఏహి )సంతానము కావలెనని కోరికయున్న పక్షమున మఱియొక పురుషునితో నియోగమొనర్చి సంతానముం బడయుము. సంతానేచ్ఛ లేనిపక్షమున బ్రహ్మచర్యవ్రతము పూని కన్యలకుగాని, స్త్రీలకుగాని చదువు జెప్పుచునుండుము. ఇతర సత్కార్మల నాచరింపుము. నియోగము ద్వారమున సంతానముం బడయుదువేని యా సంతానము (హస్తగ్రాభస్య) వివాహమున నీచేతిని గ్రహించిన పతిదే యగును. నీతో నియోగముచేసిన పతికొఱకు నీవు సంతానము గందువేని యా సంతానము (దిధిషోః) నియుక్తపతిది యగును. (తవేదం జనిత్వం) ఓ విధవా ! ఇదియే నీ సంతానము. వివాహితస్త్రీ చనిపోయిన పురుషుని కొఱకును (ఉదీర్ష్వ) విధవవైన నీవు నియోగము ద్వారమున సంతానముం బడసి యతని కొసంగి సుఖముగ నుండుము.

సం॥ "ఇమాం త్వమింద్ర మీఢ్వః సుపుత్రాం సుభగాం కృణు,
దశాస్యాం పుత్రానాధేహి పతిమేకాదశం కృధి " ౪ ఋ. ౮-౩-౨౭-౫

ఇదానీం నియోగస్య సంతానోత్పత్తేశ్చ పరిగణనం క్రియతే. కతివారం నియోగః కర్తవ్యః, కియంతి సంతానాని చోత్పాద్యానీతి ? తద్యథా:-

(ఇమాం త్వ మింద్ర) హే ఇంద్ర వివాహితపతే ! (మీఢ్వః) హే వీర్యదానకర్తః ! త్వమిమాం వివాహితస్త్రియం వీర్యసేకేన గర్భయుక్తాం కురు. తాం (సుపుత్రీం) శ్రేష్ఠపుత్రవతీం (సుభగాం) అనుత్తమ సుఖయుక్తాం (కృణు) కురు. (దశాస్యాం) అస్యాం వివాహిత స్త్రియాం దశపుత్రా నాధేహి ఉత్పాదయ; నాతోఽధికమితి. ఈశ్వరేణ దశసంతానోత్పాదనస్యై వాజ్ఞా పురుషాయ దత్తేతి విజ్ఞేయమ్. తథా (పతిమేకాదశం కృధి) హే స్త్రీ ! త్వం వివాహితపతిం గృహీత్వైకాదశ పతిపర్యంతం నియోగం కురు, అర్థాత్ కస్యాంచిదాపత్కాలావస్థాయాం ప్రాప్తాయా మేకైకస్యాభావే సంతానోత్పత్త్యర్థం దశమ పురుష పర్యంతం నియోగం కుర్యాత్. తథా పురుషోఽపి వివాహితస్త్రియాం మృతాయాం సత్యాం సంతానాభావే ఏకైకస్యా అభావే దశమ్యా విధవయా సహ నియోగం కరోతు; ఇతీచ్ఛా నాస్తి చేన్మా కురుతామ్. ౪

తె॥ స్త్రీపురుషులెన్నిమాఱులు నియోగమును చేయవచ్చును ? ఎంత సంతానమును బడయవచ్చును? అను విషయమిట వ్రాయబడుచున్నది.

(ఇమాం) అను నీ మంత్రమున నీశ్వరుడిట్లుపదేశించుచున్నాడు. (ఇంద్ర) ఐశ్వర్య యుక్తుడవగు నో వివాహిత పురుష(త్వం ఇమాం మీఢ్వ) నీవు నీ వివాహితస్త్రీయందు వీర్యదానమొనర్చిగర్భవతి నొనర్పుము. (సుపుత్రాం సుభగాం కృణు) సుపుత్రులు గలదిగ, సౌభాగ్యవతిగ నొనర్పుము. (దశాస్యాం పుత్రానాధేహి) వివాహిత స్త్రీయందు పదివఱకు సంతానమును గనుము. అంతకుమించి కనవలదు. (పతిం ఏకాదశం కృధి) ఓ స్త్రీ ! నీవును నీ వివాహితపతిని కలుపుకొని పదునొకండుగురు పతులు గలదానివి కమ్ము. ఒకడు వివాహితపతి యనియు, మిగిలిన పదిమంది నియుక్తపతులనియు భావము.

పతి చనిపోయినను, లేక భయంకరముగు రోగగ్రస్తుడై సంతానోత్పాదనకర్తుడు కాకపోయినను, స్త్రీ తనకు సంతానేచ్ఛయున్న పక్షమున విధురుడైన పురుషునితో నియోగమొనర్చి సంతానము గనవచ్చును. అతడొక నియుక్తపతి యగును. అతడును చనిపోయినను, లేక రోగగ్రస్తుడైనను నట్టి యాపత్కాలమున మూడవవానితోనియోగముచేసి సంతానము గనవచ్చును. ఇట్లే సంకటకాలమున పదిమంది వఱకు నియుక్తపతుల సంఖ్య పెరుగవచ్చునని యభిప్రాయము. కాని, ఒక సమయమున ననేకులు నియుక్తపతు లుండరాదు. ఇట్లే పురుషుడును వివాహితస్త్రీ చనిపోయిన తదుపరి బ్రహ్మచర్యమును నడపజాలక సంతానేచ్ఛ కలిగినపుడు నియోగము మూలమున మఱియొక విధవతో కలిసి సంతానముం బడయవచ్చును. ఆ విధవాస్త్రీ రుగ్ణయైనను, మరణించినను మఱియొక విధవతో సంతానముం గనవచ్చును. ఇట్లు క్రమముగ పదిమంది స్త్రీలతో నియోగ మొనర్పవచ్చును. స్త్రీపురుషుల కిట్టి యిచ్ఛగలిగినపుడే నియోగ మాచరణీయము. లేనియెడల నియోగము చేయవలయునను నియమము లేదు. ౪

*సం॥ "సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిద ఉత్తరః,*

*తృతీయో అగ్నిష్టే పతిస్తురీయస్తే మనుష్యజాః" ౫* *ఋ. ౮-౩-౨౭-౫*

*అథోత్తరోత్తరం పతీనాం సంజ్ఞా విధీయతే. (సోమః ప్రథమః) హే స్త్రీ ! యస్త్వాం ప్రథమః (వివిదే) వివాహితః పతిః ప్రాప్నోతి స సౌకుమార్యాది గుణయుక్తత్వాత్ సోమసంజ్ఞో భవతి. (గంధర్వో వి....) యస్తు (ఉత్తరః) ద్వితీయో నియుక్తః పతిర్విధవాం త్వాం వివిదే ప్రాప్నోతి స గంధర్వసంజ్ఞాం లభతే.*

*పూ. ప : కుతః ?*

*ఉ. ప : తస్య భోగాభిజ్ఞత్వాత్, (తృతీయో అ...) యేన సహ త్వం తృతీయవారం నియోగం కరోషి; సోఽగ్ని సంజ్ఞో జాయతే.*

*పూ. ప : కుతః ?*

*ఉ. ప: ద్వాభ్యాం పురుషాభ్యాం భుక్తభోగయా త్వయా సహనియుక్తత్వా దగ్ని దాహవత్తస్య శరీరస్థ ధాతవో దహ్యంత ఇత్యతః (తురీయః తే మనుష్యజాః) హే స్త్రీ ! చతుర్థ మారభ్య దశమ పర్యంతా స్తవ పతయః సాధారణ బలవీర్యత్వా న్మనుష్యసంజ్ఞా భవంతీతి బోధ్యమ్. తథైవ స్త్రీణామపి సోమ్యా, గంధర్వ్యా, ఆగ్నేయ్యా, మనుష్యజాః సంజ్ఞాస్తత్తద్ గుణయుక్తత్వాద్ భవంతీతి"*

తె॥ (సోమః ప్రథమో వివిదే) ఓ స్త్రీ ! మొదట నిన్ను వివాహమాడుపతి సోముడనబడును. అతడు సుకుమారుడై మృదుత్వాది గుణములు కలవాడై యుండును. (గంధర్వో వివిద ఉత్తరః) నియోగము

కొఱకు లభించు రెండవపతి గంధర్వుడనబడును. అతడు భోగమున నభిజ్ఞుడై యుండును. (తృతీయో అగ్నిష్టేపతిః) నియోగము ద్వారమున నగు మూడవపతి యగ్నిసంజ్ఞ కలవాడును. ఇరువురు నియుక్తపతులచే ననుభవింపబడిన స్త్రీవగు నీతో నియోగముచేయు పురుషుని దేహగతధాతువులు అగ్ని దాహముచే దగ్ధము చేయబడి నల్లగును. (తురీయస్తే మనుష్యజాః) నాల్గవవాని మొదలు పదవ పురుషునివఱకు సంభవించు నియుక్తపతులు సాధారణ బలవీర్యములు గలవారగుటచే మనుష్యులనబడుదురు. ఇట్లే స్త్రీలుకూడ నాయా గుణములతో గూడినవారై సౌమ్యా, గంధర్వీ, ఆగ్నాయీ, మనుష్యజా మున్నగు నామములు గల వారగుదురు.

౫

సం॥ "అదేవృఘ్న్యపతిఘ్నీ హైధి శివా పశుభ్యః సుయమా సువర్చాః, ప్రజావతీ వీరసూర్ దేవృకామా స్యోనేమ మగ్నిం గార్హపత్యం సపర్య" ౬ అథర్వ. ౧౪-౨-౧౮

(అదేవృఘ్న్యపతిఘ్నీ) హే అదేవృఘ్ని ! దేవరసేవికే ! హే అపతిఘ్ని ! వివాహితపతిసేవికే ! స్త్రీ ! త్వం (శివా) కల్యాణగుణయుక్తా (పశుభ్యః సుయమా సువర్చాః) గృహకృత్యేషు శోభన నియమయుక్తా గృహసంబంధి పశుభ్యో హితా, శ్రేష్ఠ కాంతివిద్యాసహితా, తథా (ప్రజావతీ వీరసూః) ప్రజాపాలనతత్పరా, వీరసంతానోత్పాదికా (దేవృకామా) నియోగేన ద్వితీయ వరస్య కామనావతీ (స్యోనా) సమ్యక్ సుఖయుక్తా సుఖకారిణీ సతీ (ఇమమగ్నిం గార్హపత్యం) గృహసంబంధిన మాహవనీయాదిమగ్నిం సర్వం గృహసంబంధి వ్యవహారం చ (సపర్య) ప్రీత్యా సమ్యక్ సేవయ.

అత్ర స్త్రియాః పురుషస్య చాపత్కాలే నియోగవ్యవస్థా ప్రతిపాదితాస్తీతి వేదితవ్యమ్. ఇతి.

ఇతి నియోగ విషయః సంక్షేపతః

---

తె॥ (అదేవృఘ్న్యపతిఘ్నీ) ఓ విధవాస్త్రీ, నీవు దేవరునకు, వివాహితపతికి సుఖము నిచ్చుదానవు. వారిక ప్రియమును నీవుకాని, నీ కప్రియము వారుకాని యేవిధముగను చేయకుందురుగాక ! (ఏధిశివా) ఇట్లే శుభకార్యముల నొనర్చుచు నెల్లపుడు సుఖమును పెంపుచేయుము. (పశుభ్యః సుయమా సువర్చాః) గృహ పశువులు మున్నగు ప్రాణులను రక్షించుచు, జితేంద్రియవై, ధర్మయుక్తములగు శ్రేష్ఠకార్యముల నాచరింపుము. విద్యారూపమగు నుత్తమతేజస్సును వర్ధిల్లజేయుము. (ప్రజావతీ వీరసూః) నీవు మంచి సంతానవంతురాల వగుము. గొప్ప గొప్ప వీరులం గనుము. (దేవృకామా) నీవు దేవరుని కామించుదానవు. నీవు వివాహితపతి మరణించినపుడు కాని, భయంకర రోగియైనపుడుకాని, లేక నపుంసకుడైనపుడు కాని, రెండవపతితో నియోగమొనర్చి సంతానము గనుము. (స్యోనేమ మగ్నిం గార్హపత్యం సపర్య) నీ యగ్నిహోత్రాది గృహకార్యములను సుఖకారిణివై యెల్లప్పుడు ప్రేమతో చేయుచుండుము. ౬

ఇట్లే విధవావిధురులునగు స్త్రీపురుషులిరువురును నాపత్కాలమున నియోగ ధర్మము ననుసరించి సంతానముం గనుడు. ఉత్తమోత్తమ వ్యవహారములను నెఱవేర్చుచుండుడు. భ్రూణహత్యలు, వ్యభిచారము మున్నగు నధర్మము లాచరింపకుడు. వేదవిహిత నియోగము ఆచరణీయమే. ఈ వ్యవస్థయే యన్నింటికంటె నుత్తమము.

నియోగవిషయము సమాప్తము

# అథ రాజప్రజాధర్మ విషయః సంక్షేపతః

సం॥ "త్రీణి రాజానా విదథే పురూణి పరి విశ్వాని భూషథః సదాంసి, అపశ్యమత్ర మనసా జగన్వాన్ వ్రతే గంధర్వాం అపి వాయుకేశాన్" ౧ ఋ. ౩–౨–౨౮–౧

"క్షత్రస్య యోనిరసి క్షత్రస్య నాభిరసి,మా త్వా హిగ్ంసీ న్మా మా హిగ్ంసీః" ౨ యజు.౨౦–౧

"యత్ర బ్రహ్మ చ క్షత్రం చ సమ్యంచౌ చరతః సహ,

తం లోకం పుణ్యం య (ప్ర) జ్ఞేషం యత్ర దేవాః సహాగ్నినా" ౩ యజు. ౨౦–౨౫

ఏషామభి:– అత్ర మంత్రేషు రాజధర్మో విధీయత ఇతి. యథా సూర్యచంద్రౌ రాజానౌ సర్వమూర్త ద్రవ్యప్రకాశకౌ భవత స్తథా సూర్యచంద్రగుణశీలౌ ప్రకాశ న్యాయయుక్తౌ వ్యవహారౌ త్రీణి సదాంసి (భూషథః) భూషయతోఽలంకురుతః (విదథే) తాభిః సభాభిరేవ యుద్ధే (పురూణి) బహూని విజయాదీని సుఖాని మనుష్యాః ప్రాప్నువంతి. తథా (పరివిశ్వాని) రాజధర్మాదియుక్తాభి స్సభాభిర్ విశ్వస్థాని సర్వాణి వస్తూని ప్రాణిజాతాని చ భూషయంతి సుఖయంతి.

ఇదమత్ర బోధ్యమ్ – ఏకా రాజార్యసభా; తత్ర విశేషతో రాజకార్యాణ్యేవ భవేయుః. ద్వితీయాఽఽర్య విద్యాసభా; తత్ర విశేషతో విద్యాప్రచారోన్నతీ ఏవ కార్యే భవతః. తృతీయాఽఽర్యధర్మసభా; తత్ర విశేషతో ధర్మోన్నతి రధర్మహాని శ్చోపదేశేన కర్తవ్యా. పరంత్వేతాస్తిస్ర స్సభాః సామాన్యే కార్యే మిలిత్వైవ సర్వానుత్తమాన్ వ్యవహారాన్ ప్రజాసు ప్రచారయేయురితి. యత్రైతాసు సభాసు ధర్మాత్మభిర్ విద్వద్భిః సారాసారవిచారేణ కర్తవ్యాకర్తవ్యస్య ప్రచారో నిరోధశ్చ క్రియతే; తత్ర సర్వాః ప్రజాః సదైవ సుఖయుక్తా భవంతి. యత్రైకో మనుష్యో రాజా భవతి; తత్ర పీడితాశ్చేతి నిశ్చయః.

(అపశ్యమత్ర) ఇదమత్రాహమపశ్యమ్. ఈశ్వరోఽభివదతి :– యత్ర సభయా రాజప్రబంధో భవతి తత్రైవ సర్వాభ్యః ప్రజాభ్యో హితం జాయత ఇతి. (వ్రతే) యో మనుష్యః సత్యాచరణే (మనసా) విజ్ఞానేన సత్యం న్యాయం (జగన్వాన్) విజ్ఞాతవాన్,స రాజసభామర్హతి, నేతరశ్చ (గంధర్వాన్) పూర్వోక్తాసు సభాసు గంధర్వాన్ పృథివీరాజపాలనాది వ్యవహారేషు కుశలాన్ (అపి వాయుకేశాన్) వాయువద్దూతప్రచారేణ విదితసర్వవ్యవహారాన్ సభాసదః కుర్యాత్. కేశాః సూర్యరశ్మయ స్తద్వత్ సత్యన్యాయ ప్రకాశకాన్, సర్వహితం చికీర్షూన్ ధర్మాత్మనః సభాసదః, స్థాపయితు మహ మాజ్ఞాపయామి; నేతరాం శ్చేతి–ఈశ్వరోపదేశః సర్వైర్ మంతవ్య ఇతి. ౧

(క్షత్రస్య యోనిరసి)హే పరమేశ్వర ! త్వం యథా క్షత్రస్య రాజవ్యవహారస్య యోనిర్ నిమిత్తమసి. తథా (క్షత్రస్య నాభిరసి) ఏవం రాజధర్మస్య త్వం ప్రబంధకర్తాఽసి. తథైవ నోఽస్మానపి కృపయా రాజ్యపాలన నిమిత్తాన్, క్షత్రధర్మ ప్రబంధకర్తౄంశ్చ కురు. (మా త్వా హిగ్ంసీ న్మా మా హిగ్ంసీః) తథాఽస్మాకం మధ్యాత్ కోఽపి జనస్త్వాం మా హింసీత్; అర్థాద్ భవంతం తిరస్కృత్య నాస్తికో మా భవతు, తథా త్వం మాం మా హింసీః; అర్థాన్మమ తిరస్కారం కదాచి న్మా కుర్యాః. యతో వయం భవత్సృష్టౌ రాజ్యాధికారిణ స్సదా భవేమ. ౨

(యత్ర బ్రహ్మ చ క్షత్రం చ) యత్ర దేశే బ్రహ్మ పరమేశ్వరో, వేదో వా బ్రాహ్మణో బ్రహ్మవిచ్చైతత్సర్వం బ్రహ్మ, తథా (క్షత్రం) శౌర్య ధైర్యాది గుణవంతో మనుష్యా శ్చైతౌ ద్వౌ (సమ్యంచౌ) యథావద్ విజ్ఞానయుక్తా వవిరుద్ధౌ (చరతః సహ) (తం లోకం) తం దేశం, (పుణ్యం) పుణ్యయుక్తం (యజ్ఞేషం) యజ్ఞకరణేచ్ఛావిశిష్టం విజానీమః, (యత్ర దేవాః సహాగ్నినా) యస్మిన్ దేశే విద్వాంసః పరమేశ్వరేణ అగ్నిహోత్రాది యజ్ఞానుష్ఠానేన చ సమవర్తంతే, తత్రైవ ప్రజాః సుఖిన్యో భవంతీతి విజ్ఞేయమ్. 3

తె॥ పై మంత్రముల యభిప్రాయము : ఈ మంత్రములలో రాజధర్మము విధింపబడినది. సూర్యచంద్రులు సర్వమూర్త ద్రవ్యములను ప్రకాశింపజేయునట్లు, సూర్యచంద్రులవంటి గుణస్వభావములు గలిగినట్టియు ప్రకాశము, న్యాయము గలిగినట్టియు ద్వివిధ వ్యవహారములు-మూడుసభలను (భూషథః) సుశోభితముచేయును. (విధతే) ఆ సభలతోనే యుద్ధమునందు, (పురూణి) విజయము మున్నగు బహుసుఖములను మనుష్యులు బొందుదురు. ఇట్లే వారు (విశ్వాని) రాజధర్మాదులతో గూడిన సభలతో నెల్లయెడల నెల్ల పదార్థములను బొంది, ప్రాణి సమూహమునకు సుఖము చేకూర్చుదురు. మువ్విధములగు సభలు :-౧. రాజార్యసభ. ఇందు విశేషించిరాజకార్యములే జరుగును. ౨. ఆర్యవిద్యాసభ. ఇందు ముఖ్యముగ విద్యాప్రచారము, దానియున్నతికి సంబంధించిన కార్యములునుండును. ౩.ఆర్యధర్మసభ. ఇందు మిక్కిలిగ నుపదేశము మూలమున ధర్మమునకున్నతి, అధర్మమునకు నాశము కలుగునట్లు వ్యవహరింపబడును. కాని, యీమూడు సభలును సామాన్య కార్యములలో కలిసియే ప్రజలలో సర్వోత్తమ వ్యవహారములను ప్రచారమొనర్పవలెను.

ఏ దేశమునందలి యీ సభలలో, ధర్మాత్ములైన విద్వాంసులు సారాసారములను విచారించి కర్తవ్య ప్రచారమును, అకర్తవ్య నిరోధమును జేయుదురో; ఆ దేశమునందలి ప్రజలు సతతము సుఖములను బొందుదురు. ఏదేశమున నొకవ్యక్తి రాజగునో యట ప్రజలు దుఃఖితులగుదురు. (అపశ్యమత్ర) 'సభలమూలమున రాజ ప్రబంధము జరుగుచోట ప్రజలకు హితము కలుగునని నే నెఱుగుదును' అని యీశ్వరోక్తి (వ్రతే) ఏమానవుడు సత్యాచరణమున (మనసా) విజ్ఞానముతో సత్యన్యాయమును (జగన్వాన్) ఎఱిగియున్నాడో యతడే రాజ్యసభకు యోగ్యుడగును. ఇతరుడుకాడు. (గంధర్వాన్) పూర్వోక్తసభలలో పృథివీరాజపాలనాది వ్యవహారములలో దక్షులును, (అపి వాయు కేశాన్) వాయువువలె దూతల మూలమున సర్వవ్యవహారముల నెఱిగినవారును నగు వ్యక్తులను సభాసదులుగ జేయవలెను. సూర్యకిరణములవలె సత్యమును, న్యాయమును ప్రకటించువారిని, నెల్లరికి హితము నపేక్షించు ధర్మాత్ములను సభాసదులుగ జేయవలయును; కాని యితరులను జేయరాదని యీశ్వరాజ్ఞ. దీని నెల్లరు పాలింపవలెను.

(క్షత్రస్య యోనిరసి) రాజ్యప్రదాతవగు నో పరమేశ్వర ! రాజ్యసుఖమునకు, రాజవ్యవహారమునకు నీవే పరమకారణము. (క్షత్రస్యానాభిరసి) నీవే రాజధర్మమునకు ప్రబంధకర్తవు; జీవనహేతువు; మమ్ముల నట్లే చేయుము. (మాం త్వాం హిగ్ంసీ న్మా మా హిగ్ంసీః) ఓ జగదీశ్వర ! ప్రజలెల్లరు నిన్ను విడిచి యితరుని తమకు రాజుగా నెన్నడు నంగీకరింపకుందురుగాక ! నిన్ను తిరస్కరించి నాస్తికులు కాకుందురుగాక! నీవును మేమును పరస్పరానుకూలముగ వర్తింతుముగాక ! నీ సృష్టియందు మేము రాజ్యాధికారుల మగుదుముగాక !

(యత్ర బ్రహ్మ చ క్షత్రం చ) ఏ దేశమున పరమేశ్వరుని వేదముల నుపాసించుచు నుత్తమ విద్వాంసులగు బ్రాహ్మణులు, శూరవీరులునగు క్షత్రియులు కలిసి రాజకార్యములను నెఱవేర్తురో యాదేశమే ధర్మముతోను, శుభకర్మములతోను గూడి సుఖమును బొందును.

(యత్ర దేవాః సహాగ్నినా) ఏ దేశమున నీశ్వరాజ్ఞా పాలనము, అగ్నిహోత్రాది సత్క్రియలుచేయు విద్వాంసులుందురో యాదేశము ఉపద్రవములు లేక యఖండరాజ్యమును నిత్యము ననుభవించును. ౩

సం॥ 'దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినోర్ బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యామ్. అశ్వినోర్ భైషజ్యేన తేజసే బ్రహ్మవర్చసా యాభిషించామి; ఇంద్రస్యేంద్రియేణ బలాయ శ్రియై యశసేఽభిషించామి'

౪ యజు. ౨౦-౪

(దేవస్య త్వా సవితుః) హే సభాధ్యక్ష ! స్వప్రకాశమానస్య, సర్వస్య జగత ఉత్పాదకస్య, పరమేశ్వరస్య (ప్రసవే) అస్యాం ప్రజాయాం. (అశ్వినోర్ బాహుభ్యాం) సూర్యాచంద్రమసోర్ బాహుభ్యాం బలవీర్యాభ్యాం, (పూష్ణో హస్తాభ్యాం) పుష్టికర్తుః ప్రాణస్య గ్రహణ దానాభ్యాం. (అశ్వినోర్ భైషజ్యేన) పృథివ్యంతరిక్షౌషధి సమూహేన సర్వరోగనివారకేణ సహ వర్తమానం త్వాం (తేజసే) న్యాయాది సద్గుణ ప్రకాశాయ, (బ్రహ్మవర్చసాయ) పూర్ణవిద్యాప్రచారాయ, (అభిషించామి) సుగంధజలైర్ మూర్ధని మార్జయామి.

(సరస్వత్యై భైషజ్యేన వీర్యాయాన్నాద్యాయాభిషించామి' ఇతి అధికః పాఠః అస్య భాష్యమ్ :- (సరస్వత్యై) సుశిక్షితాయై వాచే (భైషజ్యేన) భిషజా మౌషధీనాం భావేన (వీర్యాయ) పరాక్రమాయ (అన్నాద్యాయ) అత్తుం యోగ్యాయాన్నాద్యాయ (అభిషించామి) సర్వథా స్వీకరోమి")

తథా (ఇంద్రస్యేంద్రియేణ) పరమేశ్వరస్య పరమైశ్వర్యేణ విజ్ఞానేన చ (బలాయ) ఉత్తమ బలార్థం (శ్రియై) చక్రవర్తి రాజ్యలక్ష్మీ ప్రాప్త్యర్థం, (త్వాం)7(యశసే) అతిశ్రేష్ఠకీర్త్యర్థం చ (అభిషించామి) రాజధర్మపాలనార్థం స్థాపయామీతి - ఈశ్వరోపదేశః. ౪

తె॥ (దేవస్య త్వా సవితుః) సభాధ్యక్షుడు కాదగినవ్యక్తి నభిషేకించి, యతనితో నిట్లనవలెను. ఓ సభాధ్యక్ష! నీవు స్వయం ప్రకాశవంతుడు, సర్వజగత్తు నుత్పన్నము చేయువాడునగు పరమేశ్వరుని, (ప్రసవే) సృష్టిలో ప్రజాపాలన కొఱకు, (అశ్వినోర్ బాహుభ్యాం) సూర్యచంద్రుల బలవీర్యములతో (పూష్ణో హస్తాభ్యామ్) పుష్టినిచ్చు ప్రాణమును గ్రహించుటకును, దానముచేయుటకును సమర్థములగు హస్తములతో నిన్ను సభాధ్యక్షునిగ స్వీకరించుచున్నాము. (అశ్వినోర్ భైషజ్యేన) పరమేశ్వరుని ఉక్తి :- పృథివియందున్నట్టియు, అంతరిక్షమున నున్నట్టియు శుద్ధవాయ్వాద్యోషధులతో రాత్రింబవళ్ళుసర్వరోగ ములనుండియు నిన్ను ముక్తునిజేసి, (తేజసే) సత్యన్యాయ ప్రకాశార్థము, (బ్రహ్మవర్చసాయ) బ్రహ్మజ్ఞానముకొఱకు విద్యావృద్ధికొఱకు (సరస్వత్యై) బాగుగ శిక్షితమగు వాణికొఱకు (వీర్యాయ) పరాక్రమము కొఱకు, (అన్నాద్యాయ) తినదగిన యన్నాదులప్రాప్తి కొఱకును (అభిషించామి) అభిషేకము చేయుచున్నాను. మఱియు (ఇంద్రస్యేంద్రియేణ) పరమేశ్వరుని పరమైశ్వర్య విజ్ఞానముతోను, ఆజ్ఞా విజ్ఞానముతోను, (బలాయ) ఉత్తమ సేనకొఱకు, (శ్రియై) సర్వోత్తమ లక్ష్మికొఱకు, (యశసే) సర్వోత్తమకీర్తి ప్రాప్తికొఱకును, నేను (ఈశ్వరుడు) సభను నిర్మించుటకు మిమ్ముల నాజ్ఞాపించుచున్నాను. ఈ యాజ్ఞ రాజుయొక్కయు, ప్రజలయొక్కయు, వ్యవస్థకు సంబంధించినది. మానవులెల్లరు నీ విషయమును బాగుగ ప్రచార మొనర్పవలెను. ౪

సం॥ "కోఽసి కతమోఽసి కస్మై త్వా కాయ త్వా, సుశ్లోక సుమంగల సత్యరాజన్" ౫
యజు. ౨౦-౪

(కోఽసి) హే పరమాత్మన్ ! త్వం సుఖస్వరూపోఽసి, భవానస్మానపి సురాజ్యేన సుఖయుక్తాన్ కరోతు (కతమోఽసి) త్వమత్యంతానందయుక్తోఽసి. అస్మానపి రాజసభాప్రబంధేనాత్యంతానందయుక్తాన్ సంపాదయ (కస్మై త్వా) అతో నిత్యసుఖాయ త్వా మాశ్రయామః. తథా (కాయ త్వా) సుఖరూపరాజ్యప్రదాయ త్వా ముపాస్మహే. (సుశ్లోక) హే సత్యకీర్తే ! (సుమంగల) హే సుష్ఠుమంగలమయ సుమంగలకారక! (సత్యరాజన్) హే సత్యప్రకాశక ! సత్యరాజ్యప్రద ! ఈశ్వర ! అస్మద్రాజసభాయా భవానేవ మహా రాజాధిరాజోఽస్తీతి వయం మన్యామహే. ౫

తె॥ ఓ మహారాజేశ్వర ! నీవు (కోసి కతమోసి) సుఖ స్వరూపుడవు, అత్యంతానంద కారకుడవు. సురాజ్యము ద్వారమున మమ్ములనుగూడ సర్వానంద యుక్తుల నొనర్పుము. (సుశ్లోక !) ఓ సత్య యశస్వీ! సర్వోత్తమకీర్తిప్రదాత ! (సుమంగల) శోభనమంగలరూప ! ఆనందదాతవగు నోజగదీశ్వర ! (సత్యరాజన్) సత్యస్వరూప ! సత్యప్రకాశక ! మాకు రాజావు నీవే, సర్వ సుఖముల నొసంగువాడవు నీవే. (కస్మై త్వా కాయ త్వా) మిక్కిలి సుఖముకొఱకు, శ్రేష్ఠమగు నానందము కొఱకు, మేము నీ శరణు జొచ్చితిమి. మాకు పూర్ణరాజ్యము, సుఖము నిస్సందేహముగ నీ వలననే లభింపగలదు. ౫

సం॥ "శిరో మే శ్రీర్యశో ముఖం త్విషిః కేశాశ్చ శ్మశ్రూణి,
రాజా మే ప్రాణో అమృతగ్ం సమ్రాట్ చక్షుర్ విరాట్ శ్రోత్రమ్" ౬ యజు. ౨౦-౫

సభాధ్యక్ష ఏవం మన్యేత (శిరో మే శ్రీః) రాజ్యశ్రీర్ మే మమ శిరోవత్. (యశో ముఖం) ఉత్తమకీర్తిర్ ముఖవత్ (త్విషిః కేశాశ్చ శ్మశ్రూణి) సత్యన్యాయదీప్తిః మమ కేశశ్మశ్రువత్. (రాజా మే ప్రాణః) పరమేశ్వరః శరీరస్థో జీవనహేతుర్ వాయుశ్చ మమ రాజవత్. (అమృతగ్ం సమ్రాట్) మోక్షాఖ్యం సుఖం, బ్రహ్మ, వేదశ్చ సమ్రాట్ చక్రవర్తి రాజవత్. (చక్షుర్ విరాట్ శ్రోత్రమ్) సత్యవిద్యాది గుణానాం వివిధ ప్రకాశకరణం శ్రోత్రం చక్షుర్వత్, ఏవం సభాసదోఽపి మన్యేరన్. ఏతాని సభాధ్యక్షస్య సభాసదాం చాంగాని సంతీతి సర్వే విజానీయుః. ౬

తె॥ సభాధ్యక్షుడు, సభాసదులు, ప్రజలు నీ క్రింది నిశ్చయము చేసికొనవలెను. (శిరో మే శ్రీః) రాజ్యలక్ష్మి నాకు శిరస్సువంటిది. (యశో ముఖం) ఉత్తమకీర్తి ముఖమువంటిది. (త్విషిః కేశాః శ్మశ్రూణి) సత్యగుణములయు, న్యాయముయొక్కయు దీప్తి నాకు కేశములు, గడ్డము మీసములు నను వీనికి సమానము. (రాజా మే ప్రాణః) అట్లే సర్వాధారుడగు నీశ్వరుడు, జీవన హేతువగు శరీరమున నుండు వాయువు నాకు ప్రాణప్రియుడగు రాజువంటివి. (అమృతం సమ్రాట్) అమృతరూపమగు బ్రహ్మము, మోక్షసుఖము, వేదము, అన్నియు చక్రవర్తిరాజు వంటివి. (చక్షుర్ విరాట్ శ్రోత్రమ్) బహు సత్య విద్యల ప్రకాశముతో గూడిన నా శ్రోత్రమే నాకు కన్ను. ఇవి యన్నియు సభాసదులకు, సభాధ్యక్షులకు నంగములని యెల్ల రెఱుగవలెను. ౬

సం॥ "బాహూ మే బలమింద్రియగ్ం హస్తౌ మే కర్మవీర్యమ్, ఆత్మా క్షత్ర మురో మమ" ౭
యజు. ౨౦-౭

(బాహూ మే బలం) యదుత్తమం బలం తన్మమ బాహువదస్తి. (ఇంద్రియగ్ం హస్తౌ) శుద్ధం. విద్యాయుక్తం మనః శ్రోత్రాదికం చ మమ గ్రహణ సాధనవత్. (కర్మ వీర్యం) యదుత్తమపరాక్రమధారణం తన్మమ కర్మవత్. (ఆత్మా క్షత్రమురో మమ) యన్మమ హృదయం తత్ క్షత్రవత్" ౭

తె॥ (బాహూ మే బలం) పూర్ణబలము నాకు భుజములు, (ఇంద్రియగ్ం హస్తౌ మే) శుద్ధ విద్యతో గూడిన యింద్రియములు, మనస్సు ఇవియన్నియు గ్రహణ సాధనములైన హస్తములవంటివి. (కర్మ వీర్యం) ఉత్తమపరాక్రమధారణమే నాకు కర్మము (ఆత్మా క్షత్ర మురో మమ) నా హృదయము, ఆత్మయు క్షత్రములు గాయము నుండి రక్షించునవి.

సం॥ "పృష్ఠీర్ మే రాష్ట్రముదర మగ్ంసౌ గ్రీవాశ్చ శ్రోణీ. ఊరూ అరత్నీ జానునీ విశో మేఽంగాని సర్వతః" ౮ యజు. ౨౦-౮

(పృష్ఠీర్ మే రాష్ట్రమ్) యద్రాష్ట్రం తన్మమ పృష్ఠభాగవత్, (ఉదరమగ్ంసౌ) యౌ సేనాకోశౌ స్తస్తత్కర్మ మమ హస్తమూలోదర వత్. (గ్రీవాశ్చ శ్రోణీ) యత్ ప్రజాయాః సుఖేన భూషితపురుషార్థి. కరణం తత్ కర్మ మమ నితంబాంగవత్, (ఊరూ అరత్నీ) యత్ ప్రజాయా వ్యాపారే గణితవిద్యాయాం చ నిపుణీకరణం తన్మమోర్వరత్న్యంగవదస్తి. (జానునీ విశో మేంగాని సర్వతః) యత్ ప్రజారాజసభయోః సర్వథా మేలరక్షణం తన్మమ కర్మ జానువత్. ఏవం పూర్వోక్తాని సర్వాణి కర్మాణి మమావయవవత్ సంతి. యథా స్వాంగేషు ప్రీతిస్తత్పాలనే పురుషస్య శ్రద్ధా భవతి, తథా ప్రజాపాలనే చ స్వకీయా బుద్ధిః సర్వైః కార్యేతి. ౮

తె॥ (పృష్ఠీర్ మే రాష్ట్రం) ఉత్తమరాజ్యము నాకు వెన్ను వంటిది. (ఉదరమగ్ంసౌ) రాజ్యసేన, కోశము బాహుమూలము, ఉదరముల వంటివి. (గ్రీవాశ్చ శ్రోణీ) ప్రజలను సుఖయుక్తులను, పురుషార్థపరులనుగ జేయుట కంఠము, పిరుదులకు సమానము. (ఊరూ అరత్నీ) ప్రజలను వ్యాపారమునందును, విద్యలలోను నిపుణులనుజేయుట అరత్ని (బాహుమధ్యమము) ఊరువులకును సమానము. (జానునీ) ప్రజకు, రాజ సభతో మైత్రికలిగి యుండునట్లు చేయుట మోకాళ్ళవంటిది. (విశో మేంగాని సర్వతః) ఇట్లు ప్రజాపాలనమున నుత్తమకర్మముల నొనర్చు వారందఱు నా యంగములకు సమానులు. మనుష్యులకు తన యంగములను కాపాడుటలో ప్రీతియు, శ్రద్ధయు నుండునట్లు ప్రజాపాలనమునను ధ్యానముంచవలెను. ౮

సం॥ "ప్రతిక్షత్రే ప్రతితిష్ఠామి రాష్ట్రే ప్రత్యశ్వేషు ప్రతితిష్ఠామి గోషు, ప్రత్యంగేషు ప్రతితిష్ఠామ్యాత్మన్ ప్రతిప్రాణేషు ప్రతితిష్ఠామి పుష్టే ప్రతి ద్యావాపృథివ్యోః ప్రతితిష్ఠామి యజ్ఞే" ౯ యజు. ౨౦-౧౦

(ప్రతిక్షత్రే ప్రతితిష్ఠామి రాష్ట్రే) అహం పరమేశ్వరో ధర్మేణ ప్రతీతే క్షత్రే ప్రతిష్ఠితో భవామి, విద్యాధర్మప్రచారితే దేశే చ. (ప్రత్యశ్వేషు) ప్రత్యశ్వం ప్రతిగాం చ తిష్ఠామి. (ప్రత్యంగేషు) సర్వస్య జగతోఽంగమంగం ప్రతితిష్ఠామి. తథా చాత్మానమాత్మానం ప్రతితిష్ఠామి. (ప్రతిప్రాణే) ప్రాణం ప్రాణం ప్రత్యేవం పుష్టం పుష్టం పదార్థం ప్రతితిష్ఠామి (ప్రతిద్యావాపృథివ్యోః) దివందివం ప్రతి పృథివీం పృథివీం ప్రతి చ తిష్ఠామి: (యజ్ఞే) తథా యజ్ఞం యజ్ఞం ప్రతితిష్ఠామ్యహమేవ సర్వత్ర వ్యాపకోఽస్మీతి. మామిష్టదేవం సమాశ్రిత్య యే రాజధర్మ మనుసరంతి, తేషాం సదైవ విజయాభ్యుదయౌ భవతః. ఏవం రాజపురుషైఽపి ప్రజాపాలనే సర్వత్ర న్యాయవిజ్ఞానప్రకాశో రక్షణీయో యతోఽన్యాయావిద్యావినాశః స్యాదితి. ౯

తె॥ (ప్రతిక్షత్రే ప్రతి తిష్ఠామి రాష్ట్రే) ఉత్తమపురుషులచే నేర్పడిన సభతో రాజ్యమును న్యాయ పూర్వకముగ పాలించు మానవుల నుద్దేశించి పరమేశ్వరు డనుచున్నాడు. ఓ మానవులార ! ధర్మాత్ములై మీరు న్యాయముతో రాజ్యమొనర్పుడు. ధర్మాత్ములయిన పురుషుల క్షాత్రధర్మమునందును, రాజ్యమునందును నేను (ఈశ్వరుడు) ప్రకాశితుడనగుదును; వారు నాకెల్లపుడు సమీపమున నుందురు. (ప్రత్యశ్వేషు ప్రతి తిష్ఠామి గోషు) వారిసేనలోని యశ్వములు, గోవులు మున్నగు పశువులలో నేను స్వసత్తాతో ప్రతిష్ఠితుడ నగుదును. (ప్రత్యంగేషు ప్రతి తిష్ఠామ్యాత్మన్) సమస్త సేనలోను, రాజాంగములందును, వారి యాత్మలందును నే నెల్లపుడు ప్రతిష్ఠితుడనై యుందును. (ప్రతి ప్రాణేషు ప్రతి తిష్ఠామి పుష్టే) వారి ప్రాణములందును, పుష్ట పదార్థములందును వ్యాపకుడనై యుందును. (ప్రతి ద్యావాపృథివ్యోః ప్రతి తిష్ఠామి యజ్ఞే) సూర్యాదులు ప్రకాశించు తావులందును అప్రకాశిత భూములందును, అశ్వమేధాది యజ్ఞములందును, వ్యాపకుడనగుటచే సమస్త జగత్తునందును ప్రతిష్ఠితుడనై యుందును. ఇష్టదేవుడనగు నన్నాశ్రయించి రాజధర్మమును పాలించువారికి సతతవిజయాభ్యుదయములు - శుభము ప్రాప్తించును. రాజపురుషులు నిట్లే న్యాయమును, విజ్ఞానమును ప్రకటింపవలెను. అందువలన నన్యాయము, నవిద్యయు నశించును. ౯

సం॥ "త్రాతారమింద్ర మవితారమింద్రగ్ం హవే హవే సుహవగ్ం శూరమింద్రమ్, హ్వయామి శక్రం పురుహూత మింద్రగ్ం స్వస్తి నో మఘవా ధాత్వింద్రః" ౧౦ యజు. ౨౦-౫౦

(త్రాతారమింద్రం) యం విశ్వస్య త్రాతారం రక్షకం పరమైశ్వర్య వంతం, (సుహవం శూర మింద్రం) సుహవం శోభనయుద్ధకారిణ మత్యంత శూరం, జగతో రాజాన మనంతబలవంతం, (శక్రం) శక్తిమంతం శక్తిప్రదం చ, (పురుహూతం) బహుభిః శూరైః సుసేవితం, (ఇంద్రం) న్యాయేన రాజ్యపాలకం, (ఇంద్రగ్ం హవే హవే)యుద్ధే యుద్ధే స్వవిజయార్థం ఇంద్రం పరమాత్మానం (హ్వయామి) ఆహ్వయామి ఆశ్రయామి. (స్వస్తి నో మఘవా ధాత్వింద్రః) స పరమధన ప్రదాతా ఇంద్రః సర్వశక్తిమానీశ్వరః సర్వేషు రాజ్యకార్యేషు నోఽస్మభ్యం (స్వస్తి ధాతు) నిరంతరం విజయసుఖం దధాతు . ౧౦

తె॥ (త్రాతారమింద్ర) సంపూర్ణ విశ్వరక్షకుడు, సర్వశక్తిమంతుడు, (సుహవం శూరమింద్రం) శోభనయుద్ధకర్త, అత్యంతశూరుడు, జగత్తునకు రాజు, అనంతబలయుక్తుడు, (శక్రం) శక్తియుక్తుడు, శక్తిప్రదుడు, (పురుహూతం) బహుశూరులచే సుసేవితుడు, (ఇంద్రం) న్యాయముతో రాజ్యమును పాలించువాడునగు, (ఇంద్రం హవే హవే) పరమేశ్వరుని నేను ప్రతియుద్ధమునందును విజయముకొఱకు (హ్వయామి) ఆహ్వానింతును-ఆశ్రయింతును. (స్వస్తి మఘవా ధాత్వింద్రః) పరమైశ్వర్యదాతయు, సర్వశక్తిమంతుడునగు నీశ్వరుడు సర్వరాజ్యకార్యములందును మాకు (స్వస్తి ధాతు) నిరంతర విజయ సుఖము నిచ్చుగాక ! ౧౦

సం॥ "ఇమం దేవా అసపత్నగ్ం సువధ్వం మహతే క్షత్రాయ మహతే జ్యైష్ఠ్యాయ మహతే జానరాజ్యాయేంద్రస్యేంద్రియాయ. ఇమ మముష్య పుత్ర మముష్యై పుత్రమస్యై విశ ఏష వోఽమీ రాజా సోమోఽస్మాకం బ్రాహ్మణానాగ్ం రాజా." ౧౧ యజు. ౯-౪౦

(దేవాః) హే దేవా విద్వాంసః సభాసదః ! (మహతే క్షత్రాయ) అతులరాజధర్మాయ, (మహతే జ్యైష్ఠ్యాయ) అత్యంత జ్ఞానవృద్ధవ్యవహార స్థాపనాయ (మహతే జానరాజ్యాయ) జనానాం విదుషాం మధ్యే పరమరాజ్యకరణాయ, (ఇంద్రస్యేంద్రియాయ) సూర్యస్య ప్రకాశవన్న్యాయవ్యవహారప్రకాశనా యాంధకార వినాశాయ (అస్యై విశే) వర్తమానాయై ప్రజాయై యథావత్ సుఖప్రదానాయ (ఇమం అసపత్నగ్ం

సువర్ధ్వమ్) ఇమం ప్రత్యక్షం శత్రూద్భవరహితం నిష్కంటకముత్తమ రాజధర్మం సువధ్వం ఈశిధ్వమైశ్వర్య సహితం కురుత. యూయమప్యేవం జానీత. (సోమోఽస్మాకం బ్రాహ్మణానాగ్ం రాజా) వేదవిదాం సభాసదాం మధ్యే యో మనుష్యః సోమ్యగుణసంపన్నః సకల విద్యాయుక్తోఽస్తి; స ఏవ సభాధ్యక్షత్వేన స్వీకృతః సన్ రాజాస్తు. హే సభాసదః ! (అమీ) యే ప్రజాస్థా మనుష్యాః సంతి తాన్ ప్రత్యప్యేవమాజ్ఞాశ్రావ్యా, (ఏష వో రాజా) అస్మాకం హే యుష్మాకం చ స సభాసత్. సోయం రాజసభావ్యవహార ఏవ రాజాస్తీతి. ఏతదర్థం వయం (ఇమమముష్య పుత్రమముష్యై పుత్రం) ప్రఖ్యాతనామ్నః పురుషస్య, ప్రఖ్యాత నామ్న్యాః స్త్రియాశ్చ సంతాన మభిషిచ్య అధ్యక్షత్వే స్వీకుర్మ ఇతి" ౧౧

తె॥ (ఇమం దేవా అసపత్నం) ఈశ్వరుడు మానవుల నెల్లర నుద్దేశించి రాజ్యవ్యవస్థా విషయమున నిట్లు ఆజ్ఞాపించుచున్నాడు.ఓ విద్వాంసులార ! మీ రీరాజధర్మమును సరిగా నెఱిగి మీ రాజ్యముపై శత్రువులెత్తి రాకుండునట్లు రాజ్యవ్యవస్థ నేర్పఱచుకొనుడు. (మహతే క్షత్రాయ) ఓ శూరులార ! వీరులార ! మీ క్షత్రియ ధర్మముకొఱకును, చక్రవర్తి రాజ్యముకొఱకును, శ్రేష్ఠమగు కీర్తికొఱకును, సర్వోత్తమ రాజ్యప్రబంధము కొఱకును (మహతే జానరాజ్యాయ) ప్రజలను విద్యాయుక్తులనుజేసి రాజ్యవ్యవస్థను నడపుటకును, (ఇంద్రస్యేంద్రియాయ) సూర్యప్రకాశమునకు సమానముగ నైశ్వర్యము, సత్యము న్యాయముతోగూడిన వ్యవహారమును ప్రకటించుటకును, అన్యాయాంధకారమును దొలగించుటకును, (సువధ్వం) మంచి రాజ్యవ్యవస్థ నేర్పఱచుకొనుడు. అందువలన నెల్లరకు నుత్తమసుఖము వర్థిల్లును. (సోమోఽస్మాకం బ్రాహ్మణానాం రాజా) వేదవిదులైన సభాసదులలో సౌమ్యగుణ సంపన్నుడై సర్వవిద్యాయుక్తుడైన వానిని సభాధ్యక్షుడుగా మీరెల్లరంగీకరించుడు. అతడే రాజు. ఓ సభాసదులార ! 'ఈ సభాసదుడు మా మీ రాజవ్యవహారములందు రాజుగా నుండును' అని ప్రజలకు వినిపింపుడు. కావున మనము (ఇమమముష్య పుత్రమముష్యైపుత్రం) ప్రసిద్ధనామముగల స్త్రీ పురుష సంతానమగు నితనిని రాజ్యమున నభిషిక్తుంజేసి రాజుగ - అధ్యక్షుడుగ - స్వీకరించుచున్నాము. ౧౧

సం॥ "ఇంద్రో జయాతి న పరా జయాతా అధిరాజో రాజసు రాజ యాతై,

చర్కృత్య ఈడ్యో వంద్యశ్చోపసద్యో నమస్యో భవేహ" ౧౨ అథ. ౨-౧౦-౯౮-౧

(ఇంద్రో జయాతి) స ఏవేంద్రః పరమేశ్వరః సభాప్రబంధో వా జయాతి విజయోత్కర్షం సదా ప్రాప్నోతు, (న పరాజయాతా) స మా కదాచిద్ పరాజయం ప్రాప్నోతు, (అధిరాజో రాజసు రాజయాతై) స రాజాధిరాజో విశ్వస్యేశ్వరః సర్వేషు చక్రవర్తి రాజసు మాండలికేషు వా స్వకీయసత్యప్రకాశ న్యాయేన సహాస్మాకం మధ్యే సదా ప్రసిద్ధ్యతామ్ (చర్కృత్యః) యో జగదీశ్వరః సర్వైర్ మనుష్యైః పునః పునరుపాసనా యోగ్యోఽస్తి, (ఈడ్యః) అస్మాభిః స ఏవైకః స్తోతుం యోగ్యః. (వంద్యశ్చ) పూజనీయః, (ఉపసద్యః) సమ్యాశ్రయితుం యోగ్యః (నమస్యః) నమస్కర్తుం యోగ్యోఽస్తి. (భవేహ) హే మహారాజేశ్వర! త్వముత్తమ ప్రకారేణాస్మిన్ రాజ్యే సత్కృతో భవ. భవత్ సత్కారేణ సహ వర్తమానా వయమప్యస్మిన్ చక్రవర్తి రాజ్యే సదా సత్కృతాభవేమ.

తె॥ (ఇంద్రో జయాతి) ఓ బంధువులార ! ఆ పరమాత్ముడుకాని, సభాప్రబంధముకాని యెల్లపుడును విజయము బొందుగాక !(న పరాజయాతా) ఎన్నడును పరాజయము నందకుండుగాక ! (అధిరాజః) ఆ మహారాజాధిరాజగు సర్వేశ్వరుడు, (రాజసు రాజయాతై) చక్రవర్తులలోను, మాండలిక రాజులలోను తన సత్య ప్రకాశముతోను, న్యాయముతోను మనలోకూడ నెల్లప్పుడు ప్రసిద్ధుడగుగాక ! (చర్ కృత్యః) ఆనంద

స్వరూపుడగు పరమేశ్వరుడు మనుష్యులచే నెల్లప్పుడు నుపాసింప యోగ్యుడై యున్నాడు. (ఈడ్యో వంద్యశ్చ) ఆ పరమేశ్వరుడొక్కడే స్తుతియించుటకును, నమస్కరించుటకును యోగ్యుడు. (ఉపసద్యో నమస్యః) అతడే మనకు శరణ్యుడు; నమస్కరింప యోగ్యుడును. (భవేహ) ఆ జగదీశ్వరుడు మనకు విజయము చేకూర్చువాడు; రక్షకుడు; న్యాయాధీశుడు; రాజు కావున మనమిట్లు ప్రార్థింతుము. ఓ పరమేశ్వర ! నీవు కృపతో మాయందఱకు రాజవగుము. మాచే సత్కరింపబడుము. మేముకూడ నీ సత్కారముతోబాటు రాజ్యాధికారులమై నీ రాజ్యమును సత్యన్యాయముతో సుశోభితము చేయుచు మేమును సత్కృతుల మగుదుముగాక ! ౧౨

సం॥ "త్వమింద్రాధిరాజః శ్రవస్యుస్త్వం భూరభిభూతిర్ జనానామ్

త్వం దైవీర్ విశ ఇమా విరాజా యుష్మత్ క్షత్రమజరం తే అస్తు" ౧౩

అథ. ౨-౧౦-౯౮-౨

(త్వమింద్రాధిరాజః శ్రవస్యుః) హే ఇంద్ర పరమేశ్వర ! త్వం సర్వస్య జగతోఽధిరాజోఽసి "శ్రవ ఇవాచరతీతి సర్వస్య శ్రోతా చ" స్వకృపయా మామపి తాదృశం కురు (త్వం భూరభి భూతిర్ జనానామ్) హే భగవన్ ! త్వం భూః సదా భవసి. యథా జనానా మభిభూతి రభీష్టస్యైశ్వర్యస్య దాతాసి తథా మామప్యనుగ్రహేణ కరోతు. (త్వం దైవీర్ విశ ఇమా విరాజా) హే జగదీశ్వర ! యథా త్వం దివ్యగుణ సంపన్నా వివిధోత్తమరాజపాలితాః ప్రత్యక్షవిషయాః ప్రజాః సత్యన్యాయేన పాలయసి తథా మామపి కురు. (యుష్మత్ క్షత్రమజరం తే అస్తు) హే మహారాజాధిరాజేశ్వర ! తవ యదిదం సనాతనం రాజధర్మయుక్తం నాశరహితం విశ్వరూపం రాష్ట్రమస్తి తదిదం భవద్దత్తమస్మాక మస్త్వితి యాచితః సన్నాశీర్ దదాతి; ఇదం మద్రచితం భూగోలాఖ్యం రాష్ట్రం యుష్మ దధీనమస్తు. ౧౩

తె॥ (త్వమింద్రాధిరాజః శ్రవస్యుః) ఓ పరమేశ్వరా ! నీవు సమస్త విశ్వమునకధిరాజవు; అప్పులవలె సత్యన్యాయము నుపదేశించువాడవు. అట్లే నన్నును జేయుము. (త్వం భూరభిభూతిర్ జనానామ్) ఓ భగవంతుడ ! నీవు నిత్యస్వరూపుడవు. సజ్జనులకు రాజ్యైశ్వర్యాదుల నొసంగువాడవు. అట్లే నన్నునుం జేయుము. (త్వం దైవీర్ విశ ఇమా విరాజా) ఓ జగదీశ ! నీవే యీ వివిధ ప్రజలను సత్యన్యాయముతో పాలింతువు; దివ్యగుణయుక్తులను జేయుదువు. కృపతో నన్ను నట్లేచేయుము. (యుష్మత్ క్షత్రమజరం తే అస్తు) ఓ పరమేశ్వర ! విశ్వరూపమగు నీరాజ్యమెల్లపుడు తరుణావస్థలో నుండునుగాక ! అందువలన నెల్లరకు వివిధ సుఖములు ప్రాప్తించుగాక ! ఇట్లు సత్యమగు ప్రేమతోను, పురుషార్థముతోను నీశ్వరుని భజించుచు, అతని యాజ్ఞలను పాలించువారి నీశ్వరుడు 'నాచే రచియింపబడిన యీ భూగోలరాజ్యము మీ యధీనమగుగాక !' అని యాశీర్వదించును. ౧౩

సం॥ "స్థిరా వః సంత్వాయుధా పరాణుదే వీలూ ఉత ప్రతిష్కభే

యుష్మాకమస్తు తవిషీ పనీయసీ మా మర్త్యస్య మాయినః" ౧౪ ఋ. ౧-౩-౧౮-౨

(స్థిరా వః) అస్యార్థః ప్రార్థనావిషయే ఉక్తః - ౧౪

తె॥ ఈ మంత్రార్థము ప్రార్థనా విషయమున వ్రాయబడినది. అందు చూడవచ్చును. ౧౪

సం॥ "తం సభా చ సమితిశ్చ సేనా చ" ౧౫ అథ. ౧౫-౨-౯-౨

(తం సభా చ) రాజసభా ప్రజా చ తం పూర్వోక్తం సర్వరాజాధిరాజం పరమేశ్వరం తథా సభాధ్యక్ష మభిషిచ్య రాజానం మన్యేత. (సమితిశ్చ) తమనుశ్రిత్యైవ సమితిర్ యుద్ధమాచరణీయమ్ (సేనా చ) తథా వీరపురుషాణాం యా సేనా సాపి పరమేశ్వరం, ససభాధ్యక్షాం సభాం న్యసేనానీం చానుశ్రిత్య యుద్ధం కుర్యాత్. ౧౫

తె॥ (తం సభా చ) ప్రజలు, రాజ సభయు పూర్వము చెప్పబడిన రాజుల కందఱకు రాజగు పరమేశ్వరు నెఱింగి సర్వసభలయందును సభాధ్యక్షుని కభిషేక మొనర్పవలెను. (సమితిశ్చ) పరమేశ్వరుని, సర్వోపకారకమగు ధర్మమును నాశ్రయించి, యుద్ధ మొనర్చుట మనుష్యులకును తగును. (సేనా చ) అట్లే వీరపురుషులచే నేర్పడిన సేనయు, పరమేశ్వరుని సేనాపతి, సభాధ్యక్షునితో గూడిన సభను, నాశ్రయించి ప్రజాపాలనము, యుద్ధము నాలోచించి చేయవలెను. ౧౫

సం॥ "ఇమం వీర మనుహర్షధ్వ ముగ్రమింద్రం సఖాయో అనుసంరభధ్వమ్, గ్రామజితం గోజితం వజ్రబాహుం జయంతమజ్మ ప్రమృణంత మోజసా" ౧౬ అథర్వ. ౬-౧౦-౯౭-౩

ఈశ్వరః సర్వాన్మనుష్యాన్ ప్రత్యుపదిశతి. (సఖాయః) హే సఖాయః ! (ఇమం వీరముగ్ర మింద్రం) శత్రూణాం హంతారం, యుద్ధకుశలం, నిర్భయం, తేజస్వినం ప్రతిరాజపురుషం తథేంద్రం పరమైశ్వర్యవంతం పరమేశ్వరం (అనుహర్షధ్వం) సర్వే యూయ మనుమోదయధ్వమ్ నీవం కృత్వైవ దుష్టశత్రూణాం పరాజయార్థం (అను సంరభధ్వం) యుద్ధారంభం కురుత. కథం భూతం తమ్ ? (గ్రామజితం) యేన పూర్వం శత్రూణాం సమూహో జితః (గోజితం) యేనేంద్రియాణి పృథివ్యాదికం చ జితం (వజ్రబాహుం) వజ్రః ప్రాణో బలం బాహుర్యస్య (జయంతం) జయం ప్రాప్నువంతం. (ప్రమృణంత మోజసా) ఓజసా బలేన శత్రూన్ ప్రకృష్టతయా హింసంతం, (అజ్మ) వయం తమాశ్రిత్య సదా విజయం ప్రాప్నుమః. ౧౬

తె॥ ఈశ్వరుడెల్ల మానవులకుపదేశించు చున్నాడు. (సఖాయః) ఓ బంధువులార ! (ఇమం వీరం) అనంతబలవంతుడగు పరమేశ్వరు నిష్టదేవునిగా నెంచి (అనుహర్ష ధ్వం) శూరులను, వీరులను సదానందమున నుంచుడు. (ఉగ్రమింద్రం) అత్యంతోగ్రుడగు పరమేశ్వరుని సహాయముతో నైకమత్యము కలవారై (అనుసంరభధ్వం) దుష్టులను యుద్ధమున జయించుటకు నుపాయములను వెదకుడు. (గ్రామజితం) సమస్త భూగోళమును జయించినట్టియు (గోజితం) ఎల్లరి మనస్సులను, ఇంద్రియములను జయించిన వాడును, (వజ్రబాహుం) ప్రాణము బాహువులుగా గలవాడును, (జయంతం) సర్వమును జయించువాడును నగు (అజ్మ) వాని నిష్టునిగా నెఱింగి, మనమతనిని రాజుగా నంగీకరింపవలెను. (ప్రమృణంత మోజసా) మఱియు అనంత పరాక్రమముతో దుష్టులను పరాజితులనుజేసి మనకు సుఖమునిచ్చు వాని నాశ్రయించి విజయమును బొందవలెను. ౧౬

సం॥ "సభ్య సభాం మే పాహి యే చ సభ్యాః సభాసదః ।

త్వయేద్గాః పురుహూత విశ్వమాయుర్ వ్యశ్నవమ్" ౧౭ అథ. ౧౯-౭-౫౫-౬

(సభ్య సభాం మే పాహి) హే సభాయాం సాధో పరమేశ్వర ! మే మమ సభాం యథావత్ పాలయ. "మ" ఇత్యస్మచ్ఛబ్ద నిర్దేశాత్ సర్వాన్ మనుష్యానిదం వాక్యం గృహ్ణాతీతి. (యే చ సభ్యాః సభాసదః) యే సభాకర్మసు సాధవశ్చతురాః సభాయాం సీదంతి తేఽస్మాకం పూర్వోక్తాం త్రివిధాం సభాం పాంతు

యథావద్ రక్షంతు. (త్వయేద్గాః పురుహూత) హే బహుభిః పూజిత పరమాత్మన్ ! త్వయా సహ యే సభాధ్యక్షాః సభాసదః, ఇద్గాః ఇతం రాజధర్మజ్ఞానం గచ్ఛంతి, త ఏవ సుఖం ప్రాప్నువంతి, (విశ్వమాయుర్ వ్యశ్నవమ్) ఏవం సభాపాలితోఽహం సర్వో జనః శతవార్షికం సుఖయుక్తమాయుః ప్రాప్నుయామ్" ౧౭

తె॥ (సభ్యసభాం మే పాహి) ఓ సభకు యోగ్యుడవగు పరమేశ్వర ! నీవు మా రాజసభను రక్షింపుము. (యే చ సభ్యాః సభాసదః) సభాకార్యములలో చతురులగు సభాసదులు నీ కృపవలన సభ్యతా యుక్తులై పూర్వము వర్ణింపబడిన త్రివిధములగు సభలను సత్యన్యాయముతో రక్షింతురుగాక ! (త్వయేద్గాః పురుహూత) ఎల్లరకు నుపాసింపదగు నోదేవ ! నీతోబాటు సభాధ్యక్షులు, సభాసదులు రాజధర్మజ్ఞానమును బొంది, వారు సుఖమును బొందుదురు. (విశ్వమాయుర్ వ్యశ్నవమ్) ఇట్లు సభామూలమున రక్షింపబడిన మేము నీ సహాయముతోనే నీ యాజ్ఞలను పాలింతుముగాక ! అందువలన నూఱువత్సరముల సంపూర్ణాయువు సుఖముగ ననుభవింతుముగాక ! ౧౭

సం॥ "జనిష్ఠా ఉగ్రః సహసే తురాయేతి సూక్తముగ్రవత్ సహస్వత్తత్ క్షత్రస్య రూపమ్.

మన్ద్ర ఓ జిష్ఠ ఇత్యోజస్వత్తత్ క్షత్రస్య రూపమ్" ౧

"బృహత్పృష్ఠమ్ భవతి, క్షత్రం వై బృహత్ క్షత్రేణైవ తత్ క్షత్రం సమర్ధయత్యథో క్షత్రం వై బృహదాత్మా యజమానస్య నిష్కేవల్యం తద్ యత్ బృహత్ పృష్ఠం భవతి" ౨

"బ్రహ్మ వై రథంతరం క్షత్రం బృహద్ బ్రహ్మణి ఖలు వై క్షత్రం ప్రతిష్ఠితం క్షత్రే బ్రహ్మ" ౩

"ఓజో వా ఇంద్రియం వీర్యం పంచదశ, ఓజః క్షత్రం వీర్యం, రాజన్యస్తదేనమోజసా క్షత్రేణ వీర్యేణ సమర్ధయతి. తద్భారద్వాజం భవతి భారద్వాజం వై బృహత్" ౪ ఐ. ౮-౧-౨-౩

ఇయం రాజధర్మవ్యాఖ్యా వేదరీత్యా సంక్షేపేణ లిఖితా. అతోఽగ్ర ఐతరేయ శతపథ బ్రాహ్మణాది గ్రంథరీత్యా సంక్షేపతో లిఖ్యతే. తద్యథా :

(జనిష్ఠా ఉగ్రః) రాజసభాయాం జనిష్ఠా అతిశయేన జనా విద్వాంసో ధర్మాత్మానః, శ్రేష్ఠప్రకృతీన్ మనుష్యాన్ ప్రతి, సదా సుఖదాః సౌమ్యా భవేయుః. తథా దుష్టాన్ ప్రత్యుగ్రో వ్యవహారో ధార్య ఇతికుతః? యద్ రాజకర్మాస్తి తద్ ద్వివిధం భవతి-ఏకం సహస్వద్, ద్వితీయ ముగ్రవత్, అర్థాత్ క్వచిద్దేశకాలవస్త్వనుసారేణ సహనం కర్తవ్యమ్. క్వచిత్తద్విపర్యయే రాజపురుషైర్ దుష్టేషూగ్రో దండో నిపాత నీయశ్చ ఏతత్ క్షత్రస్య ధర్మస్య స్వరూపం భవతి. తథా (మంద్ర ఓజిష్ఠః) ఉత్తమకర్మకారిభ్య ఆనందకరో, దుష్టేభ్యో దుఃఖప్రదశ్చాత్యుత్తమ వీరపురుష సేనాది పదార్థసామగ్ర్యా సహితో యో రాజధర్మోస్తి స చ క్షత్రస్య స్వరూపమస్తి.

(బృహత్ పృష్ఠం) యత్ క్షత్రం కర్మ తత్ సర్వేభ్యః కృత్యేభ్యో బృహన్ మహదస్తి, తథా పృష్ఠమర్థాన్నిర్బలానాం రక్షకం సత్ పునరుత్తమ సుఖకారకం భవతి. ఏతేనోక్తేన చక్షత్రరాజకర్మణా మనుష్యో రాజకర్మ వర్ధయతి; నాతోఽన్యథా క్షత్రధర్మస్య వృద్ధిర్భవితు మర్హతి. తస్మాత్ క్షత్రం సర్వస్మాత్ కర్మణో బృహద్ యజమానస్య ప్రజాస్థస్య జనస్య రాజపురుషస్య వా ఆత్మా-ఆత్మవదానంద ప్రదం భవతి. తథా సర్వస్య సంసారస్య నిష్కేవల్యం నిరంతరం కేవలం సుఖం సంపాదయితుం యతః సమర్థం భవతి, తస్మాత్తత్ క్షత్రకర్మ సర్వేభ్యో మహత్తరం భవతీతి. ౨

(బ్రహ్మ వై రథంతరం) బ్రహ్మశబ్దేన సర్వవిద్యాయుక్తో బ్రాహ్మణవర్ణో గృహ్యతే, తస్మిన్ ఖలు క్షత్రధర్మః ప్రతిష్ఠితో భవతి; నైవ కదాచిత్ సత్యవిద్యయా వినా క్షత్రధర్మస్య వృద్ధిరక్షణే భవతః; తథా (క్షత్రే బ్రహ్మ) రాజన్యే బ్రహ్మ-అర్థాత్ సత్యవిద్యా ప్రతిష్ఠితా భవతి. నైవాస్మాద్ వినా కదాచిద్ విద్యాయా వృద్ధిరక్షణే సంభవతః, తస్మాద్ విద్యారాజవ్యవహారౌ మిలిత్వైవ రాష్ట్ర సుఖోన్నతిం కర్తుం శక్నుత ఇతి. ౩

(ఓజో వా ఇంద్రియం) రాజపురుషైర్ బలపరాక్రమవంతీంద్రియాణి సదైవ రక్షణీయాని; అర్థాజ్జితేంద్రియతయైవ సదైవ వర్తితవ్యమ్. కుతః ! 'ఓజ ఏవ క్షత్రం; వీర్యమేవ రాజన్య' ఇత్యుక్తత్వాత్. తత్ర స్మాదోజసా క్షత్రేణ వీర్యేణ రాజన్యే నైనం రాజధర్మం మనుష్యః సమర్ధయతి, సర్వసుఖైరేధమానం కరోతి ఇదమేవ భారద్వాజం భరణీయం, బృహ దర్థాన్మహత్ కర్మాస్తీతి. ౪

తె॥ వేదమునందుజెప్పబడిన విధిననుసరించి రాజధర్మమిట సంక్షేపముగ వ్రాయబడినది, ఇకముందు ఐతరేయ శతపథ బ్రాహ్మణముల ననుసరించి సంక్షేపముగ వ్రాయుచున్నాము.

(జనిష్ఠా ఉగ్రః) రాజసభయందు విద్వాంసులు, ధర్మాత్ములునైన పురుషులుండవలెను. వారు శ్రేష్ఠ స్వభావముగల మనుజులకు సుఖము గలిగించువారై యుండవలెను. దుష్టుల విషయములో వారు కఠినచర్యలు తీసికొనవలెను. రాజకర్మము రెండు విధములుగ నుండును. ౧. సహస్వత్తు-దేశకాల వస్తువుల ననుసరించి, అక్కడక్కడ సహనము చూపుట ౨. ఉగ్రవత్తు - కొన్ని యెడల సహనమునకు విరుద్ధముగా దుష్టులకు, కఠోరదండన విధించుట. ఇట్లే (మంద్ర ఓజిష్ఠః) రాజధర్మము మంచిపనులుచేయువారికి నానంద ప్రదమును, దుష్టులకు దుఃఖప్రదమును కావలెను. ఉత్తమ వీరపురుషులు, సేన, మున్నగు పదార్థ సహితమై యుండవలెను. ఇదియే క్షత్రధర్మ స్వరూపము. ౧

(బృహత్ పృష్ఠం) క్షత్రధర్మము సర్వధర్మములకంటె నుత్తమము. నిర్బలులకది పృష్ఠము-రక్షకము ఉత్తమ సుఖములను మాటిమాటికి కలిగించునదియు నగును. ఉపర్యుక్తమగు క్షాత్రరాజధర్మము ద్వారమున మనుష్యుడు రాజకర్మమును వృద్ధిచేయును. అట్లు చేయకున్న క్షాత్రధర్మము వృద్ధినొందదు. కావున క్షత్రధర్మమన్ని కర్మములకంటె గొప్పది. యజమానునకు, ప్రజలలోనుండు ప్రతి మానవునకు, రాజ పురుషునకును నిది యాత్మవలె నానంద ప్రదమగును. ఇట్లే యీ క్షాత్రధర్మము సంపూర్ణ ప్రపంచమునకు నిరంతరము కేవలసుఖము నియ్యగలదు; కావున నిది యన్నింటికంటె గొప్పది. ౨

(బ్రహ్మ వై రథంతరం) ఇట 'బ్రహ్మ' శబ్దముచే సంపూర్ణ విద్యాయుక్త బ్రాహ్మణ వర్గము గ్రహింపబడును. దానియందే క్షాత్రధర్మము ప్రతిష్ఠితమై యున్నది. సత్యవిద్య లేనినాడు క్షాత్రధర్మము వర్ధిల్లదు; రక్షణయు జరుగనేరదు. ఇట్లే (క్షత్రే బ్రహ్మ) క్షాత్రధర్మమున సత్య విద్య ప్రతిష్ఠితమగును. క్షాత్రధర్మము లేక విద్యావృద్ధికాని, విద్యకు రక్షణకాని జరుగదు. కావున విద్యయు, రాజధర్మము రెండును కలిసి రాష్ట్రమున సుఖమునుపెంప సమర్థములగును. ౩

(ఓజో వా ఇంద్రియం) రాజపురుషులు తమ యింద్రియములను సదా బలపరాక్రమ యుక్తములుగా నుంచుకొనవలెను - జితేంద్రియులై యుండవలెను. ఓజస్సే క్షత్రము. వీర్యమే రాజన్యము. కావున మనుష్యుడు ఓజస్సు - క్షాత్రముతోను, వీర్యము రాజన్యముతోను రాజధర్మమును పెంపుచేయును. రాజ్యము సర్వసుఖములతోను వర్ధిల్లజేయును. కావున, నిది భారద్వాజము-భరణీయ ధర్మము, అన్నింటి కంటె నుత్తమము. ౪

సం॥ "తానహ మనురాజ్యాయ సామ్రాజ్యాయ, భౌజ్యాయ స్వారాజ్యాయ, వైరాజ్యాయ పారమేష్ఠ్యాయ రాజ్యాయ మహారాజ్యాయాధిపత్యాయ స్వావశ్యాయాతిష్ఠాయాం రోహామీతి" ౫

"నమో బ్రహ్మణే నమో బ్రహ్మణే నమో బ్రహ్మణ ఇతి త్రిష్కృత్వో బ్రహ్మణే నమస్కరోతి. బ్రహ్మణ ఏవ తత్క్షత్రం వశమేతి తద్యత్ర వై బ్రహ్మణః క్షత్రం వశమేతి తద్రాష్ట్రం సమృద్ధం తద్వీర వదాహాస్మిన్ వీరో జాయతే" ౬
ఐ. ౮–౨–౬–౯

(తానహమనురాజ్యాయ) సర్వే మనుష్యా ఏవ మిచ్ఛాం కృత్వా పురుషార్థం కుర్యుః. పరమేశ్వరాను గ్రహేణాహ మనురాజ్యాయ సభాధ్యక్షత్వ ప్రాప్తయే, తథా మాండలికానాం రాజ్ఞా ముపరి రాజసత్తా ప్రాప్తయే (సామ్రాజ్యాయ) సార్వభౌమ రాజ్యకరణాయ (భౌజ్యాయ) ధర్మన్యాయేన రాజ్యపాలనాయ, ఉత్తమభోగాయ చ (స్వారాజ్యాయ) స్వస్మై రాజ్యప్రాప్తయే, (వైరాజ్యాయ) వివిధానాం రాజ్ఞాం మధ్యే మహత్త్వేన ప్రకాశాయ (పారమేష్ఠ్యాయ) పరమరాజ్య స్థితయే, (మాహారాజ్యాయ) మహారాజ్య సుఖభోగాయ, తథా (ఆధిపత్యాయ) అధిపతిత్వకరణాయ, (స్వావశ్యాయ) స్వార్థప్రజావశత్వ కరణాయ చ, (అతిష్ఠాయాం) అత్యుత్తమా విద్వాంసస్తిష్ఠంతి యస్యాం సా అతిష్ఠా సభా, తస్యాం సర్వైర్ గుణైః సుఖైశ్చ రోహామి వర్ధమానో భవామీతి. ౫

(నమో బ్రహ్మణే) పరమేశ్వరాయ త్రివారం చతుర్వారం వా నమస్కృత్య రాజకర్మారంభం కుర్యాత్. యత్ క్షత్రం బ్రహ్మణః పరమేశ్వరస్య వశమేతి, తద్రాష్ట్రం సమృద్ధం సమ్యక్ బుద్ధియుక్తం వీరవద్ భవతి, తస్మిన్నేవ రాష్ట్రే వీరపురుషో జాయతే, నాన్యత్రే త్యాహ పరమేశ్వరః. ౬

తె॥ (తానహమనురాజ్యాయ) మనుష్యులెల్లరు నిట్లుకోరి పురుషార్థ మొనరింపవలెను. పరమేశ్వరుని కృపవలన నేను సభాధ్యక్షతను బొందుటకును, మాండలికరాజులమీద రాజసత్తా ప్రాప్తికొఱకును, (సామ్రాజ్యాయ) సార్వభౌమ రాజ్యమొనర్చుటకును. (భౌజ్యాయ) ధర్మన్యాయముతో రాజ్యపాలనకును నుత్తమ భోగము కొఱకును, (స్వారాజ్యాయ) తనకు రాజ్యము ప్రాప్తించుటకును, (వై రాజ్యాయ) నానావిధ రాజులమధ్య మిక్కిలి ప్రసిద్ధి బొందుటకును (పారమేష్ఠ్యాయ) పరమరాజ్యప్రాప్తి కొఱకును, (మహారాజ్యాయ) గొప్ప రాజ్యమున సుఖము ననుభవించుటకును, (ఆధిపత్యాయ) ఆధి పత్యము బొందుటకును (స్వావశ్యాయ) ప్రజలను తనవశము చేసికొనుటకును, (అతిష్ఠాయాం) విద్వాంసులతోగూడిన సభలో నేను సర్వగుణములతోను, సుఖములతోను వృద్ధి బొందుదును గాక ! ౫

(నమో బ్రహ్మణే) పరమేశ్వరునకు పలుపర్యాయములు నమస్కరించి, రాజకర్మము నారంభింపవలెను. ఎటక్షత్రధర్మము పరమేశ్వరుని యధీనమున నుండునో యట రాష్ట్రమంతయు సమృద్ధితోను, వీరపురుషులతోను కూడియుండును. ఆ రాష్ట్రమునందే వీరపురుషులుద్భవింతురని పరమేశ్వరోక్తి. ౬

సం॥ "స ప్రజాపతికా, అయం వై దేవానామోజిష్ఠో బలిష్ఠః సహిష్ఠః సత్తమః పారయిష్ణుతమ ఇమమే వాభిషించామహా ఇతి తథేతి తద్వై తదింద్రమేవ" ౭

"సమ్రాజం సామ్రాజ్యం భోజం భోజపితరం స్వరాజం స్వారాజ్యం విరాజం వైరాజ్యం రాజానం రాజపితరం పరమేష్ఠినం పారమేష్ఠ్యం క్షత్రమజని క్షత్రియోఽజని విశ్వస్యభూతస్యాధిపతి రజని విశామత్తాజని పురాం భేత్తాఽజన్యసురాణాం హంతాఽజని బ్రహ్మణో గోప్తాఽజని ధర్మస్య గోప్తాఽజనీతి" ౮
ఐ. ౮–౧౨

(స ప్రజాపతికా) సర్వే సభాసదః ప్రజాస్థ మనుష్యాః స్వామినే ష్టేన పూజ్యతమేన పరమేశ్వరేణైవ సహవర్తమానా భవేయుః. సర్వే మిలిత్వైవం విచారం కుర్యుర్ యతో న కదాచిత్ సుఖహానిపరాజయౌ స్యాతామ్. యో దేవానాం విదుషాం మధ్యే (ఓజిష్ఠః) పరాక్రమ వత్తమః. (బలిష్ఠః) సర్వోత్కృష్ట బలసహితః, (సహిష్ఠః) అతిశయేన సహనశీలః, (సత్తమః) సర్వైర్గుణైరత్యంత శ్రేష్ఠః, (పారయిష్ణుతమః) సర్వేభ్యో యుద్ధాది దుఃఖేభ్యోఽతిశయేన సర్వాంస్తారయితృతమో విజయకారకతమోఽస్మాకం మధ్యే శ్రేష్ఠతమోఽస్తీతి. వయం నిశ్చిత్య తమేవ పురుషమభిషించామ ఇతి – ఇచ్ఛేయుః. తథైవ ఖల్వస్త్వితి సర్వే ప్రతిజానీయుః ఏవం భూతస్యోత్తమ పురుషస్యాభిషేక కరణం సర్వైశ్వర్య ప్రాపకత్వాదింద్రమిత్యాహుః. ౭

(సమ్రాజం) ఏవం భూతం సార్వభౌమ రాజానం (సామ్రాజ్యం) సార్వభౌమ్యరాజ్యం, (భోజం) ఉత్తమభోగ సాధకం (భోజపితరం) ఉత్తమ భోగానాం రక్షకం, (స్వరాజం) రాజకర్మసు ప్రకాశమానం సద్విద్యాది గుణైస్స్వహృదయే దేదీప్యమానం (స్వారాజ్యం) స్వకీయ రాజ్యపాలనం (విరాజం) వివిధానాం రాజ్ఞాం ప్రకాశకం (వైరాజ్యం) వివిధ రాజ్య ప్రాప్తికరం (రాజానం) శ్రేష్ఠైశ్వర్యేణ ప్రకాశమానం. (రాజపితరం) రాజ్ఞాంరక్షకం. (పరమేష్ఠినం) పరమోత్కృష్టే రాజ్యేస్థాపయితుం యోగ్యం (పారమేష్ఠ్యం) పరమేష్ఠి సంపాదితం సర్వోత్కృష్టం పురుషం వయమభిషించామహే, ఏవ మభిషిక్తస్య పురుషస్య సుఖయుక్తం క్షత్రమజని ప్రాదుర్భవతీతి.

అజనీతి "ఛందసి లుఙ్లఙ్లిట"ఇతి వర్తమానకాలే లుఙ్(క్షత్రియోఽజని). తథా క్షత్రియో వీర పురుషః (విశ్వ) సర్వస్య ప్రాణి మాత్రస్యాధిపతిః సభాధ్యక్షః (విశామత్తా) దుష్ట ప్రజానామత్తా వినాశకః (పురాం భేత్తా) శత్రునగరాణాం వినాశకః (అసురాణాం హంతా) దుష్టానాం హంతా హననకర్తా, (బ్రహ్మణో) వేదస్య రక్షకః (ధర్మస్యగో) ధర్మస్య చ రక్షకోఽజని ప్రాదుర్ భవతీతి. ౮

తె॥ ఏ రాజ్యము పరమేశ్వరాధీనమున నుండునో, విద్వాంసుల ప్రబంధమున నడచునో యారాజ్యము సర్వసుఖ కారక పదార్థముల తోను, వీర పురుషులతోను నత్యంతము ప్రకాశించును. ( స ప్రజాపతికా) సర్వ సభాసదులు, ప్రజలును స్వామియు, నిష్టుడు, పూజ్యతముడువగు పరమేశ్వరునితో నుండవలెను. పరమేశ్వరుని లక్ష్యమున నుంచుకొన వలెనని భావము. ఎల్లరును కలిసి తమకు చిన్న హానియు, పరాజయము కలుగ కుండునట్లు ఆలోచింపవలెను.

ఆ విద్వాంసులు అద్వితీయుడగు పరమేశ్వరునే యుపాసింతురు. ఆ యద్వితీయ పరమేశ్వరుడే దేవుడు. విద్వాంసులలో (ఓజిష్ఠః) అనంత విద్యాయుక్తుడనియు, (బలిష్ఠః) అపార బలవంతుడనియు, (సహిష్ఠః) అత్యంత సహన స్వభావము గలవాడనియు (సత్తమః) సర్వోత్తముడనియు, వర్ణింపబడియున్నాడు. అతడే (పారయిష్ణుతమః) యుద్ధాది దుఃఖముల నుండియు మనలను దాటింపజేసి, జయాది సర్వ సుఖములను ప్రసాదించును. అతనినే మనము మన రాజ్యమునందును, సభయందును నభిషేకించి న్యాయకర్తయైన రాజుగ నంగీకరింతుము. అతడే యింద్రుడు-పరమైశ్వర్యయుక్తుడు. ౮

అతడే మనకు సమ్రాట్టు – చక్రవర్తి – రాజు అతడే మనకు చక్రవర్తి రాజ్యము నొసంగువాడు. తండ్రివలె సర్వ విధముల నతడే మనలను పాలించువాడు. (స్వరాజం) రాజకర్మములందు ప్రకాశించు వాడును, సద్విద్యాది గుణములచే హృదయమున దీపించువాడును, (స్వారాజ్యం) స్వరాజ్యపాలన మొనర్చువాడును, (విరాజం) వివిధ రాజులను ప్రకాశింపజేయువాడును, (వైరాజ్యం) వివిధ రాజ్యముల

నిచ్చువాడు. అతనినే మనము రాజుగను, రాజులకందఱకు తండ్రిగను నంగీకరింతుము. అతడే పరమేష్ఠి. సర్వోత్తమ రాజ్యదాతయు (పారమేష్ఠ్యం) పరమేశ్వర నిర్మిత శ్రేష్ఠ పురుషుని రాజ్యమున నభిషిక్తుం జేయుదము. అట్టి పురుషుని క్షాత్రధర్మము సుఖయుక్తమగును. అతని కృప వలననే నేను క్షత్రియుడను రాజ్యమును ప్రసిద్ధ మొనర్చితిని. సర్వ ప్రాణులకు నధిపతినైతిని. అట్లే దుష్ట ప్రజల సంహారము, దుష్టుల నగర భేదనము, బందిపోటు దొంగల తాడనము, వేద విద్యాపాలనము, ధర్మ రక్షణము చేయగలిగితిని. అజని-ప్రాదుర్భూతుడనైతిని. "ఛందసి లుఙ్, లఙ్ లిటః అనుపాణిని సూత్రము ననుసరించి వర్తమాన కాలమున లుఙ్ లకారము. ౯

సం॥ "స పరమేష్ఠీ ప్రాజాపత్యోఽభవత్" ౯. ఐ. ౮-౩-౧౪

(స పరమేష్ఠీ ప్రా) స రాజధర్మ : సభాధ్యక్షాది మనుష్యై : (ప్రాజా పత్యః) అర్థాత్ పరమేశ్వర ఇష్టః కరణీయః, న తద్భిన్నోఽర్థః కేనచిత్ మనుష్యేణేష్టః కర్తుం యోగ్యోఽస్త్యతః సర్వే మనుష్యాః పరమేశ్వర పూజకా భవేయుః. ౯

తె॥ (స పరమేష్ఠీ ప్రాజా) సర్వ సాధారణ మనుజులు, సభాధ్యక్షాదులును పరమేశ్వరునే తమకిష్టునిగా నెంచ వలెను. అతనినే పూజింపవలెను. ఇదియే రాజధర్మము. ౯

సం॥ "స ఏతేనైంద్రేణ మహాభిషేకేణాభిషిక్తః క్షత్రియః సర్వాజితీర్ జయతి, సర్వాన్ లోకాన్ విందతి. సర్వేషాం రాజ్ఞాం శ్రైష్ఠ్య ప్రతిష్ఠాం పరమతాం గచ్ఛతి, సామ్రాజ్యం భౌజ్యం స్వారాజ్యం వైరాజ్యం పారమేష్ఠ్యం రాజ్యం మాహారాజ్య మాధిపత్యం జిత్వాఽస్మిన్ లోకే స్వయం భూః స్వరాడమృతోఽముష్మిన్‌త్స్వర్గే లోకే సర్వాన్ కామానాప్త్వాఽ మృతః సంభవతి; యమేతే నైంద్రేణ మహాభిషేకేణ క్షత్రియం శాపయిత్వాఽభిషించతి. ౧౦ ఐత. ౮-౪-౧౯

యో మనుష్యో రాజ్యం కర్తు మిచ్ఛేత్ స (ఏతేనైంద్రేణ) పూర్వోక్తేన సర్వైశ్వర్య ప్రాప్తినిమిత్తేన (మహాభిషేకేణ) అభిషిక్తః స్వీకృతః (క్షత్రియః) క్షత్రధర్మవాన్ (సర్వా) సర్వేషు యుద్ధేషు జయతి, సర్వత్ర విజయం తథా సర్వానుత్తమాంల్లోకాంశ్చ విదంతి ప్రాప్నోతి; సర్వేషాం రాజ్ఞాం మధ్యే శ్రైష్ఠ్యం సర్వోత్తమత్వం పూర్వోక్తాం ప్రతిష్ఠాం, యా పరేషు శత్రుషు విజయేన హర్షనిమిత్తా, తథా పరేషాం శత్రూణాం దీనత్వనిమిత్తా, సా పరమతా సభా, తాం వా గచ్ఛతి ప్రాప్నోతి, తయా సభయా పూర్వోక్తం సామ్రాజ్యం భౌజ్యం స్వారాజ్యం వైరాజ్యం పారమేష్ఠ్యం మహారాజ్య మాధిపత్యం రాజ్యం చ జిత్వా అస్మిన్ లోకే చక్రవర్తి సార్వభౌమో మహారాజాధిరాజో భవతి, తథా శరీరం త్యక్త్వాఽ స్మిన్ స్వర్గే సుఖ స్వరూపే లోకే పరబ్రహ్మణి స్వయం భూః స్వాధీనః (స్వరాట్) స్వప్రకాశః (అమృతః) ప్రాప్త మోక్షసుఖః సన్ సర్వాన్ కామానాప్నోతి, (ఆప్త్వాఽమృతః) పూర్ణకామోఽ జరామరః సంభవతి (యమేతేనైంద్రేణ) ఏతే నోక్తేన సర్వైశ్వర్యేణ (శాపయిత్వా) ప్రతిజ్ఞాం కారయిత్వా, యం సకల గుణోత్కృష్టం క్షత్రియం (మహాభిషే) అభి షించంతి సభా సదః- సభాయాం స్వీకుర్వంతి, తస్య రాష్ట్రే కదాచి దనిష్టం న ప్రసజ్యత ఇతి విజ్ఞేయమ్. ౧౦

తె॥ ఇట్టి గుణములతోను, సత్య కర్మములతోను నభిషిక్తుడై యుక్తుడైన క్షత్రియుడు సర్వయుద్ధములందును జయము బొందును, సర్వోత్తమ సుఖములకు, లోకములకు నధికారియై రాజులలో నుత్తమత్వమును బొందును. అందువలన నీలోకమున చక్రవర్తి రాజ్యమును బాలించి, లక్ష్మి ననుభవించి మరణానంతరమున స్వరాట్టు-అమృతుడై పరమేశ్వరునియందు సర్వసుఖముల ననుభవించును.

మహదైశ్వర్య యుక్తమగు సభిషేకము వలన క్షత్రియునకు ప్రతిజ్ఞా పూర్వక రాజ్యాధి కారము లభించును - కావున నేదేశమున నిట్టి రాజ్య ప్రబంధము చేయబడునో యా దేశమత్యంత సుఖమును బొందును. ౧౦

సం॥ "క్షత్రం వై స్విష్టకృత్, క్షత్రం వై సామ, సామ్రాజ్యం వై సామ" ౧౧
శ. ౧౨-౮-౩-౧౯-౨౩

(క్షత్రం వై) క్షత్ర మర్థాద్రాజసభా ప్రబంధేన యద్యథావత్ ప్రజాపాలనం క్రియతే తదేవ స్విష్టకృ దర్థా దిష్టసుఖకారి, (క్షత్రం వై సామ) యద్ వై దుష్ట కారిణా మంతకారి తథా సర్వస్యాః ప్రజాయాః సాంత్వ ప్రయోగ కర్తృ చ భవతి. (సామ్రాజ్యం వై) తదేవ శ్రేష్ఠం రాజ్యం వర్ణయంతి. ౧౧

తె॥ (క్షత్రం వై) రాజసభా ప్రబంధము వలన చక్కగా జరుగు ప్రజాపాలనము (స్విష్టకృత్) బాగుగ కోరబడిన సుఖముల నొసంగున దగును. (క్షత్రం వై సామ) దుష్టులను నశింపజేసి, శిష్టులను పాలించు క్షత్ర ధర్మము సామ్రాజ్యకారి రాజసుఖముల నొసంగునదగును. ౧౧

సం॥ "బ్రహ్మ వై బ్రాహ్మణః క్షత్రగ్ం రాజన్యస్తదస్య బ్రహ్మణా చ క్షత్రేణ చోభయతః శ్రీః పరి గృహీతా భవతి, యుద్ధం వై రాజన్యస్య వీర్యమ్" ౧౨ శ. ౧౩-౧-౫-౩-౬

(బ్రహ్మ వై) బ్రహ్మ - అర్థాద్ వేదం పరమేశ్వరం చ వేత్తి స ఏవ బ్రాహ్మణో భవితు మర్హతి. (క్షత్రగ్ం) యో జితేంద్రియో విద్వాన్ శౌర్యాది గుణయుక్తో మహావీరపురుషః క్షత్రధర్మం స్వీకరోతి. స రాజన్యో భవితు మర్హతి. (తదస్య బ్రహ్మణా) తాద్భశైర్ బ్రాహ్మణైః రాజన్యైశ్చ సహాస్య రాష్ట్రస్య సకాశా దుభయతః శ్రీః రాజ్యలక్ష్మీః పరితః సర్వతో గృహీతా భవతి; నైవం రాజధర్మానుష్ఠానే నాస్యాః శ్రియః కదాచి ద్దారిస్యాన్యథాత్వే భవతః (యుద్ధం వై) అత్రేదం బోధ్యమ్ - యుద్ధ కరణమేవ రాజన్యస్య వీర్యం బలం భవతి. నానేన వినా మహాధనసుఖయోః కదాచిత్ ప్రాప్తిర్ భవతి. కుతః? సంగ్రామ స్యైవ మహాధన సంజ్ఞత్వాత్; మహాంతి ధనాని ప్రాప్తాని భవంతి యస్మిన్ స మహాధనః సంగ్రామో, నాస్మాద్ వినా కదాచిన్మహతీ ప్రతిష్ఠా మహాధనం చ ప్రాప్నుతః. ౧౨ ని. ఘం. ౨-౧౭

తె॥ (బ్రహ్మవై) బ్రహ్మ-వేదమును, పరమేశ్వరుని నెఱిగినవాడే బ్రాహ్మణుడు కాదగినవాడు (క్షత్రం) జితేంద్రియుడు, పండితుడు, శూరతాది గుణయుక్తుడు, శ్రేష్ఠుడు, వీరపురుషుడునై క్షత్ర ధర్మమును స్వీకరించువాడు క్షత్రియుడు కాదగినవాడు. (తదస్య బ్రహ్మణా) ఇట్టి బ్రాహ్మణులతోను క్షత్రియులతోను న్యాయముగ పాలించురాజున కనేక విధముల లక్ష్మి ప్రాప్తించును. అతని ధన కోశమునకు హాని యెన్నడును గలుగదు.

(యుద్ధం వై) రాజునకు యుద్ధమే బలము. యుద్ధము చేయుట వలననే యతనికి ధనము;సుఖము లభించును. కారణమేమన నిఘంటువు నందు సంగ్రామమే మహాధన మనబడినది. యుద్ధము వలన నుత్తమ పదార్థము - ధనములు - లభించును. యుద్ధము చేయని రాజునకు ధనము, ప్రతిష్ఠయు నెన్నడు లభింపవు. కావుననే సంగ్రామమే ధనమని నిఘంటువు చెప్పుచున్నది.

సం॥ "రాష్ట్రం వా అశ్వమేధః"
శ. ౧౩-౧-౬-౩

(రాష్ట్రం వా అశ్వమేధః) రాష్ట్ర పాలనమేవ క్షత్రియాణా మశ్వ మేధాఖ్యో యజ్ఞో భవతి. నాశ్వం హత్వా తదంగానాం హెూమకరణం చేతి.
౧౩

తె॥ న్యాయముతో రాజ్యపాలనము చేయుటయే క్షత్రియుల కశ్వమేధ యజ్ఞము. గుఱ్ఱమును చంపి దాని యంగములను హోమము చేయుట యశ్వమేధము కాదు. ౧౩

సం॥ "రాజన్య ఏవ శౌర్యం మహిమానం దధాతి తస్మాత్ పురా రాజన్యః

శూర ఇషవ్యోఽతివ్యాధీ మహారథో జజ్ఞే" ౧౪ శ. ౧౩-౧-౬-౨

(రాజన్య ఏవ) పురా పూర్వోక్తైర్ గుణైర్ యుక్తో రాజన్యో యదా శౌర్యం మహిమానం దధాతి. తదా సార్వభౌమం రాజ్యం కర్తుం సమర్థో భవతి. తస్మాత్ కారణాద్ రాజన్యః శూరో, యుద్ధోత్సుకో, నిర్భయః, (ఇషవ్యః) శస్త్రాస్త్ర ప్రక్షేపణే కుశలః, (అతి వ్యాధ) అత్యంతా వ్యాధః శత్రూణాం హింసకా యోద్ధారో యస్య, (మహారథః) మహాంతో భూజలాంతరిక్షగమనాయ రథా యస్యేతి. యస్మిన్ రాష్ట్రే ఈదృశో రాజన్యో జజ్ఞే జాతోస్తి నైవ కదాచిత్తస్మిన్ భయదుఃఖే సంభవతః. ౧౪

తె॥ (రాజన్య ఏవ) శూరతారూపకీర్తి నార్జించినపుడే రాజు పృథివియం దంతటను రాజ్యముజేయ సమర్థుడగును. కావున నేదేశము నందు యుద్ధము నెక్కుడుగా నభిలషించువాడు, నిర్భయుడు, శస్త్రాస్త్ర సంచాలనమున నిపుణుడు, జలస్థలాంతరిక్షములందు నడవదగిన యానములు గలవాడు నగు రాజు రాజ్యము సేయునో యట భయము కాని, దుఃఖము కాని ప్రజలకు గలుగవు. ౧౪

సం॥ "శ్రీర్ వై రాష్ట్రమ్" ౧౫ శ. ౧౩-౨-౯-౨

(శ్రీర్) యా విద్యాద్యుత్తమ గుణ రూపా నీతిః సైవ రాష్ట్రం భవతి ౧౫

తె॥ (శ్రీర్వై) విద్యాద్యుత్తమ గుణ రూపనీతియే రాష్ట్రమగును. ౧౫

సం॥ "శ్రీర్ వై రాష్ట్రస్య భారః" ౧౬ శ. ౧౩-౨-౯-౩

(శ్రీర్ - భారః) సైవ రాజ్యశ్రీ రాష్ట్రస్య సంభారో భవతి. ౧౬

తె॥ ఆ రాజ్యశ్రీయే రాష్ట్ర సంభారము (సామగ్రియును) ౧౬

సం॥ "శ్రీర్ వై రాష్ట్రస్య మధ్యమ్" ౧౭ శ. ౧౩-౨-౯-౪

(శ్రీర్ మధ్యమ్) రాష్ట్రస్య మధ్యభాగోఽపి శ్రీరేవాస్తి. ౧౭

తె॥ (శ్రీర్ మధ్యమ్) రాష్ట్రమునకు మధ్యభాగముకూడ శ్రీ యే. ౧౭

సం॥ "క్షేమో వై రాష్ట్రస్య శీతమ్" ౧౮ శ. ౧౩- ౨-౯-౫

(క్షేమో-శీతమ్) క్షేమో యద్రక్షణం తదేవ రాష్ట్రస్య శయనవన్నిరుపద్రవం సుఖం భవతి. ౧౮

తె॥ (క్షేమో) రాష్ట్రరక్షణమే దానికి శయనమువలె నిరుపద్రవమగు సుఖము. ౧౮

సం॥ "విడ్ వై గర్భో రాష్ట్రం పసో రాష్ట్రమేవ విశ్యాహంతి తస్మాద్

రాష్ట్రీ విశం ఘాతుకః" ౧౯ శత. ౧౩-౨-౯-౬

(విడ్ వై గభో) విడ్ యా ప్రజా సా గభాఖ్యాఽస్తి (రాష్ట్రం పసో) యద్ రాష్ట్రం తత్ పసాఖ్యం భవతి. తస్మాద్ యద్ రాష్ట్రి సంబంధి కర్మ తద్ విశి ప్రజాయా మావిశ్య తామాహంత్యా సమంతాత్ కర గ్రహణేన ప్రజాయా ఉత్తమ పదార్థానాం హరణం కరోతి (తస్మాద్ రాష్ట్రీ విశం) యస్మాత్ సభయా వినైకాకీ పురుషో భవతి తత్ర ప్రజా సదా పీడితా భవతి, తస్మాదేకః పురుషో రాజా నైవ కర్తవ్యో నైకస్య పురుషస్య రాజధర్మానుష్ఠానే యథావత్ సామర్థ్యం భవతి. తస్మాత్ సభయైవ రాజ్య ప్రబంధః కర్తుం శక్యోఽస్తి.

తె॥ (విడ్ వై గభో) ప్రజకు 'గభ' యని నామము (రాష్ట్రింపసో) రాష్ట్రిమునకు 'పస'ము అని పేరు. కావున రాష్ట్రి సంబంధి కర్మము పన్ను - శిస్తు- రూపమున ప్రజల నుండి యుత్తమ పదార్థములను గ్రహించును. (తస్మాద్ రాష్ట్రివిశం) ఏదేశమున సభ కాక, ఒక్క వ్యక్తి రాజ్యము సేయునో యక్కడి ప్రజలు దుఃఖముల పాలగుదురు. కావున నొక్క వ్యక్తిని రాజుగ చేయరాదు. ఒకనియందు రాజ ధర్మానుష్ఠానము నకు వలయు సామర్థ్యముండదు. అందువలన రాజ్య వ్యవస్థ యంతయు సభా మూలమున చేయవలెను.

సం॥ "విశమేవ రాష్ట్రాయాద్యాం కరోతి తస్మాద్ రాష్ట్రీ విశమత్తి న పుష్టం పశుమన్యత ఇతి" ౨౦
శత. ౧౩-౨-౯-౮

(విశమేవ రాష్ట్రాయ) యత్రైకో రాజాఽస్తి, తత్ర రాష్ట్రాయ విశం ప్రజాం అద్యాం భక్షణీయాం భోజ్యవ త్తాడితాం కరోతి. యస్మాత్ స్వసుఖార్థం ప్రజాయా ఉత్తమాన్ పదార్థాన్ గృహ్ణాన్సన్ ప్రజాయై పీడాం దదాతి, తస్మా దేకో రాష్ట్రీ విశమత్తి. (న పుష్టం పశుం) యథా మాంసాహారీ పుష్టం పశుం దృష్ట్వా హంతు మిచ్ఛతి, తథైకో రాజా 'న మత్తః కశ్చి దధికో భవే' దితీర్ష్యయా నైవ ప్రజాస్థస్య కస్యచిన్మనుష్యస్యోత్కర్షం సహతే, తస్మాత్ సభా ప్రబంధయుక్తేన రాజ్యవ్యవహారేణైవ భద్రమ్" ౨౦

ఇత్యేవం రాజధర్మ వ్యవహార ప్రతిపాదకా మంత్రా బహవః సంతీతి.

---

తె॥ (విశమేవ రాష్ట్రాయ) ఏ దేశమున నొక్క వ్యక్తి రాజగునోయతడట ప్రజలకు దుఃఖము లొదవజేయును. అతడు తన సుఖము కొఱకు ప్రజలయుత్తమ పదార్థములను లాగుకొనును. అట్టి యెడ నతడు ప్రజలనే భక్షించుచున్నాడన నొప్పును. (న పుష్టం పశుం) మాంసాహారియైన మనుష్యుడు మత్తిల్లిన పుష్ట పశువును చంపి తిన నెంచునట్లు రాజు కూడ తనకంటె నింకొక డధికుడుగా నుండుట యీర్ష్యతో సహింపనివాడై ప్రజల యున్నతిని సహింపడు. కావున సభనేర్పాటు చేసికొని, తన్మూలమున రాజ్యవ్యవహారములను నడపుకొనుట బాగగును. ౨౦

ఇట్లు రాజధర్మమును ప్రతిపాదించు మంత్రములు పెక్కు గలవు.

రాజ ప్రజాధర్మ విషయమిట సంక్షేపముగ సమాప్తము.

# అథ వర్ణాశ్రమవిషయః సంక్షేపతః

సం॥ తత్ర వర్ణవిషయో మంత్రో "బ్రాహ్మణోఽస్య ముఖమాసీ" దిత్యుక్తస్తదర్థశ్చ. తస్యాయం శేషః

"వర్ణో వృణోతేః" ౧ ని. ౨–౩

"బ్రహ్మ హి బ్రాహ్మణః, క్షత్రగ్ం హీంద్రః క్షత్రగ్ం రాజన్యః" ౨ శ. ౫–౧–౧–౧౧

"బాహూ వై మిత్రావరుణౌ పురుషో గర్త :" ౩ శ.కాం–౫ అ–౪ బ్రా–౩ కం–౧౫

"వీర్యం వా ఏతద్ రాజన్యస్య యద్ బాహూ వీర్యం వా ఏత దపాగ్ం రసః" ౪ శ.౫–౪–౩–౧౭

"ఇషవో వై దిద్యవః" ౫ శత. ౫–౪–౪–౨

"వర్ణో వృణోతే" రితి నిరుక్తప్రామాణ్యాత్ వరణీయా వరీతు మర్హాగుణ కర్మాణి చ దృష్ట్వా యథా యోగ్యం వ్రియంతే యే తే వర్ణాః" ౧

(బ్రహ్మహి బ్రాహ్మణః) బ్రహ్మణా వేదేన పరమేశ్వర స్యోపాసనేన చ సహ వర్తమానో విద్యాద్యుత్తమ గుణయుక్తః పురుషో బ్రాహ్మణో భవితు మర్హతి, తథైవ (క్షత్రగ్ం హీంద్రః) క్షత్రం క్షత్రియకులం యః పురుష ఇంద్రః పరమైశ్వర్యవాన్ శత్రూణాం క్షయకరణాద్ యుద్ధోత్సుకత్వాచ్చ ప్రజాపాలనతత్పరః (రాజన్యః) క్షత్రియో భవితు మర్హతి. ౨

(మిత్రః) సర్వేభ్యః సుఖదాతా (వరుణః) ఉత్తమగుణ కర్మ ధారణేన శ్రేష్ఠః ఇమా వేవ క్షత్రియస్య ద్వౌ బాహువత్ భవేతామ్. ౩

(వా) అథవా వీర్యం పరాక్రమో బలం చైతదుభయం రాజన్యస్య క్షత్రియస్య బాహూ భవతః; అపాం ప్రాణానాం యో రస ఆనందస్తం ప్రజాభ్యః ప్రయచ్ఛతః క్షత్రియస్య వీర్యం వర్ధతే.

తస్య (ఇషవః) బాణాః "శస్త్రాస్త్రాణాముపలక్షణం మేతత్" (దిద్యవః) ప్రకాశకాః సదా భవేయుః ౫

తె॥ "బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్" అను నీ మంత్రము వర్ణ విషయమునకు సంబంధించినది. దీని యర్థము సృష్టి విద్యా విషయము నకు చెందిన ప్రకరణమున వ్రాయబడినది. మంత్రము మంత్రార్థము నట చూడనగును. ఇట వర్ణ విషయక నిరుక్తాది ప్రమాణములు వ్రాయుచున్నాము.

(వర్ణో వృణోతేర్) ఈ నిరుక్త ప్రమాణము ననుసరించి వర్ణమున కర్థము వరణీయము స్వీకరింపదగినది. తన తన గుణకర్మల ననుసరించి యథాయోగ్యముగ స్వీకరించినను, అధికారిగ చేయబడినను నది వర్ణమగును. ౧

(బ్రహ్మహి బ్రాహ్మణః) వేదముతోను, బ్రహ్మోపాసనతోను యుక్తుడై విద్యాద్యుత్తమగుణములు కలవాడు బ్రాహ్మణుడగును. (క్షత్రగ్ం హీంద్రః) ఇట్లే, క్షత్ర ధర్మము కలవాడై, పరమైశ్వర్యము కలవాడై, శత్రువుల వినాశమునకు యుద్ధమున కుత్సుకుడగువాడును, ప్రజాపాలన తత్పరుడును నగు మనుష్యుడు (రాజన్యః) క్షత్రియుడు కాదగినవాడు. ౨

(మిత్రః) అందఱకు సుఖము నిచ్చువాడు. (వరుణః) ఉత్తమ గుణ కర్మములు గలవాడగుట శ్రేష్ఠుడు, నను నీయిరువురే క్షత్రియుని భుజయుగమునకు సమానులు. ౩

(వా) లేక వీర్యము-పరాక్రమము, బలమునను నీ రెండును క్షత్రియునకు రెండు బాహువులు, ప్రజలకు జీవన సుఖము నొసంగు వాడగు క్షత్రియునకు వీర్యము పెంపగును. ౪

ఆ క్షత్రియుని (ఇషవః) బాణములు మున్నగు శస్త్రాస్త్రములన్నియు (దిద్యవః) నెల్లపుడు ప్రకాశించు చుండునుగాక ! ౫

(అజమేర్‌లో ముద్రిత పుస్తకమునగల హిందీ భాగమునందలి విషయమున కనువాదము.)

" ఈ విషయమున నీ క్రింది విశేషములు విశేషముగ గ్రహింప నగును. ప్రథమమున మానవజాతి యొక్కటిగనే యుండెను. వేదము వలన నట్లే తెలియనగుచున్నది. ఇందులకు ప్రమాణము సృష్టివిషయమున వ్రాయబడినది. మనుష్య జాతిలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులనునవి వర్ణము లనబడును. వేద రీతితో నీ వర్ణములు ఆర్యులు దస్యులు నని రెండు విధములు. (విజానీహ్యార్యాన్ యే చ దస్యవః) అను మంత్రమావిషయమున ప్రమాణము. 'మనుష్యులలో శ్రేష్ఠ లార్యులనియు, దుష్ట స్వభావము కలవారు దస్యులనియు తెలిసికొనుడని యీశ్వరోక్తి-మంత్రాభిప్రాయము. అట్లే (ఉత శూద్రే ఉత ఆర్యే) అను మంత్రమును బట్టి ఆర్యులు - బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులని వ్యవహరింప దగుదురు. (అసూర్యా నామ తే లోకాః) ఈ మంత్రము ననుసరించి మనుజులు దేవాసురులు- విద్వాంసులు, మూర్ఖులు నని రెండు విధములుగ వ్యవహరింప దగుదురు. విద్వాంసులకు మూర్ఖులకు మధ్య జరుగు విరోధమే దేవాసుర సంగ్రామ మనబడును."

సమీక్ష:- పండిత వర్గము పైన చూపినట్లు వర్ణించిన వర్ణముల విషయమునకు సంబంధించినంత వఱకు కొన్ని యంశములు మాకు సమ్మతము కాదు. పైన వ్రాసిన వాక్యములను బట్టి చూచిన బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య శూద్రులనబడు వర్ణముల వారిని ఆర్యులు, దస్యులు, అని రెండుగా భాగించినట్లు కనబడుచున్నది. మఱియొక విధముగ నీ భాగమును ఆర్యులు, శూద్రులు ననియు, దేవాసురులనియుకూడ చెప్పునట్లు కానవచ్చుచున్నది. దాని ఫలితముగా పండితులు శూద్రులు, దస్యులు, అసురులు అను పదములు సమానార్థకములుగ వాడినట్లు తెలియనగుచున్నది. కాని మాతుచ్ఛ సమ్మతిలో మాత్రము వేదము, మనుస్మృతి మున్నగు ప్రామాణిక గ్రంథములలో దస్యు శూద్ర శబ్దములు ఏ కార్థకములుగ వాడినట్లు కనిపింపదు. వైదిక పరిభాషను బట్టి చూచిన దస్యులనబడువారు దేశమును, ధర్మమును జాతిని అన్ని విధముల నాశము చేయుటకు సిద్ధపడిన వారుగ కనబడుచున్నారు. దస్యులు దాసులు, అసురులు ఈ మూడు పదములు మాత్రము సమానార్థకములుగ కనిపించుచున్నవి. 'దసు' 'ఉపక్షయే' అను ధాతువు వలన దస్యుపద మేర్పడినది. దస్యుడు సమాజమును నిర్మించుటకు తోడ్పడువాడుకాదు. పై పెచ్చు సమాజమును నాశము చేయుటకు యత్నించువాడు. దస్యుడైన దొంగ, బందిపోటు దొంగ, లూటీ చేయువాడు, లంపటుడునని యర్థము. వైదిక భాషనుబట్టి చూచి నపుడు దస్యువు విషయమున చాల చెడ్డ భావము కలుగును. చూడుడు. (౧) వధీర్హి దస్యుం ధనినం ఘనేన (ఋ.౧-౩౩-౪) అను నీ మంత్రము ననుసరించి ధనవంతుడగు దస్యుని బందిపోటు దొంగను వజ్రముతో చంపుటకు విధి కనబడుచున్నది. ఇట్లే తరువాత మంత్రమున దస్యుడు-అయజ్వా-యాజ్ఞికుల నీర్ష్యతో చూచువాడనియు, 'అవ్రతీ' సామాజికములు, ధార్మికములు, రాజకీయములు, ఈశ్వరీయములునగు నియమములను పాటింపని వాడనియు వర్ణింపబడినది.

ఇక శూద్ర విషయమున వేదమునందు పలుతావులలో సమ్మానార్థక శబ్దములు ప్రయోగింపబడి యుండుట చూడనగును. ఇట్టి ప్రయోగములు ముందు చూపుదుము. (౩) " అవాదహెూ దివ ఆదస్యుమ్" (ఋ.౧-౩౩-౭) 'దస్యుని దగ్ధము' చేయుము. (౪) "విజానీ హ్యార్యాన్ యే చ దస్యవో బర్హిష్మతే రంధయ శాసద వ్రతాన్" (ఋ. ౧-౫౧-౬) "దస్యుని వశమున నుంచు కొనుడు, నాశము చేయుడు" (౫) "దస్యుం వకు రేణాధమంతా (ఋ. ౧-౧౧౭-౨౧) "దస్యుని అస్త్ర శస్త్రములతో వధింపుము" అను నిట్టి మంత్రములలో దస్యుడు వధ్యుడుగా వర్ణింపబడుట చూడనగును. ఇంతే కాక యీ క్రింది మంత్రములలో

(౬) "హత్వీ దస్యూన్ ప్రార్యం వర్ణమావత్" (ఋ. ౩-౩౪-౯)

(౭) "యథా వశం నయతి దాస మార్యః" (ఋ. ౫-౩౪-౬)

(౮) "విశ్వోఽ వతారీర్దాసీః" (ఋ. ౬-౨౫-౨)

(౯) "యో దాసం వర్ణ మధరం గుహా కః" (ఋ. ౨-౧౨-౪)

(౧౦) "అవగిరేర్దాసం శంబరహన్" (ఋ. ౬-౨౬-౫)

దస్యు - దాస - విషయములో నీచ శబ్దములు ప్రయోగింపబడుట చూడనగును. అంతే కాక చంపుటకు, వశములో నుంచుటకు, ఖైదు చేయుటకు, దండించుటకు దేశమునుండి వెడలగొట్టుటకు విధానములు చూడనగును. వీరు సమాజమునకు విఘాతకులు. ఈ దస్యులే యసురులనియు చెప్పబడుదురు. (ఋ. ౧-౫౧-౫) మంత్రమునందు వీరిని గూర్చి (అధిషు ప్రావజుహ్వత) 'అసురులు ముఖమునందే హవనము చేయుదురు. పరుల కుపకారమొనర్చు యజ్ఞములు చేయక తమ పొట్టలు మాత్రము నింపుకొందురు. అని భావము' అని వర్ణింపబడినది. కౌషీతకీ బ్రాహ్మణము నందును వీరిని గూర్చి యిట్టి భావమే ప్రకటింపబడినది.

"అసురా వా ఆత్మన్యజుహ్వుః" అసురులు శరీరమునందే హవనము చేయుచుండిరి. అందువలననే వారు ఓడిపోయిరని, వాజసనేయులు చెప్పిరి. 'దేవాశ్చ హవా అసురాశ్చాస్పర్ధన్త. తతో హాసురా అభిమానేన కస్మై చ న జుహుమ ఇతి స్వేషు ఆస్యేషు జుహ్వత శ్చరుస్తే పరాబభూవుః ఇతి. 'ఆదేవతలు అసురులు పరస్పరము స్పర్ధతో మెలగజొచ్చిరి. అసురులు తామెవరిని పూజింపము, స్తుతి జేయము, అను నభిమానముతో తమ ముఖములందే హవనము చేయుచు విచరించిరి. కావున వారు పరాజితులయిరి" ఇక్కడ అసురులని చెప్పబడినవారే వేదమున దస్యులనబడిరి. దస్యు అసురపదములు రెండు పర్యాయ పదములని నిరూపించుట నాకిట ప్రస్తుతముకాదు. కాని, పై వాక్యములవలన దస్యులు, అసురులు దుష్టులని మాత్రము తెలిసికొన పాఠకుల కవకాశము గలిగించితినని యెంచెద. కాని శూద్రపదమునుగూర్చి పరిశీలించినపుడు వైదిక సాహిత్యమున శూద్రుడొక సత్పురుషుడుగా తెలియ నగును. దస్యునకు శూద్రునకు సామ్య మెక్కడను జూడము.

(౧) "యజుర్వేదమున పదునాఱవ" (౧౬) యధ్యాయము చదివిన అందు శూద్రునకు 'నమః' నమస్కారము వంటి ఆదరార్థక పద ప్రయోగము చూడనగును.

(౨) యజుర్వేదమున ౩౦ అ. ౫. మంత్రమున (తపసే శూద్రమ్) శూద్రుడు తపస్వి, పరిశ్రమ మొనర్చువాడు, సాహసికుడు, అని చెప్పబడినాడు. శూద్రుని విషయమున వేదమెట్టి భావమును వెల్లడించుచున్నదో దీనింబట్టి తెలిసికొనవచ్చును.

(౩) "రుచం నో ధేహి బ్రాహ్మణేషు, రుచం రాజసు నస్కృధి, రుచం విశ్యేషు శూద్రేషు, మయి ధేహి రుచారుచమ్" (యజు. ౧౮-౪౮) ఈ మంత్రమున నన్యవర్ణముల వారితోబాటు సమానముగ శూద్రుని కొఱకును ప్రీతి, ప్రకాశము నొసంగుమని ప్రార్థన చేయబడినది.

"యచ్ఛూద్రే యదర్యే యదేన శ్చకృమా వయమ్...తస్యా వయజనమసి" (య. ౨౦-౧౭) ఓ పరమాత్మా ! మేము వైశ్యుని విషయమునను, శూద్రుని విషయమునను జేసిన యపరాధమునుగూడ నీవు నష్టము చేయుదువు.' అని యీ మంత్రమున పరమేశ్వరునకు విజ్ఞప్తి చేయబడినది.

(౫) "ప్రియం మాదర్భకృణు బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయ చ" అథ.౧౯-౩౨-౮

(౬) "ప్రియం మా కృణు దేవేషు ప్రియం మా కురు రాజసు, ప్రియం సర్వస్య పశ్యత ఉత శూద్ర ఉతార్యే" (అథర్వ. ౧౯-౬౨-౧) మున్నగు మంత్రములలో నన్యవర్ణములతో సమానముగ శూద్రునకు సమ్మానమియ్యబడినట్లు చూచుచున్నాము. కావున వేదమున దస్యు శూద్రపదములు సమానార్థకము లనుట సంగతముకాదు.

(౭) 'యథేమాం వాచం కల్యాణీం" అను మంత్రమున శూద్ర, అరణపదములు వేఱువేఱుగ ప్రయోగింపబడుట జూతుము. అరణ శబ్దమున కర్థము దస్యుడు, చోరుడు, బందిపోటుదొంగ. కావున దస్యుశూద్రశబ్దములు సమానార్థకములు కావు. ఇట్లే మనుస్మృతిలో బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులుకాక మిగిలినవారు మ్లేచ్ఛభాష నుపయోగించువారు. కావున, ఆర్యభాష మాటాడనివారెల్లరు దస్యులనబడినారు. కావున శూద్రులు దస్యులు కారు. వారు పరిశ్రమచేయు తపస్సంపన్ను లనియు, సమాజ ఘటకులనియు స్పష్టమగుచున్నది.

"ఏవమేవ తు శూద్రస్య ప్రభుకర్మ సమాదిశత్, ఏతేషామేవ వర్ణానాం శుశ్రూషా మనసూయయా"
మను. ౧-౯

ఈ మను వచనములను బట్టి శూద్రుడు ఈర్ష్య అభిమానాదులను విడిచి బ్రాహ్మణాదులకు సేవ చేయవలెను అని బోధపడుచున్నది. దస్యునిలో నీగుణమెట నుండివచ్చును ? శూద్రుడిట్లు సమాజమున కంగమై యార్యు డనిపించుకొనును. 'ఉత శూద్రే ఉతార్యే' (అథ. ౧౯-౬౨-౧) అను నథర్వ వేదమంత్రమును జదివిన తరువాత శూద్రు డార్యుడు కాదనుటెట్లు పొసగును ? (సంపాదకీయ టిప్పణి)

*సం॥ ఆశ్రమా అపి చత్వారః సంతి; బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సంన్యాస భేదాత్. బ్రహ్మచర్యేణ సద్విద్యా శిక్షా చ గ్రాహ్యా. గృహాశ్రమే ఞోత్తమాచరణానాం శ్రేష్ఠానాం పదార్థానాం చోన్నతిః కార్యా. వానప్రస్థే నైకాంతసేవనం బ్రహ్మోపాసనం విద్యాఫలవిచారణాది చ కార్యమ్. సంన్యాసేన పరబ్రహ్మ మోక్షపరమానంద ప్రాపణం క్రియతే సదుపదేశేన సర్వస్మా ఆనందదానం చేత్యాది చతుర్భి రాశ్రమైర్ ధర్మార్థ కామమోక్షాణామ్ సమ్యక్ సిద్ధిః సంపాదనీయా. ఏతేషాం ముఖ్యతయా బ్రహ్మచర్యేణ సద్విద్యా సుశిక్షాదయః శుభ గుణాః సమ్యగ్ గ్రాహ్యాః. అత్ర బ్రహ్మచర్యాశ్రమే ప్రమాణమ్—*

*"ఆచార్య ఉపనయమానో బ్రహ్మచారిణం కృణుతే గర్భమంతః, తం రాత్రీస్తిస్ర ఉదరే బిభర్తి తం జాతం ద్రష్టుమభిసంయంతి దేవాః"*
*అథర్వ. ౧౧-౩-౫-౫*

*(ఆచార్య ఉప) ఆచార్యో విద్యాధ్యాపకో బ్రహ్మచారిణముపనయమానో విద్యాపఠనార్థముపవీతం దృఢవ్రతముపదిశ న్నంతర్గర్భమివ కృణుతే కరోతి. తం తిస్రో రాత్రీ స్త్రిదినపర్యంత ముదరే బిభర్తి.*

అర్థాత్ సర్వాం శిక్షాం కరోతి, పఠనస్య చ రీతి ముపదిశతి. యదా విద్యాయుక్తో విద్వాన్ జాయతే, తదా తం విద్యాను జాతం ప్రాదుర్భూతం దేవా విద్వాంసో ద్రష్టుమభిసంయంతి; ప్రసన్నతయా తస్య మానం కుర్వంతి. అస్మాకం మధ్యే మహాభాగ్యోదయేన ఈశ్వరానుగ్రహేణ చ సర్వమనుష్యోపకారార్థం త్వం విద్వాన్ జాత ఇతి ప్రశంసంతి. ౧

తె॥ నాలుగాశ్రమముల వర్ణనము : బ్రహ్మచర్యము, గృహస్థము, వానప్రస్థము, సంన్యాసము.

(౧) బ్రహ్మచర్యము ఇందు మంచి శిక్షణ, సత్యవిద్య మున్నగు గుణములు గ్రహింపవలెను.

(౨) గృహాశ్రమము : ఇందు ఉత్తమగుణముల ప్రచారము, శ్రేష్ఠ పదార్థముల యున్నతితో సంతానోత్పత్తి; ఆ సంతానమునకు మంచి శిక్షణ నిచ్చుట మున్నగునవి జరుగును.

(౩) వానప్రస్థము : ఇందు బ్రహ్మవిద్యాదులను సాక్షాత్తుగ సాధించుటకు, ఏకాంతమున నుండి పరమేశ్వరుని ఉపాసించుట జరుగును.

(౪) సంన్యాసము : ఇందు మోక్షసుఖప్రాప్తి, సాంసారిక పురుషుల కుపకారము చేయుటకు సత్యోపదేశము చేయబడును. ధర్మార్థకామమోక్షములనెడి చతుర్విధ పురుషార్థములను సాధించుటకు మానవులెల్లరు నీ నాలుగాశ్రమ ధర్మములను నిర్వహింప వలెను. ఇందు మొదటి బ్రహ్మచర్యాశ్రమధర్మము తక్కిన యాశ్రమముల కన్నింటికి మూలము. బ్రహ్మచర్యాశ్రమమునుబాగుగ నిర్వహించినచో తక్కిన యాశ్రమములు చక్కగ నిర్వహింపనగును. అది చెడిపోయిన తక్కిన యాశ్రమములును చెడును. బ్రహ్మచర్యాశ్రమమునకు జెందిన ప్రమాణములు వేదమున నెన్నో యున్నవి. వానిలో గొన్నింటి నిట జూపుచున్నాము.

(ఆచార్య ఉ...) మాతాపితల సంబంధముతో మాతృగర్భము నుండి ప్రథమ జన్మము మనుష్యునకు లభించును. రెండవ జన్మము మనుష్యునకు ఆచార్యుడను తండ్రివలనను, విద్యయనెడి తల్లివలనను గలుగును. ఈ రెండవ జన్మము లభింపని మనుష్యునియందు మనుష్యత్వము ప్రాప్తింపదు. మనుష్యుడవశ్యము మనుష్యత్వమును సంపాదింపవలెను. విద్యార్థులు పాఠశాలకు వెళ్ళి యాచార్యుని సమీపమున నుందురు. ఉపవీతులగుదురు. దృఢవ్రతమును ధారణ చేయుచు నాచార్యుని వలన నుపదేశమును బొందుదురు. అప్పటి నుండియు వారు-బాలకులు, బ్రహ్మచారులనియు, బాలికలు బ్రహ్మచారిణులనియు పిలువబడుదురు. బ్రహ్మ-వేదము, పరమేశ్వరుడు నను నీ రెండింటి యందును వారు తత్పరులై యుందురు. కావున వారి కా నామము సార్థకము. వారి నాచార్యుడు మూడు రాత్రులు తన గర్భమున నుంచుకొనెనో యనునట్లు వర్తించును. ఆ మూడు దినములలోను-గురుకులవాసకాలమున=ఈశ్వరోపాసన, ధర్మము, పరస్పరము విద్యను చెప్పుట, చదువుట మున్నగు ముఖ్యాతిముఖ్య విషయములు వారికి నేర్పబడును. తదుపరి యాబ్రహ్మచారులను జూచుటకు విద్వాంసులు అధ్యాపకులు వత్తురు. వారిని 'భాగ్యవశమునను, ఈశ్వరుని కృపవలనను మానవుల కుపకారముచేయు నిమిత్తము మీరు మాలో విద్వాంసులయితిరి' అని ప్రశంసింతురు. ౧

సం॥ "ఇయం సమిత్ పృథివీ ద్యౌర్ ద్వితీయోతాంతరిక్షం సమిధా పృణాతి, బ్రహ్మచారీ సమిధా మేఖలయా శ్రమేణ లోకాం స్తపసా పిపర్తి" ౨ అథర్వ. ౧౧-౩-౫-౪

(ఇయం సమిత్) ఇయం పృథివీ ద్యౌః ప్రకాశోఽంతరిక్షం చ, అనయా సమిధా స బ్రహ్మచారీ పృణాతి; తత్రస్థాన్ సర్వాన్ ప్రాణినో విద్యయా హోమేన చ ప్రసన్నాన్ కరోతి, (సమిధా) అగ్నిహోత్రాదినా, (మేఖలయా) బ్రహ్మచర్య చిహ్నధారణేన చ, (శ్రమేణ) పరిశ్రమేణ (తపసా) ధర్మానుష్ఠానే నాధ్యాపనే నోపదేశేన చ (లోకాన్) సర్వాన్ ప్రాణినః పిపర్తి పుష్టాన్ ప్రసన్నాన్ కరోతి. ౨

తె॥ (ఇయం సమిత్) ఇది పృథివి, ప్రకాశము, అంతరిక్షము, ఈ సమిధతో బ్రహ్మచారి పాలించును. వీనిలోనున్న సర్వప్రాణులను విద్యాహోమముల మూలమున ప్రసన్నులను జేయును. (సమిధా) అగ్నిహోత్రాదులతోను, (మేఖలయా) బ్రహ్మచర్య చిహ్నములను ధరించుటచేతను, (శ్రమేణ) పరిశ్రమతోను (తపసా) ధర్మానుష్ఠానము, చదివించుట, ఉపదేశము నను వానితోను (లోకాన్) సర్వప్రాణులను ప్రసన్నులను జేయును. ౨

సం॥ "పూర్వో జాతో బ్రహ్మణో బ్రహ్మచారీ ఘర్మం వసాన స్తపసోదతిష్ఠత్. తస్మా జ్జాతం బ్రాహ్మణం బ్రహ్మజ్యేష్ఠం దేవాశ్చ సర్వే అమృతేన సాకమ్" ౩ అథర్వ. ౧౧–౩–౫–౫

(పూర్వో జాతో బ్రహ్మ) బ్రహ్మణి వేదే చరితుం శీలం యస్య స బ్రహ్మచారీ. (ఘర్మంవసానః) అత్యంతం తప శ్చరన్ బ్రాహ్మణోఽర్థాత్ వేదం పరమేశ్వరం చ విదన్ పూర్వః సర్వేషా మాశ్రమాణా మాదిమః సర్వాశ్రమ భూషకః, (తపసా) ధర్మానుష్ఠానేన (ఉదతిష్ఠత్) ఊర్ధ్వే ఉత్కృష్టబోధే వ్యవహారే చ తిష్ఠతి. తస్మాత్ కారణాత్ (బ్రహ్మజ్యేష్ఠం) బ్రహ్మైవ పరమేశ్వరో విద్యా వా జ్యేష్ఠా సర్వోత్కృష్టా యస్య తం బ్రహ్మజ్యేష్ఠం. (అమృతేన) పరమేశ్వరమోక్షబోధేన పరమానందేన (సాకం) సహ వర్తమానం (బ్రాహ్మణం) బ్రహ్మవిదం (జాతం) ప్రసిద్ధం (దేవాః) సర్వే విద్వాంసః ప్రశంసంతి. ౩

తె॥ (పూర్వో జాతో బ్రహ్మ) బ్రహ్మ – వేదమున విచరించు స్వభావముగల బ్రహ్మచారి (ఘర్మం వసానః)మిక్కిలిగ తప మొనర్చుచు, బ్రహ్మ–వేదమును, పరమేశ్వరుని నెఱుగుచు, (పూర్వః) సర్వాశ్రమములకు నాది భూషణమైన (తపసా) ధర్మానుష్ఠానము వలన (ఉదతిష్ఠత్) ఉత్కృష్టమగు జ్ఞానము నందును, వ్యవహారము నందును నుండును. కావున (బ్రహ్మజ్యేష్ఠం) బ్రహ్మ – వేదమును ఈశ్వరునన్నింటికంటెను శ్రేష్ఠముగా నెంచుచు (అమృతేన) పరమేశ్వరునితోను, మోక్షానందముతోను నుండువాడుననగు (బ్రాహ్మణం) బ్రహ్మజ్ఞానిగ (జాతం) ప్రసిద్ధుడైన వానిని (దేవాః) విద్వాంసు లెల్లరు ప్రశంసింతురు.

సం॥ "బ్రహ్మచార్యేతి సమిధా సమిద్ధః" కార్ష్ణం వసానో దీక్షితో దీర్ఘశ్మశ్రుః, స సద్య ఏతి పూర్వస్మాదుత్తరం సముద్రం లోకాన్ త్సంగృభ్య ముహురాచరిక్రత్" ౪ అథ. ౧౧–౩–౫–౬

(బ్రహ్మచార్యేతి) స బ్రహ్మచారీ పూర్వోక్తయా (సమిధా) విద్యయా, (సమిద్ధః) ప్రకాశితః (కార్ష్ణం వసానః) మృగ చర్మాదిక మాచ్ఛాదయన్ (దీర్ఘశ్మశ్రుః) దీర్ఘకాలం కేశశ్మశ్రూణి ధారితాని యేన సః (దీక్షితః) ప్రాప్తదీక్షః, (ఏతి) పరమానందం ప్రాప్నోతి, తథా (పూర్వస్మాత్) బ్రహ్మచర్యానుష్ఠాన భూతాత్ సముద్రాత్ (ఉత్తరం) గృహాశ్రమం సముద్రం (సద్య ఏతి) శీఘ్రం ప్రాప్నోతి. ఏవం నివాస యోగ్యాన్ సర్వాన్ (లోకాన్త్సం) సంగృహ్య ముహుర్ వారం వారం (ఆచరిక్రత్) ధర్మోపదేశమేవ కరోతి. ౪

తె॥ (బ్రహ్మచార్యేతి) బ్రహ్మచారి విద్యతో ప్రకాశితుడై (కార్ష్ణం వసానః) మృగచర్మాదులను ధరించి (దీర్ఘశ్మశ్రుః) చాల కాలముగ కేశములను మీసములనుధరించుచు, దీక్షతో విద్యలను బొందును. అట్లే

విద్యలను సంపాదించి బ్రహ్మచర్యాశ్రమ మనెడి పూర్వసముద్రమును దాటి యుత్తర సముద్రరూపమగు గృహాశ్రమమును (సద్య ఏతి) శీఘ్రముగ బొందును. బాగుగ నివాసయోగ్యములగు సర్వలోకములను సంగ్రహించి విచార పూర్వకముగ మాటిమాటికి తాను ధర్మోపదేశ మొనర్చు చుండును. ౪

సం॥ "బ్రహ్మచారీ జనయన్ బ్రహ్మాపో లోకం ప్రజాపతిం పరమేష్ఠినం విరాజమ్, గర్భో భూత్వామృతస్య యోనావింద్రో హ భూత్వాఽసురాం స్తతర్హ" ౫ అథ. ౧౧-౩-౫-౭

(బ్రహ్మచారీ) స బ్రహ్మచారీ (బ్రహ్మ) వేదవిద్యాం పఠన్ (అపః) ప్రాణాన్, (లోకం) దర్శనం, (పరమేష్ఠినం) ప్రజాపతిం (విరాజం) వివిధ ప్రకాశకం పరమేశ్వరం (జనయన్) ప్రకటయన్. (అమృతస్య) మోక్షస్య (యోనౌ) విద్యాయాం (గర్భో భూత్వా) గర్భవన్నియమేన స్థిత్వా, యథావద్ విద్యాం గృహీత్వా (ఇంద్రో హ భూత్వా) సూర్యవత్ ప్రకాశకః సన్ (అసురాన్) దుష్టకర్మకారిణో మూర్ఖాన్ పాషండినో జనాన్ దైత్యరక్షః స్వభావాన్ (తతర్హ) తిరస్కరోతి; సర్వాన్ నివారయతి. యథేంద్రః సూర్యోఽసురాన్ మేఘాన్ రాత్రిం చ నివారయతి. తథైవ బ్రహ్మచారీ సర్వశుభగుణ ప్రకాశకోఽశుభగుణనాశకశ్చ భవతీతి. ౫

తె॥ (బ్రహ్మచారీ జనయన్) ఆ బ్రహ్మచారి వేదవిద్యను యథార్థముగ నెఱుగును. ప్రాణవిద్యను, లోక విద్యను గ్రహించును. సర్వశ్రేష్ఠుడు, సర్వప్రకాశకుడు ప్రజాపతియునగు పరమేశ్వరు నెఱుగుచు, నీ మోక్ష ప్రాపక విద్యలను గర్భమువలె స్థితుడై నియమపూర్వకముగ జదివి, ఇంద్రుని - సూర్యుని - వలె ప్రకాశకుడై, అసురుల - మూర్ఖుల యవిద్యారూపాంధకారమును ఛేదించును. ఇంద్రుడు - సూర్యుడు, అసురుల - మేఘములను, రాత్రిని దూరమొనర్చునట్లు, బ్రహ్మచారి శుభగుణములనన్నింటిని ప్రకాశింప జేయువాడై యశుభ గుణములను నశింపజేయును. ౫

సం॥ "బ్రహ్మచర్యేణ తపసా రాజా రాష్ట్రం విరక్షతి
ఆచార్యో బ్రహ్మచర్యేణ బ్రహ్మచారిణ మిచ్ఛతే" ౬ అథర్వ. ౧౧-౩-౫-౧౭

(బ్రహ్మచర్యేణ) తపసా బ్రహ్మచర్యేణ కృతేన రాజా రాష్ట్రం విరక్షతి, విశిష్టతయా ప్రజా రక్షితుం యోగ్యో భవతి. ఆచార్యోఽపి కృతేన బ్రహ్మచర్యేణైవ విద్యాం ప్రాప్య బ్రహ్మచారిణ మిచ్ఛతే స్వీకుర్యాన్నాన్యథేతి.

అత్రప్రమాణమ్:- "ఆచార్యః కస్మా దాచారం గ్రాహయత్యాచినోతి, అర్థానాచినోతి బుద్ధిమితి వా"
ని. అ. ౧-౪-౬

తె॥ (బ్రహ్మచర్యేణ) బ్రహ్మచర్య - తపస్సుతో రాజు రాజ్యమును రక్షించును. బ్రహ్మచర్యమును బాగుగ పాలించిన రాజు ప్రజలను రక్షించుటకు దగిన యోగ్యత గలవాడగునని భావము. ఆచార్యుడును బ్రహ్మచర్యము పాలించియే విద్యనుబొంది విద్యార్థిని స్వీకరింపదగినవాడు. లేకున్న నతడు తగడు. యాస్కనిరుక్తమున నాచార్యునిగూర్చి యిట్లున్నది. 'అత్యాచారమును విడిపించి సత్యాచరణమును కలిగించి అనర్థములను విడిపించి యర్థములను గ్రహింపజేసి జ్ఞానమును వృద్ధి చేయువాడు ఆచార్యుడనబడును.'
ని. ౧-౪

సం॥ "బ్రహ్మచర్యేణ కన్యా ౩ యువానం విందతే పతిమ్,
అనడ్వాన్ బ్రహ్మచర్యేణాశ్వో ఘాసం జిగీషతి" ౭ అథర్వ. ౧౧-౩-౫-౧౮

(బ్రహ్మచర్యేణ) పీవమేవ కృతేన బ్రహ్మచర్యేణైవ కన్యాయువతిః సతీ యువానం స్వసదృశం పతిం విందతే, నాన్యథా, న చాతః పూర్వ్యమసదృశం వా. అనడ్వానిత్యుపలక్షణం వేగవతాం పశూనాం, తే పశవోఽశ్వశ్చ ఘాసం యథా, తథా కృతేన బ్రహ్మచర్యేణ స్వవిరోధినః పశూన్ జిగీషంతి యుద్ధేన జేతు మిచ్ఛంతి, అతో మనుష్యై స్త్వవశ్యం బ్రహ్మచర్యం కర్తవ్య మిత్యభిప్రాయః. ౭

తె॥ (బ్రహ్మచర్యేణ) బ్రహ్మచర్యాశ్రమమునందు కన్య, పూర్ణవిద్య నభ్యసించి, యువావస్థను బొందిన తరువాత పూర్ణ యువకుడైన పతిని బొందవలెను. ఇట్లే పురుషుడును బ్రహ్మచర్యమును బాగుగ పాలించి విద్వాంసుడై, ధర్మాత్ముడును సుశీలుడునునై సుశీలయు, ధర్మాత్మయు, యువతియునైన స్త్రీని ప్రసన్నతా పూర్వకముగ వివాహమాడి, యువతీ యువకు లిరువురు పరస్పరము సుఖదుఃఖములలో సహాయకులగుచు జీవనమును నిర్వహింప దగును. కారణమేమన :- వృషభాదులు పశువులుకూడ యువావస్థ బొందువఱకు బ్రహ్మచర్యమును పాలించినపుడె బలముగలవి, వేగము గలవియు నగును; తమకు శత్రువులైన జంతువులను జయించి జీవింపగలవు. కావున మనుజులు తప్పక బ్రహ్మచర్యమును చక్కగ కాపాడుకొనవలెను.

సం॥ "బ్రహ్మచర్యేణ తపసా దేవా మృత్యు ముపాఘ్నత,
ఇంద్రోహ బ్రహ్మచర్యేణ దేవేభ్యః స్వరాభరత్" ౮ అథర్వ. ౧౧-౩-౫-౧౯

(బ్రహ్మ - దేవా) దేవా విద్వాంసో, బ్రహ్మచర్యేణ వేదాధ్యయనేన బ్రహ్మవిజ్ఞానేన తపసా ధర్మానుష్ఠానేన చ, మృత్యుం జన్మ మృత్యు ప్రభవ దుఃఖముపాఘ్నత, నిత్యం ఘ్నంతి, నాన్యథా బ్రహ్మచర్యేణ సునియమేన (హేతికిలార్థే) యథా, ఇంద్రః సూర్యో, దేవేభ్య ఇంద్రియేభ్యః స్వః సుఖం ప్రకాశం చాభర ద్ధారయతి. తథా వినా బ్రహ్మచర్యేణ కస్యాపి నైవ విద్యా సుఖం చ యథావద్ భవతి. ౮

అతో బ్రహ్మచర్యానుష్ఠాన పూర్వకా పీవ గృహాశ్రమాదయస్త్రయ ఆశ్రమాః సుఖమేధంతే. అన్యథా మూలాభావే కుతః శాఖాః, కింతు మూలే దృఢే శాఖాః పుష్పఫలచ్ఛాయాదయః సిద్ధాః భవన్త్యేవేతి.

తె॥ (బ్రహ్మచర్యేణ దేవాః) బ్రహ్మచర్యము, వేదాధ్యయనము, బ్రహ్మవిజ్ఞానము తపస్సు, ధర్మానుష్ఠానము ననువానితో విద్వాంసులు జన్మ మరణ దుఃఖములను జయించి మోక్షమును బొందుదురు. ఇంద్రుడు - సూర్యుడు పరమేశ్వరుని నియమము నందుండి సర్వేంద్రియములకు ప్రకాశమును, సుఖము నిచ్చుచున్నాడు. అట్లే బ్రహ్మచర్యమును జక్కగ పాలింపక యెవ్వడును విద్యాసుఖమును బొందజాలడు. ౮

కావున బ్రహ్మచర్యానుష్ఠానము బాగుగ జేయనినాడు తక్కిన గృహస్థాద్యాశ్రమములు మూడును సుఖము నొసంగజాలవు. మూలమే లేనినాడు శాఖాదు లెటనుండి వచ్చును. మూలమున్నపుడు శాఖాదు లభివృద్ధి బొందును.

బ్రహ్మచర్యాశ్రమ విషయము సమాప్తము.

# అథ గృహాశ్రమ విషయః సంక్షేపతః

సం॥ "యద్గ్రామే యదరణ్యే యత్ సభాయాం యదింద్రియే
యదేనశ్చకృమా వయమిదం తదవయజామహే స్వాహా" ౧ య. ౩-౪౫
"దేహి మే దదామి తే ని మే ధేహి ని తే దధే,
నిహారం చ హరాసి మే నిహారం నిహరాణి తే స్వాహా" ౨ యజు. ౩-౫౦
"గృహా మా బిభీత మా వేపధ్వ మూర్జం బిభ్రత ఏమసి,
ఊర్జం బిభ్రద్వః సుమనాః సుమేధా గృహా నైమి మనసా మోదమానః" ౩యజు. ౩-౪౧
"యేషామధ్యేతి ప్రవసన్ యేషు సౌమనసో బహుః
గృహా నుపహ్వయామహే తే నో జానంతు జానతః" ౪య. ౩-౪౨

"ఉపహూతా ఇహ గావ ఉపహూతా అజావయః, అథో అన్నస్య కీలాల ఉపహూతో గృహేషు నః క్షేమాయ వః శాంత్యై ప్రపద్యే, శివగ్ం శగ్మగ్ం శంయోః శంయోః" ౫ య. ౩-౪౩

ఏషామభిప్రాయః :- ఏతేషు గృహాశ్రమ విధానం క్రియత ఇతి. (యద్గ్రామే) యద్గ్రామే గృహాశ్రమే వసంతో వయం పుణ్యం విద్యాప్రచారం సంతానోత్పత్తిం అత్యుత్తమ సామాజిక నియమం సర్వోపకారకం, తథైవారణ్యే వానప్రస్థాశ్రమే బ్రహ్మవిచారం విద్యాధ్యయనం తపశ్చరణం, సభాసంబంధే యచ్ఛ్రేష్ఠం, ఇంద్రియే మానసవ్యవహారే చ యదుత్తమం కర్మ చ కుర్మస్తత్సర్వ మీశ్వర మోక్షప్రాప్త్యర్థమస్తు యచ్చ భ్రమేణైనః పాపం చ కృతం, తత్ సర్వమిదం పాప మవయజామహ ఆశ్రమానుష్ఠానేన నాశయామః" ౧

(దేహి మే) పరమేశ్వర ఆజ్ఞాపయతి. హే జీవ ! త్వమేవం వద, మే మహ్యం దేహి. మత్సుఖార్థం విద్యాం ద్రవ్యాదికం చ త్వం దేహి, అహమపి తే తుభ్యం దదామి, మే మహ్యం మదర్థం త్వముత్తమ స్వభావదాన ముదారతాం సుశీలతాం చ ధేహి ధారయ, తే తుభ్యం త్వదర్థం అహమ ప్యేవం చ దధే. తథైవ ధర్మవ్యవహారం క్రయదానాదానాఖ్యం చ హరాసి ప్రయచ్ఛ. తథైవాహమపి తే తుభ్యం త్వదర్థం నిహారాణి నిత్యం ప్రయచ్ఛాని దదాని, స్వాహేతి సత్యభాషణం, సత్యమానం, సత్యాచరణం, సత్యవచనశ్రవణం చ సర్వే వయం మిలిత్వా కుర్యామేతి, సత్యేనైవ సర్వవ్యవహారం కుర్యా. ౨

(గృహా) హే గృహాశ్రమ మిచ్ఛంతో మనుష్యాః, స్వయంవరం వివాహం కృత్వా యూయం గృహాణి ప్రాప్నుత. గృహాశ్రమానుష్ఠానే (మా బిభీత) భయం మా ప్రాప్నుత తథా (మావేపధ్వం) మా కంపధ్వమ్ ( ఊర్జ బిభ్రత ఏమసి) ఊర్జం బలం పరాక్రమం చ బిభ్రతః పదార్థా నేమసి వయం ప్రాప్నుమ - ఇతీచ్ఛత. (ఊర్జం బిభ్రద్వః) వో యుష్మాకం మధ్యేఽహమూర్జం బిభ్రన్త్సన్ (సుమనాః) శుద్ధమనాః సుమేధోత్తమ బుద్ధియుక్తః (మనసా మోదమానః) ప్రాప్తానందః, (గృహానేమి) గృహాణి ప్రాప్నోమి. ౩

(యేషామధ్యేతి) యేషు గృహేషు ప్రవసతో మనుష్యస్య (బహుః) అధికః (సౌమనసః) ఆనందో భవతి. తత్ర ప్రవసన్ యేషాం యాన్ పదార్థాన్ సుఖకారకాన్ స (అధ్యేతి) స్మరతి, (గృహానుపహ్వయామహే) వయం గృహేషు వివాహాదిషు సత్కారార్థం తాన్ గృహసంబంధినః సఖిబంధ్వాచార్యాదీన్ని మంత్రయామహే (తే నః) వివాహనియమేషు కృతప్రతిజ్ఞా నస్మాన్ (జానతః) ప్రౌఢజ్ఞానాన్ యువావస్థాన్ స్వేచ్ఛయా కృతవివాహాన్ తే (జానంతు) అస్మాకం సాక్షిణః సంత్వితి. ౪

(ఉపహూతా ఇహ) హే పరమేశ్వర ! భవత్ కృపయాఽఽహాస్మిన్ గృహాశ్రమే (గావః) పశుపృథివీంద్రియ విద్యాప్రకాశాహ్లాదాదయః (ఉపహూతాః) అర్థాత్ సమ్యక్ ప్రాప్తా భవంతు. తథా అజావయః (ఉపహూతా) అస్మదనుకూలా భవంతు. (అథో అన్నస్య) అథో ఇతి పూర్వోక్త పదార్థప్రాప్త్యనంతరం, నోఽస్మాకం గృహేష్వన్నస్య భోక్తవ్యపదార్థ సమూహస్య కీలాలో విశేషేణోత్తమరస ఉపహూతః సమ్యక్ ప్రాప్తో భవతు. (క్షేమాయ వః శాంత్యై) వో యుష్మాన్ అత్ర పురుషవ్యత్యయో అస్తి, తాన్ పూర్వోక్తాన్ ప్రత్యక్షాన్ పదార్థాన్ (క్షేమాయ) రక్షణాయ, (శాంత్యై) సుఖాయ ప్రపద్యే ప్రాప్తోఽస్మి. తత్ ప్రాప్త్యా (శివం) నిశ్శ్రేయసం కల్యాణం పారమార్థికం సుఖం (శగ్మం) సాంసారిక మాభ్యుదయికం సుఖం చ ప్రాప్నుయామ్. శంయోః (నిఘం ౪।౧) శమితి నిఘంటౌ పదనామాస్తి. పరోపకారాయ గృహాశ్రమే స్థిత్వా పూర్వోక్తస్య ద్వివిధస్య సుఖస్యోన్నతిం కుర్మః. ౫

తె॥ పై మంత్రముల యభిప్రాయము :- ఈ మంత్రములందు గృహాశ్రమము విధింపబడినది. (యద్ గ్రామే) గృహాశ్రమమున నివసించుచు, మనుష్యులు పుణ్యము, విద్యాప్రచారము, సంతానోత్పత్తి, ఉత్తమములు సర్వోపకారకములునగు సామాజిక నియమపాలనము చేయుదురు. అట్లే యరణ్యమున నుండి వానప్రస్థాశ్రమమునందు బ్రహ్మవిచారణ, విద్యాధ్యయనము, తపస్సు చేయుదురు. ఇట్లే సభా సంబంధమునను శ్రేష్ఠకర్మములు, ఇంద్రియ వ్యవహారములందును, మనోవ్యవహారములందును నుత్తమ కర్మముల నొనర్తురు. ఇవి యన్నియు మోక్షప్రాప్తికగుగాక ! మనుష్యులమగు మనము భ్రమవలన నేదేని పాపము చేయుదుమేని యది యాశ్రమానుష్ఠానముతో నాశము చేయుదుము. ౧

పరమేశ్వరుని యుపదేశము : (దేహి మే) సామాజిక నియమముల వ్యవస్థ ననుసరించి నడచుకొనుటయే గృహస్థుని పరమోన్నతికి కారణమగును. ఎవనినుండియైన నేదేని వస్తువు గ్రహించినను, నెవనికైన నేదేని యిచ్చినను నది సత్యవ్యవహారముతో కూడియుండవలెను. (ని మే ధేహి, ని తే దధే) 'నేను నీకీపని చేయుదును. నీవు నాకు నిట్లు చేయుము' అను నిట్టి వ్యవహారముకూడ సత్యముతో గూడియుండవలెను. (నిహారం చ హరాసి మే ని) నేను నీకీ వస్తువు నిత్తును నీవు నాకిదియిమ్ము - అను నిట్టి వ్యవహారమునను గూడ లోటు జరుగరాదు - ఎవనితోను నేవిషయము నందును మిథ్యావ్యవహారము జరుపరాదు. ఇట్లే గృహస్థుల వ్యవహారములు చక్కగ సిద్ధించును. గృహస్థులు బాగుగ నాలోచించి యందఱికిని హితమొనర్చుచు వ్యవహరించిన వారికున్నతి కలుగును. సత్యము చెప్పుట, సత్యము నంగీకరించుట, సత్యము నాచరించుట, సత్యమునే వినుటయు 'స్వాహా' శబ్దమున కర్థము కావున ప్రతి గృహస్థుడును తన వ్యవహారములనన్నింటిని సత్యములగునట్లు యత్నింపవలెను. ౨

(గృహా మా బిభీత) గృహస్థాశ్రమమును గోరు మానవులార ! మీరు మీ మీ యిచ్ఛల ననుసరించి వివాహములను జేసికొని, (స్వయంవర మాచరించి) గృహస్థాశ్రమమునందు ప్రవేశింపుడు. భయపడకుడు; కంపింపకుడు. ఆ యాశ్రమమునందుండి బలపరాక్రమముల నొసంగు పదార్థములను సంగ్రహింపుడు.

నూతనముగ గృహాశ్రమమున బ్రవేశించు వ్యక్తి 'నేను పరమేశ్వరుని కృపవలన మీయందఱిమధ్య పరాక్రమము, శుద్ధమనస్సు, ఉత్తమబుద్ధి, ఆనందముబొంది గృహస్థాశ్రమమును నిర్వహింతును' అని గృహస్థులతో నుడువవలెను. ౩

(యేషామధ్యేతి) ఏ గృహములందుండు మనుజులకధికానందము గలుగునో యా మనుష్యులు తమ మిత్రులను, బంధువులను, ఆచార్యాదులను స్మరింతురు. మఱియు వివాహాది శుభకార్యముల బంధు మిత్రులను సత్కారపూర్వకముగ నాహ్వానించి వారికి తమ కోరికనిట్లు వెల్లడింతురు - మీరెల్లరు మమ్ములను యువావస్థలో నున్నవారినిగను, వివాహాది నియమములను సరిగా నంగీకరించు వారినిగను, నెఱుగుడు - మాకు మీరు సాక్షులుగ నుండుడు. ౪

(ఉపహూ) ఓ పరమేశ్వర ! నీ కృపవలన గృహాశ్రమముననుండు మాకు పశువులు, భూమి, విద్య, ప్రకాశము, ఆనందము, మేకలు, గొఱ్ఱెలు, మున్నగు పదార్థములు బాగుగ లభించుగాక ! మా గృహములలో నుత్తమములు, రసవంతములునగు భోజ్యపదార్థము లెల్లపుడు కొఱవడకుండుగాక. (వః) (ఈపదము పురుషవ్యత్యయముతో ప్రథమ పురుషార్థము నిచ్చును.) పదార్థములను మేము మా సుఖముకొఱకును, వాని రక్షణార్థమును బొందుదుముగాక ! అందువలన మాకు సాంసారిక సుఖములు, పరమార్థము సిద్ధించునుగాక !

(శం యోః) ఈ పదము నిఘంటువునందు పదనామములలో పేర్కొనబడినది. యాస్కముని దీనికర్థము 'రోగశాంతి' భయనివృత్తి' యని నుడివియున్నాడు. ౫

గృహాశ్రమ విషయ సంక్షేపము.

# అథ వానప్రస్థ విషయః సంక్షేపతః

సం॥ "త్రయో ధర్మస్కంధా యజ్ఞోఽధ్యయనం దానమితి ప్రథమస్తప ఏవ, ద్వితీయో బ్రహ్మచార్యాచార్యకులవాసీ, తృతీయోఽత్యంత మాత్మానమాచార్య కులేఽవసాదయన్ సర్వ ఏతే పుణ్యాలోకా భవంతి." ౧ ఛాందో. ౨-౨౩-౧

(త్రయోధర్మ) అత్ర సర్వేష్వాశ్రమేషు ధర్మస్య స్కంధా అవయవాస్త్రయః సంతి :- అధ్యయనం, యజ్ఞః క్రియాకాండం, దానం చ; తత్ర ప్రథమే బ్రహ్మచారీ.తపః - సుశిక్షాధర్మానుష్ఠానేనాచార్యకులే వసతి. ద్వితీయో గృహాశ్రమీ, తృతీయోఽత్యంతమాత్మాన మవసాదయన్ - హృదయే విచారయ న్నేకాంతదేశం ప్రాప్య సత్యాసత్యే నిశ్చినుయాత్; స వానప్రస్థాశ్రమీ. ఏతే సర్వే బ్రహ్మచర్యాదయస్త్రయ ఆశ్రమాః పుణ్యాలోకాః సుఖనివాసాః సుఖయుక్తా భవంతి. పుణ్యానుష్ఠానాదేవాశ్రమ సంఖ్యా జాయతే.౧

తె॥ (త్రయోధర్మ) సర్వాశ్రమములందును ధర్మమునకు మూడు స్కంధములు - అవయవములు గలవని వర్ణింపబడినది. ౧. అధ్యయనము, ౨. యజ్ఞము - క్రియాకాండము, ౩. దానము. బ్రహ్మచర్య కాలమున బ్రహ్మచారి తపస్సు చేయుచు శిక్షణను బొందుచు ధర్మానుష్ఠానము నొనర్చుచు నాచార్య కులమున నుండును. రెండవ ఆశ్రమమున నతడు గృహస్థుడగును. మూడవదియగు వానప్రస్థాశ్రమమున నతడు బాగుగ హృదయమున సత్యాసత్యవస్తువులను గూర్చి యాలోచించుచు నుండును. ఈ మూడాశ్రమము లందును సుఖము లభించును. పుణ్యానుష్ఠాన భేదమువలన నాశ్రమసంఖ్య యేర్పడును. ౧

బ్రహ్మచర్యాశ్రమమున విద్యనభ్యసించి, ధర్మమును, ఈశ్వరాది తత్త్వములను బాగుగ నిశ్చయించి, గృహాశ్రమమునందు వాని ననుష్ఠించి, జ్ఞానమును వృద్ధిచేసికొని, తదుపరి యేకాంతమునజేరి యట సత్యాసత్య వస్తువులను వ్యవహారముతో నిశ్చయించి వానప్రస్థమును పూర్తిచేసి సంన్యాసి కావలెను. ౧. బ్రహ్మచర్యాశ్రమమును సమాప్తముచేసి గృహస్థుడు కావలెను. తదుపరి వానప్రస్థుడు, అటుపై సంన్యాసి కావలెను. ఇదియొక పక్షము. ౨. పూర్ణవైరాగ్యము కలిగినచో గృహస్థాశ్రమమునకు తరువాతనే సంన్యాసమును గ్రహింపనగును. ఇది రెండవ పక్షము. ౩. బ్రహ్మచర్యాశ్రమమునకు తరువాతనే పూర్ణవైరాగ్యము కలిగినచో గృహస్థ వానప్రస్థములను విడిచి, తిన్నగా సంన్యాసి కావచ్చును. ఇది మూడవపక్షము. ఈ మూడు పక్షములందును గృహస్థ, వానప్రస్థాశ్రమములను విడిచి సంన్యాసమును గ్రహింపవచ్చునని వికల్పము చెప్పబడినది; కాని, బ్రహ్మచర్యమును విడుచుట కంగీకరింపలేదు. కావున బ్రహ్మచర్యమును ప్రతి వ్యక్తియు పాలింపవలెను. బ్రహ్మచర్యాశ్రమ ధర్మపాలనము చేయని పక్షమున నన్యాశ్రమములు సిద్ధింపవు.

వానప్రస్థ విషయ సంక్షేపము

# అథ సంన్యాస విషయః సంక్షేపతః

బ్రహ్మచర్యాశ్రమేణ గృహీతవిద్యో ధర్మేశ్వరాది సమ్యఙ్ నిశ్చిత్య, గృహాశ్రమేణ తదనుష్ఠానం తద్విజ్ఞానవృద్ధిం చ కృత్వా, తతో వనమేకాంతం గత్వా, సమ్యక్ సత్యాసత్యవస్తువ్యవహారాన్నిశ్చిత్య, వాన ప్రస్థాశ్రమం సమాప్య సన్న్యాసీ భవేత్, అర్థాత్ బ్రహ్మచర్యాశ్రమం సమాప్య గృహీ భవేత్, గృహీ భూత్వా వనీ భవేత్, వనీభూత్వా ప్రవ్రజే దిత్యేకః పక్షః. ("యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్ వనాద్ వా గృహాద్ వా" జాబాల. ఉ-౪) అస్మిన్ పక్షే వానప్రస్థాశ్రమ మకృత్వా గృహాశ్రమానంతరం సన్న్యాసం గృహ్ణీయాదితి ద్వితీయఃపక్షః. (బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత) సమ్యగ్ బ్రహ్మచర్యాశ్రమం కృత్వా గృహస్థ, వానప్రస్థాశ్రమా వకృత్వా సన్న్యాసాశ్రమం గృహ్ణీయాదితి తృతీయః పక్షః. సర్వత్రాన్యాశ్రమవికల్ప ఉక్తః. పరంతు బ్రహ్మచర్యాశ్రమానుష్ఠానం నిత్యమేవ కర్తవ్యమిత్యాయాతి. కుతః! బ్రహ్మచర్యాశ్రమేణ వినాఽన్యాశ్రమానుపపత్తేః.

సం॥ "బ్రహ్మ సగ్ంస్థోఽ మృతత్వమేతి" ౧ ఛాం. ౨-౨౩

"తమేతం వేదానువచనేన వివిదిషంతి. బ్రహ్మచర్యేణ తపసా శ్రద్ధయా యజ్ఞేనానాశకేన చైతమేవ విదిత్వా మునిర్ భవత్యేతమేవ ప్రవ్రాజినో లోక మీప్సంతః ప్రవ్రజంతి. ఏతద్ధస్మ వై తత్పూర్వే బ్రాహ్మణాః, అనూచానా విద్వాగ్ంసః ప్రజాం న కామయంతే, కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయమాత్మాఽయం లోక ఇతి. తే హ స్మ పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరంతి. యాహ్యేవ పుత్రైషణా సా విత్తైషణా, యా విత్తైషణా సా లోకైషణా, ఉభే హ్యేతే ఏషణే ఏవ భవతః. ౨ శత. ౧౪-౭-౨-౨౫-౨౬

(బ్రహ్మసగ్ంస్థః) చతుర్థో బ్రహ్మసంస్థః; సంన్యాసీ అమృతత్వం (ఏతి) ప్రాప్నోతి. ౧

(తమేతం వేదా) సర్వ ఆశ్రమిణో, విశేషతః సంన్యాసి మతమేతం (సంన్యాసినస్తమేతం) పరమేశ్వరం సర్వభూతాధిపతిం వేదానువచనేన తదధ్యయనేన తచ్ఛ్రవణేన తదుక్తానుష్ఠానేన చ వేత్తుమిచ్ఛంతి. (బ్రహ్మచర్యేణ) బ్రహ్మచర్యేణ, తపసా ధర్మానుష్ఠానేన, శ్రద్ధయాఽత్యంత ప్రేమ్ణా, యజ్ఞేన నాశరహితేన విజ్ఞానేన ధర్మక్రియాకాండేన చైతం పరమేశ్వరం విదిత్వైవ మునిర్ భవతి. ప్రవ్రాజినః సంన్యాసిన ఏనం యథోక్తం లోకం ద్రష్టవ్యం పరమేశ్వర మేవేప్సంతః ప్రవ్రజన్తి, సంన్యాసాశ్రమం గృహ్ణంతి. (ఏతద్ బ్రహ్మ) య ఏత దిచ్ఛంతః సంతః, పూర్వే అత్యుత్తమా బ్రాహ్మణా బ్రహ్మవిదోఽనూచానా నిశ్శంకాః పూర్ణజ్ఞానినోఽన్యేషాం శంకానివారకాః విద్వాంసః ప్రజాం గృహాశ్రమం న కామయంతే నేచ్ఛంతి. (తే హ స్మ) హేతి స్ఫుటే, స్మేతిస్మయే; తే ప్రోత్ ఫుల్లాః ప్రకాశమానా వదంతి వయం ప్రజయా కింకరిష్యామః కిమపి నేత్యర్థః. యేషాం నోఽస్మాక మయమాత్మా పరమేశ్వరః ప్రాప్యో, లోకో దర్శనీయ శ్చాస్తి. ఏవం తే (పుత్రైషణాయాశ్చ) పుత్రోత్పాదనేచ్ఛాయాః (విత్తైషణాయాశ్చ) జడధన ప్రాప్త్యనుష్ఠానేచ్ఛాయాః (లోకైషణాయాశ్చ) లోకే స్వస్య ప్రతిష్ఠాస్తుతి నిందేచ్ఛాయాశ్చ (వ్యుత్థాయ) విరజ్య (భిక్షాచర్యం చ) సంన్యాసాశ్రమానుష్ఠానం కుర్వంతి యస్య పుత్రైషణా పుత్రప్రాప్త్యేషణేచ్ఛా భవతి; తస్యావశ్యం విత్తైషణాఽపి భవతి; యస్య విత్తైషణా తస్య నిశ్చయేన లోకైషణా భవతీతి విజ్ఞాయతే. తథా యస్యైకా లోకైషణా భవతి, తస్యోభే పూర్వేపుత్రైషణాలోకైషణే

భవతః. యస్య చ పరమేశ్వరమోక్ష ప్రాప్త్యేషణేచ్ఛాస్తి, తస్యైతా స్త్రిస్రో నివర్తంతే. నైవ బ్రహ్మానందవిత్తేన తుల్యం లోకవిత్తం కదాచిత్ భవితు మర్హతి. యస్య పరమేశ్వరే ప్రతిష్ఠాఽస్తి, తస్యాన్యాః సర్వాః ప్రతిష్ఠా నైవ రుచితా భవంతి. సర్వాన్ మనుష్యా ననుగృహ్ణన్ సర్వదా సత్యోపదేశేన సుఖయతి; తస్య కేవలం పరోపకారమాత్రం సత్యప్రవర్తనం ప్రయోజనం భవతీతి. ౨

తె॥ (బ్రహ్మసగ్ంస్థః) చతుర్థుడు బ్రహ్మస్థుడైన సంన్యాసి మోక్షమును బొందును.

(తమేతం వేదా) ఆశ్రమవాసులెల్లరు, ముఖ్యముగ సంన్యాసియు - ఎల్లరకు స్వామి యగు పరమేశ్వరుని, వేదాధ్యయనము, శ్రవణము, వేదాజ్ఞాపాలనము నొనర్చుటవలన నెఱుగ గోరుదురు. (బ్రహ్మచర్యేణ) బ్రహ్మచర్యము, తపస్సు - ధర్మానుష్ఠానము, శ్రద్ధ - అత్యంతప్రేమ, యజ్ఞము - నాశరహితమగు విజ్ఞానము లేక ధర్మమునకు సంబంధించిన క్రియాకలాపము మూలమున పరమేశ్వరు నెఱింగియే ముని యగును. పూర్వము చెప్పినట్లు ద్రష్టవ్యుడగు పరమేశ్వరునే కామించుచు సంన్యాసి సంన్యాసాశ్రమమును గ్రహించును. (ఏతద్ బ్రహ్మ) బ్రహ్మ నిచ్ఛయించు సత్యుత్తమ బ్రాహ్మణుడు - బ్రహ్మవిదుడగు విద్వాంసుడును, నట్లే యితరుల సందేహములను దూరమొనర్చు మనుష్యుడును గృహాశ్రమము నిచ్ఛగింపరు. (తే హ స్మ) జ్ఞానప్రకాశ యుక్తులగువారు తమకు ప్రజ-సంతానముతో నేమియు ప్రయోజనము లేదందురు. వారికి పరమేశ్వరుడే గమ్యుడు. అతడే వారికి తెలియదగినవాడు. ఇట్లు వారు (పుత్రైషణాయాశ్చ) సంతానము గనుకోరిక నుండియు, (విత్తైషణా యాశ్చ) జడవస్తు రూపమగు ధనమును సంపాదించి, దానిని వినియోగించు కోరికనుండియు, (లోకైషణాయాశ్చ) ప్రపంచమున తమకు యశస్సు కలుగవలయునను కోరికనుండియు (విరజ్య) విరక్తులయి (భిక్షాచర్యం) సంన్యాసమును గ్రహింతురు. పుత్రకామన కలవానికి ధనసంపాదన కోరిక తప్పక కలుగును. ఎవనికి ప్రతిష్ఠాకాంక్ష యుండునో, వానికి పుత్రేచ్ఛయు, ధనేచ్ఛయు గల్గును. పరమేశ్వరు నెఱింగి, మోక్షమును బొందవలయునను వానికి పై మూడు కోరికలును నశించును. బ్రహ్మానందరూపధనమునకు లోకధనము సమానమెన్నడును గాదు. పరమేశ్వరునియందు ప్రతిష్ఠకలవాని కితర ప్రతిష్ఠలు రుచింపవు. అతనికి పరోపకారము చేయుటయు, సత్యప్రవర్తనము ముఖ్యోద్దేశమగును. ౨

సం॥ "ప్రాజాపత్యామిష్టిం నిరూప్య తస్యాం సర్వవేదసం హుత్వా బ్రాహ్మణః ప్రవ్రజేదితి - శతపథే శ్రుత్యక్షరాణి. "యం యం లోకం మనసా సంవిభాతి విశుద్ధసత్త్వః కామయతే యాంశ్చ కామాన్, తం తం లోకం జాయతే తాంశ్చ కామాం స్తస్మాదాత్మజ్ఞం హ్యర్చయేద్ భూతికామః" ౩

ముండక. ౩-౧-౧౦

(ప్రాజాపత్యా) స చ సంన్యాసీ ప్రాజాపత్యాం పరమేశ్వరదేవతాకామిష్టిం కృత్వా, హృదయే సర్వమేతన్నిశ్చిత్య, తస్యాం (సర్వవేదసం) శిఖా సూత్రాదికం హుత్వా, మునిర్ మననశీలః సన్, ప్రవ్రజతి సంన్యాసం గృహ్ణాతి.

పరంత్వయం పూర్ణవిద్యావతాం రాగద్వేషరహితానాం సర్వమనుష్యోపకారబుద్ధీనాం సంన్యాసగ్రహణాధికారో భవతి; నాల్ప విద్యానామితి. తేషాం సంన్యాసినాం ప్రాణాపాన హోమో, దోషేభ్య ఇంద్రియాణాం మనసశ్చ సదా నివర్తనం, సత్యధర్మానుష్ఠానం చైవాగ్నిహోత్రమ్, కింతు పూర్వేషాం త్రయాణా మేవాశ్రమిణా మనుష్ఠాతుం యోగ్యం, యద్బాహ్య క్రియామయ మస్తి సంన్యాసినాం తన్న, సత్యోపదేశ ఏవ సంన్యాసినాం బ్రహ్మయజ్ఞః, దేవయజ్ఞో బ్రహ్మోపాసనం, విజ్ఞానినాం ప్రతిష్ఠాకరణం పితృయజ్ఞః, దేవయజ్ఞో బ్రహ్మోపాసనం, విజ్ఞానినాం ప్రతిష్ఠాకరణం పితృయజ్ఞః,

హ్యజ్ఞేభ్యో జ్ఞానదానం, సర్వేషాం భూతానా ముపర్యనుగ్రహాఽపీడనం చ భూతయజ్ఞః. సర్వ మనుష్యోపకారార్థం భ్రమణ మభిమానశూన్యతా, సత్యోపదేశకరణేన సర్వమనుష్యాణాం సత్కారానుష్ఠానం చాతిథియజ్ఞః. ఏవం లక్షణాః పంచమహాయజ్ఞా విజ్ఞాన ధర్మానుష్ఠానమయా భవంతీతి విజ్ఞేయమ్. పరంత్వేకస్యాద్వితీయస్య సర్వశక్తిమదాది విశేషణయుక్తస్య పరబ్రహ్మణ ఉపాసనా సత్యధర్మానుష్ఠానం చ, సర్వేషామాశ్రమిణా మేక మేవ భవతీత్యయం విశేషః.

(విశుద్ధస) శుద్ధాంతః కరణో మనుష్యః యం యం లోకం (మనసా) ధ్యానేన (సంవిభాతి) ఇచ్ఛతి. (కామయతే యాంశ్చ కామాన్) యాంశ్చ మనోరథా నిచ్ఛతి తం తం లోకం, తాంశ్చ కామాన్(జాయతే) ప్రాప్నోతి. తస్మాత్ కారణాత్ (భూతికామః) ఐశ్వర్యకామో మనుష్యః, (ఆత్మజ్ఞం) ఆత్మానం పరమేశ్వరం జానాతీతి తం సంన్యాసినమేవ సర్వదాఽర్చయేత్ సత్కుర్యాత్. తస్యైవ సంగేన సత్కారేణ చ మనుష్యాణాం సుఖప్రదా లోకాః, కామాశ్చ సిద్ధా భవంతీతి. తద్భిన్నాన్ మిథ్యోపదేశకాన్ స్వార్థసాధన తత్పరాన్ పాషండినః కోఽపి నైవార్చయేత్, కుతః ? తేషాం సత్కారస్య నిష్ఫలత్వా ద్దుఃఖఫల త్వాచ్చేతి. 3

తె॥ (ప్రాజాపత్యా) సంన్యాసి, పరమేశ్వరుడే దేవతగా గల యిష్టి (ప్రాజాపత్యేష్టి) ని జేసి, హృదయమున నిదియంతయు నిశ్చయించి, యాయిష్టియందు, (సర్వవేదసం) శిఖాసూత్రాదికమును హోమమొనర్చి, మనస్వియై సంన్యాసమును గ్రహింపవలెను. కాని, పూర్ణ విద్వాంసుడు, రాగ ద్వేషరహితుడు, సర్వమానవులకు నుపకారము చేయవలయునను బుద్ధిగలవాడు నగు వానికే యీ సంన్యాసమున కధికారము - అల్పవిద్యగలవారి కధికార మిందులేదు. సంన్యాసులకు ప్రాణము నపానమునందును, అపానమును ప్రాణమునందును హోమము చేయుటయు, ఇంద్రియములను మనస్సును దోష - రాగ ద్వేషములనుండి వేఱుచేయుటయు, సత్యధర్మము ననుష్ఠించుటయును అగ్నిహోత్రమగును. మొదటి మూడాశ్రములలోనుండి వా రనుష్ఠించు అగ్నిహోత్రాది కర్మకాండము పంన్యాసి కాచరణీయము కాదు. సత్యోపదేశమే సంన్యాసులకు బ్రహ్మయజ్ఞము. బ్రహ్మోపాసనము - దేవయజ్ఞము. విజ్ఞానులకు ప్రతిష్ఠను గలిగించుట పితృయజ్ఞము. అజ్ఞానులకు జ్ఞానమొసంగుట, సర్వప్రాణులకు నుపకారమొనర్చుట, వానిని గరుణించి దుఃఖము కలిగింపకుండుటయు భూతయజ్ఞ మగును. సర్వమానవులకు నుపకారము సేయు నిమిత్తము భ్రమణము సేయుట, నిరభిమానము, సత్యోపదేశముచేసి మానవులను సత్కరించుటయు అతిథియజ్ఞము. ఇట్టి విజ్ఞానము, ధర్మానుష్ఠానము ననునవియే సంన్యాసులకు పంచమహాయజ్ఞములని యెఱుగవలెను. కాని, అద్వితీయుడు సర్వశక్తిమంతుడు మున్నగు విశేషణయుక్తుడగు పరమేశ్వరు నుపాసించుటయు, సత్యధర్మము ననుష్ఠించుటయు, సంన్యాసులకు, నితరాశ్రమవాసులకును సమానము.

(విశుద్ధస) శుద్ధాంతఃకరణముగల మనుష్యు డేయే లోకమును (మనసా) ధ్యానముతో (సంవిభాతి) కోరునో, (కామయతే యాంశ్చ కామాన్) ఏ మనోరథముల నభిలషించునో యా యా లోకములను కామములను (జాయతే) పొందును. కావున, (భూతికామః) ఐశ్వర్యమును గోరు మనుష్యుడు (ఆత్మజ్ఞం) పరమేశ్వరునెఱుగు సంన్యాసినే యెల్లప్పుడు సత్కరింపవలెను. అతని సాంగత్యము, సత్కారము వలననే మనుష్యులకు సుఖప్రదములగు లోకములు, మనోరథములు సిద్ధించును. మిథ్యోపదేశకులు, స్వార్థపరులు, పాషండులునగు వారి నెవ్వరు నెన్నడు సత్కరింపరాదు. కారణ మేమన :- అట్టివారికి చేసిన సత్కారము నిష్ఫలమగుటయే కాక - మంచి ఫలమునియ్యక పోవుటయే కాక - దుఃఖరూప ఫలము నొసంగును. 3

## సంన్యాస విషయ సంక్షేపము

# అథ పంచమహాయజ్ఞ విషయః సంక్షేపతః

సం॥ యే పంచమహాయజ్ఞా మనుష్యైర్ నిత్యం కర్తవ్యాః సంతి; తేషాం విధానం సంక్షేపతోఽత్ర లిఖామః. తత్ర బ్రహ్మయజ్ఞస్యాయం ప్రకారః -

సాంగానాం వేదాదిశాస్త్రాణాం సమ్యగధ్యయన మధ్యాపనం సంధ్యోపాసనం చ సర్వైః కర్తవ్యమ్. తత్రాధ్యయనాధ్యాపనక్రమో యాదృశః పఠన పాఠన విషయ ఉక్తస్తాదృశో గ్రాహ్యః. సంధ్యోపాసన విధిశ్చ పంచమహాయజ్ఞవిధానే యాదృశ ఉక్తస్తాదృశః కర్తవ్యః. తథాఽగ్నిహోత్రవిధిశ్చ యాదృశస్తత్రోక్తస్తాదృశ ఏవ కర్తవ్యః అత్ర బ్రహ్మయజ్ఞాగ్నిహోత్ర ప్రమాణం లిఖ్యతే -

"సమిధాగ్నిం దువస్యత ఘృతైర్ బోధయతాతిథిమ్, అస్మిన్ హవ్యా జుహోతన" ౧య.౩-౧

(సమిధాగ్నిం) హే మనుష్యాః వాయ్వోషధి వృష్టిజలశుద్ధ్యా పరోపకారాయ; (ఘృతైః) ఘృతాదిభిశ్శోధితైర్ద్రవ్యైః, సమిధా చాతిథి మగ్నిం యూయం బోధయత, నిత్యం ప్రదీపయత. (అస్మిన్) అగ్నౌ (హవ్యా) హోతుమర్హాణి పుష్టిమధురసుగంధరోగనాశకైర్ గుణైర్ యుక్తాని సమ్యక్ శోధితాని ద్రవ్యాణి (ఆ జుహోతన) ఆసమంతా జ్జుహుత. ఏవ మగ్నిహోత్రం నిత్యం (దువస్యత) పరిచరత. అనేన కర్మణా సర్వోపకారం కురుత. ౧

తె॥ మనుష్యులు నిత్యము చేయవలసిన పంచమహాయజ్ఞముల విధానము నిట సంక్షేపముగ వ్రాయుచున్నాము. వానిలో మొదటిది బ్రహ్మయజ్ఞము. సాంగవేదాది శాస్త్రాధ్యయనాధ్యాపనములు, సంధ్యోపాసనము బ్రహ్మయజ్ఞ మనబడును. ప్రతి దినము ప్రాతఃసాయం కాలములందు ఈశ్వరుని స్తుతి ప్రార్థనోపాసనములు చేయవలెను. ఇందలి పఠన పాఠనవ్యవస్థ పూర్వము వర్ణించిన పఠనపాఠన విషయమునందు విస్తారముగ చూడనగును. సంధ్యోపాసనము, అగ్నిహోత్రమునకు సంబంధించిన విధులు పంచమహాయజ్ఞ విధియనెడి పుస్తకమున వ్రాసినట్లు చేయుడు. ఇప్పుడిక్కడ బ్రహ్మయజ్ఞమునకు, నగ్నిహోత్రమునకు జెందిన ప్రమాణములు వ్రాయుచున్నాము.

(సమిధాగ్నిం) ఓ మానవులార ! మీరు, వాయువు, ఓషధులు, వృష్టిజలము వీనిని శుద్ధమొనర్చి యెల్లరకు నుపకారమొనర్చుటకుగాను, శుద్ధమైన నేతితోను, ఆమ్రపలాశాది కాష్ఠములతోను నతిథియగు నగ్నిని నిత్యము ప్రజ్వలింప జేయుడు. ఆ యగ్నియందు హోమము చేయుటకు యోగ్యములు - దుగ్ధము, ఘృతము, మున్నగు పుష్టికారకములు, చక్కెర, బెల్లము, మున్నగు మధురములు, కుంకుమపువ్వు, కస్తూరి మున్నగు సుగంధితములు, సోమలతాది రోగనాశకములునగు పదార్థములను శుద్ధము చేసియుంచి వానితో నిత్యమగ్నిహోత్రముచేసి యెల్లరకు నుపకారము చేయుడు. ౧

సం॥ "అగ్నిం దూతం పురోదధే హవ్యవాహ ముపబ్రువే దేవాఀ ఆసాదయాదిహ" ౨

య. ౨౨-౧౭

(అగ్నిం దూతం) అగ్నిహోత్రకర్తా ఏవమిచ్ఛేత్ - అహం వాయౌ మేఘమండలే చ భూతద్రవ్యస్య ప్రాపణార్థ మగ్నిం దూతం భృత్యవత్ (పురోదధే) సమ్ముఖతః స్థాపయే. కథం భూత మగ్నిం ? (హవ్యవాహమ్) హవ్యం ద్రవ్యం దేశాంతరం వహతి ప్రాపయతీతి హవ్యవాట్, తం (ఉపబ్రువే) అన్యాన్

జిజ్ఞాసూన్ ప్రత్యుపదిశామి (దేవాన్౨) సోఽగ్నిరేతదగ్నిహోత్ర కర్మణా దేవాన్ దివ్యగుణాన్ వాయువృష్టి జలశుద్ధి ద్వారా ఇహాస్మిన్ సంసార ఆసాదయా దాసమంతాత్ ప్రాపయతి. యద్వా హే పరమేశ్వర ! (దూతం) సర్వేభ్యః సత్యోపదేశకం (అగ్నిం) అగ్నిసంజ్ఞకం త్వాం (పురోదధే) ఇష్టత్వేనోపాస్యం మన్యే, తథా (హవ్యవాహం) గ్రహీతుం యోగ్యం శుభగుణమయం విజ్ఞానం హవ్యం, తద్వహతి ప్రాపయతీతి తం త్వాం (ఉపబ్రువే) ఉపదిశామి. స భవాన్ కృపయా (ఇహ) అస్మిన్ సంసారే, (దేవాన్) దివ్యగుణాన్ (ఆసాదయాత్) ఆ సమంతాత్ ప్రాపయతు. ౨

తె॥ (అగ్నిం దూతమ్) మొదటి యర్థము : అగ్నిహోత్రము చేయు మనుజుని కథనము – నేను ప్రాణుల కుపకారముజేయు పదార్థములను వాయువునందును, మేఘమండలమునందును జేర్చుటకు నగ్నిని సేవకునివలె నెదుట నుంచుకొను చున్నాను. ఆ యగ్ని హవ్యము హోమమొనర్చుటకు దగిన వస్తువులను దేశాంతరమునకు జేర్చును. కావుననే యగ్నికి 'హవ్యవాట్' అని పేరు. ఆయగ్నిహోత్రము నెఱుగగోరువారికి నే నుపదేశించుచున్నాడ. అగ్నిహోత్రకర్మమం దుపయోగింపబడునగ్ని వాయువును, వృష్టిజలమును శుద్ధమొనర్చి (ఇహం) ఈ లోకమున సంతట, (దేవాన్౨) దివ్యగుణములను చేర్చును. రెండవ యర్థము : ప్రాణుల కెల్లరకు సత్యోపదేశకుడవగు నో పరమేశ్వర ! అగ్ని నామముతో బ్రసిద్ధుడవగు నిన్ను ఉపాసనకు యోగ్యుడవుగా నెంచుచున్నాను. నిన్నెఱుగగోరువారికిగూడ 'నీవు శుభగుణ యుక్తుడవు, విశేషజ్ఞానదాయకుడవు' నని నిన్ను గూర్చి యుపదేశించున ట్లనుగ్రహింపుము. నీవును కృపతో నీ లోకమునందు శ్రేష్ఠగుణములను జేర్చుము. ౨

*సం॥* "*సాయం సాయం గృహపతిర్నో అగ్నిః ప్రాతః ప్రాతః సౌమనస్యదాతా, వసోర్ వసోర్ వసుదాన ఏధి వయంత్వేంధానా స్తన్వం పుషేమ*" ౩ *అథ. ౧౯-౭-౫౫-౩*

*(నః) అస్మాక మయం (అగ్నిః) భౌతికః, పరమేశ్వరశ్చ (గృహపతిః) గృహాత్మ పాలకః, ప్రాతః సాయం పరిచరితః సూపాసితశ్చ (సౌమనస్య దాతా) ఆరోగ్యస్యానందస్య చ దాతాస్తి. తథా (వసోర్వ) ఉత్తమోత్తమ పదార్థస్య చ దాతాస్తి, అత ఏవ పరమేశ్వరః (వసుదానః) ఇతి నామ్నా ఖ్యాయతే. హే పరమేశ్వర ! ఏవం భూతస్త్వ మస్మాకం రాజ్యాది వ్యవహారే హృదయే చ (ఏధి) ప్రాప్తో భవ. తథా భౌతికోఽప్యగ్నిరత్ర గ్రాహ్యః, (వయంత్వే) హే పరమేశ్వర ! ఏవం (త్వా) త్వా మింధానాః ప్రకాశమానా వయం (తన్వం) శరీరం, (పుషేమ) పుష్టం కుర్యామ. తథాగ్నిహోత్రాదికర్మణా భౌతికమగ్ని మింధానాః ప్రదీపయితారః సంతః సర్వే వయం పుష్యామః.* ౩

తె॥ (సాయం సాయం) (నః అగ్నిః గృహపతిః) ప్రతిదినము ప్రాతః సాయంకాలములందు బాగుగ నుపాసింపబడి గృహమును, గృహపతిని రక్షించు భౌతికాగ్నియు పరమేశ్వరుడును, (సౌమనస్యదాతా) ఆరోగ్యమును, ఆనందమును, ఉత్తమోత్తమ పదార్థములను నిచ్చువారగుదురు. కావుననే పరమేశ్వరుడు (వసుదానః) ఉత్తమ పదార్థములను, ధనమును నిచ్చువాడని ప్రసిద్ధుడై యున్నాడు. ఓ పరమేశ్వర ! ఇట్టి నీవు నారాజ్యాది వ్యవహారము లందును, చిత్తమునందును నెల్లపుడు ప్రకటితుడవగుము. ఇట భౌతికాగ్నియు గ్రహింప యోగ్యమగును. (వయంత్వే) ఓ జగదీశ్వర ! మేము పూర్వోక్తరీతితో నిన్ను ప్రకాశింపజేయుచు, గౌరవించుచు నీ శరీరముతో (పుషేమ) బలపడుదుముగాక ! అట్లే భౌతికాగ్నినికూడ ప్రజ్వలింపజేసి పుష్టిని బొందుదుము. ౩

సం॥ "ప్రాతః ప్రాతర్ గృహపతిర్ నో అగ్నిః సాయం సాయం సౌమనస్య దాతా, వసోర్ వసోర్ వసుదాన ఏధీంధానా స్త్వా శతహిమాఋధేమ" ॥ అథర్వ. ౧౯–౭–౫౫–౪

(ప్రాతః ప్రాతర్ గృహపతిర్ నో) అస్యార్థః పూర్వవద్ విజ్ఞేయః. అత్ర విశేషస్త్వయమ్. ఏవమగ్నిహోత్ర మీశ్వరోపాసనం చ కుర్వంతః సంతః (శతహిమాః) శతం హిమా హేమంతర్తవో గచ్ఛంతి యేషు సంవత్సరేషు తే శతహిమా యావత్ స్యు స్తావత్ (ఋధేమ) వర్ధేమహి. ఏవం కృతేన కర్మణా నోఽస్మాకం కదాచి ద్ధానిర్ న భవేది తీచ్ఛామః. ॥

తె॥ (ప్రాతః ప్రాతః) ఈ మంత్రార్థము పూర్వమంత్రార్థమునకు సమానమే. కాని యిందొకింత విశేషమున్నది. అగ్నిహోత్రము, ఈశ్వరోపాసనము చేయుచు మనము, (శతహిమాః) నూఱు హేమంత ఋతువులు గడచి పోవునంత వఱకు నూఱు సంవత్సరముల వఱకు ధనాది పదార్థములతో (ఋధేమ) వృద్ధి నొందుదుముగాక ! మేమొనర్చు యీ కర్మమువలన మాకు హాని కలుగకుండుగాక ! ఇదియే మాప్రార్థన. ॥

సం॥ "అగ్నిహోత్ర కరణార్థం తామ్రస్య మృత్తికాయా వైకాం వేదిం సంపాద్య, కాష్ఠస్య రజత సువర్ణయోర్వా చమస మాజ్యస్థాలీం చ సంగృహ్య, తత్ర వేద్యాం పలాశామ్రాది సమిధః సంస్థాప్యాగ్నిం ప్రజ్వాల్య, తత్ర పూర్వోక్తద్రవ్యస్య ప్రాతః సాయం కాలయోః ప్రాతరేవ వా–ఉక్త మంత్రైః నిత్యం హోమం కుర్యాత్.

తె॥ అగ్నిహోత్ర మొనర్చుటకు రాగితోకాని, మట్టితోకాని అగ్నికుండమును సిద్ధము చేసికొనవలెను. కొయ్య, వెండి, సువర్ణములలో దేనితోనైనను నగ్నిలో ఘృతాది పదార్థములను వేయుటకు దగిన గరిటె మున్నగు పాత్రలను నిర్మించుకొనవలెను. అగ్నిని ప్రజ్వలింప చేయుటకుగాను మామిడి, రావి, మోదుగ మున్నగు వృక్షముల పుల్లలు - సమిధలు - సంపాదించు కొనవలెను. ఈ పదార్థముల నన్నింటిని సంపాదించుకొని విధిపూర్వకముగ ప్రాతః సాయంకాలములు రెండు వేళలలో కాని, ప్రాతః కాలమునందే రెండు వేళలకు సంబంధించిన విధి పూర్ణముగ గాని నిత్యము చేయవలెను.

# అథాగ్నిహోత్రే హోమకరణమంత్రాః

సం॥ "సూర్యో జ్యోతిర్ జ్యోతిః సూర్యః స్వాహా" ౧

"సూర్యో వర్చో జ్యోతిర్ వర్చః స్వాహా" ౨

"జ్యోతిః సూర్యః సూర్యో జ్యోతిః స్వాహా" ౩

"సజూర్ దేవేన సవిత్రా సజూరుషసేంద్రవత్యా జుషాణః సూర్యో వేతు స్వాహా" ౪

ఇతి ప్రాతఃకాల మంత్రాః :-

"అగ్నిర్ జ్యోతిర్ జ్యోతిరగ్నిః స్వాహా" ౧

"అగ్నిర్ వర్చో జ్యోతిర్ వర్చః స్వాహా" ౨

"అగ్నిర్ జ్యోతి" రితి మంత్రం మనసోచ్చార్య తృతీయా ఆహుతిర్ దేయా ౩

"సజూర్ దేవేన సవిత్రా సజూరాత్రేంద్రవత్యా జుషాణో అగ్నిర్ వేతు స్వాహా" ౪

య. ౩—౯—౧౦

ఇతి సాయంకాలమంత్రా :-

(సూర్యో...) యశ్చరాచరాత్మా, జ్యోతిషాం ప్రకాశకానాం జ్యోతిః ప్రకాశకః, సూర్యః సర్వప్రాణః పరమేశ్వరోఽస్తి తస్మై స్వాహేఽర్థాత్ తదాజ్ఞాపాలనేన సర్వజగదుపకారాయైకాహుతిం దద్మః" ౧

(సూర్యోవ...) యోవర్చః సర్వవిదాం జ్యోతిషాం జ్ఞానవతాం జీవానాం, వర్చోఽంతర్యామితయా సత్యోపదేష్టా సర్వాత్మా సూర్యః పరమేశ్వరోఽస్తి తస్మై. ౨

(జ్యోతిః సూ...) యః స్వయంప్రకాశః సర్వజగత్ప్రకాశకః సూర్యో జగదీశ్వరోఽస్తి తస్మై ౩

(సజూ...) యో దేవేన ద్యోతకేన సవిత్రా సూర్యలోకేన జీవేన చ సహ, తథా (ఇంద్రవత్యా) సూర్య ప్రకాశవత్యోషసా అథవా జీవవత్యా మానసవృత్త్యా (సజూః) సహ వర్తమానః పరమేశ్వరోఽస్తి సః (జుషాణః) సంప్రీత్యా వర్తమానః సన్ (సూర్యః) సర్వాత్మా కృపాకటాక్షేణాస్మాన్ వేతు విద్యాది సద్గుణేషు జాతవిజ్ఞానాన్ కరోతు తస్మై. ౪

"ఇమాశ్చతస్ర ఆహుతీః ప్రాతరగ్నిహోత్రే కుర్వంతి"

అథ సాయంకాలాహుతయః :-

(అగ్నిర్ జ్యోతిః...) యో జ్ఞాన స్వరూపో, జ్యోతిషాం జ్యోతిరగ్నిః పరమేశ్వరోఽస్తి తస్మై. ౧

(అగ్నిర్ వర్చో...) యః పూర్వోక్తోఽగ్ని పరమేశ్వరోఽస్తి తస్మై. ౨

అగ్నిర్ జ్యోతిః – ఇత్యనేనైవ తృతీయాహుతిర్దేయా. తదర్థశ్చ పూర్వవత్ ౩

(సజూర్ దే) యః పూర్వోక్తేన దేవేన సవిత్రా సహ పరమేశ్వరం సజూ రస్తి; యశ్చేంద్రవత్యా వాయుచంద్రవత్యా రాత్ర్యా సహ వర్తతే సోఽగ్నిః (జుషాణః) సంప్రీతోఽస్మాన్ వేతు నిత్యానంద మోక్షసుఖాయ స్వకృపయా కామయతు, తస్మై జగదీశ్వరాయ స్వాహేతి పూర్వవత్. ౪

ఏతాభిః సాయంకాలేఽగ్ని హోత్రిణో జుహ్వతి, ఏకస్మిన్ కాలే సర్వాభిర్ వా.

తె॥(సూర్యో జ్యో...) చరాచరముల కాత్మయు, ప్రకాశ స్వరూపుడు, సూర్యాది ప్రకాశక లోకములకును ప్రకాశకుడు, నెల్లరకు ప్రాణమునగు పరమేశ్వరుని కొఱకు మేము హోమము చేయుచున్నాము. అతని యాజ్ఞను పాలించుట మూలమున సమస్త జగత్తునకు నుపకారము చేయుట కొఱక యాహుతి నిచ్చు చున్నాము. ౧

(సూర్యో వర్చో) సూర్యుడు-పరమేశ్వరుడు మనకన్ని విద్యల నొసంగువాడు; మన ద్వారమున వానిని ప్రచారము చేయించువాడును. అతని యనుగ్రహమున మన మగ్ని హోత్రము చేయు చున్నాము. ౨

(జ్యోతిః సూర్యః) స్వయం ప్రకాశమానుడు, సర్వజగత్ ప్రకాశకుడునగు సూర్యుని పరమేశ్వరునికొఱకు మనము అగ్నిహోత్రము చేయుచున్నాము. ౩

(సజూర్ దేవేన) ప్రకాశకమగు సూర్యలోకముతోను, జీవుని తోను, (ఇంద్రవత్యా) సూర్య ప్రకాశముగల యుషస్సుతోను, లేక జీవయుక్త మానసవృత్తితోను వర్తించువాడును, (జుషాణః) ప్రీతితో వర్తించువాడును (సూర్యః) సర్వాత్ముడునునగు పరమేశ్వరుడు కృపతో మనలను విద్యాదిగుణయుక్తుల నొనర్చుగాక! ఆ ప్రభువు కొఱకే అగ్ని హోత్రము చేయుచున్నాము. ౪

అగ్నిహోత్రులు ప్రాతః కాలమున నీ నాలుగాహుతులతో హోమము చేయుదురు.

సాయంకాలాహుతులుః- (అగ్నిర్ జ్యో) అగ్ని - జ్యోతిః స్వరూపుడగు పరమేశ్వరుని యాజ్ఞ వలన మేము పరోపకారము నిమిత్తము హోమము చేయుచున్నాము. [పరమేశ్వరునిచే రచియింపబడిన యీ భౌతికాగ్ని, తనలో నాహుతి చేయబడిన ద్రవ్యములను సూక్ష్మరూపమున మార్చి వాయువునందును, వృష్టి జలమునందును జేర్చి వాయువును, జలమును శుద్ధముచేయును. అందువలన ప్రాణులకు సుఖము, ఆరోగ్యము చేకూర్చును.] ౧

(అగ్నిర్ వర్చో) అగ్ని =పరమేశ్వరుడు, వర్చః= సర్వ విద్యలనొసంగు వాడు. భౌతికాగ్ని ఆరోగ్యమును, బుద్ధిని వర్ధిల్లజేయును. కావున మేము పరమేశ్వరుని హోమము ద్వారమున నుపాసింతుము. ౨

మౌనియై-మొదటి మంత్రమునే మనస్సున నుచ్చరించి మూడవ యాహుతి నొసంగవలెను. మంత్రార్థము పూర్వము వ్రాసియున్నాము. ౩

(సజూర్ దేవేన) సూర్యాది లోకములందు వ్యాపకుడై యున్న పరమేశ్వరుడు, వాయువు మూలమున రాత్రి కాలమున ప్రపంచమునకు పరమహితము నొనర్చుచు, కృపతో మమ్ములను నిత్యానందమగు మోక్షము కొఱకు ఉత్సాహయుక్తుల నొనర్చుగాక! ఆ జగదీశ్వరుని ప్రీత్యర్థము హోమము చేయుచున్నాము. ౪

సం॥ అథోభయోః కాలయో రగ్నిహోత్రే హోమకరణార్థాః సమాన మంత్రాః

"ఓం భూరగ్నయే ప్రాణాయ స్వాహా" ౧

"ఓం భువర్ వాయవేఽపానాయ స్వాహా" ౨

"ఓం స్వరాదిత్యాయ వ్యానాయ స్వాహా" ౩

"ఓం భూర్ భువః స్వరగ్నివాయ్వాదిత్యేభ్యః ప్రాణాపాన వ్యానేభ్యఃస్వాహా" ౪

"ఓం ఆపో జ్యోతీరసోఽమృతం బ్రహ్మ భూర్ భువః స్వరోం స్వాహా" ౫

"ఓం సర్వం వై పూర్ణగ్ం స్వాహా" ౬

ఇతి సర్వే మంత్రా స్తైత్తిరీయోపనిషదాశయే నైకీకృతాః :-

ఏషు మంత్రేషు భూరిత్యాదీని సర్వాణీశ్వరస్య నామాన్యేవ వేద్యాని. ఏషా మర్థా గాయత్ర్యర్థే ద్రష్టవ్యాః

(సర్వం వై) హే జగదీశ్వర! యదిదమస్మాభిః పరోపకారార్థం కర్మ క్రియతే తద్ భవత్ కృపయాఽలం భవత్వితి హేతో రేతత్కర్మ తుభ్యం సమర్ప్యతే.

తథైతరేయ బ్రాహ్మణే పంచమపంచికాయా మేకత్రింశత్తమాయాం ఖండికాయాం చ సాయం ప్రాత రగ్ని హోత్రమంత్రా భూర్ భువః స్వరోమిత్యాదయో దర్శితాః.

అగ్నయే పరమేశ్వరాయ, జలవాయు శుద్ధి కరణాయ చ, హోత్రం హవనం, దానం యస్మిన్ కర్మణి క్రియతే తదగ్నిహోత్రమ్. ఈశ్వరాజ్ఞాపాలనార్థం వా. సుగంధి పుష్టిమిష్టబుద్ధి వృద్ధి శౌర్యధైర్యబలరోగ నాశకైర్ గుణైర్ యుక్తానాం ద్రవ్యాణాం హోమకరణేన వాయు వృష్టిజలయోః శుద్ధ్యా పృథివీస్థ పదార్థానాం సర్వేషాం శుద్ధ వాయు జల యోగాత్ సర్వేషాం జీవానాం పరమసుఖం భవత్యేవ - అతస్తత్కర్మ కర్తౄణాం జనానాం తదుపకారేణాత్యంత సుఖ మీశ్వరానుగ్రహశ్చ భవత్యేతదాద్యర్థ మగ్ని హోత్రకరణమ్.

తె॥ ఇట్లు ఐతరేయ బ్రాహ్మణమున నైదవ పంచికలో ముప్పది యొకటవ కండికలో ప్రాతః సాయం కాలీన "భూర్ భువః స్వర్ ఓమ్" మున్నగు హోమమంత్రములు వర్ణింపబడినవి. పై మంత్రములలోని 'భూః' మున్నగు పదము లీశ్వరునకు నామములని యెఱుగునది. గాయత్రి మంత్రార్థముననివి వివరింపబడినవి. (సర్వం వై పూ) ఓ జగదీశ్వర! పరోపకారము కొఱకు మే మొనర్చు నీ యగ్ని హోత్ర కర్మము నీ కృప వలన పూర్ణమగు గాక! అందులకై యీ కర్మమును నీకు సమర్పించుచున్నాము.

ఇట్లు ప్రాతః సాయం కాలములందు పై మంత్రములతో సంధ్యోపాసనకు తదుపరి హోమము చేయవలెను. అధికముగా నాహుతుల నీయదలచువారు గాయత్రీ మంత్రమునకు చివర స్వాహా పదము చేర్చి హోమము చేయవచ్చును.

అగ్ని - పరమేశ్వరుని కొఱకును, జలవాయు శుద్ధి కొఱకును. ఈశ్వరుని యాజ్ఞా పాలనము కొఱకును, హోత్రము -హవనము - దానము ఏకర్మమున జేయబడునో యాకర్మము అగ్ని హోత్ర మనబడును.

కుంకుమ పువ్వు, కస్తూరి మున్నగు సుగంధ వస్తువులు, ఘృతము, దుగ్ధము మున్నగు పోషక పదార్థములు, చక్కెర మున్నగు తీపి గల వస్తువులు, బుద్ధిని బలమును, ధైర్యమును పెంచు వస్తువులు, రోగనాశక వస్తువులు, బుద్ధిని బలమును, ధైర్యమును పెంచు వస్తువులు, రోగనాశక వస్తువులు హోమము చేయుటవలన - అగ్నియందాహుతిగా వేయుట వలన - వాయువు వృష్టిజలము శుద్ధమగును. అందువలన పార్థివ పదార్థములన్నియు నుత్తమములగును. కాగా సర్వ జీవులకు పరమ సుఖము కల్గును, కావున నగ్ని హోత్రము చేయు వారలకును పరుల కుపకారము జేసి నందున మిక్కిలి సుఖము ప్రాప్తించును. ఈశ్వరుడు వారి ననుగ్రహించును. ఉపర్యుక్త లాభముల కొఱ కగ్నిహోత్రము తప్పక చేయవలెను.

# అథతృతీయః పితృయజ్ఞః

సం॥ తస్య ద్వౌ భేదౌ స్తః; ఏకస్తర్పణాఖ్యో, ద్వితీయః శ్రాద్ధాఖ్యశ్చ-తత్ర యేన కర్మణా విదుషో దేవాన్, ఋషీన్, పితౄంశ్చ తర్పయంతి సుఖయంతి తత్ తర్పణమ్. తథా యత్తేషాం శ్రద్ధయా సేవనం క్రియతే తచ్ఛ్రాద్ధం వేదితవ్యమ్. తత్ర విద్యత్సు విద్యమానేష్వేతత్ కర్మ సంఘట్యతే. నైవ మృతకేషు. కుతః? తేషాం ప్రాప్త్యభావేన సేవనాశక్యత్వాత్, తదర్థకృత కర్మణః ప్రాప్తభావ ఇతి వ్యర్థతాపత్తే శ్చ. తస్మాద్ విద్యమానాభిప్రాయేణైతత్ కర్మోపదిశ్యతే. సేవ్యసేవక సన్నికర్షాత్ సర్వమేతత్ కర్తుం శక్యత ఇతి. తత్ర సత్ కర్తవ్యాస్త్రయః సంతి. దేవాః, ఋషయః పితరశ్చ.

(౧) తత్ర దేవేషు ప్రమాణమ్ :-

"పునంతు మా దేవజనాః పునంతు మనసా ధియః,

పునంతు విశ్వా భుతాని జాతవేదః పునీహి మా" ౧ య. ౧౯-౩౯

ద్వయం వా ఇదం న తృతీయమస్తి. సత్యం చైవానృతం చ; సత్యమేవ దేవా అనృతం మనుష్యాః, ఇదమహ మనృతాత్ సత్యముపైమీతి తన్మనుష్యేభ్యో దేవానుపైతి. స వై సత్యమేవ వదేత్. ఏతద్ధ వై దేవా వ్రతం చరంతి యత్ సత్యమ్. తస్మాత్తే యశో. యశో హ భవతి య ఏవం విద్వాన్ సత్యం వదతి. ౨ శ. ౧-౧-౧-౪-౫

"విద్వాగ్ంసో హి దేవాః" ౩ శత. ౩-౭-౩-౧౦

(జాత వేదః) హే పరమేశ్వర! (మా) మాం పునీహి సర్వథా పవిత్రం కురు. భవన్నిష్ఠా, భవదాజ్ఞాపాలినో (దేవజనాః) విద్వాంసః, శ్రేష్ఠా జ్ఞానినో, విద్యాదానేన (మా) మాం (పునంతు) పవిత్రం కుర్వంతు తథా (పునంతు మనసా) భవద్దత్త విజ్ఞానేన భవద్విషయక ధ్యానేన వాఽస్మాకం బుద్ధయః పునంతు పవిత్రా భవంతు. తథా, (పునంతు విశ్వా భూతాని) విశ్వాని సర్వాణి సంసారస్థాని భూతాని పునంతు భవత్ కృపయా సుఖానందయుక్తాని పవిత్రాణి భవంతు. ౧

(ద్వయం వా) మనుష్యాణాం ద్వాభ్యాం లక్షణాభ్యాం ద్వే ఏవ సంజ్ఞే భవతః. దేవో మనుష్యశ్చేతి. తత్ర 'సత్యం చైవానృతం చ కారణే స్తః. (సత్యమేవ) యత్ సత్యవచనం, సత్యమానం, సత్యకర్మ తదేవ దేవా ఆశ్రయంతి. తథైవ అనృత వచన మనృతమాన మనృతం కర్మ చేతి మనుష్యాశ్చేతి. అత ఏవఽనృతం త్యక్త్వా సత్యముపైతి స దేవః పరిగణ్యతే, యశ్చ సత్యం త్యక్త్వాఽనృతముపైతి స మనుష్యశ్చ. అతః సత్యమేవ సర్వదా వదే న్మన్యేత కుర్యాచ్చ. యః సత్యవ్రతో దేవోఽస్తి స ఏవ యశస్వినాం మధ్యే యశస్వీ భవతి; తద్విపరీతో మనుష్యశ్చ. ౨

తస్మాదత్ర విద్వాంస ఏవ దేవాః సంతి ౩

తె॥ పితృయజ్ఞము ;

పితృయజ్ఞమున రెండు భేదములున్నవి.

౧. పితృతర్పణము, ౨. పితృశ్రాద్ధము. విద్వద్రూపులగు దేవతలు, పితరులు, ఋషులు మున్నగువారు సుఖపడునట్లు చేయు కర్మమునకు తర్పణమని పేరు. వారికి శ్రద్ధతో జేయు సేవ శ్రాద్ధమనబడును. ఈ తర్పణము, శ్రాద్ధము జీవితులై ప్రత్యక్షములగు వ్యక్తులందే ఘటిల్లును; కాని మృతినొందిన వారియెడ నీ కర్మములు ఆచరణీయములు కావు. కారణమేమన? మృతవ్యక్తులు ప్రత్యక్షము కారు. కావున వారికి సేవ చేయుట సంభవము కాదు. వారికేదేని వస్తువీయదలచినను చేరనేరదు. అందువలన జీవించియుండువారికి శ్రద్ధా పూర్వకముగ సేవ చేసి, వారిని సుఖపెట్టుటయే శ్రాద్ధ తర్పణములని వేదశాస్త్రములందు వర్ణింపబడినది. సేవింపబడువారు, సేవించువారు నిరువురు ప్రత్యక్షమైనపుడే యిట్టి కర్మములు జరుపనగును. తర్పణాదులచే సత్కరింపదగిన వ్యక్తులు ముువ్విధములుగా నున్నారు. దేవతలు, ఋషులు, పితరులును.

(౧) దేవతల విషయమున ప్రమాణము.

(పునంతు) ఓ జాత వేద ! పరమేశ్వర ! నీవు నన్నన్ని రీతులను బవిత్రుం జేయుము. నిన్ను పాసించువారు, నీ యాజ్ఞలను పాలించువారు, విద్వాంసులు జ్ఞానులునగు పురుషులు నన్ను విద్యాదానముతో బవిత్రుం జేయుదురుగాక ! నీ వొసంగిన విశేషజ్ఞానముతోను, నీ ధ్యానముతోను మా బుద్ధులు పవిత్రములగుగాక! (పునంతు విశ్వాభూతాని) ప్రాపంచిక జీవులు నీ కృపచే పవిత్రులై యానందమున నుందురుగాక!

(ద్వయం వా) మానవులు రెండు లక్షణములు కారణములుగ రెండు విధములుగ జెప్పబడుదురు. ౧. దేవతలు, ౨. మనుష్యులు, ఈ భేదమునకు కారణము సత్యము, అసత్యమును. (సత్యమేవ) సత్యముజెప్పుట, సత్యము నంగీకరించుట, సత్యము నాచరించుట దేవతలకు లక్షణము. అనృతము చెప్పుచు, అనృతము నంగీకరించుచు, ననృత మాచరించువారు మనుష్యులు. కావున నసత్యమును విడిచి సత్యమును గ్రహించుట వలన మనుష్యుడు దేవత యనబడును. అందువలన నెల్లరు నసత్యమును విడిచి సత్యమును గ్రహించుటయే యుచితము. బుద్ధిమంతులందువలననే సత్యమును వ్రతముగా గ్రహించి దేవతలనబడు కీర్తిమంతులలో కీర్తి మంతులగుదురు. ఆనందమున నుందురు. దీనికి విపరీతముగ నసత్య వ్రతులు దుఃఖముల ననుభవించు చుందురు. ౨

కావున సత్య ధారణ మొనర్చిన విద్వాంసులే దేవతలనబడుదురు. ౩

సం॥ (౨) అథర్షి ప్రమాణమ్ :-

“తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్ పురుషం జాత మగ్రతః
తేన దేవా అయజంత సాధ్యా ఋషయశ్చ యే” ౧ య. ౩౧-౯
“అథ యదేవానుబ్రువీత, తేనర్షిభ్య ఋణం జాయతే
తద్ధ్యేభ్య ఏతత్ కరోత్యృషీణాం నిధిగోప ఇతి హ్యనూచాన మాహుః” ౨
శత. ౧-౭-౨-౩

“అథార్షేయం ప్రవృణీతే; ఋషిభ్యశ్చైవైన మేతద్దేవేభ్యశ్చ నివేదయత్యయం మహావీర్యో యో యజ్ఞం ప్రాపదితి, తస్మా దార్షేయం ప్రవృణీతే” ౩ శత. ౧-౪-౨-౩

తం యజ్ఞమితి సృష్టి విద్యా విషయే వ్యాఖ్యాతః ౧ (అథ యదేవా) అథేత్యనంతరం సర్వవిద్యాం

పఠిత్వా యదనువచన మధ్యాపనకర్మానుష్ఠానమస్తి తదృషికృత్యం విజ్ఞాయతే. తేనాధ్యయనాధ్యాపన కర్మణైవర్షయః సేవనీయా జాయంతే. యత్తేషాం ప్రియమాచరంతి తదేతత్తేభ్యః సేవాకర్తృభ్య ఏవ సుఖకారి భవతి. యః సర్వ విద్యావిద్ భూత్వాఽధ్యాపయతి తమేవానూచాన మృషి మాహుః.

(అథార్షేయం ప్రవృ) యో మనుష్యః పాఠనం కర్మ ప్రవృణీతే తదార్షేయం కర్మ కథ్యతే. య ఋషిభ్యో దేవేభ్యో విద్యార్థిభ్యశ్చ ప్రియం వస్తు నివేదయిత్వా నిత్యం విద్యా మధీతే స విద్వాన్ మహావీర్యో భూత్వా యజ్ఞం విజ్ఞానాఖ్యం (ప్రావద్) ప్రాప్నోతి. తస్మాదిద మార్షేయం కర్మ సర్వైర్ మనుష్యైః స్వీకార్యమ్.

తె॥ (౨) ఋషి విషయక ప్రమాణము :-

(తం యజ్ఞం) ఈ మంత్ర వ్యాఖ్యానము సృష్టి విద్యా విషయక ప్రకరణమున వ్రాయబడినది. అట చూచునది.

(అథ యదేవా) సర్వ విద్యలను చదువుట , చదివించుటయు ఋషికర్మ మగును. అందువలన మనుజులు ఋషులకు ఋణపడుదురు. ఋషులకు సేవ చేయుట వలన ఋషి ఋణము తీఱును. పఠన పాఠనమే ఋషుల సేవ యగును. కావున నిత్యము విద్యాదానము చేయుచు, విద్యను గ్రహించుచు సేవ సేయుచు నుండువాడు సుఖమును బొంది, యితరులకు సుఖము గలుగజేయును. (నిధిగోప) ఈ వ్యవహారమే విద్య యనెడి నిధిని - కోశమును రక్షించుట యగును. ౨.

(అథార్షేయం ప్ర) విద్యలను గ్రహించి, యితరుల కవి గ్రహింపజేయు ఋషులకు దేవతలకు ప్రియములగు పదార్థములనిచ్చి పఠన పాఠనములతో సేవ నొనర్చు విద్వాంసుడు బహు పరాక్రమ యుక్తుడై విశేష జ్ఞానమునుబొందును. మనుజుడు చేయు పాఠన కర్మము ఆర్షమన బడును. ఈ యార్ష కర్మము అధ్యాపనము నెల్లరు స్వీకరింపవలెను. ౩

సం॥ (౩) అథ పితృషు ప్రమాణమ్ :-

"ఊర్జం వహంతీ రమృతం ఘృతం పయఃకీలాలం పరిస్రుతమ్,

స్వధాస్థ తర్పయత మే పితౄన్" ౧ య. ౨-౩౪

(ఊర్జం వహంతీ) సర్వే మనుష్యాః సర్వాన్ ప్రత్యేవం జానీయు శ్చాజ్ఞాపయేయుః- (మే పితౄన్) మమ పితృ పితామహాదీ నాచార్యాదీంశ్చ సర్వే యూయం తర్పయత, సేవయా ప్రసన్నాన్ కురుతేతి, తథా (స్వధాస్థ) సత్య విద్యా భక్తి స్వపదార్థ ధారిణో భవత. కేన కేన పదార్థేన తే సేవనీయాస్తానాహ (ఊర్జం) పరాక్రమం ప్రాపికాః సుగంధితాః ప్రియా హృద్యా అపః, (అమృతం) అమృతాత్మక మనేక విధం రసం, (ఘృతం) ఆజ్యం, (పయః) దుగ్ధం, (కీలాలం) సంస్కారైః సంపాదిత మనేక విధమన్నం, (పరిస్రుతం) మాక్షికం మధు కాలపక్వం ఫలాదికం చ నివేద్య పితౄన్ ప్రసన్నాన్ కుర్యాత్. ౧

తె॥ (ఊర్జం వహంతీ) తండ్రికాని, యజమానుడు కాని, తన పుత్రపౌత్రులను, కళత్రమును, సేవకులు మున్నగు వారి నిట్లా జ్ఞాపించునది. (తర్పయత మే) మాన్యులగు పితృపితామహాదులు, మాతృ మాతామహ్యాదులు, ఆచార్యులు, ఇతర విద్వాంసులు, వయస్సు నందును, జ్ఞానమునందును వృద్ధులైన వారెల్లరు మనకు

గౌరవింపదగినవారు. మీరు వారికి (ఊర్జం...) పరాక్రమమును గలిగించు సుగంధితము, ప్రియకరము, హృదయాకర్షకమునగు నుత్తమ జలము (అమృతం) రోగనాశకములగు నమృతాత్మకములగు నానా విధ రసములు, (ఘృతం) నేయి, (పయః) పాలు, (కీలాలం) బాగుగ సిద్ధము చేయబడిన యన్నము, (పరిస్రుతం) తేనె, ఉత్తమఫలరసములు మున్నగు పదార్థములతో నిత్యము సేవ జేయుడు. వారు ప్రసన్నులై మీకు సదా విద్యల నొసంగుదురు. అందువలన మీరును నిత్యము ప్రసన్నముగా నుందురు. (స్వధాస్థ) సత్య విద్యను, భక్తిని, నిజపదార్థములను ధరించువారునై యుందురు. ఇట్లు విన్నవించుడు. ఓ పితరులార! మే మొసంగు నమృతాత్మక పదార్థముల ననుభవించి తృప్తులగుదురుగాక ! మీ కనుకూలములగు పదార్థము లెయ్యవియో వానిని చేకూర్చునట్లు మమ్మాజ్ఞాపింపుడు. మనో వాక్కాయములతో మీకు సుఖము నొడగూర్ప సిద్ధముగా నున్నాము. మీ కెట్టి దుఃఖము కలుగ కుండుగాక! బాల్యమునందును, బ్రహ్మ చర్యాశ్రమము నందును మీరు మమ్ములను సుఖ పెట్టి యున్నారు. అట్లే మేమును మీకు ప్రత్యుపకార మొనర్చి కృతజ్ఞులమై యుండుట మాకు కర్తవ్యము, లేకున్న కృతఘ్నతాదోష గ్రస్తులమగుదుము. ౧

సం॥ " ఆయంతు నః పితరః సోమ్యాసోఽగ్నిష్వాత్తాః పథిభిర్ దేవయానైః , అస్మిన్ యజ్ఞే స్వధయా మదంతోఽధిబ్రువంతు తేఽవంత్వస్మాన్ ౨ య. ౧౯–౫౮

యే (సోమ్యాసః) సోమగుణాః శాంతాః, సోమవల్ల్యాదిరసనిష్పాదనే చతురాః (అగ్నిష్వాత్తాః) అగ్నిః పరమేశ్వరోఽభ్యుదయాయ సుష్ఠుతయాఽఽత్తో గృహీతో యైస్తేఽగ్నిష్వాత్తాః తథా హోమకరణార్థం, శిల్పవిద్యాసిద్ధయే చ భౌతికోఽగ్నిరాత్తో గృహీతో యైస్తే పితరో విజ్ఞానవంతః పాలకాః సంతి, (ఆయంతు నః) తే అస్మత్ సమీప మాగచ్ఛంతు వయం చ తత్సామీప్యం నిత్యం గచ్ఛేమ (పథిభిర్ దేవ) తాన్ విద్వన్మార్గైర్ దృష్టిపథమాగతాన్ దృష్ట్వాఽభ్యుత్థాయ, హే పితరో భవంత ఆయంత్విత్యుక్త్వా ప్రీత్యాఽఽసనాదికం నివేద్య నిత్యం సత్ కుర్యామ. (అస్మిన్) హే పితరోఽస్మిన్ సత్కారరూపే యజ్ఞే (స్వధయా) అమృతరూపయా సేవయా (మదంతో) హర్షంతోఽస్మాన్ రక్షితారః సంతః సత్యవిద్యా మధిబ్రువంతు ఉపదిశంతు. ౨

తె॥ (ఆయంతు నః) పితృశబ్దముచేత సర్వరక్షకులు, శ్రేష్ఠస్వభావులు, జ్ఞానులునగు వ్యక్తులు గ్రహింపబడుదురు. సుశిక్షణము, విద్యయును వీని వలన మనుష్యులకు రక్షణ లభించినట్లు మఱియేరీతి వలనను లభింపదు. విద్వాంసులు మనుష్యులకు జ్ఞానచక్షువు నిచ్చి, వారి యవిద్యాంధకారమును దొలగించి, రక్షింతురు. కావున వారిని పితరులందురు. అట్టి వారిని సత్కరించుట ప్రతి మానవునకు ముఖ్య కర్తవ్యము. కావుననే యీశ్వరుడాజ్ఞాపించుచున్నాడు.

పితరులు – జ్ఞానులు– వచ్చినపుడు వారి కెదురేగి భక్తితో 'రండు దయచేసి యీ యాసనముపై కూర్చుండుడు. ఈ జలమును గ్రహించుడు. దయచేసి మీకు భోజ్యపదార్థము లెయ్యవి కావలెనో తెలుపుడు. అని వారిని ప్రార్థనాపూర్వకముగ భక్తితో సత్కరింపవలెను. అటుపై వారి నిట్లు ప్రార్థింపవలెను. 'ఆర్య! ఉపదేశింపదగిన విషయములు మాకు ప్రీతితో దెలుపుడు. మేమును సత్య విద్యలతో గూడినవారమై మానవుల కెల్లరకు పితరుల మనిపించుకొందుముగాక! ఇంతే కాక నిత్యమును భగవంతునిట్లు ప్రార్థింపవలెను. 'ఓ పరమేశ్వర! నీ యనుగ్రహము వలన (సోమ్యాసః) శాంత శీలురు, నెల్లరకు సుఖము నొడగూర్చువారు, సోమలత మున్నగు నోషధుల రసమును గ్రహించుటలో చతురులగు విద్వాంసులు, (అగ్నిష్వాత్తాః) నిజాభ్యుదయము కొఱకు అగ్ని నామక పరమాత్మను, అగ్నిహోత్ర మొనర్చుటకు, శిల్పవిద్యల

ప్రయోజనార్థము భౌతికాగ్నిని బాగుగ తెలిసికొని సేవించు జ్ఞానులు, సంఘరక్షకులునగు పితరులు (ఆయంతు నః) మాకు లభింతురు గాక! మే మెల్లపుడు వారి సాన్నిధ్యమును సంపాదించు కొందుము గాక! (పథిభిర్ దేవ) విద్వాంసుల మార్గములందు నడచు నా పితరులు మా గృహముల కరుదెంచుట జూచి, మేము వారి కభ్యుత్థాన మొనర్చి 'ఓ పితృగణములార! రండు. దయచేయుడు' అని వారిని ప్రార్థనాపూర్వకముగ నాసనాదుల నొసంగి సత్కరింతుముగాక!

(అస్మిన్ యజ్ఞే) మాయీ సత్కారాత్మక యజ్ఞమునందాపితరులు విద్వాంసులు (స్వధయా) మాచే నొసంగబడిన సత్కారముతో (మదంతః) ప్రసన్నులై (అస్మాన్ అవంతు) మమ్ములను రక్షింతురుగాక! మఱియు, (అస్మాన్ అధిబ్రువంతు) మాకు సత్యవిద్యల నుపదేశింతురుగాక! ఇట్లే విద్యార్థులు సేవకులు కూడ తమ సమీపమున కరుదెంచిన పితరుల సభ్యుత్థానాదులతో సత్కరించి, నమస్కరించి, భక్తితో సేవింపవలెను. అట్లే విద్వాంసులు, జ్ఞానులును సత్యభాషణము, నిర్వైరత, దయ మున్నగు సద్గుణములతో గూడి తోటిమానవులను సన్మార్గముల నడపవలెను. తామును నడవ వలెను. ఇట్లెల్లరు ఛలము, లోభము మున్నగు దుర్గుణములు వీడి పరులకుపకారము చేయుటకు సత్యవ్యవహారములను జరుపుచుండవలెను. ౨

సం॥ "అత్ర పితరో మాదయధ్వం యథాభాగ మావృషాయధ్వమ్,

అమీ మదంత పితరో యథాభాగ మావృషాయిషత" ౩ య. ౨-౩౧

(అత్ర పితరో) హే పితరోఽ త్రాస్యాం సభాయాం పాఠశాలాయాం వా అస్మాన్ విద్యా విజ్ఞాన దానే నానందయుక్తాన్ కురుత. (యథా భాగం) భజనీయం స్వం స్వం విద్యారూపం భాగం (ఆవృషాయధ్వం) విద్వద్వత్ స్వీకృత్య (అమీ మదంత) అస్మిన్ సత్యోపదేశే విద్యాదాన కర్మణి హర్షేణ సదోత్సాహవంతో భవత. (యథాభాగమా) తథా యథాయోగ్యం సత్కారం ప్రాప్య శ్రేష్ఠాచారేణ ప్రసన్నాః సంతో విచరత. ౩

తె॥ (అత్ర పితరో) ఓ పితరులార! మీరు మాకు సభయందు కాని, పాఠశాలయందు కాని విద్యా విజ్ఞానముల నొసంగి మమ్ముల నానందితులను జేయుడు, (యథా భాగమా) సేవింపదగు మీ మీ విద్యారూప భాగములను విద్వాంసులవలె స్వీకరించి (అమీ మదంత పితరః) మీరిట విద్యా ప్రచారమువలన నెల్లర నానందయుక్తుల జేయుడు. (యథా భాగమా) అట్లే మా వలన యథా యోగ్య సత్కారములను బొంది, మీరు ప్రసన్నులై మమ్ముల నానందింప జేయుడు. ౩

సం॥ "నమో వః పితరో రసాయ నమో వః పితరః శోషాయ నమో వః పితరో జీవాయ నమో వః పితరః స్వధాయై, నమో వః పితరో ఘోరాయ నమో వః పితరో మన్యవే నమో వః పితరః పితరో నమో వో గృహాన్నః పితరో దత్త సతో వః పితరో దేష్మై తద్వః పితరో వాసః. ౪ య ౨-౩౨

(నమో వః) హే పితరః ! రసాయ సోమలతాదిరస విజ్ఞానానంద గ్రహణాయ, (నమో వః పితరః) శోషాయాగ్నివాయు విద్యాప్రాప్తయే, (నమో...జీవా) జీవనార్థం విద్యాజీవికాప్రాప్తయే, (నమో...స్వధా) మోక్షవిద్యాప్రాప్తయే, (నమో వః) ఆపత్కాలనివారణాయ, (నమో...మన్యవే) దుష్టానాముపరి క్రోధధారణాయ, క్రోధస్య నివారణాయ చ, (నమో వః పితరః) సర్వవిద్యాప్రాప్తయే చ యుష్మభ్యం వారం వారం నమోఽస్తు. (గృహాన్నః) హే పితరో ! గృహాన్ గృహ సంబంధి వ్యవహార బోధా న్నో ఽ స్మభ్యం యూయం దత్త (సతో వః) హే పితరో ! యేఽస్మాక మధికారే విద్యమానాః పదార్థాః సంతి,

తాన్ వయం వో యుష్మభ్యం (దేష్మః) దద్మః; యతో వయం కదాచిద్ భవద్భ్యో విద్యాం ప్రాప్య క్షీణా న భవేమ. (ఏతద్ వః పితరః) హే పితరోఽస్మాభిర్ యద్ వాసో వస్త్రాదికం వస్తు యుష్మభ్యం దీయతే ఏతద్ యూయం ప్రీత్యా గృహ్ణీత. ౪

తె॥ (నమో వః) ఓ పితరులార! మేము మీకు నమస్కరించుచున్నాము. మీవలన మాకు విద్యానందము, ఓషధివిద్య, జలవిద్య ప్రాప్తించుగాక! అట్లే (నమో వః) ఓషధులను, జలమును శోషింప జేయునగ్ని వాయువులకు సంబంధించిన విద్యల ప్రాప్తికొఱకు మేము మీకు నమస్కరింతుము. (నమో...జీవాయ) పితరులార! మీ సత్య శిక్షణ మూలమున మేము ప్రమాదములకు లోనుగాక జితేంద్రియులమై పూర్ణాయువు ననుభవింతుము గాక! ఇందులకై మేము మీకు నమస్కరించుచున్నాము (నమో.... స్వధాయై) విద్వాంసులార! అమృత రూప మోక్ష విద్యా ప్రాప్తి కొఱకు మేము మీకు నమస్కరించుచున్నాము. (నమో....ఘోరాయ) పితరులార! ఆపత్కాలమున నిర్వహించుటకుదగిన విద్యలను నేర్పు కోరికతో దుఃఖములను దాటుటకై మేము మీసేవ జేయుచున్నాము. (నమో....మన్యవే) దుష్టజీవులను, దుష్ట కర్మములను ప్రేమింపక, సత్పురుషులను, సత్కర్మములను ప్రేమించుటకు దగిన విద్యను నేర్ప మేము మీకు నమస్కరించుచున్నాము. (నమః పితరః) గృహాశ్రమాది వ్యవహారములను నిర్వహించుటకు వలయు విద్యలను నేర్చుకొనుటకు మీకు మాటిమాటికి నమస్కరించుచున్నాము. (నతో వః) పితరులార ! మీరు సర్వగుణములను, సర్వసాంసారిక సుఖములను నొసంగువారు కావున మేము మీకు నుత్తమపదార్థముల నొసంగుచున్నాము. ప్రేమతో వీనిని గ్రహింపుడు. అట్లే ప్రతిష్ఠ కొఱకు నుత్తమోత్తమవస్త్రములను మీ కొసంగుదుము. వానిని ప్రేమతో ధరింపుడు. మీరు ప్రసన్నులై సర్వసుఖార్థము ప్రపంచమున సత్య విద్యలను ప్రచారమొనర్చుడు. ౪

సం॥ "ఆధత్త పితరో గర్భం కుమారం పుష్కరస్రజమ్ యథేహ పురుషోఽసత్" యజు. ౨—౩౩

(ఆధత్త పితరో) హే పితరో యూయం మనుష్యేషు విద్యాగర్భమాధత్త ధారయత. తథా విద్యాదానార్థం (పుష్కరస్రజం) పుష్పమాలాధికారిణం కుమారం బ్రహ్మచారిణం యూయం ధారయత. (యథేహ) యేన ప్రకారేణ ఇహాస్మిన్ సంసారే విద్యాసుశిక్షాయుక్తః పురుషోఽసత్ స్యాత్, యేన చ మనుష్యే షూత్తమ విద్యోన్నతిర్ భవేత్తథైవ ప్రయతధ్వమ్ ౫

తె॥ (ఆధత్త పితరో) 'ఓ విద్యా ప్రదులగు పితరులార ! విద్యాభ్యాసము కొఱకు పుష్పమాలను ధరించియున్న యీ బ్రహ్మచారిని తల్లి గర్భమును కాపాడునట్లు రక్షించి యుత్తమవిద్య నొసంగుడు. ఇతడు విద్వాంసుడై శోభాయుక్తుడగుగాక ! (యథేహ పురుషోఽసత్) ఈ ప్రపంచమున విద్యాదిగుణముల మూలమున నుత్తమకీర్తి, సుఖము మనుజులకు లభించునట్లు ప్రసన్నులయిన మీ రాచరింతురుగాక ! అని యిది పితరుల నుద్దేశించిన యీశ్వరాజ్ఞ కావున మానవులెల్లరు సదా యీ యాజ్ఞను పాలింపవలెను.

సం॥ "యే సమానాః సమనసో జీవా జీవేషు మామకాః,

తేషాం శ్రీర్ మయి కల్పతా మస్మింల్లోకే శతగ్ం సమాః" ౬ య. ౧౯—౪౬

(యే సమానాః) యే మామకా మదీయా ఆచార్యాదయః (జీవాః) విద్యమానజీవనాః (సమనసః) ధర్మేశ్వర సర్వమనుష్యహితకరణే కనిష్ఠాః, (సమానాః) ధర్మేశ్వర సత్యవిద్యాది శుభగుణేషు సమానత్వేన వర్తమానాః (జీవేషు) ఉపదేశ్యేషు శిష్యేషు సత్యవిద్యాదానాయ ఛలాది దోషరాహిత్యేన వర్తమానా

విద్వాంసః సంతి (తేషాం) విదుషాం యా శ్రీః సత్యవిద్యాది గుణాఢ్యా శోభాస్తి (అస్మింల్లోకే శతం) సామయికీ లక్ష్మీః శతవర్షపర్యంతం (కల్పతాం) స్థిరా భవతు, యతో వయం నిత్యం సుఖినః స్యామ. ౬

తె॥ (యే సమానాః) ఆచార్యులు మున్నగువారు (జీవాః) జీవించుచు, (సమనసః) ధర్మము, ఈశ్వరభక్తి సర్వలోకహితము చేయుట కుద్యుక్తులై యుందురు. (సమానాః) ధర్మము, ఈశ్వరుడు, సత్యవిద్యాది గుణములు ననువాని ప్రచారమున బాగుగ నాలోచించువారు, (జీవేషు) ఉపదేశించుటకు యోగ్యులై, శిష్యులకు సర్వవిద్యల నొసంగుటకు కపటము మున్నగు దోషములు లేక ప్రేమించు విద్వాంసుల సత్యవిద్యాది శ్రేష్ఠగుణయుక్తమగు శోభయు, రాజ్యలక్ష్మియు నా కొఱకు (అస్మింల్లోకే శతం సమాః) నీలోకమున నూఱువత్సరముల వఱకు స్థిరముగ నుండుగాక. అందువలన మేము నిత్యము సుఖము ననుభవించుచు పురుషార్థపరుల మగుదుముగాక ! ౬

సం॥ "ఉదీరతా మవర ఉత్పరాస ఉన్మధ్యమాః పితరః సోమ్యాసః.

అసుం య ఈయు రవృకా ఋతజ్ఞా స్తే నోఽవంతు పితరో హవేషు." ౭

యజు. ౧౯-౪౯

(ఉదీరతామవరే) యే పితరోఽవకృష్టగుణాః, (ఉత్పరాసః) ఉత్కృష్టగుణాః, (ఉన్మధ్యమాః) మధ్యస్థగుణాః, (సోమ్యాసః) సోమ్యగుణాః (అవృకాః) అజాతశత్రవః, (ఋతజ్ఞాః) బ్రహ్మవిదో వేదవిదశ్చ, తే జ్ఞానినః పితరో, హవేషు దేయ గ్రాహ్యవ్యవహారేషు, విజ్ఞానదానేన (నోఽవంతు) అస్మాన్ సదా రక్షంతు, తథా, (అసుం య ఈయుః) యేఽసుం ప్రాణమీయుః ప్రాప్నుయు ర్ద్వాత్ ద్వాభ్యాం జన్మాభ్యాం విద్వాంసో భూత్వా విద్యమాన జీవనాస్సృస్తఏవ సర్వైః సేవనీయాః, నైవ మృతాశ్చేతి. కుతః? తేషాం దేశాంతరప్రాప్త్యా సన్నికర్షాభావాత్తే సేవాగ్రహణేఽ సమర్థాః సేవితు మశక్యాశ్చ. ౭

తె॥ (ఉదీరతామవరే) కనిష్ఠగుణములుగలవారు (ఉన్మధ్యమాః) మధ్యములు, (ఉత్పరాసః) ఉత్తమ గుణములు కలవారు. (పితరః సోమ్యాసః) చంద్రునివలె ప్రజలకానందము నొసంగువారు. (అవృకాః) శత్రురహితులై - సర్వప్రియులై - పక్షపాతమును వీడి సత్యమార్గము ననుసరించువారు, (ఋతజ్ఞాః) బ్రహ్మవిదులు, వేదవిదులు, యథార్థ ధర్మమును సత్యవిద్యను నెఱుంగువారును నగు (తే నోఽవంతు పితరో హవేషు) పితరులు, ఇచ్చి పుచ్చుకొనుట కర్తములగు వ్యవహారములలో మాతో నుండి వారి విద్యలను మా కొసంగి మమ్ముల రక్షింతురుగాక ! అట్లే (అసుం య ఈయుః) రెండు జన్మము (శారీరికజన్మ, విద్యాజన్మ) ల మూలమున విద్వాంసులై జీవించియుండు పితరుల నెల్లరు సేవింపవలెను. మృత పితరులను సేవింపరాదు. కారణ మేమన - మృతులు దేశాంతర లోకాంతరవాసులగుటచే సేవను గ్రహింపజాలరు. వారికి సేవజేయుటకును వీలుండదు. ౭

సం॥ "అంగిరసో నః పితరో నవగ్వా అథర్వాణో భృగవః సోమ్యాసః, తేషాం వయగ్ం

సుమతౌ యజ్ఞియానా మపి భద్రే సౌమనసే స్యామ" ౮ య. ౧౯-౫౦

(అంగిరసో నః) యేఽంగేషు రసభూతస్య ప్రాణాఖ్యాన్య పరమేశ్వరస్య జ్ఞాతారః, (నవగ్వాః) సర్వాసు విద్యాసూత్తమకర్మసు చ నవీనా గతయో యేషాం తే, (అథర్వాణః) అథర్వవేదవిదో ధనుర్వేదవిదశ్చ (భృగవః) పరిపక్వజ్ఞానాః శుద్ధాః, (సోమ్యాసః) శాంతాః సంతి (తేషాం వయగ్ం

సుమతౌ) వయం తేషాం యజ్ఞానాం (యజ్ఞియానాం) యజ్ఞాది సత్కర్మసు కుశలానాం, అపీతి నిశ్చయేన, సుమతౌ విద్యాది శుభగుణ గ్రహణే (భద్రే) కల్యాణకరే వ్యవహారే (సౌమనసే) యత్ర విద్యానంద యుక్తం మనో భవతి తస్మిన్, (స్యామ) అర్థాద్ భవతాం సకాశా దుపదేశం గృహీత్వా ధర్మార్థ కామ మోక్షప్రాప్తా భవేమ. ౮

తె॥ (అంగిరసో నః) బ్రహ్మాండమున కంగభూతములగు పృథివ్యాదులకు రసభూత ప్రాణనామక పరమేశ్వరు నెఱుగువారును, (నవగ్వాః) నవీన నవీన విద్యలను నుత్తమోత్తమ కర్మములను గ్రహించువారు, గ్రహింప జేయువారును (అథర్వాణః) అథర్వవేదమునందును, ధనుర్వేదమునందును చతురులును, దుష్టులగు శత్రువులను, దోషములను నివారించుటలో ప్రవీణులు, (భృగవః) పరిపక్వజ్ఞానులు, తేజస్వులు, (సోమ్యాసః) పరమేశ్వరుని యుపాసనవలనను, తమ విశేషగుణముల వలనను శాంతస్వరూపులు నగు, (పితరః) పితరులు – విద్వాంసులు గలరో (తేషాం యజ్ఞియానాం) యజ్ఞములుచేసి చేయింపగలవారి (సుమతౌ భద్రే సౌమనసే) కల్యాణకరమగు విద్యచే శుభకరము, భద్రతాయుక్తమునగు మనస్సునందు (వయమపి స్యామ) మేముకూడ స్థిరముగా నుందుముగాక ! వ్యావహారికములు, పారమార్థికములునగు సుఖములు పొందుదుముగాక ! ౮

సం॥ "యే సమానాః సమనసః పితరో యమరాజ్యే తేషాం లోకః

స్వధా నమో యజ్ఞో దేవేషు కల్పతామ్" ౯ య. ౧౯–౪౫

(యే సమానాః, సమనసః) అనయోరర్థ ఉక్తః యే (యమరాజ్యే) రాజసభాయాం న్యాయాధీశత్వేనాధి కృతాః (పితరః) విద్వాంసః సంతి, (తేషాం లోకః) యో న్యాయదర్శనం స్వధా అమృతాత్మకో లోకోభవతీతి. (యజ్ఞో) యశ్చ ప్రజాపాలనాఖ్యో రాజధర్మవ్యవహారో దేవేషు విద్వత్సు ప్రసిద్ధోఽస్తి సోఽస్మాకం మధ్యే (కల్పతాం) సమర్థతాం, ప్రసిద్ధో భవతు. య ఏవం సత్యన్యాయకారిణః సంతి; తేభ్యో (నమః) నమోస్తు. అర్థాద్ యే సత్యన్యాయాధీశాస్తే సదైవాస్మాకం మధ్యే తిష్ఠంతు. ౯

తె॥ (యే సమానాః) ఏ విద్వాంసు లీ పరమేశ్వరుని రాజ్యము నందు సభాసదులు న్యాయాధీశులై న్యాయమును జెప్పువారును, (సమనసః పితరః) ప్రపంచమునకు హితము చేయుటలో సమానబుద్ధి కలిగిన వారును, నగుదురో (యేషాం లోకః స్వధా) ఎవరిదేశము సత్యన్యాయమునుబొంది సుఖించునదియు నగునో యట్టివారికి (నమః) మేము నమస్కరింతుము. వారు పక్షపాతముచేయక సత్యవ్యవస్థలో నుండి తాము దృష్టాంత రూపమున మెలగుచు నితరులను తమ మార్గమున నడపింతురు. (యజ్ఞో దేవేషు కల్పతామ్) సత్యధర్మయుక్త ప్రజాపాలన రూపమగు నీయశ్వమేధ యజ్ఞము పరమేశ్వరుని కృపవలన విద్వాంసులలో సత్యవ్యవస్థను వృద్ధిచేయుటకు సతతము సమర్థమగు గాక ! సత్యన్యాయాధీశులు మాలో నెల్లపుడు నుందురుగాక. ౯

సం॥ "యే నః పూర్వే పితరః సోమ్యాసోఽనూహిరే సోమపీథం వసిష్ఠాః, తేభిర్యమః

సగ్ంరరాణో హవీగ్ంష్యుశ న్నుశద్భిః ప్రతికామ మత్తు" ౧౦ య. ౧౯–౫౧

(యే సోమ్యాసః) సోమవిద్యాసంపాదినః, (వసిష్ఠాః) సర్వవిద్యాద్యుత్తమ గుణేష్వతిశయేన రమమాణాః, (సోమపీథం) సోమ విద్యారక్షణం (అనూహిరే) పూర్వం సర్వా విద్యాః పఠిత్వాఽధ్యాప్య తాంస్తా అనుప్రాపయంతి, తే (నః పూర్వే పితరః) యేఽస్మాకం పూర్వే పితరః సంతి. (తేభిః) తైః

(ఉశద్భిః) పరమేశ్వరం ధర్మం చ కామయమానైః పితృభిః సహ. సమాగమేనైవ, (సగ్ంరరాణః) సత్యవిద్యాయాః సమ్యగ్ దానకర్తా (యమః) సత్యవిద్యావ్యవస్థాపకః పరమేశ్వరో విదితో భవతి. కిం కుర్వన్ ? (హవీగ్ంషి) విజ్ఞానాదీన్యుశన్ సర్వేభ్యో దాతుం కామయన్ సన్, అతః సర్వో జన ఏవ మాచరన్ సన్ (ప్రతికామమత్తు) సర్వాన్ కామాన్ ప్రాప్నోతు. ౧౦

తె॥ (యే నః పూర్వే పితరః) ఏ మా పూర్వపితరులు - తండ్రి, తాత, ఆచార్యులు మున్నగు శాంతాత్ములు, మఱియు, (అనూహిరే సోమపీథం వసిష్ఠాః) సోమపానము చేయుటకు చేయించుటకును సర్వ విద్యలందును రమించుచుండిరో (తేభి రుశద్భిర్ యమః సంరరాణః) ఎవరు పరమేశ్వరుని, ధర్మమును కామించుచుండిరో యట్టి మహాత్ములతో సత్సంగము చేయుటవలన సత్యవిద్యలను ప్రసాదించువాడును, యముడు-న్యాయకారియు, నంతర్యామియునగు పరమేశ్వరుడు నిస్సందేహముగ తెలియబడును. (హవీగ్ంషి) ఆ ప్రభువెల్లరకు విజ్ఞానాది పదార్థముల నిచ్చువాడు. కావున నో మానవులార ! ఇట్టి ధర్మాత్ములైన పురుషుల సాంగత్యమువలన మీరుకూడ నా పరమాత్ముని యానందము వలననే యాప్త కాములై తృప్తులగుదురు గాక! ౧౦

సం॥ "బర్హిషదః పితర ఊత్యర్వాగిమా వో హవ్యా చకృమా జుషధ్వమ్,

త ఆగతావసా శంతమేనాథా నః శం యో రరపో దధాత" య. ౧౯-౫౫-౧౧

(బర్హిషదః) యే బర్హిషి సర్వోత్తమే బ్రహ్మణి విద్యాయాం చ నిషణ్ణాస్తే (పితరః) విద్వాంసః, (అవసాశంతమేన) అతిశయేన కల్యాణ రూపేణ రక్షణేన సహవర్తమానాః, (ఆగత) అస్మాకం సమీప మాగచ్ఛంతు. ఆగతాన్ తాన్ ప్రత్యేవం వయం బ్రూమహే-హే విద్వాంసః! యూయమాగత్య (అర్వాక్) పశ్చాత్ (ఇమా) ఇమాని హవ్యాని గ్రాహ్యదేయాని వస్తూని (జుషధ్వం) సంప్రీత్యా సేవధ్వమ్. హే పితరః! వయం (ఊత్యా) భవద్రక్షణేన వో యుష్మాకం సేవాం (చకృమ) నిత్యం కుర్యామ. (అథా నః శం) అథేతి సేవాప్రాప్తే రనంతరం, యూయం నోఽస్మాకం శంయోర్ విజ్ఞానరూపం సుఖం దధాత. కింత్వవిద్యారూపం పాపం దూరీకృత్య (అరపః) నిష్పాపతాం దధాత. యేన వయమపి నిష్పాపా భవేమేతి. ౧౧

తె॥ (బర్హిషదః పి) సర్వోత్తమమగు బ్రహ్మమునందును, సత్యవిద్యయందును స్థితులగువారు మాకు కల్యాణరూపమగు రక్షణనిచ్చుటకు తత్పరులగుదురుగాక ! మేము వారికి సేవజేయువారమగుదుముగాక ! వారు మాకు ప్రీతి పూర్వకముగ విద్యలనునేర్పి మమ్ములను ప్రసన్నుల నొనర్తురుగాక. (త ఆగతావసా) ఓ పితరులార ! మీరు మా సమీపమునకును, మేము మీ యంతికమునకును వచ్చినప్పుడు (ఇమా హవ్యా) మేముత్తమ పదార్థములతో మిమ్ములను సేవింపవలెనని యభిలషించుచున్నాము. మీరును మా యొసంగు పదార్థములను ప్రేమతో గ్రహింపుడు, అన్నాది పదార్థముల నర్పించి మీకు సేవ సేయుదుము. మీరును (శాంత...) మాకు శుభము లొడగూర్చు గుణముల నుపదేశింపుడు. (అథా నః శంయోః) మాచే సేవను బొందిన పిమ్మట విజ్ఞానరూప సుఖమును మాకొసంగుడు. (అరపః) మేము పాపులము కాకుండునట్టి విషయములను మాకు నేర్పుడు. ౧౧

సం॥ "ఆహం పితౄన్ త్సువిదత్రాఁ ౨. అవిత్సి న పాతం చ విక్రమణం చ విష్ణోః, బర్హిషదో యే స్వధయా సుతస్య భజంత పిత్వస్త ఇహాగమిష్ఠాః" ౧౨ య. ౧౯-౫౬

(ఆహం పితౄన్ సువిదత్రాం) యే బర్హిషదః, స్వధయాఽన్నేన సుతస్య సోమవల్ల్యాదిభ్యో నిష్పాదితస్య రసస్య ప్రాశనం (భజంతే) సేవంతే, (పిత్వః) తత్పానం కృత్వా, (త ఇహాగ) అస్మిన్నస్మత్ సన్నిహితదేశే తే పితరః ఆగచ్ఛంతు. య ఈదృశాః పితరః సంతి, తాన్ విద్యాది శుభగుణానాం దానకర్త్రా నహం (ఆ అవిత్సి) ఆ సమంతాద్ వేద్మి, అత్రాత్మనేపద మిడభావశ్చ వ్యత్యయేన. తాన్ విదిత్వా సంగమ్య చ. (విష్ణోః) సర్వత్ర వ్యాపకస్య పరమేశ్వరస్య (విక్రమణం చ) వివిధక్రమేణ జగద్రచనం తథా (న పాతం చ) న విద్యతే పాతో వినాశో యస్య తన్ మోక్షాఖ్యం పదం చ వేద్మి; యత్ ప్రాప్య ముక్తానాం సద్యః పాతో న విద్యతే. తదేతచ్చ విదుషాం సంగేనైవ ప్రాప్తం భవతి. తస్మాత్ సర్వైర్ విదుషాం సమాగమః సదా కర్తవ్య ఇతి. ౧౨

తె॥ (ఆహం పితౄన్) పితరులు తమ యుత్తమ విద్య, ఉపదేశము మున్నగు వానితో సుఖమునిచ్చు వారని నే నెఱుగుదును. (న పాతం చ విక్రమణం చ విష్ణోః) అంతట వ్యాపకుడైన పరమేశ్వరుని సృష్టిరచనను అతని నాశరహిత మోక్షపదమును (ఆ అవిత్సి) సరిగా నెఱుగుదును. ముక్తులు దేనినిబొంది తిరిగి త్వరగా వెనుకకు రారో యదియే మోక్షపదము. (బర్హిషదో యే) అన్నమునుండియు, సోమలతాదులనుండియు తీసిన రసమును పానము సేయు పితరులను నేనెఱుగుదును. (పిత్వః) ఆరసమును పానముచేసి యెల్లరకు హితమునొనర్చు నాపురుషులు మనకు నెల్లపుడు ప్రాప్తింతురు గాక ! వారివలన మనలో నిత్యము జ్ఞానము వర్ధిల్లుగాక ! పితరుల వలననే మనకు జ్ఞానము పూర్ణముగ లభింపగలదు. కావున నెల్లరు జ్ఞానుల సాంగత్యము చేయవలెను. ౧౨

సం॥ "ఉపహూతాః పితరః సోమ్యాసో బర్హిష్యేషు నిధిషు ప్రియేషు త ఆగమంతు త ఇహ
శ్రువం త్వధిబ్రువంతు తేఽవంత్వస్మాన్" ౧౩ య. ౧౯—౫౭

(సోమ్యాసః) యే ప్రతిష్ఠార్హాః పితరస్తే (బర్హిష్యేషు) ప్రకృష్టేషు (నిధిషు) ఉత్తమవస్తుస్థాపనార్హేషు (ప్రియేషు) ప్రీత్యుత్పాదకేషు (ఉపహూతాః) నిమంత్రితాః సంతః సీదంతు (ఆగమంతు) సత్కారం ప్రాప్యాస్మత్ సమీపం వారం వార మాగచ్ఛంతు (త ఇహ) త ఇహాగత్యాస్మత్ ప్రశ్నాన్ (శ్రువంతు) శృణ్వంతు, శ్రుత్వా తదుత్తరాణి (అధిబ్రువంతు) కథయంతు. ఏవం విద్యాదానేనవ్యవహారోపదేశేనచ (తేఽవం త్వస్మాన్) సదాఽస్మాన్ రక్షంతు. ౧౩

తె॥ (ఉపహూతాః పితరః) ప్రతిష్ఠగల పితరులను మన మాహ్వానింతుము. వారు మనకడకు వచ్చి (బర్హిష్యేషు) ఉత్తమ (నిధిషు) వస్తువులుంచుటకు యోగ్యములగు (ప్రియేషు) ప్రీతి నుత్పన్నము సేయదగు నాసనములపై గూర్చుండి, వినుటకింపైన బహుమూల్యములగు నుపదేశములు మనకిత్తురు గాక! (త ఆగమంతు) ఆ పితరులు వచ్చినపుడు వారిని 'రండు దయచేసి కూర్చుండుడు, ఈ యుత్తమాస నముల నలంకరింపుడు, అని సమ్మానింపవలెను. (ఇహ శ్రువంతు) ఇట మేమడుగు ప్రశ్నలను వినుడు. (అధిబ్రువంతు) ఆ ప్రశ్నలకు సమాధానము లొసగుడు. (తేఽవంత్వస్మాన్) మమ్ములను రక్షింతురుగాక!

సం॥ "అగ్నిష్వాత్తాః పితర ఏహ గచ్ఛత సదః సదః సదత సుప్రణీతయః, అత్తా హవీగ్ంషి
ప్రయతాని బర్హిష్యథా రయిగ్ం సర్వ వీరందధాతన" ౧౪ య. ౧౯—౫౯

(అగ్నిష్వాత్తాః పితర ఏహ గచ్ఛత) హే పూర్వోక్తా అగ్నిష్వాత్తాః పితరః ! అస్మత్ సన్నిధౌ ప్రీత్యా ఆగచ్ఛత, ఆగత్య (సుప్రణీతయః) శోభనా ప్రకృష్టా నీతిర్ యేషాం తే; ఏవం భూతా భవంతః పూజ్యాః

నంతః (సదః సదః సదత) ప్రతిగృహం, ప్రతి సభాం చోపదేశార్థం స్థితిం భ్రమణం చ కురుత. (అత్తా హవీగ్ంషి) ప్రయత్నయుక్తాని కర్మాణి దేయయోగ్యాన్యుత్తమాన్నాని వా యూయం స్వీకురుత (బర్హిష్యథా) అథేత్యనంతరం. బర్హిషి సదసి గృహే వా స్థిత్వా (రయిగ్ంసర్వవీరం) సర్వైర్వీరైర్యుక్తం విద్యాదిధనం యూయం దధాతన. యతోఽస్మాసు బుద్ధి శరీర బలయుక్తా వీరాః స్థిరా భవేయుః, సత్యా విద్యాకోశశ్చ. ౧౪

తె॥ (అగ్నిష్వాత్తాః పితర ఏహ) సర్వ విద్యానిపుణులగు నో పితరులార ! మీ రుపదేశకులై మాయిండ్లకు సభలకును వచ్చి యుపదేశింపుడు. ఆ పితరులెట్టివారై యుండవలెను? (సుప్రణీతయః) ఉత్తమ నీతితోను, గుణములతోను గూడినవారై, (బర్హిషి) సభలలోను, గృహములందు సత్యన్యాయ మొనర్చువారై యుండవలెను. అట్లే (హవిః) వారు దానము చేయుటకును, గ్రహించుటకును యోగ్యమగు విద్యాదిగుణములను దానము చేయువారును గ్రహించువారునై యుండవలెను. (రయిగ్ం సర్వవీరం దధాతన) వీరపురుషయుక్తసేనా ప్రాప్తి గలుగునట్టి యుత్తమ విద్యాది ధనమునుగూర్చి యుపదేశించి మమ్ములను బలపఱచువారై యుండవలెను. అట్టి విద్వాంసులనుగూర్చి దేశదేశములందింటింటికి వెళ్ళి యెల్లరకు సత్యవిద్య నుపదేశింపుడు - అని యీశ్వరాదేశమును గలదు. ౧౪

సం॥ "యే అగ్నిష్వాత్తా యే అనగ్నిష్వాత్తా మధ్యే దివః స్వధయా మాదయంతే, తేభ్యః

స్వరా డసునీతి మేతాం యథా వశం తన్వం కల్పయాతి" ౧౫ య. ౧౯-౬౦

(యే అగ్నిష్వాత్తాః) యే అగ్నివిద్యాయుక్తాః (అనగ్నిష్వాత్తాః) యే వాయుజల భూగర్భాది విద్యానిష్ఠాః, (మధ్యే దివః) ద్యోతనాత్మకస్య పరమేశ్వరస్య సద్విద్యాప్రకాశస్య చ మధ్యే (స్వధయా) అన్నవిద్యయా శరీర బుద్ధిబల ధారణేన చ (మాదయంతే) ఆనందితా భూత్వా, అస్మాన్ సర్వాన్ జనా నానందయంతి, (తేభ్యః) తేభ్యో విద్వద్భ్యో వయం నిత్యం సద్విద్యాం తథా (అసునీతిమేతాం) సత్యన్యాయయుక్తా మేతాం ప్రాణనీతిం చ గృహ్ణీయామ. (యథా వశం) తే (విద్వాంసో వయం చ) విద్యావిజ్ఞాన ప్రాప్త్యా సర్వోపకారేషు నియమేషు స్వతంత్రాః, ప్రత్యేక ప్రియేషు చ పరతంత్రా భవంతు యతః (స్వరాట్) స్వయం రాజతే ప్రకాశతే, స్వాన్ రాజయతి ప్రకాశయతి వా-స స్వరాట్ పరమేశ్వరః (తన్వం కల్పయాతి) తనుం విద్వచ్ఛరీర మస్మదర్థం కృపయా కల్పయాతి, కల్పయతు నిష్పాదయతు, యతోఽస్మాకం మధ్యే బహవో విద్వాంసో భవేయుః. ౧౫

తె॥ (యే అగ్నిష్వాత్తా యే అనగ్నిష్వాత్తాః) ఎవరు అగ్నివిద్యనెఱుగుదురో యెవరు వాయుజల భూగర్భ శాస్త్రముల యందారితేరిన వారో (మధ్యే దివః స్వధయా మాదయంతే) ఎవరు దివము - విజ్ఞాన రూపుడగు పరమేశ్వరుని యందును, సద్విద్యా ప్రకాశమునందును - అన్నాదివిద్యల వలనను, శారీరిక బౌద్ధిక బలధారణల వలనను స్వయముగా సుఖములను బడయుచు నితరులకును సుఖముల నొడకూర్తురో (తేభ్యః స్వరాడసునీతి మేతాం) అట్టి విద్వాంసులగు పితరుల హితముకొఱకు పరమేశ్వరుడు ప్రాణవిద్యను ప్రకటించును. అందువలన మేము ప్రార్థించుచున్నాము. (యథా వశం తన్వం కల్పయాతి) "ఓ పరమేశ్వర! నీవు కృపతో వారి శరీరమును సతతము సుఖముగా నుండునట్లును, రోగగ్రస్తముకాక తేజోవంతమై యుండునట్లును అనుగ్రహింపుము. వారి మూలమున మాకు జ్ఞానము లభించునట్లును, మేము వారి వలన, సత్యము, న్యాయముతోను గూడినవారమై సద్విద్యలను ప్రాణవిద్యను గ్రహించునట్లు కృపతో జూడుము! ౧౫

సం॥ "అగ్నిష్వాత్తా నృతుమతో హవామహే నారాశగ్ంసే సోమపీథం య ఆశుః, తే నో విప్రాసః సుహవా భవంతు వయగ్ం స్యామ పతయో రయీణామ్" ౧౬ యజు. ౧౯—౬౧

(అగ్నిష్వాత్తాః) హే మనుష్యాః! యథా వయం, ఋతువిద్యావతోఽర్థాద్ యథాసమయ ముద్యోగకారిణోఽగ్నిష్వాత్తాః పితరః సంతి తాన్, (హవామహే) ఆహ్వయామహే, తథైవ యుష్మాభిరపి తత్సేవనాయాహ్వానం నిత్యం కార్యమ్ (సోమపీథం య ఆశుః) యే సోమపాన మశ్నంతి. యే చ. (నారాశగ్ంసే) నరైః ప్రశస్యే—అనుష్ఠాతవ్యే కర్మణి కుశలాః సంతి, (తే నో విప్రాసః) తే విప్రా మేధావినో నోఽస్మాన (సుహవా) సుష్ఠుతయాగ్రహీతారో భవంతు. (సోమపీథం) యే సోమవిద్యాదాన గ్రహణాభ్యాం తృప్తాః ఏషాం సంగేన (వయగ్ం.... రయీణామ్) సత్యవిద్యా చక్రవర్తి రాజ్యశ్రీణాం పతయః పాలకాః స్వామినో భవేమ. ౧౬

తె॥ (అగ్నిష్వాత్తా నృతుమతో) ఓ మనుష్యులార ! మీరు అగ్నివిద్యను, సమయవిద్యను నెఱిగిన పితరులను సేవింపుడు. వారి నెల్లపుడు నాహ్వానింపుడు. వారి సాంగత్యముచేసి, సేవతో వారిని ప్రసన్నులను జేసి మీ విద్యల నభివృద్ధి జేసికొనుడు. (నారాశగ్ంసే సోమపీథం య ఆశుః) మానవులు చేయదగు శ్రేష్ఠకర్మముల నాచరించుటలో చతురులును, సోమలతాదులైన యోషధుల రసమును పానము చేయువారును (తే నో విప్రాసః సుహవా) నగు విద్వాంసులు మాకు సత్యవిద్యలను ప్రీతితో గ్రహింపజేయుదురుగాక ! (వయగ్ం స్యామ పతయో రయీణాం) ఆ విద్యల మూలమున మేము చక్రవర్తి రాజ్యలక్ష్మి ప్రభృత్యుత్తమ పదార్థములను బొందుటకును, వానిని రక్షించుకొని యున్నతి నందుటకును సమర్థుల మగుదుముగాక ! అని ప్రార్థింపుడు.

సం॥ "యే చేహ పితరో యే చ నేహ యాంశ్చ విద్మ యాం ౨ ఉ చ న ప్రవిద్మ, త్వం వేత్థ యతి తే జాతవేదః స్వధాభిర్ యజ్ఞగ్ం సుకృతం జుషస్వ" ౧౭ యజు. ౧౯—౬౧

(యే చేహ పితరో) యే పితరో విద్వాంస ఇహాస్మత్ సన్నిధౌ వర్తంతే, యే చేహాస్మత్ సమక్షే న సంత్యర్థాద్దేశాంతరే తిష్ఠంతి, (యాంశ్చ విద్మ) యాన్ వయం జానీమః; (యాం ౨. ఉ చ న) దూర దేశస్థిత్యా యాంశ్చ వయం న జానీమ స్తాన్ సర్వాన్ హే (జాతవేదః) హే పరమేశ్వర ! (త్వం వేత్థ) త్వం యథావజ్జానా స్యతో భవాన్ తేషామస్మాకం చ సంగం నిష్పాదయ (స్వధా) యోఽస్మాభి స్సుకృతః సమ్యగనుష్ఠితో యజ్ఞోఽస్తి, త్వం స్వధాభి రన్నాద్యాభిః సామగ్రీభిః సంపాదితం యజ్ఞం సదా జుషస్వ. సేవస్వ, యేనాస్మాక మభ్యుదయనిఃశ్రేయసకరం క్రియాకాండం సమ్యక్ సిధ్యేత్. (యతి తే) యే యావంతః పరోక్షా విద్యమానా విద్వాంసః సంతి తా నస్మాన్ ప్రాపయ. ౧౭

తె॥ (యే చేహ పితరో) ఓ జాతవేద-పరమేశ్వర! యే పితరులు మాకు సమీపముననను, దూరమున నున్నారో, (యాంశ్చ విద్మ) యెవరిని మే మెఱుగుదుమో, (యాం ౨. ఉ చ న విద్మ) యెవరిని మే మెఱుగమో, (యతి తే) ఇట్లు ప్రపంచమునందు ప్రత్యక్షముగ మే మెఱిగినవారును, పరోక్షమున నుండుటచే మే మెఱుగనివారు నెందఱున్నారో, (త్వం వేత్థ) వారినందఱను నీ వెఱుగుదువు. కృపతో వారిసాంగత్యము మాకు గలుగు నట్లనుగ్రహింపుము. (స్వధాభిర్ యజ్ఞం సుకృతం) అన్నాద్యాదిపదార్థములతో వ్యావహారికములు, పరమార్థరూపములునగు మాచే నొనరింపబడిన శ్రేష్ఠయజ్ఞములను నీవు ధారణాదిశక్తులతో దయతో ననుగ్రహింపుము. అందువలన మేము అభ్యుదయనిః శ్రేయసములను గలిగించు క్రియాకాండను సిద్ధము చేసికొనగలము. మాకు సర్వసుఖములు లభింపగలవు. ౧౭

సం॥ "ఇదం పితృభ్యో నమో అస్త్వద్య యే పూర్వాసో య ఉ పరాస ఈయుః, యే పార్థివే రజస్యా నిషత్తా యే వా నూనగ్ం సువృజనాసు విక్షు" ౧౭ య. ౧౯-౬౮

(ఇదం పితృభ్యః) యే పితరోఽద్యేదానీ మస్మత్ సమీపే అధ్యయనాధ్యాపనే కర్మణి వర్తంతే, (పూర్వాసః) పూర్వమధీత్య విద్వాంసః సంతి. (యే పార్థివే రజసి) యే పృథివీ సంబంధి భూగర్భ విద్యాయాం (అనిషత్తాః) ఆ సమంతా న్నిషణ్ణాః సంతి, (యే వా నూనగ్ం సు) యే చ సువ్మబలయుక్తాసు ప్రజాసు సభాధ్యక్షాః సభాసదో భూత్వా న్యాయాధీశత్వాదికర్మణేఽధిక్రుతాః సంతి, తే చాస్మా నీయుః ప్రాప్నుయుః. ఇత్థం భూతేభ్యో పితృభ్యోఽస్మాకమిదం సతతం నమోఽస్తు. ౧౭

తె॥ (ఇదం పితృభ్యో) మేము పితరులకు నమస్కరించు చున్నాము. (అద్య పూర్వాసో య ఉ పరాస ఈయుః) వారు ముందు విద్వాంసులై తదుపరి మాకు విద్యాదానము చేయుదురు. లేక విరక్తులు సంన్యాసులునై యంతటదిరుగుచు నుపదేశింతురు. (యే పార్థివే రజస్యానిషత్తాః) వారు భూగర్భాది విద్యలు, సూర్యాది లోకవిజ్ఞానము గలిగి యుందురు. (యే వా నూనగ్ం సు) మఱియు వారు నిశ్చయముగ బలయుక్త ప్రజలకు హితము సేయుట కుద్యుక్తులై యుందురు. ఉత్తమ సేనలయందు వారు చతురులు; కావున వారు న్యాయాధీశాది పదవులలో నధికృతులగుదురు. అట్టివారి కెల్లరకు మేము నమస్కరింతుము. వారు మా యౌన్నత్యమునకు దోడ్పడుదురు గాక ! ౧౭

సం॥ "ఉశంతస్త్వా నిధీమహ్యుశంతః సమిధీమహి,
ఉశన్నుశత ఆవహ పితౄన్ హవిషే అత్తవే" ౧౮ యజు ౧౯-౭౦

(ఉశంతస్త్వా) హే పరమేశ్వర ! వయం త్వాం కామయమానా ఇష్టత్వేన హృదయాకాశే, న్యాయాధీశత్వేన రాష్ట్రే సదా స్థాపయామః (ఉశంతః సమిధీమహి) జగదీశ్వర ! త్వాం శృణ్వంతః శ్రావయంతః సమ్యక్ ప్రకాశయేమహి. కస్మై ప్రయోజనాయేత్యత్రాహ :- (హవిషే అత్తవే) సద్విద్యాగ్రహణాయ తేభ్యో ధనాద్యుత్తమపదార్థదానాయానంద భోగాయ చ (ఉశన్నుశతావహ పితౄన్) సత్యోపదేశవిద్యాం కామయమానాన్ కామయమాన స్త్వంస్త్వ మస్మా నావహాసమంతాత్ ప్రాపయ. ౧౮

తె॥ (ఉశంతస్త్వా నిధీమహి) ఓ పరమేశ్వర ! మేము నిన్ను బొందవలెనను కోరికతో నిన్ను ఇష్టదేవతగా హృదయమునందును, న్యాయాధీశరూపమున రాష్ట్రమునందును స్థాపితము చేయుదుముగాక ! (ఉశంతః సమిధీమహి) నిన్నుగూర్చి వినుచు, వినిపించుచు నెల్లయెడల ప్రకటింతుముగాక ! (ఉశన్నుశత పితౄనావహ) ఓ దేవ ! మాకు మేలు గలుగుటకై పూర్వోక్త పితరులను లభింపజేయుము. అందువలన (హవిషే అత్తవే) మేము వారికి సేవనొనర్చి విద్యలను గ్రహించుటకును, వారికి నుత్తమ పదార్థములను సమర్పించుటకును, ఆనందము ననుభవించుటకును స్థిరుల మగుదుముగాక ! ౧౮

సం॥ "పితృభ్యః స్వధాయిభ్యః స్వధా నమః, పితామహేభ్యః స్వధాయిభ్యః స్వధా నమః, ప్రపితామహేభ్యః స్వధాయిభ్యః స్వధా నమః, అక్షన్ పితరోఽమీమదంత పితరోఽతీతృపంత పితరః, పితరః శుంధధ్వమ్" ౨౦ య. ౧౯-౩౬

(పితృభ్యః) స్వాం స్వకీయా మమృతాఖ్యాం మోక్షవిద్యాం కర్తుం శీలం యేషాం తేభ్యోవసుసంజ్ఞకేభ్యో విద్యాప్రదాతృభ్యో, జనకేభ్యశ్చ, (స్వధా) అన్నాద్యుత్తమం వస్తు దద్మః. యే చ చతుర్వింశతి వర్ష పర్యంతేన బ్రహ్మచర్యేణ విద్యామధీత్యాధ్యాపయంతి తే వసుసంజ్ఞకాః; (పితామహేభ్యః) యే

చతుశ్చత్వారింశ ద్వర్షపర్యంతేన బ్రహ్మచర్యేణ విద్యాం పఠిత్వా పాఠయంతి తే పితామహాః, (ప్రపితామహేభ్యః) యేఽష్టాచత్వారింశ ద్వర్షప్రమితేన బ్రహ్మచర్యేణ విద్యాపారావారం ప్రాప్యాధ్యాపయంతి త ఆదిత్యాఖ్యాః, అర్థాత్ సత్యవిద్యా ద్యోతకాః, (నమః) తేభ్యోఽస్మాకం సతతం నమోఽస్తు (అక్షన్ పితరః) హే పితరో 'భవంతోఽక్షన్నత్రైవ భోజనాచ్ఛాదనాదికం కుర్వీరన్'అమీమదంత పితర ఇతి పూర్వం వ్యాఖ్యాతమ్. (అతీతృపంత పితరః) హే పితరోఽస్మత్ సేవయాఽఽనందితా భూత్వా తృప్తా భవత (పితరః శుంధధ్వమ్) హే పితరో యూయ ముపదేశేనావిద్యాది దోషవినాశాదస్మాన్ శుంధధ్వం పవిత్రాన్ కురుత. ౨౦

తె॥ (పితృభ్యః స్వధా) అమృతనామక మోక్షవిద్య నభ్యసించుటయే స్వభావముగలిగి, యిరువదినాలుగు సంవత్సరముల కాలము విద్యాధ్యయనము చేయుచు నితరులకు విద్యాదానము చేయు వసుసంజ్ఞగల పితరులకు మే మన్నాద్యుత్తమ పదార్థముల నిత్తుము; వారికి నమస్కరింతుము. (పితామహేభ్యః) నలువదినాలుగు వర్షముల వఱకు బ్రహ్మచర్యాశ్రమమునుండి, వేదాది విద్యల నభ్యసించి, యెల్లరకు నుపకారము చేయుచు, నమృత రూపజ్ఞానము నొసంగు రుద్రనామక పితరులను సత్కరించి నమస్కరింతుము. (ప్రపితామహేభ్యః) నలువది యెనిమిది వత్సరముల పర్యంతము జితేంద్రియులై యుండి, సంపూర్ణ విద్యల నభ్యసించి, క్రియాత్మక రూపమునను వానిని స్వాధీనము చేసికొని, యెల్లరి సుఖముకొఱకు నెల్లపుడు యత్నించు ఆదిత్యనామక పితరులనుగూడ మేము సత్కరింతుము. ఇందు పితృసంజ్ఞ కలవారు వసువు లనబడుదురు. వారు సర్వవిద్యలయందు వాసము చేయుదురు. అట్లే పితామహులకు రుద్రులని నామము. వారు వసువులకంటె రెండింతలుకాని, మూఁడింతలుకాని యెక్కుడు విద్యావంతులు, బలశాలురునై యుందురు. అట్లే ప్రపితామహులు ఆదిత్యులనబడుదురు. వారు సమస్త విద్యలలోను, గుణములలోను సూర్యునివలె ప్రకాశింతురు. ఇతరులను ప్రకాశింపజేయుదురు. ఈ ముప్విధములగు పితరులు మనుష్యులలో దుష్టతను అజ్ఞానము నుండనీయరు. (అక్షన్ పితరః) ఓ పితరులారా ! మీరిటనే భుజింపుడు; పానము చేయుడు; వస్త్రములను ధరింపుడు. (అమీమదంత పితరః) అట్లే మేమొనర్చు సేవతో ప్రసన్నులగుదురుగాక ! (అతీతృపంత పితరః) మా సేవలతో తృప్తిబొంది మమ్ములను ప్రసన్నులను జేయుడు; తృప్తి పఱపుడు. మీకు వలసిన పదార్థములను సేకరించుటలో మేము తప్పుచేసిన మమ్ములను శిక్షింపుడు. (పితరః శుంధధ్వమ్) పితరులార ! ధర్మోపదేశముతోను, సత్యవిద్యలతోను, మమ్ములను బవిత్రులను జేయుడు. మేమును మీతోగలిసి మా శుద్ధికొఱకు భక్తితో సనాతనుడగు పరమేశ్వరుని సేవింతుము. ౨౦

*సం॥* "పునంతు మా పితరః సోమ్యాసః, పునంతు మా పితామహాః పునంతు ప్రపితామహాః. పవిత్రేణ శతాయుషా. పునంతు మా పితామహాః పునంతు ప్రపితామహాః పవిత్రేణ శతాయుషా, విశ్వమాయుర్ వ్యశ్నవై" ౨౧

య. ౧౯-౩౭

(పునంతు మా పితరః) భో పితరః ! పితామహాః !, ప్రపితామహాశ్చ !, భవంతో మాం మనః కర్మ వచనద్వారా వారం వారం పునంతు, పవిత్రవ్యవహారకారిణం కుర్వంతు కేన పునంత్విత్యాహ - (పవిత్రేణ) పవిత్రకర్మానుష్ఠానకరణోపదేశేన, (శతాయుషా) శతవర్షపర్యంత జీవన నిమిత్తేన బ్రహ్మచర్యేణ మాం పునంతు. అగ్రే పునంత్వితి క్రియాత్రయం యోజనీయమ్; యేనాహం (విశ్వమాయుర్ వ్యశ్నవై) సంపూర్ణమాయుః ప్రాప్నుయామ్. ౨౧

అత్ర "పురుషోవావ యజ్ఞో" (ప్ర. ౩-౧౬) ఇత్యాకారేణ ఛాందోగ్యోపనిషత్ ప్రమాణేన వసురుద్రాదిత్య సంజ్ఞా విదుషాం వేదితవ్యాః.

తె॥ (పునంతు మా పితరః) శాంతాత్ములు, దయగలవారు నగు పితరులు నాకు విద్యనొసంగి పవిత్రుం జేయుదురుగాక !అందువలన నా వ్యవహారము పవిత్రమగుగాక ! (పునంతు మా పితామహాః) ఇట్లే పితామహులు, ప్రపితామహులును నాకు ఉత్తమవిద్యలం గఱపి పవిత్రుం జేయుదురుగాక ! వారి వలన శిక్షణను బొంది బ్రహ్మచర్య ధారణచేయుటవలన నూఱు వర్షముల పర్యంత మానందముతో నేను జీవింతునుగాక! ఈ మంత్రమున (పవిత్రేణ శతాయుషా) అను భాగము రెండు పర్యాయములు ప్రయోగించుట ఆదరార్థము. ౨౦

'పురుషో వావయజ్ఞః' (ఛాందో. ౩-౧౬) అను ఛాందోగ్యోపనిషద్భాగము వసురుద్రాదిత్య సంజ్ఞలకు ప్రమాణము - అది చూడదగును.

పితృయజ్ఞవిషయక మంత్రము లిట్టివి యనేకములున్నవి. వానినిట్లే తెలిసికొనవలెను. ఎటనైనను నమావాస్యయందు పితృయజ్ఞము చేయుడని యున్నచో నిత్యము పితరులను సేవింపజాలనివారు మాసమునకొక దినముననైనను నమావాస్యకు మాసేష్టి చేయునపుడు వారి నాహ్వానించి తప్పక సత్కరింప వలెనని యెఱుగవలెను.

పితృయజ్ఞ విషయము సమాప్తము.

# అథ బలివైశ్వదేవవిధిర్ లిఖ్యతే

సం॥ యదన్నం పక్వమక్షారలవణం భవేత్తేనైవ బలివైశ్వదేవ కర్మ కార్యమ్.

"వైశ్వదేవస్య సిద్ధస్య గృహ్యేఽగ్నౌ విధిపూర్వకమ్

ఆభ్యః కుర్యాద్దేవతాభ్యో బ్రాహ్మణో హోమమన్వహమ్" ౧ మను. ౩-౮౪

అథ బలివైశ్వదేవకర్మణి ప్రమాణమ్;

"అహరహర్ బలిమిత్తే హరంతోఽశ్వాయేవ తిష్ఠతే ఘాసమగ్నే" ౧అథ. ౧౯-౭-౫౫-౭

"రాయస్పోషేణ సమిషా మదంతో మా తే అగ్నే ప్రతివేశా రిషామ" ౨

అథ. ౧౯-౭-౫౫-౭

(అగ్నే) హే పరమేశ్వర ! (తే) తుభ్యం, త్వదాజ్ఞాపాలనార్థం, (ఇత్) ఏవ, (తిష్ఠతేఽశ్వాయ ఘాసం) యథాఽశ్వస్యాగ్రే పుష్కలః పదార్థః స్థాప్యతే తథైవ (ఇవ) (అహరహః) నిత్యం ప్రతి (బలింహరంతః) భౌతికమగ్నిమతిథీంశ్చ బలీన్ ప్రాపయంతః, (సమిషా) సమ్యగిష్యతే యా సా సమిట్, తయా శ్రద్ధయా (రాయస్పోషేణ) చక్రవర్తి రాజ్యలక్ష్మ్యా (మదంతః) హర్షంతో వయం (అగ్నే) హే పరమాత్మన్! (తే) తవ (ప్రతివేశాః) ప్రతికూలా భూత్వా సృష్టిస్థాన్ ప్రాణినః (మా రిషామ) మా పీడయేమ. కింతు భవత్ కృపయా సర్వే జీవా అస్మాకం మిత్రాణి సంతు. సర్వేషాం చ వయం సఖాయః స్మ; ఇతి జ్ఞాత్వా పరస్పరం నిత్యముపకారం కుర్యామ. ౧-౨

తె॥ ఉప్పుకలియని పక్వమైన యన్నముతో బలివైశ్వదేవ కర్మ మాచరింపవలెను.

'గృహ్యాగ్నియందు విశ్వదేవతల నుద్దేశించి సిద్ధము చేయబడిన యన్నముతో ప్రతి దినము బ్రాహ్మణుడు - ద్విజుడు - దేవతలకొఱకు హోమము చేయవలెను.

(అగ్నే) ఓ పరమేశ్వర ! గుఱ్ఱము ముందు ఖాద్యపదార్థములను పుష్కలముగ నుంచునట్లు నీయాజ్ఞను పాలించుటకుగాను, (అహరహః) ప్రతిదినము భౌతికాగ్నియందు హోమము చేయుచు, (బలిం) భోజనము నతిథుల కందించుచు మేము వాంఛించిన చక్రవర్తి రాజ్యలక్ష్మి నానందముతో ననుభవింతుము. అగ్నే ! ఓ పరమాత్మ ! (ప్రతివేశాః) నీ యాజ్ఞకు ప్రతికూలముగ వర్తించువారమై నీచే సృష్టింపబడిన ప్రాణులను (మా రిషామ) అన్యాయముగ కష్టపెట్టకుందుముగాక ! నీ కృపవలన సర్వప్రాణులు మాకు మిత్రములగుగాక ! మేమును వానికి మిత్రములగుదుముగాక ! పరస్పరముపకార మొనరించు కొందుముగాక ! ౧

"పునంతు మా దేవజనాః పునంతు మనసా ధియః

పునంతు విశ్వా భూతాని జాతవేదః పునీహి మా (స్వాహా)" ౩ యజు. ౧౯-౩౯

(పునంతు మా) అస్య మంత్ర స్యార్థస్తర్పణ విషయ ఉక్తః

తె॥ ఈ మంత్రార్థము తర్పణ విషయమున పూర్వము వ్రాయబడినది :

"ఓం అగ్నయే స్వాహా" ౧

"ఓం సోమాయ స్వాహా" ౨

"ఓం అగ్నీషోమాభ్యాం స్వాహా" ౩

"ఓం విశ్వేభ్యో దేవేభ్యః స్వాహా" ౪

"ఓం ధన్వంతరయే స్వాహా" ౫

"ఓం కుహ్వై స్వాహా" ౬

"ఓం అనుమత్యై స్వాహా" ౭

"ఓం ప్రజాపతయే స్వాహా" ౮

"ఓం సహ ద్యావాపృథివీభ్యాగ్ం స్వాహా" ౯

"ఓం స్విష్టకృతే స్వాహా" ౧౦

(ఓమ్) అగ్న్యర్థ ఉక్తః. ౧

(ఓం సో....) సర్వానందప్రదో యః సర్వజగదుత్పాదక ఈశ్వరః, సోఽత్ర గ్రాహ్యః. ౨

(ఓమగ్నీ....) ప్రాణాపానాభ్యామ్. అనయోరర్థో గాయత్రీమంత్రార్థ ఉక్తః. ౩

(ఓం వి...) విశ్వే దేవా విశ్వప్రకాశకా ఈశ్వరగుణాః, సర్వే విద్వాంసో వా. ౪

(ఓం ధ...) సర్వరోగనాశక ఈశ్వరోఽత్ర గృహ్యతే. ౫

(ఓం కు...) దర్శేష్ట్యర్థోఽయ మారంభః, అమావాస్యేష్టి ప్రతిపాదితాయై చితిశక్తయే వా. ౬

(ఓమ...) పౌర్ణమాస్యేష్ట్యర్థోఽయ మారంభః విద్యాపఠనానంతరం మతిర్ మననం జ్ఞానం యస్యా శ్చితిశక్తేః సాఽనుమతిర్ వా తస్యై. ౭

(ఓం ప్ర...) సర్వజగతః స్వామీ రక్షక ఈశ్వరః. ౮

(ఓం సహ...) ఈశ్వరేణ ప్రకృష్టగుణైః సహోత్పాదితాభ్యాం అగ్నిభూమిభ్యాం సర్వోపకారా గ్రాహ్యాః వీతదర్థోఽయ మారంభః ౯

(ఓం స్విష్ట...) యః సుష్ఠు శోభన మిష్టం సుఖం కరోతి స చేశ్వరః" ౧౦

ఏతైర్ మంత్రైర్ హోమం కృత్వాఽథ బలిదానం కుర్యాత్.

తె॥ ౧ (ఓ మగ్నయే...) అగ్నిశబ్దమున కర్థము పూర్వము వ్రాయబడినది.

(అగ్నిహోత్రప్రకరణమున చూడనగును)

౨ (ఓం సోమ...) సర్వపదార్థములను సృష్టించి, పుష్టిని గలిగించి సుఖము నిచ్చువాడు కావున నీశ్వరుడు సోముడు.

౩ (ఓం అగ్నిషోమ...) ప్రాణులకు జీవనహేతువగు ప్రాణము. దుఃఖనాశకమగు నపానము రెండు నగ్నీషోమములు.

౪ (ఓం విశ్వే...) ప్రపంచమును ప్రకటింపజేయు నీశ్వరగుణములు, విద్వాంసులు విశ్వేదేవు లనబడుదురు.

౫ (ఓం ధన్వం...) జన్మమరణాదిరోగనాశకుడగుటచే పరమేశ్వరుడు ధన్వంతరి యనబడును.

౬ (ఓం కుహ్వై) అమావాస్యేష్టి కిదిద్యోతకము - అమావాస్యేష్టి ప్రతిపాదించు నీశ్వర చితిశక్తి కుహూ' అనబడును.

౭ (ఓ మనుమత్యై) పౌర్ణమాసేష్టికాని, సర్వశాస్త్ర ప్రతిపాదితమగు నీశ్వరునిచితిశక్తి కాని అనుమతి యనబడును.

౮ (ఓం ప్రజాపతి) సర్వజగత్తునకు స్వామియైన జగదీశ్వరుడు ప్రజాపతి యనబడును.

౯ (ఓం సహద్యావా...) ఈశ్వరునిచే ప్రకృష్టగుణములతో బాటు సృష్టింపబడిన అగ్ని, పృథివి వీనివలన గలుగు నుపకారము లన్నియు నిట 'ద్యావాపృథివీ' పదములచే గ్రహింపనగును.

౧౦ (ఓం స్విష్ట...) ఇష్టసుఖములనిచ్చు పరమేశ్వరుడు స్విష్ట కృత్పదవాచ్యుడు.

'స్వాహా' శబ్దమున కర్థము పూర్వమే వ్రాయబడినది. ఈ పదిమంత్రముల యర్థముల వలన పది ప్రయోజనములను తెలిసికొనవలెను. ఈ మంత్రములతో హోమ మొనర్చి బలిదాన మొనర్పవలెను.

ఇక బలిదానము మంత్రము లివి :

౧ ఓం సానుగాయేంద్రాయ నమః

౨ ఓం సానుగాయ యమాయ నమః

౩ ఓం సానుగాయ వరుణాయ నమః

౪ ఓం సానుగాయ సోమాయ నమః

౫ ఓం మరుద్భ్యో నమః

౬ ఓం అద్భ్యో నమః

౭ ఓం వనస్పతిభ్యో నమః

౮ ఓం శ్రియై నమః

౯ ఓం భద్రకాళ్యై నమః

౧౦ ఓం బ్రహ్మపతయే నమః

౧౧ ఓం వాస్తుపతయే నమః

౧౨ ఓం విశ్వేభ్యో దేవేభ్యో నమః

౧౩ ఓం దివాచరేభ్యో భూతేభ్యో నమః

౧౪ ఓం నక్తంచారిభ్యో నమః

౧౫ ఓం సర్వాత్మభూతయే నమః

౧౬ ఓం పితృభ్యః స్వధాయిభ్యః స్వధా నమః

ఇతి నిత్య శ్రాద్ధమ్.

(ఓం సాను) 'ణమ ప్రహ్వత్వే శబ్దే' ఇత్యనేన సత్ క్రియాపురస్సర గుణైః విచారేణ మనుష్యాణాం యథార్థం విజ్ఞానం భవతీతి వేద్యమ్. నిత్యైర్ సహవర్తమానః పరమైశ్వర్యవా నీశ్వరోఽత్ర గృహ్యతే ౧

(ఓం సాను) పక్షపాతరహితో న్యాయకారిత్వాది గుణయుక్తః పరమాత్మాఽత్ర వేద్యః. ౨

(ఓంసా....వరుణ) విద్యాద్యుత్తమ గుణవిశిష్టః సర్వోత్తమః పరమేశ్వరోఽత్ర గ్రహీతవ్యః. ౩

(ఓం సా...సోమ) అస్యార్థ ఉక్తః. ౪

(ఓం మరుద్భ్యః) య ఈశ్వరాధారేణ సకలం విశ్వం ధారయంతి చేష్టయంతి చ తే మరుతః. ౫

(ఓ మద్భ్యః) అస్యార్థః శన్నో దేవీరిత్యత్రోక్తః. ౬

(ఓం వనస్పతి) వనానాం లోకానాం సతయ ఈశ్వరోత్పాదితా వాయుమేఘాదయః పదార్థా అత్ర గ్రాహ్యాః, యద్వా ఉత్తమ గుణయోగే నేశ్వరేణోత్పాదితేభ్యో మహావృక్షేభ్య శ్చోపకారగ్రహణం సదా కార్యమితి బోధ్యమ్. ౭

(ఓం శ్రియై) శ్రీయతే సేవ్యతే సర్వైర్ జనై స్సా శ్రీ రీశ్వరః సర్వ సుఖశోభావత్వాత్, యద్వేశ్వరేణోత్పాదితా విశ్వశోభా చ. ౮

(ఓం భద్రకాల్యై) యా భద్రం కల్యాణం సుఖం కలయతి సా భద్రకాళీ—ఈశ్వరశక్తిః. ౯

(ఓం బ్రహ్మపతయే) బ్రహ్మణః సర్వశాస్త్ర విద్యాయుక్తస్య వేదస్య బ్రహ్మాండస్య వా పతిరీశ్వరః ౧౦

(ఓం వాస్తుపతయే) వసంతి సర్వాణి భూతాని యస్మింస్తద్ వాస్త్వాకాశం తత్పతిరీశ్వరః. ౧౧

(ఓం విశ్వే...) అస్యార్థ ఉక్తః. ౧౨

(ఓం దేవాచర...) (ఓం నక్తం చర) ఈశ్వరకృపయైవం భవేన్నః దివసే యాని భూతాని విచరంతి, రాత్రౌ చ, తాని విఘ్నం మా కుర్వంతు తైః సహాఽవిరోధోఽస్తు నః; ఏతదర్థోఽయ మారంభః. ౧౩–౧౪

(ఓం సర్వాత్మా...) సర్వేషాం జీవాత్మనాం భూతిర్ భవనం సత్తేశ్వరోఽత్ర గ్రాహ్యః. ౧౫

(ఓం పితృ) అస్యార్థ ఉక్తః పితృతర్పణే. నమ ఇత్యస్య నిరభిమానద్యోతనార్థః పరస్యోత్కృష్టతా మాస్యజ్ఞాపనార్థ శ్చారంభః. ౧౬

తె॥ (ఓం సానుగాయేంద్రాయ) ఇట సానుగేంద్ర శబ్దముచే పరైశ్వర్యయుక్తుడగు పరమేశ్వరుడు నతని గుణములు గ్రహింపనగును. ౧

(ఓం సా...యమ) సత్యన్యాయ మొనర్చు నీశ్వరుడు, నతని సృష్టిలోని సత్యన్యాయము నొనర్చు సభాసదులు సానుగ - యమ శబ్దముచే గ్రహింపదగుదురు. ౨

(ఓం సా...వరుణ) విద్యాద్యుత్తమగుణయుక్తుడు, సర్వోత్తముడునగు పరమాత్మయు నతని భక్తులు నిట గ్రాహ్యులు. ౩

(ఓం సా...సోమ) పుణ్యాత్ముల నానందింపజేయు పరమేశ్వరుడు, పుణ్యాత్ములు గ్రహింపదగుదురు. ౪

(ఓం మరుత్) ప్రాణములు, ఇవియున్న జీవనముండును, లేకున్న మరణము కలుగును. మరుత్ పదవాచ్యములగు నీ ప్రాణములను కాపాడుకొనవలెను. ౫

(ఓ మద్భ్యః) 'శన్నోదేవీ' మంత్రమున నీ 'అప్' శబ్దమున కర్థము వ్రాయబడినది. ౬

(ఓం వనస్పతి...) ఈశ్వరనిర్మితములగు వాయువు, మేఘాదులు, సర్వపాలన హేతువులగు పదార్థములు గ్రహింపనగును. మఱియు వేనివలన నధికవర్షములు కురియవో వేనిఫలములవలన జగత్తున కుపకారము గలుగునో యట్టి వృక్షములను రక్షింపవలెను. ౭

(ఓం శ్రియై) సేవింపదగు పరమేశ్వరుని సేవింపవలెను. రాజ్యశ్రీ ప్రాప్తికొఱకు నిత్యము పురుషార్థ మొనర్పవలెను. ౮

(ఓం భద్రకాళ్యై) శుభము నొడగూర్చు పరమేశ్వరుని శక్తి - సామర్థ్యము నెల్లపుడాశ్రయింపవలెను. ౯

(ఓం బ్రహ్మపదయే) వేదమునకు, బ్రహ్మాండమునకు స్వామియగు నీశ్వరుని విద్యకొఱకు ప్రార్థింపవలెను. ౧౦

(ఓం వాస్తు) సర్వభూతముల నివాసస్థానమగు నాకాశమునకు పతియును, గృహసంబంధి పదార్థముల నుపాసించువాడును నీశ్వరుడే. ౧౧

(ఓం విశ్వే) 'విశ్వేదేవ' పదమునకర్థము పూర్వము వ్రాయబడినది. ౧౨

(ఓం దివాచరేభ్యో - నక్తం చరేభ్యో) రాత్రిందినములలో సంచరించు ప్రాణుల కుపకారము చేయుచు వాని వలన నుపకారము బొందవలెను. ౧౩-౧౪

(ఓం సర్వాత్మభూతయే) అంతట వ్యాపించియున్న పరమేశ్వరుని యునికి నెప్పుడు ధ్యానమున నుంచుకొనవలెను. ౧౫

(ఓం పితృ...) తల్లి దండ్రులు, ఆచార్యులు, మున్నగువారికి భోజనాదుల నొసంగి పిదప తాను భుజింపవలెను. ౧౬

అభిమానమును విడిచి యితరులను గౌరవించుట నమఃశబ్దమున కర్థము. ఇట్లు సత్కారపూర్వకముగ నాలోచించుటవలన మానవులకు యథార్థజ్ఞానము కలుగును.

ఇదియే 'నిత్య శ్రాద్ధము' తదుపరి యాఱు భాగములుచేసి,

"శునాం చ పతితానాం చ శ్వపచాం పాపరోగిణామ్

వాయసానాం కృమీణాం చ శనకైర్ నిర్వపేద్ భు వి" మ. ౩-౯౨

"అనేన షడ్భాగాన్ భూమౌ దద్యాత్, ఏవం సర్వప్రాణిభ్యో భాగాన్ విభజ్య దత్త్వా చ తేషాం ప్రసన్నతాం సంపాదయేత్.

తె॥ కుక్కలకు, పతితులకు, శ్వపచులు – అతి నీచులకు కుష్ఠ మున్నగు భయంకర రోగములు కలవారికి, కాకులు మున్నగు పక్షులకు చీమలు మున్నగు పురుగులకును వేఱువేఱుగ నాయన్నమును పంచి యిచ్చి వానికి సుఖమును జేకూర్చవలెను. సర్వప్రాణులకు సుఖము గలిగింప యత్నింపవలెనని భావము.

వేద, మనుస్మృతి మున్నగు గ్రంథప్రమాణములతో బలివైశ్వదేవ విధి వ్రాయబడినది.

బలివైశ్వదేవవిధి సమాప్తము.

# అతిథియజ్ఞః

సం॥ అథ పంచమోఽతిథియజ్ఞః ప్రోచ్యతే. యత్రాతిథీనాం సేవనం యథావత్ క్రియతే తత్ర సర్వాణి సుఖాని భవంతీతి. అథ కే అతిథయః? యే పూర్ణవిద్యావంతః పరోపకారిణో, జితేంద్రియా, ధార్మికాః, సత్యవాదిన శ్ఛలాదిదోషరహితా నిత్యభ్రమణకారిణో మనుష్యా స్తే నతిథయ ఇతి కథయంతి. అత్రానేకే ప్రమాణభూతా వైదికమంత్రాః సంతి. పరంత్వత్ర సంక్షేపతో ద్వావేవ లిఖామః.

"తద్యస్యైవం విద్వాన్ వ్రాత్యోఽతిథిర్ గృహా నాగచ్ఛేత్" ౧ అథర్వ. ౧౫-౨-౧౧-౧

"స్వయమేన మభ్యుదేత్య బ్రూయాత్, వ్రాత్య ! క్వావాత్సీర్, వ్రాత్యోదకం, వ్రాత్య తర్పయంతు, వ్రాత్య యథా తే ప్రియం తథాస్తు. వ్రాత్య యథా తే వశ స్తథాస్తు, వ్రాత్య యథా తే నికామస్తథా ఽస్త్వితి" ౨ అథర్వ. ౧౫-౨-౧౧-౨

(తద్య) యః పూర్వోక్త విశేషగుణయుక్తో విద్వాన్ (వ్రాత్యః) మహోత్తమగుణ విశిష్టః, సేవనీయోఽతిథిరర్థాద్యస్య గమనాగమనయో రనియతా తిథిః, కింతు స్వేచ్ఛయాఽకస్మాదాగచ్ఛేద్ గచ్ఛేచ్ఛ. ౧

స యదా యదా గృహస్థానాం గృహేషు ప్రాప్నుయాత్ (స్వయమేన మ) తదా గృహస్థోఽత్యంత ప్రేమ్ణోత్థాయ నమస్కృత్య చ తం మహోత్తమాసనే నిషాదయేత్. తతో యథాయోగ్యం సేవాం కృత్వా తదనంతరం తం పృచ్ఛేత్ – (వ్రాత్య క్వావాత్సీః) హే పురుషోత్తమ ! త్వం కుత్ర నివాసం కృతవాన్? (వ్రాత్యోదకం) హే అతిథే ! జలమేతద్ గృహాణ. (వ్రాత్య తర్పయంతు) యథా భవంతః స్వకీయసత్యోపదేశేన అస్మాన్ అస్మాకం మిత్రాదీం శ్చ తర్పయంతి తథాఽస్మదీయా భవంతం చ. (వ్రాత్య యథా) హే విద్వన్! యథా భవతః ప్రసన్నతా స్యాత్తథావయం కుర్యామ. యద్వస్తు భవత్ప్రియమస్తి తస్యాజ్ఞాం కురు. (వ్రాత్య యథా తే) హే అతిథే ! భవాన్ యథేచ్ఛతి తథైవ వయం తదనుకూలతయా భవత్ సేవాకరణే నిశ్చినుయామ. (వ్రాత్య యథా తే) యథా భవదిచ్ఛాపూర్తిః స్యాత్తథా సేవాం వయం కుర్యామ, యతో భవాన్ వయం చ పరస్పరం సేవా సత్సంగపూర్వికయా విద్యావృద్ధ్యా సదా సుఖే తిష్ఠేమ.

తె॥ అతిథి యజ్ఞము. ఇది యైదవది. ఇం దతిథులకు తగిన సేవచేయవలసి యుండును.

అతిథులన నెవరు?

పూర్ణవిద్వాంసులు, పరోపకారులు, జితేంద్రియులు, ధర్మాత్ములు, సత్యవాదులు, కపటరహితులు, నిత్యము దేశమునందెల్ల యెడల దిరుగుచు విద్యాధర్మములను బ్రచారమొనర్చువారు, అవిద్యాఽధర్మములను దొలగించువారు అతిథులనబడుదురు.

ఈ విషయమునుబోధించు వేదమంత్రములనేకములు ప్రమాణములుగా నుల్లేఖింపవచ్చును. కాని, సంక్షేపముగ నిట రెండు మంత్రములను మాత్రమే వ్రాయుచున్నాము.

(తద్యస్యైవం...) పూర్వోక్తములగు విశేష గుణములు గలిగి (వ్రాత్యః) ఉత్తమ గుణవంతుడు, సేవ నొనర్ప యోగ్యుడగు విద్వాంసుడింటికివచ్చిన నతనికి తగినట్లు సేవ చేయవలెను. రాక పోకలకు నియత తిథి-దినము-సమయములేని వ్యక్తి అతిథియనబడును.

(స్వయమేనమభ్యేత్య) గృహస్థులు విద్వాంసుడైన యతిథి తమ యింటికి వచ్చుటంజూచి, వానికెదురేగి, భక్తితో నమస్కరించి యుత్తమాసనముపై గూర్చుండ జేయవలెను.

తదుపరి యిట్లు ప్రార్థింపవలెను ! ఆర్య ! మీకు వలయు వస్తువుల నాజ్ఞాపింపుడు. అతడు స్వస్థచిత్తుడైన మీదట (వ్రాత్య క్వావాత్సీః)

అయ్యా ! మీరెక్కడ నుంటిరి? (వ్రాత్యోదకం) అతిథీ ! ఈ జలమును గ్రహింపుడు. మమ్ములను మీ సత్యోపదేశముతో (తర్పయంతు) తృప్తి పఱపుడు. మేము, మాయిష్ట మిత్రులు ఎల్లరు మిమ్ములను సేవతో తృప్తి నొందింతుము.

(వ్రాత్య యథా) ఓ విద్వాంసుడ ! నీకెట్లు ప్రసన్నత కలుగునో యట్లే మేమాచరింతుము. మీకు ప్రియకరవస్తువుల నాజ్ఞాపింపుడు. సమకూర్చెదము. మీ కోరిక తీరునట్లు మేము నిన్ను సేవింతుము. మీరు, మేము పరస్పర సాంగత్యమువలన విద్యావృద్ధి నొనర్చుకొని సుఖింతుముగాక !

పంచమహాయజ్ఞ విషయము సమాప్తము.

# అథ గ్రంథ ప్రామాణ్యాప్రామాణ్య విషయః

సం॥ సృష్టిమారభ్యాద్యపర్యంతం యేషాం యేషాం స్వతః పరతః ప్రమాణ సిద్ధానాం గ్రంథానాం పక్షపాతరహితై రాగద్వేషశూన్యైః సత్యధర్మ ప్రియాచరణైః సర్వోపకారకై రార్యైర్ విద్వద్భిర్ యథాంగీకారః కృతస్తథాఽత్రోచ్యతేః– య ఈశ్వరోక్తా గ్రంథాస్తే స్వతః ప్రమాణం కర్తుం యోగ్యాః సంతి. యే జీవోక్తాస్తే పరతః ప్రమాణార్హాశ్చ. ఈశ్వరోక్తత్వాచ్చత్వారో వేదాః స్వతః ప్రమాణమ్.

పూ. ప : కుతః ?

ఉ. ప : తదుక్తౌ భ్రమాదిదోషాభావాత్, తస్య సర్వజ్ఞత్వాత్, సర్వ విద్యావత్వాత్ సర్వశక్తిమత్వాచ్చ. తత్ర వేదేషు వేదానామేవ ప్రామాణ్యం స్వీకార్యం సూర్యప్రదీపవత్. యథా సూర్యః ప్రదీపశ్చ స్వప్రకాశే నైవ ప్రకాశితౌ సంతౌ సర్వమూర్తద్రవ్య ప్రకాశకౌ భవతః; తథైవ వేదాః స్వప్రకాశేనైవ ప్రకాశితాః సంతః సర్వా నన్యవిద్యాగ్రంథాన్ ప్రకాశయంతి. యే గ్రంథా వేద విరోధినో వర్తంతే, నైవ తేషాం ప్రామాణ్యం స్వీకర్తుం యోగ్యమస్తి. వేదానాం తు ఖలు అన్యేభ్యో గ్రంథేభ్యో విరోధా దప్యప్రామాణ్యం న భవతి, తేషాం స్వతః ప్రామాణ్యాత్తద్భిన్నానాం గ్రంథానాం వేదాధీనప్రామాణ్యాచ్చ.

యే స్వతః ప్రమాణభూతా మంత్రభాగసంహితాఖ్యాశ్చత్వారో వేదా ఉక్తాస్తద్భిన్నా స్తద్వ్యాఖ్యాన భూతా బ్రాహ్మణగ్రంథా వేదానుకూలతయా ప్రమాణ మర్హంతి; తథైవైకాదశశతాని సప్తవింశతిశ్చ వేదశాఖా వేదార్థ వ్యాఖ్యానా అపి వేదానుకూలతయైవ ప్రమాణమర్హంతి. ఏవమేవ యాని శిక్షా కల్పోఽథ వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిషమితి షడంగాని, తథా ఆయుర్వేదో వైద్యకశాస్త్రమ్, ధనుర్వేదః శస్త్రాస్త్ర రాజవిద్యా, గాంధర్వ వేదో గానవిద్యా, అర్థవేదశ్చ శిల్పశాస్త్రమ్, చత్వార ఉపవేదా అపి. తత్ర చరక సుశ్రుత నిఘంట్వాదయ ఆయుర్వేదే గ్రాహ్యాః. ధనుర్వేదస్య గ్రంథాః ప్రాయేణ లుప్తాః సంతి. పరంతు తస్య సర్వవిద్యాక్రియావయవైః సిద్ధత్వా దిదానీమపి సాధయితు మర్హాస్స్తి. అంగిరః ప్రభృతిభిర్ నిర్మితా ధనుర్వేద గ్రంథా బహవ ఆసన్నితి. గాంధర్వవేదశ్చ సామగాన విద్యాదిసిద్ధః. అర్థవేదశ్చ – విశ్వకర్మ త్వష్టృదేవజ్ఞ మయకృత శ్చతస్సంహితాఖ్యో గ్రాహ్యాః.

తె॥ సృష్టిమొదలు నేటివఱకు పక్షపాతము, రాగద్వేషములేని వారును, సత్యధర్మయుక్తులును, నెల్లరకు ప్రియులునునగు ప్రాచీనార్య విద్వాంసు లే యే గ్రంథములను స్వతః ప్రమాణములనియు, వేనిని పరతః ప్రమాణములనియును సంగీకరించుచు వచ్చిరో, వాని నిట వ్రాయుచున్నాము. స్వతః ప్రమాణములు తమకు తామే ప్రమాణములు, పరతః ప్రమాణములు=వేదములు, ప్రత్యక్షాది ప్రమాణములు వేని ప్రామాణ్యము సంగీకరించునో యా గ్రంథములు. ఉపర్యుక్త ప్రాచీన విద్వాంసులెల్లరు నీశ్వరోక్తము లయిన నాలుగు మంత్ర సంహితలును స్వతః ప్రమాణములనియు నన్యములు కావనియు సంగీకరించిరి. వేదములకు భిన్నములైన గ్రంథములు మానవరచితములు వేదానుకూలములయిన ప్రమాణములగును. అందువలన నవి పరతః ప్రమాణము లనబడును.

కారణమేమన ? వేదము లీశ్వర రచితములు. ఈశ్వరుడు సర్వజ్ఞుడు; సర్వవిద్యాయుక్తుడు; సర్వశక్తిమంతుడు. కావున నతని వాక్యము భ్రమరహితమై స్వతః ప్రమాణ మనదగియుండును. జీవులచే

రచితములైన గ్రంథములు స్వతః ప్రమాణము లనదగవు. వారు సర్వవిద్యాయుక్తులు కాని, సర్వ శక్తిమంతులుగాని కారు. వేదమునందు జెప్పబడిన విషయములలో నెక్కడనైన ప్రమాణమున కావశ్యకము కలిగిన నట సూర్య ప్రదీపములవలె వేదమే ప్రమాణమగును. సూర్యుడు, దీపము క్రియాగుణములుగల వస్తువులను (మూర్తద్రవ్యములను) ప్రకాశింపజేయును. అంతేకాక తమ్ము దామే ప్రకాశింప జేసికొనును. సూర్యునికాని, దీపమునుకాని చూచుట కింకొక వస్తుసహాయమావశ్యక ముండదు; అట్లే వేదములుకూడ తాము చెప్పు విషయమునకు తాము ప్రమాణములగుటయేకాక యితర గ్రంథముల విషయమును నిరూపించుటకు గూడ వేదములే ప్రమాణముగా గ్రహింపబడునని నిశ్చితమగుచున్నది. కావున వేదవిరుద్ధము లైన గ్రంథములు ప్రమాణములుగ నంగీకరింపదగవని యెఱుగనగును. వేదములకు నితర గ్రంథములతో విరోధము గలిగినను వేదములే ప్రమాణములగును. అయ్యవి స్వతః ప్రమాణములు. ఐతరేయ, శతపథ, తాండ్యాది బ్రాహ్మణ గ్రంథములు వేదములకు వ్యాఖ్యానములు. అం దితిహాసాది విషయములు కూడ వర్ణింపబడినవి. కావున నవియు వేదములకనుకూలముగ నున్నంత వఱకే ప్రమాణములు - పరతః ప్రమాణములు - అగును. వేదములు మంత్రభాగములు. అవి సంహితలనబడును. అయ్యవి నాలుగే స్వతః ప్రమాణములు. వానికంటె భిన్నములైన శతపథాది బ్రాహ్మణములన్నియు పరతః ప్రమాణములనియే తెలియవలెను. ఇట్లే (౧౧౨౭) పదునొకండు వందల యిరువదియేడు వేదశాఖలుకూడ వేదవ్యాఖ్యానము లగుట వలన పరతః ప్రమాణములే యగును. ఇట్లే ౧ శిక్ష, ౨ కల్పము ౩ వ్యాకరణము, ౪ నిరుక్తము, ౫ ఛందస్సు, ౬ జ్యోతిషము - అను నాఱు వేదాంగములు, ౧ ఆయుర్వేదము - వైద్యకశాస్త్రము ౨ ధనుర్వేదము-శస్త్రాస్త్ర సంబంధమగు రాజవిద్య, ౩ గాంధర్వవేదము-గానవిద్య, ౪ అర్థవేదము-శిల్పశాస్త్రము అను నాలుగు ఉపవేదములు నన్నియు వేదముల కనుకూలము లైనంతవఱకే ప్రమాణములు. కావున పరతః ప్రమాణములేకాని స్వతః ప్రమాణములుకావు. చరకము, సుశ్రుతము, ధన్వంతరి కృతనిఘంటువు మున్నగునవి యాయుర్వేదము నందే చేరును. ధనుర్వేదమునకు జెందిన గ్రంథములు దాదాపుగ నన్నియు లుప్తములే యనవచ్చును. ఎవరైనను పురుషార్థమొనర్చి వీనిని సిద్ధము చేయదలచినచో వేదాదివిద్యా గ్రంథముల మూలమున సాక్షాత్కారము చేసికొనవచ్చును. అంగిరసుడు, భరద్వాజుడు మున్నగు ఋషులు వ్రాసిన గ్రంథములు పూర్వమున నుండెడివి. సామగానము, నారదసంహిత మున్నగు గ్రంథములు గాంధర్వవేదమునకు జెందినవియే. అర్థవేదము - శిల్పశాస్త్రము, విశ్వకర్త, త్వష్ట, దేవజ్ఞుడు, మయుడు ననువారు శిల్పవిద్యకు సంబంధించిన సంహితలు రచించియుండిరి.

*సం॥ శిక్షా పాణిన్యాదిమునికృతా. కల్పో మానవకల్పసూత్రాదిః. వ్యాకరణమష్టాధ్యాయీ మహాభాష్య ధాతుపాఠోణాదిగణ ప్రాతిపదిక గణ పాఠాఖ్యమ్. నిరుక్తం యాస్కమునికృతం నిఘంటుసహితం చతుర్థం వేదాంగం మంతవ్యమ్. ఛందః పింగలాచార్యకృతసూత్రభాష్యమ్. జ్యోతిషం వసిష్ఠాద్యృష్యుక్తం రేఖాబీజగణితమయం చేతి వేదానాం షడంగాని సంతి. తథా షడుపాంగాని-తత్రాద్యం కర్మకాండ విధాయకం ధర్మధర్మివ్యాఖ్యామయం వ్యాసమున్యాదికృత భాష్యసహితం జైమిన మునికృతసూత్రం పూర్వమీమాంసా శాస్త్రాఖ్యం గ్రాహ్యమ్, ద్వితీయం విశేషతయా ధర్మధర్మి విధాయకం ప్రశస్తపాదకృత భాష్యసహితం కణాదమునికృతం వైశేషికశాస్త్రమ్. తృతీయం పదార్థవిద్యావిధాయకం వాత్స్యాయన భాష్యసహితం గోతమముని కృతం న్యాయశాస్త్రమ్, చతుర్థం యత్త్రిభిర్ మీమాంసా వైశేషిక న్యాయశాస్త్రైః సర్వపదార్థానాం శ్రవణమననేనానుమానిక జ్ఞానతయా నిశ్చయోభవతి, తేషాం సాక్షాత్‌జ్ఞానసాధన ముపాసనా విధాయకం వ్యాసమునికృత భాష్యసహితం పతంజలి మునికృతం యోగశాస్త్రమ్, తథా పంచమం తత్త్వపరిగణన వివేకార్థం భాగురిమునికృతభాష్యసహితం కపిలముని కృతం సాంఖ్యశాస్త్రమ్. షష్ఠం*

బౌద్ధాయన వృత్త్యాదివ్యాఖ్యా సహితం వ్యాసమునికృతం వేదాంతశాస్త్రమ్, తథైవ ఈశ కేన కఠ ప్రశ్న ముండక మాండూక్య తైత్తిరీ యైతరేయఛాందోగ్య బృహదారణ్యకా దశోపనిషదశ్చోపాంగాని చ గ్రాహ్యాణి, ఏవం చత్వారో వేదాః సశాఖా వ్యాఖ్యానసహితా శ్చత్వార ఉపవేదాః, షడ్ వేదాంగాని, షట్ చ వేదోపాంగాని మిలిత్వా షడ్ భవంతి. ఏతైరేవ చతుర్దశవిద్యా మనుష్యైర్ గ్రాహ్యా భవంతీతి వేద్యమ్.

తె॥ ౧. పాణిన్యాది మునికృతమగు శిక్ష, ౨. మన్వాదికృతమానవకల్ప సూత్రాది, ఆశ్వలాయనాది కృత శ్రౌతసూత్రాది - కల్పము, ౩. పాణిని మునికృతమగు నష్టాధ్యాయి, ధాతుపాఠము, గణపాఠము, ఉణాదిగణపాఠము, ప్రాతిపదిక, పతంజలిమునికృత మహాభాష్యము నను వ్యాకరణము. ౪. యాస్కమునికృత నిరుక్తము, నిఘంటువు, ౫. పింగలాచార్యమునికృతమగు సూత్రభాష్య సహితము ఛందస్సు, ౬. జ్యోతిషము వసిష్ఠాది ఋషికృతము, రేఖా-గణితయుక్తము, బీజగణితయుక్తమగు జ్యోతిషము. ఈ యాఱును వేదాంగములు. ఇవియు పరతః ప్రమాణములే. ఇట్లే వేదముల కుపాంగము లాఱుగలవు. షట్ శాస్త్రములనియు వానికి పేరు. ౧. పూర్వ మీమాంస. ఇది జైమిని కృతము. వ్యాసభాష్య సహితము, ఇందు కర్మకాండ వివరింపబడినది. ధర్మ, ధర్మిరూపమున నిందు పదార్థములు వివరింపబడినవి. ౨. వైశేషిక శాస్త్రము. ఇది విశేషించి ధర్మము, ధర్మి వీనిని గుఱించి చెప్పును. ఈ సూత్రగ్రంథము కణాదముని రచితము. ప్రశస్తపాద భాష్యాది వ్యాఖ్యా సహితము - ౩. గోతమమునికృత న్యాయశాస్త్రము, ఇందు పదార్థవిద్య వివరింపబడినది. ఇది గోతమముని కృత సూత్రములు,వాత్స్యాయనమునికృత భాష్య సమేతము. ౪. పతంజలి ముని కృత యోగశాస్త్రము, వ్యాసమునికృత భాష్యసమేతము. న్యాయ, వైశేషిక, మీమాంసా శాస్త్రముల శ్రవణమననముల మూలమున పదార్థముల ఆనుమానిక జ్ఞానము కలుగును. ఆ పదార్థముల సాక్షాత్కారము యోగశాస్త్రాభ్యాసమున గలుగును. ౫. సాంఖ్యశాస్త్రము ఇది కపిలముని కృత సూత్ర గ్రంథము. భాగురిముని కృతభాష్య సమేతము. ఇందు ప్రకృతి మున్నగు తత్త్వములు లెక్కింప బడినవి. ప్రకృతిపురుష వివేక మీ గ్రంథపఠనమువలన గల్గును. ౬. వేదాంత శాస్త్రము వ్యాసముని కృతసూత్రములు, బౌద్ధాయన వృత్త్యాది వ్యాఖ్యా సహితము. ఈ యాఱు శాస్త్రములు వేదములకు ఉపాంగములు. ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్య కోపనిషత్తులు పదియు నుపాంగములుగా నెంచబడును. శాఖలు, శాఖాంతరములు వీనితోగూడిన నాలుగు వేదములు, నాలుగుప వేదములు, ఆఱు అంగములు ఉపాంగములు నన్నియు కలిసి చతుర్దశ విద్యలనబడును. వీనిని మనుష్యులు తప్పక చదువవలెను.

*సం॥ ఏతాసాం పఠనాత్ యథార్థం విదితత్త్వాన్ మానస బాహ్యజ్ఞాన క్రియాకాండ సాక్షాత్కరణాచ్చ మహావిద్వాన్భవతీతి నిశ్చేతవ్యమ్. ఏత ఈశ్వరోక్తా వేదాః, తద్వ్యాఖ్యానమయా బ్రాహ్మణాదయో గ్రంథాః– ఆర్షా వేదానుకూలాః సత్య ధర్మ విద్యాయుక్తాః, యుక్తి ప్రమాణసిద్ధా ఏవ మాననీయాః సంతి. నైవైతేభ్యో భిన్నాః, పక్షపాతక్షుద్ర విచారస్వల్పవిద్యాఽధర్మాచరణ ప్రతిపాదనాః అనాప్తోక్తా వేదార్థవిరుద్ధాయుక్తి ప్రమాణ విరహా గ్రంథాః కేనాపి కదాచిదంగీకార్యా ఇతి:*

*తేచ సంక్షేపతః పరిగణ్యంతే. రుద్రయామలాదయ స్తంత్ర గ్రంథాః, బ్రహ్మవైవర్తాదీని పురాణాని చ. ప్రక్షిప్త శ్లోక త్యాగా యా మనుస్మృతేర్ వ్యతిరిక్తాః స్మృతయః. సారస్వత చంద్రికా కౌముద్యాదయో వ్యాకరణాభాసగ్రంథాః. మీమాంసా శాస్త్రాది విరుద్ధ నిర్ణయ సింధ్వాదయో గ్రంథాః వైశేషిక న్యాయశాస్త్ర విరుద్ధా స్తర్క సంగ్రహ మారభ్య జాగదీశ్యంతా న్యాయాభాసా గ్రంథాః. యోగశాస్త్ర విరుద్ధా హఠ ప్రదీపికాదయో గ్రంథాః. సాంఖ్యశాస్త్రవిరుద్ధాః సాంఖ్యతత్త్వ కౌముద్యాదయః; వేదాంత శాస్త్రవిరుద్ధా వేదాంతసార పంచదశీ యోగ వాసిష్ఠాదయో గ్రంథాః, జ్యోతిషశాస్త్రవిరుద్ధా ముహూర్త చింతామణ్యాదయో*

ముహూర్త జన్మపత్ర ఫలాదేశ విధాయకా గ్రంథాః. తథైవ శ్రౌత సూత్ర విరుద్ధా స్త్రికండికాస్నాన సూత్ర పరిశిష్టాదయో గ్రంథాః.

మార్గశీర్షైకాదశీ కాశీస్థల జలసేవన యాత్రాకరణ దర్శన నామస్మరణ స్నాన జడమూర్తి పూజాకరణ మాత్రేణైవ ముక్తిభావన పాపనివారణ మాహాత్మ్యవిధాయకాః సర్వేగ్రంథాః, తథైవ పాఖండి సంప్రదాయి నిర్మితాని సర్వాణి పుస్తకాని చ నాస్తికత్వ విధాయకా గ్రంథాశ్చోపదేశాశ్చ. తే సర్వే వేదాది శాస్త్రవిరుద్ధా యుక్తి ప్రమాణ పరీక్షా హీనాః సంత్యతః శిష్టైరగ్రాహ్యా భవంతి.

తె॥ ఈ పదునాలుగు విద్యలు బాగుగ నేర్చినందున మానసిక జ్ఞానము, బాహ్యజ్ఞానము కలిగి క్రియాకాండము సాక్షాత్కారమగుటచే మనుష్యుడు మహావిద్వాంసుడగును. పైన జూపబడిన గ్రంథములను, స్వతః, పరతః ప్రమాణములుగ నంగీకరించి చదివి, చదివింపవలెను. భిన్నగ్రంథములను జదువరాదు. పక్షపాతముగలవారు, క్షుద్రబుద్ధులు, విద్యలను బాగుగ నేర్వనివారు, అధర్మాత్ములు, అసత్యవాదులు వేదార్థములకు విరుద్ధముగా, యుక్తి ప్రమాణశూన్యముగ వ్రాసిన గ్రంథములు స్వీకరింపరాదు. అట్టి నిషిద్ధములైన గ్రంథములలో ముఖ్యములైన వాని నామములిట జూపుచున్నాము. రుద్రయామలాది తంత్రగ్రంథములు, బ్రహ్మవైవర్తము, శ్రీమద్భాగవతము మున్నగు పురాణములు, సూర్యగాథాద్యుప పురాణములు, మనుస్మృతి లోని ప్రక్షిప్త శ్లోకములు; మనుస్మృతి కాక మిగిలిన స్మృతులు, వ్యాకరణ విరుద్ధములగు సారస్వత చంద్రిక, కౌముది మున్నగు గ్రంథములు, మీమాంసాశాస్త్రమునకు విరుద్ధములైన నిర్ణయ సింధ్వాదులు, వైశేషిక, న్యాయశాస్త్ర విరుద్ధములైన తర్కసంగ్రహము మొదలు జాగదీశ్యంత న్యాయాభాస పుస్తకములు, యోగశాస్త్రమునకు విరుద్ధములైన హఠయోగ ప్రదీపికాదులు, సాంఖ్యశాస్త్రమునకు విరుద్ధములైన సాంఖ్య తత్త్వకౌముద్యాదులు, వేదాంతమున పంచదశి, యోగవాసిష్ఠాదులు, జ్యోతిః శాస్త్రమునకు విరుద్ధములగు ముహూర్త చింతామణ్యాదులు, ముహూర్త జన్మపత్ర ఫలాదేశ పుస్తకములు, శ్రౌత సూత్రములకు విరుద్ధములగు త్రికండికాస్నాన విధాయకాది సూత్రపుస్తకములు, మార్గశీర్ష ఏకాదశ్యాది వ్రతములు, కాశ్యాది స్థలములు, పుష్కరగంగాది జలములు, యాత్రా మాహాత్మ్యములను దెలుపు పుస్తకములు, దర్శనము, నామస్మరణము, విగ్రహారాధనలు చేసినందుననే ముక్తి కలుగునని చెప్పుపుస్తకములు, ఇట్లే పాపనివారణము, ఈశ్వరావతారము, సందేశమును దెచ్చు దూతలు వీనిని విధించు గ్రంథములు, శైవ, శాక్త, గాణాపత్య, వైష్ణవ సంప్రదాయకుల గ్రంథములు, నాస్తిక్యమును జెప్పు పుస్తకములు, నాస్తికోపదేశములు, ఇవి యన్నియు వేదవిరుద్ధములు. యుక్తిసంగతములు కావు. ప్రమాణ పరీక్షలకు నిలబడని గ్రంథములు. కావున వీనిని పఠింపరాదు.

పూ.పః తేషు బహ్వనృత భాషణేషు కించిత్సత్యమప్యగ్రాహ్యంభవితు మర్హతి విషయుక్తాన్నవత్?

ఉ.పః యథా పరీక్షకా విషయుక్త మమృతతుల్య మప్యన్నం పరీక్ష్య త్యజంతి తద్వ దప్రమాణా గ్రంథా స్త్యాజ్యా ఏవ.

పూ.ప : కుతః?

ఉ.వ; తేషాం ప్రచారేణ వేదానాం సత్యార్థాప్రవృత్తే స్తదప్రవృత్త్యా హ్యసత్యార్థాంధకారాపత్తేః, అవిద్యాంధకారతయా యథార్థ జ్ఞానానుత్పత్తేశ్చేతి.

అథ తంత్రగ్రంథానాం మిథ్యాత్వం ప్రదర్శ్యతే – తత్ర పంచమకార సేవనే నైవ ముక్తిర్ భవతి, నాన్యథేతి. తేషాం మతం యత్రేమే శ్లోకాః సంతి;–

"మద్యం మాంసం చ మీనం చ ముద్రా మైథున మేవ చ,
ఏతే పంచమకారాశ్చ మోక్షదా హి యుగే యుగే" ౧ కాలీతంత్రే

"పీత్వా పీత్వా పునః పీత్వా యావత్ పతతి భూతలే,
పునరుత్థాయ వై పీత్వా పునర్ జన్మ న విద్యతే" ౨ మహానిర్వాణతంత్రే.

"ప్రవృత్తే భైరవీచక్రే సర్వే వర్ణా ద్విజాతయః,
నివృత్తే భైరవీచక్రే సర్వే వర్ణాః పృథక్ పృథక్" ౩ కులార్ణవతంత్రే

"మాతృయోనిం పరిత్యజ్య విహరేత్ సర్వయోనిషు,
లింగం యోన్యాం తు సంస్థాప్య జపే న్మంత్ర మతంద్రితః" ౪ జ్ఞానసంకలనీతంత్రే

"మాతరమపి న త్యజేత్" ఇత్యాద్యనేకవిధ మల్ప బుద్ధ్యధర్మా శ్రేయస్కర్మా నార్యాభిహితయుక్తి ప్రమాణ రహితం వేదాదిభ్యోఽత్యంత విరుద్ధ మనార్ష మశ్లీల ముక్తం, తచ్ఛిష్టైర్ న కదాపి గ్రాహ్య మితి, మద్యాది సేవనేన బుద్ధ్యాది భ్రంశా న్ముక్తిస్తు న జాయతే, కింతు నరక ప్రాప్తిరేవ భవతీత్యన్యత్ సుగమం ప్రసిద్ధం చ.

ఏవ మేవ బ్రహ్మవైవర్తాదిషు మిథ్యాపురాణ సంజ్ఞాసు, కిం చ నవీనేషు మిథ్యా భూతా బహ్వ్యః కథా లిఖితా స్తాసాం స్థాలీపులాక న్యాయేన స్వల్పాః ప్రదర్శ్యంతే, తత్రైవమేకా కథా లిఖితాః- ప్రజాపతిర్ బ్రహ్మ చతుర్ముఖో దేహధారీ స్వాం సరస్వతీం దుహితరం మైథునాయ జగ్రాహేతి. సా మిథ్యైవాస్తి.

పూ.పః కుతః?

ఉ.పః అస్యాః కథాయా అలంకారాభిప్రాయత్వాత్, తద్యథాః

తె॥ పూ.పః ఈ యసత్య గ్రంథములందుగల సత్యము కూడ విషయుక్తాన్నమువలె అగ్రాహ్యమేనా?

ఉ.పః అమృతమువంటి యన్నమునందును విషము కలిపిన నంతయు త్యజింపబడును. అట్లే యీ యసత్య గ్రంథములను త్యజింప వలెను. వాని నుండి సత్యము గ్రహింపదలచినచో సత్యప్రకాశములగు వేదాదిశాస్త్రముల ప్రచారము లోపించును. సత్యగ్రంథముల ప్రచారార్థమై అసత్య గ్రంథములను త్యజించుటయే యుక్తము. కారణ మేమనః- సత్యవిద్యా ప్రచారము లేనినాడు జ్ఞానమెట్లు కలుగును? అదిలేక యున్నతి కలుగదు. అందువలన మనుష్యుడు దుఃఖసాగరమున మునిగి తేలుచుండును.

పూర్వము నిర్దేశించిన యప్రమాణ గ్రంథముల దోషములను సంక్షేపముగ నిటజూపుదుము. తాంత్రికులు పంచమకార సేవనమున ముక్తి కలుగు నందురు. ఇందుల కుదాహరణముగ తంత్ర గ్రంథములం దెట్టి మంత్రములు వ్రాయబడినవో చూడుడు.

(మద్యం మాంసం) మద్యపానము, మత్స్య-మాంసభక్షణము, ఎల్లరు నొకచోచేరి కలిసి భక్ష్యాభక్ష్యముల నారగించుట, ముద్ర మైథునము, కన్య, తోబుట్టువు, మాత, కోడలు అని విచారింపక యెల్లరితోను వ్యభిచరించుటయను నిట్టి 'పంచ మకారముల' ను సేవించుట వలన ముక్తి కలుగును.

౧ కాలీ తంత్రము

(పీత్వా పీత్వా) కొండొక గృహమున నాలుగు స్థానములందు మద్యపాత్రములనుంచి, యొక వైపునుండి ప్రారంభించి, నిలబడియే మద్యపానము చేయుచు నెల్ల తావులలోనున్న మద్యపాత్రలనుండి క్రమముగా నొకదాని తరువాత మఱియొక పాత్రనుండి మద్యమును తీసికొని బాగుగ త్రాగి మత్తిల్లి పడిపోవు వఱకు నట్లు చేయవలెను. ఇట్లు మాటిమాటికి త్రావి పడిపోయిన జన్మ మరణ దుఃఖముల నుండి విముక్తి కలుగును.
౨ మహానిర్వాణ తంత్రము

(ప్రవృత్తే భైరవీచక్రే) వామ మార్గులు - తాంత్రికులు, అప్పుడప్పుడు నొకచో సమావేశమగుదురు. అట్టివేళ బ్రాహ్మణుడు మొదలు చండాలురవఱకు స్త్రీ పురుషులెల్లరు జేరుదురు. వారొక స్త్రీని నగ్నగా జేసి ఆమె యోనిని బూజింతురు. అప్పుడప్పుడు పురుషుని నగ్నుని జేసి యతని లింగమును బూజించుటయు గలదు. తరువాత మద్యము నొక పాత్రలో నింపి యా స్త్రీ పురుషులకు ద్రావింతురు. ఆ పాత్రతో నే మిగిలినవారు ద్రావి, మాంసాదులను బాగుగ సేవింతురు. మత్తిల్లు వఱకు నట్లే చేయుదురు. తదుపరి యొక స్త్రీతో నొక పురుషుడు కాని యనేకులుకాని మైథునము చేయుదురు. ఇట్లు కాలము గడపి చివరకు వెళ్ళునపుడు ఎవరి వర్ణము వారిదేయని చెప్పి వేఱగుదురు. ఆరంగమున నున్నంతవఱకు నెల్ల వర్ణములవారు బ్రాహ్మణులే యట"
౩ (కులార్ణవ తంత్రము)

(మాతృయోనిం పరిత్యజ్య) తల్లిని విడిచి యెల్లస్త్రీలతోను వ్యభిచరింపవచ్చును. లింగమును యోనియందుంచి మంత్రమును జపించవలెను. ఇందు దోషము లేదు. ౪ (జ్ఞాన సంకలనీ తంత్రము)

కొందఱు 'తల్లిని కూడ వదలకూడదు' అని యెంచువారును గలరు. తంత్ర గ్రంథములలో నిట్టి యనర్థము లెన్నియో వ్రాయబడి యున్నవి. వేదాది సత్యశాస్త్రములకు యుక్తి ప్రమాణములకు విరుద్ధములు కావున సత్పురుషులు వీనిని గ్రహింపరాదు. మద్యాదులను సేవించిన ముక్తి గల్గుననుట వెఱ్ఱి. దాని వలన బుద్ధి నశించును. దుఃఖరూప నరకము వాటిల్లును.

ఇట్లే బ్రహ్మవైవర్తాది పురాణములు, శ్రీమద్ భాగవతాది గ్రంథములు వ్యాసుని పేరుతో సాంప్రదాయకులు రచియించిరి. అవి పురాణములు కావు. వానిని నవీనములనుటయే యుచితము. వాని మిథ్యాత్వమును నిరూపించుట కిట కొన్ని కథలు సంక్షేపముగ వ్రాయు చున్నాము.

భాగవతమున నొక కథ యిట్లున్నది - 'చతుర్ముఖుడైన దేహధారియగు బ్రహ్మ తన కన్యయగు సరస్వతిని మైథునార్థము పట్టుకొనెను' ఈ కథ యసత్యము. కారణమేమనః ఈ కథ - యాలంకారికము. అందు వలన నభిప్రాయము తెలిసికొనజాలక యిట్లు వ్రాసిరి.

సం॥ "ప్రజాపతిర్వై స్వాం దుహితర మభ్యధ్యాయద్దివమిత్యన్య ఆహురుషస మిత్యన్యే. తామృశ్యో భూత్వా రోహితం భూతా మభ్యైత్, తస్య యద్రేతసః ప్రథమ ముదదీప్యత తదసా వాదిత్యో భవత్
ఐ. ౩-౩౩-౩౪

"ప్రజాపతిర్ వై సుపర్ణో గరుత్మా నేష సవితా" శత. ౧౦-౨-౨-౪

"తత్ర పితా దుహితుర్ గర్భం దధాతి పర్జన్యః పృథివ్యాః" నిరు. ౪-౨౧

ద్యౌర్ మే పితా జనితా నాభిరత్ర బంధుర్ మే మాతా పృథివీ మహీయమ్. ఉత్తానయోశ్చమ్వోర్యో నిరంతరత్రా పితా దుహితుర్ గర్భ మాధాత్" ౧ ఋ. ౧-౧౬౪-౩౩

"శాసద్వహ్నిర్ దుహితుర్ నప్త్యంగా ద్విద్వాం ఋతస్య దీధితిం సపర్యన్, పితా యత్ర దుహితుః సేకమృంజన్ సంశగ్మ్యేన మనసా దధన్వే" ౨ ఋ. ౩-౩౧-౧

సవితా సూర్యః సూర్యలోకః ప్రజాపతిసంజ్ఞకోఽస్తి, తస్య దుహితా కన్యావద్ ద్యౌ రుషాచాస్తి. యస్మాద్ యదుత్పద్యతే తత్తస్యాపత్యవత్, స తస్య పితృవదితి రూపకాలంకారోక్తిః స చ పితా తాం రోహితాం కించిద్ రక్తగుణ ప్రాప్తాం స్వాం దుహితరం కిరణైర్ ఋష్యవచ్ఛీఘ్ర మభ్యధ్యాయత్ ప్రాప్నోతి. ఏవం ప్రాప్తః ప్రకాశాఖ్య మాదిత్యం పుత్ర మజీజన దుత్పాదయతి, అస్య పుత్రస్య మాతృవదుషా పితృవత్ సూర్యశ్చ.

పూ.ప: కుతః?

ఉ. పః తస్యాముషసి దుహితరి కిరణరూపేణ వీర్యేణ సూర్యాద్దివసస్య పుత్రస్యోత్పన్నత్వాత్. యస్మిన్ భూప్రదేశే ప్రాతః పంచఘటికాయాం రాత్రౌ స్థితాయాం కించిత్ సూర్యప్రకాశేన రక్తతా భవతి తస్యోషా ఇతి సంజ్ఞా. తయోః పితాదుహిత్రోః సమాగమా దుత్కట దీప్తిః ప్రకాశాఖ్య ఆదిత్యపుత్రో జాతః. యథా మాతాపితృభ్యాం సంతానోత్పత్తిర్ భవతి, తథైవాత్రాపి బోధ్యమ్. ఏవమేవ పర్జన్యపృథివ్యోః, పితాదుహితృవత్.

పూ.ప: కుతః?

ఉ. ప.: పర్జన్యాదద్భ్యః పృథివ్యా ఉత్పత్తేః. అతః పృథివీ తస్య దుహితృవదస్తి. స పర్జన్యో వృష్టి ద్వారా తస్యాం వీర్యవ జ్జలప్రక్షేపణేన గర్భం దధాతి. తస్మాద్ గర్భా దోషధ్యాదయోఽపత్యాని జాయంతే. అయమపి రూపకాలంకారః.

అత్ర వేదప్రమాణమ్ (ద్యౌర్ మే పితా) ప్రకాశో మమ పితా పాలయితాస్తి ( జనితా) సర్వవ్యవహారాణా ముత్పాదకః. అత్ర ద్యయోః సంబంధత్వాత్. తత్రేయం పృథివీ మాతా మానకర్త్రీ. ద్యయోశ్చమ్వోః పర్జన్యపృథివ్యోః సేనావ దుత్తానయో రూర్ధ్వం తానయో రుత్తాన స్థితయో రలంకారః. అత్ర పితా పర్జన్యో దుహితుః పృథివ్యా, గర్భం జల సమూహ మాధాత్. ఆ సమంతాద్ ధారయతీతి రూపకాలంకారో మంతవ్యః. ౧

(శాసద్ వహ్ని) అయమపి మంత్రోఽస్యైవాలంకారస్య విధాయకోస్తి. వహ్ని శబ్దేన సూర్యో, దుహితాఽస్య పూర్వోక్తైవ. స పితా, స్వస్యా ఉషసో దుహితుః, సేకం కిరణాఖ్యవీర్యస్థాపనేన గర్భాధానం కృత్వా దివసపుత్ర మజనయదితి. ౨

అస్యాం పరమోత్తమాయాం రూపకాలంకార విధాయిన్యాం నిరుక్త బ్రాహ్మణేషు వ్యాఖ్యాతాయాం కథాయాం సత్యామపి బ్రహ్మవైవర్తాదిషు భ్రాంత్యా యాః కథా అన్యథా నిరూపితా స్తా నైవ కదాచిత్ కేనాపి సత్యా మంతవ్యా ఇతి.

తె॥ (ప్రజాపతి ర్వై స్వాం దుహి తర మభ్యధ్యాయత్) ఈ బ్రాహ్మణ వాక్యమునందు ప్రజాపతి పదమున కర్థము సూర్యుడు. అతనికి ప్రకాశము, ఉషయు రెండును కన్యల వంటివి. ఏది దేనివలన గలుగునో యది దానికి సంతాన మనదగును. ఐదు ఘడియల రాత్రి యున్నదనగా సూర్యోదయానికి ముందు పూర్వదిశయందు రక్తిమ-ఎఱుపురంగు-కనిపించును. అది ఉషయనబడును. సూర్యకిరణములచే

నుత్పన్నమగును కావున నది సూర్యునకు పుట్టిన కన్యగా వ్యవహరింపబడును. సూర్యకిరణములలో నే కిరణము మొదట నాయుషః కన్యకు సమ్ముఖమున బడునో యదియే వీర్యస్థాపనగా నెంచబడును. సూర్యకిరణ ఉషస్సంయోగమువలన నేర్పడు సంతానమే దినము. రూపకాలంకారమున కిదియొక దృష్టాంతము.

శతపథ బ్రాహ్మణమున సూర్యునకు 'ప్రజాపతి' 'సవితా' యని రెండు నామములు చెప్పబడినవి.

ఇట్లే నిరుక్తమునందును రూపకాలంకారముతో నొక కథ నిర్దేశింపబడినది. అందు పర్జన్యుడు - మేఘము తండ్రిగాను, పృథివి పుత్రిక-కన్యగాను వర్ణించుట చూడనగును.

అందులకు కారణమేమియన! పృథివి జలమునుండి యుత్పన్నమగును. కావున జలరూపమగు మేఘునకు పృథివి పుత్రికయైనది. మేఘము వర్షించినపుడు జలము భూమియందు పడును. ఇదియే మేఘుడు (తండ్రి) భూమి (కన్య) యందు వీర్యాధానము చేసినట్లు వర్ణింపబడినది. వర్షమునకు తదుపరి భూమియందు ఓషధులుత్పన్నములగును. ఈ యోషధులే మేఘునకు భూపుత్రికయందు కలిగిన పుత్రులు. ఈ కథకు మూలమయిన ఋగ్వేద మంత్రమిది.

(ద్యౌర్ మే పితా) ద్యౌః - సూర్యప్రకాశము. ఈ మంత్రమునందు సూర్య ప్రకాశము తండ్రిగాను, భూమి తల్లిగాను, ఓషధ్యాదులు సంతానముగాను రూపింపబడినవి. సూర్యుడు సర్వసుఖములకు కారణమగుటచే నతడు తండ్రికి సమానుడు. (మే మాతా పృథివీ) భూమి విశాలమైనది. మాన్యతకు హేతువు. కావున తల్లివంటిది. (ఉత్తానయోః) పైన సూర్యుడు క్రింద భూమి, ఇవి రెండును, క్రిందనొక వస్త్రమును బఱచి దానిపై సంతానమును పరుండబెట్టి పైన నొక వస్త్రముతో చాందినీ కట్టినట్లూహింపదగినవిగా కనబడును. లేక యీ పృథివీ మేఘములు ఒక సేనకు మఱియొక సేన యెదురెదురుగా నిలబడి యున్నట్లు నూహింపవచ్చును. ఇట్లే మేఘమునకు భూమికిని గల సంబంధమును జెప్పవచ్చును. ఇందు యోనిస్థానమున భూమిని, గర్భస్థాపన చేయువాడు మేఘుడనియు చెప్పనగును. భూమియనెడి యోనియందు మేఘుడు జలరూప వీర్యమును స్థాపించును. భూమి యాజలమును గర్భమున ధరించి యోషధులనెడి పుత్రులను-సంతానమును-గనును. వాని మూలమున జగత్పాలన జరుగును.

(శాసద్ వహ్నిః) ఈ మంత్రము కూడ రూపకాలంకారమునే దెలుపును. ఇందలి వహ్ని శబ్దము సూర్యబోధకము. ఆ సూర్యునికి దుహిత-కన్య పూర్వము చెప్పిన ఉషస్సే. ఆ యుషస్సు జన్మకు కారణమైన సూర్యుడు (పిత) తన కన్యయనదగు నుషస్సునందు కిరణ రూపవీర్యమును స్థాపించుటయే గర్భాధానము. అందువలన 'దివసము' అనెడి పుత్రుడు జన్మించునని యభిప్రాయము.

ఇట్లు రూపకాలంకారముతో వేదమునందును బ్రాహ్మణ నిరుక్తాది గ్రంథములందును ప్రాకృతిక విషయములు వర్ణింపబడినవి. ఈ విషయమును సరిగా తెలిసికొనక బ్రహ్మవైవర్త, శ్రీమద్ భాగవతాది గ్రంథములలో విపరీతార్థములు కలుగునట్లు వికటముగా కథలు వ్రాయబడినవి. కావున విద్వాంసు లీకథలను విశ్వసింపక సత్యవిషయముల నెఱింగి వానిని ప్రచారము చేయవలెను.

***సం॥ తథా చ కశ్చిద్దేహధారీంద్రో దేవరాజ ఆసీత్. స గోతమ స్త్రియాం జారకర్మ కృతవాన్, తస్మై గోతమేన శాపో దత్తస్త్వం సహస్ర భగో భవేతి. తస్యై అహల్యాయై శాపో దత్తస్త్వం పాషాణశిలా భవేతి. తస్యా రామపాద రజః స్పర్శేన శాపస్య మోక్షణం జాతమితి. తత్రేదృశ్యో మిథ్యైవ కథాః సంతి.***

కుతః ? ఆసామప్యలంకారార్థత్వాత్. తద్యథా.

"ఇంద్రాగచ్ఛేతి. గౌరావస్కందిన్నహల్యాయై జారేతి. తద్యాన్యేవాస్య చరణాని తైరేవైన మేతత్ ప్రమమోదయిషతి. శత. ౩-౩-౪-౧౩-౮

"రేతః సోమః" శత. ౩-౩-౨-౧

"రాత్రి రాదిత్యస్యాదిత్యోదయేఽంతర్ధీయతే నిరు. ౧౨-౧౧

"సూర్యరశ్మిశ్చంద్రమా గంధర్వ ఇత్యపి నిగమో భవతి. సోఽపి గౌరుచ్యతే" నిరు. ౨-౬

"జార ఆ భగః జార ఇవ భగమ్. ఆదిత్యోఽత్ర జార ఉచ్యతే, రాత్రేర్ జరయితా" నిరు. ౩-౧౬

"ఏష ఏవేంద్రో య ఏష తపతి' శత. ౧-౬-౪-౧౮

ఇంద్రః సూర్యో, య ఏష తపతి, భూమిస్థాన్ పదార్థాంశ్చ ప్రకాశయతి. అస్యేంద్రేతి నామ పరమైశ్వర్య ప్రాప్తేర్ హేతుత్వాత్.స అహల్యాయా జారోఽస్తి. సా సోమస్య స్త్రీ. తస్య గోతమ ఇతి నామ. గచ్ఛతీతి గౌరతిశయేన గౌరితి గోతమశ్చంద్రః, తయోః స్త్రీ పురుషవత్ సంబంధోఽస్తి. రాత్రి రహల్యా. కస్మాత్. అహర్ దినం లీయతేఽస్యాం తస్మాద్ రాత్రి రహల్యోచ్యతే. స చంద్రమాః సర్వాణి భూతాని ప్రమోదయతి. స్వ స్త్రియా అహల్యయా సుఖయతి. అత్ర స సూర్య ఇంద్రో, రాత్రే రహల్యాయా గోతమస్య చంద్రస్య స్త్రియా జార ఉచ్యతే. కుతః? అయం రాత్రేర్ జరయితా. 'జౄష్ వయోహానావితి ధాత్వర్థోఽ భిప్రేతోఽస్తి. రాత్రే రాయుషో వినాశక ఇంద్రః సూర్య ఏవేతి మంతవ్యమ్.

ఏవం సద్విద్యోపదేశార్థాలంకారాయాం భూషణ రూపాయాం సచ్ఛాస్త్రైర్మిథ ప్రణీతాయాం కథాయాం సత్యాం, యా నవీన గ్రంథేషు పూర్వోక్తా మిథ్యా కథా లిఖితాఽస్తి. సా కేనచిద్ కదాపి నైవ మంతవ్యా, హ్యేతాదృశ్యోఽన్యాశ్చాపి.

తె॥ ఇంద్రాహల్యల కథః మూఢు లీకథ ననేక విధముల వికృతమొనర్చి వ్రాసి యున్నారు.

ఇంద్రుడొక దేహధారి దేవత. అతడు దేవలోకమున దేవతలకు రాజు. అతడు గోతమ మహర్షి భార్య యహల్యతో జారకర్మము నాచరించును. గోతముడది చూచి, 'ఇంద్ర' నీవు వేయి భగములు-యోనులు గలవాడవగుము అని యింద్రుని, 'నీవు శిలారూపవగుము' అని యహల్యను శపించెను. అప్పుడా యిరువురును గోతముని శాపమోక్షణార్థమై ప్రార్థింపగా నతడు, 'నీవేయి భగముల స్థానమున వేయి కన్నులగును' యని యింద్రుని, 'రామచంద్రుని పాదరజ స్పర్శవలన మరల నీవు నీ స్వరూపమును బొందుదువు' అని యహల్యను నను్గ్రహించెను. తదుపరి రామచంద్రుని పాదరజః స్పర్శవలన నహల్య స్వస్వరూపమును బొందినదనియు పుస్తకములందు వ్రాయబడినది. ఇట్టి వికృత కథలు సత్యగ్రంథములందు లేవు. వాస్తవమున నీకథయు రూపకాలంకారమే.

(ఇంద్రాగచ్ఛేతి) సూర్యుడు ఇంద్రుడనియు, రాత్రి యహల్య యనియు చంద్రుడు గోతముడనియు, నీ స్థలమున తెలిసికొనవలెను. రాత్రి చంద్రుడు స్త్రీ పురుష రూపమున - పత్నీపతుల-రూపమున ఆలంకారికముగ వర్ణింపబడినవి. చంద్రుడు తన స్త్రీయగు రాత్రి వలన నెల్లరకు నానందము గలిగించును. ఆ రాత్రిరూపస్త్రీకి జారుడు ఆదిత్యుడు - సూర్యుడుదయించగానే రాత్రి యంతర్ధానమగును. సూర్యుడు రాత్రియందుగల రూపమును శృంగారమును జెడగొట్టువాడు అని భావము. ఇట చంద్రుని పురుషునితోను,

రాత్రిని స్త్రీతోను బోల్చి రూపకాలంకారముతో స్త్రీ పురుషులవలె వర్ణింపబడినది. స్త్రీ పురుషులు కలిసి యుండునట్లు రాత్రి, చంద్రులు కలిసియుండుట ప్రాకృతికము. చంద్రుడిట గోతముడనబడుటకు కారణము - చంద్రుడు వేగముగ నడచును. గోతముడు - వేగముగ నడచువాడు (అహస్సు) దినము రాత్రియందు (లీయతే) లీనమగును కావున అహల్య-రాత్రి యనబడును. రాత్రి రాగానే దినము దానిలో లీనమగును-నశించును. అని భావము. సూర్యుడుదయింపగానే రాత్రి నశించును-సూర్యుడిట ఇంద్రుడుగా వర్ణింపబడినాడు. సూర్యుడు రాత్రికి జారుడు - ఆయువును నశింపజేయువాడు.

'జృష్' ధాతువునకు ఆయునాశనము - వయోహాని-యని యర్థము. దానితో జారుడను పదమేర్పడుచున్నది. సూర్యోదయము కాగానే రాత్రి తొలగిపోవును. కావున సూర్యుడు రాత్రి జారుడని-అహల్యా జారుడని యాలంకారికముగ చెప్పబడినట్లు తెలిసికొనవలెను. ఇట్టియుత్తమ రూపకాలంకారముతో జెప్పబడిన ప్రాకృతిక విషయముల నర్థము చేసికొనలేని యల్పబుద్ధులు విషయమును వికృతకథగా వర్ణించి యున్నారు. కావున విద్వాంసులు పురాణములని చెప్పబడు గ్రంథములందలి యీ కథలనెన్నడు సత్యములని విశ్వసింపరాదు.

సం॥ ఏవ మేవేంద్రః కశ్చిద్దేహధారీ దేవరాజ ఆసీత్తస్య త్వష్టుర పత్యేన వృత్రాసురేణ సహ యుద్ధ మభూత్. వృత్రాసురేణేంద్రో నిగలితోఽతో దేవానాం మహద్ భయమభూత్, తే విష్ణుం శరణం గతాః. విష్ణు రుపాయం వర్ణితవాన్ "మయా ప్రవిష్టేన సముద్రఫేనే నాయం హతో భవిష్యతీతి' ఈదృశ్యః ప్రమత్తగీతవత్ ప్రలపితాః కథాః పురాణ భాషాదిషు నవీనేషు గ్రంథేషు మిథ్యైవ సంతీతి భద్రైర్ విద్వద్భిర్ మంతవ్యమ్. కుతః? ఏతాసా మప్యలంకారవత్త్వాత్ - తద్యథా.

"ఇంద్రస్య ను వీర్యాణి ప్రవోచం యాని చకార ప్రథమాని వజ్రీ, అహన్నహిమన్వపస్తతర్ద ప్ర వక్షణా అభినత్ పర్వతానామ్" ౧ ఋ. ౧-౩౨-౧

ఇంద్రస్య సూర్యస్య పరమేశ్వరస్య వా తాని వీర్యాణి - పరాక్రమా నహం ప్రవోచం కథయామి; యాని ప్రథమాని పూర్వం, (ను) ఇతి వితర్కే, వజ్రీ చకార (వజ్రీ) వజ్రః ప్రకాశః ప్రాణో వాఽస్యాస్తీతి.

'వీర్యం వై వజ్రః" శత. ౭-౪

స అహిం మేఘ మహన్ హతవాన్, తం హత్వా పృథివ్యామను పశ్చాదపస్తతర్ద - విస్తారితవాన్. తాభిరద్భిః ప్రవక్షణా నదీస్తతర్ద - జల ప్రవాహేణ హింసితవాన్. తటాదీనాం చ భేదం కారితవానస్తి. కీదృశ్య స్తా నద్యః? పర్వతానాం మేఘానాం సకాశా దుత్పద్య మానాః. యజ్జల మంతరిక్షా ద్ధింసిత్వా నిపాత్యతే తద్ వృత్రస్య శరీరమేవ విజ్ఞేయమ్.

తె॥ ఇంద్ర వృత్రాసురులకథ-పౌరాణికులు దీనిని గూడ వికృతము చేసి యున్నారు. ఈ కథను జదివినవారికిది యుక్తి ప్రమాణములకు విరుద్ధముగా దోచును. కథా స్వరూపమిది. 'త్వష్టృకుమారుడు వృత్రుడను' వాడు దేవరాజగు నింద్రుని మ్రింగివేసినాడు. అప్పుడు దేవతలు భయపడి విష్ణువు కడకేగిరి. విష్ణు వావృత్రుని చంపు నుపాయము చెప్పెను. 'నేను సముద్రపు నురుగులో చేరుదును. మీరానురుగు నెత్తి వృత్రాసురుని గొట్టుడు. అతడు మరణించును' అని ఇది పురాణ కథ. పిచ్చివారు కల్పించినట్లు లేదా? ఇయ్యది సత్యము కాదు. బుద్ధి మంతులు దీనిని విశ్వసింపరాదు. కారణమేమన వాస్తవమున నిదియు నాలంకారిక వర్ణనమే. సత్యగ్రంథములలో నీకథకు సంబంధించిన విషయమెట్లున్నదో చూడుడు.

(ఇంద్రస్య ను వీర్యాణి) ఈ మంత్రమునగల యింద్రపదము సూర్యుని దెలుపును. ఆ సూర్యుని పరాక్రమములను మనము చెప్పుదుము. సూర్యుడు తేజోవంతుడు. అతడు తన కిరణములతో వృత్రునిమేఘుని కొట్టును. అప్పుడా మేఘుడు చచ్చి భూమిపై బడును. తన జలరూపమగు శరీరము భూమిలో వ్యాపింపజేయును. అందువలన పెద్ద పెద్ద నదు లాజలముతో నిండి క్రమముగా మరల సముద్రమున జేరును. ఆ నదులెట్టి వి యన ? పర్వతము - మేఘముల వలన నేర్పడి జలమును ప్రవహింపజేయునవై యుండును. ఇంద్రుడు - సూర్యుడు మేఘరూప వృత్రుని చంపి యాకాశమునుండి భూమి మీద పడవేసినపుడతడు - వృత్రుడు భూమిమీద శయనించును. ౧

సం॥ "అహన్నహిం పర్వతే శిశ్రియాణం త్వష్టాస్మై వజ్రం స్వర్యం తతక్ష, వాశ్రా ఇవ ధేనవః స్యందమానా అఞ్జః సముద్ర మవజగ్మురాపః" ౨ ఋ.౧-౩౨-౨

అగ్రే మంత్రాణాం సంక్షేపతోఽర్థో లిఖ్యతే.

(త్వష్టా) సూర్యః (అహన్నహిం) తం మేఘ మహన్ హతవాన్. కథం హతవానిత్యత్రాహ - అస్మై అహయే వృత్రాసురాయ మేఘాయ, (పర్వతే శిశ్రియాణమ్) మేఘే శ్రితమ్. (స్వర్యమ్) ప్రకాశమయమ్ (వజ్రం) స్వకిరణజన్యం విద్యుత్, వజ్రం ప్రక్షిపతి. యేన వృత్రాసురం మేఘం (తతక్ష) కణీకృత్య భూమౌ పాతయతి, పునర్ భూమౌ గతమపి జలం కణీకృత్యాకాశం గమయతి పాతయతి - తా ఆపః సముద్రం (అవజగ్ముః) గచ్ఛంతి. కథం భూతా ఆపః? (అఞ్జః) వ్యక్తాః (స్యందమానాః) చలంత్యః. కా ఇవ. వాశ్రాః వత్సమిచ్ఛవో గావ ఇవ. ఆప ఏవ వృత్రాసురస్య శరీరమ్, యదిదం వృత్రశరీరాఖ్య జలస్య భూమౌ నిపాతనం తదిదం, సూర్యస్య స్తోతుమర్హం కర్మాస్తి.

తె॥ ఇకముందు మంత్రములకర్థము సంక్షేపముగ వ్రాయబడును.

(అహన్నహిం) ఆమేఘమే ఆకాశమునుండి క్రిందపడి మరల మేఘమండలము నాశ్రయించును. దానిని సూర్యుడు మరల తన కిరణములచే హననము చేయును - కొట్టును. ఒకడొక కొయ్య ముక్కను చిన్న చిన్న తునుకలు చేయునట్లు సూర్యుడు మేఘమును చిన్న చిన్న బిందువులుగా మార్చి భూమి మీద పడునట్లు చేయును. వర్షింపజేయును. మేఘమున కాశరీర రూపమగు జలము క్రమముగా నొకచో జేరి నదుల రూపము ధరించి సముద్రమున జేరును.

సం॥ 'అహన్ వృత్రం వృత్రతరం వ్యంస మింద్రో వజ్రేణ మహతా వధేన, స్కంధాంసీవ కులిశేనా వివృక్ణాహిః శయత ఉపపృక్ పృథివ్యాః" ౩ ఋ. ౧-౩౨-౫

"అపాదహస్తో అపృతన్యదింద్ర మాస్య వజ్రమధి సానౌ జఘాన, వృష్ణో వధ్రిః ప్రతిమానం బుభూషన్ పురుత్రా వృత్రో అశయద్ వ్యస్తః" ౪ ఋ. ౧-౩౨-౭

"అహిరితి మేఘనామసు పఠితమ్" నిఘం. ౧-౧౦

"ఇంద్రశత్రు రింద్రోఽస్య శమయితా వా శాతయితా వా తస్మాదింద్ర శత్రుః" నిఘం. ౨-౧౬

"తత్ కో వృత్రో? మేఘ ఇతి నైరుక్తాస్త్వాష్ట్రోఽసుర ఇత్యైతిహాసికాః, వృత్రం జఘ్నివా నపవవార తద్వృత్రో, వృణోతేర్ వా, వర్తతేర్ వా. వర్ధతేర్వా.

"యదవృణోత్తద్ వృత్రస్య వృత్రత్వ" మితి విజ్ఞాయతే. నిరు. ౨-౧౭

(ఇంద్రః) సూర్యః, (వజ్రేణ) విద్యుత్ కిరణాఖ్యేన (మహతా వ) తీక్ష్ణతరేణ, (వృత్రమ్) మేఘం, (వృత్రతరమ్) అత్యంతబలవంతమ్, (వ్యంసమ్) ఛిన్నస్కంధం, ఛేదిత ఘనజాలం యథా స్యాత్తథా (అహన్) హతవాన్, స (అహిః) మేఘః (కులిశేన) వజ్రేణ (వివృక్ణా) ఛిన్నాని స్కంధాసీవ ( పృథివ్యా ఉపపృక్) యథా కస్యచి న్మనుష్యాదే రసినా ఛిన్నం సదంగం పృథివ్యాం పతతి; తథైవ స మేఘోఽపి (అశయత).

'ఛందసి లుఙ్ లఙ్ లిటః" (పాణి ౩-౩-౬)

ఇతి సామాన్యకాలే లఙ్. ౩

పృథివ్యాం శయాన ఇవేంద్రేణ సూర్యేణాపాదహస్తో వ్యస్తో భిన్నాఙ్గకృతో వృత్రో మేఘో భూమావశయత్ శయనం కరోతీతి.

నిఘంటౌ, అ. ౧ ఖం, ౧౦ వృత్ర ఇతి మేఘస్య నామ. ౪

"ఇంద్రః శత్రుర్యస్య స ఇంద్రశత్రు రింద్రోఽస్య నివారకః, త్వష్టా సూర్యస్త స్యాపత్య మసురో మేఘః"

కుతః? సూర్యకిరణ ద్వారైవ రస జల సముదాయభేదేన యత్ కణీభూతం జల ముపరి గచ్ఛతి, తత్ పునర్మిలిత్వా మేఘరూపం భవతి. తస్యై వాసుర ఇతి సంజ్ఞాత్వాత్, పునశ్చ తం సూర్యో హత్వా భూమౌ నిపాతయతి. స చ భూమిం ప్రవిశతి. నదీర్ గచ్ఛతి. తద్వారా సముద్ర మయనం కృత్వా తిష్ఠతి; పునశ్చోపరి గచ్ఛతి. తం వృత్ర మింద్రః సూర్యో జఘ్నివా నపవవార నివారితవాన్. వృత్రార్థో వృణోతేః స్వీకరణీయః. మేఘస్య యద్ వృత్రత్వ మావరకత్వం తద్వర్తమానత్వాద్ వర్ధమానత్వాచ్చ సిద్ధమితి విజ్ఞేయమ్.

తె॥ కొండొకడు కొండొక మనుజుని శరీరమును శస్త్రాస్త్రములతో జీల్చి చెండాడి క్రిందపడవేయునట్లు సూర్యుడు తన తీక్ష్ణకిరణములతో గర్జించు మేఘములను ఛిన్నాభిన్నము చేసి భూమిపై పడునట్లు చేయును. అప్పుడా వృత్రుడు-మేఘము కాళ్ళు చేతులు మున్నగు నవయవములు ఖండింపబడినట్లు శవమువలె భూమిమీద పడును. ౩-౪

'అశయత' 'అశయత్' అను నీ స్థలములందు 'ఛందసి లుఙ్ లఙ్ లిటః' (పాణి-౩-౩-౬) అను వ్యాకరణ సూత్రము ననుసరించి సామాన్య కాలమున 'లఙ్' లకారము ప్రయోగింపబడినది.

నిఘంటువునందు మేఘమునకు అహి, వృత్రుడు అని నామము లున్నట్లు చూడనగును. (ఇంద్రశత్రు) ఇంద్రుడు శత్రువు కాగలవాడు. ఇంద్రుడు సూర్యుడు వృత్రుని ఛేదించువాడు. మేఘములను ఛిన్నాభిన్నము చేసి తొలగించువాడు సూర్యుడని భావము. సూర్యునకు 'త్వష్ట' యనిపేరు. అతని సంతానము అసురుడు మేఘము. కారణమేమన :- సూర్యకిరణముల ద్వారమున జలము కణములుగా-బాష్పముగా మారి పైకెగసి యట నేకమై మేఘమును ఛిన్నాభిన్నముచేసి నీటి బిందువులుగా మార్చి భూమిపై వర్షించునట్లు చేయును. ఆ జలము నదులలో జేరును. వాని మూలమున తన కాశ్రయమగు సముద్రమునం జేరి జలము మరల సూర్యకిరణములచే బాష్పమై పైకెగసి మేఘమండలమున జేరును. సూర్యుడు మరళ నా మేఘమును ఛిన్నాభిన్నముచేసి వర్షింపచేయును, ఇట్లు నిరంతరము నింద్రవృత్ర యుద్ధము జరుగుచునే యుండును.

న్నిరుక్తమున మేఘము వృత్రశబ్దముచే చెప్పబడినది. వృత్రము–ఆవరకము– సూర్యున కావరణము కల్పించునది యని యర్థము. 'వృఞ్' ఆచ్ఛాదనే అను ధాతువుచే వృత్రశబ్ద మేర్పడును. ఇందు 'క్త్రి' ప్రత్యయము (ఉదా. ౪-౧౬౪) చేర్చబడును. 'వృతు' వర్తమానే. అను ధాతువునకు (రక్) ప్రత్యయము చేర్చిన వృత్ర పదమేర్పడును. ఇట్లే, 'వృధు' వృద్ధౌ, అను ధాతువునకు 'రక్' ప్రత్యయము (ఉ.౨-౧౩) చేర్చినను 'వృత్ర' పదము సిద్ధించును. మేఘము నాలుగుమాసములుండును గావున వృత్రపదము మేఘవాచకమగుచున్నది. అట్లే వృద్ధిపొందునది కావున మేఘమునకు వృత్ర మని పేరు. ఈ యర్థములను దెలుపుటకే నిరుక్త రచయిత యాస్కముని శతపథ బ్రాహ్మణము నుండి (యదవృణోత్) అను నిట్టి వాక్యముల నుట్టంకించి యున్నాడు.

సం॥ "అతిష్ఠంతీనా మనివేశనానాం కాష్ఠానాం మధ్యే నిహితం శరీరమ్, వృత్రస్య నిణ్యాం విచరం త్యాపో దీర్ఘం తమ ఆశయ దింద్రశత్రుః" ౫ ఋ. ౧–౩౨–౧౦

"నాస్మై విద్యున్న తన్యతుః, నిషేధ న యాం మిహమకిరద్ ధ్రాదునిం చ, ఇంద్రశ్చ యద్యుయుధాతే అహిశ్చోతా పరీభ్యో మఘవా విజిగ్యే" ౬ ఋ, ౧–౩౨–౧౩

ఇత్యాదయ ఏత ద్విషయా వేదేషు బహవో మంత్రాః సంతి. వృత్రో హ వా ఇదగ్ం సర్వం వృత్వాశిశ్యే. యదిద మంతరేణ ద్యావా పృథివీ. స యదిదగ్ం సర్వం వృత్వా శిశ్యే తస్మాద్ వృత్రో నామ" శత. ౧–౧–౩–౪

తమింద్రో జఘాన, స హతః పూతిః సర్వత ఏవాఽపోఽభిప్రసుస్రావ. సర్వత ఏవ హ్యయగ్ం సముద్ర స్తస్మాదు హైకా ఆపో బీభత్సాం చక్రిరే. తా ఉపర్యుపర్యతి పుప్రువిరే. అత ఇమే దర్భాస్తా హైతా అనాపూయితా ఆపోఽస్తి వా ఇతరాసు సగ్ంసృష్టమివ, యదేనా వృత్రః పూతి రభిప్రాస్రవత్తదేవాసా మేతాభ్యాం పవిత్రాభ్యా మపహం త్యథ మేధ్యాభి రేవాద్భిః ప్రోక్షతి, తస్మాద్వా ఏతాభ్యా ముత్పునాతి. శత. ౧–౧–౩–౫

"త్రిస్ర ఏవ దేవతా ఇతి నైరుక్తాః, అగ్నిః పృథివీస్థానో,

వాయుర్వేంద్రో వాంతరిక్షస్థానః, సూర్యో ద్యుస్థాన ఇతి" నిరు. ౭–౫

(అతిష్ఠంతీనామ్) వృత్రస్య శరీరమాపో దీర్ఘంతమ శ్చరంతి,

అత ఏవేంద్ర శత్రుర్ వృత్రో మేఘో భూమాచశయత్ – ఆసమాన్నాచ్చేతే" ౫

(నాస్మై విద్యుత్) వృత్రేణ మాయారూప ప్రయుక్తా విద్యుత్తన్యతుశ్చాస్మై సూర్యా యేంద్రాయ న నిషేధ–నిషేద్ధుం న శక్నోతి. అహిర్ మేఘః, ఇంద్రః సూర్యశ్చ ద్వౌ పరస్పరం యుయుధాతే. యదా వృత్రో వర్ధతే తదా సూర్యప్రకాశం నివారయతి. యదా సూర్యస్య తాపరూపసేనా వర్ధతే తదా వృత్రం మేఘం నివారయతి. పరంతు మఘవా ఇంద్రః సూర్యస్తం వృత్రం మేఘం విజిగ్యే జితవాన్ భవతి. అంతతోఽస్యైవ విజయో భవతి న మేఘ స్యేతి. ౬

('వృత్రో హ వా ఇతి')స వృత్ర ఇదం సర్వం విశ్వం వృత్వాఽఽవృత్య శిశ్యే శయనం కరోతి తస్మాద్ వృత్రో నామ.

తం వృత్రం మేఘ మింద్రః సూర్యో జఘాన హతవాన్. స హతః సన్ పృథివీం ప్రాప్య సర్వతః కాష్ఠతృణాదిభిః సంయుక్తః పూతిర్ దుర్గంధో భవతి. స పురాకాశస్థో భూత్వా సర్వతోఽపోఽభిసుస్రావ. తాసాం వర్షణం కరోతి. అయం హతో వృత్రః సముద్రం ప్రాప్య తత్రాపి భయంకరో భవతి. అత ఏవ తత్రస్థా ఆపో భయప్రదా భవంతి. ఇత్థం పునః పున స్తాస్తా నదీసముద్రపృథివీ గతా ఆపః సూర్యద్వారేణోపర్యు పర్యంతరిక్షం పుప్రువిరే గచ్ఛంతి, తతోఽభివర్షంతి చ, తాభ్య ఏవేమే దర్భాద్యోషధిసమూహో జాయంతే.

యౌ వాయ్వింద్రౌ సూర్యపవనా వంతరిక్షస్థానౌ. సూర్యశ్చద్యుస్థానే, అర్థాత్ ప్రకాశస్థః. ఏవం సత్యశాస్త్రేషు పరమోత్తమాయా మలంకార యుక్తాయాం కథాయాం సత్యాం, బ్రహ్మవైవర్తాది నవీన గ్రంథేషు పురాణాభాసే ష్వేతా అన్యథా కథా ఉక్తాస్తాః శిష్టైః కదాచిన్నైవాంగీకర్తవ్యా ఇతి.

తె॥ ఈ విషయమునకు సంబంధించిన యిట్టి వేదమంత్రములు వేదమున పెక్కుగలవు.

(అతిష్ఠంతీనామ్) వృత్రుని ఈ జలరూప శరీరము నల్లని మేఘపటలములుగా చరించును. ఆ వృత్రుని-మేఘమును, సూర్యుడు ఛిన్నభిన్నము చేసినపుడు భూమిని జేరి యామేఘము చెఱువులయు, నదులయు రూపమున నుండి సముద్రమును జేరును. ఇదియే వృత్రుడు భూమిపై శయనించుట. ౫

(నాస్మై)ఆ వృత్రుడు తన విద్యుత్తుతోకాని, ఉరుములతో గాని యింద్రుని జయింపజాలడు. ఇట్లు సూర్యమేఘముల సంఘర్షణమే ఇంద్ర వృత్రాసురులు యుద్ధము చేయుచున్నట్లాలంకారికముగ వేదము లందు వర్ణింపబడి యున్నది. మేఘము లెక్కుడైనపుడు సూర్యుని ప్రకాశ మావృతమగును. సూర్యుని తేజస్సు-తాప మెక్కుడైనపుడు మేఘమును వృత్రుని - దొలగించును. కాని యీ యుద్ధమునందు చివరకు ఇంద్రునకే సూర్యునకే విజయము లభించును.

(వృత్రో హవా) "వృత్రుడు-మేఘము-వృద్ధినిబొంది పృథివ్యాకాశములందు వ్యాపించును. కావుననే మేఘమునకు వృత్రుడనిపేరు" అని శతపథబ్రాహ్మణమున నున్నది.

సూర్యుడు (ఇంద్రుడు) అవృత్రుని-మేఘమును హననముజేసి భూమిపై బడవేయును. ఆ మేఘము వర్షరూపమున అశుద్ధమగు భూమిపైబడి, కుళ్ళిపోయిన ఆకులతోను మలమూత్రములతోను కలిసి దుర్గంధయుక్తమై నదులరూపమున సముద్రముం జేరును. అట నా జలము చూచుటకెంతో భయంకరముగ కనిపించును. ఇట్లు నీరు మేఘరూపమును ధరించి పలుమాఱు వర్షించుచుండును. (ఉపర్యుపర్యంత) జలమంతటను బాష్పరూపమున పైకెగిరి యాకాశమున జేరును. అక్కడ నేకమై మరల వర్షించును. ఆ వర్షజలము భూమిపై బడినపుడే యనేకములగు ఓషధులు భూమియందుద్భవించును. మేఘమే వృత్రుడని పిలువబడును.

వాయువు సూర్యుడు-నింద్రుడనబడును. వాయు వంతరిక్షమునను, సూర్యుడు ప్రకాశస్థానమున నుండును. ఆకాశమున నింద్రవృత్రుల యుద్ధమిట్లు జరుగుచుండును. ఈ యుద్ధమున చివరకు నింద్రునకే-సూర్యునకే విజయము చేకూరును. మేఘుడు-వృత్రాసురు డోడిపోవును. సత్యశాస్త్రములందు ఆలంకారికముగ వర్ణింపబడిన యీ ఘట్టములను సరిగా గ్రహింపక యల్పబుద్ధులు బ్రహ్మవైవర్తభాగవతాది గ్రంథములందు మిథ్యాకథలను కల్పించి వ్రాసియున్నారు. బుద్ధిమంతులు వీని నంగీకరింపరాదు.

సం॥ ఏవమేవ నవీనేషు గ్రంథేషూక్తా అనేకవిధా దేవాసురసంగ్రామ కథా అన్యథైవ సంతి, తా అపి బుద్ధిమద్భిర్ మనుష్యై రితరైశ్చ నైవ మంతవ్యాః. కుతః? తాసామప్యలంకార యోగాత్, తద్యథా:-
"దేవాసురాః సంయత్తా ఆసన్" ౧ శత. ౧౩-౩-౪-౧

"అసురానభిభవేమ దేవాః. అసురా అసురతా స్థానేష్వస్తాః స్థానేభ్య ఇతి వా. అపి వా అసురితి ప్రాణనామా స్తః శరీరే భవతి, తేన తద్వంతః. సోర్ దేవా నసృజత తత్సురాణాం సురత్వమ్. అసోరసు రానసృజత తదసురాణా మసురత్వమితి విజ్ఞాయతే" నిరు. ౩-౮

"దేవానా మసురత్వ మేకత్వం ప్రజ్ఞావత్వం వాజ్ఞానవత్వం వాపివాసురితి ప్రజ్ఞానామాస్యత్యనర్థాన స్తాశ్చాస్యామర్థా అసురత్వమాదిలుప్తమ్" నిరు. ౧౦-౩౩

సోర్ చకే భ్రామ్యంశ్చచార ప్రజాకామః. స ఆత్మన్యేవ ప్రజాతి మధత్త, స ఆస్యేనైవదేవానసృజత, తే దేవా దివ మభిపద్యాసృజ్యంత, తద్దేవానాం దేవత్వం యద్దివమభిపద్యాసృజ్యంత, తస్మై ససృజానాయ దివేవాస, తద్వేవ దేవానాం దేవత్వం యదస్మై ససృజానాయ దివేవాస.

అథ యోఽయ మవాఙ్ ప్రాణః, తేనాసురా నసృజత, ఇమామేవ పృథివీ మభి సంపద్యాసృజ్యంత, తస్మై ససృజానాయ తమ ఇవాస. సోఽవేత్, పాప్మానం వా అసృక్షి, యస్మై మే ససృజానాయ తమ ఇవాభూదితి, తాం స్తత ఏవ పాప్మనా విధ్యత్తే, తఽ ఏవ పరాభవం, స్తస్మాదాహుర్ నైతదస్తి య ద్దైవాసురం, యదిదమన్వాఖ్యానే త్వదుద్యత ఇతిహాసే త్వత్, తతో హ్యేవ తాన్ ప్రజాపతిః పాప్మనా విధ్యత్తే, తత ఏవ పరాభవన్నితి, తస్మాదేతదృషిణాభ్యనూక్తమ్. న త్వం యుయుత్సే కతమచ్చ నాహర్న తేఽమిత్రో మఘవన్ కశ్చనాస్తి. మాయేత్సా తే యాని యుద్ధాన్యాహుర్ నాద్య శత్రుం న ను పురాయుయుత్స ఇతి. స యదస్మై దేవాన్త్ససృజానాయ దివేవాస తదహర కురుతాథ యదస్మా అసురాన్త్ససృజానాయ తమ ఇవాస తాగ్ం రాత్రిమకురుత తే అహో రాత్రే. స ఐక్షత ప్రజాపతిః"
శత. ౧౧-౧-౬ నుండి ౧౨ వరకు.

"దేవాశ్చ వా అసురాశ్చ. ఉభయే ప్రాజాపత్యాః ప్రజాపతేః పితు ర్దాయముపేయుః.
శత. ౧-౮-౨-౨

"ద్వయా హ ప్రాజాపత్యాః. దేవాశ్చాసురాశ్చ, తతః కానీయసా ఏవ దేవా జ్యాయసా అసురా, యదేవేద మప్రతిరూపం వదతి, స ఏవ స పాప్మా శత. ౧౪-౪-౧-౧-౩

"ఊర్గితి దేవా మాయేత్యసురాః" శత. ౧౦-౫-౨-౨౦

"ప్రాణా దేవాః" శత. ౬-౩-౧-౧౫

"ప్రాణో వా అసుస్తస్యైషా మాయా" శత. ౬-౬-౨-౬

(దేవాసురాః) దేవా అసురాశ్చ సంయత్తా సజ్జా యుద్ధం కర్తుం తత్పరా ఆసన్ భవతీతి శేషః. కే తే దేవాసురా ఇత్యత్రోచ్యతే.

"విద్వాగ్ంసో హి దేవాః" శ. ౩-౭-౩-౧౦

హీతి నిశ్చయేన విద్వాంసో దేవా స్తద్విపరీతా అవిద్వాంసోఽసురాః యే దేవాస్తే విద్యావత్త్వాత్ ప్రకాశవంతో భవంతి. యే హ్యవిద్వాంస స్తే ఖల్వవిద్యావత్త్వాత్ జ్ఞానరహితాంధకారిణో భవంతి. ఏషా ముభయేషాం పరస్పరం యుద్ధమివ వర్తతేఽయమేవ దేవాసుర సంగ్రామః.

ద్వయం వా ఇదం న తృతీయమస్తి. సత్యం చైవానృతం చ. సత్యమేవ దేవా అనృతం మనుష్యాః. ఇద మహమనృతాత్సత్య ముపైమీతి తన్మనుష్యేభ్యో దేవానుపైతి, స వై సత్యమేవ వదేత్. ఏతద్ధ వై దేవా వ్రతం చరంతి. యత్ సత్యం, తస్మాత్తే యశో, యశో హ భవతి. య ఏవం విద్వాం స్సత్యం వదతి, మనో హ వై దేవా మనుష్యస్య. శత. ౧-౧-౧-౪-౫-౭

యే సత్యవాదినః సత్యమానినః సత్యకారిణశ్చ తే దేవాః. యే చానృత వాదినోఽ నృతకారిణోఽ నృతమానినశ్చ తే మనుష్యా అసురా ఏవ. తయో రపి పరస్పరం విరోధో యుద్ధమివ భవత్యేవ. మనుష్యస్య యన్మనస్తద్దేవాః, ప్రాణా అసురా, ఏతయోరపి విరోధో భవతి. మనసా విజ్ఞానబలేన ప్రాణానాం నిగ్రహో భవతి; ప్రాణబలేన మనసశ్చేతి యుద్ధమివ ప్రవర్తతే. ప్రకాశాఖ్యాత్సర్వదేవాన్మనః షష్ఠానీంద్రియాణీశ్వరోఽ సృజత. అతస్తే ప్రకాశకారకాః. అసౌ రంధకారాఖ్యాత్ పృథివ్యాదే రసురాన్ పంచకర్మేంద్రియాణి ప్రాణాంశ్చాసృజత. ఏతయోరపి ప్రకాశా ప్రకాశ సాధకతమత్వాసురోధేన సంగ్రామవ దనయోర్ వర్తమాన మస్తీతి విజ్ఞేయమ్.

(సోఽర్చఞ్ ఛ్రామ్యంశ్చచార) ప్రజాకామః పరమేశ్వర ఆస్యే నాగ్నిపరమాణుమయాత్ కారణాత్, సూర్యాదీన్ ప్రకాశవతో లోకాన్ ముఖ్యగుణకర్మభ్యో యానసృజత, తే దేవా ద్యోతమానా దివం ప్రకాశం పరమేశ్వరప్రేరిత మభిపద్య, ప్రకాశాదివ్యవహారా నసృజ్యన్త. తదేవ దేవానాం దేవత్వం యతస్తే దివి ప్రకాశే రమంతే.

అథేత్యనంతర మర్వాచీనో యోఽయం ప్రాణో వాయుః పృథివ్యాది లోకశ్చేశ్వరేణ సృష్ట స్తేనైవాసురాన్ ప్రకాశరహితా నసృజత సృష్టవా నస్తి. తే పృథివీ మభిపద్యౌషధ్యాదీన్ పదార్థా నసృజ్యంత, తే సర్వే సకార్యాఃప్రకాశరహితా స్తయో స్తమః ప్రకాశవతో రన్యోన్యం విరోధో యుద్ధమివ ప్రవర్తతే. తస్మా దిద మపి దైవాసురం యుద్ధమితి విజ్ఞేయమ్. తథైవ పుణ్యాత్మా మనుష్యో దేవోఽస్తి, పాపాత్మా హ్యసురశ్చ. ఏతయో రపి పరస్పరం విరుద్ధస్వభావా ద్యుద్ధమివ ప్రతిదినం భవతి. తస్మాదేషోఽపి దేవాసురసంగ్రామోఽస్తీతి విజ్ఞేయమ్. ఏవమేవ దినం దేవః, రాత్రిరసురః; ఏతయోరపి పరస్పరం యుద్ధమివ ప్రవర్తతే.

త ఇమే ఉభయే పూర్వోక్తాః ప్రజాపతేః పరమేశ్వరస్య పుత్రా ఇవ వర్తంతే, అత ఏవ తే పరమేశ్వరస్య పదార్థా నుపేతాః సంతి.

తేషాం మధ్యేఽసురాః ప్రాణాదయో జ్యేష్ఠాః సంతి. వాయోః పూర్వోత్పన్నత్వాత్ ప్రాణానాం తన్మయత్వాచ్చ. తథైవ జన్మతో మనుష్యాః సర్వేఽవిద్వాంసో భవంతి; పునర్విద్వాంసశ్చ. తథైవ వాయోః సకాశా దగ్నే రుత్పత్తిః ప్రకృతేరింద్రియాణాం చ తస్మా దసురా జ్యేష్ఠా దేవాశ్చ కనిష్ఠాః. ఏకత్ర దేవాః సూర్యాదయో జ్యేష్ఠా పృథివ్యాదయోఽసురాః కనిష్ఠాశ్చ. తే సర్వే ప్రజాపతేః సకాశా దుత్పన్నత్వా త్తస్యాపత్యానీవ సంతీతి విజ్ఞేయమ్. ఏషామపి పరస్పరం యుద్ధమివ ప్రవర్తత ఇతి జ్ఞాతవ్యమ్.

యే ప్రాణపోషకాః స్వార్థసాధనతత్పరా మాయావినః కపటినో మనుష్యాస్తే హ్యసురాః. యే చ పరోపకారకాః పరదుఃఖభంజనా నిష్కపటినో ధార్మికా మనుష్యా స్తే దేవాశ్చ విజ్ఞేయాః. ఏతయోరపి పరస్పరం విరోధాత్ సంగ్రామ ఇవ భవతి.

ఇత్యాది ప్రకారకం దైవాసురం యుద్ధమితి బోధ్యమ్. ఏవం పరమోత్తమాయాం విద్యావిజ్ఞాపనార్థాయాం రూపకాలంకారేణాన్వితాయాం సత్యశాస్త్రేషూక్తాయాం కథాయాం సత్యాం, వ్యర్థపురాణ సంజ్ఞకేషు నవీనేషు తంత్రాదిషు గ్రంథేషు చ యా మిథ్యైవ కథా వర్ణితాః సంతి, విద్వద్భిర్ నైవైతాః కథాః కదాచిదపి సత్యా మంతవ్యా ఇతి.

తె॥ నాలుగవది దేవాసుర సంగ్రామ కథ. ఇదియును ప్రమాదమునకు గురియైన వారివలన చెడగొట్టబడినది. దీనినిగూడ నెవ్వరు నంగీకరింపరాదు. కారణము ? ఈ కథయును రూపకాలంకారము నకు చెందినదియే.

కథ : 'దైత్యులసేన యొకటియుండెను. వారికి పురోహితుడు శుక్రాచార్యులు. వారు దక్షిణదేశమున నుండెడివారు. రెండవది దేవసేన దానికి రాజు ఇంద్రుడు. సేనాపతి అగ్ని. పురోహితులు బృహస్పతి. ఆ దేవతలకు విజయము జేకూర్చుట కార్యావర్తపు రాజులుకూడ వెళ్ళుచుండెడివారు. అసురులు తపమొనర్చి బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులవలన వరములను బొందెడివారు. వారిని జంపుటకై విష్ణు వవతారములనెత్తి పృథివీభారమును దొలగించెడివాడు. "ఇవి యన్నియు పురాణములలోని గప్పాలు- కల్పితగాథలు. వీనిని వ్యర్థములని యెంచి, యీ క్రింద వ్రాయు సత్య శాస్త్రములలోని కథనెల్లరు స్వీకరింపవలెను.

(దేవాసురాః) దేవతలు నసురులు సుసజ్జితులై యెల్లపుడు యుద్ధమొనర్ప సిద్ధముగా నుందురు. పూర్వము వ్రాసిన యింద్రవృత్రాసురుల కథయు దేవాసుర సంగ్రామ మనియే యెంచనగును. సూర్యకిరణములకు దేవతలనిపేరు. మేఘము లసురులు. వానిమధ్య జరుగు యుద్ధము వ్రాసియే యున్నాము. నిఘంటువు మున్నగు సత్యశాస్త్రములందు సూర్యుడు దేవతయనియు, మేఘము అసురుడనియు వర్ణింపబడియున్నది. దేవాసుర సంగ్రామమన నేమో యెల్లరకు దెలుపుటయే యీ వాక్యముల ముఖ్యాభిప్రాయము.

నిరుక్తము బ్రాహ్మణ గ్రంథములు మున్నగువాని ప్రమాణములనుబట్టి, విద్వాంసులు, సత్యవాదులు- సత్యము నంగీకరించువారు, సత్యకర్మల నాచరించువారు దేవతలనబడుదురు. అవిద్వాంసులు, అనృతవాదులు, అసత్యాచారపరులు, అసత్యమునంగీకరించువారు అసురులగుదురు. ఇట్టి దేవాసురులలో గలుగువిరోధము యుద్ధమునకు సమానమగును. ఇట్లే మనుష్యుల మనస్సు, జ్ఞానేంద్రియములు దేవతలనబడును. వానిలో మనస్సు రాజు, ఇంద్రియములు సేన, ప్రాణముల కసురులని పేరు. వానిలో ప్రాణము రాజు. అపానాదులుసేన. ఈ యింద్రియప్రాణాది రూప దేవాసురులలోను విరోధరూప యుద్ధము జరుగుచుండును. మనో విజ్ఞాన మెక్కుడైన ప్రాణము నిగ్రహింపబడును. ప్రాణవిజ్ఞాన మెక్కుడైనపుడు మనస్సు నిగ్రహింపబడును.

(సోర్దే) (సోర్చ) సు = ప్రకాశరూప పరమాణువులు వానివలన మనస్సు పంచేంద్రియములు, వాని పరస్పర సంయోగము, సూర్యుడు మున్నగు వానిని పరమేశ్వరుడు రచించును. మఱియు (అసో) అంధకార రూప పరమాణువుల వలన పంచ కర్మేంద్రియములు, దశ ప్రాణములు, భూమి మున్నగు వానిని పరమేశ్వరుడు రచించును. అవి ప్రకాశరహితములగుట వలన నసురులనబడును. ప్రకాశాంధకారములు పరస్పర విరుద్ధము లగుటవలన వీనియందును సంగ్రామము జరుగుచున్నదని యెంచబడును. పుణ్యాత్ములు

దేవతలు; పాపాత్ములసురులు ననబడుదురు. వారియందును పారస్పరిక విరోధమనెడి సంగ్రామము జరుగుచునే యుండును. దినము దేవత; రాత్రి అసురుడు. అట్లే శుక్లపక్షము దేవత; కృష్ణపక్షము అసురుడు. ఉత్తరాయణము దేవత, దక్షిణాయనము అసురుడు. ఈ యన్నిటియందును పరస్పర విరోధమనెడి యుద్ధమెల్లపుడు జరుగుచున్నట్లే యుండును. ఇట్లే యితర స్థలములందును పరస్పర విరుద్ధ పదార్థములుగల తావున రూపకాలంకారముతో దేవాసుర సంగ్రామము నూహింప వచ్చును.

దేవాసురు లెల్లరు నీశ్వరుని పుత్రులకు సమానముగ జెప్పఁబడును. ప్రపంచ పదార్థములన్నియు వీరి యధికారముననే యుండును. ఇం దసురులని వర్ణింపబడిన ప్రాణాదులు జ్యేష్ఠులు. అవి ముందుత్పన్నమైనవి. అట్లే బాల్యమున మనుష్యులెల్లరు నవిద్వాంసులుగనే యుందురు. సూర్యుడు, జ్ఞానేంద్రియములు, విద్వాంసులు తదుపరి ప్రకాశితులగుదురు. కావున కనిష్ఠులనబడుదురు.

మనుష్యులలో స్వార్థపరులు, తమ ప్రాణములనే పోషించుకొనువారు, కపటులు, మున్నగు దుష్టులు అసురులనబడుదురు. పరోపకారులు, పరుల దుఃఖములను దొలగించువారు, ధర్మాత్ములు నగువారు దేవతలనబడుదురు. ఇట్టి దేవాసురులందును గలుగు పరస్పరవిరోధములు దేవాసుర సంగ్రామమనబడును. ఇట్టి సత్యవిద్యను ప్రకటించు కథను ప్రీతిపూర్వకముగ గ్రహించి ప్రచారమొనర్పవలెను. అసత్యకథలను మనోవాక్కాయములతో త్యజించుట యెల్లరకు నుచితము.

*సం॥ ఏవ మేవ కశ్యప గయాది తీర్థ కథా అపి, బ్రహ్మ వైవర్తాదిషు గ్రంథేషు వేదాదిసత్యశాస్త్రేభ్యో విరుద్ధా ఉక్తాః సంతి. తద్యథా – "మరీచి పుత్రః కశ్యపఋషిరాసీత్. తస్మై త్రయోదశ కన్యా దక్షప్రజాపతినా వివాహ విధానేన దత్తాః. తత్సంగమే దితేర్ దైత్యాః. అదితే రాదిత్యాః, దనోర్ దానవాః, ఏవ మేవ కద్ర్వాః సర్పాః, వినతాయాః పక్షిణః. తథాఽన్యాసాం సకాశాద్ వానరర్క్ష వృక్ష ఘాసాదయ ఉత్పన్నాః" ఇత్యాద్యా అంధకారమయ్యః ప్రమాణయుక్తి విద్యావిరుద్ధా అసంభవగ్రస్తాః కథా ఉక్తా స్తా అపి మిథ్యా ఏవ సంతీతి విజ్ఞేయమ్. తద్యథా –*

*స యత్ కూర్మో నామ, ప్రజాపతిః ప్రజా అసృజత. య దసృజతాకరోత్; తద్యదకరోత్తస్మాత్ కూర్మః, కశ్యపో వై కూర్మ స్తస్మాదాహుః సర్వాః ప్రజాః కాశ్యప్య ఇతి.* శత. ౭–౫–౧–౫

***(స యత్ కూర్మః)*** *పరమేశ్వరేణేదం సకలం జగత్ క్రియతే; తస్మాత్తస్య 'కూర్మ' ఇతి సంజ్ఞా. "కశ్యపో వై కూర్మః" ఇత్యనేన పరమేశ్వరస్యైవ కశ్యప ఇతి నామాస్తి. తేనైవేమాః సర్వాః ప్రజా ఉత్పాదితాస్తస్మాత్సర్వా ఇమాః ప్రజాః కాశ్యప్య ఇత్యుచ్యంతే. కశ్యపః కస్మాత్ ? పశ్యకో భవతీతి నిరుక్త్యా, పశ్యతీతి పశ్యః, సర్వజ్ఞతయా సకలం జగద్ విజానాతి స పశ్యః; పశ్య ఏవ నిర్ భ్రమతయా అతి సూక్ష్మమపి వస్తు యథార్థం జానాత్యేవాతః పశ్యక ఇతి. ఆద్యంతాక్షర విపర్యయా ద్ధింసేః సింహః, కృతేస్తర్కు రిత్యాదివత్ కశ్యప ఇతి "హయవరట్" ఇత్యేతస్యోపరి మహాభాష్య ప్రమాణేన పదం సిధ్యతి. అతః సుష్ఠు విజ్ఞాయతే– కాశ్యప్యః ప్రజా ఇతి.*

తె॥ ఐదవది కశ్యపకథ. పుష్కరతీర్థాదుల కథలను బ్రహ్మ వైవర్తాదిపుస్తకములందు వికటముగ వ్రాసియున్నారు. చూడుడు.

కశ్యప ఋషి మరీచి పుత్రుడు. అతనికి దక్ష ప్రజాపతి తన పదుముగ్గురు కన్యలనిచ్చి వివాహ మొనర్చెను. కశ్యపుడు వారియందు ప్రపంచ ప్రాణుల నుత్పన్న మొనర్చెను. దితి వలన దైత్యులు, అదితి

వలన నాదిత్యులు, దనువు వలన దానవులు, కద్రువ వలన సర్పములు, వినతవలన పక్షులు, ఇట్లే యితర భార్యలవలన వానరులు, భల్లూకములు, వృక్షములు నుత్పన్న మొనర్చి యున్నాడు. ఇట్లే చంద్రునకును నిరువదియేడ్గురు కన్యల నొసంగెను. ఇట్టి కథ లనేకములు, యుక్తి ప్రమాణములకు విరుద్ధములైనవి వ్రాయబడి యున్నవి. వాని నంగీకరింపరాదు. ఈ కశ్యపకథ సత్యగ్రంథము లందెట్లున్నదో చూడుడు.

(స యత్ కూర్మో) ప్రజనుత్పన్న మొనర్చుటచే ప్రజాపతియగు పరమేశ్వరునకు కూర్మమని పేరు. అతడు తన జ్ఞానముతో నిఖిల జగత్తును నిర్ భ్రాంతముగ నెఱుగును-బాగుగ జూచువాడగుట నతనికి కశ్యపుడనియు నామము. (కశ్యపః) 'కశ్యప' అను పదము 'పశ్యక' శబ్దమునందలి మొదటి యక్షరమును చివరకు, చివరియక్షరమును మొదటికి మార్చినందువలన నేర్పడును. కావున పశ్యకుడు-కశ్యపుడు అగును. చూచువాడని యర్థము. ఇట్లే 'హింస' 'సింహ' మగును. 'కృతి' 'తర్కు' అగును. 'హయవరట్' అను పాణిని సూత్రమునకు వ్రాసిన పతంజలిముని భాష్య ప్రమాణము ననుసరించి 'పశ్యక' శబ్దము 'కశ్యప' మగును. ఇట్టి యుత్తమ కథావిషయములను బాగుగ గ్రహించి వానిని, ప్రకటముచేసి మిథ్యా కథల ప్రచారమును దూరమొనర్చుట వలన నెల్లరకు శుభము కలుగును.

సం॥ ప్రాణో వై బలం తత్ప్రాణే ప్రతిష్ఠితం, తస్మాదాహుర్ బలగ్ం సత్యాదో జీయః, ఇత్యేవమ్వేషా గాయత్ర్యధ్యాత్మం ప్రతిష్ఠితా. సాహైషా గయాం స్త్రత్రే, ప్రాణా వై గయా స్తత్ప్రాణాం స్త్రత్రే. తద్యద్ గయాంస్త్రత్రే. తస్మాద్ గాయత్రీ నామ.
శత. ౧౪-౮-౫-౬-౭

"గయ ఇత్యపత్యనామను పఠితమ్"
నిఘం. ౨-౨

తీర్థమేవ ప్రాయణీయోఽతిరాత్రస్తీర్థేన హి ప్రస్నాంతి, తీర్థ మేవోదయనీయోఽతిరాత్ర స్తీర్థేన హ్యుత్స్నాంతి.
శత. ౧౨-౨-౧-౧-౫

"అహిగ్ంసన్ సర్వభూతాన్యన్యత్ర తీర్థేభ్య" ఇతి ఛాందోగ్యోపనిషది
౮-౧౫

"సమానతీర్థే వాసీ" ఇత్యష్టాధ్యాయ్యామ్
౪-౪-౧౦౭

సతీర్థ్యో బ్రహ్మచారీత్యుదాహరణమ్. త్రయః స్నాతకా భవన్తి. విద్యాస్నాతకో, వ్రతస్నాతకో, విద్యావ్రతస్నాతకశ్చేతి. యో విద్యాం సమాప్య, వ్రతమసమాప్య సమావర్తతే, స వ్రతస్నాతక ఇత్యాది పాస్కర గృహ్యసూత్రే.

నమస్తీర్థ్యాయ చ, యే తీర్థాని ప్రచరన్తి సృకాహస్తా నిషంగిణః. ఇతి శుక్లయజుర్వేదసంహితాయాం.
౧౬-౪౨-౬౧

ఏవమేవ గయాయాం శ్రాద్ధం కర్తవ్యమిత్యత్రోచ్యతే, తద్యథా - ప్రాణ ఏవ బలమితి విజ్ఞాయతే, బలమోజీయః. తత్రైవ సత్యం ప్రాణేఽధ్యాత్మం ప్రతిష్ఠితం, తత్ర చ పరమేశ్వరః ప్రతిష్ఠిత స్తద్వాచ కత్వాత్. గాయత్ర్యపి బ్రహ్మవిద్యాయామధ్యాత్మం ప్రతిష్ఠితా, తాం గాయత్రీం గయామాహ. ప్రాణానాం గయేతి సంజ్ఞా, "ప్రాణా వై గయా" ఇత్యుక్తత్వాత్. తత్ర గయాయాం శ్రాద్ధం కర్తవ్యమ్. అర్థాత్ గయాఖ్యేషు ప్రాణేషు శ్రద్ధయా సమాధి విధానేన పరమేశ్వర ప్రాప్తి వత్యంతశ్రద్ధధానా జీవా అనుతిష్ఠేయు రిత్యేకం గయాశ్రాద్ధ విధానమ్. 'గయాన్ ప్రాణాన్ త్రాయతే సా గాయత్రీ' ఇత్యభిధీయతే.

ఏవమేవ గృహస్యాపత్యస్య ప్రజాయాశ్చ గయేతి నామాస్తి, అత్రాపి సర్వైర్ మనుష్యైః శ్రద్ధాతవ్యమ్, గృహకృత్యేషు శ్రద్ధాఽవశ్యం విధేయా. మాతుః పితురాచార్యస్యాతిథేశ్చాన్యేషాం మాన్యానాం చ శ్రద్ధయా సేవాకరణం గయాశ్రాద్ధ మిత్యుచ్యతే. తథైవ స్వస్యాపత్యేషు ప్రజాయాం చోత్తమ శిక్షాకరణే హ్యుపకారే చ శ్రద్ధాఽవశ్యం సర్వైః కార్యేతి. అత్ర శ్రద్ధాకరణేన విద్యాప్రాప్త్యా మోక్షాఖ్యం విష్ణుపదం లభ్యత ఇతి నిశ్చీయతే.

అత్రైవ భ్రాంత్యా విష్ణుగయేతి చ పదద్వయో ర్థర్థ విజ్ఞానాభావాన్మగధ దేశైకదేశే పాషాణస్యోపరి శిల్పి ద్వారా మనుష్యపాదచిహ్నం కారయిత్వా తస్యైవ కైశ్చిత్ స్వార్థసాధన తత్పరై రుదరంభరై ర్విష్ణు పదమితి నామరక్షితమ్. తస్య స్థలస్య గయేతి చ, తద్ వ్యర్థమేవ. కుతః ? విష్ణుపదం మోక్షస్య నామాస్తి. ప్రాణగృహ ప్రజానాం చ అతోఽత్రేయం తేషాం భ్రాంతిర్ జాతేతి బోధ్యమ్. అత్ర ప్రమాణమ్.

"ఇదం విష్ణుర్ విచక్రమే త్రేధా నిదధే పదమ్, సమూఢమస్య పాగ్ంసురే స్వాహా" ౧

యజు. ౫-౧౫

యదిదం కించ తద్విక్రమతే విష్ణు స్త్రిధా నిధత్తే పదమ్. త్రేధా భావాయ పృథివ్యా మంతరిక్షే, ఏతి శాకపూణిః, సమారోహణే విష్ణుపదే గయశిరసీ త్యౌర్ణవాభః. సమూఢమస్య పాంసుల ఇవ పదం న దృశ్యత ఇతి. పాంసవః పాదైః సూయంత ఇతి వా, పన్నాః శేరత ఇతి వా, పంసనీయా భవంతీతి వా.

నిరు. ౧౨-౧౯

అస్యార్థం యథావ దవిదిత్వా భ్రమేణేయం కథా ప్రచారితా. తద్యథా—విష్ణుర్ వ్యాపకః పరమేశ్వరః సర్వజగత్కర్తా తస్య పూషేతి నామ. అత్రాహ నిరుక్తకారః :–

పూషేత్యథ యద్విషితో భవతి తద్విష్ణుర్ భవతి. విష్ణుర్ విశతేర్ వా వ్యశ్నోతేర్ వా. తస్యైషా భవతి – 'ఇదం విష్ణురిత్యృక్' నిరు. ౧౨-౧౮-౧౯

వేవేష్టి విశితః ప్రవిష్టోఽస్తి, చరాచరం జగత్ వ్యశ్నుతే వ్యాప్నోతి వా స విష్ణుర్ నిరాకారత్వాత్ సర్వగత ఈశ్వరోఽస్తి. ఏతదర్థవాచికేయమృక్.

ఇదం సకలం జగత్ త్రేధా త్రిప్రకారకం విచక్రమే విక్రాంతవాన్. క్రముపాదవిక్షేపే. పాదైః ప్రకృతి పరమాణ్వాదిభిః స్వసామర్థ్యాంశైర్ జగదిదం పదం ప్రాప్తవ్యం సర్వం వస్తుజాతం త్రిషు స్థానేషు (నిధత్తే) నిదధే స్థాపితవాన్. అర్థాత్ యావద్ గురుత్వాదియుక్తం ప్రకాశరహితం తత్సర్వం జగత్ పృథివ్యామ్. యల్లఘుత్వాదియుక్తం వాయుపరమాణ్వాదికం తత్సర్వ మంతరిక్షే, యత్ చ ప్రకాశమయం సూర్యజ్ఞానేంద్రియ జీవాదికం చ తత్సర్వం దివి ద్యోతనాత్మకే ప్రకాశమయేఽగ్నౌ వేతి విజ్ఞేయమ్. ఏవం త్రివిధం జగత్ ఈశ్వరేణ రచితమ్. ఏషాం మధ్యే యత్సమూఢం మోహేన సహవర్తమానం జ్ఞానవర్జితం జడం, తత్ పాంసురేఽంతరిక్షే పరమాణుమయం రచితవాన్ సర్వే లోకా అంతరిక్షస్థాః సంతీతి బోధ్యమ్. తదిదమస్య పరమేశ్వరస్య ధన్యవాదార్హం స్తోతవ్యం కర్మాస్తీతి బోధ్యమ్.

అయమేవార్థః (యదిదం కించ) ఇత్యనేన యాస్కాచార్యేణ వర్ణితః. యదిదం కించిజ్జగద్ వర్తతే, తత్ సర్వం విష్ణుర్ వ్యాపక ఈశ్వరో విక్రమతే రచితవాన్. (త్రిధా నిధత్తే పదం) త్రేధాభావాయ, త్రిప్రకారకస్య జగతో భవనాయ; తదుక్తం పూర్వమేవ, తస్మిన్ (విష్ణుపదే) మోక్షాఖ్యే (సమారోహణే) సమారోఢు మర్హే (గయశిరసీతి) ప్రాణానాం ప్రజానాం చ యదుత్తమాంగం ప్రకృత్యాత్మకం శిరో యథా

భవతి, తథైవేశ్వరస్యాపి సామర్థ్యం గయశిరః, ప్రజా ప్రాణయో రుపరిభాగే వర్తతే. యదీశ్వరస్యానంతం సామర్థ్యం వర్తతే, తస్మిన్ గయశిరసి విష్ణుపదే హీశ్వర సామర్థ్యేఽస్తీతి.

కుతః ? వ్యాప్యస్య సర్వస్య జగతో వ్యాపకే పరమేశ్వరే వర్తమానత్వాత్. పాంసురే ప్యాయనేఽంతరిక్షే పదం పదనీయం పరమాణ్వాఖ్యం యజ్జగత్ తచ్చక్షుషా న దృశ్యతే. యే చ పాంసవః పరమాణు సంఘాతాః పాదై ష్ద్రవ్యాంశైః సూయంత ఉత్పద్యంతే. అత ఏవ ముత్పన్నాః సర్వే పదార్థాః దృశ్యా భూత్వేశ్వరే శేరత ఇతి విజ్ఞాయతే.

ఇమమర్థ మవిజ్ఞాయ మిథ్యాకథావ్యవహారః పండితాభాసైః ప్రచారిత ఇతి బోద్ధవ్యమ్.

తథైవ వేదాద్యుక్తరీత్యాఽఽర్యైశ్చానుష్ఠితాని తీర్థాన్యన్యాన్యేవసంతి. యాని సర్వదుఃఖేభ్యః పృథక్ కృత్వా జీవేభ్యః సర్వసుఖాని ప్రాపయంతి, తాని తీర్థాని మతాని. యాని చ భ్రాంతైఃరచితపుస్తకేషు జలస్థలమయాని తీర్థ సంజ్ఞాన్యుక్తాని, తాని వేదార్థాభిప్రేతాని నైవసంతీతి మంతవ్యమ్. తద్యథా :

తీర్థమేవ (ప్రాయణీయో) యత్ప్రాయణీయ యజ్ఞస్యాంగ మతిరాత్రాఖ్యం వ్రతం సమాప్య స్నానం క్రియతే తదేవ తీర్థమితి వేద్యమ్. యేన తీర్థేన మనుష్యాః ప్రస్నాయ శుద్ధా భవన్తి. తథైవ యదుదయ నీయాఖ్యం యజ్ఞసంబంధి సర్వోపకారకం కర్మ సమాప్య స్నాంతి, తదేవ దుఃఖసముద్రా త్తారకత్వాత్ తీర్థమితి మంతవ్యమ్.

ఏవమేవ (అహింసన్) మనుష్యః సర్వాణి భూతాన్యహింసన్, సర్వైర్ భూతైర్ వైర మకుర్వాణః సన్వర్తేత, పరంతు తీర్థేభ్యో వేదాది సత్య శాస్త్ర విహితేభ్యోఽన్యత్రాహింసా ధర్మో మంతవ్యః. తద్యథా– యత్ర యత్ర అపరాధినా ముపరి హింసనం విహితం, తత్తు కర్తవ్యమేవ, యే పాఖండినో వేదసత్యధర్మానుష్ఠాన శత్రవ శ్చోరాదయశ్చ, తే తు యథాపరాధం హింస నీయా ఏవ. అత్ర వేదాది సత్యశాస్త్రాణాం తీర్థసంజ్ఞాఽస్తి. తేషామధ్యయ నాధ్యాపనేన, తదుక్త ధర్మకర్మానుష్ఠానేన చ దుఃఖ సముద్రాత్తరంత్యేవ. తేషు సమ్యక్ స్నాత్వా మనుష్యాః శుద్ధా భవంత్యతః.

తథైవ సమానతీర్థే వాసీత్యనేన సమానో ద్వయోర్ విద్యార్థినో రేక ఆచార్యః, సమాన మేకశాస్త్రాధ్యయనం చ; అత్రాచార్య శాస్త్రయో స్తీర్థసంజ్ఞాఽస్తి. మాతాపిత్రతిథీనాం సమ్యక్ సేవనేన సుశిక్షయా విద్యాప్రాప్త్యా దుఃఖసముద్రా న్మనుష్యా స్తరంత్యేవ; అత స్తాని తీర్థాని దుఃఖాత్తారకత్వాదేవ మంతవ్యాని. ఏతేష్వపి స్నాత్వా మనుష్యైః శుద్ధిః సంపాదనీయేతి.

(త్రయఃస్నా) త్రయ ఏవ తీర్థేషు కృతస్నానాః శుద్ధా భవంతి. తద్యథా; యః సునియమేన పూర్ణాం విద్యాం పఠతి, స బ్రహ్మచర్యాశ్రమ మసమాప్యాపి విద్యాతీర్థే స్నాతి, స శుద్ధో భవతి. యస్తు ఖలు ద్వితీయః, యత్ పూర్వోక్తం బ్రహ్మచర్యం సునియమాచరణేన సమాప్య, విద్యామసమాప్య సమావర్తతే, స వ్రతస్నాతకో భవతి. యశ్చ సునియమేన బ్రహ్మచర్యాశ్రమం సమాప్య వేదశాస్త్రాదివిద్యాం చ సమాప్య సమావర్తతే సోఽప్యస్మి న్నుత్తమతీర్థే సమ్యక్స్నాత్వా యథావ చ్ఛుద్ధాత్మా, శుద్ధాంతఃకరణః సత్యధర్మాచారీ, పరమవిద్వాన్ సర్వోపకారకో భవతీతి విజ్ఞాతవ్యమ్.

(నమస్తీర్థ్యాయ చ) తేషు ప్రాణవేద విజ్ఞాన తీర్థేషు పూర్వోక్తేషు భవః, సః తీర్థ్యః, తస్మై తీర్థ్యాయ పరమేశ్వరాయ నమోఽస్తు, యే విద్వాంస స్తీర్థాని వేదాధ్యయన సత్యభాషణాదీని పూర్వోక్తాని ప్రచరంతి వ్యవహరంతి, యే చ పూర్వోక్త బ్రహ్మచర్య సేవినో రుద్రా మహాబలాః (సృకాహస్తాః) విద్యావిజ్ఞానే హస్తా

యేషాం తే, (నిషంగిణః) నిషంగః సంశయచ్ఛేదక ఉపదేశాఖ్యః ఖడ్గో యేషాం తే సత్యోపదేష్టారః. "తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామీ" తి బ్రాహ్మణవాక్యాత్ ఉపనిషత్ప్రభవం ప్రతిపాద్యం విజ్ఞాపనీయం పరమేశ్వర మాహుః. అత ఏవోక్తస్తీర్థ్య ఇతి. సర్వేషాం తారకాణాం తీర్థానామాత్మకత్వాత్ పరమతీర్థాఖ్యో, ధర్మాత్మనాం స్వభక్తానాం సద్య స్తారకత్వాత్ పరమేశ్వర ఏవాస్తి. ఏతైనైతాని తీర్థాని వ్యాఖ్యాతాని.

పూ. ప : యై స్తరంతి నరా స్తాని జలస్థలాదీని తీర్థాని కుతో న భవంతి ?

ఉ. ప : అత్రోచ్యతే. నైవ జలం స్థలం చ తారకం కదాచిద్ భవితు మర్హతి, తత్ర సామర్థ్యాభావాత్, కరణ కారక వ్యుత్పత్త్యభావాచ్చ. జలస్థలాదీని నౌకాదిభిర్ యానైః, పద్భ్యాం, బాహుభ్యాం చ జనా స్తరంతి.. తాని చ కర్మకారకాన్వితాని భవంతి; కరణకారకాన్వితాని తు నౌకాదీని. యది పద్భ్యాం గమనం బాహుబలం న కుర్యాన్న చ నౌకాదిషు తిష్ఠేత్, తర్హ్యవశ్యం తత్ర మనుష్యో మజ్జే న్మహద్దుఃఖం చ ప్రాప్నుయాత్. తస్మాద్ వేదానుయాయినా మార్యాణాం మతే కాశీ ప్రయాగ పుష్కర గంగా యమునాది నదీనాం సాగరాణాం చ నైవ తీర్థ సంజ్ఞా సిద్ధ్యతి. కింతు వేదవిజ్ఞాన రహితై రుదరంభరైః సంప్రదాయస్థైర్ జీవికార్థిభిర్ వేదమార్గవిరోధిభి రల్పజ్ఞైర్ జీవికార్థం స్వకీయ రచితగ్రంథేషు తీర్థసంజ్ఞయా ప్రసిద్ధీకృతాని సంతీతి.

పూ. ప : నను, 'ఇమం మే గంగే యమునే సరస్వతీ' తి గంగాది నదీనాం వేదేషు ప్రతిపాదనం కృతమస్తి; త్వయా కథం న మన్యతే ?'

ఉ. ప : అత్రోచ్యతే, మన్యతే తు మయా తాసాం నదీ సంజ్ఞేతి; తా గంగాదయో నద్యః సంతి. తాభ్యో యథాయోగ్యం జలశుద్ధ్యాది గుణైర్ యావానుపకారో భవతి, తావత్తాసాం మాన్యం కరోమి, న చ పాపనాశకత్వం దుఃఖాత్తారకత్వం చ.

కుతః ? జల స్థలాదీనాం తత్ సామర్థ్యాభావాత్. ఇదం సామర్థ్యం తు పూర్వోక్తే ష్వేవ తీర్థేషు గమ్యతే నాన్యత్రేతి. అన్యచ్చ - ఇడా పింగలా సుషుమ్నా కూర్మనాడ్యాదీనాం గంగాది సంజ్ఞాఽస్తీతి. తాసాం యోగ సమాధౌ పరమేశ్వరస్య గ్రహణాత్. తస్య ధ్యానం దుఃఖనాశకం ముక్తిప్రదం చ భవత్యేవ. తాసా మిడాదీనాం ధారణాసిద్ధ్యర్థం చిత్తస్య స్థిరీకరణార్థం స్వీకరణ మస్తీతి తత్ర గ్రహణాత్. ఏతన్మంత్ర ప్రకరణే పరమేశ్వరస్యానువర్తనాత్, ఏవమేవ, (సితాసితే యత్ర సంగథే తత్రాప్లుతాసో దివ ముత్పతంతి) ఏతేన పరిశిష్టవచనేన కేచిద్ గంగా యమునయోర్ గ్రహణం కుర్వంతి. 'సంగథే' ఇతి పదేన గంగాయమునయోః సంయోగస్య ప్రయాగతీర్థమితి సంజ్ఞాం కుర్వంతి. తన్న సంగచ్ఛతే.

పూ. ప : కుతః ?

ఉ. ప : నైవ తత్రాప్లుత్య స్నానం కృత్వా దివం ద్యోతనాత్మకం పరమేశ్వరం సూర్యలోకం వోత్పతంతి గచ్ఛంతి, కింతు పునః స్వకీయం గృహమాగచ్ఛంత్యతః. అత్రాపి సితశబ్దేనేడాయాః అసితశబ్దేన పింగలాయాశ్చ గ్రహణమ్. యత్ర తు ఖల్వేతయోర్ నాడ్యోః సుషుమ్నాయాం సమాగమో మేలనం భవతి. తత్ర కృతస్నానాః పరమయోగినో, దివం పరమేశ్వరం ప్రకాశమయం మోక్షాఖ్యం సత్యవిజ్ఞానం చో త్పతంతి - సమ్యగ్గచ్ఛంతి ప్రాప్నువంతి. అతోఽనయోరేవాత్ర గ్రహణం, న చ తయోః. అత్ర ప్రమాణమ్.

"సితా సితమితి వర్ణనామ, తత్ప్రతిషేధోఽసితమ్" ని. ౯-౨౬

సితం శుక్లవర్ణ మసితం తస్య నిషేధః, తయోః ప్రకాశాంధ కారయోః సూర్యాది పృథివ్యాది పదార్థయోర్ యత్రేశ్వర సామర్థ్యే సమాగమోఽస్తి తత్ర కృతస్నానా స్తద్విజ్ఞానవంతో దివం పూర్వోక్తం గచ్ఛంత్యేవ.

తె॥ ఈ యాఱవకథ గయాతీర్థమునకు చెందినది. మగధ ప్రాంతమున ప్రవహించు ఫల్గునదీ తీరమున గల యొక రాతిమీద మనుష్యుని పదచిహ్న మొకటి నిర్మించి దానికి విష్ణుపాదమని పేరుపెట్టి, యెవరో కొందఱు 'ఆ స్థలమున శ్రాద్ధము పెట్టిన వారి పితరులు ముక్తిబొందుదు' రని ప్రసిద్ధిజేసిరి. మూర్ఖులైన శ్రీమంతులిట్టి మాటలు విశ్వసించి యక్కడికివెళ్ళి యక్కడనున్న వారి చేతులలోజిక్కి డబ్బు వ్యర్థముగా వ్యయించి, తిరిగి వచ్చుచుందురు. ఇట్లు పరుల ధనమును హరించి పొట్టనింపుకొనువారి లీలలన్నియు నసత్యములనుట నిశ్చితము. సత్యశాస్త్రములందుగల యథార్థము తెలిసినపుడిది ప్రకటమగును.

(ప్రాణో వై బలం) గయ యను పేరుగల ప్రాణాదులందు మిక్కిలి శ్రద్ధతో పరమేశ్వరు నుపాసించువారికి ముక్తి కలుగును. ప్రాణమునందు బలము, సత్యము ప్రతిష్ఠితములై యున్నవి. పరమేశ్వరుడు ప్రాణములకును ప్రాణము. అతనిని ప్రతిపాదించునది – తెలుపునది – గాయత్రీమంత్రము. దానికే 'గయ' యని పేరు. గాయత్రీ మంత్రార్థము నెఱింగి శ్రద్ధతో పరమేశ్వరుని భజించుటవలన సర్వదుఃఖముల నుండి విడివడి మనుజుడు ముక్తుడగును. 'గయ' ప్రాణమునకు పేరు. ప్రాణాయామ రీతితో నా ప్రాణమును (గయను) నిరోధించి పరమేశ్వరునందుగల భక్తి ప్రభావముతో పితరులు – జ్ఞానులు – ముక్తులగుదురు. దుఃఖములనుండి విడివడుదురు. పరమేశ్వరుడు ప్రాణములను రక్షించువాడు. కావున నీశ్వరుని నామము 'గాయత్రీ' ఆ గాయత్రీనామము 'గయ' – గృహము, సంతానము, ప్రజయను నీమూటికిని నామము. 'గయా' గయ యనినిఘంటువున జూడనగును. వీనియందు మనుజులు శ్రద్ధ వహింపవలెను. ఇట్లే, మాత, పిత, ఆచార్యుడు, అతిథి యనువారి సేవ, సర్వోపకారము, ఉన్నతికారకములగు పనులలో జూపు శ్రద్ధ యంతయు గయాశ్రాద్ధ మనబడును. స్వ సంతానమునకు మంచి శిక్షణ నొసంగుట, వారి నత్యంత ప్రీతితో బోషించుటయు గయాశ్రాద్ధమగును. ధర్మముతో ప్రజను పాలించుట, సుఖమును వృద్ధిచేయుట, విద్యాప్రచారము, శ్రేష్ఠపురుషులను రక్షించుట, దుష్టులను దండించుట, సత్యోన్నతి, మున్నగు ధర్మకార్యముల నాచరించుట ఇవి యన్నియు కలిసి కాని, యొక్కటొక్కటి కాని గయా శ్రాద్ధ మనబడును.

ఇట్టి యుత్తమ కథను విడిచి, విద్యాహీనులైనవారు అసత్యములగు కథల నల్లినారు. వాని నెన్నడు నమ్మరాదు. రాతిమీద మనుజుని పాదము నొకదాని జెక్కి – నిర్మించి, యది విష్ణుపదమని చెప్పుట బూటకము. కారణమేమన :

పరమేశ్వరుడు జగదుత్పాదకుడు; అతడు వ్యాపకుడగుటచే 'విష్ణు' వనబడును. మోక్షమునకు 'విష్ణుపదమ' ని పేరు. నిరుక్తకారుడేమనుచున్నాడో చూడుడు.

(పూ్షేత్యథ) 'విష్ణ' ధాతువున కర్థము వ్యాపకము. చరాచరమగు జగత్తు నందంతటను ప్రవేశించి, జగత్తును తనలో నుంచుకొను వాడు విష్ణువనబడును. అతడు నిరాకారుడు.

(క్రము పాద విక్షేపే) ఈ 'క్రము' ధాతు వితర వస్తువులను పాదము క్రింద నణచియుంచుటనుకాని, స్థాపించుటనుకాని తెలుపును. కావున భగవంతుడు – విష్ణువు – తనపాదము – ప్రకృతి పరమాణ్వాది సామర్థ్యాంశములతో సమస్త జగత్తును మూడు స్థానములందు స్థాపించి ధరించియున్నాడు. ప్రకాశములేని భారముతోగూడిన పదార్థములను భూమియందును, వాయువు, పరమాణవులు మున్నగు సూక్ష్మపదార్థముల

నంతరిక్షము నందును, ప్రకాశమానములగు సూర్యుడు, జ్ఞానేంద్రియములు, జీవులు మున్నగు పదార్థములను ద్యులోకమున - ప్రకాశమున - గాని, అగ్నియందుకాని యిట్లు ముప్పిధముల జగత్తును పరమేశ్వరుడు రచించియున్నాడు. ఈ మూడింటి యందును జ్ఞానరహితమగు జడ ప్రపంచము అంతరిక్షమున నున్నది. ఇట్టి యద్భుత పదార్థములను రచియించి, ధరించియుండుట పరమేశ్వరునకే చెల్లును.

(యదిదం కించ) ఈ విష్ణుపదమునుగూర్చి యాస్కమునియు నిట్లు వర్ణించియున్నాడు. సర్వ వ్యాపకుడగు పరమేశ్వరు డీజగత్తును రచియించి (త్రిధా) యిందు ముప్పిధములైన రచనను గనబఱచి యున్నాడు. మోక్షపదమును బొందుటకు సమారోహణమని పేరు. ఆ విష్ణుపదము - మోక్షము గయ శిరస్సు - ప్రాణమునకు, ప్రజకు పరమున (పై భాగము) నున్నది. మనుష్యులు ప్రాణములందు స్థిరులై దానిని బొందుదురు. ప్రాణము కంటె ప్రియుడగు పరమేశ్వరుని బొందుదురు. మఱియొక మార్గము లేదు.

కారణమేమన : వ్యాపకుడగు పరమేశ్వరుడు వ్యాప్యమైన జగత్తునందంతటను నున్నాడు. పరమేశ్వరుడు ప్రాణములకు ప్రాణము - జీవుల యందును వ్యాప్తుడై యున్నాడు. కావున నతనికి జీవులుకాని, జీవుల కతడుకాని దూరము కాజాలరు. జగత్తున కతి సూక్ష్మభాగము చక్షువునకు గోచరముకాదు. పరమాణువులు సంయుక్తములై స్థూలపదార్థముగ నేర్పడినపు డది యింద్రియ గోచరమగును. ఇట్టి సూక్ష్మస్థూల జగత్తెవనిలో నుండునో, ఎవడీ జగత్తునందంతట పూర్ణుడై యున్నాడో యట్టి పరమేశ్వరుడే విష్ణుపద మనబడును.

ఇట్టి యథార్థమును గ్రహింపక యవిద్వాంసులు రాతిమీద మనుష్యుని పదచిహ్నము నొక దానిని చెక్కి, దానికి విష్ణుపదమని పేరు పెట్టినారు. కావున నిదియంతయు నసత్యము - మిథ్య.

అట్లే తీర్థశబ్దార్థమును సైతము చెడగొట్టి యజ్ఞానులు, స్వార్థపరులు లోకుల సొత్తును హరించి స్వప్రయోజనమును నెఱవేర్చుటకు మిథ్యాచారములను సంఘమున బ్రవేశపెట్టి యున్నారు. అదియును తగదు.

జీవులు దుఃఖసముద్రమును తరించి సుఖమును బొందుటకు దోడ్పడునది తీర్థమనబడును. అట్టి తీర్థములు వేదాది సత్యశాస్త్రములందు ప్రతిపాదింపబడియున్నవి. ఆర్యులు వానినే యనుష్ఠానమునందుంచిరి. వాస్తవమున జీవులను దుఃఖములనుండి విడిపించి, వారికి సుఖము లొడగూర్పగల సాధనములే తీర్థము లనబడును. వేదోక్త తీర్థము లియ్యవియే.

(తీర్థమేవ ప్రాయ) అగ్నిహోత్రము మొదలు అశ్వమేధము వఱకుగల యనేకవిధ యజ్ఞములలో నొక యజ్ఞమును నిర్వర్తించి తదుపరి చేయు స్నానము తీర్థమనబడునని శతపథ బ్రాహ్మణమున వ్రాయబడినది.

ఆ యజ్ఞకర్మ నొనరించినందున వాయువు, వృష్టిజలము పవిత్రములై మానవులకు, ప్రాణులకు సుఖములు లభించును. ఆ కర్మల నొనరించు వారికిని సుఖముశుద్ధియు లభించును.

(అహింసన్) మనుజులు తమ వైరభావమును మనస్సునుండి తొలగించి యెల్లరకు సుఖమును చేకూర్ప ప్రవర్తింపవలెను. సాంసారిక వ్యవహార నిర్వహణమున దుఃఖము కలుగకుండునట్లు ప్రవర్తింప వలెను. ఇదియే తీర్థము - దీనిని సేవింపవలయునని ఛాందోగ్యమున (౮-౧౫-౧) వ్రాయబడినది. (అన్యత్ర తీర్థేభ్యః) కాని, వేదాది శాస్త్రములందు నిషేధింపబడిన కర్మముల నొనర్చువారు దండనకు పాత్రులుకాక

తప్పదు. అపరాధులు, పాషండులు, వేదశాస్త్రములందు జెప్పబడిన ధర్మముల ననుష్ఠింపక యందులకు విరుద్ధముగ స్వ సుఖమునకు పరులను బీడించువారెల్లప్పుడు దండనకు పాత్రులగుదురు. కావున వేదాది సత్యశాస్త్రములు తీర్థము లనబడును. వానిని చదువుటవలనను, జదివించుట వలనను మనుష్యులు వాని యందు జెప్పబడిన ధర్మమార్గములందు నడచుకొని, దుఃఖసాగరమును తరించి సుఖముల బడయుదురు.

(సమానతీర్థే) ఈ పాణిని సూత్రార్థమునుబట్టి చూచిన వేదాది సత్యశాస్త్రములను జదివింపజేయు నాచార్యుడు, వేదాది సత్యశాస్త్రములు, తల్లి, తండ్రి, అతిథి యనువారికి తీర్థనామమున్నట్లు తెలియుచున్నది. వారిని సేవించినందున జీవుడు శుద్ధుడై దుఃఖములనుండి తరించును. కావున వీరు తీర్థములగుట సత్యము.

(త్రయః స్నాతకాః) పారస్కరగృహ్య సూత్రమున నిట్లున్నది. ఈ తీర్థములందు స్నానము చేయదగిన పురుషులు ముప్పురు !

౧. ఉత్తమ నియమములతో వేదాదివిద్యలను నేర్చి బ్రహ్మచర్యమును పూర్తిచేయకయే విద్యాభ్యాసము పూర్తిచేసి, జ్ఞానరూపతీర్థమున స్నానమాచరించి శుద్ధుడైనవాడు - మొదటివాడు.

౨. ఇరువది యైదేండ్లు కాని, ౩౦-౩౬, ౪౪, ౪౮ సంవత్సరములు కాని నియమ పూర్వకముగ బ్రహ్మచర్యమును బాలించి, విద్యను పూర్తిచేయకయే వివాహమాడు వ్రతస్నాతకుడు బ్రహ్మచర్య తీర్థమున స్నానముచేసి శుద్ధుడగును - ఇతడు రెండవవాడు.

౩. నియమపూర్వకముగ బ్రహ్మచర్యమును, వేదాది సత్యశాస్త్రాధ్యయనమును పూర్తిచేసి సమావర్తన మొనర్చువాడు మూడవవాడు. ఇతడుత్తమ తీర్థమున స్నానమాచరించిన వాడగును. ఇతని దేహము, అంతఃకరణము పవిత్రములగును. శ్రేష్ఠమగు విద్య, బలము పొంది పరోపకారము చేయును.

(నమస్తీర్థ్యాయ) శుక్ల యజుర్వేదమున నిట్లు చెప్పబడినది. 'ప్రాణము, వేదము, విజ్ఞానము నను తీర్థముల ద్వారమున ప్రాప్తించు పరమేశ్వరుడును తీర్థమనబడును. అట్టి తీర్థమునకు నమస్కారము.' వేదముల నభ్యసించి పరుల కభ్యాసము చేయించుచు, సత్యకథనమనెడి తీర్థములను ప్రచారమొనర్చుచు, నలువదినాలుగు సంవత్సరముల పర్యంతము బ్రహ్మచర్యమును బాగుగ పాలించువారు మిక్కిలి బలవంతులై రుద్రులనబడుదురు. (సృకాహస్తా) సృకా - విజ్ఞానమనెడి హస్తము, నిషంగ-సంశయమును ఛేదించు ఉపదేశమనెడి ఖడ్గముగల సత్యోపదేశకుడును రుద్రుడనబడును. అట్లే యుపనిషత్తులందు వర్ణింపబడి నట్టియు, ఉపదేశింప దగినట్టియు పరమేశ్వరుడు పరమతీర్థ మనబడును. అతని యనుగ్రహము, అతని సాక్షాత్కారమువలననే జీవుడు సమస్త దుఃఖములనుండి తరించును. ఇట్లు సత్యశాస్త్రములందు తీర్థములు వ్యాఖ్యానింపబడినవి.

పూ. ప : జల స్థల విశేషములు తీర్థములు కావా?

ఉ. ప : కావు. వానిలో తరింపజేయు సామర్థ్యము లేదు. తీర్థశబ్దము కరణకారక యుక్తము గ్రహింపబడును. దేనిచేత తరింతుమో యది తీర్థమగును. జలముకాని, స్థానవిశేషముకాని యధికరణమో, లేక కర్మకారకమో యగును. జలమునందు నావతోను, స్థలమునందు పాదములు మున్నగు వానితోను తరింతుము. కావున జలముకాని, స్థలముకాని తరింపజేయవు. జలమునందు దిగి హస్తపాదములనో, నౌకాదులనో యుపయోగింపకున్న నందు మునిగిపోదురేకాని, యెవరును తరింపరు. నీరు ముంచునదియే కాని, తరింపజేయదు. దీనిం బట్టి కాశీ ప్రయాగాదులుకాని, గంగాయమునాది నదులుకాని, సముద్రముకాని

తీర్థము లనబడవు. సత్యశాస్త్రములందు వర్ణింపబడినవే తీర్థములగును; కాని, ఇతర జల స్థల విశేషము లెన్నడు తీర్థములు కావు.

పూ. ప : (ఇమం మే గంగె యమునే) అను నీ మంత్రము గంగా యమునా నదులను తీర్థములని విధించుచుండ మీరేల యంగీకరింపరు ?

ఉ. ప : గంగా యమునలు నదులని యంగీకరింతుము. వాని జలమున నుండు గుణములనుగూడ మే మంగీకరింతుము. కాని, యీ నదులకు గాని, జలములకుగాని జీవులను పాపములనుండి విడిపించుటకును, దుఃఖములనుండి తరింపజేయుటకును సామర్థ్యముండదు. అట్టి సామర్థ్యము పూర్వోక్త తీర్థములకే కలదు. ఈ మంత్రమునందలి గంగా యమునాది పదములు ఇడ, పింగల, సుషుమ్న యను నదులకు పేరులు. వానియందు యోగాభ్యాసము ద్వారమున యోగులు పరమేశ్వరునుపాసించి దుఃఖములనుండి తరింతురు. నాడుల మూలముననే యుపాసనధారణ చేయబడును. కావున నీ మంత్రమునం దానాడులు లెక్కింప బడినవి. ఆ నామములచే నాడులు గ్రహింపవలెను. కాని, గంగా, యమునా నదులు కావు. ప్రకరణమును బట్టి యీ మంత్రమునందు పరమేశ్వరు డనువర్తించును. (సితాసితే) అను నీ పరిశిష్ట వచనము వలన కొందఱు గంగాయమునలు నదులుగా గ్రహింతురు. 'సంగథే' అను పదమునకు గంగా యమునల సంగమస్థానము ప్రయాగ తీర్థమనియు జెప్పుదురు. కాని యది సరికాదు. కారణమేమన :– ఆ సంగమ స్థానమున స్నానమొనర్చి ప్రకాశ స్వరూపుడగు పరమేశ్వరుని గాని, సూర్యలోకమునుగాని పొందరు. పైపెచ్చు తిరిగి తమ తమ యిండ్లకే పోదురు. కావున సిత శబ్దముచే 'ఇడా' నాడియు, అసిత శబ్దముచే 'పింగళా' నాడియు గ్రహింపనగును. ఈ రెండు నాడులు కలియు స్థానమున (సుషుమ్న) నాడియుండును. ఈ నాడియందు యోగి యోగాభ్యాసముతో స్నానమాడి శుద్ధుగడును. శుద్ధస్వరూపుడగు పరమేశ్వరుని బొంది సదానందుడగును. ఈ విషయమున నిరుక్తము ప్రమాణము.

సితాసిత శబ్దములు శుక్ల కృష్ణవర్ణ వాచకములు. ప్రకాశము గల సూర్యాది పదార్థములు, ప్రకాశ రహితములయిన పృథివ్యాది పదార్థములు నీశ్వరుని సామర్థ్యమున నెట కలియునో యట స్నాన మొనరించి ఆ పదార్థముల విజ్ఞానము బాగుగ సంపాదించి జనులు పరమేశ్వరుని బొందుదురు. మంత్రార్థముల నిట్లు బాగుగ గ్రహింపక మిథ్యార్థములను కల్పించి జల స్థలాదులను తీర్థములని వర్ణించినారు.

*సం॥ తథైవ యత్తంత్ర పురాణాది గ్రంథేషు మూర్తి పూజా నామస్మరణాది విధానం కృతమస్తి, తదపి మిథ్యైవాస్తీతి వేద్యమ్.*

*కుతః ? వేదాదిషు సత్యేషు గ్రంథేషు తస్య విధానాభావాత్. తత్ర తు ప్రత్యుత నిషేధో వరివర్తతే. తద్యథా.*

*"న తస్య ప్రతిమా అస్తి యస్య నామ మహద్యశః. హిరణ్యగర్భ ఇత్యేష మా మా హింసీదిత్యేషా యస్మాన్న జాత ఇత్యేషః, ౧ యజు. ౩౨–౩*

*యస్య పూర్ణస్య పురుషస్యాజస్య నిరాకారస్య పరమేశ్వరస్య, (మహద్యశః) యస్యాజ్ఞాపాలనాఖ్యం మహాకీర్తికరం ధర్మ్యం సత్యభాషణాదికర్తు మర్హం కర్మాచరణం నామస్మరణమస్తి– (హిరణ్యగర్భః) యో హిరణ్యానాం సూర్యాదీనాం తేజస్వినాం గర్భ ఉత్పత్తి స్థానమ్. యస్య సర్వైర్ మనుష్యైర్ మా మా హింసీదిత్యేషా ప్రార్థనా కార్యా. (యస్మాన్న) యో యతః కారణాన్నైవైషః కస్యచిత్ సకాశాత్ కదాచి*

దుత్పన్నో, నైవ కదాచిచ్ఛరీర ధారణం కరోతి. నైవ తస్య ప్రతిమా, అర్థాత్ ప్రతినిధిః, ప్రతికృతిః, ప్రతిమానం, తోలనసాధనం, పరిమాణం, మూర్త్యాదికల్పనం కించి దప్యస్తి; పరమేశ్వరస్యానుపమేయత్వాద మూర్తత్వా దపరిమేయత్వా న్నిరాకారత్వాత్ సర్వత్రాభివ్యాప్తత్వాచ్చ. ఇత్యనేన ప్రమాణేన మూర్తిపూజన నిషేధః.

తె॥ తంత్రగ్రంథములు, పురాణములు ననెడి పేరుతో గ్రంథములు క్రొత్తవి యెన్నియో కల్పింపబడినవి. వానియందు విగ్రహారాధన, నానావిధములగువారు, కృష్ణాది నామముల స్మరణము, కాష్ఠాది నిర్మితమాలలను ధరించుట, ఫాలభాగమునను, ఇతరాంగముల మీదను తిలకములను దిద్దుట మున్నగునవి మోక్షసాధనములుగ విధింపబడినవి. ఇవి యన్నియు నసత్యము లనియే యెంచవలెను.

కారణమేమన వేదాది సత్యశాస్త్రములం దివి యెక్కడను పేరునకైనను గనిపింపవు. ఇట్టి వాని నిషేధమే చూడనగును. ఉదాహరణము :

(న సత్య) పూర్ణుడు - ఏ కొలంతయులేనివాడు - (అజ) జన్మరహితుడు, (నిరాకార) ఏ విధమైన యాకారము - మూర్తి - లేనివాడే పరమేశ్వరుడు. (మహద్యశః) అతని యాజ్ఞను పాలించుటయు, నుత్తమ కీర్తికి హేతువులైన సత్యభాషణాది కర్మముల నొనరించుటయును నామస్మరణ మనబడును. (హిరణ్యగర్భ) తేజోవంతములగు సూర్యాది లోకములు గర్భమునందు కలవాడు - వానియుత్పత్తికి కారణము. అతని నిట్లు ప్రార్థింపవలెను. ఓ పరమేశ్వర! (మామా హిగ్ంసీః) మమ్ములను సర్వవిధముల రక్షింపుము. ఈ నిరాకారుడు సర్వవ్యాపకుడు నగు పరమేశ్వరునేల యుపాసింపవలెను ? అని యెవరేని ప్రశ్నించిన సమాధానమిది.

(యస్మాన్న) పరమేశ్వరుడు మాతాపితరుల వలన జన్మించిన వాడుకాడు. అతని కుత్పత్తి - జన్మములేదు. పూర్వమెన్నడు జన్మించిన వాడుకాడు - ముందును జన్మింపడు. అతడెన్నడును శరీరమును ధరించి, బాల్య, యౌవన జరాద్యవస్థలకు లోనుగాడు. (న తస్య) ఆ పరమేశ్వరునకు ప్రతిమ - కొలత సాధనము కాని ప్రతిబింబముకాని సదృశ చిత్రము కాని యుండదు. అతడు మూర్తి రహితుడు. అనంతుడు. హద్దులు లేనివాడు. అన్నింటను వ్యాపకుడు. కావున పరమేశ్వరుని నిరాకారుడనియే యుపాసింపవలెను. శరీర ధారుడని యుపాసించిన దోషమేమియని యెవరేని ప్రశ్నించిన సమాధానమిట్లు చెప్పవలెను. పరమేశ్వరుడు జన్మించి శరీరధారియగునెడల నతడు వృద్ధుడై యొకనాడు చనిపోవును. అప్పుడెవరి నుపాసింతురు? కావున వేదమున మూర్తి మూజ నిషిద్ధము.

సం॥ "స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరగ్ం శుద్ధ మపాప విద్ధమ్, కవిర్ మనీషీ పరిభూః స్వయంభూర్ యాథాతథ్యతోఽర్థాన్ వ్యదధా చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః" ౩ యజు. ౪౦-౮

యః కవిః సర్వజ్ఞః, మనీషీ సర్వసాక్షీ. పరిభూః సర్వోపరి విరాజ మానః, స్వయంభూ రనాదిస్వరూపః పరమేశ్వరః, శాశ్వతీభ్యో నిత్యాభ్యః సమాభ్యః ప్రజాభ్యో, వేదద్వారాఽ౦తర్యామితయా చ యాథాతథ్యతోఽర్థాన్ వ్యదధాత్ విహితవానస్తి, స పర్యగాత్ సర్వవ్యాపకోఽస్తి. యత్ (శుక్రమ్) వీర్యవత్తమమ్, (అకాయమ్) మూర్తి జన్మ ధారణ రహితమ్, (అవ్రణమ్) ఛేద భేద రహితమ్, (అస్నావిరమ్) నాడీబంధనాది విరహమ్. (శుద్ధమ్) నిర్దోషమ్, (అపాపవిద్ధమ్) పాపాత్ పృథగ్భూతం. యదీదృశలక్షణం బ్రహ్మ సర్వైరుపాసనీయ మితి మన్యధ్వమ్.

ఇత్యనేనాపి శరీరజన్మమరణరహిత ఈశ్వరః ప్రతిపాద్యతే. తస్మాదయం నైవ కేనాపి మూర్తిపూజనే యోజయితుం శక్య ఇతి.

తె॥ (స పర్యగాత్) ఆ పరమేశ్వరుడు, (కవిః) సమస్తము నెఱుగువాడు (మనీషీ) ఎల్లరి మనస్సులకు సాక్షి. (పరిభూః) సర్వోపరి విరాజిల్లువాడు. (స్వయంభూః) అనాదిస్వరూపుడు. అనాదిస్వరూపులగు తన ప్రజలయిన జీవులకు అంతర్యామి రూపమున వేదము మూలమున సర్వవ్యవహారముల జ్ఞానము నుపదేశించుచు నంతట వ్యాపకుడై యున్నాడు. (శుక్రమ్) మిక్కలి పరాక్రమవంతుడు - వీర్యవంతుడు. (అకాయమ్) సర్వవిధ శరీరరహితుడు మూర్తులు లేనివాడు. (అవ్రణం) గాయములు, రోగములు లేనివాడు. (అస్నావిరం) నాడ్యాది బంధనములు లేనివాడు. (శుద్ధం) సర్వదోషరహితుడు. (అపాపవిద్ధం) పాపము అంటనివాడు. కావున నతడే యెల్లరకు నుపాస్యుడని యెఱుగునది.

ఈ మంత్రమునందును పరమేశ్వరుడు శరీరధారణ చేయడనియు, నతని కాకారములుండవనియు వర్ణింపబడుటచే పరమేశ్వరునకు మూర్తులను పాషాణాదులతో గల్పించి, వానికి పూజలనొనర్చి, పరమేశ్వరుని పూజించితి మనుట యుక్తి ప్రమాణములకు మిక్కలి విరుద్ధము.

*సం॥* పూ. ప : వేదేషు ప్రతిమా శబ్దోఽస్తి. న వా ?

ఉ. ప : అస్తి.

పూ. ప : పునః కిమర్థో నిషేధః ?

ఉ. ప : నైవ ప్రతిమార్థేన మూర్తయో గృహ్యంతే. కింతర్హి పరిమాణార్థా గృహ్యంతే. అత్ర ప్రమాణాని.

"సంవత్సరస్య ప్రతిమాం యాం త్వా రాత్ర్యుపాస్మహే,

సా న ఆయుష్మతీం ప్రజాం రాయస్పోషేణ సంసృజ" ౩ అథ. ౩–౨–౧౦–౩

"ముహూర్తానాం ప్రతిమా తా దశ చ సహస్రాణ్యష్టౌ చ

శతాని భవంత్యేతావంతో హి సంవత్సరస్య ముహూర్తాః" శత. ౧౦–౪–౩–౨౦

"యద్వాచాఽనభ్యుదితం యేన వాగభ్యుద్యతే తదేవ బ్రహ్మ త్వం విద్ధినేదం యదిద ముపాసతే" ౧ సామవేదీయ తవలకారో పనిషది. ఖం. ౧. మ. ౪. ఇత్యాది మంత్రపంచకం మూర్త్యాది నిషేధక మితి బోధ్యమ్.

విద్వాంసః సంవత్సరస్య యాం ప్రతిమాం పరిమాణ ముపాసతే, వయమపి త్వాం తామేవోపాస్మహే. అర్థా ద్యాః సంవత్సరస్య త్రీణి శతానిష్టష్టిశ్చ రాత్రయో భవంతి, యత ఏతాభిరేవ సంవత్సరః పరిమీయతే, తస్మాదేతాసాం ప్రతిమా సంజ్ఞేతి, యథా సేయం రాత్రిర్ నోఽస్మాకం రాయస్పోషేణ ధనపుష్టిభ్యా మాయుష్మతీం ప్రజాం సంసృజ, సమ్యక్ సృజేత్. తథైవ సర్వైర్ మనుష్యై రనుష్ఠేయమితి.

(ముహూర్తా) తథా యే సంవత్సరస్య దశసహస్రాణ్యష్టౌ శతాని ఘటికా ద్వయాత్మకా ముహూర్తాః సంతి తేఽపి ప్రతిమాశబ్దార్థా విజ్ఞేయాః.

(యద్వాచా) యదసంస్కృతవాణ్యా అవిషయం యేన వాణీ విదితాఽస్తి (తదేవ) తద్ బ్రహ్మ, హే మనుష్య ! త్వం విద్ధి. యత్ ఇదం ప్రత్యక్షం జగదస్తి, నైవైతద్ బ్రహ్మాస్తి. కింతు, విద్వాంసో, యన్నిరాకారం, సర్వవ్యాపక మజం, సర్వనియంతృ, సచ్చిదానందాది లక్షణం బ్రహ్మోపాసతే, త్వయాపి తదేవోపాసనీయం, నేతరదితి.

పూ. ప : కించ భోః, మనుస్మృతౌ, 'ప్రతిమానాం చ భేదకః' 'దైవతా న్యభిగచ్ఛేత్తు' 'దేవతాఽభ్యర్చనం చైవ, 'దేవతానాం చ కుత్సనమ్' 'దేవతాయతనాని చ' 'దేవతానాం ఛాయోల్లంఘననిషేధః' 'ప్రదక్షిణాని కుర్వీత' 'దేవబ్రాహ్మణసన్నిధౌ' 'దేవతాగార భేదకాన్, ఉక్తానాం వచనానామేషాం కా గతి రితి ?

ఉ. ప : అత్ర ప్రతిమాశబ్దేన రక్తికా మాష సేటకాదీని తోలన సాధనాని గృహ్యంతే. తద్యథా.

"తులామానం ప్రతీమానం సర్వం చ స్యాత్సులక్షితమ్" మను. ౮-౪౦౩

ఇత్యనయా మనూక్తరీత్యైవ ప్రతిమా ప్రతీమాన శబ్దయో రేకార్థ త్వా త్తోలనసాధనాని గృహ్యంత ఇతి బోధ్యమ్. అత ఏవ ప్రతిమానా మధికన్యూనకారిణే దండో దేయ ఇత్యుక్తః.

విద్వాంసో దేవాస్తే యత్రాధీయతేఽధ్యాపయంతి నివసంతి చ తాని స్థానాని దైవతానీత్యుచ్యంతే. దేవా ఏవ దేవతాస్తేషా మిమాని స్థానాని దైవతాని, దేవతాయతనాని చ సంతీతి బోధ్యమ్. విదుషామేవాభ్యర్చనం సత్కారణం కర్తవ్యమితి. నైవైతేషాం కేనచిదపి నిందా, ఛాయోల్లంఘనం, స్థానవినాశశ్చ కర్తవ్యః. కింతు సర్వై రేతేషాం సామీప్యాగమనం, న్యాయప్రాపణం. దక్షిణపార్శ్వే స్థితిశ్చ కార్యేతి. ఏవమేవ యత్ర యత్రాన్యత్రాపి ప్రతిమా దేవ దేవతాయతనాది శబ్దాః సంతి. తత్ర తత్రైవమర్థా విజ్ఞేయాః. గ్రంథభూయస్త్వ భియా నాత్ర తే లేఖితుం శక్యా ఇతి. ఏతావతైవ మూర్తిపూజన కంఠీ తిలక ధారణాది నిషేధా బోధ్యాః.

తె॥ పూ. ప : వేదమున ప్రతిమా శబ్దమున్నదా ?

ఉ. ప : ఉన్నది.

పూ. ప : అటులయిన మూర్తి పూజనేల నిషేధించుచున్నారు ?

ఉ. ప : ప్రతిమా శబ్దమున కట మూర్తియని యర్థముకాదు. పరిమాణార్థమున నది ప్రయోగింప బడినది. ఇందులకు ప్రమాణము.

(సంవత్సరస్య ప్రతిమా) విద్వాంసులు సంవత్సరమునకుగల పరిమాణమును క్షణము మున్నగు కాలవిభాగము నొనర్చు నేర్రాత్రి నుపాసింతురో, మేము నారాత్రినే యుపాసింతుము. ఒక సంవత్సరమునకు (౩౬౦) మూడువందల యఱువది రాత్రులు. ఈ రాత్రులతోనే సంవత్సరమేర్పడును. కావున నవి సంవత్సరపు కొలతను తెలుపును; రాత్రికి ప్రతిమయని సంజ్ఞ. (సాసఆయు) ఈ రాత్రులలో పరమాత్మని కృపవలన సత్కర్మల ననుష్ఠించుచు మనము ధనముతోను, పుష్టితోనుగూడి, ఆయుష్మంతమగు సంతానము బడయుదుముగాక ! ఈ మంత్రము యొక్క భావార్థముకొంత శతపథ బ్రాహ్మణమునను గలదు.

(ముహూర్తానాం) ఒక సంవత్సరమునకు ౧౦౮౦౦ ముహూర్తములు. ఇవియు ప్రతిమాశబ్దముచే చెప్పబడినవి. ముహూర్తము రెండు ఘడియల కాలము.

(యద్ వాచా) అవిద్యాయుక్త వాణికి విషయము కానిదియు నేది సమస్త వాణుల నెఱుగునో, యదియే బ్రహ్మమని, ఓ మానవులార ! మీ రెఱుగుడు. మూర్తిమంతమగు నీజగత్తు పరమేశ్వరుడు కాదు. ఇయ్యది పరమేశ్వరునిచే రచియింపబడినది. నిరాకారుడు, వ్యాపకుడు, సర్వ పదార్థములను నియమించువాడు, సచ్చిదానందాది లక్షణయుక్తుడునగు పరమేశ్వరునే మీ రుపాసింపుడు. ఇది యుపనిషత్కర్తలగు ఋషుల

వచనము. (ఈ యుపనిషత్తునం దిట్లే యింకను నాలుగు మంత్రములున్నవి. ఇవి యన్నియు మూర్తిపూజను నిషేధించుచున్నవి. తెలిసికొనుడు.)

పూ. ప : 'ప్రతిమను భగ్నముచేసినవానిని రాజు దండింపవలెను' 'దేవతలను సమీపించుడు' వారిని పూజింపుడు 'వారి ఛాయలను లంఘింపకుడు' 'వారికి ప్రదక్షిణము చేయుడు' అనునిట్టి వాక్యములు మనుస్మృతిలో జూడబడుచున్నవి. వీనింబట్టి మూర్తిపూజ సిద్ధమగుచున్నది కదా ? మీరేల యంగీకరింపరు?

ఉ. ప : మీరేల భ్రమపడుచున్నారు. కొంచెము కన్నులు తెఱచి చూచిన సత్యము మీకు తెలియును. ప్రతిమ యన రాతివిగ్రహము కాదు. అట్లు గ్రహించుట యజ్ఞానము. మనుస్మృతిలోని యీ ప్రతిమా శబ్దమున కర్థము రత్తి, ఛటాకు మున్నగు తూనికరాళ్ళు.

(తులామానం) తులా = తరాజు, మానం = తూనికరాళ్ళు. ప్రతిమానము = ప్రతిమ–తూనికరాయి. ఈ తూనికరాళ్ళను రాజ్యాధికారులప్పుడప్పుడు పరీక్షించుచుండవలెను. వ్యాపారు లారాళ్ళలో హెచ్చుతగ్గ లేవియైన చేసిన వారిని శిక్షింపవలెను.

(దేవతాభ్యర్చనం) అనునిట్టి వాక్యములనుగూడ నిట్లు తెలిసికొనవలెను. శతపథ బ్రాహ్మణమున విద్వాంసులు పఠన పాఠనములు చేయుదురో, నివసింతురో యాస్థానము 'దైవతము' లనబడును. కావున నిట్టి స్థానములకువెళ్ళి యట విద్వాంసులకు సత్కారముచేయుట యుచితమే.

(దేవతానాం చ కుత్సనం) విద్వాంసులను నిందింపరాదు. అవమానింపరాదు. (ఛాయోల్లంఘనం) ఆ విద్వాంసుల స్థానములను చెడగొట్టరాదు. ఆ స్థానములలో నెట్టి యుపద్రవము కలుగనీయరాదు. (దైవతాన్యభిగచ్ఛేత్తు) ఆ విద్వాంసులుండు స్థానములకు వెళ్ళి సద్విషయములను నేర్వవలెను. (ప్రదక్షిణ) విద్వాంసుల చెంతకు వెళ్ళినపుడు వారికి కుడివైపున గూర్చుండి యుపదేశములను వినవలెను. అందువలన వారికి గౌరవమిచ్చినట్లగును. ఈ విధముగనే యితర స్థానములందును శబ్దములను గ్రహింప యత్నింపవలెను. మనుస్మృతిలోని యీ వాక్యములనుబట్టి మూర్తిపూజ సిద్ధమగు ననుట భ్రమయేకాని, మఱేమియు కాదు. ఈస్థలమున నెక్కువగా ప్రమాణములను వివరించుట పుస్తకమును పెంచుటయగును. సత్యశాస్త్రములందు చెప్పబడిన దానికి విరుద్ధముగా తిలకములు దిద్దుట రుద్రాక్షాదిమాల ధారణము చేయుట మంచిదికాదని తెలిసి వానిని త్యజింపవలెను.

*సం॥* ఏవమేవ సూర్యాది గ్రహపీడాశాంతయే బాలబుద్ధిభిః 'ఆకృష్ణేన రజసా' ఇత్యాది మంత్రా గృహ్యంతే. అయ మేషాం భ్రమ ఏవాస్తీతి.

కుతః ! తత్ర తేషా మర్థానా మగ్రహణాత్. తద్యథా – తత్రాకృష్ణేన రజసేతి మంత్రస్యార్థ ఆకర్షణానుకర్షణ ప్రకరణే ఉక్తః. ఇమం దేవా అసపత్న మిత్యస్య రాజధర్మవిషయే చేతి. ౧–౨

"అగ్నిర్ మూర్ధా దివః కకుత్పతిః పృథివ్యా అయమ్, అపాగ్ం రేతాగ్ంసి జిన్వతి" ౩

యజు. ౩–౧౨

(అయమగ్నిః) పరమేశ్వరో భౌతికో వా (దివః) ప్రకాశవల్లోకస్య (పృథివ్యాః) ప్రకాశ రహితస్య చ, (పతిః) పాలయితాఽస్తి. (మూర్ధా) సర్వోపరి విరాజమానః, (కకుత్) తథా కకుభాం దిశాం చ మధ్యే వ్యాపకతయా సర్వపదార్థానాం పాలయితాఽస్తి. 'వ్యత్యయో బహుల' మితి సూత్రేణ భకారస్థానే తకారః

(అపాగ్ం రేతాగ్ంసి) అయమేవ జగదీశ్వరో భౌతికశ్చాపాం ప్రాణానాం జలానాం చ రేతాంసి వీర్యాణి (జిన్వతి) పుష్ణాతి. ఏవం చాగ్నిర్ విద్యుద్ రూపేణ సూర్యరూపేణ చ పూర్వోక్తస్య రక్షకః పుష్టికర్తా చాస్తి. 3

తె॥ ఇట్లే యల్పబుద్ధిగల మనుష్యులు 'ఆకృష్ణేన రజసా' అను నిట్టి మంత్రములతో సూర్యాది గ్రహములవలన గలుగు పీడలను శాంతింపజేయ యత్నింతురు. ఇది కేవల భ్రమ. మంత్రార్థముతో వారొనర్చు క్రియకు సంబంధ మొకింతయు లేదు. కారణమేమియన ? ఈ మంత్రములలో గ్రహపీడను నివారించుట కనువగు నర్థమే లేదు. ఈ మంత్రార్థము ఆకర్షణానుకర్షణ ప్రకరణమున వ్రాయబడినది. అట్లే (ఇమం దేవా) అను మంత్రార్థము కూడ నీ విషయమునకు సంబంధించినది కాదు. 'రాజధర్మ' ప్రకరణమున నీ మంత్రార్థము చూడనగును. ౧-౨

(అగ్నిః) పరమేశ్వరుడు, భౌతికాగ్ని (దివః) ప్రకాశవంతములు, (పృథివ్యాః) ప్రకాశరహితములు నగు లోకములను పాలించును. (మూర్ధా) అతడు సర్వోపరి విరాజమానుడు (కకుత్పతిః) వ్యాపకుడగుటచే పరమేశ్వరుడు దిశలలోగల సర్వపదార్థములకు రాజు. 'వ్యత్యయో బహులమ్' అను వ్యాకరణ సూత్రము ననుసరించి 'కకుభ్' అను శబ్దమునగల 'భ్' కారమునకు 'త్' కారము వచ్చినది. (అపాగ్ం రేతాగ్ంసి జిన్వతి) ఆ జగదీశ్వరుడే ప్రాణములయు, జలముయొక్కయు వీర్యమును పుష్టము చేయును. ఇట్లే భౌతికాగ్నియు విద్యుద్రూపమునను, సూర్యుని రూపమునను పూర్వోక్త పదార్థములను పుష్టమొనర్చును.౩

సం॥ "ఉద్బుధ్యస్వాగ్నే ప్రతిజాగృహి త్వమిష్టాపూర్తే సగ్ం సృజేథా మయం చ, అస్మిన్ త్సధస్థే అధ్యుత్త రస్మిన్ విశ్వే దేవా యజమానశ్చ సీదత" ౪ యజు. ౧౫-౫౪

(ఉద్బుధ్యస్వాగ్నే) హే అగ్నే ! పరమేశ్వర ! అస్మాకం హృదయే త్వముద్బుధ్యస్వ ప్రకాశితో భవ. (ప్రతిజాగృహి) అవిద్యాంధకార నిద్రాత స్సర్వాన్ జీవాన్ పృథక్కృత్య విద్యార్క-ప్రకాశే జాగృతాన్ కురు. (త్వమిష్టాపూర్తే) హే భగవన్ ! అయం జీవో మనుష్యదేహధారీ ధర్మార్థ కామమోక్ష సామగ్ర్యాః పూర్తిం సృజేత సముత్పాదయేత్, త్వమస్యేష్టం సుఖం సృజేః. ఏవం పరస్పరం ద్వయోః సహాయపురుషార్థాభ్యా మిష్టాపూర్తే సంసృష్టే భవేతామ్. (అస్మిన్ త్సధస్థే) అస్మిన్ లోకే శరీరే చ. (అధ్యుత్తరస్మిన్) పరలోకే ద్వితీయే జన్మని చ, (విశ్వేదేవా యజమానశ్చ సీదత) సర్వే విద్వాంసో, యజమానో విద్వత్ సేవాకర్తా చ, కృపయా సదా సీదంతు-వర్తంతామ్. యతోఽస్మాకం మధ్యే సదైవ సర్వా విద్యాః ప్రకాశితా భవేయు రితి. 'వ్యత్యయో బహుల' మిత్యనేన సూత్రేణ పురుషవ్యత్యయః.

తె॥ (ఉద్బుధ్యస్వాగ్నే) ఓ పరమేశ్వర ! మా హృదయమున ప్రకాశింపుము. (ప్రతిజాగృహి) అవిద్యాంధకారమనెడి నిద్రనుండి తొలగించి జీవులమగు మమ్ములను విద్యయనెడి ప్రకాశముతో ప్రకాశింప జేయుము. (త్వమిష్టాపూర్తే) ఓ దేవ ! మనుష్యదేహధారియగు నీ జీవుడు ధర్మార్థకామ మోక్షములనెడి సామగ్రిని పూర్తి జేయగలుగునట్లు నీ విష్టసిద్ధి నొనరింపుము. (అస్మిన్ త్సధస్థే) ఈ లోకమున నీ శరీరము నందును, (అధ్యుత్తరస్మిన్) పరలోకమున మఱియొక జన్మము నందును (విశ్వేదేవా యజమానశ్చ సీదత) నీ కృపవలన విద్వాంసులెల్లరు యజమానులు - విద్యోపదేశమును గ్రహించువారు, సేవజేయువారు సుఖముగా నుందురుగాక ! వారివలన మేమును విద్యాయుక్తుల మగుదుముగాక ! (వ్యత్యయో బహులమ్) అను సూత్రము ననుసరించి 'సంసృజేథామ్' 'సీదత' అను నీ క్రియలు ప్రథమ పురుషస్థానమున మధ్యమ పురుష ప్రయోగము చేయబడినది. ౪

సం॥ "బృహస్పతే అతి యదర్యో అర్హాద్ ద్యుమద్విభాతి క్రతుమజ్జనేషు, యద్దీదయచ్ఛవస ఋతప్రజాత తదస్మాసు ద్రవిణం ధేహి చిత్రమ్" ౫ యజు. ౨౬-౩

(బృహస్పతే) హే బృహతాం వేదానాం పతే పాలక ! (ఋతప్రజాత) వేదవిద్యా ప్రతిపాదిత జగదీశ్వర! త్వం (జనేషు) యజ్ఞకారకేషు విద్వత్సు లోకలోకాంతరేషు వా, (క్రతుమత్) భూయాంసః క్రతవో భవంతి యస్మింస్తత్ (ద్యుమత్) సత్యవ్యవహారప్రకాశో విద్యతే యస్మింస్తత్, (దీదయచ్ఛవసః) దానయోగ్యం, శవసో బలస్య ప్రాపకం, (యదర్యో అర్హాత్) యేన విద్యాది ధనేన యుక్తః సన్ (అర్యః) స్వామీ రాజా, వణిగ్జనో వా ధార్మికేషు జనేషు (విభాతి) ప్రకాశతే, (చిత్రం) యద్ధన మద్భుతం, (అస్మాసు ద్రవిణం ధేహి) తదస్మదధీనం ద్రవిణం ధనం కృపయా ధేహీత్యనేన మంత్రేణేశ్వరః ప్రార్థ్యతే.

తె॥ (బృహస్పతే) ఓ వేదవిద్యాపాలక ! (ఋతప్రజాత) వేదము వలన ప్రసిద్ధుడవగు నో జగదీశ్వర! (తదస్మాసు చిత్రం ద్రవిణం ధేహి) సత్యవిద్య యనెడి బహువిధములగు నద్భుతధనమును మాయందు దయతో నుంచుము. ఆ ధన మెట్టిది యన (జనేషు) విద్వాంసులందును, లోకలోకాంతరములందును (క్రతుమత్) అనేక యజ్ఞముల నొనర్ప సాధనమై యుండవలెను. (ద్యుమత్) సత్యవ్యవహార ప్రకాశకము, (యదర్యో) రాజు, వ్యాపారి, ధార్మికజనులు నైనవారిలో (విభాతి) ప్రకాశించునదియునై యుండవలెను. ఇట్టి సంపూర్ణ విద్యాయుక్త ధనము మాలో నెల్లపుడు నుండునట్లనుగ్రహింపుము. అని యీ మంత్రముతో ప్రార్థన చేయబడును. ౫

సం॥ "అన్నాత్ పరిస్రుతోరసం బ్రహ్మణా వ్యపిబత్ క్షత్రం పయః సోమం ప్రజాపతిః, ఋతేన సత్యమింద్రియం విపానగ్ం శుక్రమంధసః, ఇంద్రస్యేంద్రియమిదం పయోఽమృతం మధు" ౬ యజు. ౧౯-౭౫

(క్షత్రం) యత్ర యద్ రాజకర్మ, క్షత్రియో వా, (బ్రహ్మణా) వేదవిద్భిశ్చ సహ, (పయః) అమృతాత్మకం, (సోమం) సోమాద్యోషధి సంపాదితం (రసం) బుద్ధ్యానంద శౌర్య ధైర్య బలపరాక్రమాది సద్గుణ ప్రదం (వ్యపిబత్) పానం కరోతి, తత్ర స సభాధ్యక్షో రాజన్యః (ఋతేన) యథార్థవేదవిజ్ఞానేన (సత్యం) ధర్మం రాజవ్యవహారం చ. (ఇంద్రియం) శుద్ధవిద్యాయుక్తం శాంతం మనః (విపానం) వివిధ రాజధర్మ రక్షణం (శుక్రం) ఆశుసుఖకరం, (అంధసః) శుద్ధాన్న స్యేచ్ఛా హేతుం, (పయః) సర్వపదార్థసార విజ్ఞానయుక్తం (అమృతం) మోక్షసాధకం, (మధు) మధురం సత్యశీలస్వభావయుక్తం, (ఇంద్రస్య) పరమైశ్వర్య యుక్తస్య సర్వవ్యాపకాంతర్యామిన ఈశ్వరస్య కృపయా, (ఇంద్రియం) విజ్ఞానయుక్తం మనః ప్రాప్య (ఇదం) సర్వం వ్యావహారిక పారమార్థికం సుఖం ప్రాప్నోతి. (ప్రజాపతిః) పరమేశ్వర ఏవ మాజ్ఞాపయతి యః ప్రజాపాలనాధికృతో భవేత్, స ఏవం ప్రజాపాలనం కుర్యాత్, (అన్నాత్ పరిస్రుతః) న చామృతాత్మకో రసోఽన్నాద్ భోజ్యాత్ పదార్థాత్ పరితః సర్వతః స్రుతశ్చ్యుతో యుక్తో వా కార్యః. యథా ప్రజాయా మత్యంతం సుఖం సిద్ధ్యేత్తథైవ క్షత్రియేణ కర్తవ్యమ్. ౬

తె॥ (క్షత్రం) రాజకర్మముకాని, క్షత్రియుడు కాని (బ్రహ్మణా) వేదవిదులయిన వారితో కలిసి రాజ్యపాలనము సేయవలెను. (పయః) అమృతరూపమగు (సోమం) సోమలతాద్యోషధుల (రసం) సారభూతము, బుద్ధి, ఆనందము, శూరత, ధైర్యము, బలము, పరాక్రమము మున్నగు గుణములను నొసంగు రసమును (వ్యపిబత్) రాజపురుషులు, జనులు వైద్యకరీతితో ద్రావుదురు. ఆ సభాసదులు, ప్రజాజనులు,

(ఋతేన) వేద విద్యను బాగుగనెఱిగి, (సత్యం) ధర్మమును, రాజవ్యవహారమును (ఇంద్రియం) శుద్ధ విద్యాయుక్త శాంతస్వరూపమగు మనస్సును (విపానం) ప్రజారక్షణమును (శుక్రం) శీఘ్రముగ సుఖము నొసంగు (అంధసః) శుద్ధాన్నేచ్ఛతో యుక్తము (పయః) సర్వపదార్థసారమును, విజ్ఞాన సహితమును (అమృతం) మోక్షజ్ఞాన సాధనమును, (మధు) మధురవాణి, శీలము మున్నగు గుణములు (ఇంద్రస్య) పరమైశ్వర్య యుక్తుడగు నీశ్వరుని కృపవలన, (ఇద మింద్రియం) విజ్ఞానయుక్తమగు మనస్సును బొంది వ్యావహారికమును, పారమార్థికమునునగు సుఖమును బొందును. (ప్రజాపతిః) కావున పరమేశ్వరుడు రాజపురుషులను, ప్రజలను నాజ్ఞాపించుచున్నాడు. మీరు పూర్వోక్తములగు విద్యావిజ్ఞానములను బొంది ధర్మముతో ప్రజలను పాలింపుడు. మఱియు (అన్నాత్ పరిస్రుతః) అమృతరూపరసమును భోజ్యపదార్థములందు కలిపి సేవింపుడు. మీకు పూర్ణసుఖము లభింపగలదు.' ౬

సం॥ "శన్నో దేవీరభీష్టయ ఆపో భవంతు పీతయే శంయో రభిస్రవంతు నః" ౭

యజు. ౩౬-౧౨

(ఆప్ల వ్యాప్తౌ) అస్మాద్ధాతో రప్శబ్దః సిద్ధ్యతి. స వియత స్త్రీలింగో బహువచనాంతశ్చ. దివు క్రీడాద్యర్థః (దేవీః) దేవ్య ఆపః, సర్వప్రకాశకః సర్వానందప్రదః, సర్వవ్యాపక ఈశ్వరః, (అభీష్టయే) ఇష్టానందప్రాప్తయే (పీతయే) పూర్ణానందభోగేన తృప్తయే. (నః) అస్మభ్యం, (శం) కల్యాణ కారికా భవంతు. స ఈశ్వరో నః కల్యాణం భావయతు ప్రయచ్ఛతు. తా ఆపో దేవ్యః, స ఏవ ఈశ్వరో నోఽస్మాక ముపరి (శంయోః)సర్వతః సుఖస్య వృష్టిం కరోతు. అత్ర ప్రమాణమ్.

"యత్ర లోకాంశ్చ, కోశాంశ్చాపో బ్రహ్మ జనా విదుః,

అసచ్చ యత్ర సచ్చాంతః స్కంభం తం బ్రూహి కతమఃస్విదేవ సః"అథర్వ. ౧౦-౭-౨-౧౦

అనేన వేదమంత్ర ప్రమాణేన అప్ శబ్దేన పరమాత్మనో గ్రహణం క్రియతే. తద్యథా :- (ఆపో బ్రహ్మ జనా విదుః) విద్వాంస ఆపో బ్రహ్మణో నామాస్తీతి జానంతి, (యత్ర లోకాంశ్చ కోశాంశ్చ) యస్మిన్ పరమేశ్వరే సర్వాన్ భూగోలాన్నిధీంశ్చ, (అసచ్చ యత్ర సచ్చ) యస్మింశ్చానిత్యం కార్యం, జగదేతస్య కారణం చ స్థితం జానంతి, (స్కంభం తం బ్రూహి కతమః స్విదేవ సః) స జగద్ధాతా సర్వేషాం పదార్థానాం మధ్యే కతమోఽస్తి. విద్వంస్త్వం బ్రూహీతి పృచ్ఛ్యతే, (అంతః) స జగదీశ్వరః సర్వేషాం జీవాది పదార్థానా మాభ్యంతరేఽంతర్యామి రూపే ణావస్థితోఽస్తీతి భవంతో జానంతు. ౩

తె॥ (శన్నో దేవీ) 'ఆప్ల వ్యాప్తౌ' అను ధాతువువలన అప్ శబ్దము సిద్ధమగును. ఈ శబ్ద మెల్లపుడు స్త్రీలింగ బహువచనముగానే వ్యవహరింపబడును. 'దివు' ధాతువునకు క్రీడ మున్నగునవి యర్థములు. దానితో దేవశబ్ద మేర్పడును. (దేవీః) ఎల్లరకు నానందమును, ప్రకాశమును నిచ్చుదేవుడు (ఆపః) సర్వవ్యాపకుడై యున్నాడు. (అభీష్టయే) అతడు ఇష్టమగు, (పీతయే) పూర్ణానంద ప్రాప్తికొఱకు (నః) మనకు (శం భవంతు) కల్యాణకరుడగుగాక ! అతడే (శంయోః) సుఖమును (అభిస్రవంతు) వర్షింపజేయునుగాక ! ఇందు 'ఆపః' అను శబ్దమునకు పరమేశ్వరుడని యర్థము. చెప్పుటకు ప్రమాణము - (యత్ర లోకాంశ్చ కోశాంశ్చ...) అను నీమంత్ర ప్రమాణమునుబట్టి 'ఆపః' శబ్దమునకు పరమేశ్వరుడనియర్థము గ్రహింపవలెను. (ఆపో బ్రహ్మజనా విదుః)విద్వాంసులు 'ఆపః' పరమాత్మకు వాచక మందురు. 'యత్ర లోకాంశ్చ' అను మంత్రమున నిట్లు ప్రశ్నింపబడినది. దేనియందు భూమ్యాది సర్వలోకములు, సమస్త పదార్థములు నున్నవో, (అసచ్చ యత్ర సచ్చ) దేనియందు అనిత్యమగు - కార్యరూపమగు నీప్రపంచము, ప్రపంచ

పదార్థములకు కారణమును నున్నవో, (స్కంభం తం బ్రూహి కతమఃస్విదేవసః) వానినన్నింటిని ధారణ చేయునది యెవరు ?' ఈ ప్రశ్నకు మంత్రమున సమాధానమును గలదు. (అంతః) భూమ్యాది లోకములలోను, జీవులలోను అంతర్యామి రూపమున పరమేశ్వరుడు వ్యాపించియున్నాడు. అతడే యీ లోకములనన్నింటిని ధరించియున్నాడు. అని యెఱిగి యతనినే యుపాసింపదగును. అంతఃకరణమునందే యన్వేషింపుడు.

సం॥ "కయా నశ్చిత్ర ఆ భువదూతీ సదా వృధః సఖా కయా శచిష్ఠయా వృతా" ౮
యజు. ౩౬–౪

(కయా) ఉపాసనారీత్యా (శచిష్ఠయా) అతిశయేన సత్కర్మానుష్ఠాన ప్రకారయా, (వృతా) శుభ గుణేషు వర్తమానయా, (కయా) సర్వోత్తమ గుణాలంకృతయా సభయా ప్రకాశితః" (చిత్రః) అద్భుతా నంతశక్తిమాన్, (సదా వృధః) సదానందేన వర్ధమాన ఇంద్రః పరమేశ్వరః, (నః) అస్మాకం సఖా మిత్రః (మిత్రం) యథాభిముఖో భూత్వా (ఊతీ) స జగదీశ్వరః కృపయా సర్వదా సహాయకరణేనాస్మాకం రక్షకో భవతు. తథైవాస్మాభిః స సత్యప్రేమభక్త్యా సేవనీయ ఇతి. ౮

తె॥ (కయా) ఉపాసనారీతితోను, (శచిష్ఠయా) అతిశయ కర్మానుష్ఠాన ప్రకారములతోను, (వృతా) సత్యవిద్యాది శుభగుణములలోనుండు (కయా) సర్వోత్తమ గుణాలంకృతమగు సభచే ప్రకాశించువాడు (చిత్రః) అద్భుతానంత శక్తియుక్తుడు. (సదావృధః) సదానందముతో వర్ధిల్లు పరమేశ్వరుడు, (నః సఖా) మాకు మిత్రుడు, సభిముఖుడునై (ఆభువత్) ప్రకాశించువాడై, (ఊతీ) కృపతో సహాయ మొనర్చి రక్షించునుగాక ! మేము సత్యప్రేమ భక్తులతో నతనిని సేవింతుము.

సం॥ "కేతుం కృణ్వన్న కేతవే పేశో మర్యా అపేశసే, సముషద్భి రజాయథాః" ౯
యజు. ౨౯–౩౭

హే మర్యా మనుష్యాః ! ఉషద్భిః పరమేశ్వరం కామయమానైస్తదాజ్ఞాయాం వర్తమానైర్విద్వద్భిర్ యుష్మాభిః సహ సమాగమే కృతే సత్యేవ (అకేతవే) అజ్ఞానవినాశాయ కేతుం ప్రజ్ఞానం (అపేశసే) దారిద్ర్య వినాశాయ పేశః చక్రవర్తిరాజ్యాది సుఖసంపాదకం ధనం చ కృణ్వన్ సన్ జగదీశ్వరః (అజాయథాః) ప్రసిద్ధో భవతీతి వేదితవ్యమ్. ౯

తె॥ (మర్యాః) ఓ మనుష్యులార ! (ఉషద్భిః) పరమేశ్వరుని కామించునట్టియు, అతని యాజ్ఞలలో వర్తించునట్టియు మీకు విద్వాంసుల సాంగత్యము చేసిన మీదటనే (అకేతవే) అజ్ఞానమును, (అపేశసే) దారిద్ర్యమును దూరమొనర్చుటకు విజ్ఞాన ధనమును, చక్రవర్తి రాజ్యాది సుఖసాధనములను పరమేశ్వరు డిచ్చును. (అజాయథాః) ప్రసిద్ధుడగును. భగవంతునిట్లే యెఱుంగవలెను.

గ్రంథప్రామాణ్యా ప్రామాణ్య విషయము సమాప్తము.

# అథ అధికారానధికార విషయః

(సంక్షేపతః)

సం॥ పూ. ప : వేదాదిశాస్త్ర పఠనే సర్వేషామధికారోఽస్త్యాహోస్విన్నేతి ?

ఉ. ప : సర్వేషామస్తి, వేదానామీశ్వరోక్తత్వాత్, సర్వమనుష్యోపకారార్థత్వాత్, సత్య విద్యాప్రకాశకత్వాచ్చ యద్ యద్ధి ఖలు పరమేశ్వరరచితం వస్త్వస్తి, తత్తత్ సర్వం సర్వార్థ మస్తీతి విజానీమః. అత్ర ప్రమాణమ్–

"యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః, బ్రహ్మరాజన్యాభ్యాగ్ంం శూద్రాయ చార్యాయ చ స్వాయ చారణాయ; ప్రియో దేవానాం దక్షిణాయై దాతురిహ భూయాస మయం మే కామః సమృధ్యతా ముప మాదో నమతు" ౧ యజు. ౨౬–౨

అస్యాభిప్రాయః – పరమేశ్వరః – సర్వమనుష్యైర్ వేదాః పఠనీయాః పాఠ్యా ఇత్యాజ్ఞాం దదాతి. తద్యథా – (యథా) యేన ప్రకారేణ, (ఇమామ్) ప్రత్యక్షభూతాం ఋగ్వేదాది వేదచతుష్టయీం, (కల్యాణీమ్) కల్యాణసాధికాం (వాచం) వాణీం, (జనేభ్యః) సర్వేభ్యో మనుష్యేభ్యోఽర్థాత్ సకలజీవోపకారాయ, (ఆవదాని) ఆ సమంతా దుపదిశాని, తథైవ సర్వైర్ విద్వద్భిః సర్వమనుష్యేభ్యో వేదచతుష్టయీ వా గుపదేష్టవ్యా ఇతి.

అత్ర కేచి దేవం బ్రూయుః – జనేభ్యో ద్విజేభ్య ఇత్యధ్యాహార్యం, వేదాధ్యయనాధ్యాపనే తేషామేవాధికారత్వాత్. నైవం శక్యమ్. ఉత్తర మంత్రభాగార్థ విరోధాత్. తద్య థా – కస్య కస్య వేదాధ్యయన శ్రవణే అధికారోఽస్తీత్యాకాంక్షాయా మిద ముచ్యతే – (బ్రహ్మరాజన్యాభ్యాం) బ్రాహ్మణ క్షత్రియాభ్యాం, (అర్యాయ) వైశ్యాయ, (శూద్రాయ), (చారణాయ) అతి శూద్రాయాంత్యజాయ (స్వాయ) స్వాత్మీయాయ పుత్రాయ భృత్యాయ చ, సర్వైః సైషా వేదచతుష్టయీ శ్రావ్యేతి. (ప్రియో దేవానాం దక్షిణాయై దాతురిహ) యథాహ మీశ్వరః పక్షపాతం విహాయ, సర్వోపకారకరణేన సహవర్తమానః సన్ దేవానాం విదుషాం ప్రియః, దాతుర్ దక్షిణాయై సర్వస్వదానాయ ప్రియశ్చ (భూయాసమ్) స్యామ్. తథైవ భవద్భిః సర్వైర్ విద్వద్భిరపి సర్వోపకారం సర్వప్రియాచరణం మత్వా సర్వేభ్యో వేదవాణీ శ్రావ్యేతి. యథాయం మే మమ కామః సమృధ్యతే తథైవైవం కుర్వతాం భవతాం (అయం కామః సమృధ్యతామ్) ఇయ మిష్టసుఖేచ్ఛా సమృధ్యతాం సమ్యగ్ వర్ధతామ్. యథా అదః సర్వ మిష్టసుఖం మాముపనమతి (ఉపమాదోనమతు) తథైవ భవతోఽపి సర్వమిష్టసుఖ ముపనమతు సమ్యక్ ప్రాప్నోత్వితి.

మయా యుష్మభ్య మయ మాశీర్వాదో దీయత ఇతి నిశ్చేతవ్యమ్, యథా మయా వేదవిద్యా సర్వథా ప్రకాశితా, తథైవ యుష్మాభిరపి సర్వార్థా ఉపకర్తవ్యా, నాత్ర వైషమ్యం కించిత్ కర్తవ్యమితి.

పూ. ప : కుతః !

ఉ. ప : యథా మమ సర్వప్రియార్థా పక్షపాతరహితా చ ప్రవృత్తిరస్తి, తథైవ యుష్మాభి రాచరణే కృతే మమ ప్రసన్నతా భవతి, నాన్యథేతి. అస్య మంత్రస్యాయ మేవార్థోఽస్తి.

పూ. ప : కుతః !

ఉ. ప : 'బృహస్పతే అతి యదర్య' ఇత్యుత్తరస్మిన్ మంత్రే హీశ్వరార్థస్యైవ ప్రతిపాదనాత్.

తె॥ వేదాది శాస్త్రములు చదువుటకు జదివించుటకు, వినుటకు వినిపించుటకు నెల్లరకు నధికారమున్నదా ? లేదా !

ఉ. ప : ఉన్నది. ఎల్లవిద్యలకు మూలమగు వేదములను పరమేశ్వరుడు సర్వమానవుల యుపకారార్థము రచియించియున్నాడు. పరమేశ్వరునిచే రచియింపబడిన పదార్థములన్నియు నెల్లరి యుపయోగము కొఱకే యని మే మెంచుచున్నాము. ఇందులకు యజుర్వేద మంత్రమే ప్రమాణము. (యథేమాం వాచం కల్యాణీమ్) ఈ మంత్రాభిప్రాయమిది. వేదములను నెల్లరు జదువవచ్చును. విద్వాంసులకు వానిని జదివింప నధికారమున్నది. ఈ మంత్రమున నీశ్వరుడిట్లు ఆజ్ఞనిచ్చుచున్నాడు. ఓ మానవులార ! నేనెట్లు మీకు నాలుగు వేదముల నుపదేశించుచున్నానో యట్లే మీరును వానిం జదివి యెల్లరకు నేర్పుడు, వినిపింపుడు. ఈ వేదవాణి యెల్లరకు శుభము నొడగూర్చును. (ఆవదాని జనేభ్యః) నే నెట్లు జనులకొఱకు వేదముల నుపదేశించు చున్నానో యట్లే మీరును జేయుడు.

పూ. ప: (జనేభ్యః) ఈ పదమునకు ద్విజజను లనియే యర్థము చెప్పవలెను. సూత్రగ్రంథములందును స్మృతులలోను ద్విజులే వేదములు జదువ నధికారులని యున్నది.

ఉ. ప : ఇది సరికాదు. ఈశ్వరుని యభిప్రాయ మట్లులేదు. అట్లున్న పక్షమున జనుల కొఱకు (ఆవదాని జనేభ్యః) అని యేల చెప్పును ? ఇంతేకాక మంత్రమున (బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయ చ స్వాయ చారణాయ) బ్రాహ్మణులు, క్షత్రియులు, శూద్రులు, వైశ్యులు, (స్వాయ) పుత్రులు, భృత్యులు, (చారణాయ) అతి శూద్రులు నను వారి కెల్లరకు సమానముగ నుపదేశించుచున్నట్లేల చెప్పును? విద్యల కాకరమగు నీవేద మెల్లరకు హితము కల్గించునదియై యున్నది. ఈశ్వర రచితపదార్థములందు దాయభాగములకెల్ల రధికారులే. కావున మనుష్య లెల్లరు వేదములను జదువవలెను. వేద మీశ్వరుడు తన బిడ్డల కెల్లరకు నిచ్చిన ధనము. కొండొకవర్ణ విశేషమునకే యిచ్చినదికాదు. (ప్రియో దేవానాం) వేదరూప సత్యవిద్యను నే నెట్లుపదేశించి విద్వాంసులకు ప్రియుడ నగుచున్నానో, (దక్షిణాయై దాతురిహ భూయాసమ్) సర్వస్వము దానము చేయుటచే ప్రియుడ నగుచున్నానో, యట్లే మీరును పక్షపాతరహితులై వేదవిద్య నుపదేశించి యెల్లరకు ప్రియులు కండు. (అయం మే కామః సమృధ్యతామ్) వేదప్రచార రూపమగు నా యిష్టము లోకమున నెట్లు వ్యాపించునో యట్లే మీరును వేదవిద్య ప్రపంచమున నెల్లపుడు ప్రచారమున నుండునట్లు కోరు... - యత్నింపుడు. (ఉపమాదో నమతు) అనంతవిద్యాకారణముగ నాలో నానందమున్నట్లు, వేదవిద్యను గ్రహించి, ప్రచార మొనర్చువారికి ప్రాపంచిక సుఖములు, మోక్షసుఖము లభించును. కావున మీరును నెల్లరకు సమానముగ వేదవిద్యను గఱప యత్నింపవలెను. ఇందు భేదభావ ముంచరాదు. కారణమేమన పక్షపాతము లేక యెల్లరి హితముకొఱకు నేను వేదము నుపదేశించినట్లు మీరు నుపదేశించి, ప్రవర్తించిన నేను ప్రసన్నుడ నగుదును' అని మంత్రాభిప్రాయము.

'బృహస్పతే అతియదర్య' అను నీ తరువాతి మంత్రమునందును పరమేశ్వరుడే గ్రహింపబడినాడు. కావున నెల్లరకు వేదాధికారమున్నది.

సం॥ వర్ణాశ్రమా అపి గుణకర్మాచారతో హి భవంతి. అత్రాహ మనుః—

"శూద్రో బ్రాహ్మణతామేతి, బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్.

క్షత్రియాజ్జాతమేవం తు, విద్యాద్ వైశ్యాత్తథైవ చ" ౧ మను. ౧౦–౬౫

శూద్రః పూర్ణవిద్యానుశీలతాది బ్రాహ్మణగుణయుక్తశ్చేద్ బ్రాహ్మణతామేతి, బ్రాహ్మణభావం ప్రాప్నోతి, యోఽస్తి బ్రాహ్మణస్యాధికారస్తం సర్వం ప్రాప్నోత్యేవ. ఏవమేవ కుచర్యాఽధర్మాచరణ నిర్బుద్ధి మూర్ఖత్వ పరాధీనతా పరసేవాది శూద్రగుణైర్ యుక్తో బ్రాహ్మణశ్చేత్ స శూద్రతా మేతిః శూద్రాధికారం ప్రాప్నోత్యేవ. ఏవమేవ క్షత్రియాజ్జాతం క్షత్రియాదుత్పన్నం వైశ్యాదుత్పన్నం ప్రతి చ యోజనీయమ్. అర్థాద్ యస్య వర్ణస్య గుణైర్ యుక్తో యో వర్ణః, స తత్తదధికారం ప్రాప్నోత్యేవ.

తె॥ వర్ణాశ్రమ వ్యవస్థయు గుణకర్మముల యాచరణవిభాగమును బట్టియు గలుగును. ఈ విషయమున మనుస్మృతి ప్రమాణము –

(శూద్రో బ్రాహ్మణతా మేతి) శూద్రుడు బ్రాహ్మణుడు, బ్రాహ్మణుడు శూద్రుడు నగును. గుణకర్మములు బ్రాహ్మణుడగుటకు దగినట్లున్న బ్రాహ్మణుడగును. శూద్రుడగుట కనుకూలముగ నున్న శూద్రుడగును. బ్రాహ్మణుడు క్షత్రియాదుల గుణములు గలవాడయిన క్షత్రియాది నామవాచ్యుడగును. అట్లే శూద్రుడు మూర్ఖుడై యున్న శూద్రుడే యగును. ఉత్తమ గుణయుక్తుడగు నెడల నాగుణముల ననుసరించి యతడు బ్రాహ్మణాది పదములతో వ్యవహరింప యోగ్యుడగును. అట్లే క్షత్రియ వైశ్యులను గూర్చియు నెఱుగనగును. శూద్రునకు వేదము జదువ నధికారము లేకున్నచో నతడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యాధికారముల నెట్లు బొందగల్గును ? దీనింబట్టి యిరువది యైదవయేట వర్ణాధికారము సరిగా తెలియునని నిశ్చితముగు చున్నది.

ఇరువదియైదేండ్లు వచ్చువఱకు మనుజుని బుద్ధి పెరుగుచుండును. కావున నప్పుడే గుణకర్మములను బాగుగ పరీక్షించి యెవడే వర్ణమున కధికారియో నిర్ణయించుట యుచితము. ౧

సం॥ ఏవమే వాపస్తంబసూత్రేఽప్యస్తి –

"ధర్మచర్యయా జఘన్యో వర్ణః పూర్వం

పూర్వం వర్ణమాపద్యతే జాతిపరివృత్తౌ" ౧ ప్ర. ౨–౫. ౧౧–౧౦

"అధర్మచర్యయా పూర్వో వర్ణో జఘన్యం

జఘన్యం వర్ణమాపద్యతే జాతిపరివృత్తౌ" ౨ ప్రశ్న. ౨–౫–౧౧–౧౧

సత్యధర్మాచరణేనైవ శూద్రో వైశ్యం, క్షత్రియం, బ్రాహ్మణం చ వర్ణమాపద్యతే. సమంతాత్ ప్రాప్నోతి, సర్వాధికారమిత్యర్థః జాతిపరివృత్తావిత్యుక్తే జాతేర్ వర్ణస్య పరితః సర్వతో యా వృత్తి రాచరణం తత్సర్వం ప్రాప్నోతి. ౧

ఏవమేవ స లక్షణేనా ధర్మాచరణేన పూర్వో వర్ణో బ్రాహ్మణో, జఘన్యం న్యస్మాదధఃస్థితం క్షత్రియం వైశ్యం శూద్రం చ వర్ణ మాపద్యతే, జాతిపరివృత్తౌ చేతి పూర్వవత్. ౨

"అర్థాత్ ధర్మాచరణ మే వోత్తమవర్ణాధికారే కారణ మస్తి ఏవ మేవాధర్మాచరణం కనిష్ఠవర్ణాధికార ప్రాప్తేశ్చేతి"

యత్ర యత్ర శూద్రో నాధ్యాపనీయో, న శ్రావణీయశ్చేత్యుక్తం, తత్రాయమభిప్రాయః - శూద్రస్య ప్రజ్ఞావిరహత్వా ద్విద్యాపఠనధారణ విచారానమర్థత్వాత్ తస్యాధ్యాపనం శ్రావణం వ్యర్థమేవాస్తి, నిష్ఫలత్వా చ్చేతి.

తె॥ ఆపస్తంబసూత్రమున నిట్లున్నది.

(ధర్మచర్యయా) ధర్మాచరణమువలన క్రిందివర్ణమువారు పూర్వ వర్ణాధికారమును బొందుదురు. ఈ యధికారము నామమాత్రము కాదు. శూద్రుడు ధర్మాచరణము వలన బ్రాహ్మణ వర్ణాధికారమును బొందును. (ఆపద్యతే జాతిపరివృత్తౌ) ౧

(అధర్మచర్యయా) అట్లే అధర్మమువలన బ్రాహ్మణాద్యుత్తమ వర్ణములవారు నిమ్నవర్ణాధికారమును బొందుదురు. ౨

కావున ధర్మాచరణము ఉత్తమవర్ణాధికారమునకును, అధర్మాచరణము నిమ్న వర్ణాధికారమునకును కారణమగుచున్నది.

దీనినిబట్టి వేదాధ్యయనాధికార మెల్లరకు గలదని సిద్ధమగుచున్నది. శూద్రునకు వేదము వినుటకు, చదువుటకు నధికారము లేదని వ్రాసినతావున, మూర్ఖుడు బుద్ధిహీనుడునగువాడు శూద్రుడనియు, అతడు చదువ సమర్థుడు కాడనియు, వేదమును చదివి, దానిని ధారణ చేయజాలడనియు నెంచినందువలన నతనికి వేదము చెప్పుటయు, చదివించుటయు వ్యర్థమగును. కావున నట్లు చేయరాదని మాత్రమే తెలిసికొన వలెను.

అధికారానాధికార విషయము సమాప్తము.

# అథ పఠనపాఠన విషయః సంక్షేపతః

సం॥ అత్రాదౌ పఠనస్యారంభే శిక్షారీత్యా స్థానప్రయత్న స్వరజ్ఞానాయ అక్షరోచ్చారణోపదేశః కర్తవ్యః, యేన నైవ స్వరవర్ణోచ్చారణ జ్ఞానవిరోధః స్యాత్ తద్యథా 'ప' ఇత్యస్యోచ్చారణమోష్ఠౌ సంయోజ్యైవ కార్యమ్. అస్యోష్ఠౌ స్థానం స్పృష్టః ప్రయత్న ఇతివేద్యమ్. ఏవమేవ సర్వత్ర. అత్ర మహాభాష్యకారః పతంజలి మహాముని రాహ.

"దుష్టః శబ్దః స్వరతో వర్ణతో వా మిథ్యాప్రయుక్తో న తమర్థ మాహ. స వాగ్వజ్రో యజమానం హినస్తి యథేంద్రశత్రుః స్వరతోఽపరాధాత్" ౧ మ. భాష్య. ౧-౧-౧

నైవ స్థాన ప్రయత్నయోగేన వినోచ్చారణే కృతే అక్షరాణాం యథావత్ ప్రకాశః పదానాం లాలిత్యం చ భవతి. యథా గానకర్తా షడ్జాదిస్వరాలాపనేఽన్యథోచ్చారణం కుర్యాచ్చేత్, న తస్యైవాపరాధో భవేత్, తద్వద్వేదేష్వపి ప్రయత్నేన సహ స్వస్వస్థానే ఖలు స్వరవర్ణోచ్చారణం కర్తవ్యమ్. అన్యథా దుష్టః శబ్దో దుఃఖదోఽనర్థకశ్చ భవతి. యథావదుచ్చారణ ముల్లంఘ్యోచ్చారితే శబ్దే వక్తు రపరాధ ఏవ విజ్ఞాయతే; త్వం మిథ్యాప్రయోగం కృతవానితి. నైవ స మిథ్యాప్రయుక్తః శబ్దస్తమభిప్రేత మర్థమాహ.

తద్యథా – సకలమ్, శకలమ్; సకృత్ శకృదితి. సకలశబ్దః సంపూర్ణార్థవాచీ. శకల ఇతి ఖండవాచీచ. ఏవం సకృదిత్యేకవారార్థవాచీ. శకృదితి మలార్థవాచీ చాత్ర. సకారోచ్చారణే కర్తవ్యే శకారోచ్చారణం క్రియతే చేత్. ఏవం శకారోచ్చారణే కర్తవ్యే సకారోచ్చారణం చ, తదా స శబ్దః స్వవిషయం నాభిధత్తే. స వాగ్వజ్రో భవతి. యమర్థమ్మత్వోచ్చారణం క్రియతే, స శబ్దస్తదభిప్రాయనాశకో భవతి. తద్వక్తారం యజమానం త దధిష్ఠాతారం చ హినస్తి; తేనార్థేన హీనం కరోతి. యథేంద్రశత్రురయం శబ్దః స్వరస్యాపరాధా ద్విపరీతఫలో జాతః. తద్యథా – ఇంద్రః సూర్యలోకస్తస్య శత్రురివ మేఘః. అత్ర ఇంద్రశత్రుశబ్దే తత్పురుషసమాసార్థ మంతోదాత్తే కర్తవ్యే ఆద్యుదాత్త కరణాద్ బహువ్రీహిః సమాసః కృతో భవతి. అస్మిన్ విషయే తుల్య యోగితా త్వలంకారేణ మేఘసూర్యవర్ణనంకృతమితి, తతోఽర్థవైపరీత్యం జాయతే. ఉత్తరపదార్థ ప్రధానస్తత్పురుషః; అన్యపదార్థప్రధానో బహువ్రీహిః సమాసో భవతి, తత్ర యస్యేచ్ఛా, సూర్యస్య గ్రహణేఽస్తి, తేనేంద్రశత్రు శబ్దః కర్మ ధారయ సమాసే నాంతోదాత్త ఉచ్చారణీయః. యస్య చ మేఘస్య, తేన బహువ్రీహి సమాస మాశ్రిత్యాద్యుదాత్తస్వరశ్చేతి నియమోస్తి. అత్రాన్యథాత్వే కృతే మనుష్యస్య దోష ఏవ గణ్యతే. అతః కారణాత్ స్వరోచ్చారణం వర్ణోచ్చారణం చ యథావదేవ కర్తవ్యమితి. ౧

తె॥ బాలబాలికలకు పఠనపాఠనములను ప్రారంభించునపుడు శిక్షారీతిననుసరించి అక్షరోచ్చారణమును నేర్పవలెను. స్థానప్రయత్నములయు, స్వరములయు జ్ఞానము చక్కఁగ గలుగునట్లు యత్నింపవలెను. 'ప' కారమునకు స్థానము పెదవులు; ప్రయత్నము స్పృష్టము. పెదవులను బాగుగ కలిపి యుచ్చరించిన 'ప' స్పష్టముగ పలుకనగును. కొండొక యక్షరముతో స్వర, వ్యంజనములు కలిసి యున్నప్పుడును వాని వాని స్థానప్రయత్నములు గుర్తెఱిగి యుచ్చరింపవలెను. వ్యాకరణమునందు, శిక్షాగ్రంథమునను నీవిషయము వివరముగ లభించును. మహాభాష్యకారుడైన పతంజలి మహామునియు నిట్లు నుడివెను.

స్వరవర్ణోచ్చారణమున వైపరీత్యము గలిగినచో శబ్దము దుష్టమనబడును. ఆ శబ్దము మూలార్థము దెలుపదు. (సవాగ్వజ్రో) స్థానప్రయత్నములను చక్కగా తెలిసికొనక యుచ్చరించిన పదము ప్రసన్నతను గలిగింపనట్లే, స్వరవైపరీత్యముగల యుచ్చారణము, గాన విద్యయు సుందరములుకావు. గాయకుడు షడ్జము మున్నగు స్వరములను సరిగా పలుకని నాడది యతని యపరాధ మనబడును. ఇట్లే వేదాది గ్రంథపఠనమున స్వర వర్ణోచ్చారణము యత్నపూర్వకముగ చేయవలెను. విపరీతోచ్చారణము చేసిన నది (దుష్టః శబ్దః) దుఃఖమునొసంగునదియు, నసత్యము నగును. శబ్దమును సరిగా నుచ్చరింపక విపరీతముగా నుచ్చరించినపు డా దోషము – శబ్దము నుచ్చరించిన వ్యక్తి దగును. విద్వాంసులట్టి వానిని 'నీవు శబ్దమును శుద్ధముగ నుచ్చరింపలేదు. కావున నది నీ యభిప్రాయమును సరిగా చెప్పజాలదు' అని యందురు. ఉదాహరణమునకు : (సకల) సకల శబ్దము సంపూర్ణమును దెలుపును. ఆ శబ్దము నందలి దంత్యసకారస్థానమున తాలవ్య శకారమును జేర్చి సకలమనుటకు 'శకలము' అనిన పక్షమున నది ఖండము – భాగమును దెలుపును. అట్లే 'సకృత్' 'శకృత్' శబ్దములు విపరీతోచ్చారణము వలన విపరీతార్థముల నొసంగును. సకృత్ = ఒక మాటు. దానిని 'శకృత్' అని పలికినచో నది 'పెంట' అను నర్థము నిచ్చును. కావున శబ్దములను సరిగా నుచ్చరించిన సరియైన యర్థమును దెలుపును. లేకున్న విపరీతార్థములను దెలుపును. అప్పుడది చెప్పువాని యభిప్రాయమును హతము చేయును. ఈ దోషము శబ్దము నుచ్చరించువానిదే యగును.

(ఇంద్రశత్రుః) ఇంద్రశత్రువు అనుపదములోని 'ఇ' కారమును ఉదాత్తస్వరముగా నుచ్చరించిన నీ శబ్దము అన్యపదార్థము ప్రధానముగా గల బహువ్రీహి సమాసమగును. అంతోదాత్తముగ నుచ్చరించిన నుత్తర పదార్థ ప్రధానమగు తత్పురుష సమాసమగును. సూర్యునకు ఇంద్రుడనియు, మేఘమునకు వృత్రాసురుడనియు నామములు. ఇంద్రశత్రు పదముతో సూర్యమేఘముల వర్ణనము తుల్య యోగితాలంకారముతో చేయబడినది. సూర్యుని – ఇంద్రుని యుత్తమత్వము నపేక్షించి చెప్పదలచువాడు ఇంద్రశత్రుసమాస పదమును అంతోదాత్తముగ నుచ్చరింపవలెను. మేఘవృత్రాసురుని యభివృద్ధిని గోరువాడు ఆద్యుదాత్తముగ నుచ్చరింప వలెను. కావున స్వరోచ్చారణము, వర్ణోచ్చారణముకూడ సరిగా చేయగలుగవలెను.

సం॥ తథా భాషణ శ్రవణాసనగమనోత్థాన భోజనాధ్యయన విచారార్థ యోజనాదీనామపి శిక్షా కర్తవ్యైవ. అర్థజ్ఞానేన వినైవ పఠనేకృతే పరమోత్తమం ఫలం ప్రాప్నోతి. పరంతు యో న పఠతి తస్మాత్త్వయం పాఠమాత్రకార్య వృత్తమో భవతి. యస్తు ఖలు శబ్దార్థసంబంధ విజ్ఞానపురస్సర మధీతే. స ఉత్తమతరః. యస్త్వేవం వేదాన్ పఠిత్వా విజ్ఞాయ చ శుభగుణ కర్మాచరణేన సర్వోపకారీ భవతి, స ఉత్తమతమః, అత్ర ప్రమాణాని.

"ఋచో అక్షరే పరమే వ్యోమన్ యస్మిన్ దేవా అధివిశ్వే నిషేదుః యస్తన్న వేద కిమృచా కరిష్యతి య ఇత్తద్విదుస్త ఇమే సమాసతే" ౨
ఋ. ౧–౧౬౪–౩౯

"స్థాణురయం భారహారః కిలాభూ దధీత్య వేదం న విజానాతి యోఽర్థమ్ యోఽర్థజ్ఞ ఇత్ సకలం భద్ర మశ్నుతే నాకమేతి జ్ఞాన విధూతపాప్మా" ౩

"యద్ గృహీత మవిజ్ఞాతం నిగదేనైవ శబ్ద్యతే, అనగ్నా వివశుష్కైధో న తజ్జ్వలతి కర్హిచిత్" ౪
నిరుక్త. ౧–౧౮

"ఉత త్వః పశ్య న్న దదర్శ వాచ ముత త్వః శృణ్వ న్న శృణోత్యేనామ్, ఉతో త్వస్మై తన్వం విసస్రే జాయేవ పత్య ఉశతీ సువాసాః" ౫
ఋ. ౧౦–౭౧–౪

"ఉత త్వం సఖ్యే స్థిరపీతమాహుర్ నైనం హిన్వంత్యపి వాజినేషు, అధేన్వా చరతి మాయయైష వాచం శుశ్రువాం అఫలా మపుష్పామ్" ౬ ఋ. ౧౦-౭౧-౫

అభిప్రాయః – అత్రార్థజ్ఞానేన వినా అధ్యయనస్య నిషేధః క్రియత ఇతి. (ఋచో౽క్షరే) యస్మిన్ వినాశరహితే పరమోత్కృష్టే వ్యోమవద్ వ్యాపకే బ్రహ్మణి చత్వారో వేదాః పర్యవసితార్థాః సంతి. ఋగుప లక్షణం చతుర్ణాం వేదానాం గ్రహణార్థమ్; తత్ కిం బ్రహ్మేత్యత్రాహ – యస్మిన్ విశ్వే దేవాః సర్వే విద్వాంసో, మనుష్యాః, ఇంద్రియాణి చ సూర్యాదయశ్చ సర్వే లోకాః అధినిషేదుర్ యదాధారేణ నిషణ్ణాః స్థితా స్తద్ బ్రహ్మ విజ్ఞేయమ్. (యస్తం న వేద) యః ఖలు తన్న జానాతి సర్వోపకారకరణార్థాయా మీశ్వరాజ్ఞాయాం యథావ న్న వర్తతే, స పఠితయాపి ఋచా వేదేన కిం కరిష్యతి, నైవాయం కదాచిద్ వేదార్థ విజ్ఞానజాతం కిమపి ఫలం ప్రాప్నోతీత్యర్థః (య ఇత్ తద్విదుస్త ఇమే సమాసతే) యేచైవం తద్ బ్రహ్మవిదు స్త ఏవ ధర్మార్థ కామమోక్షాఖ్యం ఫలం సమ్యక్ ప్రాప్నువంతి. తస్మాత్ సార్థకమేవ వేదాదీనా మధ్యయనం కర్తవ్యమ్. ౨

(స్థాణురయం) యః పురుషో వేదమధీత్య పాఠమాత్రం పఠిత్వా౽ర్థం న జానాతి, తం విజ్ఞాయాపి ధర్మం నాచరతి; స మనుష్యః స్థాణుః కాష్ఠస్తంభవద్ భవతి. అర్థా జ్ఞడవద్విజ్ఞేయో భారవాహశ్చ. యథా కశ్చిన్మనుష్యః పశుశ్చ భారమాత్రం వహం స్తన్న భుంక్తే, కింతు తేనోఢం ఘృతమిష్ట కస్తూరీ కేసరాదికం కశ్చిద్ భాగ్యవానన్యో మనుష్యో భుంక్తే. యో౽ర్థ విజ్ఞానశూన్య మధ్యయనం కరోతి, స భారవాహవత్ (కిలాభూత్) భవతీతి మంతవ్యమ్. (యో౽ర్థజ్ఞ) యో౽ర్థస్య జ్ఞాతా వేదానాం శబ్దార్థసంబంధవిద్ భూత్వా ధర్మాచరణో భవతి, స వేదార్థ జ్ఞానేన (విధూత పాప్మా) పాపరహితః సన్ మరణాత్ ప్రాగేవ (సకలం) సంపూర్ణం (భద్రం) భజనీయం సుఖం (అశ్నుతే) ప్రాప్నోతి. పునశ్చ శరీరం త్యక్త్వా (నాకమేతి) సర్వదుఃఖ రహితం మోక్షాఖ్యం బ్రహ్మపదం ప్రాప్నోతి. తస్మాద్ వేదానా మర్థజ్ఞాన ధర్మానుష్ఠాన పూర్వకమే వాధ్యయనం కర్తవ్యమ్. ౩

(యద్ గృహీతమవిజ్ఞాతం) యేన మనుష్యేణ యదర్థ జ్ఞాన శూన్యం వేదాధ్యయనం క్రియతే, కింతు (నిగదేన) పాఠమాత్రేణైవ (శబ్ద్యతే) కథ్యతే, తత్ (కర్హిచిత్) కదాచిదపి (న జ్వలతి) న ప్రకాశతే. కస్మిన్ కిమివ? (అనగ్నా వివ శుష్కైధః) అవిద్యమానాగ్నికే స్థలే శుష్కం సాంప్రతం ప్రజ్వలన మింధన మివ. యథా౽నగ్నౌ శుష్కాణాం కాష్ఠానాం స్థాపనే నా౽పి దాహప్రకాశౌ న జాయంతే, తాదృశమేవ తదధ్యయన మితి. ౪

(ఉత త్వః పశ్యన్న దదర్శ) అపి ఖల్వేకో వాచం శబ్దం పశ్యన్నర్థం న పశ్యతి (ఉత త్వః శృణ్వ న్న శృణోత్యేనామ్) ఉ ఇతి వితర్కే, కశ్చిన్మనుష్యో వాచం శబ్దముచ్చారయన్నపి న శృణోతి తదర్థం న జానాతి, యథా తేనోచ్చారితా శ్రుతా౽పి వాక్ అవిదితా భవతి; తథైవా౽ర్థజ్ఞానవిరహ మధ్యయన మితి మంత్రార్థేనా విద్యాలక్షణ ముక్తమ్. (ఉతో త్వస్మై) యో మనుష్యో౽ర్థజ్ఞానపూర్వకం వేదానామధ్యయనం కరోతి తస్మై (వాక్) విద్యా (తన్వం) శరీరం స్వస్వరూపం (విసస్రే) వివిధతయా ప్రకాశయతి. కస్మై కా కిం కుర్వతీవ? (జాయేవ పత్య ఉశతీ సువాసాః) యథా శోభనాని వాసాంసి వస్త్రాణి ధారయంతీ, పతిం కామయమానా స్త్రీ స్వస్వామినే స్వమాత్మానం శరీరం ప్రకాశయతి. తథైవార్థజ్ఞానపూర్వకాధ్యయనకర్త్రే మనుష్యాయ, విద్యా స్వమాత్మానం స్వస్వరూప మీశ్వరమారభ్య పృథివీ పర్యంతానాం పదార్థానాం జ్ఞానమయం ప్రకాశయ తీత్యర్థః ౫

(సఖ్యే) యథా సర్వేషాం ప్రాణినాం మిత్రభావకర్మణి, (ఉతత్వం) అన్యమనూచానం పూర్ణవిద్యా యుక్తం (స్థిరపీతం) ధర్మానుష్ఠానేశ్వర ప్రాప్తిరూపం మోక్షఫలం పీతం ప్రాప్తం యేన, తం విద్వాంసం పరమ సుఖప్రదం మిత్రం (ఆహుః) వదంతి, (నైనం హిన్వం త్యపి వాజినేషు) ఈదృశం విద్వాంసం కస్మింశ్చిద్వ్యవహారే కేఽపి న హింసంతి. తస్య సర్వప్రియ కారకత్వాత్. తథైవ నైవ కేచిత్ప్రశ్నోత్తరాదయో వ్యవహారా వాజినేషు విరుద్ధవాదిషు శత్రుభూతేష్వపి మనుష్యే ష్వేన మర్థవిజ్ఞానసహితస్యాధ్యేతారం మనుష్యం హిన్వంతి, తస్య సత్య విద్యాన్వితయా కామదుహా వాచానహ వర్తమానత్వేన సత్య విద్యాశుభ లక్షణాన్వితత్వాత్, ఇత్యనేన మంత్ర పూర్వార్ధేన విద్వత్ ప్రశంసోచ్యతే.

అథైతన్మంత్రోత్తరార్ధేన అవిద్వల్లక్షణ మాహ (అధేన్వాచరతి) యతో యో హ్యవిద్వాన్, (అపుష్పామ్) కర్మోపాసనానుష్ఠానాచారవిద్యారహితాం (అఫలాం) ధర్మేశ్వర విజ్ఞానాచార విరహాం వాచం శుశ్రువాన్–శ్రుతవాన్; తథాఽర్థశిక్షారహితయా భ్రమసహితయా (మాయయా) కపటయుక్తయా వాచాఽస్మింల్లోకే చరతి, నైవ స మనుష్యజన్మని స్వార్థపరోపకారాఖ్యం చ ఫలం కించిదపి ప్రాప్నోతి. తస్మాదర్థ జ్ఞాన పూర్వక మేవాధ్యయన ముత్తమం భవతీతి. ౬

తె॥ బాలబాలికలకు మాటలాడుట, వినుట, నడచుట, కూర్చుండుట, నిలుచుండుట, తినుట, త్రాగుట, చదువుట, ఆలోచించుట, పదార్థముల నెఱుగుట, వానిని సంగ్రహించుట మున్నగు ననేక విషయములకు సంబంధించిన శిక్షణ నొసంగవలెను. అర్థజ్ఞానములేని చదువువలన నుత్తమ ఫలము లభింపజాలదు. కాని, బొత్తిగా చదువని వానికంటె నర్థజ్ఞానము లేని మూలపాఠము మాత్రము నేర్చినను కొంత మేలే యగును. కేవల పఠనముచేయు వానికంటె నర్థసహితముగ వేదాధ్యయనము చేయుట మిక్కిలి శ్రేష్ఠము. చదువువలన నిజమైన ఫలమప్పుడే లభించును. వేదముల నర్థసహితముగ పఠించి, యుత్తమ గుణములను గ్రహించి శ్రేష్ఠకర్మముల నాచరించు వాడెల్లరికంటె నుత్తముడు. ఇందులకనేక వేదమంత్రములు ప్రమాణములు.

(ఋచో అక్షరే పరమే వ్యోమన్) ఇట్టి మంత్రములలో నర్థజ్ఞానములేని పఠనము తగదని నిషేధింప బడినది. (ఋచో) నాశము లేనివాడు, నెల్లరికంటె శ్రేష్ఠుడు, ఆకాశమువలె వ్యాపకుడు, అన్నింటియందు నుండువాడు, అర్థసహిత వేదముల కాధారమైనవాడు, జగత్తు నంతటిని నుత్పన్నము చేసినవాడు నగు నా పరమేశ్వరుడు పరబ్రహ్మమెవరు? అని ప్రశ్నించి దానికి సమాధాన మీ మంత్రముననే చెప్పబడినది. (యస్మిన్ దేవా) విద్వాంసులు, సర్వేంద్రియములు, సర్వమనుష్యులు, సూర్యాది సర్వలోకములు నెవనిలో నున్నవో, యతడే పరమేశ్వరుడు. అతడే బ్రహ్మము. వేదములను జదివియు, నిట్టి యీశ్వరు నెఱుగని వానికి వేదార్థముల నెఱిగినందువలన గలుగు ఫలము లభించునా? ఎన్నడును లభింపదు. కావున వేదవిషయమున మేమింతకు పూర్వము వ్రాసినట్లు వ్యవహరించువాడే యత్యంతానందమును బొందును. కేవలము మంత్రపాఠము చేయువాడు ఉత్తమ సుఖమును బొందనేరడు. కావున నర్థజ్ఞానముతోనే యేకొంచె మైనను జదువవలెను.

(స్థాణు...) వేదములను బఠించి, వాని యర్థము నెఱుగని మనుజుడు బరువుమోయు పశువు వంటివాడు; ఫలపుష్పభారమును వహించు వృక్షము వంటివాడు నగును. వృక్షము తాను వహించు ఫలపుష్ప గుణముల ననుభవించి యానందింపనేరదు. ఇతరులు సుఖము ననుభవింతురు. పశువు తాను మోయు వస్తువుల గుణముల ననుభవించి సుఖింపదు. కేవలము వేదపాఠము చేయువ్యక్తియు వేదమునందలి

యర్థమును గ్రహింపక సుఖపడనేరడు. (యో అర్థజ్ఞ) అర్థము నెఱుగు వ్యక్తి యధర్మమునుండి విడివడి, ధర్మాత్ముడై జన్మ మరణరూప దుఃఖములను బోగొట్టుకొని, సంపూర్ణ సుఖము ననుభవించును. జ్ఞానముచే పవిత్రుడైనవాడు (నాక మేతి) దుఃఖరహితుడై మోక్షసుఖమును బొందును. కావున వేదాది శాస్త్రముల నర్థసహితముగ నేర్వవలెను. ౩

(యద్ గృహీత) వేదములను అర్థరహితముగ బఠించుట యంధకారమునకు సమానమగును. (అనగ్నావివ శుష్కైధో) నిప్పులేని యెండుకట్టె దహన ప్రకాశములజేయ జాలనట్లు అర్థము తెలియని వేదపఠనము జ్ఞానానందముల నొసంగక నిష్ఫలమగును. అట్టి యధ్యయనము వలన నవిద్య నశింపదు. ౪

(ఉత త్వః పశ్యన్న దదర్శ వాచం) వేదమును పఠించియు, వినియు శబ్దార్థములకు గల సంబంధము నెఱుగనివాడు మూర్ఖుడు. అవిద్వాంసుడే యగును. (ఉతోత్వస్మై) శబ్దము, అర్థము, వానికిగల సంబంధము నెఱిగి బాగుగ విద్యాప్రయోజనమును గుర్తించినవాడే విద్వాంసుడు. అట్టి పురుషునకే విద్యాస్వరూపము నెఱిగినందువలన పరమానంద రూపఫలముకూడ ప్రాప్తించును. (జాయేవ పత్య ఉశతీసువాసాః) సుందర వస్త్రములను ధరించి, పతిని కామించు పతివ్రతా స్త్రీ తన భర్త కెట్లు తన శరీరమును బ్రదర్శించునో, యట్లే యర్థసహితముగ వేదముల నధ్యయనము జేసినవానికే విద్యయు దనస్వరూపమును జూపి, పరమాత్ముడు మొదలు పృథివి వఱకు గల సమస్త వస్తువుల జ్ఞానమును గలుగజేయును; పరమానందము నొన గూర్చును. ౫

(ఉత త్వం సఖ్యే) విద్వాంసుల నెల్లరు ప్రేమింపవలెను. మైత్రికర్తుడైన మనుజునెల్ల రేవిధముగ ప్రేమింతురో యట్లే నీవును వేదాది విద్యా విజ్ఞాన యుక్తుడగు పురుషుని గౌరవించి, యతనికి సుఖము నొడగూర్పుము. అందువలన నీ కతనినుండి విద్య ప్రాప్తించును. అర్థసహితముగ విద్య నభ్యసించి, విద్యానుకూలమగు నాచరణము గలవాడై, ధర్మార్థ కామమోక్షములను సాధించువాడే విద్వాంసుడనబడును. అతనినే 'స్థిరపీతు' డందురు. అతడే లోకమునకు సుఖము జేకూర్చును. (నైనం హిన్వంత్యపి) అతని కెవరును దుఃఖమును గలిగింపరు. అతని హృదయమున విద్యారూప సూర్యుడు ప్రకాశించు చుండును. కావున దుఃఖరూప చోరుడతనికి దుఃఖము నొసంగడు. (అధేన్వా చ) అర్థమును, అభిప్రాయమును నెఱుగని వానిని బ్రయోగించువాడు, వినువాడు సుఖమును బొందజాలరు. దుఃఖరూప శత్రువతని నెల్లప్పుడు బాధించుచుండును. విజ్ఞానము లేనందున నా దుఃఖరూప శత్రువు నతడు జయింపజాలడు. కావున నర్థజ్ఞాన యుక్తమగు నధ్యయనము కోరిన సుఖములను జేకూర్చును. ౬

*సం॥ మనుష్యైర్ వేదార్థ విజ్ఞానాయ వ్యాకరణాష్టాధ్యాయీ మహాభాష్యాధ్యయనమ్, తతో నిఘంటు నిరుక్త ఛందో జ్యోతిషాణాం వేదాంగానామ్. తతో మీమాంసా వైశేషికన్యాయ యోగ సాంఖ్య వేదాంతానాం వేదోపాంగానాం షణ్ణాం శాస్త్రాణామ్, తత ఐతరేయ, శతపథ, సామ, గోపథ బ్రాహ్మణానా మధ్యయనం చ కృత్వా వేదార్థపఠనం కర్తవ్యమ్. యద్వా ఏతత్సర్వ మధీతవద్భిః కృతం వేదవ్యాఖ్యానం దృష్ట్వా చ వేదార్థ జ్ఞానం సర్వైః కర్తవ్యమితి.*

*పూ. ప : కుతః ?*

*ఉ. ప : 'నావేదవిన్మనుతే తం బృహంతమితి' యో మనుష్యో వేదార్థాన్నవేత్తి, స నైవ తం బృహంతం పరమేశ్వరం ధర్మం విద్యాసమూహం వేత్తు మర్హతి.*

పూ. ప : కుతః ?

ఉ. ప : సర్వాసాం విద్యానాం వేద ఏవ అధికరణమస్త్యతః. నహి తమవిజ్ఞాయ కస్యచిత్ సత్యవిద్యా ప్రాప్తిర్ భవితు మర్హతి. యద్ యద్ కించిద్ భూగోలమధ్యే పుస్తకాంతరేషు హృదయాంతరేషు వా సత్య విద్యా విజ్ఞానమభూద్, భవతి, భవిష్యతి చ, తత్ సర్వం వేదాదేవ ప్రసృతమితి విజ్ఞేయమ్.

పూ. ప : కుతః ?

ఉ. ప : యద్ యద్ యథార్థం విజ్ఞానం తత్తదీశ్వరేణ వేదేష్వధికృతమస్తి. తద్ద్వారైవాన్యత్ర కుత్రచిత్ సత్య ప్రకాశో భవితుం యోగ్యః. అతో వేదార్థ విజ్ఞానాయ సర్వైర్ మనుష్యైః ప్రయత్నోఽను ష్ఠేయ ఇతి.

తె॥ వేదార్థము నెఱుగుటకు అర్థసహితముగ వ్యాకరణమున – అష్టాధ్యాయి, ధాతుపాఠము, ఉణాది గణపాఠము, మహాభాష్యము, శిక్ష, కల్పము, నిఘంటు నిరుక్తములు, ఛందస్సు, జ్యోతిషము, నను నీ యాఱు వేదాంగములు; మీమాంస, వైశేషికము, న్యాయము, యోగము, సాంఖ్యము, వేదాంతమునను నాఱు వేదోపాంగములు, ఐతరేయ, శతపథ, సామ, గోపథ బ్రాహ్మణములు నను గ్రంథములు చదువవలెను. వీనిని క్రమముగ నర్థసహితముగ జదివినపుడే వేదార్థము తెలియనగును. తరువాత వేదములకు వ్రాసిన సత్యవ్యాఖ్యానమును గూడ జదివి వేదార్థములను బాగుగ తెలిసికొనవలెను. కారణమేమి ? యన : (నా వేదవిన్మనుతే తం బృహంతమ్) వేదార్థముల నెఱుగనివాడు పరమేశ్వరుని, ధర్మమును, సర్వపదార్థ విద్యలను బాగుగ నెఱుగజాలడు. హేతువేమన?

వేదమే సర్వవిద్యల కధికరణము – ఆధారము. దాని నెఱుగని వానికి సత్యవిద్య లభింపదు. భూగోళమున పుస్తకములందుగాని, మనస్సులందుగాని ప్రకటింపబడిన జ్ఞానమంతయు వేదము మూలముననే ప్రకటితమైనది.

సత్య విద్యల జ్ఞానమంతయు నీశ్వరుడు వేదములందే నింపియున్నాడు. విద్య లేనివాడు కన్నులు లేనివానికి సమానుడు. సమస్త విద్యలకు మూలమగు వేదము జదువక మనుష్యునకు యథార్థజ్ఞానము కలుగదు. కావున నర్థముతోబాటు వేదముల నెల్లరు జదువవలెను.

పఠన పాఠన విషయము సమాప్తము.

# అథ భాష్యకరణ శంకాసమాధానాది విషయః సంక్షేపతః

పూ. ప : కించ భోః ! నవీనం భాష్యం త్వయా క్రియతే, ఆహోస్విత్, పూర్వాచార్యైః కృతమేవ ప్రకాశ్యతే ! యది పూర్వైః కృతమేవ ప్రకాశ్యతే తర్హి తత్ పిష్టపేషణదోషేణ దూషితత్వాన్న కేనాపి గ్రాహ్యం భవతీతి.

ఉ. ప : పూర్వాచార్యైః కృతం ప్రకాశ్యతే. తద్యథా. యాని పూర్వైర్ దేవైర్ విద్వద్భిర్ బ్రహ్మణ మారభ్య యాజ్ఞవల్క్య వాత్స్యాయన జైమిన్యంతైర్ ఋషిభి శ్చైతరేయ శతపథాదీని భాష్యాణి రచితా న్యాసన్, తథా యాని పాణిని పతంజలి యాస్కాది మహర్షిభిశ్చ వేద వ్యాఖ్యానాని వేదాంగాఖ్యాని కృతాని, ఏవమేవ జైమిన్యాదిభిర్ వేదోపాంగాఖ్యాని షట్ శాస్త్రాణి, ఏవ ముపవేదాఖ్యాని, తథైవ వేదశాఖాఖ్యాని చ రచితాని సంతి, ఏతేషాం సంగ్రహమాత్రేణైవ సత్యోఽర్థః ప్రకాశ్యతే. న చాత్ర కించి దప్రమాణం నవీనం స్వేచ్ఛయా రచ్యత ఇతి.

పూ. ప : కిమనేన ఫలం భవిష్యతీతి ?

ఉ. ప : యాని రావణోవట సాయణ మహీధరాదిభిర్ వేదార్థ – విరుద్ధానిభాష్యాణి కృతాని, యాని చైతదనుసారేణ – ఇంగలేండ శారమణ్య దేశోత్పన్నైర్ యూరోపఖండదేశనివాసిభిః స్వదేశ భాషయా స్వల్పాని వ్యాఖ్యానాని కృతాని, తథైవార్యావర్త దేశస్థైః కైశ్చిత్తదనుసారేణ ప్రాకృతభాషయా వ్యాఖ్యానాని కృతాని వా క్రియంతే చ; తాని సర్వాణ్యనర్థగర్భాణి సంతీతి సజ్జనానాం హృదయేషు యథావత్ ప్రకాశో భవిష్యతి; టీకానా మధిక దోషప్రసిద్ధ్యా త్యాగశ్చ. పరంత్వవకాశాభావాత్తేషాం దోషాణా మత్ర స్థాలీపులాక న్యాయవత్ ప్రకాశః క్రియతే.

తద్యథా : యత్ సాయణాచార్యేణ వేదానాం పరమమర్థమవిజ్ఞాయ సర్వే వేదాః క్రియాకాండ తత్పరాః సంతీత్యుక్తం; తదన్యథాస్తి.

పూ. ప : కుతః ?

ఉ. ప : తేషాం సర్వవిద్యాన్వితత్వాత్. తచ్చ పూర్వం సంక్షేపతో లిఖితమస్తి. ఏతావతైవాస్య కథనం వ్యర్థమస్తీ త్యవగంతవ్యమ్. (ఇంద్రం మిత్రం) అస్య మంత్రస్యార్థోఽప్యన్యథైవ వర్ణితః. తద్యథా – తేనాత్రేంద్ర శబ్దో విశేష్యతయా గృహీతో మిత్రాదీని చ విశేషణతయా. అత్ర ఖలు విశేష్యోఽగ్ని శబ్ద ఇంద్రాదీనాం విశేషణానాం సంగే అన్వితోభూత్వా, పునః స ఏవ సద్వస్తు బ్రహ్మ విశేషణం భవత్యేవ మేవ విశేష్యం ప్రతి విశేషణం పునః పునరన్వితం భవతీతి, న చైవం విశేషణమ్. ఏవమేవ యత్ర శతం సహస్రం వైకస్య విశేష్యస్య విశేషణాని భవేయుః. తత్ర విశేష్యస్య పునఃపున రుచ్చారణం భవతి, విశేషణ స్యైకవారమే వేతి. తథైవాత్ర మంత్రే పరమేశ్వరేణాఽగ్నిశబ్దో ద్విరుచ్చారితో విశేష్య విశేషణాభిప్రాయాత్. ఇదం సాయణాచార్యేణ నైవబుద్ధమ్; అత స్తస్య భ్రాంతిరేవ జాతేతి వేద్యమ్. నిరుక్తకారేణాప్యగ్ని శబ్దో విశేష్య విశేషణత్వేనైవ వర్ణితః, తద్యథా –

"ఇమ మేవాగ్నిం మహాంత మాత్మాన మేకమాత్మానం
బహుధా మేధావినో వదంతీంద్రం మిత్రం వరుణ మిత్యాది" నిరు. ౭-౧౮

న చైకస్య సద్వస్తునో బ్రహ్మణో నామాస్తి. తస్మాదగ్న్యాదీ నీశ్వరస్య నామాని సంతీతి బోధ్యమ్. తథా చ 'తస్మాత్ సర్వైరపి పరమేశ్వర ఏవ హూయతే, యథా రాజ్ఞః పురోహితః సదభీష్టం సంపాదయతి, యద్వా యజ్ఞస్య సంబంధిని పూర్వభాగే ఆహవనీయరూపేణావస్థిత' మిత్యుక్త మిదమపి పూర్వాపర విరుద్ధమస్తి. తద్యథా :- సర్వైర్నామభిః పరమేశ్వర ఏవ హూయతే చేత్, పున స్తేన హోమసాధక ఆహవనీయ రూపేణావస్థితో భౌతికాగ్నిః కిమర్థో గృహీతః ? తస్యేదమపి వచనం భ్రమ మూలమేవ. కోఽపి బ్రూయాత్- సాయణాచార్యేణ యద్యపీంద్రాదయ స్తత్ర తత్ర హూయంతే, తథాపి పరమేశ్వరస్యై వేంద్రాది రూపేణావస్థానా దవిరోధ ఇత్యుక్తత్వా దదోష ఇతి. ఏవం ప్రాప్తే బ్రూమః - యదీంద్రాదిభిః నామభిః పరమేశ్వర ఏవోచ్యతే, తర్హి పరమేశ్వరస్య ఇంద్రాది రూపావస్థితిః అనుచితా-తద్యథా - "అజ ఏకపాత్, స పర్యగాచ్ఛుక్రమకాయ" మిత్యాది మంత్రార్థేన పరమేశ్వరస్య జన్మ రూపవత్వ శరీరధారణాది నిషేధాత్తత్ కథన మనదస్తి.

ఏవమేవ సాయణాచార్యకృతభాష్యదోషా బహవః సంతి, అగ్రే యత్ర యత్ర యస్య యస్య మంత్రస్య వ్యాఖ్యానం కరిష్యామ స్తత్ర తత్ర తద్ భాష్యదోషాన్ ప్రకాశయిష్యామ ఇతి.

తె॥ మీరు వేదములకు నవీన భాష్యము వ్రాయుచున్నారా? పూర్వాచార్యుల భాష్యమును ప్రకటించు చున్నారా? పూర్వమును మరల ప్రకటించుట పిష్టపేషణమై వ్యర్థమగును. ఎవరును గ్రహింపరు.

ఉ. ప : ప్రాచీనాచార్యుల భాష్యముల కనుకూలముగ నియ్యది రచియింపబడును. రావణుడు ఉవ్వటుడు, సాయణుడు, మహీధరుడు మున్నగువారు రచియించిన భాష్యములన్నియు మూల మంత్రములకు, ప్రాచీన ఋషికృత వ్యాఖ్యానములకును విరుద్ధముగా నున్నవి. వారు వేదముల సత్యార్థమును, అపూర్వతను కొంచెమైన నెఱుగరైరి. నేను రచియించు నీ భాష్యము వేదములను, వేదాంగములను, ఐతరేయ శతపథాది బ్రాహ్మణ గ్రంథములను ననుసరించియుండును. ఇదియే యిందలి యపూర్వత. ప్రామాణ్యా ప్రామాణ్య విషయమున నే యే గ్రంథములు వేదములకంటె భిన్నశాస్త్రములుగ లెక్కించియుంటిమో యవియన్నియు వేదముల వ్యాఖ్యానములే. అట్లే (౧౧౨౭) పదునొకండు వందల యిరువదియేడు వేదశాఖలును వేద వ్యాఖ్యానములే. వాని ప్రమాణములతో నీభాష్యము రచియింపబడును. ఇందు ప్రమాణ రహితముగ స్వకల్పిత విషయమొండును వ్రాయబడదు. ఇయ్యదియు నీ భాష్యమునందలి యపూర్వతయే.

సాయణాదుల భాష్యముల ననుసరించియే యాంగ్లేయులు, జర్మనులు మఱి యితరులు కొందఱు వ్యాఖ్యానములు రచియించి యున్నారు. ఆ వ్యాఖ్యానములును నశుద్ధములే.

సాయణుడు వేదముల శ్రేష్ఠార్థమును నెఱుగక 'వేదములన్నియు క్రియాకాండమునే ప్రతిపాదించు నని' వ్రాసియున్నాడు. ఇయ్యది యసత్యము. దీనికి కారణములింతకు పూర్వ మీ భూమికయందు వ్రాసియే యుంటిమి చూడుడు. అట్లే (ఇంద్రం మిత్రం) అను మంత్రార్థమునుగూడ సాయణాచార్యుడు భ్రాంతితో చెడగొట్టియున్నాడు. అతని కీ మంత్రము నందలి విశేష్య విశేషణములుకూడ సరిగ బోధపడ లేదు. కావుననే యింద్రపదము విశేష్యమని వర్ణించి యున్నాడు. మిత్రాదిపదము లా యింద్రపదమునకు విశేషణములనియు ననెను. అతడు భ్రమతో నిట్లు వర్ణించి యున్నాడు. వాస్తవమున నీమంత్రమునందు

'అగ్ని' పదము విశేష్యము; ఇంద్రాది పదములు విశేషణములు, అగ్ని శబ్దము విశేషణములగు నింద్రాది పదములతో నన్వితమై మరల సద్వస్తువగు బ్రహ్మకు విశేషణమగును. ఇట్లే విశేష్య పదము ప్రతి విశేషణముతోను నన్వితమగును. విశేషణ మట్లుకాదు. ఒక్క విశేష్యమునకు శతమో, సహస్రమో విశేషణము లున్నయెడ నా విశేష్యము ప్రతివిశేషణముతోను వేఱువేఱుగ నన్వితమగును. విశేషణములతో బాటు విశేష్య మనేక పర్యాయము లుచ్చరింపబడును. కావుననే యీ మంత్రమునందు 'అగ్ని' పదము విశేష్య మగుట వలననే దాని నీశ్వరుడు రెండు పర్యాయములు ప్రయోగించియున్నాడు. ఈ విషయము సాయణునకు బోధపడలేదు. కావున నిట భ్రాంతుడై నాడనుట సిద్ధము. నిరుక్తకారుడు కూడ నీ మంత్రమునందలి 'అగ్ని' పదమునే విశేష్యముగా నంగీకరించియున్నాడు.

చూడుడు : (ఇమమేవాగ్నిం) ఇక్కడ అగ్ని, ఇంద్రాదినామములొక్క సద్వస్తువైన బ్రహ్మకు సంబంధించినవే. కారణమేమన; ఇంద్రాది పదములు 'అగ్ని' పదమునకు విశేషణములు. అగ్ని మున్నగు పదములు బ్రహ్మకు నామములు. నిరు. ౭-౧౮

ఇట్లే సాయణాచార్యు డనేక మంత్రముల వ్యాఖ్యానమున/శబ్దార్థములను విపరీతము చేసియున్నాడు. "రాజపురోహితుడు రాజునకే హితమగు కార్యమును సిద్ధముచేయును. లేక, యజ్ఞమునకు సంబంధించిన పూర్వభాగమున నే యగ్ని హవనార్థమున్నదో యా రూపమున నీశ్వరుడున్నాడు' అను నీ స్థలమునందును సాయణుని వ్యాఖ్యానము సరిగా లేదు. పూర్వాపరములకు విరుద్ధమై, పూర్వ సంబంధమును ఖండితము చేయుచున్నది. ఇట నామములన్నియు నీశ్వరునకే గ్రాహకములయినపుడు, 'హవనము చేయుటకు యోగ్యమగు నగ్ని' యని అగ్నినేల గ్రహింపవలెను ? ఏవరేని 'ఇంద్రాదిదేవత లక్కడక్కడ గ్రహింపబడుదురు. అయినను పరమేశ్వరుడే యింద్రాదిరూపములతో నట నుపస్థితుడగుటవలన నట్లు సాయణాచార్యునిచే చెప్పబడినది. అందువలన దోషము లేదని సమాధానము చెప్పిన నదియు సరికాదు. కారణమేమన -

ఇంద్రాది నామములచే పరమేశ్వరుడే గ్రహింపబడు నెడల పరమేశ్వరు డిట నింద్రాది రూపమున నవస్థితుడై యున్నాడనుట యనుచితము. 'అజ ఏకపాత్' సపర్యగాచ్ఛుక్రమకాయ మవ్రణమ్' అను నీ మంత్రముల యర్థమునుబట్టి పరమేశ్వరుడు శరీరధారి కాడనియు నతని కింద్రాది రూపములుండవనియు స్పష్టమగుచున్నది. అట్టియెడ పరమేశ్వరుడు యజ్ఞమునర్పదగు నగ్నిరూపమున ముందు స్థితుడై యున్నాడనుట సత్యమెట్లగును? ఎన్నడును కాజాలదు.

ఇట్లే సాయణాచార్యుడు భ్రమతో నేయే మంత్రములకు విపరీత వ్యాఖ్యానము చేసి యున్నాడో వాని నా యీ మంత్రభాష్యమున వివరింతుము.

**సం॥ ఏవమేవ మహీధరేణ మహానర్థరూపం వేదార్థదూషకం వేదదీపాఖ్యం వివరణం కృతం తస్యాపీహ దోషా దిగ్దర్శనవత్ ప్రదర్శ్యంతే.**

తె॥ ఇట్లే మహీధరుడును యజుర్వేదమునకు, మూలమున కత్యంత విరుద్ధముగ అనర్థరూపమును, వేదార్థవిదూషకమును నగు "వేదదీప" మను పేరుగల వ్యాఖ్యానమును రచియించియున్నాడు. అందలి దోషములకూడ సంక్షేపముగ నిట జూపుచున్నాము.

**సం॥ "గణానాం త్వా గణపతిగ్ం హవామహే ప్రియాణాం త్వా ప్రియపతిగ్ం హవామహే నిధీనాం త్వా నిధిపతిగ్ం హవామహే వసో మమ ఆహ మజాని గర్భధమా త్వమజాసి గర్భధమ్" ౧**

యజు. ౨౩-౧౯

అస్య మంత్రస్య వ్యాఖ్యానే తేనోక్త మస్మిన్ మంత్రే గణపతిశబ్దాదశ్వోవాజీ గ్రహీతవ్య ఇతి. తద్యథా- మహిషీ-యజమానస్య పత్నీ, యజ్ఞశాలాయాం పశ్యతాం సర్వేషా మృత్విజా మశ్వసమీపే శేతే; శయానా సత్యాహ - హే అశ్వ ! గర్భధం గర్భం దధాతి గర్భధం గర్భధారకం రేతః, అహం ఆ అజాని ఆకృష్య క్షిపామి. త్వం చ గర్భధం రేతః ఆ అజాసి ఆకృష్య క్షిపసి.

తె॥ (గణానాం త్వా) ఈ మంత్రమునందలి గణపతి శబ్దమునకు మహీధరుడు గుఱ్ఱమని యర్థము వ్రాసియున్నాడు. అంతేకాక, 'ఋత్విక్కులందఱు చూచుచుండ యజమానుని పత్ని యజ్ఞశాలయందు గుఱ్ఱము సమీపమున పడుకొన వలెననియు, అట్లుపడుకొని 'ఓ యశ్వమా ! గర్భధారణము గలిగించు నీ రేతస్సు-వీర్యమును ఆకర్షించి, నా యోనియం దుంచుకొందును. నీవు వీర్యమును నాయందుంచుము' అని పలుకవలెననియు వ్రాసియున్నాడు. (ఇంతకంటె మించిన యనర్థము లోకమున నెవరేని చేయగలరా?)

సం॥ అథ సత్యోర్థః -

"గణానాం త్వా గణపతిం హవామహ ఇతి బ్రాహ్మణస్పత్యం. బ్రహ్మ వై బృహస్పతిః, బ్రహ్మణైవైనం తదభిషజ్యతి ప్రథశ్చ యస్య సప్రథశ్చ నామేతి" ఐత. పం-౧ కం-౨౧

"ప్రజాపతి ర్వై జమదగ్నిః, సోఽశ్వమేధః, క్షత్రం వాశ్వో, విడితరే పశవః, క్షత్రస్యైతద్రూపం యద్ధిరణ్యం, జ్యోతిర్వై హిరణ్యమ్" శత-౧౩-౫-౨-బ్రా-౨-కం-౧౪-౧౫-౧౭-౧౬

"న వై మనుష్యః స్వర్గం లోకమంజసా వేదాశ్వో వై స్వర్గం లోక మంజసా వేద"

శత.౧౩-౨-౩-౧

రాష్ట్ర మశ్వమేధో జ్యోతిరేవ తద్రాష్ట్రే దధాతి, క్షత్రాయైవ తద్విశం కృతానుకరా మనువర్త్మానం కరోతి. అథో క్షత్రం వా అశ్వః, క్షత్రస్యైతద్రూపం యద్ధిరణ్యం, క్షత్రమేవ తత్క్షత్రేణ - సమర్ధయతి - విశమేవ తద్విశా సమర్ధయతి. శత. ౧౩-౨-౨-కం-౧౬-౧౫-౧౭-౧౮

గణానాం త్వా గణపతిగ్ం హవామహ ఇతి. పత్న్యః పరియంత్యపహ్నువత ఏవాస్మై ఏత దతోఽన్యే వాస్మై హ్నువతేఽథో ధువత ఏవైనం త్రిః పరియంతి. త్రయో వా ఇమే లోకా ఏభి రేవైనం లోకైర్ ధువతే త్రిః పునః పరియంతి షట్ సంపద్యంతే షడ్ వా ఋతవ ఋతుభి రేవైనం ధువతే.

అప వా ఏతేభ్యః ప్రాణాః క్రామంతి. యే యజ్ఞే ధువనం తన్వతే. నవకృత్వః పరియంతి. నవ వై ప్రాణాః -ప్రాణానేవాత్మన్దత్తే. నైభ్యః ప్రాణా అపక్రామంత్యాహ మజాని గర్భధ మాత్వమజాసి గర్భధమితి. ప్రజావై పశవో గర్భః ప్రజామేవ పశూ నాత్మన్ధత్తే" శత. కాం. ౧౩-౨-౮-౪-కం-౪-౫

(గణానాం త్వా) వయం గణానాం గణనీయానాం పదార్థ సమూహానాం గణపతిం పాలకం స్వామినం (త్వా) త్వాం పరమేశ్వరం (హవామహే) గృహ్ణీమః. తథైవ సర్వేషాం ప్రియాణా మిష్టమిత్రాదీనాం మోక్షాదీనాం చ ప్రియపతిం త్వేతి పూర్వవత్. ఏవమేవ నిధీనాం విద్యారత్నాది కోశానాం నిధిపతిం త్వేతి పూర్వవత్. వసత్యస్మిన్ సర్వం జగద్ వా యత్ర వసతి స వసుః - పరమేశ్వరః, తత్ సంబుద్ధౌ హే వసో, పరమేశ్వర వరత్వమ్. సర్వాన్ కార్యాన్ భూగోలాన్ స్వసామర్థ్యే గర్భవద్దధాతీతి స గర్భధ స్తం త్వా మహం భవత్కృపయా ఆజాని, సర్వథా జానీయామ్. (ఆత్వమజాసి) హే భగవన్ ! త్వం తు ఆసమంతాత్ జ్ఞాతాసి. పునర్ గర్భధ మిత్యుక్త్వా వయం ప్రకృతి పరమాణ్వాదీనాం గర్భధానామపి గర్భధం త్వాం మన్యామహే. నైవాతో భిన్నః కశ్చిద్ గర్భధారకోస్తీతి. ఏవమే వైతరేయ శతపథ బ్రాహ్మణే

గణపతి శబ్దార్థో వర్ణితః. (బ్రాహ్మణస్పత్యస్) అస్మిన్ మంత్రే బ్రాహ్మణో వేదస్య పతేర్ భావో వర్ణితః. బ్రహ్మ వై బృహస్పతి రిత్యుక్తత్వాత్ తేన బ్రహ్మోపదేశే నైవైనం జీవం యజమానం వా సత్యోపదేష్టా విద్వాన్ భిషజ్యతి రోగరహితం కరోతి. ఆత్మనో భిషజం వైద్య మిచ్ఛతీతి, యస్య పరమేశ్వరస్య ప్రథః సర్వత్ర వ్యాప్తో విస్తృతః, సప్రథశ్చ, ప్రకృత్యా ఆకాశాదినా ప్రథేన స్వసామర్థ్యేన వా సహ వర్తతే స సప్రథః. తదిదం నామద్వయం తస్యైవాస్తీతి.

ప్రజాపతిః పరమేశ్వరో వై ఇతి నిశ్చయేన జమదగ్ని సంజ్ఞోఽస్తి. అత్ర ప్రమాణమ్.

"జమదగ్నయః ప్రజమితాగ్నయో వా, ప్రజ్వలితాగ్నయో వా, తై రభిహుతో భవతి"

నిరు. ౭–౨౪

ఇమే సూర్యాదయః ప్రకాశకాః పదార్థా స్తస్య సామర్థ్యాదేవ ప్రజ్వలితా భవంతి. తైః సూర్యాదిభిః కార్యై స్తన్నియమైశ్చ కారణాఖ్య ఈశ్వరోఽభిహుతశ్చాభిముఖ్యేన పూజితో భవతీతి. యః స జమదగ్నిః పరమేశ్వరః (సోఽశ్వమేధః) స ఏవ పరమేశ్వరోఽశ్వమేధాఖ్య ఇతి ప్రథమోఽర్థః.

అథాపరః –క్షత్రం వాశ్వో విడితరే పశవ ఇత్యాది. యథాఽశ్వస్యాపేక్ష యేతరే ఇమేఽజాదయః పశవో న్యూనబలవేగా భవంతి, తథా రాజ్ఞః సభాసమీపే విట్ ప్రజా నిర్బలైవ భవతి. తస్య రాజ్యస్య, యద్ధిరణ్యం సువర్ణాది వస్తు; జ్యోతిః ప్రకాశో వా న్యాయకరణ మేతత్స్వరూపం భవతి. యథా రాజప్రజాలంకారేణ రాజప్రజాధర్మో వర్ణితః, తథైవ జీవేశ్వరయోః స్వస్వామిసంబంధో వర్ణ్యతే, నైవ మనుష్యః కేవలేన స్వసామర్థ్యేన సరలతయా (సహజతయా) స్వర్గం పరమేశ్వరాఖ్యం లోకం వేద, కింత్వీశ్వరానుగ్రహేణైవ జానాతి.

"అశ్వో యత ఈశ్వరో వా అశ్వః" శత. ౧౩–౩–౩–౫

అశ్నుతే వ్యాప్నోతి సర్వం జగత్ సోఽశ్వ ఈశ్వరః, ఇత్యుక్తత్వా దీశ్వరస్యైవాత్రాశ్వసంజ్ఞాస్తీతి.

అన్యచ్చ (రాష్ట్రం వా) రాజ్య మశ్వమేధసంజ్ఞం భవతి. యద్ రాష్ట్రే రాజ్యకర్మణి జ్యోతిర్ దధాతి, తత్ కర్మఫలం క్షత్రాయ రాజపురుషాయ భవతి. తచ్చ స్వసుఖాయైవ విశం ప్రజాం కృతానుకరాం (స్వవర్తమానా మనుకూలాం) కరోతి. అథో ఇత్యనంతరం క్షత్రమేవాశ్వమేధసంజ్ఞకం భవతి. తస్య యద్ధిరణ్యా మేత దేవ రూపం భవతి. తేన హిరణ్యాద్యన్వితేన క్షత్రేణ రాజ్యమేవ సమ్యగ్ వర్తతే న చ ప్రజా. సా తు స్వతంత్ర స్వభావాన్వితయా విశా సమర్ధయతి. అతో యత్రైకో రాజా భవతి, తత్ర ప్రజా పీడితా జాయతే. తస్మాత్ ప్రజా సత్తయైవ రాజ్యప్రబంధః కార్య ఇతి.

(గణానాం) స్త్రియోప్యేనం రాజ్యపాలనాయ, విద్యామయం సంతాన శిక్షాకరణాఖ్యం యజ్ఞం, పరితః సర్వతః ప్రాప్నుయుః; ప్రాప్తాః సత్యోఽన్య సిద్ధయే యదపహ్నవాఖ్యం కర్మాచరంతి, అతః కారణాదేతదేతాసా మన్యే విద్వాంసో దూరీకుర్వంతి. అథో ఇత్యనంతరం య ఏనం విచాలయంతి, తానప్యన్యే చ దూరీకుర్యుః. ఏవమస్య త్రివారం రక్షణం సర్వథా కుర్యుః. ఏవం ప్రతిదినమేతస్య శిక్షయా రక్షణేన చాత్మ శరీరబలాని సంపాదయేయుః, యే నరాః పూర్వోక్తం గర్భధం పరమేశ్వరం జానంతి. నైవ తేభ్యః ప్రాణా బలపరాక్రమాదయోఽ పక్రామంతి. తస్మా న్మనుష్య స్తం గర్భధం పరమేశ్వర మహమాజాని సమంతా జ్జానీయా మితీచ్ఛేత్. (ప్రజా వై పశవః) ఈశ్వర సామర్థ్య గర్భాత్ సర్వే పదార్థా జాతా ఇతి

యోజనీయమ్. యశ్చ పశూనాం ప్రజానాం మధ్యే విజ్ఞానవాన్ భవతి, స ఇమాం సర్వాం ప్రజా మాత్మని అతతి సర్వత్ర వ్యాప్నోతి, తస్మిన్ జగదీశ్వరే వర్తత ఇతి ధారయతి. ౧

ఇతి సంక్షేపతో గణానాం త్వేతి మంత్రస్యార్థో వర్ణితః, అస్మాన్ మహీధరస్యార్థోఽత్యంతవిరుద్ధ ఏవాస్తీతి మంతవ్యమ్.

తె॥ (గణానాం) అను నీ మంత్రమునకు సరియైన సత్యార్థము.

ఈ మంత్రము ఈశ్వరార్థమును ప్రతిపాదించును. ఐతరేయ బ్రాహ్మణమున గణపతి శబ్దమున కిట్లు వ్యాఖ్యానము చేయబడినది -

బృహస్పతి, ఈశ్వరుడు, వేదము ఈ మూడును బ్రహ్మమనబడును. మంచి వైద్యుడు రోగికి మందునిచ్చి యతనిని దుఃఖవిముక్తుని జేయునట్లు పరమేశ్వరుడు వేదోపదేశము ద్వారమున విజ్ఞాన రూపమగు మందు నిచ్చి యవిద్య యనెడి దుఃఖమునుండి మనుష్యులను ముక్తులనుజేయును. అతడు సర్వమునను వ్యాపకుడై యున్నాడు; ఆకాశాది వ్యాపక పదార్థములకును వ్యాపకుడు సుప్రభుడు. అతడే ప్రజాపతి; పరమేశ్వరుడు; జమదగ్ని.

యాస్క నిరుక్తమునందును నిట్లున్నది - ప్రకాశకములగు నీ సూర్యాది పదార్థములు పరమేశ్వరుని సామర్థ్యముచేతనే ప్రజ్వలితము లగుచున్నవి. ఇట్లే యీ సూర్యాదికార్య పదార్థములవలనను, వాని నియమములవలనను సర్వమునకు నిమిత్తకారణమగు నీశ్వరుడు పూజితుడగుచున్నాడు. కావున నతడు జమదగ్ని.'

ఈ మంత్రము (గణానాం) ఈశ్వరుని నామములను బాగుగ ప్రతిపాదించుచున్నది. శతపథ బ్రాహ్మణమున పరమేశ్వరుని నామము 'అశ్వమేధము' అని యున్నది. ఇట్లే రాజు అశ్వమనియు, ప్రజ గుల్మము కంటె నితరములగు పశువులనియు పేర్కొనబడినది. మేకలు, గొఱ్ఱెలు, గోవులు మున్నగు పశువులు గుల్మముకంటెబలహీనములై యుండునట్లు ప్రజలు కూడ రాజుకంటె నిర్బలులని భావము. రాజ్యమునకు శోభ - ధనము. జ్యోతికి పేరు హిరణ్యము. అట్లే పరమేశ్వరునికిగూడ అశ్వము నామము. మనుజుడు స్వయముగ తన సామర్థ్యముచే స్వర్గము నెఱుగజాలడు. కాని, అశ్వము-పరమేశ్వరుడు- మనుష్యులకు స్వర్గసుఖజ్ఞానమును గలుగజేయును. భక్తియుక్తుడు ధర్మాత్ముడునగు మానవునకు స్వర్గ సుఖము నొసంగును.

ఈ విషయమే శతపథ బ్రాహ్మణమునందును 'సంపూర్ణ జగత్తునందు వ్యాపించియుండును; కావున నీశ్వరుడు 'అశ్వ' పద, వాచ్యుడు, అని వర్ణింపబడినది. ...

అట్లే (రాష్ట్రమశ్వమేధః) రాజ్యమునకును 'అశ్వమేధము' అని నామమున్నది. రాజ్యమునకు ప్రకాశము గలిగించుట సభాకార్యము. ఆ సభ పేరే రాజు. ఆ సభయే ప్రజలకు పన్ను విధించును. రాజు రాజ్యమును, ప్రజ ప్రజలను వృద్ధిచేయును. ఏ రాజ్యమున నొక్కడే రాజగునో యట ప్రజలు పీడింపబడుదురు. కావున ప్రజాసత్తాత్మక రాజ్య వ్యవస్థ యుండవలెను. (గణానాం త్వా)రాజ్యపాలన కొఱకు స్త్రీలుకూడ సంతానమునకు విద్యాశిక్షణ నొసంగుచుండవలెను. ఇట్టి సంతాన శిక్షణమను యజ్ఞమును బొందియు సంతానోత్పత్తి మున్నగు కర్మములలో మిథ్యాచరణ మొనర్చు స్త్రీల కర్మములను విద్వాంసులు

నిందింతురు. సంతానమును శిక్షితమొనర్చుటలో ప్రమాదపరులు, అలసులునగు పురుషుల నితరులు కట్టి తాడన చేయుదురు.

పరమేశ్వరు నుపాసించువారి బలాదిగుణము లెన్నడు నశింపవు. (ఆహమజాని) ప్రజయే పశువులు-గర్భము. రాజసభ ప్రజను, ప్రజకు సంబంధించిన పశువులను తన యాత్మయందు ధారణచేయవలెను-సభాసదులు తమ సుఖము గోరునట్లు ప్రజలయు, పశువులయు సుఖమును గోరవలెను. (గణానాం త్వా) పరమేశ్వరుడు గణింపదగిన పదార్థములను పాలించువాడు. వానిని పూజ్యబుద్ధితో (హవామహే) గ్రహింతుము, (ప్రియాణాం) ఆ పరమేశ్వరుడు మాకు ఇష్టమిత్రుడు. మోక్షసుఖాదుల నొసంగు నధిపతి. సదా మనల నానందమున నుంచి రక్షించువాడు. కావున నతనినే యుపాస్య దేవునిగా గ్రహింతుము. (నిధీనాం త్వా) విద్య, సుఖముననెడి దివ్య పదార్థకోశములకు రక్షకుడు. అట్టి పరమేశ్వరునే రాజుగా, స్వామిగా నంగీకరింతుము. పరమేశ్వరుడు వ్యాపకుడై జగత్తు నందంతటను తానుండును. సమస్త జగత్తు నతని యందే వసించును. కావున నతడు వసువనబడును. ఓ వసో ! పరమేశ్వర ! నీవు నీ సామర్థ్యముతో జగత్తున కనాదికారణమగు ప్రకృతి యందు గర్భధారణము చేయుదువు. మూర్తిమంతములగు పదార్థముల నన్నింటిని నీవే యుత్పన్నము చేయుదువు. కావుననే నీకు గర్భధమని పేరు. (ఆహమజాని) ఇట్టి గుణయుక్తుడవుగా నిన్నెఱుగుదును గాక ! (ఆత్వ) నీ వెల్లవిధముల నెల్లవిషయము నెఱుగుదువు. అట్లే నన్నును సర్వవిధ జ్ఞానముతో గూడిన వాడనుగా జేయుము. (గర్భధం) రెండవ మాటుచేసిన గర్భధశబ్ద ప్రయోగాభిప్రాయ మేమన : కార్య ద్రవ్యములకు గర్భరూపములగు ప్రకృతియందు పరమాణువులలో జగత్తును బీజరూపమున నుంచువాడు పరమేశ్వరుడే. జగత్తు నుత్పన్నముచేసి, పోషించి లయము చేయగలవాడును పరమేశ్వరుడే. ఐతరేయ శతపథాది బ్రాహ్మణ గ్రంథములలో నీయర్థమే వివరింపబడినది.

ఇట్టి సత్యము, దివ్యమునగు నర్థమును గుప్తముచేసి నవీన మిథ్యార్థము ప్రచారము చేయబడినందున మనుష్యులు భ్రాంతులగుటయేకాక వేదముల కెంతయవమానము కలిగినదో యాలోచింపుడు : కావున నిట్టి దోషములను దొలగించి సత్యార్థమును ప్రకటించుటయే మాయీ భాష్యమునకు ముఖ్య ప్రయోజనము.

*సం॥ "తా ఉభౌ చతురః పదః సంప్రసారయావ స్వర్గే లోకే*
*ప్రోర్ణువాథాం వృషా వాజీ రేతోధా రేతో దధాతు"* ౨-య-౨౩-౨౦
*మహీధర స్యార్థః – అశ్వశిశ్న ముపస్థే కురుతే వృషా వాజీతి.*
*మహిషీ స్వయమే వాశ్వశిశ్న మాకృష్య స్వయోనౌ స్థాపయతి"* ౨

తె॥ మహీధరార్థము – యజమానునిపత్ని స్వయముగ నశ్వశిశ్నమును తన యోనియందుంచు కొనవలెను –

*సం॥ సత్యోఽర్థః – తా ఉభౌ చతురః పదః సంప్రసారయావేతి మిథున స్యావరుద్ధ్యై స్వర్గే లోకే ప్రోర్ణువాథా మిత్యేష వై స్వర్గో లోకో యత్ర పశుగ్ం సంజ్ఞపయంతి. తస్మా దేవ మాహ. వృషా వాజీ రేతోధా రేతో దధాత్వితి మిథునస్యైవావరుద్ధ్యై.* శత. ౧౩-౨-౮-౫

*ఆవాం రాజప్రజే, ధర్మార్థకామమోక్షాన్ చతురః పదాని, సదేవ మిలితే భూత్వా సమ్యక్ విస్తారయేవహి, కస్మై ప్రయోజనాయే త్యత్రాహ – స్వర్గే సుఖవిశేషే, లోకే ద్రష్టవ్యే భోక్తవ్యే,*

ప్రియానందస్య స్థిరత్వాయ, యేన సర్వాన్ ప్రాణినః సుఖై రాచ్ఛాదయేవహి, యస్మిన్ రాజ్యే పశుం పశుస్వభావ మన్యాయేన పరపదార్థానాం ద్రష్టారం జీవం విద్యోపదేశ దండ దానేన సమ్యగవబోధయంతి. సైష (స ఏష) ఏవ సుఖయుక్తో దేశో హి స్వర్గో భవతి. తస్మాత్ కారణా దుభయస్య సుఖా యోభయే విద్యాది సద్గుణానా మభివర్ధకం వాజినం విజ్ఞానవంతం జనం ప్రతి విద్యాబలే సతతమేవ దధాత్వి త్యాహాయం మంత్రః. ౨

తె॥ సత్యార్థము :-

(తా ఉభౌ) రాజు, ప్రజలు ఇరువురు కలిసి ధర్మార్థ కామ మోక్షములనెడి చతుర్వర్గ సాధన ప్రచారమునకు గడంగవలెను. అందువలన రాజు, ప్రజలు నిరువురు నత్యంత సుఖస్వరూప స్వర్గము ప్రియమగు నానందమును బొందుదురు. పశుభావముగలవారై పరుల వస్తువుల నన్యాయముగ హరించు ప్రజలను దండించి, సుశిక్షితులనుజేసి, జ్ఞానులను జేయు దేశము సుఖములతో గూడి స్వర్గమనబడును. రాజు, ప్రజలు సుఖముగా నుండు నిమిత్తము సద్గుణముల నుపదేశించు పురుషున కెల్లపుడు సేవల నొనర్పవలెను. విద్యను, బలమును వృద్ధిచేయుటకు నెల్లప్పుడు యత్నింపవలెను. ఇది మంత్రమునకు సరియైన యర్థము. మహీధరుని యర్థమెంత విరుద్ధముగా - ప్రకృతి విరుద్ధముగా నున్నదో పాఠకు లాలోచింపుడు.

సం॥ "యకాసకౌ శకుంతికా ఆహలగితి వంచతి,

ఆహంతి గభే పసో నిగల్గలీతి ధారకా" ౩ య. ౨౩-౨౨

మహీధరో వదతి : అధ్వర్వ్యాదయః కుమారీభిః పత్నీభిః సహ సోపహాసం సంవదంతే, అంగుల్యా యోనిం ప్రదేశయన్నాహ, స్త్రీణాం శీఘ్రగమనే యోనౌ హలహలా శబ్దో భవతీత్యర్థః, గభే యోనౌ శకుని సదృశ్యాం యదా పసో లింగమాహంతి ఆగచ్ఛతి. పస ఇతి పుంప్రజననస్య నామ. హన్తిః - గత్యర్థః. యదా భగే శిశ్నమాగచ్ఛతి తదా (ధారకా) ధరతి లింగమితి ధారకా యోనిః (నిగల్గలీతి) నితరాం గలతి వీర్యం క్షరతి, యద్వా శబ్దానుకరణం గల్గలేతి శబ్దం కరోతి. ౩

యజు.౨౩-౨౩

యకాసకౌ. ౪

కుమారీ అధ్వర్యుం ప్రత్యాహ. అంగుల్యా లింగం ప్రదేశయం త్యాహ. అగ్రభాగే సచ్ఛిద్రం లింగం ౪ తవ ముఖమివ భాసతే.

తె॥ పై మంత్రములకు మహీధరుని అర్థములు.

యజ్ఞశాలయందలి యధ్వర్యుడు మున్నగు ఋత్విక్కులు కన్యలతోను, పత్నులతోను పరిహాస
పూర్వకముగ సంవాదము చేయుదురు. అట్లే వ్రేలితో యోనిని జూపించుచు నవ్వుదురు. (ఆహలగితి)
స్త్రీలు త్వరత్వరగా నడచు నపుడు వారి యోనియందు హల-హల శబ్దము కలుగును. యోనితో లింగము
నకు సంయోగము కలిగినపుడు కూడ హల-హల శబ్దమగును. లింగమునుండి వీర్యము స్రవించును. ౩

(యకాసకౌ) కుమారి-కన్య అధ్వర్యునితో 'ఛిద్రసహితమగు నీలింగముయొక్క యగ్రభాగము నీ ౪
ముఖమువలె గనబడుచున్నది' అని యతనిని ఉపహసించును.

*సం॥ అథ సత్యోఽర్థః :—*

యకాసకౌ శకుంతికేతి, విడ్వై శకుంతికా హలగితి వంచతీతి. విశో వై రాష్ట్రాయ వంచంత్యాహంతి. గభే పసో నిగల్గలీతి ధారకేతి, విడ్ వై గభో రాష్ట్రం పసో, రాష్ట్రమేవ విశ్యాహంతి. తస్మాద్ రాష్ట్రీ విశం ఘాతుకః. శత. ౧౩—౨—౯—౬

(విడ్ వై) యథా శ్యేనస్య సమీపేఽల్పపక్షిణీ నిర్బలా భవతి, తథైవ రాజ్ఞః సమీపే (విట్) ప్రజా నిర్బలా భవతి. (ఆ హలగితి వంచతీతి) రాజానో విశః ప్రజాః (వై) ఇతి నిశ్చయేన రాష్ట్రాయ రాజసుఖ ప్రయోజనాయ సదైవ వంచంతీతి (ఆహంతి) విశో గభసంజ్ఞా భవతి. పసాఖ్యం రాష్ట్రం, రాజ్యం ప్రజయా స్పర్శనీయం భవతి, యస్మాద్ రాష్ట్రం తాం ప్రజాం ప్రవిశ్యాహంతి సమంతాద్ధననం పీడాం కరోతి, యస్మాద్ రాష్ట్రీ ఏకో రాజా మతశ్చేత్తర్హి విశం ప్రజాం ఘాతుకో భవతి. తస్మాత్ కారణాత్ ఏకో మనుష్యో రాజా కదాచిన్నైవ మంతవ్యః, కింతు సభాధ్యక్షః సభాధీనో యః సదాచారీ శుభలక్షణాన్వితో విద్వాన్, స ప్రజాభీ రాజా మంతవ్యః. ౩—౪

అస్మాదపి సత్యాదర్థాత్, మహీధరస్యాతీవ దుష్టోఽర్థోఽస్తీతి విచారణీయమ్.

తె॥ (యకాసకౌ) ప్రజకు శకుంతిక యని పేరు. డేగకు చిన్న చిన్న పక్షులు భయపడినట్లు రాజుకు ప్రజలు భయపడుదురు. (ఆహలగితి) ఏ దేశమున నొకవ్యక్తి రాజగునో యట ప్రజ దుర్దశ ననుభవించును. (ఆహంతి గభే పసౌ) గభము అన ప్రజలు.పసము రాజ్యము. ఒక్క వ్యక్తి రాజుగానున్న దేశమున నతడు ప్రజల పదార్థములకు లోభముచే హాని గలిగించును. కావుననే రాజు ప్రజలకు ఘాతకుడు, హంతకుడనియు నందురు. అందువలన నొక్కవ్యక్తిని రాజుగా నంగీకరించి యతనికి రాజ్యము నప్పగించుట తగదు. ధార్మికులయిన విద్వాంసుల సమితి యధీనమున రాజ్య వ్యవస్థ యుండవలెను.

(యకాసకౌ) మున్నగు మంత్రములకు మహీధరాదులు అల్పజ్ఞులు వ్రాసిన యర్థములు శతపథమున వ్రాసిన యర్థముల కెంతయు విరుద్ధములు.

*సం॥ "మాతా చ తే పితా చ తేఽగ్రం వృక్షస్య రోహతః*
*ప్రతిలామీతి తే పితా గభే ముష్టిమతగ్ం సయత్."* ॥ యజు. ౨౩—౨౪

*మహీధరస్యార్థః :—*

*బ్రహ్మ మహిషీ మాహ—మహిషి హయే హయే మహిషి ! తే తవ మాతా, చ పునః, తే తవ పితా, యదా వృక్షస్య వృక్షజన్య కాష్ఠమయస్య మంచకస్యాగ్రముపరిభాగం రోహతః ఆరోహతః, తదా తే పితా గభే భగే ముష్టిం ముష్టితుల్యం లింగమతం సయత్ తం సయతి ప్రక్షిపతి. ఏవం తవోత్పత్తి రిత్యశ్లీలమ్. లింగముత్థానే నాలంకరోతి వా తవ భోగేన స్నిహ్యామీతి వద న్నేవం తవోత్పత్తిః.* ॥

తె॥ మహీధరుని యర్థము :–

యజమానుని పత్నితో బ్రహ్మ పరిహాసముగ నిట్లనుచున్నాడు. నీ తల్లి దండ్రులు మంచముమీది కెక్కినపుడు, నీ తండ్రి ముష్టితుల్యమగు లింగమును నీ తల్లి యోని యందుంచెను. అప్పుడు నీవు జన్మించితివి. యజమాన పత్నియు బ్రహ్మతో 'నీ యుత్పత్తియు నట్లే జరిగినది కదా' కావున నిద్దఱి యుత్పత్తియు తుల్యమే' అనెను. ॥

సం॥ అథసత్యోఽర్థః :-

మాతా చ తే పితా చ త ఇతి. ఇయం వై మాతాసౌ పితాభ్యామే వైనం స్వర్గం లోకం గమయత్యగ్రం వృక్షస్య రోహత ఇతి శ్రీః వై రాష్ట్ర స్యాగ్రగ్ం, శ్రియమే వైనగ్ం రాష్ట్రస్యాగ్రం గమయతి. ప్రతిలామీతి తే పితా గభే ముష్టి ముష్టి మతగ్ం స యదితి. విడ్ వై గభో రాష్ట్రం ముష్టీ, రాష్ట్ర మేవావిశ్యాహంతి. తస్మా ద్రాష్ట్రీ విశం ఘాతుకః. శత. ౧౩-౨-౯-౭

(మాతా చ తే) హే మనుష్య ! ఇయం పృథివీ విద్యా చ తే తవ మాతృవ దస్తి. ఓషధ్యాద్యనేక పదార్థదానేన విజ్ఞానోత్పత్త్యా చ మాన్య హేతుత్వాత్. అసౌ ద్యౌః ప్రకాశో విద్వా నీశ్వరశ్చ తవ పితృవ దస్తి. సర్వ పురుషార్థానుష్ఠానస్య సర్వసుఖ ప్రదానస్య చ హేతుత్వేన పాలకత్వాత్. విద్వాన్ తాభ్యామే వైనం జీవం స్వర్గం సుఖరూపం లోకం గమయతి. (అగ్రం వృక్షస్య) యా శ్రీర్ విద్యా శుభగుణరత్నాది శోభాన్వితా చ లక్ష్మీః సా రాష్ట్రస్యాగ్ర ముత్తమాంగం భవతి, సైవైనం జీవం శ్రియం శోభాం గమయతి. యద్ రాష్ట్ర స్యాగ్రమగ్ర్యం ముఖ్యం సుఖం చ. (ప్రతిలామీతి) విట్ ప్రజా గభాఖ్యా అర్థా దైశ్వర్యప్రదా, (రాష్ట్రం ముష్టిః) రాజ కర్మ ముష్టిః, యథా ముష్టినా మనుష్యో ధనం గృహ్ణాతి తథైవైకో రాజా చేత్తర్హి పక్షపాతేన ప్రజాభ్యః స్వసుఖాయ సర్వాం శ్రేష్ఠాం శ్రియం హరత్యేవ. యస్మాద్ రాష్ట్రం విశి ప్రజాయాం ప్రవిశ్య ఆహంతి, తస్మాద్ రాష్ట్రీ విశం ఘాతుకో భవతి.

అస్మాదర్థా న్మహీధరస్యార్థోఽత్యంత విరుద్ధోఽస్తి, తస్మాత్ స నైవ కేనాపి మంతవ్యః

తె॥ (మాతా చ తే) పృథివియు, విద్యయు సర్వప్రాణులకు తల్లివంటివి. సూర్యుడు, విద్వాంసుడు, పరమేశ్వరుడును తండ్రివంటివారు. పృథివి ఓషధులు మున్నగు పదార్థముల నుత్పన్న మొనర్చుట వలనను, విద్య విజ్ఞానమును గలిగించుట వలనను మాన్యహేతువులగు చున్నవి. అందువలన నవి మాతృ సమానములు. సూర్యుడు పృథివ్యాది లోకములను బ్రకాశింపజేయును; విద్వాంసుడు, విజ్ఞానము నొసంగును; పరమేశ్వరు డెల్లరను బాలించును; కావున వీరు పితృతుల్యులు. ఈ రెండు కారణములవలననే విద్వాంసులు జీవులకు నానావిధ సుఖములను గలుగ జేయుదురు. (అగ్రం వృక్షస్య) శ్రీలక్ష్మి రాజ్యమున కగ్రభాగము-చివరిభాగ సమానము. విద్యయు, ధనమును రెండును కలిసియే జీవులకు సుఖమును రాజ్యమునకు శోభయును గలుగజేయును. (ప్రతిలామీతి) ప్రజ గభ యనబడును. అనగా నైశ్వర్యము నొసంగునది యని యభిప్రాయము. రాజ్యము ముష్టి యనబడును. రాజు తన ప్రజల పదార్థములను పిడికిళ్ళతో దన వశమొనర్చుకొనునట. ఏ రాజ్యమున నొక మనుష్యుడు రాజగునో యతడు గుణవంతుడు కానిపక్షమున, నా రాజ్యమున గల ప్రజలకు సుఖమునొసంగు లక్ష్మిని తాను హరించి ప్రజలను పీడించువాడగును. కావున నొకనిని రాజుగా నొనర్చి సర్వస్వతంత్రుని జేయరాదు. సమితి నొకదాని నేర్పఱచి, దానికొక యధ్యక్షుని నెన్నుకొని, యధ్యక్షసహితముగు నాసభకెల్లరు లోబడి యుండి దాని యాజ్ఞలను బాలింపవలెను.

ఈ మంత్రమునకు మహీధరుడెట్టి విరుద్ధార్థము నొనరించి యున్నాడో గ్రహించి, దాని నెవ్వరు నంగీకరింపరాదు. ౫

సం॥ ఊర్ధ్వామేనా ముచ్ఛ్రాపయ గిరౌ భారగ్ం హరన్నివ,
అథాస్యై మధ్యమేధతాగ్ం శీతే వాతే పునన్నివ. ౬ యజు. ౨౩-౨౬

మహీ ధరస్యార్థః :-

యథా అస్త్యై అస్యా వా వాతాయా మధ్యమేధతాం యోని ప్రదేశో వృద్ధిం యాయాత్. యథా యోనిర్ విశాలా భవతి. తథా మధ్యే గృహీత్వోచ్ఛ్రాపయేత్యర్థః. దృష్టాంతాంతరమాహ – యథా శీతలే వాయౌ వాతి పునన్ ధాన్యపవనం కుర్వాణః కృషీవలో ధాన్యపాత్ర మూర్ధ్వం కరోతి తథేత్యర్థః ౬

తె॥ (వావాతా) యజమానుని భార్యయొక్క యోని విశాలమగునట్లామెను మధ్యలో పట్టుకొని యెత్తవలెను. కృషీవలుడు ప్రవహించువాయువున కెదురుగా పొట్టును వేఱుచేయుటకు ధాన్యము నెత్తిపట్టుకొనునట్లు యోనిని విశాల మొనర్చుటకు స్త్రీని సైతమట్లెత్తవలెను. ఇది రెండవ యుదాహరణము.
౬

సం॥ యదాస్యా అగ్ం హుభేద్యాః కృధు, స్థూలముపాతసత్,

ముష్కావిదస్యా ఏజతో గోశఫే శకులావివ. ౭ యజు. ౨౩–౨౪

మహీధరస్యార్థః :-

యత్ యదా అస్యాః పరివృక్తాయాః కృధు హ్రస్వం స్థూలం చ శిశ్నముపాతసత్ ఉపగచ్ఛేత్ యోనిం ప్రతి గచ్ఛేత్; తం న ఉపక్షయే; తదా ముష్కౌ వృషణౌ ఇత్ ఏవ అస్యాః యోనే రుపరి ఏజతః కంపేతే లింగస్య స్థూలత్వాద్యోనేరల్పత్వాద్ వృషణౌ బహిస్తిష్ఠత ఇత్యర్థః. తత్ర దృష్టాంతః గోశఫే జలపూర్ణే గోఖురే శకులౌ మత్స్యావివ, యథా ఉదకపూర్ణే గోః పదే మత్స్యౌ కంపేతే. ౭

తె॥ మహీ ధరుని అర్థము :-

(యదాస్యా అగ్ంహు) వీర్యస్రావమయిన స్త్రీ పరివృక్త యనబడును. వీర్యము స్రవించిన తదుపరి స్త్రీ యోనియందు లింగము చిన్నదో పెద్దదో ప్రవేశపెట్టబడినపుడు, వృషణములు రెండు నా యోనిపై నర్తనము చేయుచుండును. యోని చిన్నదగుటవలనను,లింగము స్థూలమగుటవలనను వృషణములు యోనిలో బ్రవేశింపజాలవని భావము. భూమియందేర్పడిన గోవుపాద చిహ్నమునందు జలము నిండియున్నపుడందులో రెండు చేపలు నటించున ట్లీ యండకోశము యోనిపై నటించునని మహీ ధరుడుదాహరించుచున్నాడు.

సం॥ అథ సత్యోర్థః :-

'ఊర్ధ్వమేనా ముచ్ఛ్రాపయేతి, శ్రీర్వై రాష్ట్రమశ్వమేధః శ్రియ మేవాస్మై రాష్ట్రమూర్ధ్వ ముచ్ఛ్రయతి. గిరౌ భారగ్ం హరన్నివేతి. శ్రీర్వై రాష్ట్రస్యభారః, శ్రియమేవాస్మై రాష్ట్రగ్ం సన్నహ్యత్యథో శ్రియమేవాస్మిన్ రాష్ట్ర మధినిదధాతి. అథాస్త్యై మధ్యమేధతామితి. శ్రీర్ వై రాష్ట్రస్య మధ్యం శ్రియమేవ రాష్ట్రే మధ్యతోఽన్నాద్యం దధాతి. శీతే వాతే పునన్నివేతి. క్షేమోవై రాష్ట్రస్య శీతం క్షేమమేవాస్మై కరోతి.
శత. కాం. ౧౩ అ. ౨ బ్రా. ౯ కం. ౨–౩–౪–౫

(ఊర్ధ్వమేనా) హే నర ! త్వం శ్రీర్ వై రాష్ట్రమశ్వమేధో యజ్ఞశ్చాస్మై రాష్ట్రాయ శ్రియ ముచ్ఛ్రాపయ. సేవ్యా ముత్కృష్టాం కురు. ఏవం సభయా రాజ్యపాలనే కృతే రాష్ట్రం రాజ్య మూర్ధ్వం సర్వోత్కృష్ట గుణ ముచ్ఛ్రయితుం శక్యమ్. (గిరౌ భారం హరన్నివ) కస్మిన్ కమివ ? గిరిశిఖరే ప్రాప్త్యర్థం భారవద్వస్తూప స్థాపయన్నివ. కోఽస్తి రాష్ట్రస్య భారఇత్యత్రాహ – శ్రీర్ వై రాష్ట్రస్య భార ఇతి.

సభా వ్యవస్థయాఽస్మై రాష్ట్రాయ శ్రియం సన్నహ్య సంబధ్య రాష్ట్ర మనుత్తమం కుర్యాత్. అథో ఇత్యనంతరమేవ కుర్వన్ జనోఽస్మిన్ సంసారే రాష్ట్రం శ్రీయుక్త మధినిదధాతి – సర్వోపరి నిత్యం ధారయతీత్యర్థః. (అథాస్యై) కిమస్య రాష్ట్రస్య మధ్యమిత్యాకాంక్షాయా ముచ్యతే, శ్రీర్ వై రాష్ట్రస్య మధ్యం, తస్మాదిమాం పూర్వోక్తాం శ్రియ మన్నాద్యం భోక్తవ్యం వస్తు చ రాష్ట్రే రాజ్యే మహతో రాజ్య స్యాభ్యంతరే దధాతి. సుసభయా సర్వాం ప్రజాం సుభోగయుక్తాం కరోతి. కస్మిన్ కిం కుర్వన్నివ ? శీతే వాతే పునన్నివేతి. రాష్ట్రస్య క్షేమో రక్షణం శీతం భవత్యస్మై రాష్ట్రాయ క్షేమం సుసభయా రక్షణం కుర్యాత్.

అస్మాదపి సత్యాదర్థా న్మహీధరస్య వ్యాఖ్యాన మత్యంతం విరుద్ధమస్తి.

తె॥ విద్య, ధనము రెండును శ్రీ యనబడును. అట్లే రాష్ట్రపాలన మశ్వమేధ మనబడును. ఇవియే రాజ్యమున కున్నతిని, శ్రీని కలిగించును. (గిరౌ భారం) రాజ్యభారము శ్రీ. దానివలననే రాజ్యము వర్ధిల్లును. కావున రాజ్యమున ధనము, విద్యయు బాగుగ వృద్ధినొందునట్లు శ్రేష్ఠ పురుషులతో నేర్పఱప బడిన సభతో రాజ్యభారము (వ్యవస్థ) నిర్వహింపబడవలయును. (అథాస్యై) శ్రీ రాజ్యమున కాధారము. అదియే రాజ్యమునకు శోభ నొసంగి యుత్తమ పదార్థములను జేకూర్చును. ఇందులకొక దృష్టాంతము. (శీతే వాతే) రాజ్యరక్షణము శీతమనబడును. సభవలన రాజ్యరక్షణము జరిగినపుడే రాజ్యమున కున్నతి కలుగును.

రాజ్యభార మెయ్యది ? (శ్రీర్ వై రాష్ట్రస్య భారః) శ్రీ రాజ్యమును ధనయుక్త మొనర్చి యుత్తమస్థితిని గలిగించును. (అథో) అనంతరమున పైనజెప్పినట్లు రాజ్యమొనర్చుచు మనుజులు ప్రపంచమున శ్రీయుక్త మగు రాజ్యవ్యవస్థ నేర్పఱచుదురు. (అథాస్యై) ఆ రాజ్యమునకు మధ్య మెయ్యది ? రాజ్యమునగల ప్రజలను బాగుగ రక్షించుటయే నియమపూర్వకముగ బ్రజలను బాలించుటయే యా రాజ్యమునకు మధ్యము. (గిరౌ భారం వహన్నివ) మనుజుడొకడుభారమును పర్వతముపై జేర్చునట్లు సభయు రాజ్యమున కుత్తమ సుఖమును చేకూర్పగలదు.

సత్యమగు నిట్టి మంత్రార్థమునకు మహీధరుని యర్థ మెంత విరుద్ధమో పాఠకులు గుర్తించి దానిని త్యజింతురుగాక. ౬–౨

సం॥ "యద్దేవాసో లలామగుం ప్రవిష్టీమిన మావిషుః,

నక్థ్నా దేదిశ్యతే నారీ సత్యస్యాక్షిభువో యథా" ౮ య. ౨౩–౨౯

మహీధరస్యార్థః :–

(యత్) యదా (దేవాసః) దేవాః దీవ్యంతి క్రీడంతి దేవాః హోత్రాదయః ఋత్విజో (లలామగుం) లింగం. (ప్ర ఆవిషుః) యోనౌ ప్రవేశయంతి, లలామేతి సుఖనామ లలామ సుఖం గచ్ఛతి ప్రాప్నోతి లలామగుః శిశ్నః, యద్వా లలామ పుండ్రం గచ్ఛతి లలామగుః లింగం, యోనిం ప్రవిశ దుత్థితం పుండ్రాకారం భవతీత్యర్థం – కీదృశం లలామగుం విష్టీమినం శిశ్నస్య యోనిప్రదేశే క్లేదనం భవతీత్యర్థః. యదా దేవాః శిశ్నక్రీడినో భవంతి, లలామగుం యోనౌ ప్రవేశయంతి. తదా నారీ సక్థ్నా ఊరుణా ఊరుభ్యాం దేదిశ్యతే నిర్దిశ్యతే అత్యంతం లక్ష్యతే, భోగసమయే సర్వస్య నార్యంగస్య నరేణ వ్యాప్తత్వాదూరు మాత్రం లక్ష్యతే, ఇయం నారీత్యర్థః. ౮

తె॥ (యద్దేవాసో) హోత మున్నగు ఋత్విక్కులు లింగమును యోనియందు ప్రవేశపెట్టుదురు. లింగము యోనియందు ప్రవేశించుటకు పూర్వము ఉత్థితమై కమల సమానమగును. స్త్రీ పురుషుల

సమాగమము జరుగునపుడు యోని గత లింగము ఆర్ద్రమగును. స్త్రీ శరీరము పురుష శరీరముచే నాచ్ఛాదితమగును. ఊరువుల మూలమున నపుడు స్త్రీ నిర్దేశింపబడును.

సం॥ అథసత్యోర్థః :-

**(యద్దేవాసో) యథా దేవా విద్వాంసః ప్రత్యక్షోద్భవస్య సత్యజ్ఞానస్య ప్రాప్తిం కృత్వేమం (విష్టీమినం) వివిధత య్యార్ద్రభావ గుణవంతం (లలామగుం) సుఖప్రాపకం విద్యానందం ప్రవిశః ప్రకృష్టతయా సమంతాద్ వ్యాప్నువంతి, తథైవ తైస్తైన సహ వర్తమానేయం ప్రజా దేదిశ్యతే. యథా నారీ వస్త్రైరాచ్ఛాద్య మాచేన సక్థ్నా వర్తతే తథైవ చ విద్వద్భిః సుఖైరియం ప్రజా సమ్యగాచ్ఛాదనీయేతి" ౮**

తె॥ విద్వాంసులు ప్రత్యక్ష జ్ఞానమును బొంది, శుభగుణ యుక్తమును, స్నిగ్ధతా జనకమును, సుఖదాయకమును నగు విద్యయందు ప్రవేశింతురు. ప్రజల నానందయుక్తులను జేయుదురు. స్త్రీ తన యంగములను వస్త్రములతో కప్పియుంచుకొనునట్లు విద్వాంసులు సత్యములగు నుపదేశములతోను, విద్యాధర్మములతోను ప్రజలను సుఖయుక్తులను జేయవలెను.

సం॥ యద్ధరిణో యవమత్తి న పుష్టం పశుం మన్యతే,

శూద్రా యదర్యజారా న పోషాయ ధనాయతి. ౯ య. అ. ౨౩ మం. ౩౦

మహీధరస్యార్థః :-

క్షత్తా పాలాగలీ మాహ. శూద్రా శూద్రజాతిః స్త్రీ యదా ఆర్యజారాభవతి, వైశ్యో యదా శూద్రాం గచ్ఛతి, తదా శూద్రః పోషాయ న ధనాయతే. పుష్టిం న ఇచ్ఛతి. మద్భార్యా వైశ్యేన భుక్తా సతీ పుష్టాజాతేతి న మన్యతే. కింతు వ్యభిచారిణీ జాతేతి దుఃఖితో భవతీత్యర్థః, (యద్ధరిణో) పాలాగవీ క్షత్తారమాహ. యత్ యదా శూద్రః అర్యాయై అర్యాయా వైశ్యాయా జారో భవతి, తదా వైశ్యః పోషం పుష్టిం నానుమన్యతే. మమ స్త్రీ పుష్టా జాతేతి నానుమన్యతే కింతు శూద్రేణ నీచేన భుక్తేతి క్లిశ్య తీత్యర్థః.

తె॥ మహీధరుని అర్థము :-

(యద్ధరిణో) క్షత్తా సేవకపురుషుడు శూద్రదాసితో నిట్లనుచున్నాడు. శూద్రస్త్రీతో వైశ్యుడు వ్యభిచరించినపుడు ఆమెభర్త, తన స్త్రీ వైశ్యునితో వ్యభిచరించి ధనవతి యైనదని యెంచడు. పై పెచ్చు తన స్త్రీ వ్యభిచారిణి యైనందులకు చింతించును. (యద్ధరిణో) దాసి సేవకునకిట్లు ప్రత్యుత్తర మిచ్చును ! శూద్రుడు వైశ్యస్త్రీతో వ్యభిచరించినపుడు వైశ్యుడు కూడ తన స్త్రీ పోషింపబడినదని యెంచక నీచునితో వ్యభిచరించినదని దుఃఖించును.

సం॥ సత్యోఽర్థః :-

యద్ధరిణో యవమత్తీతి. విడ్వై యవో రాష్ట్రగ్ం హరిణో విశమేవ రాష్ట్రాయాద్యాం కరోతి తస్మాద్ రాష్ట్రీ విశమత్తి. న పుష్టం పశుం మన్యత ఇతి. తస్మాద్ రాజా పశూన్న పుష్యతి. శూద్రా యదర్యజారా న పోషాయ ధనాయతీతి. తస్మాద్ వైశీపుత్రం నాభిషించతి. శత. కాం. ౧౩-౨-౯-౮

**(యద్ధరిణో) విట్ ప్రజేవ యవోఽస్తి. రాజ్యసంబంధ్యేకో రాజా హరిణ ఇవ ఉత్తమ పదార్థహర్తా భవతి. యథా మృగః క్షేత్రస్థం సస్యం భుక్త్వా ప్రసన్నో భవతి, తథైవైకో రాజాపి నిత్యం స్వకీయమేవ సుఖ మిచ్ఛతి. అతః స రాష్ట్రాయ స్వసుఖప్రయోజనాయ విశం ప్రజామాద్యాం భక్ష్యమివ కరోతి. యథా**

మాంసాహారీ పుష్టం పశుం దృష్ట్వా తన్మాంస భక్షణేచ్ఛాం కరోతి. నైవ స పుష్టం పశుం వర్ధయితుం జీవితుం వా మన్యతే. తథైవ స్వసుఖ సంపాదనాయ ప్రజాయాం కశ్చిన్ మత్తో అధికో న భవేదితీచ్ఛాం సదైవ రక్షతి. తస్మాదేకో రాజా ప్రజాం న పోషయతి. నైవ రక్షయితుం సమర్థో భవతీతి, యథా చ యదా శూద్రా అర్యజారా భవతి తదా న సః శూద్రః పోషాయ ధనాయతి; పుష్టో న భవతి, తథైకో రాజాపి ప్రజాం యదా న పోషయతి, తదా సా నైవ పోషాయ ధనాయతి, పుష్టా న భవతి. తస్మాత్ కారణాద్ వేశీపుత్రం భీరుం, శూద్రా పుత్రం మూర్ఖం చ నాభిషించతి. నైవైతం రాజ్యాధికారే స్థాపయ తీత్యర్థః. ౯

అస్మాచ్ఛతపథ బ్రాహ్మణోక్తాదర్థాత్ మహీధరకృతోఽర్థోఽతీవ విరుద్ధోఽస్తి

తె॥ ఈ మంత్రమున ప్రజలు యవ పదముతోను, ర్యాష్ట్రము హరిణ (మృగ) పదముతోను వర్ణింప బడినవి. లేడి మున్నగు పశువులు పొలములందు పండుయవలు మున్నగు పంటలను బాగుగ తిని యానం దించునట్లు రాజు స్వతంత్రుడగుచో ప్రజల ధనమును తన సుఖముకొఱకు హరించును.(స పుష్టం పశుం మన్యతే) మాంస భక్షకుడు బాగుగ బలిసిన పశువును జంపి దాని మాంసమును భక్షించునట్లు రాజు తనకు దా స్వతంత్రుడైనపుడు ప్రజలను నశింపజేయును. అతడు తన సుఖమునే చూచుకొనును. ఒక వైశ్యుడు శూద్రస్త్రీతో వ్యభిచరింపబూనిన నా శూద్రస్త్రీ భర్త ధనవంతుడు కాడు. పోషింపబడడు. కావున లోభియు మూర్ఖుడు నగు వ్యక్తిని సభ కధ్యక్షునిగ గాని, రాజుగా గాని చేయరాదు.

ఇట్టి సత్యార్థమును మహీధరుడు విపరీతార్థము కల్పించి మలిన మొనర్చి యున్నాడు.

సం॥ ఉత్ సక్థ్యా అవ గుదం ధేహి సమంజిం చారయా వృషన్.

యః స్త్రీణాం జీవభోజనః. ౧౦ య. ౨౩-౨౦

మహీధరస్యార్థః :-

యజమానోఽశ్వ మభిమంత్రయతే. హే వృషన్ ! సేక్తః ! అశ్వ ! ఉత్ ఊర్ధ్వే సక్థినీ ఊరూ యస్యాస్తస్యా మహిష్యా గుదమవ – గుదోపరి, రేతో ధేహి, వీర్యం ధారయ. కథమ్ ? తదాహ – అంజిం – లింగం సంచారయ – యోనౌ ప్రవేశయ. యోఽంజిః స్త్రీణాం జీవభోజనః. యస్మిన్ లింగే యోనౌ ప్రవిష్టే స్త్రియో జీవంతి; భోగాంశ్చ లభంతే తం ప్రవేశయ. ౧౦

తె॥ యజమానుడు గుఱ్ఱముతోననును – వీర్యసించన మొనర్చు నో యశ్వమా ! నీవు నా భార్య యూరువులను పైకెత్తి యామె యోనియందు వీర్యమును విడువుము. యోనియందు లింగమును బ్రవేశింప జేయుము. లింగము స్త్రీలకు జీవ భోజనము. అది యోనియందు ప్రవేశించుటవలననే స్త్రీలు జీవింతురు. భోగముల నందుదురు. కావున నీవు నా స్త్రీ యోనియందు లింగమునుంచి యాడించుము. ౧౦

ఇయ్యది మహీధరుని యర్థము :

సం॥ అథ సత్యోఽర్థః :-

(ఉత్సక్థ్యా) హే వృషన్ ! సర్వకామానాం వర్షయితః ! ప్రాపక ! స సభాధ్యక్ష విద్వన్ ! త్వమస్యాం ప్రజాయాం అంజిం జ్ఞానసుఖ న్యాయప్రకాశం సంచారయ సమ్యక్ ప్రకాశయ. (యః స్త్రీణాం జీవ భోజనః) (యః) కాముకః సన్ నాశ మాచరతి తం త్వ మవగుద మధః శిరసం కృత్వా తాడయిత్వా

కాలాగ్రహే. (కాలగృహే) ధేహి. యథా స్త్రీణాం మధ్యే యాకాచిత్ ఉత్సక్తే వ్యభిచారిణీ స్త్రీ భవతి. తస్యై సమ్యక్ దండం దదాతి, తథైవ త్వం తం జీవభోజనం పరప్రాణనాశకం దుష్టం దస్యుం దండేన సముచ్చారయ. ౧౦

తె॥ కామనలను తీర్చు సభాధ్యక్ష సహిత విద్వాంసులార ! మీరెల్లరు నేకమతితో ప్రజలలో జ్ఞానమును పెంపుచేసి న్యాయపూర్వకముగ నెల్లరకు సుఖము నొడగూర్చుడు. అట్లే దుష్టుడు (జీవభోజనః), స్త్రీలతో వ్యభిచరించువాడు, చోరులలో చోరుడు, వంచకులలో వంచకుడు, ఇతరులకు చెడుపనులు నేర్పువాడు నగు పురుషుడు కాని, స్త్రీ కాని యున్నయెడల వారిని తలక్రిందుగా వ్రేలాడజేసి దుఃఖప్రద దండనలకు గుఱిచేయుడు. అట్లు చేసినపుడే ప్రజలలో సుఖము వర్ధిల్లగలదు.

సం॥ ఏతావతైవ ఖండనేన మహీధర కృతస్య వేదదీపాఖ్యస్య ఖండనం సర్వైర్ జనైర్ బోద్ధవ్యమితి. యదా మంత్రభాష్యం మయా విధాస్యతే తత్రాస్య మహీధర కృతస్య భాష్యస్యాన్యేపి దోషాః, ప్రకాశయిష్యంతే. యదిహార్యదేశ నివాసినాం సాయణ మహీధర ప్రభృతీనాం వ్యాఖ్యా స్వేతాదృశీ మిథ్యా గతిరస్తి; తర్హి యూరోపఖండ నివాసినా మేతదనుసారేణ స్వదేశ భాషయా వేదార్థ వ్యాఖ్యానానా మనర్థగతేస్తు కా కథా? ఏవం జాతే సతి హ్యేతదాశ్రయేణ దేశభాషయ్యా, యూరోపదేశ భాషయా చ కృతస్య వ్యాఖ్యాన స్యాశుద్ధేస్తు ఖలు కా గణనాఽస్తి, ఇతి సజ్జనైర్ విచారణీయమ్.

నైవైతేషాం వ్యాఖ్యానానా మాశ్రయం కర్తు మార్యాణాం లేశమాత్రాపి యోగ్యతా దృశ్యతే. తదాశ్రయేణ వేదానాం సత్యార్థస్య హాని రనర్థప్రకాశశ్చ. తస్మాత్తద్ వ్యాఖ్యానేషు సత్యా బుద్ధిః కేనాపి న కర్తవ్యా. కింతు వేదాః సర్వవిద్యాభిః పూర్ణాః సంతి; నైవ కించి త్తేషు మిథ్యాత్వ మస్తి. తదేతచ్చ సర్వే మనుష్యాస్తదా జ్ఞాస్యంతి యదా చతుర్ణాం వేదానాం నిర్మితం భాష్యం యంత్రితం చ భూత్వా సర్వబుద్ధి మతాం జ్ఞానగోచరం భవిష్యతి. ఏవం జాతే ఖలు నైవ పరమేశ్వర కృతయా వేదవిద్యయా తుల్యా ద్వితీయా విద్యాఽస్తీతి సర్వే విజ్ఞాస్యంతీతి బోధ్యమ్.

ఇతి భాష్యకరణ శంకాసమాధానాది విషయః

తె॥ ఇంతవఱకు చేసినయీ ఖండనము వలననే సజ్జనులు అర్థానర్థములను పరీక్షింతురుగాక ! నేను వ్రాయబోవు మంత్రభాష్యమునందు మహీధరాదు లొనర్చిన దోషములనింకను ప్రదర్శింతును. ఆర్యావర్తమున నుండు వీరి వ్యాఖ్యానములే యిట్లశుద్ధపూర్ణములై యుండ నిక వీరి భాష్యముల నాధారముగ దీసికొని నైరోపిఖండవాసులు వారి దేశభాషలలో వ్రాసిన వ్యాఖ్యానములలో గల యనర్థముల నెన్నియని లెక్కింప గలము? అట్లే యీ పాశ్చాత్య భాష్యముల ననుసరించి యా యా దేశభాషలలో వ్రాసిన వేద వ్యాఖ్యానముల వలన వేదార్థములకు హాని కలుగునే కాని, లాభ మొక్కింతయు గలుగదు. నాలుగు వేదములకు నాచే భాష్యము వ్రాయబడి. అది ముద్రితమై బుద్ధిమంతుల కెల్లరకు గోచరమైనవాడు ఎల్లరకు నుత్తమ విద్యలతో నిండియున్న వేదము లీశ్వరీయములే యని భూగోళమున ప్రకటము కాగలదు. ఇంతేకాక, యీశ్వరీయములు వేదములేనా ? మఱియొకటి యేదైన నున్నదా? యను విషయముకూడ స్పష్టము కాగలదు. వేదములే యీశ్వరీయములని యెఱింగి, యెల్లరు వేదములనే మిక్కిలిగ ప్రేమింతురు. వేదములకు భాష్యము నొనర్చుటలో నిట్టి ప్రయోజనము లనేకము లున్నవని యెఱుంగనగును.

భాష్యకరణ శంకా సమాధాన విషయము సమాప్తము.

# అథ ప్రతిజ్ఞా విషయః సంక్షేపత:॥

అత్ర వేదభాష్యే కర్మ కాండస్య వర్ణనం శబ్దార్థతః కరిష్యతే; పరంత్వేతైర్ వేదమంత్రైః కర్మకాండ వినియోజితైర్ యత్ర యత్రాగ్ని హోత్రాద్యశ్వమేధాంతే యద్యత్ కర్తవ్యం తత్తదత్ర విస్తరతో న వర్ణయిష్యతే.

పూ : కుతః?

ఉ : కర్మ కాండానుష్ఠాన స్త్యైతరేయ శతపథ బ్రాహ్మణ పూర్వ మీమాంసా శ్రౌత సూత్రాదిషు యథార్థం వినియోజితత్వాత్. పునస్తత్ కథనేనానృషికృత గ్రంథవత్ పునరుక్త-పిష్ట పేషణ-దోషాపత్తేశ్చేతి: తస్మా ద్యుక్తిసిద్ధో వేదాది ప్రమాణానుకూలో మంత్రార్థానుసృతస్తదుక్తోఽపి వినియోగో గ్రహీతుం యోగ్యోఽస్తి. తథై వోపాసనాకాండస్యాపి ప్రకరణ శబ్దానుసారతో హి ప్రకాశః కరిష్యతే.

పూ. కుతః?

ఉ : అస్యైకత్ర విశేషస్తు పాతంజలయోగ శాస్త్రాదిభిర్ విజ్ఞేయోఽ స్తీత్యతః!, ఏవమేవ జ్ఞాన కాండస్యాపి.

పూ : కుతః ?

ఉ : అన్య విశేషస్తు సాంఖ్య వేదాంతోపనిషదాది శాస్త్రానుగతో ద్రష్టవ్యః, ఏవం కాండత్రయేణ బోధా న్నివృత్త్యుపకారౌ గృహ్యేతే; తచ్చ విజ్ఞాన కాండమ్. పరం త్వేతత్ కాండ చతుష్టయస్య వేదాను సారేణ విస్తరస్తద్ వ్యాఖ్యానేషు గ్రంథేష్వస్తి. స ఏవ సమ్యక్ పరీక్ష్యావిరుద్ధోఽర్థో గ్రహీతవ్యః.

పూ : కుతః ?

ఉ : మూలాభావే శాఖాదీనా మప్రవృత్తేః ఏవమేవ వ్యాకరణాదిభిర్ వేదాంగైర్ వైదికశబ్దానా ముదాత్తాది స్వర విజ్ఞానం యథార్థం కర్తవ్య ముచ్చారణం చ. తత్ర యథార్థ ముక్తత్వా దత్ర న వర్ణ్యతే, ఏవం పింగలసూత్ర ఛందోగ్రంథే యథా లిఖితం ఛందోలక్షణం విజ్ఞాతవ్యమ్. 'స్వరా షడ్జ ఋషభ గాంధార మధ్యమ పంచమ ధైవత నిషాదాః' ౧ పింగలశాస్త్రే అ. ౩-౬౪

ఇతి పింగలాచార్యకృత సూత్రానుసారేణ ప్రతిచ్ఛందః స్వరా లేఖిష్యంతే.

పూ : కుతః?

ఉ : ఇదానీం యచ్ఛందోఽన్వితో యో మంత్ర స్తస్య స్వస్వరేణైవ వాదిత్రవాదన పూర్వక గాన వ్యవహార ప్రసిద్ధేః. ఏవ మేవ వేదానా ముపవేదై రాయుర్వేదాదిభిర్ వైద్యక విద్యాదయో విశేషా విజ్ఞేయాః తథైతే సర్వే విశేషార్థా అపి వేద మంత్రార్థ భాష్యే బహుధా ప్రకాశయిష్యంతే. ఏవం వేదార్థ ప్రకాశేన విజ్ఞానేన సయుక్తిదృఢేన జాతేనైవ సర్వమనుష్యాణాం సకల సందేహ నివృత్తిర్ భవిష్యతి.

అత్ర వేద మంత్రాణాం సంస్కృత ప్రాకృత భాషాభ్యాం సప్రమాణః పదశోఽర్థో లేఖిష్యతే. యత్ర యత్ర వ్యాకరణాది ప్రమాణా వశ్యకత్వమస్తి తత్తదపి తత్ర తత్ర లేఖిష్యతే. యేనేదానీంతనానాం

వేదార్థ విరుద్ధానాం. సనాతన వ్యాఖ్యాన గ్రంథ ప్రతి కూలానా మనర్థ కానాం వేద వ్యాఖ్యానానాం నివృత్యా సర్వేషాం మనుష్యాణాం వేదానాం సత్యార్థ దర్శనేన తేష్వత్యంతా ప్రీతిర్ భవిష్యతీతి బోధ్యమ్. సంహితా మంత్రాణాం యథాశాస్త్రం యథా బుద్ధి చ సత్యార్థ ప్రకాశేన యత్ సాయణాచార్యాదిభిః స్వేచ్ఛాను సారతో లోక ప్రవృత్త్యను కూలతశ్చ లోకే ప్రతిష్ఠార్థం భాష్యం లిఖిత్వా ప్రసిద్ధీకృతమ్. అనే నాత్రానర్థో మహాన్ జాతః– తద్ ద్వారా యూరోపఖండ వాసినామపి వేదేషు భ్రమో జాత ఇతి. యదాస్మి న్నీశ్వరాను గ్రహేణర్షి ముని మహర్షి మహా మునిభిరార్యై ర్వేదార్థ గర్భితే ష్వైతరేయ బ్రాహ్మణాది షూక్త ప్రమాణాన్వితే మయాకృతే భాష్యే ప్రసిద్ధే జాతే సతి సర్వ మనుష్యాణాం మహాన్ సుఖలాభో భవిష్యతీతి విజ్ఞాయతే– అథాత్ర యస్య యస్య మంత్రస్య పారమార్థిక వ్యావహారికయోర్ద్వయో ర్థయోః శ్లేషాలంకారాదినా సప్రమాణః సంభవోఽస్తి. తస్య తస్య ద్వౌ ద్వా వర్థౌ విధాస్యేతే. పరంతు నైవేశ్వరస్యైకస్మిన్నపి మంత్రార్థేఽత్యంతం త్యాగో భవతి.

పూ : కుతః ?

ఉ : నిమిత్త కారణ స్యేశ్వర స్యాస్మిన్ కార్యే జగతి సర్వాంగ వ్యాప్తి మత్వాత్. కార్యస్యేశ్వరేణ సహాన్వ యాచ్చ. యత్ర ఖలు వ్యావహారికోఽర్థో భవతి. తత్రాపీశ్వరరచనానుకూలతయైవ సర్వేషాం పృథి వ్యాదిద్రవ్యాణాం సద్ భావాచ్చ. ఏవ మేవ పార మార్థికే ఽర్థే కృతే. తస్మిన్ కార్యార్థ సంబంధాత్ సోఽప్యర్థ ఆగచ్ఛతీతి.

తె॥ ఈ వేద భాష్యమున శబ్దార్థముల ద్వారమున కర్మ కాండమును వర్ణింతుము. కర్మ కాండమున ప్రయుక్తములయిన మంత్రము మూలమున నెక్కడెక్కడ నేయే అగ్నిహోత్రాద్యశ్వమేధ పర్యంత కర్మములు చేయవలయునో వాని వర్ణన మిట విస్తారముగ వర్ణింపము.

కారణమేమనః వాని యనుష్ఠానముల యథార్థ వినియోగము ఐతరేయ శతపథాది బ్రాహ్మణ గ్రంథములందును, పూర్వ మీమాంస యందును. శ్రౌత, గృహ్య సూత్రాదులందును వర్ణింపబడియున్నది. మరల నదియే వర్ణించుట పిష్ట పేషణమగును. అయ్యది అల్పజ్ఞుల కార్యమగును. కావున నట్లొనర్చుట వలన వేద భాష్యమున పునరుక్తి మున్నగు దోషములు సంభవించును. అందువలననే యే కర్మ కాండము వేదానుకూలమో, యుక్తి ప్రమాణాది సిద్ధమో యదియే మాన నీయ మగును. అట్లే ఉపాసనా కాండము కూడ ప్రకరణమునకు, శబ్దములకు ననుకూలముగ ప్రకటింపబడును.

కారణమేమనః ఉపాసనాకాండమునకు సంబంధించిన విశేష వర్ణనము పాతంజలయోగ శాస్త్రాదుల మూలమున నొకచో నెఱుంగ నగును. ఇట్లే జ్ఞానకాండము గూడ ప్రకరణమును, శబ్దములను ననుసరించి వర్ణింపబడును.

సాంఖ్య, వేదాంతాది దర్శనములందును, ఉపనిషత్తులలోను జ్ఞానకాండము విశేషముగ వర్ణించియుండుట జూడనగును. ఇట్లే మూడు కాండములు కలిసి విజ్ఞాన కాండమగును. ఈ నలు విధములగు కాండముల విశేష వర్ణనము వేద వ్యాఖ్యాన గ్రంథములలో జూడనగును. కావున కేవలము మూలమంత్రముల యర్థముల కనుకూలమయిన యనుష్ఠాన మొనర్ప వలెను. ప్రతికూలాచరణమును విడువవలెను.

మూలము (మొదలు) లేక శాఖ లెట నుండి వచ్చును? కావున నేయే మంత్రార్థములు వేదోక్తములో యవి స్వతః ప్రమాణములు; ఈశ్వరీయములును. వేదములకు భిన్నములైన గ్రంథములు వేదానుకూలము

లయినందువలననే ప్రామాణికములగును. వేదానుకూలములు కాని పక్షముననవి ప్రామాణికములు కావు. ఇట్లే వేదాంగములయిన వ్యాకరణాది శాస్త్రముల బోధమూలమున నుదాత్తము, అనుదాత్తము, స్వరితము ఏకశ్రుతియు నను స్వరముల జ్ఞానము, ఉచ్చారణము నెఱుగవలెను. పింగల సూత్రగ్రంథము వలన ఛందస్సు, షడ్జ, ఋషభ, గాంధార, మధ్యమ, పంచమ, ధైవత, నిషాదములనెడి సప్తస్వరముల జ్ఞానము కూడ సంపాదింపవలెను. అందీస్వరములు బాగుగ వివరింపబడినవి. అందువలన నిట వానిం గూర్చి వ్రాయబడదు. అగ్ని మీడే' అను నీ మంత్రమున 'అ' కారమునకు క్రింద అనుదాత్త చిహ్న (-) ముండును. 'గ్ని' ఉదాత్తము - దానిపై చిహ్నమేమియు నుండదు. 'మీ' స్వరిత చిహ్నముండును. (1) 'డే' ఏకశ్రుతి స్వరము గలిగియుండును. ఇట్లు స్వరముల విషయము ధ్యానమున నుంచుకొనవలెను.

కారణమేమన : ప్రస్తుతమున నేమంత్ర మే ఛందస్సుతో గూడి యున్నదో యా మంత్రమును స్వర సహితముగ వాద్యముతో వినిపించు వ్యవహారము లేదు. ఇట్లే యుప వేదములయిన ఆయుర్వేదాదుల మూలమున వైద్యక విద్యాదుల విశేషముగ నేర్వ వలెను. ఈ విషయములన్నియు వేద మంత్రములకు భాష్యము వ్రాయునపుడు ప్రకటము చేయబడును. ఇట్లే వ్యాకరణాదులకు సంబంధించిన విశేష విషయములు వ్రాయదగినవి అన్నియు సంక్షేపముగ వ్రాయబడును. వాని సహాయముతో వేదార్థము బాగుగ తెలిసికొన వీలగును. ఈ భాష్యమున ప్రతి పదార్థము విడివిడిగా క్రమముగ వ్రాయబడును. అందువలన నవీనటీకలు వ్రాసినవారు వేదములందు కల్పించిన దోషములను దొలగించి, సత్యార్థములు తెలిసికొననగును; జనులకు వేదములందు రుచియు వర్ధిల్లును. మఱియు, సాయణమహీధరాదులయు, ఆంగ్లేయులయు, మఱి యితరులయు భాష్యములలోను, వాని యనువాదములలోనుగల యనర్థములు తొలగింప వీలగును. వేదముల సత్యార్థమును దెలిసికొనుట వలన నత్యంత సుఖము కూడ లభించును. నేనొనర్చు భాష్యము ఐతరేయాది బ్రాహ్మణ గ్రంథముల ప్రమాణములతో గూడియుండును ఋషులు, మునులు, మహర్షులు, మహామునులునగు నార్యులు పరమేశ్వరుని కృప వలన వేదముల సత్యార్థములనెఱింగి బ్రాహ్మణాది గ్రంథములను వ్రాసి యున్నారు. సత్యార్థ ప్రకాశము లభింపనంత వఱకు లోకులకు భ్రమ నివృత్తి కలుగదు. ప్రామాణ్యా ప్రామాణ్య విషయమున సత్యా సత్య కథల నెఱింగిన మీదట భ్రమ తొలగునట్లు ఇక్కడను గుర్తింపవలెను. వేద భాష్యమున నా యా మంత్రములకు శ్లేషాలంకారాదుల వలన పారమార్థికము. వ్యావహారికమునను రెండర్థములు ప్రమాణ పూర్వకముగ వ్రాయబడును. కాని యే యర్థము నందును నీశ్వరుని సంబంధముండకపోదు.

కారణమేమన : నిమిత్త కారణమగు నీశ్వరు డీ సంపూర్ణమగు కార్య జగత్తునందంతటను వ్యాప్తమై యున్నాడు. సర్వ కాలములతో నీశ్వరున కన్వయము కలదు. వ్యావహారి కార్థ స్థలము నందును ఈశ్వర రచనానుకూలత వలననే పృథివ్యాది ద్రవ్యములకునికి యేర్పడు చున్నది. ఇట్లే పారమార్థి కార్థమున వ్యావహారి కార్థ సంబంధముండకపోదు. కావున నా యర్థము కూడ నుండును. ఇట్టి యనేక ప్రయోజనముల నుద్దేశించియే యీ వేద భాష్య రచన ప్రారంభింపబడినది.

ప్రతిజ్ఞా విషయము సమాప్తము.

# అథ ప్రశ్నోత్తర విషయః సంక్షేపతః

పూ : అథ కిమర్థా వేదానాం చత్వారో విభాగాః సంతి?

ఉ : భిన్న భిన్న విద్యా జ్ఞాపనాయ.

పూ : కా స్తాః !

ఉ : త్రిథా గానవిద్యా భవతి; గానోచ్చారణ విద్యాయా ద్రుత మధ్యమ విలంబిత భేదయుక్తత్వాత్. యావతా కాలేన హ్రస్వ స్వరో చ్చారణం క్రియతే తతో దీర్ఘో చ్చారణే ద్విగుణః, ప్లుతోచ్చారణే త్రిగుణశ్చ కాలోగచ్ఛతీతి. అత ఏకైకస్యాపి మంత్రస్య చతస్పృషు సంహితాను పాఠఃకృతోఽస్తి. తద్యథా ఋగ్భిః స్తువంతి, యజుర్భిర్ యజంతి, సామభిర్ గాయంతి, ఋగ్వేదే సర్వేషాం పదార్థానాం గుణ ప్రకాశః కృతోఽస్తి, తథా యజుర్వేదే విదిత గుణానాం పదార్థానాం. సకాశాత్ క్రియయాఽనేక విద్యోపకార గ్రహణాయ విధానం కృతమస్తి. తథా సామవేదో జ్ఞాన క్రియా విద్యయోర్ దీర్ఘ విచారేణ ఫలావధి పర్యంతం విద్యా విచారః, ఏవ మథర్వ వేదేఽపి త్రయాణాం వేదానాం మధ్యే యో విద్యా ఫల విచారో విహితోఽస్తి, తస్య పూర్తి కరణేన రక్షణోన్నతీ విహితే స్తః ఏత దాద్యర్థం వేదానాం చత్వారో విభాగాః సంతి.

పూ : వేదానాం చతుః సంహితా కరణే కిం ప్రయోజన మస్తి?

ఉ : యతో విద్యా విధాయకానాం మంత్రాణాం ప్రకరణశః పూర్వాపర సంధానేన సుగమతయా తత్రస్థా విద్యా విదితాః భవేయుః; ఏతదర్థం సంహితా కరణమ్.

పూ : వేదే ష్వష్టక మండలాధ్యాయ సూక్త షట్క కాండ వర్గ దశతి త్రిక ప్రపాఠకానువాక విధానం కిమర్థం కృతమస్తి ?

ఉ : ఇత్యత్ర బ్రూమః, అత్రాష్ట కాదీనాం విధాన మేత దర్థ మస్తి. యథా సుగమతయా పఠన పాఠన మంత్ర పరిగణనం, ప్రతి విద్యం విద్యా ప్రకరణబోధశ్చ భవేత్ ఏతదర్థ మేతద్విధానం కృత మస్తీతి.

పూ : కిమర్థా ఋగ్యజుః సామాథర్వాణః ప్రథమ ద్వితీయ తృతీయ చతుర్థ సంఖ్యాక్రమేణ పరిగణితాః సంతి ?

ఉ : ఇత్యత్రోచ్యతే. న యావద్ గుణ గుణినోః సాక్షాత్ జ్ఞానం భవతి, నైవ తావత్ సంస్కారః ప్రీతిశ్చ, న చాభ్యాం వినా ప్రవృత్తిర్ భవతి. తయా వినా సుఖాభావశ్చేతి. ఏతద్ విద్యా విధాయకత్వాద్ ఋగ్వేదః ప్రథమం పరిగణితుం యోగ్యోఽస్తి. ఏవం చ యథా పదార్థ గుణ జ్ఞానానంతరం, క్రియయోపకారేణ సర్వ జగద్ధిత సంపాదనం కార్యం భవతి. యజుర్వేద ఏతద్విద్యా ప్రతిపాదకత్వాద్ ద్వితీయః పరిగణితోఽస్తీతి బోధ్యమ్. తథా జ్ఞాన కర్మ కాండయో రుపాసనాయాశ్చ కియత్యున్నతిర్ భవితు మర్హతి. కించైతేషాం ఫలం భవతి, సామ వేద ఏతద్వి ధాయకత్వాత్ తృతీయో గణ్యత ఇతి. ఏవ మేవాథర్వ వేద త్రయ్యంతర్గత విద్యానాం పరిశేషరక్షణ విధాయకత్వాచ్చతుర్థః పరిగణ్యత ఇతి. అతో గుణ జ్ఞాన క్రియా విజ్ఞానోన్నతి శేష విద్యారక్షణానాం పూర్వా పర సహభావే సంయుక్త త్వాత్,

క్రమేణ ఋగ్యజుస్సామ అథర్వాణ ఇతి చతస్రః సంహితాః పరిగణితాః సంజ్ఞా శ్చ కృతాః సంతి. ఋచస్తుతౌ. యజ – దేవ పూజా సంగతి కరణ దానేషు. సామ–సాంత్వనే. షో– అంతకర్మణి.

"థర్వతిశ్చరతి కర్మా. తత్ ప్రతిషేధః" నిరు. ౧౧–౧౮. చర సంశయే. అనేనాథర్వశబ్దః సంశయ నివారణార్థో గృహ్యతే. ఏవం ధాత్వర్థోక్త ప్రమాణేభ్యః క్రమేణ వేదాః పరిగణ్యంతే చేతి వేది॰॰స్యమ్.

తె॥ వేదము నాలుగు భాగములేల చేయబడినది ?

ఉ : వేఱు వేఱు విద్యల నెఱుంగుటకు.

పూ : ఆ విద్య లెయ్యవి?

ఉ : గాన విద్య ముప్విధములు. ద్రుత మధ్యమ విలంబిత భేదములతో గానము ముప్విధములుగ నుచ్చరింపబడును. (౧) ఉదాత్తాది. షడ్‌జాది స్వరముల యుచ్చారణము శీఘ్రగతితో జేయబడును. ఋగ్వేదస్వరముల యుచ్చారణము ద్రుతము (హ్రస్వ) – (౨) రెండవది మధ్యమ (దీర్ఘ) వృత్తి. యజుర్వేద మంత్రోచ్చారణము ఋఙ్మంత్రోచ్చారణము కంటె రెట్టింపు కాలము పట్టును. (౩) మూడవ వృత్తి (ప్లుత) విలంబితమనబడును. ఇందు మొదటి వృత్తి కంటె మూడు రెట్లు కాలము పట్టును. సామ వేదము నుచ్చరించుటలోను గానము నందును నిట్టి యుచ్చారణము జరుగును. ఈ ముప్విధములగు వృత్తులను గలుపుట వలన నథర్వ వేదోచ్చారణము సిద్ధించును. కాని, ఇందు ద్రుతవృత్తికి జెందిన ఉచ్చారణ మధికముగా నుండును. అందువలననే వేదములు నాలుగు విధములుగ విభజింపబడినవి. కొన్ని మంత్రములు నాలుగు వేదములందును పఠియింపబడుటకును కారణమిదియే. ఆ మంత్రముల నుచ్చరించుటలో పైన జూపిన నాలుగు విధములు ఉపయోగింపబడును. అట్లే ప్రకరణ భేదము వలన నర్థ భేదము కూడ నేర్పడును. కావుననే అనేక మంత్రములు నాలుగు వేదములందును పఠింపబడినవి.

అట్లే (ఋగ్భిస్తు) ఋగ్వేదమున సర్వ పదార్థముల గుణములు ప్రకటింపబడును. అందువలన పదార్థములందు ప్రీతి కలిగి వాని వలన నుపకారము బొంద వీలగును. పదార్థ గుణముల ప్రత్యక్ష జ్ఞానము కలుగక సంస్కార ప్రవృత్తు లేర్పడవు; మనుష్య జన్మము వ్యర్థమగును. కావుననే ఋగ్వేదము ప్రథమముగ గణింపబడినది. అట్లే యజుర్వేదమునందు క్రియాకాండము విధింపబడినది. జ్ఞానము కలిగిన తరువాతనే కర్మమున ప్రవృత్తి సరిగా కలుగును. ఋగ్వేదమున గుణకథన మొనర్చినట్లు యజుర్వేదమున ననేక విద్యలు బాగుగ నాలోచింపబడినవి. అందువలన ప్రపంచమున వ్యవహరింపదగు పదార్థముల యుపయోగము తెలియనగును. వాని వలన జనులకు పలు విధముల సుఖము లభించును. విధి పూర్వకముగ నాచరింపనంత వఱకు నా యా క్రియలలోగల భేదము రహస్యము బోధపడదు. కావున తా నెఱిగినది యెఱిగినట్లు చెప్ప వలెను. చెప్పినట్లాచరింప వలెను. అప్పుడే జ్ఞానమునకు దగిన ఫలము, శోభయు గలుగును. ఇంతే కాక ముఖ్యముగా జగత్తున కుపకారము రెండు విధముల జరుగును. ఒకటి ఆధ్యాత్మికము – రెండు శారీరికము. విద్యా దానము వలన నాత్మోపకారము, శ్రేష్ఠ నియమముల మూలమున నుత్తమ పదార్థములను సంపాదించి శరీరమున కుపకారము చేయనగును. ఇందులకే యీశ్వరుడు ఋగ్వేదాదుల నుపదేశించి యున్నాడు. ఋగ్వేదము వలన పదార్థ జ్ఞానము కలుగును. యజుర్వేదము వలన క్రియా కాండము బోధపడును. సామ వేదము వలన నానంద ప్రాప్తి కలుగును. అథర్వ వేదము వలన సర్వ సంశయనివృత్తి కలుగును. ఇట్లు నాలుగు వేదముల విభాగ మేర్పడినది.

పూ. ప: ప్రథమము ఋగ్వేదము; రెండవది యజుర్వేదము; మూడవది సామ వేదము; నాలుగవది అథర్వ వేదము; అను నీ క్రమ మున వేదము లెందుకు లెక్కింపబడినవి?

ఉ. ప: పదార్థముల గుణ జ్ఞానము కలుగనంత వఱకు వాని యందు మనుజులకు ప్రీతి కలుగ నేరదు. గుణ గుణి జ్ఞానము కలిగిన మీదట వాని యందు ప్రీతి కలిగి, మనుజులు వాని కొఱకు ప్రవర్తింతురు. ప్రవృత్తి కలుగని పక్షమున క్రియయు నేర్పడదు. క్రియా నిర్వహణము లేక సుఖ ప్రాప్తియు గలుగదు. కావున వేదములు ఉపర్యుక్త క్రమమున విభజింపబడినవి.

పదార్థముల గుణ జ్ఞానము కలుగుట కనుకూలముగ మొదట ఋగ్వేదము గణింపబడినది. ఋగ్వేదాధ్యయనము మూలమున పదార్థముల నెఱింగి యనంతరమున యజుర్వేదము పఠించి, శుద్ధముగ క్రియల నొనర్చుట వలన జగత్తున కుపకారము కల్గును. కావున యజుర్వేదము రెండవదిగ లెక్కింపబడినది. ఇట్లే జ్ఞాన కర్మములయు, ఉపాసనాకాండపు వృద్ధియు, ఫలమును తెలియుటకు వీలుగ సామ వేదము మూడవదిగ లెక్కింప బడినది. ఇట్లే మూడు వేదములందుగల విద్యల శేష భాగములు సర్వ విద్యల రక్షణము, సంశయనివృత్తియు గలుగు విధానములు నన్నియు నథర్వ వేదమునసున్నవి. అందువలన నది నాలుగవదిగ గణింపబడినది. దీనిం బట్టి గుణ జ్ఞానము క్రియా విజ్ఞానము, వాని యున్నతి, రక్షణ క్రమముగ గలుగుట కనుకూలముగ వేదములు విభజింపబడినవని ఎఱుంగ వలయును. ఋగ్వేదము జ్ఞాన కాండము కొఱకును, యజుర్వేదము క్రియా కాండము కొఱకును, సామ వేదము జ్ఞాన, క్రియా కాండముల యభివృద్ధి కొఱకును, అథర్వ వేధము శేష భాగముల ప్రకాశ రక్షణముల నిమిత్తము క్రమముగ ప్రథమ, ద్వితీయ, తృతీయ చతుర్థములుగ లెక్కింపబడినవని భావము. "ఋచ–స్తుతౌ" యజ–దేవపూజా సంగతి కరణదానేషు', 'సామ–సాంత్వప్రయోగే,' 'షాంతకర్మణి,'థర్వతి శ్చరతి కర్మ అను నీ 'ధాత్వర్థముల ననుసరించి నాలుగు వేదములకు ఋగ్యజుస్సామాథర్వములని నామము లేర్పడినవి. మొదట మూడు వేదములందు బోధింపబడిన సమస్త విద్యల రక్షణ బాగుగ జరుగుట కనువుగ నీశ్వరుడు అథర్వ వేదమును ప్రసాదించియున్నాడు.

పూ. ప: వేదములు నాలుగు సంహితలుగ జేయుటలో బ్రయోజనమేమి?

ఉ. ప: విద్యలను బోధించు మంత్రముల ప్రకరణము ననుసరించి పూర్వా పరముల జ్ఞానము కలుగును. దాని వలన వేదములలోని విద్య లన్నియు సులభముగ నెఱుగనగును. సంహితల వలన నిట్టి ప్రయోజనము లనేకములు సిద్ధించును.

పూ. ప: బాగు; కాని, వేదములలోని, అష్టకములు, అధ్యాయములు, మండలములు, సూక్తములు, షట్కములు, కాండములు, అనువాకములు మున్నగు విభాగముల వలన ప్రయోజనమేమి?

ఉ. ప: ఈ విభాగముల వలన పాఠనము సుగమమగును. సులభముగ మంత్ర సంఖ్య తెలియనగును. ఆయా విద్యల ప్రకరణముల విభాగములలో సంశయముండదు. గుణ, గుణి భేద జ్ఞానము మూలమున విద్యలను మననము చేయుటకు వీలగును. పూర్వా పరస్మరణము వలన ననువృత్తి పూర్వకముగ ఆకాంక్ష, యోగ్యత, ఆసత్తి, తాత్పర్యముల నన్నింటిని తెలిసికొనవచ్చును. ఇట్టి ప్రయోజనములు సిద్ధించుటకే యష్ట కాది విభజనము చేయబడినది.

*సం॥ పూ. ప: ప్రత్యేక మంత్రస్యోపరి ఋషి దేవతా ఛంద: స్వరా: కిమర్థా లిఖ్యంతే?*

ఉ. షః యతో వేదానా మీశ్వరోక్త్యనంతరం యేన యేనర్షిణా యస్య యస్య మంత్రస్యార్థో యథా వద్విదితస్తస్మాత్తస్య తస్యో పరి తత్త దృషేర్ నా మోల్లిఖితం కృతమస్తి.

పూ. ప : కుతః?

ఉ. షః యై రీశ్వర ధ్యానానుగ్రహాభ్యాం మహతా ప్రయత్నేన మంత్రార్థస్య ప్రకాశితత్వాత్ తత్కృతమహోపకార స్మరణార్థం తన్నామలేఖనం ప్రతిమంత్రస్యోపరి కర్తుం యోగ్య మస్త్యతః. అత్ర ప్రమాణమ్.

"యో వాచం శ్రుతవాన్ భవత్యఫలా మపుష్పా మిత్యఫలాఽస్మా అపుష్పా వాగ్ భవతీతి వా, కించిత్ పుష్పఫలేతి వా. అర్థం వాచః పుష్పఫల మాహ. యాజ్ఞదైవతే పుష్పఫలే దేవతాధ్యాత్మే వా. సాక్షాత్ కృత ధర్మాణ ఋషయో బభూవు స్తేఽవరేభ్యోఽసాక్షాత్ కృత ధర్మభ్య ఉపదేశేన మంత్రాన్ సంప్రాదుః. ఉపదేశాయ గ్లాయంతోఽవరే బిల్మ గ్రహణాయేమం గ్రంథం సమామ్నాసిషుర్; వేదం చ వేదాంగాని చ. బిల్మం భిల్మం భాసన మితి వై తావంతః సమాన కర్మాణో ధాతవో ధాతుర్ దధాతే రేతావంత్యస్య సత్వస్య నామ ధేయాన్యేతావతా మర్థానా మిద మభిధానం, నైఘంటుక మిదం దేవతానా మప్రాధాన్యే నేద మితి, తద్య దన్యదైవతే మంత్రే నిపతతి నైఘంటుకం తత్" నిరు. అ. ౧–౧౮–౧౯–౨౦

(యో వాచం) యో మనుష్యోఽర్థ విజ్ఞానేన వినా శ్రవణాధ్యయనే కరోతి తదఫలం భవతి.

పూ. షః వాచో వాణ్యాః కిం ఫలం భవతీత్యాహ.

ఉ. వ : విజ్ఞానం, తథా తజ్ జ్ఞానానుసారేణ కర్మానుష్ఠానమ్. య ఏవం జ్ఞాత్వా కుర్వంతి, త ఋషయో భవంతి.

పూ. ప : కీదృశాస్తే సాక్షాత్ కృత ధర్మాణః?

ఉ. షః యే : సర్వా విద్యా యథావద్ విదితాస్త ఋషయో బభూవు స్తే ఽవరేభ్యోఽ సాక్షాత్కృత వేదేభ్యో మనుష్యేభ్య ఉపదేశేన వేదమంత్రాన్ సంప్రాదుః; మంత్రార్థాంశ్చ ప్రకాశితవంతః.

పూ. షః కస్మై ప్రయోజనాయ?

ఉత్తరోత్తరం వేదార్థ ప్రచారాయ; యే చావరేఽధ్యయ నాయోప దేశాయ చ గ్లాయంతి తాన్ వేదార్థ విజ్ఞాపనాయేమం నైఘంటుకం నిరుక్తాఖ్యం గ్రంథం త ఋషయః సమామ్నాసిషుః, సమ్యగభ్యాసం కారిత వంతః. యేన వేదం వేదాంగాని యథార్థ విజ్ఞానతయా సర్వే మనుష్యా జానీయుః యే సమానార్థాః సమానకర్మాణో ధాతవో భవంతి, తదర్థ ప్రకాశో యత్ర క్రియతే, అన్య అర్థస్యైతావంతి నామధేయా న్యేతావతా మర్థానా మిద మభిధానార్థ మేకం నామ, అర్థా దేక స్యార్థ స్యానేకాని నామా న్యనేకేషా మేకం నామేతి. తన్నైఘంటుకం వ్యాఖ్యానం విజ్ఞేయమ్. యత్రార్థానాం ద్యోత్యానాం పదార్థానాం ప్రాధాన్యేన స్తుతిః క్రియతే. తత్ర సై వేయం మంత్రమయీ దేవతా విజ్ఞేయా, యచ్చ మంత్రాద్ భిన్నార్థ స్యైవ సంకేతః ప్రకాశ్యతే. తదపి నైఘంటుకం వ్యాఖ్యాన మితి.

అతో నైవ కశ్చిన్మనుష్యో మంత్ర నిర్మాతేతి విజ్ఞేయమ్. ఏవం యేన యేనర్షిణా యస్య యస్య మంత్ర స్యార్థః ప్రకాశితోఽస్తి తస్య తస్య ఋషేరేకైక మంత్రస్య సంబంధే నామోల్లేఖః కృతోఽస్తి. తథా

యస్య యస్య మంత్రస్య యో యోఽర్థోఽస్తి సః సోర్థ స్తస్య తస్య దేవతాశబ్దే నాభిప్రాయార్థ విజ్ఞాపనార్థం ప్రకాశ్యతే. ఏతదర్థం దేవతాశబ్దలేఖనం కృతమ్. ఏవం చ యస్య యస్య మంత్రస్య గాయత్ర్యాది ఛందోఽస్తి, తత్తద్విజ్ఞానార్థం ఛందోలేఖనమ్. తథా యస్య యస్య మంత్రస్య యేన యేన స్వరేణ వాదిత్ర వాదన పూర్వకం గానం కర్తుం యోగ్య మస్తి. తత్తదర్థం షడ్జాది స్వరోల్లేఖనం కృత మస్తీతి సర్వ మేత ద్విజ్ఞేయమ్.

తె॥ పూ. పః ప్రతి మంత్రమునకు మంత్రముతో బాటు ఋషి, దేవత, ఛందస్సు, స్వరము లేల వ్రాయుదురు?

ఉ. పః సృష్టి ప్రారంభమున నీశ్వరుడు వేదములను బ్రకటించి నప్పటి నుండియు ఋషులు వేద మంత్రార్థములను గూర్చి యాలోచింప దొడగిరి. ఏ మంత్రార్థము నే ఋషి ప్రకటించియున్నాడో యా మంత్రముతో బాటు స్మరణార్థ మా ఋషి నామము లిఖింపబడినది. ఈకారణము వలననే మంత్రములకు ఋషినామము కూడ కలిగినది. మఱియు నా ఋషులు ఈశ్వరుని ధ్యానమొనర్చి, యతని యనుగ్రహమును గడించి, బహుయత్నములతో వేద మంత్రముల యర్థముల నెఱింగి, సర్వ మానవులకు నుపకారమొనర్చిరి. కావుననే విద్వాంసులు వేద మంత్రములతో బాటు ఈ ఋషులను గూడ స్మరించుచున్నారు. ఇందులకు నిరుక్తము ప్రమాణము (యో వాచం ) అర్థము నెఱుంగక చేయు వేదాధ్యయనము, శ్రవణము నిష్ఫలములగును.

పూ.ప : వాక్యానకు ఫలమేమి ?

ఉ. ప : అర్థము బాగుగ గ్రహించి తదనుసారము వ్యవహారము లందు ప్రవృత్తులగుటయే వాక్యానకు ఫలము. ఈ నియమమును భావించువారే ధర్మమును సాక్షాత్కారము చేసికొనిన వారు – ఋషులు.

పూ. ప : ఋషులు సాక్షాత్కృత ధర్ములెట్లగుదురు?

ఉ. పః సర్వ విద్యల నున్నవి యున్నట్లెఱిగి, తమ యుపదేశములతో నవరులకు – అల్ప బుద్ధులకు వేద మంత్రార్థములను బోధించినవారే ఋషులు సాక్షాత్ కృత ధర్ములు.

పూ. పః వారే ప్రయోజన ముద్దేశించి యట్లు చేయుదురు.

ఉ. పః వేద ప్రచార పరంపరను స్థిర మొనర్చుటకు వారట్లు చేయుదురు. వేద శాస్త్రములను జదువుట కసమర్థులైన వారికి సులభముగ వేదార్థము బోధపడుటకుగాను నిఘంటువు, నిరుక్తము మున్నగు గ్రంథములను గూడ వారు రచియించిరి. వాని సహాయమున నెల్లరు వేద వేదాంగములను జ్ఞాన పూర్వకముగ బఠించి, వాని సత్యార్థములను బ్రకటింపగలరు. సమానార్థకములు, సమాన క్రియలుగల ధాతువుల వ్యాఖ్య గలది నిఘంటువనబడును – ఈ యర్థమున కిన్ని నామధేయములు; ఇన్ని యర్థములను దెలుపుట కిదియొక నామము – ఒక యర్థమున కనేక నామములు, అనేకార్థములకొక నామము– అను నీ విషయములను దెలుపునది నిఘంటు వనబడును. (వేద మంత్రముల శబ్దములకు వ్యాఖ్యనుదెలుపునది నిరుక్తము.) ఏ యే మంత్రములలో ముఖ్యముగా నేయర్థముల స్తుతి చేయబడునో యా మంత్రార్థములు మంత్రమయి దేవత యని యెఱుంగవలెను. ఏ మంత్రమును కేది యర్థమో యదియే దానికి దేవత యనబడును.

మంత్రములను జూడగానే వాని యభిప్రాయార్థములు యథార్థ జ్ఞానము కలుగుటకు వీలగునట్లు మంత్రములతో బాటు దేవతయు వ్రాయబడును. ఇట్లే మనుష్యులకు ఛందోజ్ఞానము బాగుగ కలుగుటకు గాను మంత్రముల ఛందస్సు కూడ వానితో బాటు వ్రాయబడును. మఱియు నే యే ఛందస్సు లే యే స్వరములతో వాద్యములందు గానము చేయ బడ వలయునో తెలియుటయే ప్రయోజనముగ షడ్ జాది స్వరముల నా మంత్రములతో వ్రాయబడును. గాయత్రీ ఛందస్సు గల మంత్రముల షడ్ జాది స్వరములతో చూడవలెను. ఇట్లే యితర స్వరములును వ్రాయబడినవి. వాని మూలమున మనుజులకు గాన విద్యయు బోధపడును.

సం॥ పూ. ప॥ వేదేష్వగ్ని వాయ్వింద్రాశ్వి సరస్వత్యాది శబ్దానాం క్రమేణ పాఠః కిమర్థః కృతోఽస్తి?

ఉ. ప॥ పూర్వా పర విద్యా విజ్ఞాపనార్థం విద్యా సంగ్యనుషంగి ప్రతి విద్యానుషంగి బోధార్థం చేతి. తద్యథా. అగ్ని శబ్దేనేశ్వర భౌతికార్థయోర్ గ్రహణం. భవతి. యథాఽనేనేశ్వరస్య జ్ఞానవ్యాపకత్వాదయో గుణా విజ్ఞాతవ్యా భవంతి. యథేశ్వరరచితస్య భౌతిక స్యాగ్నేర్ నామ శిల్ప విద్యాయా ముఖ్య హేతుత్వాత్ ప్రథమం గృహ్యతే; తథేశ్వరస్య సర్వా ధారకత్వానంత బలవత్వాదిగుణా వాయు శబ్దేన ప్రకాశ్యంతే. యథా శిల్ప విద్యాయాం భౌతికాగ్నేః సహాయ కారిత్వాన్మూర్త ద్రవ్యాధారకత్వా త్తదనుషంగిత్వాచ్చ భౌతికస్య వాయోర్ గ్రహణం కృత మస్తి, తథైవ వాయ్వాదీనా మాధారకత్వా దీశ్వరస్యాపీతి. యథేశ్వర స్యేంద్రశబ్దేన పరమైశ్వర్య వత్వాది గుణా విదితా భవంతి. తథా భౌతికేన వాయునా పృత్తమైశ్వర్యప్రాప్తిర్ మనుష్యైః క్రియతే. ఏతదర్థ మింద్ర శబ్దస్య గ్రహణం కృత మస్తి. అశ్విశబ్దేన శిల్ప విద్యాయాం యాన చలనాది విద్యావ్యవహారే జలాగ్ని పృథివీ ప్రకాశాదయో హేతవః ప్రతి హేతవశ్చ సంత్యేతదర్థమగ్ని వాయు గ్రహణానంతర మశ్వి శబ్ద ప్రయోగో వేదేషు కృతోఽస్తి. ఏవం చ సరస్వతీ శబ్దేనేశ్వరస్యానంత విద్యావత్వ శబ్దార్థ సంబంధ రూప వేదోపదేష్టృత్వాది గుణా వేదేషు ప్రకాశితా భవంతి; వాగ్ వ్యవహారాశ్చ. ఇత్యాది ప్రయోజనాయాగ్ని వాయ్వింద్రాశ్వి సరస్వత్యాది శబ్దానాం గ్రహణం కృతమస్తి. ఏవమేవ సర్వత్రైవ వైదిక శబ్దార్థ వ్యవహార జ్ఞానం సర్వైర్ మనుష్యైర్ బోధ్యమస్తీతి విజ్ఞాప్యతే.

తె॥ పూ. ప॥ వేదములందు పలుమార్లు అగ్ని, వాయువు, ఇంద్రుడు, అశ్వి, సరస్వత్యాది శబ్దములు క్రమముగా నేల ప్రయోగింపబడినవి?

ఉ. ప॥ పూర్వాపర విద్యల నెఱుగజేయుటకును, ఆయా విద్యలందుగల ముఖ్యా ముఖ్య హేతువులను తెలుపుటకును నీశ్వరుడు అగ్ని మున్నగు శబ్దములను క్రమముగా బ్రయోగించియున్నాడు. ఉదాహరణము:- అగ్ని శబ్దమునకు ఈశ్వరుడు, భౌతికాగ్ని యను నీ రెండర్థములు గ్రహింపబడును. అగ్ని శబ్దమున నీశ్వరుదుని యర్థము గ్రహించి నపుడీశ్వరుని యనంత జ్ఞానము వ్యాపకత్వము మున్నగు గుణములు మనుజులకు బోధపడును. ఈ యగ్ని శబ్దమునకే పృథివ్యాది పంచభూతములందుండు ప్రత్యక్షమగు నగ్నితత్వము కూడ యర్థముగ గ్రహింపబడును. ఈ యగ్నియే శిల్ప విద్యకు ముఖ్య హేతువు. అందు వలన నది ప్రథమమున గ్రహింపబడినది. అట్లే యీశ్వరుని సర్వాధారకత్వము, అనంత బలము మున్నగు గుణములను దెలుపుటకు వాయుశబ్దము గ్రహింపబడినది. శిల్ప విద్య యందు అగ్నికి సహాయకమగుచు, మూర్త ద్రవ్యమును ధరించుటలో ముఖ్య హేతువు భౌతిక వాయువే. కావుననే ఋగ్వేదమున ప్రథమ

సూక్తమున అగ్ని శబ్దము, రెండవ దాని యందు వాయు శబ్దము గ్రహింపబడినవి. ఇట్లే వాయువు మున్నగు వానికిని ఆధారమగుటచే నీశ్వరుడును గ్రహింపబడును. ఇంద్ర శబ్దము వలన నీశ్వరుని పరమైశ్వర్యాది గుణము లనేకములు విదితములగును. అట్లే భౌతిక వాయువు మూలమున యోగాభ్యాస మొనర్చి, విజ్ఞానము, శిల్ప విద్యమున్నగు వాని వలన మనుష్యులు ఉత్తమమగు నైశ్వర్యమును బొందవచ్చును. అందువలన ఇంద్రశబ్దము మూడవదిగ ( సూ. ౨ మం. ౪-౬) ప్రయోగింపబడినది. ఈ యగ్ని, వాయువులకు సంబంధించిన విద్యల వలన మనుష్యు ల ద్భుతములైన కలా కౌశలములకు జెందిన యుక్తుల నెఱుగ గలరు. తన్మూలమున వారు ఇంద్రులు-ఐశ్వర్యశాలు రగుదురు. ఇట్లే అశ్విశబ్దము మూడవసూక్తమున మొదటి మూడు మంత్రములలో గ్రహింపబడినది. ఇయ్యది క్రమము ననుసరించి నాలుగవ స్థానమున గ్రహింపబడినది. ఈ యశ్విశబ్దము వలన నీశ్వరుని యనంత క్రియా శక్తి విదితమగును. శిల్ప విద్యకు సంబంధించిన విమానాది యానములను నడపుటకు (అశ్వినామకములగు) జలాగ్నులు, పృథివీప్రకాశములు మున్నగు పదార్థములు ముఖ్యములగును. యంత్రములు, విమానములు, నౌకలు, శకటములు మున్నగు యానములన్నియు పూర్వము చెప్పినట్లు పృథివ్యాది పదార్థములతోనే యేర్పడును. కావున అశ్వి శబ్దము మూడవ సూక్తమున నాలుగవ స్థానమున ప్రయోగింపబడినది. అట్లే సరస్వతి అను శబ్దము పరమేశ్వరుని యనంత వాణిని బోధించును. దానిచే నీశ్వరుని యనంత విద్య యెఱుగనగును. తన్మూలముననే యీశ్వరుడు మానవహితార్థము తన యనంత విద్యా యుక్తములగు వేదముల నుపదేశించి యున్నాడు. మూడవ సూక్తమున దశమ మంత్రమునుండి యైదవ స్థానమున సరస్వతీ శబ్దము పఠింపబడినది. ఇట్టి ప్రయోజనముల నుద్దేశించియే అగ్ని వాయ్వాది శబ్దములు క్రమముగ నొకదాని తరువాత మఱియొకటి ప్రయోగింపబడినవని యెఱుగవలెను. ఇట్లే వేదముల అర్థాన్తరములను గుర్తింపవలెను.

*సం । పూ. ప : వేదానా మారంభేఽగ్నివాయ్వాది శబ్ద ప్రయోగైః ప్రసిద్ధిర్జాయతే. వేదేషు భౌతిక పదార్థానామేవ తత్తచ్ఛబ్దైర్ గ్రహణం భవతి. యత ఆరంభే ఖల్వీశ్వర శబ్ద ప్రయోగో నైవ కృతోఽస్తి?*

*ఉ. పః 'వ్యాఖ్యానతో విశేష ప్రతిపత్తిర్ నహి సందేహా దలక్షణమ్' ఇతి మహాభాష్యకారేణ పతంజలి మహామునినా (లణ్) ఇతి సూత్ర వ్యాఖ్యానోక్త న్యాయేన సర్వ సందేహనివృత్తిర్ భవతీతి.*

*పూ. పః కుతః ?*

*ఉ. పః వేద వేదాంగోపాంగ బ్రాహ్మణ గ్రంథే ష్వగ్ని శబ్దే నేశ్వరభౌతికార్థయోర్ వ్యాఖ్యానస్య విద్యమానత్వాత్. తథేశ్వరశబ్ద ప్రయోగేణాపి వ్యాఖ్యానేన వినా సర్వథా సందేహనివృత్తిర్ న భవతి. ఈశ్వర శబ్దేన పరమాత్మా గృహ్యతే. తథా సామర్థ్యవతో రాజ్ఞః కస్యచిన్మనుష్య స్యాపీశ్వర ఇతి నామాస్తి. తయోర్ మధ్యాత్ కస్య గ్రహణం కర్తవ్య మితి శంకాయాం వ్యాఖ్యానత ఏవ సందేహ నివృత్తిర్ భవత్యత్రేశ్వర నామ్నా పరమాత్మనో గ్రహణ మత్ర రాజాది మనుష్యస్యేతి. ఏవ మత్రాప్యగ్ని నామ్నా ఉభయార్థ గ్రహణే నైవ కశ్చిద్దోషో భవతీతి. అన్యథా కోటిశః శ్లోకై స్సహస్రైర్ గ్రంథైరపి. విద్యాలేఖ పూర్తి రత్యంతా సంభవాస్తి, అతః కారణా దగ్న్యాది శబ్దైర్ వ్యావహారిక పారమార్థికయోర్ విద్యయోర్ గ్రహణం స్వల్పాక్షరైః స్వల్ప గ్రంథైశ్చ భవతీతి మత్వేశ్వరేణాగ్న్యాది శబ్ద ప్రయోగాః కృతాః. యతోఽల్ప కాలేన పఠన పాఠన వ్యవహారేణాల్ప పరిశ్రమేణైవ మనుష్యాణాం సర్వా విద్యా విదితా భవేయు రితి. పరమ కారుణిక : పరమేశ్వరః సుగమశబ్దై స్సర్వ విద్యోద్దేశా నుపదిష్టవా నితి విజ్ఞేయమ్. తథా చ యేఽగ్న్యాదయః శబ్దార్థాః సంసారే ప్రసిద్ధాః సంత్యేతైః సర్వై రీశ్వర ప్రకాశ : క్రియతే.*

పూ. పః కుతః?

ఉ. పః ఈశ్వరోఽస్తీతి సర్వే దృష్టాంతా జ్ఞాపయంతీతి బోధ్యమ్. ఏవం చతుర్వేదస్థ విద్యానాం మధ్యాత్ కాశ్చిద్విద్యా అత్ర భూమికాయాం సంక్షేపతో లిఖితా. ఇతోఽగ్రే మంత్రభాష్యం విధాస్యతే. తత్ర యస్మిన్ యస్మిన్ మంత్రే యా యా విద్యోపదిష్టాస్తి, సాసా తస్య తస్య మంత్రస్య వ్యాఖ్యానావసరే యథా వత్ ప్రకాశయిష్యతే.

తె॥ పూ. పః లోకమున నిపమి, గాలి మున్నగు వస్తువులు అగ్ని మున్నగు శబ్దముల కర్థములుగా గ్రహింపబడుట ప్రసిద్ధము. కావున వేదము లందలి అగ్ని వాయ్వాది శబ్దములచే నవి యే గ్రహింపబడవలెను. కావుననే ఆ శబ్దములచే లౌకికములగు నగ్ని వాయ్వాది పదార్థములే మానవులచే గ్రహింపబడినవి. అట్లు కాని పక్షమున నెక్కడ నే శబ్దము ప్రయోగింపవలెనో అక్కడ నాశబ్దమే ప్రయోగించిన దానినే గ్రహించుటకు వీలుండెడిది. భ్రమయు గలుగకుండెడిది. లేక, ఆరంభమున నగ్ని వాయ్వాది శబ్దములను బ్రయోగింపక యీశ్వర పరమేశ్వరాది శబ్దములే ప్రయోగించి యుండినను బాగుండెడిది.

ఉ.పః అట్లు ప్రయోగించియున్నను భ్రమ కలుగవచ్చును. కాని, వ్యాఖ్యానముల మూలమున మంత్రములలోని ప్రతి పదమునకు నర్థము వివరించిన పిదప సందేహము కాని భ్రమకాని యుండనేరదు.

పూ.పః అది యెట్లు?

ఉ.పః వేదాంగములయిన శిక్ష, కల్పము మున్నగు గ్రంథములు వేదమంత్రముల యర్థములను సందేహము కలుగని విధమున వివరించును. అగ్ని శబ్దము స్థానమున నీశ్వర శబ్దమును బ్రయోగించినను వ్యాఖ్యాన సహాయము లేక సందేహనివృత్తి కలుగదు. కారణమేమనః ఈశ్వరుడను పదమునకు నుత్తమ సామర్థ్యముగల రాజు మున్నగు పురుషులనియు నర్థము చెప్పవచ్చును. ఇంతేకాక 'ఈశ్వరుడు' అను పదమొకనికి నామముకూడ కావచ్చును. మఱియును నన్నిచోట్ల లోను నేకార్థము నిచ్చు పదములే వాడిన పక్షమున వేదముల పరిమాణమునకు మేర యుండక పోయెడిది. ఎన్నివందల కోట్ల మంత్రములలో సర్వవిద్యలు బోధింప నయ్యెడివో చెప్పజాలము. అప్పుడు వేదముల పఠన పాఠనములు మానవులకు సాధ్యము కాకుండెడివి. కావుననే ఈశ్వరుడు అగ్ని వాయ్వాది పదముల నుపయోగించి వేదాధ్యయనాధ్యాపనములు సుగమములగు నట్లను గ్రహించి యున్నాడు; వ్యావహారిక పారమార్థిక విద్యల వేదములందు ప్రకటించియున్నాడు. మనుజులు స్వల్పకాలముననే వేదము మూలమున మూల విద్యల నెఱుంగ నవకాశము కల్పించినాడు. ఈశ్వరు డగ్న్యాది సులభపదముల మూలమున నుపదేశించుట కివియే ముఖ్యకారణములు. లోకమున నగ్న్యాది శబ్దములకు ప్రసిద్ధములగు నర్థముల మూలమునను నీశ్వరుడు గ్రహింపబడును.

పూ.పః అది యెందులకు?

ఉ.పః అందువలన లౌకిక వస్తువులన్నియు పరమేశ్వరుని తెలిసికొనుటకును. తెలుపుటకును దృష్టాంతములుగ నుపయోగించును. ఇట్లు నాలుగు వేదములందును గల విద్యలలో కొన్నింటి నీవేదభాష్య భూమికయందు సంక్షేపముగ వ్రాసి యున్నాము. మిగిలిన విద్యలు మంత్రభాష్యమున నా యా మంత్రార్థములను వివరించు నెడల వ్రాయుదుము – వివరింతుము.

ప్రశ్నోత్తర విషయము సంక్షేపముగ సమాప్తము.

# నిరుక్తే వైదిక శబ్దానాం విశేష నియమాః

సం॥ అథ నిరుక్తకారః సంక్షేపతో వైదిక శబ్దానాం విశేషనియమా నాహ.

తా స్త్రివిధా ఋచః:– పరోక్షకృతాః, ప్రత్యక్షకృతాః, ఆధ్యాత్మిక్యశ్చ. తత్ర పరోక్షకృతాః సర్వాభిర్ నామవిభక్తిభిర్ యుజ్యంతే; ప్రథమపురుషైశ్చాఖ్యాతస్య. అథ ప్రత్యక్ష కృతా మధ్యమ పురుష యోగా స్త్వమితి చైతేన సర్వనామ్నా. అథాపి ప్రత్యక్ష కృతాః స్తోతారో భవంతి, పరోక్షకృతాని స్తోతవ్యాని. అథాధ్యాత్మిక్య ఉత్తమ పురుషయోగా అహమితి చైతేన సర్వనామ్నా. నిరు. ౭-౧-౨

అయం నియమః వేదేషు సర్వత్ర సంగచ్ఛతే. తద్యథా – సర్వే మంత్రాస్త్రి విధానా మర్థానాం వాచకా భవంతి, కేచిత్ పరోక్షాణాం, కేచిత్ ప్రత్యక్షాణాం, కేచి దధ్యాత్మం వక్తు మర్హాః. తత్రాద్యేషు ప్రథమ పురుషస్య ప్రయోగా భవంతి; అపరేషు మధ్యమస్య, తృతీయే షూత్తమ పురుషస్య చ. తత్ర మధ్యమ పురుష ప్రయోగార్థౌ ద్వౌ భేదౌ స్తః. యత్రార్థాః ప్రత్యక్షాః సన్తి తత్ర మధ్యమ పురుష ప్రయోగా భవంతి. యత్ర చ స్తోతవ్యా అర్థాః పరోక్షాః, స్తోతారశ్చ ఖలు ప్రత్యక్షా స్తత్రాపి మధ్యమ పురుష ప్రయోగో భవతీతి. అస్యాయ మభిప్రాయః– వ్యాకరణరీత్యా ప్రథమ మధ్యమోత్తమ పురుషాః క్రమేణ భవంతీతి. తత్ర జడపదార్థేషు ప్రథమ పురుష ఏవ, చేతనేషు మధ్యమోత్తమౌచ. అయం లౌకిక వైదిక శబ్దయోః సార్వత్రికో నియమః. పరంతు వైదిక వ్యవహారే జడేపి ప్రత్యక్ష మధ్యమ పురుష ప్రయోగాః సంతి. తత్రేదం బోధ్యం. జడానాం పదార్థానా ముపకారార్థం ప్రత్యక్షకరణమాత్రమేవ ప్రయోజనమితి.

ఇమం నియమ మబుద్ధ్వా వేదభాష్య కారైః సాయణాచార్యాదిభి స్తదనుసారతయా స్వదేశ భాషయాఽనువాదకారకైర్ యూరోపాఖ్య దేశనివాస్యాదిభిర్ మనుష్యైర్ వేదేషు జడపదార్థానాం పూజాఽస్తీతి వేదార్థోఽన్యథైవ వర్ణితః.

తె॥ వేదములోని ప్రయోగములకు సంబంధించిన విశేషనియమములను గుఱించి సంక్షేపముగ నిట వ్రాయుదుము. నిరుక్తకారాదులు చెప్పిన నియమములు వేదములందలి సర్వప్రయోగములలోను బాగుగ వర్తించును.

(తా స్త్రివిధా ఋచః) వేదములలోని మంత్రములన్నియు మూడు రకముల యర్థములను దెలుపును. ౧. పరోక్షములు –అదృశ్యార్థములు, ౨. ప్రత్యక్షములు–దృశ్యార్థములు, 3. అధ్యాత్మములు – జ్ఞాన గోచరములగు నాత్మ పరమాత్మలు. అందు పరోక్షార్థములను దెలుపు మంత్రములలో ప్రథమ పురుష పదములు – అది, వాడు మున్నగునవి ప్రయోగింపబడును. వాని క్రియలు 'ఉన్నది, ఉన్నాడు, భుజించు చున్నాడు. వందుచున్నాడు' అని యుండును. ఇట్లే ప్రత్యక్షములగు నర్థములను దెలుపు మంత్రములలో 'నీవు, మీరు' అను మధ్యమ పురుష పదములుండును. వాని క్రియలు, 'ఉన్నావు, ఉన్నారు. చేయుచున్నావు, వందుచున్నావు' అని యుండును. ఇక, అధ్యాత్మములగు నర్థములను దెలుపు మంత్రములలో నుత్తమ పురుష పదములు – 'నేను, మేము మున్నగునవి చూడనగును. వాని క్రియలు – 'ఉన్నాను, ఉన్నాము, వందుచున్నాను, చేయుచున్నాను' అని యుండును.

అట్లే స్తుతింపదగు పదార్థము పరోక్షమై స్తుతి చేయునది ప్రత్యక్షమగు నెడలను మధ్యమ పురుష ప్రయోగముండును. వ్యాకరణము ననుసరించి లోక వ్యవహారమున ప్రథమ మధ్యమోత్తమ పురుష పదములు వాని వాని స్థానములందు ప్రయోగింపబడును. జడ పదార్థములను దెలుపుటకు ప్రథమ పురుష పదములు, చేతనములను దెలుపుటకు మధ్యమోత్తమ పురుష పదములు ప్రయోగింపబడునని భావము. ఇయ్యది లౌకిక, వైదిక భాషలలో నుండు సాధారణ నియమము. కాని వైదిక ప్రయోగములలో నొకింత విశేషమున్నది. - జడ పదార్థములు కూడ ప్రత్యక్షము లైనపుడు నిరుక్తకారుడు చెప్పిన విధముగ నటను మధ్యమ పురుష ప్రయోగము చేయబడును. దీనింబట్టి, యీశ్వరుడు లౌకిక జడపదార్థములను ప్రత్యక్ష మొనర్చి వానితో ననేక ప్రయోజనములను, ఉపకారములను మాత్రము బొందవలెనని తెలిపినట్లు గ్రహింపవలెను. జడ పదార్థములు జీవుల యుపకారార్థమేకాని, మఱి యొండు ప్రయోజనముకొఱకు లేదని భావము.

ఈ నియమము నెఱుంగక సాయణాచార్యాది వేదభాష్యకర్తలు, వారి ననుసరించిన యైరోపా దేశవాసులైన విద్వాంసులు వేదార్థములను విపరీత మొనర్చి యున్నారు. ఇయ్యది వారొనర్చిన పొరపాటు. అందు వలననే వారు వేదములందు జడపదార్థముల పూజ, ఉపాసనాదులున్నవని వ్రాసియున్నారు. వాస్తవమున వేదములందు జడపూజ మచ్చునకైనను కానరాదు.

నిరుక్తమున జెప్పబడిన వైదిక శబ్దముల విశేష నియమము సమాప్తము.

# అథ స్వరవ్యవస్థా విషయః

సం॥ అథ వేదార్థోపయోగితయా సంక్షేపతః స్వరాణాం వ్యవస్థా లిఖ్యతే.

తే స్వరా ద్వివిధాః; ఉదాత్త షడ్జాదిభేదాత్ సప్త సప్తైవ సంతి. తత్రోదాత్తాదీనాం లక్షణాని వ్యాకరణ మహాభాష్యకార పతంజలి ప్రదర్శితాని లిఖ్యంతే.

"స్వయం రాజంత ఇతి స్వరాః. ఆయామో దారుణ్య మణుతా స్వస్యే త్యుచ్చైః కరాణి (ఉదాత్త విధాయకానీతి యావత్) శబ్దస్య. ఆయామో గాత్రాణాం నిగ్రహః, దారుణ్యం స్వరస్య దారుణతా రూక్షతా, అణుతా కంఠస్య, కంఠస్య సంవృతతా, ఉచ్చైః కరాణి శబ్దస్య. అన్వవసర్గో మార్దవమురుతా స్వస్యేతి నీచైఃకరాణి (అనుదాత్త విధాయకానీతి యావత్) శబ్దస్య. అన్వవసర్గో గాత్రాణాం శిథిలతా, మార్దవం స్వరస్య మృదుతా స్నిగ్ధతా ఉరుతా–స్వస్య మహత్తా కంఠస్యేతి. నీచైః కరాణి శబ్దస్య, త్రైస్వర్యేణాధీమహే, త్రిప్రకారైరజ్భి రధీమహే, కైశ్చిదుదాత్తగుణైః, కైశ్చి దనుదాత్తగుణైః, కైశ్చి దుభయగుణైః, తద్యథా; శుక్లగుణః శుక్లః, కృష్ణగుణః కృష్ణః, య ఇదానీ ముభయ గుణః, స తృతీయా మాఖ్యాం లభతే. కల్మాష ఇతి వా సారంగ ఇతి వా. ఏవ మిహాపి ఉదాత్త ఉదాత్తగుణః, అనుదాత్తోఽనుదాత్తగుణః, య ఇదానీ ముభయగుణః, స తృతీయామాఖ్యాం లభతే స్వరిత ఇతి. తే ఏతే తంత్రేతర నిర్దేశే (అతిశయార్థద్యోతకే తరప్ ప్రత్యయస్య నిర్దేశే) సప్తస్వరా భవంతి. ఉదాత్తః, ఉదాత్తతరః, అనుదాత్తః, అనుదాత్తతరః, స్వరితః, స్వరితే యః ఉదాత్తః సోఽన్యేన విశిష్టః. ఏకశ్రుతిః సప్తమః. అ. ౧ పా. ౨ ఉచ్చైరుదాత్త ఇత్యాద్యుపరి.

తథా షడ్జాదయః సప్త. (స్వరాః)

'షడ్జ, ఋషభ, గాంధార, మధ్యమ, పంచమ, ధైవత, నిషాదాః" ౧ పింగలసూత్రే. ౩–౬౪

ఏషాం లక్షణ వ్యవస్థా గాంధర్వ వేదప్రసిద్ధా గ్రాహ్యా అత్ర తు గ్రంథభూయస్త్వ భియా లేఖితు మశక్యా.

తె॥ వేదార్థముల యుపయోగ నిమిత్తము స్వరవ్యవస్థ నిట సంక్షేపముగ చెప్పుచున్నాము.

స్వరములు–ఉదాత్తము, షడ్జము మున్నగు భేదములతో పదు నాలుగు విధములు. ఉదాత్తాదులు ఏడు; షడ్జాదులేడు. వానిలో మహాభాష్యకారుడైన పతంజలి మహాముని ఉదాత్తాది స్వరలక్షణముల నిట్లు వ్రాసి యున్నాడు. (స్వయం రాజంత) తనకు తానే–ఇతర సహాయము లేకయే ప్రకాశించునది స్వరమనబడును. (ఆయామః) అంగముల నడ్డగించుటః– (దారుణ్యం) వాణిని రూక్షము చేయు – ఉచ్ఛ్వాసనముతో బలుకుట; (అణుతా) కంఠమును గూడ కొంచెమడ్డగించుట; ఈ యత్నములన్నియు శబ్దము నుదాత్త మొనరించును. ఈ నియమముల ననుసరించియే యుదాత్త స్వరము పలుకబడును. (అన్వవసర్గము) గాత్రమును శిథిలము చేయుట ; (మార్దవం) స్వరకోమలత; (ఉరుతా) కంఠమును విపులమొనర్చుట; ఈ యత్నము లన్నియు శబ్దము ననుదాత్తము చేయును. (త్రైస్వర్యేణ) మన మెల్లరము ముప్పిధములగు స్వరములతో పఠింతుము. కొన్ని యెడల ఉదాత్త స్వరముతోను, మఱికొన్ని

యెడల ననుధాత్త స్వరములతోను, ఇంక కొన్ని తావులలో (ఉదాత్తా నుదాత్త) స్వరిత స్వరములతోను పఠించు చుందుము; అక్షరముల, నుచ్చరింతుము. శ్వేత వర్ణము, కృష్ణ వర్ణము, వేఱు వేఱుగ నుండును. ఈ రెండు రంగులు కలిసిన మూడవ రంగు ఏర్పడును. అది నీల వర్ణము కావచ్చును. అట్లే, శబ్దోచ్చారణమున నుదాత్తము, అనుదాత్తము వేఱు వేఱు గుణములు. ఈ రెండు గుణములు కలిసి స్వరిత గుణమగును. అధికార్థమును దెలుపు (తరప్) ప్రత్యయముతో గూడి యా ఉదాత్తాది స్వరములు సప్త (ఏడు) స్వరములగును. ౧. ఉదాత్తము. ౨. ఉదాత్తతరము. ౩. అనుదాత్తము. ౪అనుదాత్తతరము. ౫. స్వరితము. ౬ స్వరితోదాత్తము. ౭. ఏకశ్రుతి- సమానస్వరము. పైన జూపిన విధమున నీ యేడు స్వరములు సరిగ తెలిసికొనవలెను.

ఇక, షడ్ జాది స్వరములు. గాన విద్యయం దీ స్వరములుపయుక్తములు ( స్వరాః షడ్ జ ఋషభ...) ౧. షడ్జము. ౨. ఋషభము. ౩. గాంధారము. ౪. మధ్యమము. ౫. పంచమము. ౬. ధైవతము. ౭. నిషాదము. వీని లక్షణములు వ్యవస్థాయుక్తముగ గంధర్వ వేదము-గాన విద్య.యందు జూడనగును. ఇట గ్రంథవి స్తర భీతితో వ్రాయుట లేదు.

స్వర వ్యవస్థా విషయము సమాప్తము.

# వైదిక లౌకిక సామాన్య విశేష నియమాః
# వ్యాకరణ విషయః

సం॥ అథాత్ర చతుర్షు వేదేషు వ్యాకరణస్య యే సామాన్యతో నియమాః సంతి; త ఇదానీం ప్రదర్శ్యంతే. తద్యథాః–

"వృద్ధి రాదైచ్" ౧ అష్టా, ౧–౧–౧

ఉభయ సంజ్ఞాన్యపి ఛందాంసి దృశ్యంతే; తద్యథా– ససుష్టుభా స ఋక్వతా గణేన, పదత్వాత్ కుత్వం భత్వాజ్జశ్త్వం న భవతి; ఇతి భాష్య వచనమ్. అనేనైకస్మిన్ శబ్దే భ పదసంజ్ఞా కార్యద్వయం వేదేష్వేవ, నాన్యత్ర.

"స్థానివదాదేశోఽనల్విధౌ" ౨ అష్టా. ౧–౧–౫౬

ప్రాతి పదిక నిర్దేశా శ్చార్థ తంత్రా భవంతి, న కాశ్చిత్ ప్రాధాన్యేన విభక్తి మాశ్రయంతి; యాం యాం విభక్తి మాశ్రయితుం బుద్ధి రుపజాయతే సా సా ఆశ్రయితవ్యా" ఇతి భాష్యమ్. అనేనార్థ ప్రాధాన్యం భవతి; న విభక్తేరితి బోధ్యమ్.

"న వేతి విభాషా" ౩ అష్టా . ౧–౧–౪౪

అర్థ గత్యర్థ : శబ్ద ప్రయోగ : ; ఇతి భాష్య సూత్రమ్. లౌకిక వైదికేషు శబ్దేషు సార్వత్రికః సమానోఽయం నియమః.

"అర్థవ దధాతు రప్రతయః ప్రాతిపదికమ్" ౪ అష్టా. ౧–౨–౪౫

బహవో హి శబ్దా ఏకార్థా భవంతి. తద్యథా ఇంద్రః, శక్రః, పురుహూతః పురందరః కందుః కోష్ఠః. కుసూలః – ఇతి. ఏకశ్చ శబ్దో బహ్వర్థ : తద్యథా – అక్షాః, పాదాః, మాషాః, సార్వత్రికోఽయ మపి నియమః.

యథా అగ్న్యాదయః శబ్దా వేదేషు బహ్వర్థవాచకా స్త ఏవ బహవఏకార్థాశ్చ.

"తే ప్రాగ్ధాతోః" ౫ అష్టా. ౧–౪–౮౦

"ఛందసి పరవ్యవహిత వచనం చ" ఆయాత ముపనిష్కృతమ్. ఉప ప్రయోభిరాగతమ్. అనేన వార్తికేన గత్యుపసర్గ సంజ్ఞకాః శబ్దాః క్రియాయాః పరే పూర్వే దూరే వ్యవహితాశ్చ భవంతి.

తె॥ నాలుగు వేదములందును గల వ్యాకరణమునకు జెందిన సామాన్య విశేష నియమములు.

(ఉభయ...) వేదములందొకే శబ్దమునకు 'భ, పద' సంజ్ఞలుండును. ఉదా॥– (ఋక్వతా) అను నీశబ్దమున పద సంజ్ఞ యుండుట వలన చకార స్థానమున కకారము వచ్చినది. మఱియు 'భ' సంజ్ఞ వలన కకార స్థానమున గకారము రాలేదు. ౧

(ప్రాతిపదిక...) వేదములందుగల శబ్దము లే విభక్తితో గూడి యుండునో యా విభక్తికి సరియైన యర్థమే చెప్ప వలెనను నియమము లేదు. శాస్త్ర మూలకమగు యుక్తి ప్రమాణముల కనుకూలమగునట్లు ఏ విభక్తి నాశ్రయించి యర్థము చెప్పిన సముచితమగునో యావిభక్తితో నా పదమున కర్థము చెప్ప వలెను. కారణమేమన : ౨

(అర్థ గత్యర్థ :) వేదాది శాస్త్రములందు జేయబడు శబ్ద ప్రయోగములు వాని యర్థములను సరిగా తెలిసికొని వాని వలన లాభము నొందుటకే చేయబడినవి. వాని వలనను అనర్థములే సిద్ధించు నెడల నవి శాస్త్రములుగ నేల అంగీకరింపబడును? కావున నీ నియమము లోక వేదములలో నుభయత్ర సమముగ వర్తించును. ౩

(బహవో హి) ఇక మూడవ నియమమేమన : లౌకిక వైదిక భాషలందు అనేక పదము లొకే యర్థమును దెలుపును. అట్లే యొక శబ్ద మనేకార్థములను బోధించును. ఉదా : అగ్ని, వాయువు, ఇంద్రుడు, శక్రుడు మున్నగు ననేక శబ్దములు ఈశ్వరుడను నొకయర్థమునకు వాచకములు. ఆశబ్దములే లౌకికములగు నిప్పు, గాలి, మున్నగు నర్థములను గూడ దెలుపును. కావున నొకే శబ్ద మనేకార్థములకును వాచకమగు చున్నది.

(ఛందసి...) వ్యాకరణము నందు, గతి, ఉపసర్గము నను సంజ్ఞగల పదములు వేదములలో క్రియా పదమునకు పూర్వమునను, పరమునను, అనేక పదముల యనంతరమున - దూరమునను (వ్యవధానమునందు)) వచ్చును. ఉదా:- (ఉప ప్రయోభిరాగతమ్) ఇట 'ఆగతమ్' క్రియా పదము. 'ఉప' ఉపసర్గ. ఈ రెండు పదములకు మధ్య 'ప్రయోభిః' అను పదము వ్యవధానముగ నున్నది. అనగా -ఉపసర్గ సంజ్ఞగల 'ఉప' పదము క్రియా పదమునకు దూరమున బ్రయోగింపబడినది.

(ఆయాతముప) అను నీ స్థలమున, 'ఉప' ఆయాతమ్' అను క్రియా పదమునకు తరువాత ప్రయోగింపబడినది. అర్థము చెప్పునపుడు ఉపసర్గ క్రియకు పూర్వమున నన్వయించి చెప్పబడును. లౌకిక భాష యందు, ఉపసర్గ సంజ్ఞకల పద మెల్లపుడు క్రియా పదమునకు పూర్వము ననే ప్రయోగింపబడును. ఇది విశేషము. ౫

*సం॥ 'చతుర్థ్యర్థే బహులం ఛందసి"* అష్టా. ౨-౩-౬౨

షష్ఠ్యర్థే చతుర్థీ వక్తవ్యా. యా ఖర్వేణ పిబతి, తస్యై ఖర్వో జాయతే త్రిస్రో రాత్రిరితి. తస్యా ఇతి ప్రాప్తే. ఏవ మన్య త్రాపి. అనేన చతుర్థ్యర్థే షష్ఠీ, షష్ఠ్యర్థే చతుర్థీ ద్వే ఏవ భవతః, మహాభాష్య కారేణ ఛందోవన్ మత్వా బ్రాహ్మణానా ముదాహరణాని ప్రయుక్తాని. అన్యథా బ్రాహ్మణ గ్రంథస్య ప్రకృతత్వా చ్ఛందోగ్రహణ మనర్థకం స్యాత్.

"బహులం ఛందసి" ౭ అష్టా. ౨-౪-౩౯

అనేన 'అద్' ధాతోః స్థానే ఘస్ల ఆదేశో బహులం భవతిః- ఘస్తా న్నూనమ్. సగ్ధిశ్చమే. అత్తా మద్య మధ్యతో మేద ఉద్ధృతమ్. ఇత్యాద్యుదాహరణం జ్ఞేయమ్.

"బహులం ఛందసి" ౮ అష్టా. ౨-౪-౭౩

వేద విషయే శపో బహులం లుగ్ భవతి, వృత్రం హనతి. అహిః శయతే. అన్యేభ్యశ్చ భవతి. త్రాధ్వం నో దేవాః.

"బహులం ఛందసి" ౯ అష్టా. ౨-౪-౭౬

వేదేషు శపఃస్థానే శ్లుర్ బహులం భవతి, దాతి ప్రియాణి, ధాతి ప్రియాణి. అన్యేభ్యశ్చ భవతి. పూర్ణా వివష్టి, జనిమా వివక్తి ఇత్యాదీ న్యుదాహరణాని సంతీతి బోధ్యమ్.

తె॥ (యా ఖర్వేణ) ఇత్యాది పాఠములనుబట్టి, వేదములందు షష్ఠీ విభక్తి స్థానమున చతుర్థీ విభక్తియు, చతుర్థీ స్థానమున షష్ఠీ విభక్తియు, నగునని తెలియును. లౌకిక భాష యందట్లు కాదు. "తస్యై ఖర్వో జాయతే" అను నీ వాక్యమునందు "తస్యై" అను నీ పదము చతుర్థ్యంతము. ఇట 'తస్యాః' అని షష్ఠీవిభక్తి రావలసి యుండెను. ఈ యుదాహరణము బ్రాహ్మణ గ్రంథము నుండి తీసికొనబడినది. దీనిం బట్టి మహాభాష్య కారుడు బ్రాహ్మణములను గూడ వేదములకు తుల్యముగా నంగీకరించినట్లు బోధపడుచున్నది. వేదములందువలెనే బ్రాహ్మణ గ్రంథములందును వ్యాకరణ కార్యములు జరుగునని మహర్షి యభిప్రాయము. లేకున్న (ద్వితీయాబ్రాహ్మణే) అను పూర్వసూత్రమునుండి (చతుర్థ్యర్థే బహులం ఛందసి) అను సూత్రమున బ్రాహ్మణశబ్దము అనువృత్తమగు చుండగా 'ఛందసి' అను శబ్దమును గ్రహించుట వ్యర్థమగును. ౬

(బహులం) ఈ సూత్రము ననుసరించి 'అద్' ధాతువు స్థానమున 'ఘస్లృ' ఆదేశము బహుధా - ఎక్కువగా నగును. ఉదా॥- ఘస్తాత్, సగ్ధిః మున్నగు నవి. ౭

(బహులం) వేదము నందు శప్ ప్రత్యయ మెక్కువగా (బహులం) లోపించును; కొన్ని యెడల కాదు కూడ. ఉదా॥ వృత్రం హనతి' ఇట 'హన్తి' అని 'శప్' లోపించవలసియుండెను. కాని, కాలేదు. (త్రాధ్వం) ఇట త్రైఙ్ ధాతువునకు పరమున వచ్చిన 'శప్' లోపింపరాదు. కాని లోపించినది. మహాభాష్య కారుని మతము ననుసరించి "శప్" లోపింప జేసిన 'శ్యన్' ఆది ఆదేశము చేయబడును. 'శప్' సామాన్యమగుట వలన నన్ని ధాతువులకును పరమున వచ్చును. 'శప్' లోపించినపుడు 'శ్యన్' ఆదులు ప్రాప్తములే కావు. ఇట్లే 'శ్లు' విషయమునను నెఱుగ వలెను.

(బహులం...)వేదమున 'శప్' స్థానమున 'శ్లు' (లోపము) ఎక్కువగా (బహులం) అగును. - ఉక్తమునకు పరమున కాకపోవచ్చును. అనుక్తమునకు పరమున కావచ్చును కూడ. ఉదా॥- ' వివష్టి' ఇట ప్రాప్తము కాదు. అయినను అయినది. ౯

*సం॥ "సిబ్ బహులం ఛందసి లేటి" ౧౦ అష్టా. ౩-౧-౩౪*

*సిబ్ బహులం ఛందసి ణిద్ వక్తవ్యః. సవితా ధర్మ సావిషత్ ప్రణ ఆయూంషి తారిషత్. అయం లేటి విశిష్టో నియమః.*

*"ఛందసి శాయజపి!" ౧౧ అష్టా. ౩-౧-౮౪*

*శాయచ్ఛందసి సర్వత్రేతి వక్తవ్యమ్. క్వ ? సర్వత్ర హౌ చాహౌచ. కిం ప్రయోజనమ్ ? మహీః అస్కభాయత్. యో అస్కభాయత్. ఉద్గభాయత్. ఉన్మథాయతే త్యేవమర్థమ్. అయం లోటి మధ్యమ పురుషస్యైకవచనే పరస్మైపదే విశిష్టో నియమః.*

*"వ్యత్యయో బహులమ్" ౧౨ అష్టా. ౩-౧-౮౫*

*"సుప్తి ఙుపగ్రహ లింగ నరాణాం కాల హలచ్ స్వర కర్తృయఙాం చ. వ్యత్యయ మిచ్ఛతి శాస్త్ర కృదేషాం సోపి చ సిద్ధ్యతి బాహులకేన"* ౧

వ్యత్యయో భవతి స్యాదీనామితి. అనేన వికరణ వ్యత్యయః– సుపాం వ్యత్యయః తిజాం వ్యత్యయః. వర్ణవ్యత్యయః. లింగ వ్యత్యయః. పురుష వ్యత్యయః. కాల వ్యత్యయః ఆత్మ నేపద వ్యత్యయః. పరస్మై పద వ్యత్యయః స్వర వ్యత్యయః. కర్తృవ్యత్యయః. యఙ్ వ్యత్యయశ్చ.

ఏషాం క్రమే ణోదాహరణాని – యుక్తా మాతాసీద్ధురి దక్షిణాయాః; దక్షిణాయా మితి ప్రాప్తే. చషాలం యే అశ్వ యోపాయ తక్షతి; తక్షంతీతి ప్రాప్తే. త్రిష్టుభౌజః శుభిత ముగ్ర వీరమ్; శుధిత మితి ప్రాప్తే. మధోస్తృప్తా ఇవాసతే; మధున ఇతి ప్రాప్తే. అధా స వీరైర్ దశభిర్ వియూయాః, వియూయాద్ ఇతి ప్రాప్తే శ్వోఽగ్నీ నాధాస్య మాచేన శ్వః సోమేన యక్ష్యమాణేన; అధాతా యష్టేతి ప్రాప్తే. బ్రహ్మచారిణ మిచ్ఛతే; ఇచ్ఛతీతి ప్రాప్తే.

ప్రతీపమన్య ఊర్మిర్ యుధ్యతి; యుధ్యత ఇతి ప్రాప్తే. అధాతా యష్టేతి, లుట్ ప్రథమ పురుషస్యైకవచనే ప్రయోగౌ, వ్యత్యయో భవతి. స్యాదీనా మిత్యస్యోదాహరణం, తాసి ప్రాప్తే స్యో విహితః.

"బహులం ఛందసి" ౧౩

అష్టా. ౩–౨–౮౮

అనేన క్విప్ ప్రత్యయో వేదేషు బహులం విధీయతే. మాతృహా. మాతృఘాతః. ఇత్యాదీని.

"ఛందసి లిట్" ౧౪

అష్టా. ౩–౨–౧౦౫

వేదేషు సామాన్య భూతే లిట్ విధీయతే. అహం ద్యావా పృథివీ ఆతతాన.

"లిటః కానజ్వా" ౧౫

అష్టా. ౩–౨–౧౦౬

వేద విషయే లిటః స్థానే కానజాదేశో వా భవతి. అగ్నిం చిక్యానః. అహం సూర్య ముభయతో దదర్శ. ప్రకృతేఽపి లిటి పునర్ గ్రహణాత్ పరోక్షార్థస్యాపి గ్రహణం భవతి.

"క్వసుశ్చ" ౧౬

అష్టా. ౩–౨–౧౦౭

వేదే లిటః స్థానే క్వసురాదేశో వా భవతి. పపివాన్ జగ్మివాన్. న చ భవతి – అహం సూర్య ముభయతో దదర్శ.

"క్యాచ్ఛందసి" ౧౭

అష్టా. ౩–౨–౧౭౦

క్యచ్ ప్రత్యయాంతా ద్ధాతో శ్ఛందసి విషయే. తచ్ఛీలాదిషు కర్తృషు ఉకార ప్రత్యయో భవతి. మిత్రయుః. సంస్వేదయుః. సుమ్నయుః. నిరనుబంధక గ్రహణే సానుబంధకస్యాపి గ్రహణం భవతీత్యనయా పరిభాషయా క్యచ్ క్యఙ్ క్యషాం సామాన్యేన గ్రహణం భవతి.

తె॥ (సిబ్బహులం...) లేట్ లకారమున వచ్చు సిప్ ప్రత్యయము వేదమునందు బహుళముగ (అధికముగ) ణిత్ సంజ్ఞకలదియగును. అందువలన వృద్ధి మున్నగు కార్యములగును.

ఉదా:– సావిషత్ తారిషత్. ఇతి 'సిప్'ను 'ణిత్'గా నంగీకరించి వృద్ధి చేయబడినది. ఇయ్యది వేదమున లేట్ ల కారమునకు సంబంధించిన విశేష నియమము. ౧౦

(శాయచ్ఛందసి...) వేదమున 'హి' ప్రత్యయము పరమున శ్నా ప్రత్యయస్థానమున విధింపబడు 'శాయచ్' 'హి' పరమున లేనపుడును విధింపబడును. ఉదా: అస్కభాయత్ మున్నగు నవి. ౧౧

(వ్యత్యయో...) వేదమున గలుగు వ్యత్యయము (విపరీతత) పదునాకండు రకములుగ మహాభాష్యకారుడు పతంజలి వర్ణించి యున్నాడు. ౧. సుప్. ౨. తిఙ్. ౩. ఉపగ్రహ = ఆత్మనేపదము, పరస్మైపదము.౪.

